# విజ్ఞాపన

ఈ స్థానషట్కమును నేనిట్లు పరివర్తనముచేసి ప్రచురింపగలిగినందులకు తొలుత శ్రీమద్ధన్వంతరికి అనేక నమస్కారశతంబు లొనర్చుచున్నాడను. చరక పరివర్తనము సామాన్యవిషయము కాదనెడి సంగతి అందరికి తెలిసిన విషయమే. అట్టి చరకసంహితను నేను పూర్తిగ ఆంధ్రీకరింప సాహసించి తొలుత చికిత్సాస్థానమును ఆంధ్రీకరించి ప్రచురించి పిమ్మట ఈ స్థానషట్కమును కూడ ఆంధ్రీకరించి ప్రచురించితిని. ఇట్టిపనిని నిర్వహించుటకు నాశక్తియే కారణము కాదనియు శ్రీ భగవంతుని యొక్క పూర్ణకటాక్షమే కారణమనియు నేను త్రికరణశుద్ధిగ నమ్ముచున్నాడను. ఇదివరలో ఎవరును చేసియుండని యిట్టి మహోత్తరకార్యమును నేను చేసియుండుటయే అట్లు నమ్ముటకుగల కారణమై యున్నది. మిగిలిన సూత్రస్థానమును కూడ ఆంధ్రీకరించి ప్రచురించినచో చరకమునంతను పూర్తిగ ఆంధ్రీకరించినటుల శ్రీభగవంతుడు నన్ను సంపూర్ణముగ కటాక్షించినవాడగును. కాని ఈ గ్రంథము నిమిత్తమై నేను అనేక వ్యయప్రయాసలను పడియుండుటచే నేనిప్పుడా తలంపును వదలుకొంటిని. కాని నా వైద్యసోదరుల యొక్క పరిపూర్ణమైన ప్రోత్సాహము వలన అధికమైన శక్తికలవాడనై ఆ సూత్రస్థానమును కూడ ఇప్పుడే ఆంధ్రీకరించి కొద్ది రోజులలో ప్రచురింపబోవుచున్నాడను.

ఈ గ్రంథ పరివర్తనమునందు నాకు అధికముగ తోడ్పడిన బ్రహ్మశ్రీ శిష్ట్లా సుబ్రహ్మణ్యశాస్త్రిగారికిని నా సోదరుడగు శ్రీ సత్యనారాయణశాస్త్రికిని ఇతరులకును అనేక కృతజ్ఞతలను తెలుపుచు ఈ విజ్ఞాపనమును ఇంతటితో సమాప్తి నొందించుచున్నాడను.

## (ద్వితీయ ముద్రణము)

ఈ చరకస్థానషట్కము చాలాకాలము తదుపరి పునర్ముద్రణచేసి చరక సంహిత మూడు భాగములను మరల ఆయుర్వేద వైద్య సోదరులకు, వైద్య విద్యార్థులకు, వైద్యాభిమానులకు అందజేయగలిగినందుకు శ్రీమద్ధన్వంతరికి సహస్రప్రణామము లొనర్చుచున్నాము.

ఈ గ్రంథ ముద్రణకు కాగితమును నిర్ణీతధరకు సరఫరా చేసినందుకు ప్రభుత్వము వారికి మా కృతజ్ఞతలు.

రాజమండ్రి,
10—3—1978

ఇట్లు,
శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి & సన్సు.

# మాచే ప్రచురింపబడిన ఇతర గ్రంథములు

## చరక చికిత్సాస్థానము

ఇందు ప్రధానములగు సమస్త వ్యాధుల యొక్కయు చికిత్సా విధానములు అతి విపులముగా వివరింపబడి యున్నవి. మరియు నిదానము కూడ ప్రతి వ్యాధికిని విపులముగ వ్రాయబడి యున్నది. శాస్త్రసమ్మతమగుచికిత్సకు ఈగ్రంథము అత్యుత్తమమైనది. క్యాలికో బైండు చేయబడినది. వెల రు 25-00 లు.

## చరక సూత్రస్థానము

శాస్త్రమునకంతకునూ సంబంధించియుండు విషయములకు సూత్రములని పేరు. ప్రతి గ్రంథమునకు అట్టి సూత్రములు తొలుత చెప్పబడును. వాగ్భట సూత్రస్థానము మొదలగు సూత్రస్థానములను చూచిన మీకు ఈ విషయము బోధపడియే యుండును. ఈ చరక సూత్రస్థానమునందు అనేక విధములగు శాస్త్ర విషయములు అతి విపులముగ వ్రాయబడి యున్నవి.
కేలికోబైండు చేయబడినది. వెల రు 12-00.

## ఆయుర్వేదౌషధరత్నాకరము

ప్రసిద్ధములైనట్టియు, వాడుకలో నున్నట్టియు యోగములు ఆంధ్ర వైద్యులకందరికీ అందుబాటులో నుండుటకు అనేక వ్యయ ప్రయాసలకులోనై కొన్ని వందల యోగములను సంపాదించి ఈ ఆయుర్వేదౌషధరత్నాకరము ప్రచురించితిమి. సిద్ధమకరధ్వజము, వసంతకుసుమాకరం మొదలు పైత్యాంతకము, ఆనందభైరవి వరకు సుమారు నాలుగైదువందల రకముల మందుల యోగములు విమర్శనా పూర్వకముగా ఇందు వ్రాయబడి యున్నవి. మరియు మందులు తయారుచేయునప్పుడు తీసుకొనవలసిన జాగ్రత్తలు, ఔషధనామముల కర్థము, అనుపానాది వివరములు, సందేహ సమాధానములు, ఔషధ పాక వివరములు మొదలగు ఉపయోగకరమైన విషయములు కూడా కలవు.
కేలికోబైండు చేయబడినది. వెల రు 12-00 లు.

## ఆంధ్ర భైషజ్యరత్నావళి

అనేక రకములైన ఆసవారిష్టములు, చూర్ణములు, లేహ్యములు, ఘృతములు, మాత్రలు, తైలములు యొక్క యోగములు సమగ్రముగా వ్రాయబడిన పుస్తకము. ఆరు ముద్రణములు పూర్తి అయినదన్న విషయమే ఈ గ్రంథ ప్రశస్తిని తెలుపగలదు.
క్యాలికో బైండు చేయబడినది. వెల రు 8-00 లు.

## భస్మ ప్రకాశిక

సువర్ణభస్మ మొదలు కాసీసభస్మ వరకు అనేక భస్మలు తయారుచేయుటకు అత్యంత ఉపయోగకరమైన పుస్తకము. ఈగ్రంథము కూడా ఆరవ ముద్రణ పూర్తి అయినది.
క్యాలికోబైండు చేయబడినది. వెల రు 6-00 లు.

## వైద్య విజ్ఞానము

ఈ గ్రంథము ఆయుర్వేద వైద్యులకు ఉపయోగకరమైనది. వైద్య సంబంధమైన విషయములు, మందుల తయారీకి సంబంధించిన విషయములు, అనేక శాస్త్రవిషయములు ఇందు కలవు. మరియు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి స్వీయచరిత్ర కూడ కలదు.
క్యాలికో బైండు చేయబడినది. వెల రు. 6-00 లు

## అనుభవదీపిక

సుమారు 50 సంవత్సరముల నుండి తయారు చేయుచున్న ఔషధముల యొక్క అనుభవసంబంధమైన విషయము లిందు కలవు. ఔషధముల తయారీ సమయములో కలుగు సాధకబాధకములు, అనుభవము మీద ఔషధములు సరియైన పద్ధతిలో చేసుకొనే విధానములు వివరముగ గలవు.

వెల 5-00లు.

# విషయానుక్రమణిక.

# నిదానస్థానము

# విమానస్థానము.

# శారీరస్థానము.

# ఇంద్రియస్థానము.

# కల్పస్థానము

# సిద్ధిస్థానము.

ఓమ్.

శ్రీరస్తు.

ఆరోగ్యమస్తు.

ఆంధ్ర తాత్పర్య సహిత

# చరకసంహిత

## మంగళాచరణము.

శ్లో॥ యోగేన చిత్తస్య పదేన వాచాం మలం శరీరస్య చ వైద్యకేన। యోఽపాకరోత్తం ప్రవరం మునీనాం పతఞ్జలిం ప్రాఞ్జలిరానతోఽస్మి॥

అ॥ యోగశాస్త్రముచే మనస్సుయొక్కయు, వ్యాకరణశాస్త్రముచే శబ్దములయొక్కయు, వైద్యశాస్త్రముచే శరీరముయొక్కయు మాలిన్యమును పోగొట్టినట్టియు మునిశ్రేష్ఠుడైనట్టియు పతంజలిని దోసిలొగ్గి నమస్కరించుచున్నాడను.

శ్లో॥ నమామి ధన్వన్తరిమాదిదేవం సురాసురైర్వన్దితపాదపద్మమ్। లోకే జరారుగ్భయమృత్యునాశం దాతారమీశం వివిధౌషధీనామ్॥

అ॥ ఆదిదేవుడైనట్టియు, దేవతలచేతను రాక్షసులచేతను నమస్కరింపబడిన పాదపద్మములు కలిగినట్టియు, లోకమునందు ముసలితనముయొక్కయు వ్యాధులయొక్కయు భయమును మృత్యువును నశింపజేసినట్టియు, సమస్తమైన ఓషధులయొక్క జ్ఞానమునిచ్చినట్టియు, ప్రభువైనట్టియు ధన్వంతరిని నమస్కరించుచున్నాడను.

శ్లో॥ నిదానం చ విమానం చ శారీరం చేన్ద్రియం తథా। కల్పాఖ్యం చ తథా స్థానం తథా వై సిద్ధిసంజ్ఞకమ్॥ స్థానాని యాని షట్చాపి చరకేణ మహాత్మనా। సంస్కృతాని సమగ్రేణ ధీమతా లోకరఞ్జకమ్॥ స్థానాని తాని వ్యాకుర్వే వ్యాహమద్యాన్ధ్రభాషయా। దీపికావ్యాఖ్యయా యుక్తమిమం గృహ్ణన్తు సజ్జనాః॥

అ॥ మహాత్ముడైనట్టియు ధీమంతుడైనట్టియు చరకాచార్యునిచే సమగ్రముగ సంస్కరింపబడిన నిదానస్థానము విమానస్థానము శారీరస్థానము ఇంద్రియస్థానము కల్పస్థానము సిద్ధిస్థానము అను ఆరుస్థానములను ఇప్పుడు నేనుదీపికయనెడు వ్యాఖ్యతో లోకరంజకముగ ఆంధ్రములోనికి పరివర్తనము చేయుచున్నాడను. ఇట్టి గ్రంథమును సజ్జనులు గ్రహింతురుగాక.



## గ్రంథప్రారంభము



# నిదానస్థానము.



## ప్రథమాధ్యాయము



మూ॥ అథాతో జ్వరనిదానం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట జ్వరనిదానమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

### నిదానముయొక్క - పర్యాయపదములు - భేదములు.

మూ॥ ఇహ ఖలు హేతుర్నిమిత్తమాయతనం కర్తా కారణం ప్రత్యయః సముత్థానం నిదానమిత్యనర్థాన్తరమ్ । తత్త్రివిధం - అసాత్మ్యేన్ద్రియార్థసంయోగః, ప్రజ్ఞాపరాధః, పరిణామశ్చేతి ॥3॥

అ॥ ఈ ఆయుర్వేదశాస్త్రమునందు-హేతువు, నిమిత్తము, ఆయతనము, కర్త, కారణము, ప్రత్యయము, సముత్థానము, నిదానము అనునివి సమానార్థకములు, అనగా-నిదానమునకు పర్యాయపదములుగ నుండును. ఆ నిదానము - అసాత్మ్యేంద్రియార్థసంయోగము, ప్రజ్ఞాపరాధము, పరిణామము అని మూడు విధములుగ నుండును.

### వ్యాధియొక్క - భేదములు - పర్యాయపదములు.

మూ॥ అతస్త్రివిధవికల్పా వ్యాధయః ప్రాదుర్భవన్త్యాగ్నేయసౌమ్యవాయవ్యాః; ద్వివిధాశ్చాపరే రాజసాస్తామసాశ్చ । తత్ర వ్యాధిరామయో గద ఆతఙ్కో యక్ష్మా జ్వరో వికారో రోగ ఇత్యనర్థాన్తరమ్ ॥4॥

అ॥ వ్యాధులు - ఆగ్నేయ (పిత్తజ) ములు, సౌమ్య (కఫజ) ములు, వాయవ్య (వాతజ) ములు అని మూడు విధములుగను; రాజసములు, తామసములు అని రెండు విధములుగను లుండును. వ్యాధి, ఆమయము, గదము, ఆతంకము, యక్ష్మ, జ్వరము, వికారము, రోగము అనునవి సమానార్థకములు. అనగా - వ్యాధికి పర్యాయపదము లుగ నుండును.

## నిదానపంచకము.

మూ॥ తస్యోపలబ్ధిర్నిదానపూర్వరూపలిఙ్గోపశయసంప్రాప్తితః॥

అ॥ నిదానము, పూర్వరూపము, రూపము, ఉపశయము, సంప్రాప్తి అను నీ అయిదును రోగజ్ఞానసాధనములుగ నుండును.

## నిదానలక్షణము.

మూ॥ తత్ర, నిదానం కారణమిత్యుక్తమగ్రే॥

అ॥ నిదానమనగా రోగకారణమని ముందుగనే చెప్పబడినది.

## పూర్వరూపలక్షణము.

మూ॥ పూర్వరూపం ప్రాగుత్పత్తిలక్షణం వ్యాధేః॥

అ॥ వ్యాధి పుట్టుటకు ముందుకలుగులక్షణములు పూర్వరూపమని చెప్పబడును.

## రూపలక్షణము.

మూ॥ ప్రాదుర్భూతలక్షణం పునర్లిఙ్గం, తత్ర లిఙ్గమాకృతి ర్లక్షణం చిహ్నం సంస్థానం వ్యఞ్జనం రూపమిత్యనర్థాన్తరమస్మి న్నర్థే॥

అ॥ ఏర్పడిన వ్యాధియొక్క లక్షణములు రూపమనబడును. లింగము, ఆకృతి, లక్షణము, చిహ్నము, సంస్థానము, వ్యంజనము, రూపము అనునివి సమానార్థకము లుగ నుండును.

## ఉపశయలక్షణము.

మూ॥ ఉపశయః పునర్హేతువ్యాధివిపరీతానాం విపరీతార్థకారి ణాం చౌషధాహారవిహారాణాముపయోగస్సుఖానుబన్ధః॥

అ॥ హేతువిపరీతములు, వ్యాధివిపరీతములు, హేతువ్యాధివిపరీతములు, హేతు సమానాకారకములు, వ్యాధిసమానాకారకములు, హేతువ్యాధి సమానాకారములు అయిన ఔషధములయొక్కయు ఆహారముయొక్కయు విహారముయొక్కయు సుఖ కరమైన ఉపయోగము ఉపశయమని చెప్పబడును.

## సంప్రాప్తిలక్షణము

మూ॥ సంప్రాప్తిర్జాతిరాగతిరిత్యనర్థాన్తరం వ్యాధేః, సా సంఖ్యాప్రాధాన్యవిధివికల్పబలకాలవిశేషైర్భిద్యతే; సంఖ్యా తావద్యథా - అష్టౌ జ్వరాః, పఞ్చ గుల్మాః, సప్త కుష్ఠాన్యేవమాదిః; ప్రాధాన్యం పునర్దోషాణాం తరతమాభ్యాం యోగేనోపలభ్యతే, తత్ర ద్వయోస్తరస్త్రిషు తమ ఇతి; విధిర్నామ ద్వివిధా వ్యాధయో నిజాగన్తుభేదేన, త్రివిధాస్త్రిదోషభేదేన, చతుర్విధాః సాధ్యాసాధ్యమృదుదారుణభేదేన; సమవేతానాం పునర్దోషాణామంశాంశబలవికల్పో వికల్పోఽస్మిన్నర్థే; బలకాలవిశేషః పునర్వ్యాధీనామృత్వహోరాత్రాహారకాలవిధివినియతో భవతి॥

అ॥ సంప్రాప్తి, జాతి, ఆగతి అనునివి సమానార్థకములుగ నుండును. సంఖ్య, ప్రాధాన్యము, విధి, వికల్పము, బలకాలము అనువీనిచే సంప్రాప్తి భిన్నముగ నుండును. అందు—ఎనిమిదిజ్వరములు, అయిదుగుల్మములు, ఏడుకుష్ఠములు అని సంఖ్యచే వ్యాధిని నిరూపించుట సంఖ్యాసంప్రాప్తి యనబడును. దోషములయొక్క తరతమభేదములచే వ్యాధిని నిరూపించుట ప్రాధాన్యసంప్రాప్తి యనబడును. రెండుదోషములలో ఆధిక్యమును నిరూపించుట తరమనియుమూడుదోషములలో ఆధిక్యమును నిరూపించుట తమమనియు వ్యవహరింపబడును. నిజాగంతుభేదముచే రెండువిధములు, త్రిదోషభేదముచే మూడువిధములు, సుఖసాధ్యకృచ్ఛ్రసాధ్యయాప్య అసాధ్యభేదముచే నాలుగువిధములు అని వ్యాధిని నిరూపించుట విధిసంప్రాప్తి యనబడును. దోషములయొక్క అంశాంశవిభాగముచే వ్యాధిని నిరూపించుట వికల్పసంప్రాప్తి యనబడును. ఋతువు పగలు రాత్రి ఆహారకాలము వీనిననుసరించి వ్యాధియొక్క బలకాలమును నిరూపించుట బలకాలసంప్రాప్తి యనబడును.

మూ॥ తస్మాద్వ్యాధీన్ భిషగనుపహతసత్త్వబుద్ధిర్హేత్వాదిభిర్భావైర్యథావదనుబుధ్యేత। ఇత్యర్థసంగ్రహో నిదానస్థానస్యోద్దిష్టో భవతి, తం విస్తరేణ భూయస్తరమతోఽనువ్యాఖ్యాస్యామః। తత్ర ప్రథమత ఏవ తావదాద్యాంల్లోభాభిద్రోహకోపప్రభవానష్టౌ వ్యాధీన్నిదానపూర్వేణ క్రమేణానువ్యాఖ్యాస్యామః, తథా సూత్రసంగ్రహమాత్రం చికిత్సాయాః; చికిత్సితేషు చోత్తరకాలం యథోద్దిష్టం వికారాననువ్యాఖ్యాస్యామః ॥8॥

అ॥ కావున వైద్యుడు నిర్మలమైన మనస్సును బుద్ధియు కలవాడై నిదానాదిభేదములచే వ్యాధులను సరిగ తెలిసికొనవలయును. ఈప్రకారముగ నిదానస్థానమున

కవసరమగు విషయము సంగ్రహముగ చెప్పబడినది. పిమ్మట దీనిని విస్తరించి చెప్పెదము. మొదటిదైనట్టియు లోభము అభిద్రోహము కోపము వీనివలన పుట్టినట్టియు ఎనిమిదివిధములైన వ్యాధులను నిదానాదులతో క్రమముగ చెప్పెదము. మరియు చికిత్సకూడ సంగ్రహముగ చెప్పబడును. చికిత్సాస్థానమునందు ఆయా వ్యాధులకు తగునట్లు విస్తరించి చెప్పబడును.

## జ్వరభేదములు.

మూ॥ ఇహ ఖలు జ్వర ఏవాదౌ వికారాణాముపదిశ్యతే, తత్ప్రథమత్వాచ్ఛారీరాణామ్ । అథ ఖల్వష్టభ్యః కారణేభ్యో జ్వర స్సంజాయతే మనుష్యాణామ్ । తద్యథా - వాతాత్, పిత్తాత్, కఫాత్, వాతపిత్తాభ్యాం, వాతకఫాభ్యాం. పిత్తశ్లేష్మభ్యాం, వాత పిత్తశ్లేష్మభ్యః, ఆగన్తోరష్టమాత్కారణాత్ । తస్య నిదానపూర్వ రూపలిఙ్గోపశయసంప్రాప్తివిశేషానుపదేక్ష్యామః ॥9॥

అ॥ శారీరకవ్యాధులలో మొదటిదగుటవలన జ్వరమే మొట్టమొదట చెప్పబడుచున్నది. వాతము, పిత్తము, కఫము, వాతపిత్తములు, వాతశ్లేష్మములు, పిత్తశ్లేష్మములు వాతపిత్తశ్లేష్మములు, ఆగంతుకము అను నీ యెనిమిదికారణములవలన జ్వరము మనుష్యులకు కలుగుచున్నది. అట్టి జ్వరముయొక్క నిదానము, పూర్వరూపము, రూపము, ఉపశయము, సంప్రాప్తి అనువానిని చెప్పబోవుచున్నాము.

## వాతజ్వరముయొక్క హేతువులు - సంప్రాప్తి.

మూ॥ తద్యథా - రూక్షలఘుశీతవ్యాయామవమనవిరేచనాస్థాపనశిరోవిరేచన వేగసంధారణానశనాభిఘాతవ్యవాయోద్వేగశోక శోణితాభిషేకజాగరణవిషమశరీరన్యాసేభ్యో ఽతిసేవితేభ్యో వాయుః ప్రకోపమాపద్యతే, సయదా ప్రకుపితః ప్రవిశ్యామాశయమూష్మణః స్థానమూష్మణా సహ మిశ్రీభూత ఆద్యమాహారపరిణామధాతుం రస నామానమన్వవేత్య రసస్వేదవహాని చ స్రోతాంసి చ పిధాయాగ్ని ముపహత్య పక్తిస్థానాదూష్మాణం బహిర్నిరస్య కేవలం శరీరమను ప్రపద్యతే, తదా జ్వరమభినిర్వర్తయతి॥

అ॥ రూక్షగుణము లఘుగుణము శీతవీర్యము ఇవికల పదార్థములను భుజించుట, వ్యాయామము, వమనము, విరేచనము, ఆస్థాపనవస్తి, నస్యము, వేగధారణము, భుజింపకుండుట, అభిఘాతము, మైథునము, ఉద్వేగమునొందుట, దుఃఖము, రక్తమోక్షము, రాత్రి మేల్కొనియుండుట, శరీరమును హెచ్చుతగ్గులుగ నుంచుట అధికముగ సేవింప

బడిన వీనివలన వాతము ప్రకోపించును. అట్టివాతము పాచకాగ్నికిస్థానమైన ఆమాశయమును పొంది పాచకాగ్నితో కలిసినదై మొదటిదైనట్టియు ఆహారపరిణామము వలన జనించినట్టియు రసధాతువును పొంది రసవాహకములును స్వేదవాహకములును నగు స్రోతస్సులను అరికట్టి పాచకాగ్నిని చెఱచి అట్టిపాచకాగ్నిని స్వస్థానము నుండి బయటికి వెడలగొట్టి సమస్తశరీరమును పొంది జ్వరమును కలిగించును.

## వాతజ్వరలక్షణములు.

మూ॥ తస్యేమాని లిఙ్గాని భవన్తి, తద్యథా-విషమారమ్భవిసర్గిత్వం ఊష్మణో వైషమ్యం, తీవ్రతనుభావానవస్థానాని జ్వరస్య, జరణాన్తే దివసాన్తే నిశాన్తే ఘర్మాన్తే వా జ్వరాభ్యాగమనమభివృద్ధిర్వా జ్వరస్య, విశేషేణ పరుషారుణవర్ణత్వం నఖనయనవదనమూత్రపురీషత్వచామత్యర్థం క్లృప్తీభావశ్చ, అనేకవిధోపమాశ్చలాచలాశ్చ వేదనాస్తేషాం తేషామఙ్గావయవానాం, తద్యథా-పాదయోస్సుప్తతా, పిణ్డికయోరుద్వేష్టనం జానునోః కేవలానాం చ సన్ధీనాం విశ్లేషణం, ఊర్వోస్సాదః, కటీపార్శ్వపృష్ఠస్కన్ధబాహ్వంసోరసాం చ భగ్నరుగ్ణమృదితమథితచటితావపీడితావనున్నత్వమివ, హన్వోశ్చాప్రసిద్ధిః, స్వనశ్చ కర్ణయోః శఙ్ఖయోర్నిస్తోదః, కషాయాస్యతాఽఽస్యవైరస్యం వా, ముఖతాలుకణ్ఠశోషః, పిపాసా, హృదయగ్రహః, శుష్కచ్ఛర్దిః, శుష్కకాసః, క్షవథూద్గారవినిగ్రహః, అన్నరసఖేదః, ప్రసేకారోచకావిపాకాః, విషాదవిజృమ్భావినామవేపథుశ్రమభ్రమప్రలాపజాగరణరోమహర్ష దన్తహర్షా ఉష్ణాభిప్రాయతా, నిదానోక్తానామనుపశయో విపరీతోపశయశ్చేతి వాతజ్వరలిఙ్గాని స్యుః ॥10॥

అ॥ జ్వరము వచ్చుటయు విడుచుటయు విషమముగ నుండును. వేడిమి హెచ్చుతగ్గులుగ నుండును. జ్వరము ఒకప్పుడు తీవ్రముగను ఒకప్పుడు మందముగను నుండును. ఆహారముజీర్ణమైనపిమ్మటను సాయంకాలమునందును తెల్లవారుజామునందును వర్షఋతువునందును జ్వరము వచ్చుటగాని అభివృద్ధిజెందుటగాని జరుగును. గోళ్ళు నేత్రములు ముఖము చర్మము ఇవి కఠినముగను ఎఱ్ఱగను పగిలియు నుండును. మూత్రపురీషములు పరుషముగను ఎఱ్ఱగను నుండి స్వల్పముగ బయలువెడలును. అంగప్రత్యంగములయందు స్థిరములైనట్టియు చంచలములైనట్టియు అనేకవిధములగు బాధలు జనించును. ఎట్లనగా - పాదములు మొద్దుబారియుండును. పిక్కలు మెలిపెట్టినట్లుండును. మోకాళ్ళును ఇతరసంధులును పట్టుతప్పినట్లుండును. తొడలు కృశించి

యుండును. నడుము పార్శ్వములు వీపు భుజశిరస్సులు బాహువులు అంసఫలకము వక్షఃస్థలము వీనియందు విరుగకొట్టినట్లును బాధపెట్టినట్లును పిసికినట్లును నలగకొట్టినట్లును పగులకొట్టినట్లును పీడించినట్లును సూదితో గ్రుచ్చినట్లును బాధ యుండును. హనుప్రదేశము బిగపట్టినట్లుండును. చెవులయందు ధ్వనికలిగియుండును. కణతలయందు బాధ యుండును. నోరు వగరుగగాని అసహ్యముగగాని యుండును. నోరును తాలుప్రదేశమును కంఠమును ఎండిపోవుచున్నట్లుండును. దప్పిక కలుగును. హృదయము బిగపట్టినట్లుండును. వాంతి వచ్చినట్లుండును. పొడిదగ్గు కలుగును. తుమ్ములును త్రేణుపులును ప్రవర్తింపకుండును. రసములయందు ఇచ్ఛ లేకుండును. నోట నీరు కారును. అరుచి కలుగును. ఆహారము పక్వమునొందదు. దుఃఖము ఆవలింతలు శరీరము వంచబడినట్లుండుట వణుకు బడలిక మోహము ప్రలాపము నిద్రపట్టకుండుట గగుర్పాటు దంతహర్షము ఇవి కలుగును. వేడిని కోరును. హేతువులుగ చెప్పబడిన వానిచే అభివృద్ధియు వానికి విపరీతములైనవానిచే శాంతియు కలుగును. ఇవి వాతజ్వరలక్షణములుగ నుండును.

## పిత్తజ్వరముయొక్క- హేతువులు - సంప్రాప్తి.

మూ॥ ఉష్ణామ్లలవణక్షారకటుకాజీర్ణభోజనేభ్యోఽతిసేవితేభ్య స్తథాతితీక్ష్ణాతపాగ్ని సంతాపశ్రమక్రోధవిషమాహారేభ్యశ్చపిత్తం ప్రకోపమాపద్యతే, తద్యదా ప్రకుపితమామాశయాదూష్మాణముపసృజ్యాద్యమాహారపరిణామధాతుం రసనామానమన్వవేత్య రసస్వేదవహాని స్రోతాంసి పిధాయ ద్రవత్వాదగ్నిముపహత్య పక్తిస్థానాదూష్మాణం బహిర్నిరస్య ప్రపీడయత్కేవలం శరీరమనుప్రపద్యతే తదా జ్వరమభినిర్వర్తయతి॥

అ॥ ఉష్ణవీర్యము అమ్లరసము లవణరసము క్షారము కటురసము ఇవికల పదార్థములను భుజించుట, అజీర్ణపదార్థములను భుజించుట, తీక్ష్ణమైన ఎండ, అగ్నివేడిమి, పరిశ్రమ, కోపము, విషమాహారము వీనిని అధికముగ సేవించుటవలన పిత్తము ప్రకోపించును. అట్టిపిత్తము ఆమాశయమునుండి పాచకాగ్నిని పొంది ఆహారపరిణామమువలన పుట్టునదియు మొదటిదియు నగు రసధాతువును పొంది రసవాహకములును స్వేదవాహకములును నగు స్రోతస్సులను అరికట్టి ద్రవస్వభావముకలదగుటచే పాచకాగ్నిని చెరచి అట్టిపాచకాగ్నిని స్వస్థానమునుండి బయలువెడలించి బాధను కలుగజేయుచు సమస్తశరరమును పొంది జ్వరమును కలిగించును.

## పిత్తజ్వరలక్షణములు.

మూ॥ తస్యేమాని లిఙ్గాని భవన్తి, తద్యథా - యుగపదేవ కేవలే శరీరే జ్వరాభ్యాగమనమభివృద్ధిర్వా భుక్తస్య విదాహకాలే

మధ్యందినేఽర్ధరాత్రే శరది వా విశేషేణ, కటుకాస్యతా, ఘ్రాణ ముఖకణ్ఠోష్ఠతాలుపాకః, తృష్ణా, భ్రమో, మదో, మూర్ఛా, పిత్తచ్ఛర్దనం, అతీసారః, అన్నద్వేషః, సదనం, స్వేదః, ప్రలాపో, రక్తకోఠాభినిర్వృత్తిః శరీరే, హరితహారిద్రత్వం నఖనయనవదన మూత్రపురీషత్వచాం, అత్యర్థమూష్మణస్తీవ్రభావోఽతిమాత్రం దాహః, శీతాభిప్రాయతా, నిదానోక్తానామనుపశయో, విపరీతోపశయశ్చేతి పిత్తజ్వరలిఙ్గాని భవన్తి ॥11॥

అ॥ జ్వరము వచ్చుటగాని అభివృద్ధినొందుటగాని సమస్తశరీరమునందును ఒకమారుగనే కలుగును. ఆహారజీర్ణముమగునప్పుడును మధ్యాహ్నమునందును అర్ధరాత్రియందును శరదృతువునందును జ్వరము వచ్చుటగాని అభివృద్ధినొందుటగాని తరుచు జరుగును. నోరు కారముగ నుండును. ముక్కు నోరు కంఠము పెదవులు తాలుప్రదేశము ఇవి పాకమునొందును. దప్పిక మోహము మదము మూర్ఛ పైత్యవాంతి అతిసారము అన్నద్వేషము కృశించుట చెమట ప్రలాపము ఎఱ్ఱనిదద్దుర్లు ఇవి కలుగును. గోళ్ళు నేత్రములు ముఖము మూత్రము పురీషము చర్మము ఇవి పచ్చదనమును పసుపుదనమును కలిగియుండును. జ్వరవేగమును తాపమును అధికముగ నుండును. చలవను కోరును. హేతువులుగ చెప్పబడినవానిచే అభివృద్ధియు వానికివిపరీతములైనవానిచే శాంతియు కలుగును. ఇవి పిత్తజ్వరలక్షణములుగ నుండును.

## కఫజ్వరముయొక్క హేతువులు - సంప్రాప్తి.

మూ॥ స్నిగ్ధగురుమధురపిచ్ఛిలశీతామ్లలవణదివాస్వప్నహర్ష వ్యాయామేభ్యోఽతిసేవితేభ్యః శ్లేష్మా ప్రకోపమాపద్యతే, స యదా ప్రకుపితః ప్రవిశ్యామాశయమూష్మణా సహ మిశ్రీభూయాద్యమాహారపరిణామధాతుం రసనామానమన్వవేత్య రసస్వేదవహాని స్రోతాంసి పిధాయాగ్నిముపహత్య పక్తిస్థానాదూష్మాణం బహిర్నిరస్య ప్రపీడయన్కేవలం శరీరమనుప్రపద్యతే, తదా జ్వరమభినిర్వర్తయతి॥

అ॥ స్నిగ్ధగుణము గురుగుణము మధురరసము పిచ్ఛిలగుణము శీతవీర్యము అమ్లరసము లవణరసము ఇవికల పదార్థములను భుజించుట, పగటినిద్ర, సంతోషము, వ్యాయామములేకుండుట వీనిని అధికముగ సేవించుటవలన కఫము ప్రకోపించును. అట్టికఫము ఆమాశయమును పొంది పాచకాగ్నితో కలిసి ఆహారపరిణామమువలన పుట్టునదియు మొదటిదియు నగు రసధాతువును పొంది రసవాహకములును స్వేదవాహకములును నగు స్రోతస్సులను అరికట్టి పాచకాగ్నిని చెరచి అట్టిపాచకాగ్నిని

స్వస్థానమునుండి బయలువెడలించి బాధను కలుగజేయుచు సమస్తశరీరమును పొంది జ్వరమును కలిగించును.

## కఫజ్వరలక్షణములు.

మూ॥ తస్యేమాని లిఙ్గాని భవన్తి, తద్యథా - యుగపదేవ కేవలే శరీరే జ్వరాభ్యాగమనమభివృద్ధిర్వా భుక్తమాత్రే పూర్వాహ్ణే పూర్వరాత్రే వసన్తకాలే వా విశేషేణ, గురుగాత్రత్వం, అనన్నాభిలాషః, శ్లేష్మప్రసేకో, ముఖస్య చ మాధుర్యం, హృల్లాసో, హృదయోపలేపః, ఛర్దిః, మృద్వగ్నితా, నిద్రాధిక్యం, స్తమ్భః, తన్ద్రా, శ్వాసః, కాసః, ప్రతిశ్యాయః, శైత్యం, శ్వైత్యం చ నఖనయనవదనమూత్రపురీషత్వచామత్యర్థం, శీతపిడకాశ్చ భృశమఙ్గేభ్య ఉత్తిష్ఠన్తి, ఉష్ణాభిప్రాయతా, నిదానోక్తానామనుపశయో విపరీతోపశయశ్చేతి శ్లేష్మజ్వరలిఙ్గాని భవన్తి ॥12॥

అ॥ జ్వరము వచ్చుటగాని అభివృద్ధినొందుటగాని సమస్తశరీరమునందును ఒకమారుగనే కలుగును. భుజించినతోడను పూర్వాహ్ణమునందును రాత్రిప్రారంభమునందును వసంతఋతువునందును జ్వరము వచ్చుటగాని అభివృద్ధినొందుటగాని తరుచు జరుగును. శరీరము బరువుగనుండుట, ఆహారమునందిష్టము లేకపోవుట, శ్లేష్మము నుమియుట, నోరు తియ్యగనుండుట, హృదయమునందు దడ, హృదయము పూయబడినట్లుండుట, శరీరము మొద్దబారినట్లుండుట, వాంతి, జాఠరాగ్ని మందముగనుండుట, అధికనిద్ర, శరీరము బిగపట్టినట్లుండుట, కునికిపాట్లు, ఆయాసము, దగ్గు, జలుబు, శీతలము, గోళ్ళు నేత్రములు ముఖము మూత్రము పురీషము చర్మము ఇవి తెల్లగనుండుట, శరీరమునందు శీతపిడకలు లేచుట, వేడిమిని కోరుట ఇవి కలుగును. హేతువులుగ చెప్పబడినవానిచే అభివృద్ధియు వానికి విపరీతములైనవానిచే శాంతియు కలుగును. ఇవి కఫజ్వరలక్షణములుగ నుండును.

## ద్వంద్వజాదిజ్వరములయొక్క హేతువులు - లక్షణములు.

మూ॥ విషమాశనాదనశనాదన్నపరివర్తాదృతువ్యాపత్తేరసాత్మ్యగన్ధోపఘ్రాణాత్ విషోపహతస్యోదకస్య చోపయోగాద్గరేభ్యో గిరీణాం చోపశ్లేషాత్ స్నేహస్వేదవమనవిరేచనాస్థాపనానువాసనశిరోవిరేచనానామయథావత్ప్రయోగాత్ మిథ్యాసంసర్జనాద్వా స్త్రీణాం చ విషమప్రజననాత్ ప్రజాతానాం చ మిథ్యోపచారాద్యథోక్తానాం చ హేతూనాం మిశ్రీభావాద్యథానిదానం

ద్వన్ద్వానామన్యతమః సర్వే వా త్రయో దోషా యుగపత్ప్రకోప మాపద్యన్తే; తే ప్రకుపితా స్తయైవానుపూర్వ్యా జ్వరమభినిర్వర్త యన్తి; తత్ర యథోక్తానాం జ్వరలిఙ్గానాం మిశ్రీభావవిశేషదర్శనా ద్ద్వన్ద్వకమన్యతమం జ్వరం, సాన్నిపాతికం వా విద్యాత్ ॥13॥

ఆ॥ విషమాహారము, భుజింపకుండుట, అలవాటైన ఆహారమును ఒక్కమారుగనే మార్చుట, ఋతువిపర్యయము, సాత్మ్యముకాని పరిమళమును ఆఘ్రాణించుట, విషముతోగూడిన జలమును ఉపయోగించుట, కృత్రిమవిషము, పర్వతములసమీపము నందుండుట, స్నేహము స్వేదము వమనము విరేచనము ఆస్థాపనవస్తి అనువాసనవస్తి నస్యము వీనినిగాని సంసర్జనక్రమమునుగాని సరిగ నాచరించకపోవుట, స్త్రీలకు విషమ ప్రసవముకలుగుట, ప్రసవమైనపిదప పథ్యము సరిగ నాచరించకపోవుట వీనివలనను; ఆయా దోషములకు ప్రత్యేకముగ చెప్పబడిన హేతువులు కలియుటవలనను ఆయా హేతువుల ననుసరించి రెండేసిదోషములుగాని మూడుదోషములునుగాని ఒకేసారి ప్రకోపమునొందును. అట్లు ప్రకోపించి ఆయా దోషములకుతగినట్లు ద్వంద్వజజ్వరమునుగాని సాన్నిపాతికజ్వరమునుగాని కలిగించును. ఆయా దోషములకు చెప్పబడిన లక్షణములయొక్క సంయోగముననుసరించి ద్వంద్వజజ్వరములనుగాని సాన్నిపాతికజ్వరమునుగాని తెలిసికొనవలయును.

## ఆగంతుక జ్వరమునకు కారణములు – దోషసంబంధము.

మూ॥ అభిఘాతాభిషఙ్గాభిచారాభిశాపేభ్య ఆగన్తుర్హి వ్యథాపూర్వో జ్వరోఽష్టమో భవతి, స కించిత్కాలమాగన్తుః కేవలో భూత్వా పశ్చాన్నిజైర్దోషైరనుబధ్యతే । తత్రాభిఘాతజో వాయునా దుష్టశోణితాధిష్ఠానేన, అభిషఙ్గజః పునర్వాతపిత్తాభ్యాం, అభిచారాభిశాపజాతు సన్నిపాతేనానుబధ్యతే; స సప్తవిధాజ్జ్వరాద్విశిష్టలిఙ్గోపక్రమసముత్థానత్వాద్విశిష్టో వేదితవ్యః కర్మణా సాధారణేన చోపక్రమ్యతే; ఇత్యష్టవిధా జ్వరప్రకృతిరుక్తా ॥14॥

ఆ॥ ఎనిమిదవదియగు ఆగంతుకజ్వరము – అభిఘాతము, అభిషంగము, అభిచారము, అభిశాపము అనునీ కారణములచే బాధాపూర్వకముగ జనించును. అట్టిజ్వరము కొంతకాలము దోషసంబంధము లేకుండనుండి పిదప తగుదోషముయొక్క సంబంధము కలదియగును. అభిఘాతజజ్వరమునందు దుష్టరక్తముతోకూడిన వాతమునకును, అభిషంగజజ్వరమునందు వాతపిత్తములకును, అభిచారజఅభిశాపజజ్వరములయందు మూడుదోషములకును సంబంధము కలుగును. వాతజ్వరము మొదలగు ఏడుజ్వరములకంటె భిన్నమైన లక్షణములును చికిత్సయు కారణములును కలదగుటవలన ఆగంతుకజ్వరము ప్రత్యేకించి

చెప్పబడినది. ఇది సామాన్యచికిత్సచే శాంతించును. ఇట్లు, ఎనిమిదివిధములైన జ్వరములయొక్క స్వభావము చెప్పబడినది.

మూ॥ జ్వరస్త్వేక ఏవ సంతాపలక్షణః, తమేవాభిప్రాయవిశేషాద్ద్వివిధమాచక్షతే, నిజాగన్తువిశేషాచ్చ; తత్ర నిజం ద్వివిధం త్రివిధం చతుర్విధం సప్తవిధం చాహుర్భిషజో వాతాదివికల్పాత్ ॥15॥

అ॥ జ్వరము సంతాపలక్షణముచే ఒకేవిధముగ నుండును. దానినే నిజాగంతుకములనెడి భేదముచే రెండువిధములుగ చెప్పుచున్నారు. అందు నిజజ్వరము - శీతోష్ణభేదముచే రెండువిధములనియు ప్రత్యేకదోష భేదముచే మూడువిధములనియు సన్నిపాతముతోకలిసి నాలుగువిధములనియు ద్వంద్వములతోకూడ కలిసి ఏడువిధములనియు చెప్పబడుచున్నది.

## జ్వరపూర్వరూపములు.

మూ॥ తస్యేమాని పూర్వరూపాణి తద్యథా - ముఖవైరస్యం గురుగాత్రత్వమనన్నాభిలాషశ్చక్షుషోరాకులత్వమస్రాగమనం నిద్రాయా ఆధిక్యమరతిర్జృమ్భావినామో వేపథుః శ్రమభ్రమప్రలాపజాగరణలోమహర్ష దన్తహర్షాః శబ్దశీతవాతాతపాసహత్వమరోచకావిపాకౌ దౌర్బల్యమఙ్గమర్దః సదనమల్పప్రాణతా దీర్ఘసూత్రతాఽఽలస్యముచితస్య కర్మణో హానిః ప్రతీపతా స్వకార్యేషు గురూణాం వాక్యేష్వభ్యసూయా బాలేషు ప్రద్వేషః స్వధర్మేష్వచిన్తా మాల్యానులేపనభోజనపరిక్లేశనం మధురేషు భక్ష్యేషు ప్రద్వేషోఽమ్లలవణకటుకప్రియతా చేతి జ్వరపూర్వరూపాణి భవన్తి ప్రాక్సన్తాపాత్, అపి చైనం సన్తాపార్తమనుబధ్నన్తి ॥16॥

అ॥ నోరు అసహ్యముగ నుండుట, శరీరము బరువుగ వుండుట, ఆహారమునందిష్టములేకపోవుట, నేత్రములు కలకబారుట, కన్నీరుకారుట, అధికనిద్ర, దేనియందును నిచ్చలేకుండుట, ఆవలింతలు, శరీరము వంచబడినట్లుండుట, వణుకు, బడలిక, మోహము, ప్రలాపము, నిద్రపట్టకుండుట, గగుర్పాటు, దంతహర్షము, ధ్వనిని శీతమును గాలిని ఎండను సహింపకుండుట, అరోచకము, ఆహారము జీర్ణముకాకుండుట, దుర్బలత్వము, ఒడలునొప్పులు, కృశించుట, మనోదౌర్బల్యము, పనులను ఆలస్యముగ చేయుట, మందుడుగనుండుట, ఉచితమైనపనిని చేయకుండుట, తనకార్యములయందు నిర్లక్ష్యముగ నుండుట, పెద్దలవాక్యములయందసూయ, బాలురయందు ద్వేషము, తనధర్మములను ఆలోచించకపోవుట, పుష్పమాలలను చందనాదిలేపములను ఆహారమును తిరస్కరించుట, మధురపదార్థములను ద్వేషించుట, ఆమ్లలవణకటుకరసములను

కోరుట ఇవి జ్వరమునకు పూర్వరూపములుగ నుండును. ఇవి జ్వరసంతాపమునకు పూర్వమునందేగ్పడి పిదపకూడ అనుసరించును.

మూ॥ ఇత్యేతాన్యేకైకశో జ్వరలిఙ్గాని వ్యాఖ్యాతాని భవన్తి విస్తరసమాసాభ్యామ్॥

అ॥ ఇట్లు జ్వరలక్షణములువివరముగను సంక్షేపముగను ప్రత్యేకముగ చెప్పబడినవి.

జ్వరవర్ణనము.

మూ॥ జ్వరస్తు ఖలు మహేశ్వరకోపప్రభవః సర్వప్రాణినాం ప్రాణహరో దేహేన్ద్రియమనస్తాపకరః ప్రజ్ఞాబలవర్ణహర్షోత్సాహ సాదనః శ్రమక్లమమోహాహారోపరోధసంజననో, "జ్వరయతి శరీరాణి" ఇతి జ్వరః, నాన్యే వ్యాధయస్తథా దారుణా బహుపద్రవా దుశ్చికిత్స్యాశ్చ యథాఽయమితి, స సర్వరోగాధిపతిర్నానాతిర్యగ్యోనిషు బహువిధైశ్శబ్దైరభిధీయతే, సర్వప్రాణభృతశ్చ సజ్వరా ఏవ జాయన్తే సజ్వరా ఏవ మ్రియన్తే, స మహామోహః, తేనాభిభూతా దేహినః ప్రాగ్దైహికం కర్మ కించిదపి న స్మరన్తి, సర్వప్రాణభృతాం చ జ్వర ఏవాన్తే ప్రాణానాదత్తే ॥17॥

అ॥ జ్వరము ఈశ్వరకోపమువలన జనించినది. సమస్తప్రాణులయొక్క ప్రాణములను హరించును. దేహమును ఇంద్రియములను మనస్సును తపింపచేయును. బుద్ధి, బలము, శరీరకాంతి, సంతోషము, ఉత్సాహము వీనిని హరింపజేయును. బడలికను పాలుమాలికను మోహమును అన్నద్వేషమును కలిగించును. శరీరమును బాధించునది గనుక జ్వరమని చెప్పబడును. జ్వరమువలె తీవ్రమైనట్టియు అనేక ఉపద్రవములతో కూడియుండునట్టియు చికిత్సింపశక్యముకానట్టియు వ్యాధులేవియు లేవు జ్వరము సమస్తరోగములలోను ప్రధానమైనది. ఇది సమస్తములగు పశుపక్ష్యాదులయందుకూడ జనించుచు అనేకవిధములగు నామములచే వ్యవహరింపబడుచున్నది. సమస్తప్రాణులును జ్వరముతోనే జనించి జ్వరముతోనే మరణించును. ఇది మహామోహస్వరూపమైనది. దీనితోకూడియుండుటచే ప్రాణులకు పూర్వజన్మజ్ఞానముఉండదు. సమస్తప్రాణులయొక్క ప్రాణములను జ్వరమే తీసివేయును.

జ్వరచికిత్సాసంగ్రహము.

మూ॥ తత్ర పూర్వరూపదర్శనే జ్వరాదౌ వా హితం లఘ్వశనమతర్పణం వా, జ్వరస్యామాశయసముత్థత్వాత్; తతః కషాయ

పానాభ్యఙ్గస్వేదప్రదేహపరిషే కానులేపనవమనవిరేచనాస్థాపనానువాసనోశమననస్యకర్మధూపధూమపానాఞ్జనక్షీరభోజనవిధానం చ యథాస్వం యుక్త్యా ప్రయోజ్యమ్॥

అ॥ జ్వరము ఆమాశయమునందు పుట్టునదగుటవలన పూర్వరూపములు కనపడగనేగాని జ్వరప్రారంభమునందుగాని లఘ్వాహారమునిచ్చుట లేక లంఘనముచేయించుట హితకరముగ నుండును. కషాయపానము, అభ్యంగము, స్వేదము, నలుగుపెట్టుకొనుట, పరిషేకము, లేపనము, వమనము, విరేచనము, నిరూహావస్తి అనువాసనవస్తి శమనచికిత్స, నస్యకర్మ, ధూపమువేయుట, ధూమపానము, అంజనము, క్షీరపానము వీనిని జ్వరమునందు తగు విధమున చేయింపవలయును.

జీర్ణజ్వరమునందు ఘృతపానము.

మూ॥ జీర్ణజ్వరేషు తు సర్వేష్వేవ సర్పిషః పానం ప్రశస్యతే యథాస్వౌషధసిద్ధస్య; సర్పిర్హి స్నేహాద్వాతం శమయతి, సంస్కారాత్కఫం, శైత్యాత్పిత్తమూష్మాణం చ, తస్మాజ్జీర్ణజ్వరేషుతు సర్వేష్వేవ సర్పిర్హితముదకమివాగ్నిప్లుష్టేషు ద్రవ్యేష్వితి ॥శ్లో॥ యథా ప్రజ్వలితం వేశ్మ పరిషిఞ్చన్తి వారిణా । నరాశ్శాన్తిమభిప్రేత్య తథా జీర్ణజ్వరే ఘృతమ్॥ స్నేహాద్వాతం శమయతి, శైత్యాత్పిత్తం నియచ్ఛతి । ఘృతం తుల్యగుణం దోషం సంస్కారాత్తు జయేత్కఫమ్॥ నాన్యస్స్నేహస్తథా కశ్చిత్సంస్కారమనువర్తతే।యథా సర్పిరతస్సర్పిస్సర్వస్నేహోత్తమం మతమ్ ॥ గదోక్తోయః పునశ్శ్లోకైరర్థస్సమనుగీయతే । తద్వ్యక్తివ్యవసాయార్థం ద్విరుక్తం తన్నగర్హ్యతే ॥22॥

అ॥ ఘృతము - స్నేహగుణమువలన వాతమును, సంస్కారవిశేషమువలన కఫమును, శీతగుణమువలన పిత్తమును ఊష్మను శమింపజేయును. అందువలన అగ్నివ్యాప్తమైన ద్రవ్యములయందు జలసేచనమువలె జీర్ణజ్వరములయందు ఆయా ద్రవ్యములతో తయారుచేయబడిన ఘృతమును పానముచేయుట హితకరముగ నుండును. మండుచున్న యింటిని చల్లార్చునిమిత్తము నీటిని చల్లువిధమున జీర్ణజ్వరము శాంతించు నిమిత్తము ఘృతపానమును చేయింపవలయును. ఘృతము - స్నేహగుణమువలన వాతమును, శీతగుణమువలన పిత్తమును, తుల్యగుణములుకలకఫమును సంస్కారవిశేషమువలనను శమింపజేయును. ఘృతమువలె సంస్కారముననుసరించు స్నేహము మఱియొకటి లేదు. కాబట్టి సమస్తస్నేహములలోను ఘృతము శ్రేష్ఠముగ నుండును. చెప్పబడినవిషయమే స్పష్టమునిమిత్తము మరల చెప్పబడినదిగాన పునరుక్తిదోషము లేదు.

అధ్యాయసంగ్రహము.

మూ॥ త్రివిధం నామపర్యాయైర్హేతుం పఞ్చవిధం గదమ్। గదలక్షణపర్యాయాన్ వ్యాధేః పఞ్చవిధం గ్రహమ్ ॥ జ్వరమష్టవిధం తస్య ప్రకృష్టాసన్నకారణమ్ । పూర్వరూపం చ రూపం చ భేషజం సంగ్రహేణ చ॥ వ్యాఖ్యాతవాన్ జ్వరస్యాగ్రే నిదానే విగతజ్వరః । భగవానగ్నివేశాయ ప్రణతాయ పునర్వసుః ॥25॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే నిదానస్థానే జ్వరనిదానం నామ ప్రథమోఽధ్యాయః ॥

అ॥ హేతువుయొక్క త్రైవిధ్యము, హేతుపర్యాయపదములు, వ్యాధియొక్క పంచవిధత్వము, వ్యాధిపర్యాయపదములు, రూపపర్యాయపదములు, నిదానపంచకము, ఎనిమిదివిధములగు జ్వరములు, జ్వరముయొక్క విప్రకృష్టకారణములు, సన్నికృష్టకారణములు, పూర్వరూపము. రూపము, చికిత్సాసంగ్రహము వీనినిమోహాదిరహితుడైనఆత్రేయుడు నమ్ముడైయున్న అగ్నివేశునకు నిదానస్థానమునందు ముందుగ చెప్పెను.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామకకృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితావ్యాఖ్యానమునందు జ్వరనిదానమనెడు ప్రథమాధ్యాయము సమాప్తము.



## ద్వితీయాధ్యాయము

మూ॥ అథాతో రక్తపిత్తనిదానం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట రక్తపిత్తనిదానమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

రక్తపిత్తనిదానము.

మూ॥ పిత్తం యథాభూతం లోహితపిత్తమితి సంజ్ఞాం లభతే తథాఽనువ్యాఖ్యాస్యామః । యదా జన్తుర్యవకోద్దాలకకోరదూషక

ప్రాయాణ్యన్నాని భుఙ్క్తే భృశోష్ణతీక్ష్ణమపి చాన్నజాతం నిష్పావ మాషకులుత్థక్షారసూపోపహితం దధిమణ్డో దశ్విత్కట్వరామ్ల కాఞ్జికోపసేకం వారాహమాహిషాకమాత్స్యగవ్యపిశితపిణ్యాకపిణ్డాలుకవిశుష్కశాకోపహితం మూలకసర్షపలశునకరఞ్జశిగ్రుమధుశిగ్రుఖడయూషభూస్తృణసుముఖసురసకుఠేరగణ్డీరకాలమాలపర్ణాసక్షవకఫణిజ్జకోపదంశం సురసౌవీరకతుషోదకమైరేయమేదకమధూలకకువలబదరామ్లప్రాయానుపానం పిష్టాన్నోత్తరభూయిష్ఠముష్ణాభితప్తో వాఽతిమాత్రమతివేలం పయః పిబతి పయసా వా సమశ్నాతి రోహిణీకం కాణకపోతం వా సర్షపతైలక్షారసిద్ధం కులుత్థపిణ్యాకజామ్బవలకుచపక్వైః శౌక్తికైర్వా సహక్షీరమామమతిమాత్రమథవాపిబత్యుష్ణాభితప్తస్తస్యైవమాచరతః పిత్తం ప్రకోపమాపద్యతే, లోహితం చ స్వప్రమాణమతివర్తతే॥

అ॥ పిత్తము ఏవిధముగనై రక్తపిత్తమని చెప్పబడునో అట్టివిధమును చెప్పుచున్నాను. యవధాన్యము ఉద్దాలకమను ధాన్యము వరగ ధాన్యము వీనియొక్క అన్నములను, మిక్కిలి ఉష్ణవీర్యమును తీక్ష్ణగుణమును కల ఆహారమును, అనుములు మినుములు ఉలవలు వీనియొక్క పప్పుతోడను అధికమగుక్షారముతోడను కూడిన ఆహారమును, పెరుగు పెరుగుమీద తేట సగమునీళ్ళుకలిసినమజ్జిగ నీళ్ళుకలిసినమజ్జిగ కాంజికము వీనితోకూడిన ఆహారమును, పంది దున్నపోతు గొఱ్ఱె చేపలు ఆవు వీనియొక్క మాంసములతోడను తెలకపిండి పెండలము ఒరుగులు వీనియొక్క కూరలతోడను కూడిన ఆహారమును, ముల్లంగి ఆవాలు వెల్లుల్లి కానుగ మునగ చిన్నమునగ ఖడయూషము కామంచి ఎర్రావాలు తులసి గగ్గెర గురిజకూర చినతులసి నల్లగగ్గెర వాక తియ్యనిమ్మ వీనియొక్క పచ్చళ్ళతోకూడిన ఆహారమును, సుర సౌవీరము తుషోదకము మైరేయము మేదకము మధూలకము అను మద్యములయొక్కయు చినరేగు రేగు మొదలగు అమ్లరసద్రవ్యములయొక్కయు అనుపానములతో కూడిన ఆహారమును, అధికమగుపిండివంటలతో కూడిన ఆహారమును భుజించుటవలనను; ఉష్ణాభితప్తుడై పాలను అధికముగగాని తరచుగాని త్రాగుటవలనను లేక పాలతోకూడిన ఆహారమును భుజించుటవలనను; ఆవనూనె క్షారములు వీనితో తయారుకాబడిన రోహిణిఅనెడిచేపలు కణుజు పావురము వీనియొక్క మాంసమును భుజించుటవలనను; ఉష్ణాభితప్తుడై ఉలవలు తెలకపిండి నేరేడుపండ్లు నిమ్మకాయలు వీనితో తయారుచేయబడిన కాంజికములతో పచ్చిపాలను అధికముగ త్రాగుటవలనను పిత్తము ప్రకోపించును. రక్తముకూడ స్వప్రమాణముకంటె వృద్ధినొందును.

### రక్తపిత్తసంప్రాప్తి.

మూ॥ తస్మిన్ ప్రమాణాతిప్రవృత్తే పిత్తం ప్రకుపితం శరీర మనుసర్పద్యదైవ యకృత్ప్లీహప్రభవాణాం లోహితవహానాం స్రోతసాం లోహితాభిష్యన్దగురూణి ముఖాన్యాసాద్య ప్రతిరున్ధ్యాత్ తదైవ లోహితం దూషయతి ॥3॥

అ॥ రక్తము స్వప్రమాణముకంటె వృద్ధిపొందియుండగా, ప్రకోపించిన పిత్తము శరీరమునంతను వ్యాపించి యకృత్ప్లీహములయందుపుట్టిన రక్తవహస్రోతస్సులను పొంది రక్తాధిక్యముచే బరువుగనున్న అట్టిస్రోతస్సులయొక్క ముఖములను అడ్డగించి రక్తమును చెరచును.

### రక్తపిత్తనిర్వచనము.

మూ॥ తల్లోహితసంసర్గాల్లోహిత ప్రదూషణాల్లోహితగన్ధవర్ణానువిధానాచ్చ పిత్తం లోహితపిత్తమిత్యాచక్షతే ॥4॥

అ॥ పిత్తము రక్తముతో కలియుటవలనను, రక్తమును చెరచుటవలనను, రక్తముయొక్క గంధమును రంగును కలదగుటవలనను రక్తపిత్తమనబడును.

### రక్తపిత్తపూర్వరూపములు.

మూ॥ తస్యేమాని పూర్వరూపాణి భవన్తి, తద్యథా - అనన్నాభిలాషో భుక్తస్య విదాహః శుక్తామ్లగన్ధరస ఉద్గారశ్ఛర్దేరభీక్ష్ణాగమనం ఛర్దితస్య బీభత్సతా స్వరభేదో గాత్రాణాం సదనం పరిదాహో ముఖాద్ధూమాగమ ఇవ లోహలోహితమత్స్యామగన్ధిత్వమపి చాస్యస్య రక్తహారితహారిద్రత్వమఙ్గావయవశకృన్మూత్రస్వేదలాలాశిఙ్ఘాణ కాస్యకర్ణమలపిడకోలికాపిడనామఙ్గవేదనా లోహితనీలపీతశ్యావానామర్చిష్మతాం చ రూపాణాం స్వప్నే దర్శనమభీక్ష్ణమితి లోహితపిత్తపూర్వరూపాణి భవన్తి ॥5॥

అ॥ ఆహారమునందిచ్ఛలేకుండుట, భుజించినఆహారము విదాహమునొందుట, పులికడుగుయొక్క వాసనయు రుచియు కల త్రేంపులు వచ్చుట, వాంతి తరుచుగ వచ్చుట, వాంతిచేసికొనగనే భయపడుట, స్వరభేదము, అవయవములు కృశించుట, తాపము, నోటినుండి పొగ వెడలుచున్నట్టుండుట, నోటియందు లోహము రక్తము చేపలు ఆమము వీనియొక్క వాసన కలుగుట, శరీరము అవయవములు మలము మూత్రము చెమటజొల్లు చీమిడి నోటిపాచి చెవియందలి గులిమి కండ్లయందలి పుసి

పిటికలు ఇవి ఎఱ్ఱగను పచ్చగను పసుపుపచ్చగను నుండుట, శరీరమునందు బాధ, స్వప్నమునందు ఎఱ్ఱగను నీలవర్ణముగను పచ్చగను శ్యామవర్ణముగను ప్రకాశించుచున్నవిగను నుండు స్వరూపములను తరుచు చూచుట ఇవి రక్తపిత్తమునకు పూర్వరూపములుగ నుండును.

### రక్తపిత్తోపద్రవములు.

మూ॥ ఉపద్రవాస్తుఖలు - దౌర్బల్యారోచకావిపాకశ్వాసకాసజ్వరాతీసారశోఫశోషపాణ్డురోగాః సర్వభేదశ్చ ॥6॥

అ॥ దౌర్బల్యము, అరోచకము, ఆహారమజీర్ణము కాకపోవుట, ఆయాసము, దగ్గు జ్వరము, అతిసారము, శోఫ, శోష, పాండురోగము, స్వరభేదము ఇవి రక్తపిత్తమునందు ఉపద్రవములుగ నుండును.

### రక్తపిత్తమార్గవివరణము.

మూ॥ మార్గౌపునరస్య ద్వౌ-ఊర్ధ్వం చాధశ్చ; తద్బహుశ్లేష్మణి శరీరే శ్లేష్మసంసర్గాదూర్ధ్వం ప్రపద్యమానం కర్ణనాసికానేత్రాస్యేభ్యః ప్రచ్యవతే, బహువాతే తు శరీరే వాతసంసర్గాదధః ప్రపద్యమానం మూత్రపురీషమార్గాభ్యాం ప్రచ్యవతే, బహుశ్లేష్మవాతే తు శరీరే శ్లేష్మవాతసంసర్గాద్ద్వావపి మార్గౌ ప్రపద్యతే, ద్వౌ మార్గౌ ప్రపద్యమానం సర్వేభ్య ఏవ యథోక్తేభ్యః ఖేభ్యః ప్రచ్యవతే శరీరస్య ॥7॥

అ॥ రక్తపిత్తము ఊర్ధ్వమార్గమునుండియు అధోమార్గమునుండియు బయలువెడలును. ఈరక్తపిత్తము-శ్లేష్మాధిక్యముకలవానికి శ్లేష్మసంబంధమువలన ఊర్ధ్వమార్గమును పొంది చెవులు ముక్కు నేత్రములు ముఖము వీనినుండి బయలువెడలును. వాతాధిక్యముకలవానికి వాతసంబంధమువలన అధోమార్గమును పొంది మూత్రపురీషమార్గముల నుండి బయలువెడలును. శ్లేష్మవాతము లధికముగ కలవానికి శ్లేష్మవాతసంబంధమువలన ఊర్ధ్వాధోమార్గములను పొంది పైనజెప్పిన సమస్తరంధ్రములనుండియు బయలువెడలును.

### రక్తపిత్తముయొక్క సాధ్యాసాధ్యయాప్యవిచారణ.

మూ॥ తత్ర యదూర్ధ్వభాగం తత్సాధ్యం, విరేచనోపక్రమణీయత్వాద్బహ్వౌషధత్వాచ్చ; యదధోభాగం తద్యాప్యం, వమనోపక్రమణీయత్వాదల్పౌషధత్వాచ్చ; యదుభయభాగం తదసాధ్యం, వమనవిరేచనాయోగిత్వాదనౌషధత్వాచ్చేతి ॥8॥

అ॥ విరేచనములచే చికిత్సింపదగినదగుటవలనను అనేకౌషధములు కలదగుట వలనను ఊర్ధ్వగ రక్తపిత్తము సాధ్యముగ నుండును. వమనములచే చికిత్సింపదగినదగుట వలనను ఔషధములుతక్కువగ కలదగుటవలనను అధోగ రక్తపిత్తము యాప్యముగ నుండును. వమనములను విరేచనములను ప్రయోగింపకూడనిదగుటవలనను ఔషధములు లేనిదగుట వలనను ఉభయమార్గగ రక్తపిత్తము అసాధ్యముగ నుండును.

రక్తపిత్తముయొక్క ఉత్పత్తి.

మూ॥ రక్తపిత్తప్రకోపస్తు ఖలు పురా దక్షయజ్ఞధ్వంసే రుద్రకోపప్రభవాగ్నినా ప్రాణినాం పరిగతశరీరప్రాణానామనుజ్వరమభవత్॥ తస్యాశుకారిణో దావాగ్నేరివాపతితస్యాత్యయికస్యాశు ప్రశాన్తౌ యతితవ్యమ్॥

అ॥ పూర్వకాలమునందు దక్షయజ్ఞధ్వంససమయమున జనించినట్టి రుద్రకోపాగ్నిచే పీడింపబడిన ప్రాణులకు జ్వరానంతరమునందు ఈ రక్తపిత్తము పుట్టెను. దావాగ్నివలె హఠాత్తుగ జనించునట్టియు వెంటనే మరణమును కలిగించునట్టియు ఈ రక్తపిత్తమును త్వరలో శాంతినొందించుటకు ప్రయత్నింపవలయును.

రక్తపిత్తచికిత్సాక్రమము.

మూ॥ మాత్రాం దేశం కాలం చాభిసమీక్ష్య సంతర్పణేనాపతర్పణేన వా మృదుమధురశిశిరతిక్తకషాయైరభ్యవహార్యైః ప్రదేహపరిషేకావగాహసంస్పర్శనైర్వమనాద్యైర్వా తత్రావహితేనేతి॥10॥

అ॥ ఈరక్తపిత్తమునందు — పరిమాణము దేశము కాలము వీనిని తెలిసికొని బృంహణచికిత్సనుగాని అపతర్పణచికిత్సనుగాని మృదుగుణము మధురరసము శీతవీర్యము తిక్తరసము కషాయరసము కల ద్రవ్యములతోడను, లేపనము పరిషేకము అవగాహనస్నానము రత్నాదులను స్పృశించుట వమనములు మొదలగువానితోడను, తగువిధమున చికిత్స చేయవలయును.

మూ॥ సాధ్యం లోహితపిత్తం తద్యదూర్ధ్వం ప్రతిపద్యతే। విరేచనస్య యోగిత్వాద్బహుత్వాద్భేషజస్య చ॥ విరేచనం తు పిత్తస్య జయార్థే పరమౌషధమ్। యశ్చ తత్రాన్వయశ్శ్లేష్మా తస్య చానధమం స్మృతమ్॥ భవేద్యోగావహం తత్ర మధురం చైవ భేషజమ్। తస్మాత్సాధ్యం మతం రక్తం యదూర్ధ్వం ప్రతిపద్యతే॥రక్తం తు యదధోభాగం తద్యాప్యమితి నిశ్చయః। వమనస్యాల్పయోగిత్వాదల్పత్వాద్భేషజస్య చ॥ వమనం హి న పిత్తస్య హారణే శ్రేష్ఠము

చ్యతే । యశ్చ తతో౾నుగో వాయుస్తచ్ఛాన్తౌ చావరం మతమ్ ॥
తచ్చాయోగావహం తత్ర కషాయం తిక్తకాని చ । తస్మాద్యాప్యం
సమాఖ్యాతం యదక్తమనులోమగమ్॥ రక్తపిత్తం తు యన్మార్గౌ
ద్వావపి ప్రతిపద్యతే । అసాత్మ్యమితి తజ్జ్ఞేయం పూర్వోక్తాదపి కార
ణాత్ ॥ న హి సంశోధనం కించిదస్త్యస్య ప్రతిమార్గగమ్॥ప్రతిమార్గం
చ హరణం రక్తపిత్తే విధీయతే॥ ఏవమేవోపశమనం సర్వశో నాస్య
విద్యతే । సంసృష్టేషు చ దోషేషు సర్వజిచ్ఛమనం మతమ్॥
ఇత్యుక్తం త్రివిధోదర్కం రక్తం మార్గవిశేషతః । ఏభ్యస్తు ఖలు హే
తుభ్యః కించిత్సాధ్యం న సిధ్యతి ॥ ప్రేష్యోపకరణాభావాద్దౌరాత్మ్యా
ద్వైద్యదోషతః । అకర్మతశ్చ సాధ్యత్వం కశ్చిద్రోగో౾తివర్తతే ।
తత్రాసాధ్యత్వమేకం స్యాత్సాధ్యయాప్యపరిక్రమాత్ ॥22॥

అ॥ విరేచనములను చేయింపదగినదగుటవలనను అనేకౌషధములు కలదగుట వలనను ఊర్ధ్వగరక్తపిత్తము సాధ్యముగ నుండును. విరేచనము పిత్తమును హరించుటలో శ్రేష్ఠమైనదిగను అనుబంధమైన కఫమును హరించుటలో మధ్యమమైనదిగను నుండును. మధురౌషధముకూడ పిత్తకఫములను హరించును. కావున ఊర్ధ్వగరక్తపిత్తము సాధ్యముగ నుండును. వమనములవలన స్వల్పప్రయోజనము కలదగుటవలనను ఔషధములు తక్కువగ కలదగుటవలనను అధోగరక్తపిత్తము యాప్యముగ నుండును. వమనము పిత్తమును హరించుటలో శ్రేష్ఠమైనదికాదు. మరియు అనుబంధముగ నున్న వాతమును హరించుటలో అధమముగ నుండును. పిత్తనాశకములగు కషాయతిక్తరసములు వాతమును హరింపనేరవు. కావున అధోగరక్తపిత్తము యాప్యముగ నుండును. పూర్వమునందు చెప్పబడినట్లు వమనములను విరేచనములను చేయింపకూడనిదగుటవలనను ఔషధములు లేనిదగుటవలనను ఉభయమార్గరక్తపిత్తము అసాధ్యముగ నుండును. రక్తపిత్తమును హరించుటలో ప్రతిమార్గగశోధనము ముఖ్యచికిత్సగ నుండును. అట్టి శోధనము దీనియందు చేయుటకు వీలులేదు. దోషములు కలిసియున్నపుడు అన్నిదోషములను శమింపజేయునదియే శమనచికిత్స యనబడును. దీనికి అట్టిశమనచికిత్స లేదు. అందువలన ఉభయమార్గగరక్తపిత్తము అసాధ్యముగ నుండును. ఈ రీతిని మార్గవిశేషములననుసరించి మూడువిధములైన రక్తపిత్తము చెప్పబడినది. పరిచారకుడను ఉపకరణములును లేకపోవుటవలనను, రోగి దుష్టస్వభావము కలవాడగుట వలనను, వైద్యునియొక్క దోషమువలనను, చికిత్సలేకపోవుట వలను, సాధ్యత్వయాప్యత్వములను అతిక్రమించుటవలనను సమస్తమైన వ్యాధులను (సాధ్యములైనవికూడ) అసాధ్యములగును.

## రక్తపిత్తాసాధ్యలక్షణములు.

మూ॥ రక్తపిత్తస్య విజ్ఞానమిదం తస్యోపదేక్ష్యతే । యత్కృష్ణ మథవా నీలం యద్వా శక్రధనుష్ప్రభమ్॥ రక్తపిత్తమసాధ్యం తద్వా ససో రఞ్జనం చ యత్ భృశం పూత్యతిమాత్రం చ సర్వోపద్రవ వచ్చ యత్ ॥ బలమాంసక్షయే యచ్చ తచ్చ రక్తమసిద్ధిమత్ । యేన చోపహతో రక్తం రక్తపిత్తేన మానవః । పశ్యేద్దృశ్యం వియచ్చాపి తచ్చాసాధ్యమసంశయమ్ ॥25॥

అ॥ అసాధ్యరక్తపిత్తలక్షణములను చెప్పుచున్నాము. రక్తపిత్తమునందు - రక్తము నల్లగగాని నీలవర్ణముగగాని ఇంద్రధనుస్సుయొక్క వర్ణములుకలదిగగాని యున్నను, వస్త్రమునకంటినచో వదలకున్నను, మిక్కిలి దుర్గంధముగ నున్నను, అధికముగ వెడలుచున్నను, ఈవ్యాధి సర్వోపద్రవములతో కూడియున్నను, రోగియొక్క బలమాంసములు క్షీణించియున్నను, రోగికి సమస్తవస్తువులును ఆకాశమును ఎర్రగ కనబడుచున్నను అసాధ్యముగ నుండును.

మూ॥ తత్రాసాధ్యం పరిత్యాజ్యం యాప్యం యత్నేన యాపయేత్ । సాధ్యం చావహితస్సిద్ధైర్భేషజైస్సాధయేద్భిషక్ ॥26॥

అ॥ రక్తపిత్తము అసాధ్యముగనున్నచో విడిచిపెట్టవలయును. యాప్యముగ నున్నచో ప్రయత్నముచే చికిత్సించుచుండవలయును. సాధ్యముగనున్నచో సిద్ధౌషధములచే చికిత్సింపవలయును.

## అధ్యాయసంగ్రహము.

మూ॥ కారణం నామనిర్వృత్తిం పూర్వరూపాణ్యుపద్రవాన్ । మార్గౌ దోషానుబన్ధం చ సాధ్యత్వం న చ హేతుమత్ ॥ నిదానే రక్తపిత్తస్య వ్యాజహార పునర్వసుః । వీతమోహరజోదోషలోభమానమదస్పృహః ॥28॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే నిదానస్థానే రక్తపిత్తనిదానం నామ ద్వితీయోఽధ్యాయః ॥

అ॥ ఈఅధ్యాయమునందు రక్తపిత్తముయొక్క కారణములు నామనిర్వచనము పూర్వరూపములు ఉపద్రవములు మార్గములు దోషసంబంధము సాధ్యత్వాసాధ్యత్వములు వాని హేతువులు వీనిని మోహోదిరహితుడైన ఆత్రేయుడు చెప్పెను.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామకకృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు రక్తపిత్తనిదానమనెడు ద్వితీయాధ్యాయము సమాప్తము.



# తృతీయాధ్యాయము.

మూ॥ అథాతో గుల్మనిదానం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట గుల్మనిదానమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

## గుల్మభేదములు.

మూ॥ ఇహ ఖలు పఞ్చ గుల్మాభవన్తి; తద్యథా - వాతగుల్మః, పిత్తగుల్మః, శ్లేష్మగుల్మో, నిచయగుల్మః శోణితగుల్మశ్చేతి॥3॥

అ॥ వాతగుల్మము పిత్తగుల్మము కఫగుల్మము సన్నిపాతగుల్మము రక్తగుల్మము అని గుల్మము అయిదు విధములుగ నుండును.

మూ॥ ఏవంవాదినం భగవన్తమాత్రేయమగ్నివేశ ఉవాచ - కథమిహ భగవన్ ! పఞ్చానాం గుల్మానాం విశేషమభిజానీయాం, న హ్యవిశేషవిద్రోగాణా మౌషధవిదపి భిషక్ ప్రశమనసమర్థో భవతీతి॥ తమువాచ భగవానాత్రేయః - సముత్థానపూర్వరూపలిఙ్గవేదనోపశయవిశేషేభ్యో విశేషవిజ్ఞానం గుల్మానాం భవత్యన్యేషాం చ రోగాణామగ్నివేశ ! । తత్తు ఖలు గుల్మేషూచ్యమానం నిబోధ ॥5॥

అ॥ వైద్యుడు ఔషధజ్ఞానమును కలిగియున్నను రోగముయొక్క విశేషములు తెలియనిచో రోగమును శమింపజేయజాలడు. కావున ఈ అయిదువిధములగు గుల్మ

ములయొక్క విశేషములను ఎట్లు తెలిసికొనవలయునో చెప్పుము. అని అగ్నివేశుడు ఆత్రేయుని అడిగెను. నిదానము పూర్వరూపము రూపము బాధలు ఉపశయము వీని విశేషములవలన గుల్మముయొక్క విశేషములను తెలిసికొనవచ్చును. ఇటులనే ఇతర వ్యాధులనుకూడ తెలిసికొనవచ్చును. ఇప్పుడు గుల్మమువిషయమై విశేషవిజ్ఞానమును చెప్పెదను. తెలిసికొనుము. అని ఆత్రేయుడు చెప్పెను.

### వాతగుల్మనిదానము

మూ॥ యదా పురుషో వాతలో విశేషేణ జ్వరవమనవిరేచ నాతీసారాణామన్యతమేన కర్శనేన కర్శితో వాతలమాహారమాహరతిమా శీతం వా విశేషేణాతిమాత్రమస్నేహపూర్వో వా వమనవిరేచనే పిబత్యనుదీర్ణాం వా ఛర్దిముదీరయతి వాతమూత్రపురీషవేగాన్నిరుణ ద్ధ్యత్యశితో వా పిబతి నవోదకమతిమాత్రమతిమాత్రసంక్షోభిణా వా యానేన యాత్యతివ్యవాయవ్యాయామమద్యరుచిర్వాఽభిఘాతమృత చ్ఛతి వా విషమాశనశయనాసనస్థానచఙ్క్రమణసేవీ భవత్యన్యద్వా కించిదేవంవిధం విషమమతిమాత్రం వ్యాయామజాతమారభతే, తస్యాపచారాద్వాతః ప్రకోపమాపద్యతే ॥6॥

అ॥ వాతప్రకృతికలమనుజుడు - జ్వరము వమనములు విరేచనములు అతిసారము వీనిలో దేనిచేనైనను కృశించి వాతవర్ధకమగు ఆహారమునుగాని అధికమగు శీతవీర్యముకల ఆహారమునుగాని భుజించినను స్నేహకర్మను చేయకుండగనే వమనౌషధములనుగాని విరేచనౌషధములనుగాని సేవించినను వాంతిని బలవంతముగ వెడలించినను వాతమూత్రపురీషములయొక్క వేగములను అరికట్టినను అధికముగ భుజించి క్రొత్త నీటిని అధికముగ త్రాగినను శరీరక్షోభనుకలిగించు వాహనముమీద ప్రయాణము చేసినను మైథునమును వ్యాయామమును మద్యమును అధికముగ సేవించినను అభిఘాతమునుపొందినను విషమాహారము విషమశయనము విషమముగకూర్చుండుట విషమ స్థానములయందు సంచరించుట వీనిని సేవించినను ఇతరములగు ఇట్టి కృత్యములనాచరించినను వాతము ప్రకోపించును.

### వాతగుల్మసంప్రాప్తి.

మూ॥ స ప్రకుపితో మహాస్రోతోఽనుప్రవిశ్య రౌక్ష్యాత్కఠినీభూతమాప్లుత్య పిణ్డితోఽవస్థానం కరోతి హృది వస్తౌ పార్శ్వయోర్నాభ్యాం వా, స శూలముపజనయతి గ్రన్థీంశ్చానేకవిధాన్, పిణ్డితశ్చావతిష్ఠతే, స పిణ్డితత్వాద్గుల్మ ఇత్యుచ్యతే ॥7॥

అ॥ అట్లు ప్రకోపించినవాతము మహాస్రోతస్సును పొంది తనయందలి రౌక్ష్యముచే కాఠిన్యమును కలిగించి గుండ్రముగనై హృదయము వస్తి పార్శ్వములు నాభి వీనిలో దేనియందైనను స్థానమును ఏర్పరచుకొనును. పిదపశూలను అనేకవిధములైన గ్రంథులను కలిగించును. పిండాకారముగ నుండును. పొదవలె గుండ్రముగ నుండును. కనుక గుల్మమని చెప్పబడును.

## వాతగుల్మలక్షణములు.

మూ॥ స ముహురాధ్మతి, ముహురల్పత్వమాపద్యతే, అనియతవిపులాణువేదనశ్చ భవతి చలత్వాద్వాయోః, పిపీలికాసంప్రచార ఇవాఙ్గేషు, తోదస్ఫురణాయామసంకోచసుప్తిహర్షప్రలయోదయబహులః, తదాతురశ్చ సూచ్యేవ శఙ్కునేవ చాతివిద్ధమాత్మానం మన్యతే, అపిచ దివసాన్తే జీర్యతి శుష్యతి చాస్యాస్యం ఉచ్ఛ్వాసశ్చోపరుధ్యతే, హృష్యన్తి చాస్యరోమాణి వేదనాయాః ప్రాదుర్భావే, ప్లీహాటోపాన్త్రకూజనావిపాకోదావర్తాఙ్గమర్దమన్యాశిరఃశఙ్ఖశూలబ్రధ్నరోగాశ్చైనముపద్రవన్తి, కృష్ణారుణపరుషత్వఙ్నఖనయనవదనమూత్రపురీషశ్చ భవన్తి, నిదానోక్తాని చాస్య నోపశేరతే, విపరీతాని చోపశేరత ఇతి వాతగుల్మః ॥8॥

అ॥ వాతగుల్మము ఒకమారు పెద్దదిగను ఒకమారు చిన్నదిగను నుండును. వాతము చంచలస్వభావముకలదగుటవలన అధికమగు బాధలుగాని స్వల్పమగు బాధలుగాని నియమము లేకుండగ కలుగుచుండును. అవయవములయందు చీమలు ప్రాకుచున్నట్లుండును. పొడిచినట్లుబాధ అదురుట విస్తరించుట ముడుచుకొనుట మొద్దుబారుట గగుర్పాటు ఇవి చాలమారులు పుట్టుచు నశించుచుండును. సూదిచేతను మేకుచేతను పొడువబడుచున్నట్లు తలచుచుండును. సాయంకాలమునందును ఆహారము జీర్ణమైనపిమ్మటను నోరు ఎండును. శ్వాస అడ్డగించబడినట్లుండును. బాధజనించునపుడు వెండ్రుకలు గగుర్పొడుచును. ప్లీహవ్యాధి ఆటోపము ప్రేగులరచుట ఆహారము జీర్ణముకాకపోవుట ఉదావర్తము ఒడలినొప్పులు మన్యాప్రదేశమునందును శిరస్సునందును శంఖప్రదేశములయందును శూల బ్రధ్నము ఇవి ఉపద్రవములుగ నుండును. చర్మము గోళ్ళు నేత్రములు ముఖము మూత్రము పురీషము ఇవి నల్లగను ఎఱ్ఱగను పరుషముగను నుండును. హేతువులుగ చెప్పబడినవానిచే అభివృద్ధియు వానికివిపరీతములైనవానిచే శాంతియు కలుగును. ఇవి వాతగుల్మలక్షణముగ నుండును.

## పిత్తగుల్మముయొక్క నిదానము-లక్షణములు.

మూ॥ తైరేవ తు కర్శనైః కర్శితాస్యామ్లలవణకటుకక్షారోష్ణతీక్ష్ణశుక్తవ్యాపన్నమద్యహరితకఫలామ్లానాం విదాహినాం చ

శాకమాంసానాముపయోగాదజీర్ణాధ్యశనాద్రూక్ష్యేనుగతే చామాశయే వమనవిరేచనమతివేలం సంధారణం వాతాతపౌ చాతిసేవమానస్యపిత్తం సహ మారుతేన ప్రకోపమాద్యతే॥ తత్రప్రకుపితం మారుత ఆమాశయైకదేశే సంమూర్ఛ్య తానేవ వేదనాప్రకారానుపజయతి య ఉక్తా వాతగుల్మే, పిత్తం త్వేనం విదహతి కుక్షౌ హృద్యురసి కణ్ఠే చ, స విదహ్యమానః సధూమమివోద్గారముద్గిరత్యమ్లాన్వితం, గుల్మావకాశశ్చాస్య దహ్యతే దూయతే ధూప్యతే ఊష్మాయతే స్విద్యతి క్లిద్యతి శిథిల ఇవ చ స్పర్శాసహోఽల్పరోమాఞ్చశ్చ భవన్తి జ్వరభ్రమదవథుపిపాసాగలవదనతాలుశోషప్రమేహావిడ్భేదాః శ్చైనముపద్రవన్తి, హరితహారిద్రత్వఙ్నఖనయనవదనమూత్రపురీషశ్చ భవతి, నిదానోక్తాని చాస్య నోపశేరతే, విపరీతాని చోపశేరత ఇతి పిత్తగుల్మః ॥10॥

అ॥ పూర్వమువందు చెప్పబడిన జ్వరము మొదలగువానిచే కృశించినమనుజుడు అమ్లరసము లవణరసము కటురసము క్షారము ఉష్ణవీర్యము తీక్ష్ణగుణము ఇవికల పదార్థములను, కాంజికమును, చెడినమద్యమును, ఆకుకూరలను, పుల్లనిపండ్లను, తాపము నొందించు కూరలు జాంగలమాంసము వీనిని ఉపయోగించినను అజీర్ణపదార్థములను భుజించినను భుజించినవెంటనే భుజించినను ఆమాశయము రూక్షముగనున్నప్పుడు వమనవిరేచనములను అధికముగ సేవించినను మలమూత్రాదివేగములను అడ్డగించినను గాలిని ఎండను అధికముగ సేవించినను పిత్తము వాతముతోకూడ ప్రకోపించును. అట్టిపిత్తమును వాతము ఆమాశయమునందొకభాగమున మూర్ఛింపచేసి వాతగుల్మమునందు జెప్పబడినబాధలను కలిగించును. మరియు పిత్తము గుల్మమును విదాహము నొందించును. కుక్షిప్రదేశము హృదయము రొమ్ము కంఠము వీనియందు విదాహమును కలిగించును. విదాహమునొందిన యీ గుల్మము పొగవెడలుచున్నట్లున్న పుల్లనిత్రేణుపులను వెడలించును. గుల్మప్రదేశము తాపయుక్తముగను బాధకలదిగను పొగవెడలుచున్నట్లుగను వేడిమికలదిగను చెమటగలదిగను క్లేదయుక్తముగనువిడిపోవుచున్నట్లును స్పర్శనుసహించలేనిదిగను స్వల్పమగు రోమాంచముకలదిగను నుండును. జ్వరము భ్రాంతి తాపము దప్పిక కంఠమును నోరును తాలుప్రదేశమును ఎండుట మోహము మలము చాలసార్లు వెడలుట ఇవి ఉపద్రవములుగ నుండును. చర్మము గోళ్ళు నేత్రములు ముఖము మూత్రము పురీషము ఇవి పచ్చగను పసుపుపచ్చగను నుండును. హేతువు చెప్పబడినవానిచే అభివృద్ధియు వానికి విపరీతములైనవానిచే శాంతియు కలుగును. ఇవి పిత్తగుల్మలక్షణములుగ నుండును.

## కఫగుల్మముయొక్క నిదానము - లక్షణములు.

మూ॥ తై రేవ తు కర్శనైః కర్శితస్యాత్యశనాదతిస్నిగ్ధగురు మధురశీతాశనాత్పిష్టేక్షుక్షీరమాషతిలగుడ వికృతి సేవనాన్మద్యకమద్యాతిపానాద్ధరిత కాతిప్రణయనాదానూపౌదకగ్రామ్యమాంసాతిభక్షణాత్సంధారణాదతిసుహితస్య చాతిప్రగాఢముదకపానాత్సంక్షోభణాద్వా శరీరస్య శ్లేష్మా సహ మారుతేన ప్రకోపమాపద్యతే। తం ప్రకుపితం మారుత ఆమాశయైకదేశే సంమూర్ఛ్య తానేవ గాఢ వేదనాపరికారానుపజనయతి, య ఉక్తావాతగుల్మేః శ్లేష్మా త్వస్య శీతజ్వరారోచకావిపాకాఙ్గమర్దహర్షహృద్రోగ ఛర్ద్ర్యనిద్రాలస్యస్తైమిత్యగౌరవశిరోభితాపానుపజనయతి, అపిచ గుల్మస్య స్థైర్య గౌరవ కాఠిన్యావగాఢసుప్తతాః, తథా కాసశ్వాసప్రతిశ్యాయాన్ రాజయక్ష్మాణం చాతిప్రవృద్ధః, శ్వైత్యం చ త్వఙ్నఖనయనవదనమూత్రపురీషేషూపజనయతి, నిదానోక్తాని చాస్య నోపశేరతే, తద్విపరీతాని చోపశేరత ఇతి శ్లేష్మగుల్మః ॥12॥

అ॥ పూర్వమునందు చెప్పబడిన జ్వరము మొదలగువానిచే కృశించిన మనుజుడు - అధికముగ భుజించినను స్నిగ్ధగుణము గురుగుణము మధురరసము శీతవీర్యము ఇవి అధికముగగల పదార్థములను భుజించినను పిండి చెఱుకు పాలు మినుములు నువ్వులు బెల్లము వీనితోతయారుకాబడిన పదార్థములను భుజించినను చెడినమద్యమును ఆకుకూరలను అనూపదేశము ఉదకము గ్రామము వీనియందు సంచరించు జంతువుల యొక్క మాంసమును అధికముగ భుజించినను మలమూత్రాదివేగముల నడ్డగించినను తృప్తిగభుజించి జలమును అధికముగ త్రాగినను శరీరమును క్షోభింపచేసినను కఫము వాతముతోకూడ ప్రకోపించును. అట్టికఫమును వాతము ఆమాశయమునందొకభాగమున మూర్ఛింపచేసి వాతగుల్మమునందు చెప్పబడిన బాధలను అధికముగ కలిగించును. మరియు కఫము - శీతజ్వరము అరోచకము ఆహారముజీర్ణముకాకపోవుట ఒడలునొప్పులు గగుర్పాటు హృద్రోగము వాంతి అధికమగునిద్ర మాంద్యము మొద్దుబారుట శరీరముబరువుగనుండుట శిరస్సునందుబాధ వీనిని కలిగించును. గుల్మము స్థిరముగను బరువుగను కఠినముగను లోతుగను మొద్దుబారియు నుండును. కఫము మిక్కిలి వృద్ధమై దగ్గు ఆయాసము నంజు రాజయక్ష్మ వీనిని కలిగించును. మరియు చర్మము గోళ్ళు నేత్రములు ముఖము మూత్రము పురీషము ఇవి తెల్లగ నుండును. హేతువులుగ చెప్పబడినవానిచే అభివృద్ధియు వానికి విపరీతములైనవానిచే శాంతియు కలుగును. ఇవి కఫగుల్మలక్షణములుగ నుండును.

## సన్నిపాత గుల్మము.

మూ॥ త్రిదోషహేతులిఙ్గసన్నిపాతాత్తు సాన్నిపాతికం గుల్మ ముపదిశన్తి కుశలాః। సవిప్రతిషిద్ధోపక్రమత్వాదసాధ్యో నిచయ గుల్మః ॥13॥

అ॥ మూడుదోషములయొక్కయు హేతువులును లక్షణములును, కలిసి యున్నచో సాన్నిపాతికగుల్మమునుగ తెలిసికొనవలయును. ఇది పరస్పరవిరుద్ధమైన చికిత్స కలదగుటచే అసాధ్యముగ నుండును.

## రక్త గుల్మము.

మూ॥ శోణితగుల్మస్తుఖలు స్త్రియా భవతి న పురుషస్య, గర్భకోష్ఠార్తవాగమనవైశేష్యాత్। పారతన్త్ర్యాదవైశారద్యాత్సతత ముపచారానురోధాద్వేగానుదీర్ణానుపరున్ధన్త్యా ఆమగర్భేవాఽప్యచి రాత్పతితేఽథవాఽప్యచిరప్రజాతాయా ఋతౌ వా వాతప్రకోపణా న్యాసేవమానాయాః క్షిప్రం వాతః ప్రకోపమాపద్యతే। స ప్రకు పితో యోనిముఖమనుప్రవిశ్యార్తవముపరుణద్ధి మాసి మాసి, తదా ర్తవముపరుధ్యమానం కుక్షిమభివర్ధయతి ॥

అ॥ రక్తగుల్మము గర్భాశయముయొక్కయు ఆర్తవముయొక్కయు సంబంధము వలన జనించును. కావున స్త్రీలకే కలుగును. పురుషులకు కలుగదు. స్వాతంత్ర్యము లేకపోవుట అజ్ఞానము ఎల్లప్పుడును పనులనుచేయుచుండుట వీనిచే మలమూత్రాది వేగములను అడ్డగించుటవలనను గర్భస్రావమైన పిమ్మటగాని ప్రసవించిన వెంటనే గాని ఋతుకాలమునందుగాని వాతవర్ధకపదార్థములను సేవించుటవలనను వాతము వెంటనే ప్రకోపించును. అట్టివాతము గర్భాశయద్వారమును పొంది ప్రతిమాసము నందును వెడలు ఆర్తవమును అడ్డగించును. అట్లడ్డగింపబడిన ఆర్తవము గర్భకోశమును వృద్ధి నొందించును.

## రక్తగుల్మ లక్షణములు.

మూ॥ తస్యాః శూలకాసాతీసారచ్ఛర్ద్యరోచకావిపాకాఙ్గమర్ద నిద్రాలస్యస్తైమిత్యకఫప్రసేకాః సముపజాయన్తే, స్తనయోశ్చ స్త న్యం, ఓష్ఠయోః స్తనమణ్డలయోశ్చ కార్ష్ణ్యం, గ్లానిశ్చక్షుషోః, మూర్ఛా హృల్లాసో దోహదః, శ్వయథుః పాదయోః, ఈషచ్చో ద్గమో రోమరాజ్యాః, యోన్యాశ్చాటాలత్వం, అపిచ యోన్యా

దార్గర్భ్యమాస్రావశ్చోపజాయతే, కేవలశ్చాస్యా గుల్మః పిణ్డిత ఏవ స్పన్దతే, తామగర్భాం గర్భిణీమిత్యాహురూఢాః ॥15॥

అ॥ రక్తగుల్మముకల స్త్రీకి శూల దగ్గు అతిసారము వాంతి అరోచకము జీర్ణము కాకుండుట ఒడలునొప్పులు అధికమగునిద్ర మాంద్యము మొద్దుబారుట కఫము నుమియుట ఇవి కలుగును. స్తనములయందు స్తన్యము జనించును. పెదవులును స్తనమండలములును నల్లగ నగును. నేత్రములు వాడును. మూర్ఛ నోట నీరూరుట కోరికలు పాదములయందు కొద్దివాపు రోమపంక్తిఏర్పడుట యోని విస్తరించుట యోని దుర్గంధము కలదిగను స్రావముకలదిగను నుండుట ఇవి కలుగును. ఈ గుల్మము సంపూర్ణముగను పిండాకారముగను కదలుచుండును. తెలియనివారు దీనిని గర్భము నుగ అనుకొనెదరు.

## గుల్మపూర్వరూపములు

మూ॥ ఏషాంతు ఖలుపఞ్చానాం గుల్మానాం ప్రాగభినిర్వృత్తే రిమాని పూర్వరూపాణిభవన్తి;తద్యథా-అనన్నాభిలషణం. అరోచకావిపాకౌ, అగ్నివైషమ్యం, విదాహో భుక్తస్య పాకకాలే.చాయుక్త్యాఛర్ద్యుద్గారౌ, వాతమూత్రపురీషవేగాణామప్రాదుర్భావః ప్రాదుర్భూతానాం చాపవృత్తిః ఈషదాగమనం వా, వాతశూలాటోపాన్త్రకూజనపరిహర్షణాతివృత్తపురీషతాఽబుభుక్షా, దౌర్బల్యం. సౌహిత్యస్య చాసహత్వమితి గుల్మపూర్వరూపాణి భవన్తి॥16॥

అ॥ ఆహారమునందిచ్ఛలేకపోవుట, అరోచకము, జీర్ణముకాకుండుట, జాఠరాగ్ని విషమముగనుండుట, ఆహారము జీర్ణమగునప్పుడు విదాహమునొందుట, కారణములేకుండగనే వాంతియు త్రేణుపులును కలుగుట, అపానవాతము మూత్రము పురీషము వీనియొక్క వేగము కలుగకుండుటగాని వేగము కలిగినను బయలువెడలకుండుటగాని కొద్దిగ వెడలుటగాని కలుగుట, వాతశూల, అటోపము. ప్రేగులరచుట, గగుర్పాటు, మలము ఉదావర్తమునొందుట, ఆకలిలేకుండుట, దౌర్బల్యము, తృప్తిగ భుజింపలేకుండుట ఇవి అయిదువిధములగు గుల్మములకును పూర్వరూపములుగ నుండును.

## గుల్మసామాన్యచికిత్స

మూ॥ సర్వేష్వపిచ ఖల్వేతేషు గుల్మేషున కశ్చిద్వాతాదృతే సమ్భవతి గుల్మః । తేషాం సన్నిపాతజమసాధ్యం జ్ఞాత్వా నోపక్రమేత, ఏకదోషజేతు యథాస్వమారమ్భం ప్రణయేత, సంసృష్టాంస్తుసాధారణేన కర్మణోపచరేత్ ; యచ్చాన్యదప్యవిరుద్ధంమన్యేత తదవచారయేద్విభజ్య గురులాఘవముపద్రవాణాం సమీక్ష్య, గురూ

నుపద్రవాం స్త్వరమాణశ్చికిత్సేజ్జఘన్యమితరాన్, త్వరమాణ స్తు విశేషమనుపలభ్య గుల్మేష్వాత్యయికే కర్మణి వాతచికిత్సితం ప్రణయేత్, స్నేహస్వేదౌ వాతహరౌ, స్నేహోపసంహితం చమృదువిరేచనం, వస్తీంశ్చ, అమ్లలవణమధురాంశ్చ రసాన్ యుక్తితోఽవచారయేత్, మారుతే హ్యుపశాన్తే స్వల్పేనాపి ప్రయత్నేన శక్యోఽన్యోఽపి దోషో నియన్తుం గుల్మేష్వితి॥ శ్లో॥ గుల్మినామనిలశాన్తిరుపాయైః సర్వశో విధివదాచరితవ్యా।మారుతే హ్యవజితేఽన్యముదీర్ణం దోషమల్పమపి కర్మ నిహన్యాత్ ॥19॥

అ॥ ఏగుల్మముకూడ వాతసంబంధము లేనిదే జనింపదు. వానిలో సన్నిపాత గుల్మమును అసాధ్యమైనదానినిగ తెలిసికొని విడిచిపెట్టవలయును. ఏకదోషజగుల్మము నందు ఆదోషమూ ననుసరించియు ద్వంద్వజగుల్మమునందు రెండుదోషముల ననుసరించియు చికిత్స చేయవలయును. ద్వంద్వజగుల్మమునందు విరుద్ధముకాని ఏకదోషచికిత్సనుకూడ చేయవచ్చును. ఉపద్రవములయొక్క గురులాఘవములను తెలిసికొని గొప్పవియగు ఉపద్రవములను తొలుతను, స్వల్పములగు ఉపద్రవములను పిమ్మటను చికిత్సింపవలయును. గుల్మమునందు విశేషవిభాగమును చేయక త్వరగ చికిత్సచేయునపుడు వాతచికిత్సను చేయవలయును. వాతహరములగు స్నేహస్వేదములను స్నేహముతో కూడిన మృదువిరేచనములను వస్తులను అమ్లలవణమధురరసములను తగువిధమున ప్రయోగింపవలయును. వాతము శాంతించినపిదప ఇతరదోషమును స్వల్పప్రయత్నముచేతనే శాంతింపచేయవచ్చును. గుల్మమునం దెల్లప్పుడును వాతశాంతికరములగు ఉపాయములనే తగువిధమున చేయవలయును. వాతము శాంతినొందినపిదప ఇతరదోషము స్వల్పచికిత్సచేతనే శాంతించును.

## అధ్యాయసంగ్రహము

మూ॥ సంఖ్యా నిమిత్తంరూపాణి పూర్వరూపమథాపి చ।
దృష్టం నిదానే గుల్మానామేకదేశశ్చ కర్మణామ్ ॥20॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే నిదానస్థానే గుల్మనిదానం నామ తృతీయోఽధ్యాయః సమాప్తః॥

అ॥ ఈ అధ్యాయమునందు గుల్మములయొక్క సంఖ్యాసంప్రాప్తి హేతువులు లక్షణములు పూర్వరూపములు చికిత్సఇవి చెప్పబడినవి.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామకకృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితావ్యాఖ్యానమునందు గుల్మనిదానమనెడు తృతీయాధ్యాయము సమాప్తము.

---

# చతుర్థాధ్యాయము.

**మూ॥ అథాతః ప్రమేహనిదానం వ్యాఖ్యాస్యామః ॥1॥**

అ॥ పిమ్మట ప్రమేహనిదానమును చెప్పబోవుచున్నాము.

**మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥**

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

**మూ॥ త్రిదోషకోపనిమిత్తా వింశతిః ప్రమేహాభవన్తి, వికారాశ్చాపరేఽపరిసంఖ్యేయాః । తత్రియథా త్రిదోషప్రకోపః ప్రమేహానభినిర్వర్తయతి తథాఽనువ్యాఖ్యాస్యామః॥ ఇహ ఖలు నిదానదోషదూష్యవిశేషేభ్యో వికారవిఘాతభావాభావప్రతివిశేషా భవన్తి॥ యదా హ్యేతే త్రయో నిదానాదివిశేషాః పరస్పరం నానుబధ్నన్తి, అథవా కాలప్రకర్షాత్, అబలీయాంసో వాఽనుబధ్నన్తి, న తదా వికారాభినిర్వృత్తిః, చిరాద్వాఽప్యభినిర్వర్తన్తే, తనవో వా భవన్త్యథవాఽప్యయథోక్తసర్వలిఙ్గాః; విపర్యయే విపరీతాః; ఇతి సర్వవికారవిఘాతభావాభావప్రతివిశేషాభినిర్వృత్తిహేతుర్భవత్యుక్తః ॥5॥**

అ॥ మూడుదోషములును ప్రకోపించి ఇరువదిప్రమేహములను కలిగించును. పరికల్పనావిశేషముచే ఇంకను అనేకవిధములుగ నుండును. మూడుదోషములును ప్రకోపించి ఇరువదిప్రమేహములను కలిగించు విధమును చెప్పెదము. నిదానము దోషము దూష్యములు వీనియొక్క విశేషముల ననుసరించి వ్యాధులయొక్క లక్షణములు కనబడుటయు కనబడకపోవుటయు కలుగును. వ్యాధిలక్షణములు — హేతువులును దోషములును దూష్యములును పరస్పరము కలియకున్నచో కనబడకపోవుటయు, కాలసంబంధముచే చిరకాలమునకు కనబడుటయు, నిదానాదులు స్వల్పబలముకలవై పరస్పరము కలిసినచో సూక్ష్మముగ లేక అసంపూర్ణముగ కనబడుటయు జరుగును. నిదానాదు లన్నియు అనుకూలముగ నున్నచో వ్యాధిలక్షణములు సంపూర్ణముగ నుండును. ఈవిధమున సర్వవికారములయొక్క విఘాతభావమునకును (కనబడకపోవుటకును) విఘాతాభావమునకును (కనబడుటకును) కారణము చెప్పబడినది.

## కఫప్రమేహముయొక్క నిదానాదివివరణము.

**మూ॥ తత్రేమే త్రయో నిదానాదివిశేషాః శ్లేష్మనిమిత్తానాం ప్రమేహాణామాశ్వభినిర్వృత్తికరాభవన్తి; తద్యథా - హాయనకయవకచీనకోద్దాలకనైషధేత్కటముకున్దకమహావ్రీహిప్రమోదకసు**

గన్ధకానాం నవానామతివేలమతిప్రమాణేనోపయోగః, తథా సర్పిష్మతాం నవహరేణుమాషసూప్యానాం గ్రామ్యానూపౌదకానాం చ మాంసానాం శాకతిలపలలపిష్టాన్నపాయసకృశరవిలేపీక్షువికారాణాం క్షీరమన్దకదధిద్రవమధురతరుణప్రాయాణాముపయోగో, మృజావ్యాయామవర్జనం, స్వప్నశయనాసనప్రసఙ్గో యశ్చ కశ్చిద్విధిరన్యోఽపి శ్లేష్మమేదోమూత్రసంజననః స సర్వో నిదానవిశేషః॥ బహుద్రవః శ్లేష్మా దోషవిశేషః॥ బహ్వబద్ధం మేదో మాంసం శరీరక్లేదః శుక్రం శోణితం వసా మజ్జా లసీకా రసశ్చౌజః సంఖ్యాత ఇతి దూష్యవిశేషాః ॥8॥

అ॥ శ్లేష్మప్రమేహములను కలిగించు నిదానాదివిశేషములను మూడింటిని చెప్పుచున్నాము. చిన్నసంబా ధాన్యము యవధాన్యము నల్లకొఱ్ఱలు ఉద్దాలకమనెడిధాన్యము నిషధదేశమునందలిధాన్యము ఇత్కటధాన్యము ముకుందమనెడిత్రుణధాన్యము మహావ్రీహిధాన్యము షష్టికధాన్యము సుగంధకమనెడిశాలిధాన్యము క్రొత్తవియగు వీనిని కాలమునతిక్రమించి అధికముగ సేవించుట, సెనగలు మినుములు కందులు క్రొత్తవియగు వీనిని అధికమగు నేతితో ఉపయోగించుట, గ్రామమునందును అనూపదేశమునందును ఉదకమునందును సంచరించు జంతువులయొక్క మాంసములను అధికమగు నేతితో ఉపయోగించుట, ఆకుకూరలు నువ్వులు మాంసము పిండివంటలు పాయసము పులగము జావలు బెల్లము పాలు బాగుగతయారుకాని పెరుగు ద్రవపదార్థములు తియ్యనిపదార్థములు క్రొత్తవస్తువులు వీనిని ఉపయోగించుట, ఉద్వర్తనమును వ్యాయామమును విడిచిపెట్టుట, నిద్ర శయనము ఆసనము వీనిని ఎల్లప్పుడు సేవించుట, కఫము మేదస్సు మూత్రము వీనిని వృద్ధినొందించు ఇతరవిధుల నాచరించుట ఇవి కఫప్రమేహములయందు హేతువులుగ నుండును. మరియు మిక్కిలి ద్రవరూపముగనుండు కఫము దోషముగ నుండును. మేదస్సు మాంసము, శరీరక్లేదము, శుక్రము, రక్తము; వస; మజ్జ; లసీక; రసము; ఓజస్సు అధికముగను పలుచగను నున్న ఇవి దూష్యములుగ నుండును.

## శ్లేష్మప్రమేహసంప్రాప్తి.

మూ॥ త్రయాణామేషాం నిదానాదివిశేషాణాం సన్నిపాతే క్షిప్రం శ్లేష్మా ప్రకోపమాపద్యతే ప్రాగతిభూయస్త్వాత్, స ప్రకుపితః క్షిప్రమేవ శరీరే విసృప్తిం లభతే, శరీరశైథిల్యాత్స విసర్పఞ్ఛరీరే మేదసైవాదితో మిశ్రీభావం గచ్ఛతి, మేదసశ్చైవ బహ్వబద్ధత్వాన్మేదసశ్చ గుణైః సమానగుణభూయిష్ఠత్వాత్స మేదసా మిశ్రీ

భావం గచ్ఛన్ దూషయత్యనధికృతత్వాత్, స వికృతో దుష్టేన మేదసోపహితః శరీరక్లేదమాంసాభ్యాం సంసర్గం గచ్ఛతి, క్లేదమాంసయోరతిప్రమాణాభివృద్ధత్వాత్; మాంసే మాంసప్రదోషాత్పూతిమాంసపిడకాః శరావికాకచ్ఛపికాద్యాః సంజనయతి, అప్రకృతిభూతత్వాత్; శరీరక్లేదం పునర్దూషయన్మూత్రత్వేన పరిణమయతి; మూత్రవహానాం చ స్రోతసాం వఙ్క్షణవస్తిప్రభవాణాం మేదఃక్లేదోపహితాని గురూణి ముఖాన్యాసాద్య ప్రతిరుధ్యతే; తతస్తేషాం స్థైర్యమసాధ్యతాం వా జనయతి, ప్రకృతివికృతిభూతత్వాత్॥ శరీరక్లేదస్తు శ్లేష్మమేదోమిశ్రః ప్రవిశన్మూత్రాశయం మూత్రత్వమాపద్యమానః శ్లైష్మికైరేభిర్దశభిర్గుణైరుపసృజ్యతే వైషమ్యయుక్తైః; తద్యథా- శ్వేతశీతమూర్తపిచ్ఛిలాచ్ఛస్నిగ్ధగురుమధురసాన్ద్రప్రసాదమన్దైః; తత్ర యేన గుణేనైకేనానేకేన వా భూయస్తరముపసృజ్యతే, తత్సమాఖ్యం గౌణం నామవిశేషం ప్రాప్నోతి॥ తే తు ఖల్విమే దశ ప్రమేహా నామవిశేషేణ భవన్తి। తద్యథా- ఉదకమేహశ్చ, ఇక్షువాలికారసమేహశ్చ, సాన్ద్రమేహశ్చ, సాన్ద్రప్రసాదమేహశ్చ, శుక్లమేహశ్చ, శుక్రమేహశ్చ, శీతమేహశ్చ, సికతామేహశ్చ, శనైర్మేహశ్చ, ఆలాలమేహశ్చేతి॥11॥

అ॥ హేతువులును దోషములును దూష్యములును కలిసినప్పుడు కఫము అధికముగ నుండుటవలన ముందుగ ప్రకోపించును. అట్లు ప్రకోపించిన కఫము-శరీరము శైథిల్యమునొందుటవలన వెంటనే శరీరమునందు వ్యాపించి మేదస్సు అధికముగను పలుచగను నుండుటవలనను, మేదస్సుతో సమానమైన గుణములు కలదగుటవలనను ముందుగ మేదస్సుతోకలిసి ఆమేదస్సును చెరచి అట్టిమేదస్సుతో కూడినదై శరీర క్లేదమును మాంసమును అధికముగ వృద్ధినొందియుండుటవలన వానితోకూడ కలియును. అట్టికఫము - మాంసము చెడియుండుటవలన మాంసమునందు శరావిక కచ్ఛపిక మొదలగు మాంసపిటికలను కలిగించును. శరీరక్లేదమును దూషింపచేసి మూత్రమునుగ పరిణమింపచేయును. మేదస్సుతోడను క్లేదముతోడను కూడినట్టియు గురువులైనట్టియు గజ్జలయందును వస్తియందును పుట్టిన మూత్రవహస్రోతస్సులయొక్క ముఖములను పొంది అరికట్టును. వికృతినొందియుండుటవలన స్థిరత్వమును, అసాధ్యత్వమును కలికలిగించును. శరీరక్లేదము శ్లేష్మముతోడను మేదస్సుతోడను కలిసి మూత్రాశయమునందు ప్రవేశించి మూత్రస్వరూపము నొందును. అప్పుడు శ్లేష్మసంబంధమైనట్టియు వృద్ధములైనట్టియు శ్వేత శీత మూర్త పిచ్ఛిల అచ్ఛ స్నిగ్ధ గురు మధుర సాంద్రప్రసాద మంద అనెడి పదిగుణములలోను ఒకగుణముతోగాని అనేకగుణములతోగాని కలిసి

ఆ గుణములకు తగు పేరుగల ఉదకమేహము, ఇక్షువాలికారసమేహము, సాంద్రమేహము, సాంద్రప్రసాదమేహము, శుక్లమేహము, శుక్రమేయము, శీతమేహము, సికతామేహము; శనైర్మేహము; ఆలాలమేహము అను పదిప్రమేహములను కలిగించును.

మూ॥ తే దశ ప్రమేహాః సాధ్యాః, సమానగుణమేదఃస్థానత్వాత్కఫస్య ప్రాధాన్యాత్సమక్రియత్వాచ్చ ॥12॥

అ॥ సమానగుణముకల మేదస్సుకలవగుటవలనను; కఫప్రధానములగుటవలనను; దోషదూష్యములకు సమానమగు చికిత్సకలవగుటవలనను ఈ పది ప్రమేహములును సాధ్యములుగ నుండును.

శ్లేష్మప్రమేహవివరణము.

మూ॥ అచ్ఛం బహు సితం శీతం నిర్గన్ధముదకోపమమ్। శ్లేష్మకోపాన్నరో మూత్రముదమేహీ ప్రమేహతి॥ అత్యర్థమధురం శీతమీషత్పిచ్ఛిలమావిలమ్। కాణ్డేక్షురససంకాశం శ్లేష్మకోపాత్ప్రమేహతి॥ యస్య పర్యుషితం మూత్రం సాన్ద్రీభవతి భాజనే। పురుషంకఫకోపేన తమాహుస్సాన్ద్రమేహినమ్। యస్య సంహన్యతే మూత్రం కించిత్,కించిత్ప్రసీదతి।సాన్ద్రప్రసాదమేహీతితమాహు శ్లేష్మకోపతః॥ శుక్లం పిష్టనిభం మూత్రమభీక్ష్ణం యః ప్రమేహతి। పురుషం కఫకోపేన తమాహుశ్శుక్లమేహినమ్॥ శుక్రాభం శుక్రమిశ్రం వాముహుర్మేహతి యో నరః। శుక్రమేహినమాహుస్తం పురుషం శ్లేష్మకోపతః॥ అత్యర్థశీతమధురం మూత్రం మేహతి యో భృశమ్। శీతమేహినమాహుస్తం పురుషం శ్లేష్మకోపతః॥ మూర్తాన్మూత్రగతన్దోషానణూన్మేహతి యో నరః। సికతామేహినం విద్యాన్నరం తం శ్లేష్మకోపతః। మన్దం మన్దమవేగం తుకృచ్ఛ్రం యో మూత్రయేచ్ఛనైః। శనైర్మేహినమాహుస్తం పురుషం శ్లేష్మకోపతః॥ తన్తుబద్ధమివాలాలం పిచ్ఛిలం యః ప్రమేహతి। ఆలాలమేహినం విద్యాత్తం నరం శ్లేష్మకోపతః॥ 22॥ఇత్యేతే దశ ప్రమేహాః శ్లేష్మప్రకోపనిమిత్తా వ్యాఖ్యాతా భవన్తి॥

అ॥ ఉదకప్రమేహమునందు స్వచ్ఛముగను అధికముగను తెల్లగను వాసనలేనిదిగను ఉదకముతోసమానముగను నుండు మూత్రమును వెడలించును, ఇక్షుప్రమేహమునందు మిక్కిలి తియ్యగను చల్లగను కొద్దిజిగురుగలదిగను కలుషముగను తెల్లచెరుకురసముతోసమానముగను నుండు మూత్రమును వెడలించును. మూత్రమును పాత్ర

యందు నిలవయుంచినచో చిక్కబడినయెడల నయ్యది సాంద్రప్రమేహ మనబడును. మూత్రము నిలవయుంచినచో కొంతచిక్కగను కొంత తేటగను నున్నయెడల నయ్యది సాంద్రప్రసాదప్రమేహ మనబడును. తెల్లగను పిండితో సమానముగను నున్న మూత్రము తరుచు వెడలినచో నయ్యది శుక్లప్రమేహ మనబడును. శుక్రమువలె నున్నట్టికాని శుక్రముతో కూడినట్టికాని మూత్రము తరుచువెడలినచో నయ్యది శుక్రప్రమేహ మనబడును. మిక్కిలి చల్లగను తియ్యగను నున్న మూత్రము వెడలినచో నయ్యది శీతప్రమేహ మనబడును, కఠినమైనట్టియు మూత్రగతమైనట్టియు దోషము ఇసుకకణములవలె బయలువెడలినచో నయ్యది సికతామేహమని చెప్పబడును. మూత్రము కొద్దికొద్దిగను వేగములేనిదిగను కష్టముగను మెల్లగను వెడలినచో నయ్యది శనైర్మేహ మనబడును. తీగెలుకలదిగను జొల్లుకలదిగను జిగురునుగను నున్న మూత్రము వెడలినచో నయ్యది ఆలాలప్రమేహ మనబడును. శ్లేష్మప్రకోపమువలన జనించు పది ప్రమేహములును ఈవిధముగ చెప్పబడినవి.

## పిత్తప్రమేహముయొక్క నిదానము — సంప్రాప్తి

**మూ॥ ఉష్ణామ్లలవణక్షారకటుకాజీర్ణభోజనోపసేవినస్తథాఽతితీక్ష్ణాతపాగ్నిసంతాపశ్రమక్రోధవిషమాహారోపసేవినశ్చ తథాత్మకశరీరస్యైవ క్షిప్రం పిత్తం ప్రకోపమాపద్యతే ॥ తత్ప్రకుపితం తయైవానుపూర్వ్యా ప్రమేహానిమాన్ షట్ క్షిప్రమభినిర్వర్తయతి ॥ తేషామపిచపిత్తగుణవిశేషేణ నామవిశేషా భవన్తి; తద్యథా - క్షారమేహశ్చ, కాలమేహశ్చ, నీలమేహశ్చ, లోహితమేహశ్చ, మఞ్జిష్ఠామేహశ్చ, హారిద్రామేహశ్చేతి । తేషడ్భిరేతైః క్షారామ్లలవణకటుకవిస్రోష్ణైః పిత్తగుణైః పూర్వవత్సమన్వితా భవన్తి ॥**

అ॥ పిత్తప్రకృతికలమనుజుడు - ఉష్ణవీర్యము అమ్లరసము లవణరసము క్షారము కటురసము ఇవికల పదార్థములను, అజీర్ణపదార్థములను, ఎండ అగ్నివేడిమి శ్రమ కోపము తీవ్రములగు వీనిని, విషమాహారమును సేవించినచో పిత్తము వెంటనే ప్రకోపించును. అట్టిపిత్తము కఫప్రమేహములయందు చెప్పబడినవిధముననే క్షార అమ్ల లవణ కటుక విస్ర ఉష్ణ అనెడి ఆరువిధములగు పిత్తగుణములతో కలిసి ఆ గుణములను తగు రకల క్షారమేహము, కాలమేహము. నీలమేహము, లోహితమేహము, మంజిష్ఠామేహము, హారిద్రామేహము అనెడి ఆరుమేహములను వెంటనే కలిగించును.

**మూ॥ సర్వ ఏవ చ తే యాప్యాః, సంసృష్టదోషమేదఃస్థానత్వాద్విరుద్ధోపక్రమత్వాచ్చేతి ॥25॥**

అ॥ దోషస్థానమును మేదఃస్థానమును సమీపమునం దుండుటవలనను, దోష దూష్యములు పరస్పరవిరుద్ధమగు చికిత్సకలవగుటవలనను ఈ పిత్తప్రమేహములు యాప్యములుగ నుండును.

## పిత్తప్రమేహవివరణము

మూ॥ గన్ధవర్ణరసస్పర్శైర్యథా క్షారస్తథాత్మకమ్ । పిత్తకోపాన్నరో మూత్రం క్షారమేహీ ప్రమేహతి॥ మషీవర్ణమజస్రం యో మూత్రముష్ణం ప్రమేహతి । పిత్తస్య పరికోపేణ తం విద్యాత్కాలమేహినమ్ ॥ చాషపక్షినిభం మూత్రమమ్లం మేహతి యో నరః । పిత్తస్య పరికోపేణ తం విద్యాన్నీలమేహినమ్ ॥ విస్రం లవణముష్ణంచ రక్తం మేహతి యో నరః । పిత్తస్య పరికోపేణ తం విద్యాద్రక్తమేహినమ్ ॥ మఞ్జిష్ఠారూపియోఽజస్రం భృశం విస్రం ప్రమేహతి ! పిత్తస్య పరికోపాత్తం విద్యాన్మాఞ్జిష్ఠమేహినమ్॥హారిద్రోదకసంకాశం కటుకం యః ప్రమేహతి । పిత్తస్య పరికోపాత్తువిద్యాద్ధారిద్రమేహినమ్ ॥31॥ ఇత్యేతే షట్ ప్రమేహాః పిత్తప్రకోపనిమిత్తా వ్యాఖ్యాతా భవన్తి॥

అ॥ క్షారముయొక్క గంధమును రంగును రుచియు స్పర్శయు కల మూత్రము వెడలుచున్నచో నయ్యది క్షారప్రమేహ మనబడును. మసియొక్క రంగుకలదిగను వెచ్చగను నున్న మూత్రము తరుచు వెడలుచున్నచో నయ్యది కాలప్రమేహ మనబడును. చాషపక్షియొక్క రెక్కలయొక్క రంగుకలదిగను పుల్లగను నున్నమూత్రము వెడలుచున్నచో నయ్యది నీలప్రమేహ మనబడును. దుర్గంధముగను ఉప్పగను వెచ్చగను ఎర్రగను నున్న మూత్రము వెడలుచున్నచో నయ్యది రక్తప్రమేహ మనబడును. మంజిష్ఠితోసమానమైన రంగుకలదిగను మిక్కిలి దుర్గంధముగలదిగను నున్న మూత్రము తరుచు వెడలుచున్నచో నయ్యది మంజిష్టప్రమేహ మనబడును. పసుపునీటితో సమానముగను కారముగను నున్న మూత్రము వెడలుచున్నచో నయ్యది హారిద్ర ప్రమేహ మనబడును. పిత్తప్రకోపమువలన జనించు ఆరుప్రమేహములును ఈవిధముగ చెప్పబడినవి.

## వాతప్రమేహముయొక్క నిదానము - సంప్రాప్తి

మూ॥ రూక్షకటుకకషాయతిక్తలఘుశీతవ్యవాయవ్యాయామవమనవిరేచనాతిస్థాపనశిరోవిరేచనాతియోగసంధారణానశనాభిఘాతాతపోద్వేగశోకశోణితాతిసేకజాగరణవిషమశరీరన్యాసానుపసేవమానస్య తథాత్మకశరీరస్యైవ క్షిప్రం వాయుః ప్రకోపమాద్యతే ।

సప్రకుపితస్తథావిధే శరీరే విసర్పన్ యదా వసామాదాయ మూత్రవహాని స్రోతాంసి ప్రతిపద్యతే, యదా వసామేహమభినిర్వర్తయతి; యదా పునర్మజ్జానం మూత్రవస్తావాకర్షతి, తదా మజ్జమేహమభినిర్వర్తయతి, యదా లసీకాం మూత్రాశయేఽభివహన్మూత్రమనుబద్ధం చ్యోతయతి లసీకాతిబహుత్వాద్విక్షేపణాచ్చ వాయోః ఖల్వస్యాతిమూత్రప్రవృత్తిసఙ్గం కరోతి, తదా సమత్త ఇవగజః క్షరత్యజస్రం మూత్రమవేగం, తం హస్తిమేహినమాచక్షతే; ఓజః పునర్మధురస్వభావం, తద్యదా రౌక్ష్యాద్వాయుః కషాయత్వేనాభిసంసృజ్య మూత్రాశయేఽభివహతి, తదా మధుమేహినం కరోతి॥ తానిమాంశ్చతురః ప్రమేహాన్ వాతజానసాధ్యానాచక్షతే భిషజః; మహాత్యయికత్వాద్విరుద్ధోపక్రమత్వాచ్చ। తేషామపిన పూర్వవద్గుణవిశేషణ నామవిశేషా భవన్తి; తద్యథా - వసామేహశ్చ, మజ్జమేహశ్చ, హస్తిమేహశ్చ, మధుమేహశ్చేతి ॥34॥

అ॥ వాతప్రకృతికలమనుజుడు - రూక్షగుణము కటురసము కషాయరసము తిక్తరసము లఘుగుణము శీతవీర్యము ఇవికల పదార్థములను సేవించినను, మైథునము వ్యాయామము వమనములు విరేచనములు ఆస్థాపనవస్తి నస్యము వీనిని అధికముగ సేవించినను, వేగసంధారణము భుజింపకుండుట అభిఘాతము ఎండ ఉద్వేగము దుఃఖము రక్తమోక్షము రాత్రిమేలుకొనుట శరీరమును హెచ్చుతగ్గులుగనుంచుట వీని నాచరించినను వాతము వెంటనే ప్రకోపించును. అట్టివాతము శరీరమునందువ్యాపించినదై వసతోకలిసి మూత్రవహస్రోతసులను పొంది వసామేహమును కలిగించును. మజ్జను మూత్రవస్తిలోనికి తీసికొనివెళ్ళి మజ్జమేహమును కలిగించును. లసీకను మూత్రాశయములోనికి తీసికొనివెళ్ళి, లసీక అధికముగ నుండుట వలనను వాతముయొక్క పక్షేపణస్వభావమువలనను మూత్రప్రవృత్తికి అడ్డమును కలిగించి మదించినఏనుగువలె ఎల్లప్పుడును కొద్దికొద్దిమూత్రమును మెల్లగ వెడలించినట్లు చేయును. ఇది హస్తిమేహమని చెప్పబడును. మధురస్వభావముకలఓజస్సును వాతము రౌక్ష్యమువలన కషాయత్వమును పొందించి మూత్రాశయములోనికి తీసికొనివెళ్ళి మధుమేహమును కలిగించును. గంభీరములగుమజ్జాదిధాతువులను చెరుచుటవలనను, దోషదూష్యములు పరస్పరవిరుద్ధమగు చికిత్సకలవగుటవలనను ఈ వాతప్రమేహములు నాలుగును అసాధ్యములుగ నుండును. ఈనాలుగుప్రమేహములకును కఫప్రమేహమునందువలెనే గుణవిశేషముల ననుసరించి వసామేహము, మజ్జమేహము, హస్తిమేహము, మధుమేహము అనెడి పేరులు కలుగును.

## వాతప్రమేహ నివారణము.

మూ॥ వసామిశ్రం వసాభం చ ముహుర్మేహతి యో నరః। వసామేహినమాహుస్తమసాధ్యం వాతకోపతః॥ మజ్జానం సహ మూత్రేణ ముహుర్మేహతి యో నరః । మజ్జామేహినమాహుస్తమసాధ్యం వాతకోపతః॥ హస్తీమత్తఇవాజస్రంమూత్రంక్షరతి యో భృశమ్ ॥ హస్తిమేహినమాహుస్తమసాధ్యం వాతకోపతః॥ కషాయమధురం పాణ్డుం రూక్షం మేహతి యో నరః । వాతకోపాదసాధ్యం తం ప్రతీయాన్మధుమేహినమ్ ॥38॥ ఇత్యేతే చత్వారః ప్రమేహా వాతప్రకోపనిమిత్తాః ॥39॥

అ॥ వసతోకూడినట్టిగాని వసవలెనున్నట్టిగాని మూత్రను తరుచు వెడలుచున్నతో నయ్యది వసామేహ మనబడును. మజ్జతోకూడిన మూత్రము తరుచు వెడలుచున్నచో నయ్యది మజ్జమేహ మనబడును. మదించినఏనుగువలె మూత్రమును ఎల్లప్పుడు వెడలించినచో నయ్యది హస్తిమేహ మనబడును. ఒగరుగను తియ్యగను తెల్లగను రూక్షముగను నుండు మూత్రము వెడలుచున్నచో నయ్యది మధుమేహ మనబడును. ఈవాతప్రమేహములు అసాధ్యములుగ నుండును. వాతప్రకోపమువలనజనించు నాలుగుప్రమేహములును ఈవిధముగ చెప్పబడినవి.

మూ॥ త ఏవం త్రిదోషప్రకోపనిమిత్తా వింశతిః ప్రమేహా వ్యాఖ్యాతా భవన్తి ॥40॥

అ॥ ఈ విధముగ, మూడుదోషములవలనను జనించు ఇరువదిప్రమేహములును చెప్పబడినవి.

## ప్రమేహపూర్వరూపములు

మూ॥ తత్రియాస్తు దోషా ప్రకుపితాః ప్రమేహానభినిర్వర్తయిష్యన్తఇమాని పూర్వరూపాణి దర్శయన్తి; తద్యథా - జటిలీభావం కేశేషు, మాధుర్యమాస్యే, కరపాదయోస్సుప్తత్వాం దాహం ముఖతాలుకణ్ఠశోషం, పిపాసాం, ఆలస్యం, మలం చ కాయే, కాయచ్ఛిద్రేషూపదేహం, పరిదాహంసుప్తతాం చాఙ్గేషు, షట్పదపిపీలికాభిశ్చ శరీరమూత్రాభిసరణం, మూత్రే చ మూత్రదోషాన్, విస్రం శరీరగన్ధం, నిద్రాం తన్ద్రాం చ సర్వకాలమితి ॥41॥

అ॥ వెంట్రుకలు జటలల్లుకొనియుండుట, నోరు తియ్యగనుండుట, చేతులును కాళ్ళును మొద్దుబారియు తాపయుక్తముగను నుండుట, నోరును తాలుప్రదేశములును కంఠమును ఎండుచున్నట్లుండుట, దప్పిక, మాంద్యము, శరీరము మలయుక్తముగ (మురికిగ) నుండుట, శరీరమునందలి రంధ్రములు ఆయామలములతో కూడికొనియుండుట, శరీరము తాపయుక్తముగను మొద్దుబారియు నుండుట, తుమ్మెదలు చీమలు ఇవి శరీరమునందును మూత్రమునందును వాలుట, మూత్రదోషము లేర్పడుట ఎల్లప్పుడును నిద్రయు జోగును కలుగుట ఇవి మూడుదోషములవలనను కలుగు ఇరువది ప్రమేహములయందును పూర్వరూపములుగ నుండును.

## ప్రమేహముయొక్క యుపద్రవములు

మూ॥ ఉపద్రవాస్తు ఖలు ప్రమేహిణాం - తృష్ణాతీసారజ్వర దాహదౌర్బల్యారోచకావియకాః వూతిమాంసపిడకాలజీవిద్రధ్యాద సాశ్చ తత్ప్రసంగాద్భవన్తి ॥42॥

అ॥ దప్పిక, అతిసారము, జ్వరము, తాపము, దౌర్బల్యము, జీర్ణముకాకుండుట, మాంసము దుర్గంధముగ నుండుట, పిటికలు అలజి విద్రధి మొదలగునవి జనించుట ఇవి ప్రమేహములయందు ఉపద్రవములుగ కలుగును.

## ప్రమేహచికిత్సాసంగ్రహము

మూ॥ తత్ర సాధ్యాన్ ప్రమేహాన్ సంశోధనోపశమనైర్యథార్హముపపాదయంశ్చికిత్సేదితి ॥43॥

అ॥ సాధ్యములగు ప్రమేహములను శోధనశమనచికిత్సలచేతగువిధమున చికిత్సంపవలయును.

**మూ॥ గృధ్నుమభ్యవహారేషు స్నానచఙ్క్రమణద్విషమ్ । ప్రమేహః క్షిప్రమభ్యేతి నీడద్రుమమివాణ్డజః॥ మన్దోత్సాహమతిస్థూలమతిస్నిగ్ధం మహాశనమ్ । మృత్యుః ప్రమేహరూపేణ క్షిప్రమాదాయ గచ్ఛతి॥ యస్త్వాహారాం శరీరస్య ధాతుసామ్యకరం నరః। సేవతే వివిధాశ్చాన్యాశ్చేష్టాస్స సుఖమశ్నుతే ॥46॥**

అ॥ ఆహారపదార్థములయందు అధికమగు వాంఛ, స్నానముచేయకుండట, ఇటునటు తిరుగకుండుట వీనివలన ప్రమేహము మనుజుని "నివాసవృక్షమును పక్షివలె" పొందును. ఉత్సాహములేక మందుడుగనుండుట, మిక్కిలి లావుగనుండుట, శరీరము అతిస్నిగ్ధముగ నుండుట, అధికముగ భుజించుట వీనివలన మృత్యురూపమగు ప్రమేహము వెంటనే కలుగును. ఎవడు శరీరమునకును, ధాతువులకును అనుకూలమగు ఆహారవిహారములను సేవించునో వాడు ప్రమేహముకలుగనివాడై సుఖముగ జీవించును.

అధ్యాయసంగ్రహము

మూ॥ హేతుర్వ్యాధివిశేషాణాం ప్రమేహాణాం చ కారణమ్। దోషధాతుసమాయోగో రూపం వివిధమేవ చ॥ దశ శ్లేష్మకృతా యస్మాత్ప్రమేహాః షట్ చ పిత్తజాః। యథా కరోతి వాయుశ్చ ప్రమేహాంశ్చతురో బలీ॥ సాధ్యాసాధ్యవిశేషాశ్చ పూర్వరూపాణ్యుపద్రవాః। ప్రమేహాణాం నిదానేఽస్మిన్ క్రియాసూత్రం చ భాషితమ్ ॥49॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే నిదానస్థానే ప్రమేహనిదానం నామ చతుర్థోఽధ్యాయః॥

అ॥ వ్యాధిలక్షణములయందు మార్పుకలుగుటకు కారణము, ప్రమేహహేతువులు, దోషములయొక్కయు ధాతువులయొక్కయు సంబంధము, లక్షణములు, శ్లేష్మప్రమేహములు పదిగను పిత్తప్రమేహములు ఆరుగను వాతప్రమేహములు నాలుగుగను కలుగుటకు కారణములు, సాధ్యాసాధ్యవిశేషములు, పూర్వరూపములు, ఉపద్రవములు, చికిత్సాసంగ్రహము ఇవి ఈ ప్రమేహనిదానమునందు చెప్పబడినవి.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామకకృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితావ్యాఖ్యానమునందు ప్రమేహనిదానమనెడు చతుర్థాధ్యాయము సమాప్తము.

—0—

# పంచమాధ్యాయము

మూ॥ అథ తః కుష్ఠనిదానం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట కుష్ఠనిదానమును చెప్పబోవుచున్నాము.

మూ। ఇతి హస్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ సప్త ద్రవ్యాణి కుష్ఠానాం ప్రకృతిర్విపన్నాని భవన్తి। తద్యథా - త్రయో దోషా వాతపిత్తశ్లేష్మాణః ప్రకోపణవికృతాః, దూష్యాశ్చ శరీరధాతవస్త్వఙ్మాంసశోణితలసీకాశ్చతుర్ధా దోషోపఘాతవికృతాః; ఇత్యేతత్సప్తానాం సప్తధాతుకమేవంగతమాజననం కుష్ఠానా

మతః ప్రభవాణ్యభినిర్వర్తమానాని కేవలం శరీరముపతపన్తి ॥ న చ కించిదస్తి కుష్ఠమేకదోషప్రకోపనిమిత్తం. అస్తి తు ఖలు సమానప్రకృతీనామపి సప్తానాం కుష్ఠానాం దోషాంశాంశవికల్పస్థానవిభాగేన వేదనావర్ణసంస్థానప్రభావనామచికిత్సితవిశేషః ॥ స సప్తవిధోఽష్టాదశవిధోఽపరిసంఖ్యేయవిధో వా భవతి; దోషా హి వికల్పనైర్వికల్ప్యమానా వికల్పయన్తి వికారాన్, అన్యత్రాసాధ్యభావాత్; తేషాం వికల్పవికారసంఖ్యానేఽతిప్రసంగమభిసమీక్ష్య సప్తవిధమేవ కుష్ఠవిశేషముపదేక్ష్యామః ॥ ఇహ వాతాదిషు త్రిషు ప్రకుపితేషు త్వగాదీంశ్చతురః ప్రదూషయత్సు వాతేఽధికతరే కపాలకుష్ఠమభినిర్వర్తతే, పిత్తే త్వౌదుమ్బరం, శ్లేష్మణి మణ్డలకుష్ఠం, వాతపిత్తయోః ఋష్యజిహ్వం పిత్తశ్లేష్మణోః పుణ్డరీకం, శ్లేష్మమారుతయోః సిధ్మ, సర్వదోషాతివృద్ధౌ కాకణకమభినిర్వర్తతే; ఇత్యేవమేష సప్తవిధః కుష్ఠవిశేషో భవతి ॥ స చైష భూయస్తరతమతః ప్రకృతౌ వికల్ప్యమానాయాం భూయసీం వికారవికల్పసంఖ్యామాపద్యతే ॥7॥

అ॥ ఆయాకారణములచే ప్రకోపించిన వాతమును పిత్తమును శ్లేష్మమును దోషములచే వికృతినొందించబడిన చర్మమును మాంసమును రక్తమును లసీకయు ఈ యేడును కుష్ఠములకు కారణములుగ నుండును. ఇవి కుష్ఠమును కలిగించి సమస్తశరీరమును తపింపచేయును. కుష్ఠము ఒకేదోషమువలన జనింపదు. ఏడుకుష్ఠములును సమానహేతువులవలన జనించినను దోషములయొక్క అంశాంశవికల్పముచేతను, స్థానభేదముచేతను బాధ, వర్ణము, స్థితి, ప్రభావము, పేరు, చికిత్స వీనియందు భేదము కలుగును. దోషములయొక్క వికల్పనావిశేషములచే వ్యాధులనుకూడ అనేకవిధములుగ పరికల్పింపవచ్చును. అసాధ్యభావముచే కల్పనావిశేషములింకను నుండును. కావున ఈ కుష్ఠము ఏడువిధములుగ గాని పదునెనిమిది విధములుగాగాని అనేకవిధములగా గాని యుండవచ్చును. దోషవికల్పములన్నిటిని అనుసరించి చెప్పినచో అతిప్రసంగమగునని తలచి ఏడువిధములగు కుష్ఠములనే చెప్పుచున్నాము. ప్రకోపించిన మూడుదోషములును చర్మము మాంసము రక్తము లసీక అను ఈ నాలుగింటిని చెరచి కుష్ఠమును కలిగించును. అందు వాతమధికముగనున్నచో కపాలకుష్ఠమును, పిత్తమధికముగనున్నచో ఔదుంబరకుష్ఠమును, శ్లేష్మమధికముగనున్నచో మండలకుష్ఠమును, వాతపిత్తము లధికముగనున్నచో ఋష్యజిహ్వకుష్ఠమును, పిత్తశ్లేష్మము లధికముగనున్నచో పుండరీకకుష్ఠముమును, కఫవాతము లధికముగ నున్నచో సిధ్మకుష్ఠమును, మూడుదోషములధికముగనున్నచో కాకణకకుష్ఠమును జనించును. ఇట్లు కుష్ఠము ఏడువిధములుగ నుండును. దోషములయొక్క తరతమాదిభేదములచే ఇంకను అనేకవిధములుగ నుండును.

## కుష్ఠముయొక్క నిదానము - సంప్రాప్తి.

మూ॥ తత్రేదం సర్వకుష్ఠనిదానం సమాసేనోపదేక్ష్యామః - శీతోష్ణవ్యత్యాసమనానుపూర్వ్యోపసేవమానస్య తథా సంతర్పణాపతర్పణాభ్యవహారవ్యత్యాసం చ మధుఫాణితమత్స్యమూలకకాకమాచీః సతతమతిమాత్రమజీర్ణే సమశ్నతశ్చిలిమం చ పయసా, హాయనకయవకచీనకోద్దాలకకోరదూషప్రాయాణి చాన్నాని క్షీరదధితక్రకోలకులత్థమాషాతసీకుసుమ్భవరూపస్నేహవన్తి, ఏతైరేవాతిమాత్రం సుహితస్య చ వ్యవాయవ్యాయామసంతాపానత్యుపసేవమానస్య, భయశ్రమసంతాపోపహతస్య చ సహసా శీతోదకమవతరతో, విదగ్ధం చాహారమనుల్లిఖ్య విదాహీన్యభ్యవహరతః, ఛర్దిం చ ప్రతిఘ్నతః, స్నేహాంశ్చాతిచరతో యుగపత్త్రయో దోషాః ప్రకోపమాపద్యన్తే, త్వగాదయశ్చత్వారః శైథిల్యమాపద్యన్తే, తేషు శిథిలేషు త్రయో దోషాః ప్రకుపితాః స్థానమధిగమ్య సంతిష్ఠమానాస్తానేవ త్వగాదీన్దూషయన్తః కుష్ఠాన్యభినిర్వర్తయన్తి ॥8॥

అ॥ శీతోష్ణద్రవ్యములను నియమము లేకుండగ ఉపయోగించుట, సంతర్పణద్రవ్యములను అపతర్పణద్రవ్యములను నియమములేకుండగ భుజించుట, తేనె బెల్లపుపాకము చేపలు ముల్లంగి కాచికూర వీనిని ఎల్లప్పుడు అధికముగ భుజించుట, ఆహారము జీర్ణము కానప్పుడు భుజించుట, చిలిచిమములనెడిచేపలను పాలతోకూడ భుజించుట, చిన్నసంబాధాన్యము నల్లకొఱ్ఱలు ఉద్దాలకమనెడిధాన్యము కొఱ్ఱలు వీనియొక్క అన్నములను భుజించుట, పాలు పెరుగు మజ్జిగ రేగుపండ్లు ఉలవలు మినుములు అవిసె కుసుంభవృక్షము చిట్టీత చమురు వీనిసంబంధము ఎక్కువగకలపదార్థములను భుజించుట, పూర్వమునందు చెప్పబడినపదార్థములను తృప్తిగ భుజించుట, మైథునమును వ్యాయామమును వేడిమిని అధికముగ సేవించుట, భయము శ్రమ వేడిమి వీనితోకూడుకొనిన మనుజుడు వెంటనే శీతోదకమునందు స్నానము చేయుట, విదగ్ధమైనఆహారమును వెడలింపచేయకుండగనే విదాహకరములగు పదార్థములను భుజించుట, వాంతిని అరికట్టుట, స్నేహములను అధికముగ ఉపయోగించుట వీనివలన మూడుదోషములును ఒకేసారి ప్రకోపించును. మఱియు చర్మము మాంసము రక్తము లసిక ఈనాలుగను శైథిల్యమును పొందును. శైథిల్యమునొందిన వీనియందు ఆమూడుదోషములను స్థానము నేర్పరచుకొని ఆ చర్మాదులనే దూషింపచేసి కుష్ఠములను కలిగించును.

## కుష్ఠపూర్వరూపములు.

మూ॥ తేషామిమాని ఖలు పూర్వరూపాణి; తద్యథా — అస్వేదనమతిస్వేదనం పారుష్యమతిశ్లక్ష్ణతా వైవర్ణ్యం కణ్డూర్ని

స్తోదః సుప్తతా పరిదాహః పరిహర్షో లోమహర్షో ఖరత్వమూష్మాయణం గౌరవం శ్వయథుర్విసర్పాగమనమభీక్ష్ణం కాయచ్ఛిద్రేషూపదేహః పక్వదగ్ధదష్టక్షతోపస్ఖలితేష్వతిమాత్రం వేదనా స్వల్పానామపిచ వ్రణానాం దుష్టిరసంరోహణం చేతి కుష్ఠపూర్వరూపాణి భవన్తి ॥9॥

అ॥ చెమట జనింపకుండుట లేక అధికముగ జనించుట, పరుషముగ నుండుట మిక్కిలినునుపుగ నుండుట, రంగుమారుట, దురద, సూదులతో పొడిచినట్లు బాధ, మొద్దు బారుట, తాపయుక్తముగ నుండుట, చిమచిమలాడుట, గగుర్పాటు, గరగరలాడుట, ఆవిరి వెడలుచున్నట్లుండుట, బరువుగ నుండుట, వాచుట, విసర్పముజనించుట, శరీర రంధ్రములయందు ఆయామలములతో ఎల్లప్పుడును పూయబడియుండుట, పాకము నొందినను కాల్చబడినను కరవబడినను కోయబడినను కొట్టబడినను అధికమగుబాధ కలుగుట, స్వల్పమయినవ్రణములుకూడ దుష్టినొందుట, మరియు మానకుండుట ఇవి కుష్ఠములకు పూర్వరూపములుగ నుండును.

మూ॥ తేభ్యోఽనన్తరంకుష్ఠాని జాయన్తే; తేషామిదం వేదనావర్ణసంస్థాన ప్రభావనామవిశేషవిజ్ఞానం భవతి, తద్యథా ॥

అ॥ పైనచెప్పబడిన పూర్వరూపములు కలిగినపిదవ కుష్ఠములు ఏర్పడును. వాని, యొక్క బాధలు, వర్ణము, స్థితి, ప్రభావము, పేరు వీనిని వివరించిచెప్పుచున్నాము.

## కపాలకుష్ఠము.

మూ॥ రూక్షారుణపరుషాణి విషమవిసృతాని ఖరపర్యన్తాని తనూన్యుద్వృత్తబహిస్తనూని సుప్తసుప్తాని హృషితలోమాచితాని నిస్తోదబహులాన్యల్ప కణ్డూదాహపూయలసీకాన్యాశుగతి సముత్థానాన్యాశుభేదీని జన్తుమన్తి కృష్ణారుణకపాలవర్ణాని చ కపాలకుష్ఠానీతి విద్యాత్ ॥10॥

అ॥ రూక్షముగను, ఎఱ్ఱగను, పరుషముగను, విషమముగ వ్యాపించినవిగను, అంచుల యందు గరుకుకలవిగను, సూక్ష్మముగను, ఉబ్బినపైచర్మము కలవిగను, మిక్కిలి మొద్దుబారినవిగను, గరుర్పొడిచిన రోమములు కలవిగను, అధికమగు బాధలు కలవిగను, దురద మంటలు చీము లసీక ఇవి స్వల్పముగకలవిగను, తొందరగ పుట్టి వ్యాపించునవిగను, తొందరగ పగులునవిగను, క్రిములు కలవిగను, కుండపెంకులవలె నలుపు లేక ఎరుపువర్ణము కలవిగను నుండు కుష్ఠములు కాపాలకుష్ఠము లనబడును.

## ఔదుంబరకుష్ఠము.

మూ॥ తామ్రాణితామ్రఖరరోమరాజీభిరవనద్ధాని బహలాని బహుబహలరక్తపూయలసీకానికణ్డూక్లేదకోథదాహపాకవన్త్యాశుగతి సముత్థానభేదీని ససంతాకృమీణి పక్వోదుమ్బరఫలవర్ణాన్యౌదుమ్బరకుష్ఠానీతి విద్యాత్ ॥11॥

అ॥ తామ్రవర్ణము కలవిగను, తామ్రవర్ణమును గరుకుతనమును కల రోమములతో కూడినవిగను, అధికముగను, మిక్కిలి అధికమైన రక్తము చీము లసీక ఇవి కలవిగను, దురద క్లేదము కుళ్లుట మంటలు పాకము ఇవికలవిగను, తొందరగ పుట్టి వ్యాపించి పగులునవిగను, తాపమును క్రిములును కలవిగను, మేడిపండువంటి రంగు కలవిగను నుండు కుష్ఠములు ఔదుంబరకుష్ఠము లనబడును.

## మండలకుష్ఠము.

మూ॥ స్నిగ్ధాని గురూణ్యుత్సేధవన్తి శ్లక్ష్ణస్థిరపీనపర్యన్తాని శుక్లరక్తావభాసాని శుక్లరోమరాజీసంతతాని బహులబహలశుక్లపిచ్ఛిలస్రావీణి బహుక్లేదకణ్డూకృమీణి సక్తగతిసముత్థానభేదీని పరిమణ్డలాని మణ్డలకుష్ఠానీతి విద్యాత్ ॥12॥

అ॥ దట్టముగను, బరువుగను, ఉబ్బినవిగను, నునుపు కాఠిన్యము ఉబ్బు వీనితో కూడిన అంచులు కలవిగను, తెలుపులేక ఎరుపురంగుకలవిగను, ఎర్రనిరోమములు కలవిగను, మిక్కిలి అధికమైనట్టియు తెల్లగనున్నట్టియు జిగురుగనున్నట్టియు స్రావము కలవిగను, క్లేదము దురద క్రిములు ఇవి అధికముగ కలవిగను, మెల్లగపుట్టి వ్యాపించి పగులునవిగను, గుండ్రముగ వ్యాపించునవిగను నుండు కుష్ఠములు మండలకుష్ఠము లనబడును.

## ఋష్యజిహ్వాకుష్ఠము.

మూ॥ పరుషాణ్యరుణవర్ణాని బహిరన్తః శ్యావాని నీలపీతతామ్రావభాసాన్యాశుగతిసముత్థానాన్యల్పకణ్డూక్లేదకృమీణి దాహభేదనిస్తోదకబహులాని శూకోపహతోపమవేదనాన్యుత్సన్నమధ్యాని తనుపర్యన్తాని కర్కశపిడకాచితాని దీర్ఘపరిమణ్డలాని ఋష్యజిహ్వాకృతీని ఋష్యజిహ్వానీతి విద్యాత్ ॥ 13 ॥

అ॥ పరుషముగను, ఎర్రగను, లోపలను వెలుపలను శ్యావవర్ణము కలవిగను, నీలవర్ణము పీతవర్ణము తామ్రవర్ణము ఇవికలవిగను, తొందరగపుట్టి వ్యాపించునవిగను, దురద, క్లేదము, క్రిములు ఇవి స్వల్పముగ కలవిగను, మంటలు, నొప్పులు, పోట్లు,

పాకము ఇవి అధికముగకలవిగను, ముల్లుతోపొడిచినట్లు బాధ కలవిగను, మధ్యప్రదేశ మునందు ఉబ్బినవిగను, సూక్ష్మమైన అంచులు కలవిగను, కఠినమైనపిటికలచే వ్యాపింప బడినవిగను, పెద్దవియగుమండలములు కలవిగను, లేడినాలుకవంటి ఆకారముకలవిగను, నుండు కుష్ఠములు ఋష్యజిహ్వాకుష్ఠము లనబడును.

## పుండరీక కుష్ఠము.

మూ॥ శుక్లరక్తావభాసానిరక్తపర్యన్తాని రక్తరాజీసంతతాన్యుత్సేదవన్తి బహుబహలరక్తపూయలసీకాని కణ్డూకృమిదాహపాకవన్త్యాశుగతిసముత్థానభేదీని పుణ్డరీకపలాశసంకాశాని పుణ్డరీకాణీతి విద్యాత్ ॥14॥

అ॥ తెలుపును ఎరుపును కలవిగను, ఎర్రనిఅంచులు కలవిగను, ఎర్రనిరేఖలు కలవిగను, ఉబ్బినవిగను, రక్తము చీము లసీక ఇవి మిక్కిలి అధికముగ కలవిగను, దురద క్రిములు మంటలు పాకము ఇవి కలవిగను, తొందరగపుట్టి వ్యాపించి పగులు నవిగను, పద్మపురేకలతో సమానముగనునుండు కుష్ఠములు పుండరీకకుష్ఠము లనబడును.

## సిధ్మకుష్ఠము.

మూ॥ పరుషారుణవిశీర్ణబహిస్తనూన్యన్తస్స్నిగ్ధాని శుక్లరక్తావభాసాని బహూన్యల్పవేదనాన్యల్పకణ్డూదాహపూయలసీకాని లఘుసముత్థానాన్యల్పభేదకృమీణ్యలాబూపుష్పసంకాశాని సిధ్మకుష్ఠానీతి విద్యాత్ ॥15॥

అ॥ కాఠిన్యము ఎరుపు విడిపోవుచున్నట్లుండుట వీనితోకూడిన వెలుపలిచర్మము కలవిగను, లోపలదట్టముగను, తెలుపులేక ఎరుపుకలవిగను, అనేకముగను, బాధ దురద మంటలు చీము లసీకఇవి స్వల్పముగ కలవిగను, సూక్ష్మముగ వ్యాపించునవిగను, పగులుటయు క్రిములును అల్పముగ కలవిగను, సొర (ఆనప) పువ్వులతో సమానముగను నుండు కుష్ఠములు సిధ్మకుష్ఠము లనబడును.

## కాకణకకుష్ఠము.

మూ॥ కాకణన్తికావర్ణాన్యాదౌ పశ్చాత్సర్వకుష్ఠలిఙ్గసమన్వితాని పాపీయసాం సర్వకుష్ఠలిఙ్గసంభవేనానేకవర్ణాని కాకణకానీతి విద్యాత్; తాన్యసాధ్యాని సాధ్యాని పునరితరాణి ॥16॥

అ॥ తొలుత గురువిందగింజయొక్క రంగుకలవిగనుండి పిదప సమస్తకుష్ఠముల యొక్క లక్షణములుకలవిగను, అందువలన అనేక వర్ణములు కలవిగను నుండు కుష్ఠము

కాకణకకుష్ఠము లనబడును. ఇవి మహాపాపాత్ములకే జనించును. అసాధ్యములుగ నుండును. ఇతరకుష్ఠములు సాధ్యములుగనుండును.

### కుష్ఠములయొక్క సాధ్యాసాధ్యవిచారణ - ఉపద్రవములు.

మూ॥ తత్రయదసాధ్యం, తదసాధ్యతాం నాతివర్తతే; సాధ్యం పునః కించిదసాధ్యతామతివర్తతే కదాచిదపచారాత్; సాధ్యానీహ షట్ కాకణకవర్జ్యాన్యచికిత్స్యమానాన్యపచారతో వా దోషైరభిష్యన్దమానాన్యసాధ్యతాముపయాన్తి ॥ సాధ్యానామపి హ్యుపేక్ష్యమాణానామేషాం త్వఙ్మాంసశోణితలసీకాకోథక్లేదసంస్వేదజాః కృమయోఽభిమూర్ఛన్తి; తే భక్షయన్తస్త్వగాదీన్ దోషాః పునర్దూషయన్త ఇమానుపద్రవాన్ పృథక్పృథగుత్పాదయన్తి। తత్రవాతః శ్యావారుణవర్ణం పరుషతామపిచ రౌక్ష్యశూలశోషతోదవేపథుహర్షసంకోచాయాసస్తమ్భసుప్తిభేదభఙ్గాన్,పిత్తంపునర్దాహస్వేదక్లేదకోథకణ్డూస్రావపాకరాగాన్, శ్లేష్మాత్వస్య శ్వైత్యశైత్యస్థైర్యకణ్డూగౌరవోత్సేధోపస్నేహోపలేపాన్, కృమయస్త్వగాదీంశ్చతురః సిరాః స్నాయూన్మాంసాన్యస్థీన్యపిచ తరుణాని ఖాదన్తి ॥ అస్యామవస్థాయాముపద్రవాః కుష్ఠినం స్పృశన్తి తద్యథా-ప్రస్రవణమఙ్గభేదః పతనాన్యఙ్గావయవానాం తృష్ణాజ్వరాతీసారదాహదౌర్బల్యారోచకావిపాకాశ్చ, తద్విధమసాధ్యం విద్యాదితి ॥19॥

అ॥ అసాధ్యమైనవ్యాధి అసాధ్యముగనే ఉండును. సాధ్యమైనవ్యాధి అపథ్యము వలన ఒకానొకప్పుడు అసాధ్యత్వమునొందును. కాకణకకుష్ఠముకాక మిగిలిన ఆరుకుష్ఠములుకూడ చికిత్సింపకుండుటవలనగాని అపథ్యమువలనగాని దోషములచే పూరింపబడి అసాధ్యములుగ నగును. సాధ్యములైనను వీనిని ఉపేక్షించినచో చర్మము మాంసము రక్తము లసీక వీనియొక్క కుళ్ళుట చెడుట చెమట వీనివలన క్రిములు అభివృద్ధినొంది ఆ చర్మము మొదలైనవానిని తినును. దోషములు వానిని ఇంకను దూషింపచేసి చెప్పబోవుబాధలను వేరువేరుగ కలిగించును. వాతము - శ్యామవర్ణము అరుణవర్ణము కాఠిన్యము రౌక్ష్యము శూల కృశించుట పోట్లు ఒణుకు గగుర్పాటు ముణుచుకొనియుండుట ఆయాసము బిగపట్టుట మొద్దుబారుట పగులు చున్నట్లుండుట విడిపోవుచున్నట్లుండుట ఈబాధలను కలిగించును. పిత్తము-మంటలు చెమట చెడుట కుళ్ళుట దురద స్రావము పాకమునొందుట ఎరుపు ఈబాధలను కలిగించును. కఫము - తెలుపు చల్లదనము కాఠిన్యము దురద బరువుగ నుండుట ఉబ్బుట నిగారింపు పూయబడినట్లుండుట. ఈబాధలను కలిగించును క్రిములు-చర్మము మొదలగు నాలు

గింటిని సిరలను స్నాయువులను మాంసములను చిన్నఎముకలను తినును. అట్టి సమయమున, స్రవించుట శరీరము బ్రద్దలగుచున్నట్లుండుట అవయవములు జారిపోవుచున్నట్లుండుట దప్పిక జ్వరము అతిసారము తాపము దౌర్బల్యము అరోచకము జీర్ణముకాకపోవుట ఇవి ఉపద్రవములుగ కలుగును. అట్టిదానిని అసాధ్యమైనదానినిగ తెలిసికొనవలయును.

మూ॥ సాధ్యోఽయమితి యఃపూర్వంనరో రోగముపేక్షతే। నకించిత్కాలమాసాద్య మృత ఏవావబుధ్యతే॥ యస్తుప్రాగేవ రోగేభ్యో రోగేషు తరుణేషు చ । భేషజం కురుతే సమ్యక్ స చిరం సుఖమశ్నుతే ॥ యథా హ్యల్పేన యత్నేన ఛిద్యతే తరుణస్తరుః।స ఏవాతిప్రవృద్ధస్తు ఛిద్యతేఽతిప్రయత్నతః ॥ ఏవమేవ వికారోఽపి తరుణస్సాధ్యతే సుఖమ్।వివృద్ధస్సాధ్యతే కృచ్ఛ్రాదసాధ్యో వాఽపి జాయతే ॥23॥

అ॥ "ఈవ్యాధి ఏమియుచేయదు" అని ఉపేక్షించినచో నది కొంతకాలమునకు చంపును. రోగములురాకుండ జాగ్రతపడినను రోగములు కలిగినవెంటనే తగుచికిత్సను పొందినను చిరకాలము సుఖముగ జీవించును. లేత మొక్కను స్వల్పప్రయత్నముచే ఛేదింపవచ్చును. అదే పెద్దదైనచో అధికప్రయత్నముచే ఛేదింపవలసియుండును. అటులనే వ్యాధిజనించినవెంటనే సుఖసాధ్యముగ నుండును. కాలాతిక్రమణమై వృద్ధినొందినచో కష్టసాధ్యముగగాని అసాధ్యముగగాని అగును.

## అధ్యాయసంగ్రహము.

మూ॥ సంఖ్యా ద్రవ్యాణి దోషాశ్చ హేతవః పూర్వలక్షణమ్। రూపాణ్యుపద్రవాశ్చోక్తాః కుష్ఠానాం క్లైప్తికే పృథ ॥ 24 ॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే నిదానస్థానే కుష్ఠనిదానం నామ పఞ్చమోఽధ్యాయః॥

అ॥ ఈ అధ్యాయమునందు కుష్ఠములయొక్క సంఖ్యాసంప్రాప్తి దూష్యములు దోషములు హేతువులు పూర్వరూపములు లక్షణములు ఉపద్రవములు ఇవి చెప్పబడినవి.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామకకృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితావ్యాఖ్యానమునందు కుష్ఠనిదానమనెడు పంచమాధ్యాయము సమాప్తము.



# షష్ఠాధ్యాయము

మూ॥ అథాతశ్శోషనిదానం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట శోషనిదానమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ। అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

## రాజయక్ష్మ కారణములు.

మూ॥ ఇహ ఖలు చత్వారి శోషస్యాయతనాని । తద్యథా-సాహసం, సంధారణం, క్షయో, విషమాశనమితి ॥3॥

అ॥ సాహసము వేగధారణము ధాతుక్షయ విషమాశనము అనునీనాలుగును రాజయక్ష్మకు కారణములుగ నుండును.

## సాహసికయక్ష్మ వివరణము.

మూ॥ తత్ర యదుక్తం సాహసం శోషస్యాయతనమితి తదను వ్యాఖ్యాస్యామః - యదా పురుషో దుర్బలో హి సన్ బలవతా సహ విగృహ్ణాతి, అతిమహతా వా ధనుషా వ్యాయచ్ఛతి, జల్పతి వాఽప్యతిమాత్రం, అతిమాత్రం వా భారముద్వహతి, అప్సు వా ప్లవతే చాతిదూరం, ఉత్సాదనపదాఘాతనే వాఽతిప్రగాఢమాసేవతే, అతిప్రకృష్టం వాఽధ్వానం ద్రుతమభిపతతి, అభిహన్యతే వాఽన్యద్వా కించిదేవంవిధం విషమమతిమాత్రం వా వ్యాయామజాతమారభతే తస్యాతిమాత్రేణ కర్మణా ఉరః క్షణ్యతే; తస్యోరః క్షతముపప్లవతే వాయుః, స తత్రావస్థితః శ్లేష్మాణమురఃస్థముపసంసృజ్య శోషయన్ విహరత్యూర్ధ్వమధస్తిర్యక్చ; యోఽశస్తస్య శరీరసంధీనావిశతి, తేనాస్య జృమ్భాఽఙ్గమర్దో జ్వరశ్చోపజాయతే; యస్త్వామాశయముపైతి, తేనాస్య వర్చో భిద్యతే; యస్తు హృదయమావిశతి, తేన రోగా భవన్త్యురస్యాః; యో రసనాం, తేనాఽస్యారోచకశ్చ; యః కణ్ఠం ప్రపద్యతే, కణ్ఠస్తేనోద్ధ్వంస్యతే స్వరశ్చావసీదతి; యః ప్రాణవహాని స్రోతాంస్యన్వేతి, తేనశ్వాసః ప్రతిశ్యాయశ్చోపజాయతే; శిరస్య

వతిష్ఠతే, శిరస్తేనోపహన్యతే; తతః క్షణనాచ్చోరసో విషమ గతిత్వాచ్చ వాయోఃకణ్ఠస్య చోద్ధ్వంసనాత్కాసః సతతమస్యసంజాయతే; స కాసప్రసంగాదురసి క్షతే శోణితం ష్ఠీవతి, శోణితాగమాచ్చాస్య దౌర్బల్యముపజాయతే; ఏవమేతే సాహసప్రభవాః సాహసికముపద్రవాః స్పృశన్తి; తతః సోఽప్యుపశోషణైరేతైరుపద్రవైరుపద్రుతః శనైః శనైరుపశుష్యతి। తస్మాత్పురుషో మతిమాన్ బలమాత్మనః సమీక్ష్య తదనురూపాణి కర్మాణ్యారభేత కర్తుం, బలసమాధానం హి శరీరం, శరీరమూలశ్చ పురుష ఇతి ॥శ్లో॥ సాహసం వర్జయేత్కర్మ రక్షఞ్జీవితమాత్మనః॥ జీవన్హి పురుషస్త్విష్టం కర్మణః ఫలమశ్నుతే ॥5।

అ॥ సాహసమువలన రాజయక్ష్మకలుగు విధమును చెప్పుచున్నాము. దుర్బలుడుగనుండి బలవంతునితో మల్లయుద్ధము చేయుట, అతిభారమగుధనుస్సును ఉపయోగించుట, అధికముగ మాట్లాడుట, మిక్కిలిబరువును మోయుట, నీటియందు చాల దూరము ఈదుట, గాఢమైన నలుగుడును పాదాఘాతమును చేయించుకొనుట, మిక్కిలి దూరమగు మార్గమును తొందరగ పరుగెత్తుట, దెబ్బలు తగులుట, ఇంకను ఇట్టి విషమమైనట్టియు అతిమాత్రమైనట్టియు పనులనుచేయుట వీనిచే వక్షఃస్థలమునందు క్షతము కలుగును. అట్టివక్షఃస్థలమును వాతము పొంది అచ్చట నున్నశ్లేష్మముతోకలిసి దానిని ఎండింపచేసి ఊర్ధ్వాధస్తిర్యగ్భాగములయందు సంచరించును. అట్టివాతము యొక్క - శరీరసంధులనుపొందిన అంశముచే ఆవలింతలు ఒడలునొప్పులు జ్వరము ఇవియు, ఆమాశయమునుపొందిన అంశముచే మలము అధికముగ వెడలుటయు, హృదయమును పొందిన అంశముచే ఉరోవ్యాధులును, నాలుకను పొందిన అంశముచే అరుచియు, కంఠమునుపొందిన అంశముచే కంఠముచెడుట స్వరభంగము ఇవియు, ప్రాణవహస్రోతస్సులనుపొందిన అంశముచే శ్వాస ప్రతిశ్యాయము ఇవియు, శిరస్సును పొందిన అంశముచే శిరోబాధయు కలుగును. వక్షఃస్థలము క్షతము నొందియుండుట వలనను, వాతము విషమగమనము కలిగియుండుట వలనను, కంఠము చెడియుండుట వలనను ఎల్లప్పుడును దగ్గు వచ్చుచుండును. దగ్గుచుండుటవలనను, వక్షఃస్థలము క్షతము నొందియుండుటవలనను రక్తము సుమియుచుండును. రక్తము సుమియుచుండుటవలన నోటియందు దుర్గంధము కలుగును. సాహసకృత్యముల నాచరించుటవలన కలిగిన ఈ ఉపద్రవములచే మనుజుడు క్రమక్రమముగ క్షీణించును. పురుషునకు శరీరమును, శరీరమునకు బలమును ఆధారముగ నుండును. అందువలన బుద్ధిమంతుడగువాడు తన యొక్క బలమునను సరించియే పనులను చేయుచుండవలయును. తనయొక్క జీవితమును కోరిన మనుజుడు సాహసకార్యములను చేయరాదు. జీవించియున్నచో అనుకూలమైన కర్మఫలమును పొందవచ్చును.

వేగధారణజయుక్తివివరణము.

మూ॥ అథ సంధారణంశోషస్యాయతనమితియదుక్తం తదను వ్యాఖ్యాస్యామః—యదాపురుషో రాజసమీపే భర్తృసమీపే వా గురోర్వాపాదమూలేద్యూతసభమన్యంసతాం సమాజం స్త్రీమధ్యం వాఽనుప్రవిశ్య యానైర్వాఽప్యుచ్చావచైర్గచ్ఛన్ భయాత్ ప్రసంగాత్ హ్రీమత్త్వాద్ఘృణిత్వాద్వా నిరుణద్ధ్యాగతాని వాతమూత్రపురీషాణి, తదా తస్య సంధారణాద్వాయుః ప్రకోపమాపద్యతే; స ప్రకుపితః పిత్తశ్లేష్మాణౌ సముదీర్యోర్ధ్వమధస్తిర్యక్ చ విహరతి; తతశ్చాంశవిశేషేణపూర్వవచ్ఛరీరావయవవిశేషం ప్రవిశ్య శూలం జనయతి, భినత్తి పురీషముచ్ఛోషయతి వా, పార్శ్వే చాతిరుజతి, అంసౌ చావమృద్నాతి, కణ్ఠమురశ్చావధమతి, శిరశ్చోపహన్తి. కాసం శ్వాసం జ్వరం స్వరభేదం ప్రతిశ్యాయం చోపజనయతి; తతః సోఽప్యుపశోషణైరేతైరుపద్రవైరుపద్రుతః శనైః శనైరుపశుష్యతి। తస్మాత్పురుషో మతిమానాత్మనః శరీరేష్వేవ యోగక్షేమకరేషు ప్రయతేత; శరీరం హ్యస్య మూలం, శరీరమూలశ్చ పురుషో భవతీతి॥ శ్లో॥ సర్వమన్యత్పరిత్యజ్య శరీరమనుపాలయేత్ । తదభావే హి భావానాం సర్వాభావః శరీరిణామ్ ॥7॥

అ॥ వేగధారణమువలన రాజయక్ష్మ కలుగువిధమును చెప్పుచున్నాము. రాజసమీపము యజమానసమీపము గురుసమీపము జూదగాండ్రమధ్య సత్పురుషులమధ్య స్త్రీలమధ్యయానములు వీనియందుండుటవలనగాని భయమువలనగాని మాట్లాడుచుండుటవలనగాని సిగ్గువలనగాని రోతవలనగాని వాతమూత్రపురీషములయొక్క వేగములను అరికట్టినచో వాతము ప్రకోపించును. అట్టివాతము పిత్తశ్లేష్మములను ఉద్రేకము నొందించి ఊర్ధ్వాధస్తిర్యగ్భాగములయందు సంచరించుచు పూర్వమునందువలెనే అంశాంశవిశేషముచే ఆయా అవయవములను పొందును. శూలను కలిగించును. మలమును అధికముగ వెడలించును. లేక ఎండింపచేయును. పార్శ్వములయందు చిక్కులిబాధను కలిగించును. అంసఫలకమును పీడించును. కంఠమును వక్షఃస్థలమును పూరించును. శిరస్సునందు బాధను కలిగించును. కాస శ్వాస జ్వరము, స్వరభేదము పడిసెము వీనిని కలిగించును. ఈ ఉపద్రవములచే మనుజుడు క్రమముగ కృశించును. కావున బుద్ధిమంతుడగు మనుజుడు తనయొక్క శరీరయోగక్షేమకరములగు విషయములయందు విశేషించి ప్రయత్నము చేయుచుండవలయును. దీనికి శరీరము ఆధారముగ నుండును. శరీరమునకు ఆత్మ ఆధారముగ నుండును. శరీరము లేకున్నచో ఏమియు లేకుండును. కావున ఇతరములన్నిటిని విడిచిపెట్టి శరీరమును రక్షించుకొనవలయును.

## ధాతుక్షయజయక్ష్మవివరణము.

మూ॥ క్షయః శోషస్యాయతనమితి యదుక్తం తదనువ్యాఖ్యాస్యామః—యదా పురుషోఽతిమాత్రం శోకచిన్తాపరిగతహృదయో భవతి, ఈర్ష్యోత్కణ్ఠాభయక్రోధాదిభిర్వా సమావిశ్యతే, కృశో వా సన్ రూక్షాన్నపానసేవీ భవతి, దుర్బలప్రకృతిరనాహారోఽల్పాహారో వాఽఽస్తే, తదా తస్య హృదయస్థాయీ రసః క్షయముపైతి, స తస్యోపక్షయాచ్ఛోషం ప్రాప్నోతి, అప్రతీకారాచ్చానుబధ్యతే యక్ష్మణా యథోపదేక్ష్యమాణరూపేణ॥ యదా వా పురుషోఽతిప్రహర్షాత్ప్రసక్తభావః స్త్రీష్వతిప్రసఙ్గమారభతే, తస్యాతిప్రసఙ్గాద్రేతః క్షయముపైతి; క్షయమపి చోపగచ్ఛతి రేతసి యది మనః స్త్రీభ్యో నైవాస్య నివర్తతే, అతిప్రవర్తత ఏవ తస్య, చాతిప్రణీతసఙ్కల్పస్య మైథునమాపద్యమానస్య శుక్రం న ప్రవర్తతే అతిమాత్రోపక్షీణత్వాత్; అథాస్య వాయుర్వ్యాయచ్ఛమానస్యైవ ధమనీరనుప్రవిశ్య శోణితవాహినీస్తాభ్యః శోణితం ప్రచ్యావయతి, తచ్ఛుక్రక్షయాచ్ఛుక్రమార్గేణ శోణితం ప్రవర్తతే వాతానుసృతలిఙ్గం; అథాస్య శుక్రక్షయాచ్ఛోణితప్రవర్తనాచ్చ సన్ధయః శిథిలీభవన్తి, రౌక్ష్యముపజాయతే, భూయః శరీరం దౌర్బల్యమావిశతి, వాయుః ప్రకోపమాపద్యతే; స ప్రకుపితోఽవశికం శరీరమనుసర్పన్ పరిశోషయతి మాంసశోణితే, ప్రచ్యావయతి శ్లేష్మపిత్తే, సంరుజతి పార్శ్వే, చావగృహ్ణాత్యంసౌ, కణ్ఠముద్ధ్వంసయతి, శిరః శ్లేష్మాణముత్క్లేశ్య పరిపూరయతి శ్లేష్మణా, సన్ధీంశ్చ ప్రపీడయన్ కరోత్యఙ్గమర్దమరోచకావిపాకౌ చ, పిత్తశ్లేష్మోత్క్లేశాత్ప్రతిలోమగత్వాచ్చ వాయుర్జ్వరం కాసం స్వరభేదం ప్రతిశ్యాయం చోపజనయతి; తతః సోఽప్యుపశోషణైరేతైరుపద్రుతః శనైః శనైరుపశుష్యతి। తస్మాత్పురుషో మతిమానాత్మనః శరీరమనురక్షన్ శుక్రమనురక్షేత్; పరా హ్యేషా ఫలనిర్వృత్తిరాహారస్యేతి॥ శ్లో॥ ఆహారస్య పరం ధామ శుక్రం తద్రక్ష్యమాత్మనః। క్షయే హ్యస్య బహూన్ రోగాన్మరణం వా నియచ్ఛతి॥

అ॥ ధాతుక్షయవలన రాజయక్ష్మ కలుగువిధమును చెప్పుచున్నాము. దుఃఖము, చింత, ఈర్ష్య, వేడుక, భయము, కోపము, కృశించినవాఁడై రూక్షమైన అన్నపా

నములను సేవించుట, దుర్బలప్రకృతికలవాడై ఆహారమును సేవింపకుండుట లేక స్వల్పముగ సేవించుట వీనివలన హృదయమునందుండురసము క్షీణించును. రసము క్షీణించుటవలన మనుజుడు కృశించును. అట్టిసమయమున చికిత్సింపకున్నచో చెప్ప బోవుయక్ష్మ కలుగును. పురుషుడు అధిక సంతోషముచే స్త్రీలయందు ఆసక్తిగలవాడై అధికమైథునమును చేయుటవలన శుక్రము క్షీణించును. శుక్రముక్షీణించినను వాని యొక్క మనస్సు స్త్రీలనుండి మరలక అధికముగనే ప్రవర్తించుచుండును. అధికేచ్ఛ కలవాడై మైథునముచేయుచున్నవానికి శుక్రము మిక్కిలి క్షీణించియుండుటవలన ప్రవర్తింపదు. అట్లు మైథునముచేయుచున్నవానికి వాతము రక్తవాహకములగు ధమనులను పొంది ఆ ధమనులనుండి రక్తమును వెడలించును. శుక్రము క్షీణించియుండుట వలన ఆరక్తము వాతలక్షణములతోగూడి శుక్రమార్గముద్వారా బయలువెడలును. శుక్రము క్షీణించుటవలనను రక్తము ప్రవర్తించుటవలనను వీనియొక్క సంధులు శైథిల్య మును పొందును. రౌక్ష్యముకలుగును. శరీరమునందు ఇంకను దౌర్బల్యము కలుగును. వాతము ప్రకోపించి స్వాధీనమైన శరీరమునందు వ్యాపించి మాంసమును రక్తమును ఎండింపచేయును. కఫపిత్తములను స్రవింపచేయును. పార్శ్వములయందు బాధను కలిగించును. అంసఫలకమును పీడించును. కంఠమును చెరచును. కఫమునుద్రేకము నొందించి ఆకఫముచే శిరస్సును పూరించును. సంధులను పీడించును. ఒడలునొప్పులు అరోచకము జీర్ణము కాకుండుట వీనిని కలిగించును. పిత్తశ్లేష్మములు ఉద్రేకము నొందుటవలనను, వాతము విలోమగతినొందుటవలనను జ్వరము కాస స్వరభేదము పడిసెము ఇవి కలుగును. అట్టి మనుజుడు ఈ ఉపద్రవములచే క్రమక్రమముగ కృశిం చును. కావున బుద్ధిమంతుడగు మనుజుడు తనశరీరమును రక్షించుకొనుచు శుక్రమును రక్షించుకొనవలయును. శుక్రము ఆహారమునకు శ్రేష్ఠమైనఫలముగ నుండును. శుక్రము ఆహారముయొక్క శ్రేష్ఠమైనఫలము. కావున దానిని రక్షించుకొనవలయును. శుక్రము క్షీణించినచో అనేకములైన రోగములుగాని మరణముగాని కలుగును.

### విషమాశనజయక్ష్మ వివరణము

మూ॥ విషమాశనం శోషస్యాయతనమితి యదుక్తం, తదను వ్యాఖ్యాస్యామః-యదా పురుషఃపానాశనభక్ష్యలేహ్యోప యోగాన్ ప్రకృతికరణసంయోగరాశి దేశకాలోపయోగసంస్థోపశయవిషమానా సేవతే, తదా తస్య వాతపిత్తశ్లేష్మాణో వైషమ్యమాపద్యన్తే, తే విషమాః శరీరమనుపసృత్య యదా స్రోతసామయనముఖాని ప్రతి వార్యావతిష్ఠన్తే తదా జన్తుర్యద్యదాహారజాతమాహారతి తత్తదస్య మూత్రపురీషమేవోపజాయతే భూయిష్ఠం నాన్యస్తథా శరీరధాతుః, న పురీషోపస్తమ్భాద్వర్తయతి, తస్మాచ్ఛుష్యతో విశేషేణ పురీష మనురక్ష్యం, తథా సర్వేషామత్యర్థకృశదుర్బలానాం; తస్యానాప్యా

య్యమానస్య విషమాశనోపచితా దోషాః పృథక్పృథగుపద్రవైర్యుజ్యన్తే భూయః శరీరముపశోషయన్తి; తత్రవాతః శూలమఙ్గమర్దం కణ్ఠోద్ధ్వంసనం పార్శ్వసంరుజనమంసావమర్దనం స్వరభేదం ప్రతిశ్యాయం చోపజనయతి, పిత్తం పునర్జ్వరమతీసారమన్తర్దాహం చ,స కాస పరిసఙ్గాదురసి క్షతే శోణితం ష్ఠీవతి, శోణితగమనాచ్చాస్య దౌర్బల్యముపజాయతే; ఏవమేతే విషమాశనోపచితా దోషా రాజయక్ష్మాణమభినిర్వర్తయన్తి;సత్తైరుపశోషణైరుపద్రవైరుపద్రుతఃశనైః శనైరుపశుష్యతి; తస్మాత్పురుషో మతిమాన్ ప్రకృతికరణసంయోగరాశిదేశకాలోపయోగసంస్థోపశయాదవిషమమాహారమాహరేదితి ॥

శ్లో॥ హితాశీ స్యాన్మితాశీస్యాత్కాలభోజీ జితేన్ద్రియః। పశ్యన్ రోగాన్బహూన్కష్టాన్బుద్ధిమాన్విషమాశనాత్ ॥12॥

అ॥ విషమాశనజయక్ష్మ కలుగువిధమును చెప్పుచున్నాము. ప్రకృతి సంస్కారము సంయోగము ప్రమాణము దేశము కాలము ఉపయోగనియమము ఉపయోక్త వీనిచే విషమములైన పానము అశనము భక్ష్యము లేహ్యము అనెడి ఆహారములను సేవించినచో వాతపిత్తశ్లేష్మములు వైషమ్యమునుపొందినవై శరీరమునందు వ్యాపింపక స్రోతోమార్గములయొక్క ముఖములను అడ్డగించియుండును. అప్పుడు భుజింపబడిన ఆహారమంతయు తరుచు మూత్రపురీషములుగనే పరిణమించును. ఇతరశరీరధాతువులుగ పరిణమింపదు. అట్టిపురుషుడు పురీషముయొక్క బలమునే ఆధారముగ చేసికొనియుండును. కావున కృశించినవాడు విశేషించి పురీషమును రక్షించుకొనవలయును. మిక్కలి కృశించి దుర్బలులుగనున్న అందరును ఈవిధముగనే మలమును రక్షించుకొనవలయును. విషమాశనముచే వృద్ధినొందిన దోషములు సరియైనఆహారపరిణామములేనివానికి తమతమఉపద్రవములతోకూడి శరీరము నింకను శోషింపచేయును. వానిలో వాతము—శూల ఒడలునొప్పులు కంఠము చెడుట పార్శ్వములయందుబాధ అంసఫలకముఎండింపబడుట సర్వభేదము పడిసెము వీనిని కలిగించును. పిత్తము — జ్వరము అతిసారము అంతస్తాపము వీనిని కలిగించును. కఫము—పడిసెము శిరస్సుబరువుగనుండుట దగ్గు అరోచకము వీనిని కలిగించును. దగ్గు అధికముగ వచ్చుటవలన వక్షఃస్థలము క్షతము నొందును. అందువలన రక్తమును ఉమియును. రక్తము వెడలుటవలన దౌర్బల్యము కలుగును. విషమాహారముచే వృద్ధినొందిన దోషములు రాజయక్ష్మను ఈవిధముగ కలిగించును. ఈఉపద్రవములతోకూడిన మనుజుడు క్రమక్రమముగ కృశించును. కావున బుద్ధిమంతుడగుమనుజుడు — ప్రకృతి సంస్కారము సంయోగము ప్రమాణము దేశము కాలము ఉపయోగనియమము ఉపయోక్త వీనిచే విషముకాని ఆహారమును సేవింపవలయును. విషమాహారమువలన కష్టములైన అనేకవ్యాధులు జనించును. కావున జితేంద్రియుడై హితాహారమును మితముగ సకాలమునందు సేవింపవలయును.

మూ॥ ఏవమేతైశ్చతుర్భిః శోషస్యాయతనైరభ్యుపసేవితైర్వాతపిత్తశ్లేష్మాణః ప్రకోపమాపద్యన్తే, తే ప్రకుపితా నానావిధైరుపద్రవైః శరీరముపశోషయన్తి; తం సర్వరోగాణాం కష్టతమత్వాద్రాజయక్ష్మాణమాచక్షతే భిషజః యస్మాద్వా పూర్వమాసీద్భగవతః సోమస్యోడురాజస్య తస్మాద్రాజయక్ష్మేతి ॥13॥

అ॥ యక్ష్మకారణములగు ఈ నాలిగింటిని అధికముగ సేవించుటచే వాతపిత్తశ్లేష్మములు ప్రకోపించి అనేకవిధములగు ఉపద్రవములను కలిగించి శరీరమును కృశింపచేయును. ఈవ్యాధి అన్నివ్యాధులకంటె కష్టసాధ్యమైనదగుటవలనను, పూర్వకాలమున నక్షత్రరాజగు చంద్రునికి కలుగుటవలనను దీనికి రాజయక్ష్మ అను పేరువచ్చినది.

## యక్ష్మపూర్వరూపములు

మూ॥ తస్యేమాని పూర్వరూపాణి భవన్తి; తద్యథా—ప్రతిశ్యాయః క్షవథురభీక్ష్ణం శ్లేష్మప్రసేకో ముఖమాధుర్యమనన్నాభిలాసోఽన్నకాలేచాయాసో దోషదర్శనమదోషేష్వల్పదోషేషు వా పాత్రోదకాన్నపానసూపాపోపదంశపరివేశకేషు భుక్తవతో హృల్లాసస్తథోల్లేఖనమాహారస్యాన్తరాన్తరా ముఖస్య పాదయోశ్చశోషః పాణ్యోశ్చావేక్షణమత్యర్థమక్ష్ణోః శ్వేతావభాసతా చాతిమాత్రం బాహ్వోః ప్రమాణజిజ్ఞాసా స్త్రీకామతాఽతిఘృణిత్వంబీభత్సదర్శనతా చాస్య కాయేస్వప్నేచాభీక్ష్ణం దర్శనమనుదకానాముదకస్థానానాం శూన్యానాంచ గ్రామనగరనిగమజనపదానాంశుష్కదగ్ధావభగ్నానాం చవనానాం కృకలాసమయూర వానరశుకసర్ప కాకోలూకాదిభిః సంస్పర్శనమధిరోహణం వా యానానాంచాశ్వోష్ట్రఖరవరాహైః కేశాస్థిభస్మతుషాఙ్గారరాశీనాం చాధిరోహణమితి శోషపూర్వరూపాణి భవన్తి॥14॥

అ॥ పడిసెము, ఎల్లప్పుడును తుమ్ములువచ్చుట, కఫమును ఉమియుట, నోరు తియ్యగనుండుట, అన్నమునందిష్టములేకపోవుట, భుజించునప్పుడు ఆయాసముకలుగుట, దోషరహితమైనట్టిగాని స్వల్పదోషముకలిగినట్టిగాని పాత్రలు ఉదకము అన్నము పప్పు పిండివంటలు పచ్చళ్ళు వీనియందు మలినమున్నట్లుకనిపించుట, భుజించినవెంటనే నోటనీరుకారుట, భుజించిన ఆహారము వమనరూపమున బయలువెడలుట, అప్పుడప్పుడు నోరును పాదములును ఎండుచుండుట, ఎల్లప్పుడును చేతులను చూచుకొనుచుండుట, నేత్రములు తెల్లగనుండుట, బాహువులను కొలుచుకొనుచుండుట, స్త్రీలయందు అధికమగుకామము కలుగుట, తిరస్కారభావము కలుగుట, శరీరమునందు బీభత్సభావము, ఉదకరహితమైన తటాకములను చూచినట్లును శూన్యములైన గ్రామ

ములు నగరములు పట్టణములు పల్లెలు వీనిని చూచినట్లును ఎండినట్టియు మండుచున్నట్టియు విరిగిపోయినట్టియు వనములను చూచినట్లును తొండ నెమలి కోతి చిలుక పాము కాకి గుడ్లగూబ వీనిని తాకినట్లును గుఱ్ఱము ఒంటె గాడిద పంది వీనినెక్కి ప్రయాణము చేయుచున్నట్లును వెంట్రుకలు ఎముకలు బూడిద ఊక నిప్పు వీనియొక్క రాశినెక్కినట్లును స్వప్నముకలుగుట ఇవి రాజయక్ష్మకు పూర్వరూపములుగ నుండును.

## యక్ష్మముయొక్క ఏకాదశలక్షణములు

మూ॥ అత ఊర్ధ్వమేకాదశ రూపాణి తస్య భవన్తి;తద్యథా-శిరసః ప్రతిపూరణం కాసః శ్వాసః స్వరభేదః శ్లేష్మణశ్ఛర్దనంశోణితష్ఠీవనం పార్శ్వసంరుజనమంసావమర్దో జ్వరోఽతీసారస్తథాఽరోచక ఇతి॥

అ॥ పిదప శిరస్సుపూరింపబడినట్లుండుట, కాస, శ్వాస, స్వరభేదము, శ్లేష్మము నుమియుట, రక్తమునుమియుట, పార్శ్వములయందు బాధ, అంసఫలకము పీడింపబడుట, జ్వరము, అతిసారము, అరుచి, అనెడి పదునొకండులక్షణములును కలుగును.

## సాధ్యాసాధ్యవిచారణ

మూ॥ తత్రాపరిక్షీణమాంసశోణితో బలవానజాతారిష్టః సర్వైరపిశోషలిఙ్గైరుపద్రుతః సాధ్యో జ్ఞేయః బలవన్తోపచితో హి సహిష్ణుత్వాద్వ్యాధ్యౌషధబలస్య కామం బహులిఙ్గోఽప్యల్పలిఙ్గ ఏవ మన్తవ్యః. దుర్బలం త్వతిక్షీణమాంసశోణితమల్పలిఙ్గమప్యజాతారిష్టమపి బహులిఙ్గమేవ జాతారిష్టమేవ విద్యాత్, అసహత్వాద్వ్యాధ్యౌషధబలస్య, తం పరివర్జయేత్; క్షణేన హి ప్రాదుర్భవన్త్యరిష్టాని. అనిమిత్తశ్చారిష్టప్రాదుర్భావ ఇతి॥16॥

అ॥ యక్ష్మ సమస్తలక్షణములతో కూడియున్నను. రోగి క్షీణింపనిరక్తమాంసములుకలవాడుగను బలవంతుడుగను అరిష్టలక్షణములులేనివాడుగను నున్నచో, సాధ్యముగ నుండును. బలవర్ణయుక్తుడగురోగి వ్యాధియొక్కయు ఔషధముయొక్కయు బలమును సహింపగలడు. అందువలన సమస్తలక్షణములున్నను సుఖసాధ్యముగ నుండును. దుర్బలుడుగను క్షీణించినరక్తమాంసములుకలవాడుగను నున్నరోగి వ్యాధియొక్కయు ఔషధముయొక్కయు బలమును సహింపలేడు. అందువలన స్వల్పలక్షణములుఉండి అరిష్టలక్షణములు లేకున్నను వ్యాధి అసాధ్యముగనే యుండును. అరిష్టములు కారణములేకుండగనే క్షణకాలములో జనించును.

## అధ్యాయసంగ్రహము

మూ॥ సముత్థానం చ లిఙ్గం చ యః శోషస్యావబుధ్యతే।
పూర్వరూపం చ తత్త్వేన స రాజ్ఞః కర్తుమర్హతి ॥17॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే నిదానస్థానే శోషనిదానం నామ షష్ఠోఽధ్యాయః॥

అ॥ ఈ ఆధ్యాయమునందు యక్ష్మయొక్క హేతువులును, లక్షణములును, పూర్వరూపములును చెప్పబడినవి.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామకకృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితావ్యాఖ్యానమునందు శోషనిదానమనెడు షష్ఠాధ్యాయము సమాప్తము.

—0—

# సప్తమాధ్యాయము

మూ॥ అథాత ఉన్మాదనిదానం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట ఉన్మాదనిదానమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు అత్రేయుడు చెప్పెను.

## ఉన్మాదభేదములు

మూ॥ ఇహ ఖలు పఞ్చోన్మాదా భవన్తి; తద్యథా- వాతపిత్తకఫసన్నిపాతాగన్తునిమిత్తాః॥

అ॥ వాతోన్మాదము పిత్తోన్మాదము కఫోన్మాదము సన్నిపాతోన్మాదము ఆగంతుజోన్మాదము అని ఉన్మాదము అయిదువిధములుగ నుండును.

## దోషజోన్మాదకారణములు - సంప్రాప్తి

మూ॥ తత్ర దోషనిమిత్తాశ్చత్వారః పురుషాణామేవంవిధానాం క్షిప్రమభినిర్వర్తన్తే, తద్యథా-భీరూణాముపక్లిష్టసత్త్వానాము త్సన్నదోషాణాం చ సమలవికృతోపహితాన్యనుచితాన్యాహారజాతాని వైషమ్యాపయుక్తేనోపయోగవిధినోపయుఞ్జానానాం తన్త్రప్రయోగం వా విషమమాచరతామన్యాం వా చేష్టాం విషమాం సమాచరతామత్యుపక్షీణదేహానాం చ వ్యాధివేగసముద్భ్రమితానాముపహతమనసాం వా కామక్రోధలోభహర్షభయమోహాయాసశోకచిన్తోద్వేగాదిభిః పునరభిఘాతాభ్యాహతానాం వామనస్యుపహతే

**బుద్ధౌ చ పరిచలితాయామభ్యుదీర్ణా దోషాః పరికుపితా హృదయముపసృత్య మనోవహాని స్రోతాంస్యావృత్య జనయన్త్యున్మాదమ్ ॥3॥**

అ॥ దోషములవలన కలుగు నాలుగువిధములగు ఉన్మాదములు చెప్పబడుచున్నవి. భయపడినవారలకును సత్వగుణముక్షీణించినవారలకును వృద్ధిపొందినదోషములుకలవారలకును అపరిశుద్ధమైనట్టియు చెడినట్టియు అనుచితమైనట్టియు ఆహారమును విషమముగ సేవించువారలకును శరీరవర్తనమును గమనాది శరీరచేష్టలను విషమముగ నాచరించు వారలకును అధికముగకృశించిన శరీరముకలవారలకును బలమైనవ్యాధిచే వ్యాకులత చెందినవారలకును కామము కోపము లోభము సంతోషము భయము దుఃఖము చింత ఉద్రేకము వీనిచే చెడిన మనస్సుకలవారలకును అభిఘాతమునొందినవారలకును మనస్సు చెడి బుద్ధి చంచలమగును. ప్రకోపించినదోషములు అట్టిసమయమున హృదయమును పొంది మనోవహములగు స్రోతస్సులయందు వ్యాపించి ఉన్మాదమును కలుగచేయును.

### ఉన్మాదనిరూపణము

**మూ॥ ఉన్మాదం పునర్మనోబుద్ధిసంజ్ఞాజ్ఞానస్మృతిభక్తిశీలచేష్టాచారవిభ్రమం విద్యాత్ ॥4॥**

అ॥ మనస్సు బుద్ధి సంజ్ఞ జ్ఞానము జ్ఞాపకశక్తి కోరిక స్వభావము - చేయుపనులు ఆచారము వీనియందు వ్యత్యాసముకలుగుటయే ఉన్మాద మనబడును.

### ఉన్మాదపూర్వరూపములు

**మూ॥ తస్యేమాని పూర్వరూపాణి; తద్యథా-శిరసః శూన్యభావః చక్షుషోరాకులతా స్వనః కర్ణయోరుచ్ఛ్వాసస్యాధిక్యమాస్యసంస్రవణమనన్నాభిలాషోఽరోచకావిపాకౌ హృదయగ్రహో ధ్యానాయాససంమోహోద్వేగాశ్చాస్థానే సతతం లోమహర్షో జ్వరశ్చాభీక్ష్ణమున్మత్తచిత్తత్వముదర్దితత్వమర్దితాకృతికరణం చ వ్యాధేః స్వప్నే చ దర్శనమభీక్ష్ణం భ్రాన్తచలితానవస్థితానాం చ రూపాణామప్రశస్తానాం తిలపీడకచక్రాధిరోహణం వాతకుణ్డలికాభిశ్చోన్మథనం నిమజ్జనం కలుషాణామమ్భసామావర్తేషు చక్షుషోశ్చాపసర్పణమితి దోషనిమిత్తానామున్మాదానాం పూర్వరూపాణి భవన్తి ॥ తతోఽనన్తరమున్మాదాభినిర్వృత్తిః॥**

అ॥ శిరస్సు శూన్యముగనుండుట, నేత్రములు కలకబారుట, చెవులయందు ధ్వని కలుగుట, ఉచ్ఛ్వాసమధికమగుట, నోటినుండి నీరుకారుట, ఆహారమునందిష్టము లేకపోవుట, అరుచి, ఆహారము జీర్ణముకాకుండుట, హృదయము బిగపట్టుట, ధ్యానము ఆయాసము మోహము ఉద్రేకము ఇవి అకస్మాత్తుగ కలుగుచుండుట, ఎల్ల

ష్పుడును-రోమములు గగుర్పొడుచుట, జ్వరము, మనస్సు చలించుట, ఊర్ధ్వభాగము నందు బాధ, అర్దితవాతము కలవానివలె వికారములను చేయుట, భ్రమించుచున్నట్టియు చలించుచున్నట్టియు అస్థిరములైనట్టియు అప్రశస్తములైనట్టియు రూపములను చూచినట్లును నూనెగానుగను ఎక్కినట్లును స్వప్నముగాంచుట, వాతకుండలిక అను మూత్రవ్యాధిచే పీడింపబడుట, మురికినీటియందు మునిగినట్లు స్వప్నముగాంచుట, నేత్రములు తిరుగుచుండుట ఇవి దోషజోన్మాదములకు పూర్వరూపములుగనుండును. పిమ్మట ఉన్మాదము లేర్పడును.

## వాతోన్మాదలక్షణములు

మూ॥ తత్రేదమున్మాదవిజ్ఞానం భవతి; తద్యథా-పరిసర్పణమక్షిభ్రువోష్ఠాంసహనుహస్తపాదవిక్షేపణమకస్మాత్, అనియతానాం చ సతతం గిరాము త్సర్గః, ఫేనాగమనమాస్యాత్, స్మితహసితనృత్యగీతవాదిత్రాదిప్రయోగాశ్చాస్థానే, వీణావంశశఙ్ఖశమ్యాతాలశబ్దానుకరణమసామ్నా, యానమయానైః, అలఙ్కరణమనలఙ్కారికైర్ద్రవ్యైః, లోభోఽభ్యవహార్యేష్వలబ్ధేషు, లబ్ధేషు చావమానస్తీవ్రం మాత్సర్యం, కార్శ్యం పారుష్యం, ఉత్పిణ్డితారుణాక్షతా, వాతోపశయవిపర్యాసాదనుపశయతా చేతి వాతోన్మాదలిఙ్గాని భవన్తి ॥6॥

అ॥ నేత్రములు కనుబొమలు వీనిని త్రిప్పుట, పెదవులు భుజశిరస్సులు హనువులు హస్తములు పాదములు వీనిని అకస్మాత్తుగ ఎగురవేయుట, అసందర్భముగ మాట్లాడుట, నోటినుండి నురుగువచ్చుట, చిరునవ్వు నవ్వు నృత్యము గానము వాద్యము వీనిని అనవసరముగ చేయుట, వీణ పిల్లనగ్రోవి శంఖము శమ్యఅనువాద్య విశేషము తాళము వీనియొక్క శబ్దములవంటి శబ్దమును బిగ్గరగ చేయుట, ఎక్కగూడని జంతువుల నెక్కి స్వారిచేయుట. అలంకారమునకుపయోగింపని ద్రవ్యములచే అలంకరించుకొనుట, పొందశక్యముకాని కోరికలను కోరుట, తనకున్న పదార్థములయందు ఇష్టములేకుండుట, మాత్సర్యము కృశత్వము పరుషత్వము ఇవి అధికముగ కలుగుట, నేత్రములు కలకబారి ఎర్రగనుండుట, వాతమునుశమింపచేయువానిచే శమించుట, వాతమును వృద్ధినొందించువానిచే వృద్ధినొందుట ఇవి వాతోన్మాదలక్షణములుగ నుండును.

## పిత్తోన్మాదలక్షణములు

మూ॥ అమర్షక్రోధసంరమ్భాశ్చాస్థానే, శస్త్రలోష్టకాష్ఠముష్టిభిరభిహననం స్వేషాం పరేషాం వా అభిద్రవణం, ప్రచ్ఛాయశీతోదకాన్నాభిలాషా, సంతాపోఽతివేలం, తామ్రహరితహారిద్రసంరబ్ధాక్షతా, పిత్తోపశయవిపర్యాసాదనుపశయతా చేతి పిత్తోన్మాదలిఙ్గాని భవన్తి॥

అ॥ అసహనము కోపము ఆర్భాటము ఇవి అనవసరముగ కలుగుట, శస్త్రములు రాళ్ళు కఱ్ఱలు పిడికిళ్ళు వీనిచే తనను గాని ఇతరులను గాని కొట్టుట, ఇతరులను తరుముట, చల్లనివియగు నీడ ఉదకము అన్నము వీనియందు ఇష్టముకలిగియుండుట, మిక్కిలి సంతాపము కలుగుట, నేత్రములు తామ్రవర్ణముగ గాని పచ్చగ గాని పసుపుపచ్చగ గాని క్రోధయుక్తములుగ గాని యుండుట, పిత్తమును శమింపచేయువానిచే శమించుట, పిత్తమును వృద్ధినొందించువానిచే వృద్ధినొందుట ఇవి పిత్తోన్మాదలక్షణములుగ నుండును.

## శ్లేష్మోన్మాదలక్షణములు.

మూ॥ స్థానమేకదేశే, తూష్ణీంభావో, అల్పశశ్చఙ్క్రమణం, లాలాశిఙ్ఘాణకప్రస్రవణం, అనన్నాభిలాషో, రహస్కామతా, బీభత్సత్వం, శౌచద్వేషః, స్వప్ననిత్యతా, శ్వయథురాననే, శుక్లస్తిమితమలోపదిగ్ధాక్షతా, శ్లేష్మోపశయవిపర్యాసాదనుపశయతా చేతి శ్లేష్మోన్మాదలిఙ్గాని భవన్తి ॥8॥

అ॥ ఒకప్రదేశమునందే కూర్చొనుట, మాట్లాడకుండుట, కొంచెముగతిరుగుట, చొల్లు చీమిడి ఇవి కారుచుండుట, ఆహారమునం దిష్టము లేకపోవుట, ఏకాంత ప్రదేశమునం దిష్టముకలుగుట, ఆకారము భయంకరముగ నుండుట, నిద్ర అధికముగ నుండుట, ముఖము ఉబ్బుట, నేత్రములు తెల్లగను మొద్దుగను మలయుక్తముగను నుండుట, శ్లేష్మమును శమింపచేయువానిచే శమించుట, శ్లేష్మమును వృద్ధినొందించువానిచే వృద్ధినొందుట ఇవి శ్లేష్మోన్మాదలక్షణములుగ నుండును.

## సన్నిపాతోన్మాదలక్షణములు.

మూ॥ త్రిదోషలిఙ్గసన్నిపాతే తు సాన్నిపాతికం విద్యాత్, తమసాధ్యమిత్యాచక్షతే కుశలాః ॥9॥

అ॥ మూడుదోషములయొక్కయు లక్షణములున్నచో సన్నిపాతోన్మాదమునుగ తెలిసికొనవలయును. ఇది అసాధ్యముగ నుండును.

## దోషజోన్మాదచికిత్స.

మూ॥ సాధ్యానాం తు త్రయాణాం సాధనాని భవన్తి; తద్యథా --స్నేహస్వేదవమనవిరేచనాస్థాపనానువాసనోపశమననస్యకర్మధూపధూమపానాఞ్జనావపీడప్రధమనాభ్యఙ్గప్రదేహపరిషేకానులేపనవధబన్ధనావరోధనవిత్రాసనవిస్మాపనవిస్మారణాపతర్పణసిరావ్యధనాని భోజనవిధానం చ యథాస్వం యుక్త్యా,యచ్చాన్యదపికించిన్నిదానవిపరీతమౌషధం కార్యం తత్స్యాదితి ॥శ్లో॥ ఉన్మాదాన్ దోషజాన్

సాధ్యాన్ సాధయేద్భిషగుత్తమః । అనేన విధియుక్తేన కర్మణా యత్ప్రికీర్తితమ్ ॥11॥

అ॥ స్నేహకర్మ, స్వేదకర్మ వమనము, విరేచనము, నిరూహవస్తి, అనువాసన వస్తి, ఉపశమనము, నస్యకర్మ, ధూపము, ధూమపానము, అంజనము, అవపీడననస్యము, ప్రధమననస్యము, అభ్యంగము, ప్రదేహము, పరిషేకము, వేపనము, కొట్టుట, కట్టివేయుట, నిర్బంధమునందుంచుట, భయపెట్టుట, విస్మయమును కలుగజేయుట, మరచిపోవునట్లుచేయుట, లంఘనము, రక్తమోక్షము, తగు ఆహారమునిచ్చుట, ఉన్మాద కారణములకు వ్యతిరేకములగు ఔషధముల నిచ్చుట అనునివి సాధ్యములగు మూడు విధములైన ఉన్మాదములకు చికిత్సలుగ నుండును. ఇట్టివిధానముచే సాధ్యములగు ఉన్మాదములను చికిత్సింపవలయును.

## ఆగంతుకోన్మాదముయొక్క ఉత్పత్తి.

మూ॥ యస్తు దోషనిమిత్తేభ్య ఉన్మాదేభ్యః సముత్థాన పూర్వరూపలిఙ్గవేదనోపశయవిశేషసమన్వితో భవత్యున్మాదస్తమాగన్తుమాచక్షతే, కేచిత్పునః పూర్వకృతం కర్మాప్రశస్తమిచ్ఛన్తి తస్య నిమిత్తం, ప్రజ్ఞాపరాధ ఏవేతి భగవాన్పునర్వసురాత్రేయ ఉవాచ, ప్రజ్ఞాపరాధాద్ధ్యయం దేవర్షిపితృగన్ధర్వయక్షరాక్షస పిశాచగురువృద్ధసిద్ధాచార్యపూజ్యానవమత్యాహితాన్యాచరతి అన్యద్వా కించిత్కర్మాప్రశస్తమారభతే, తమాత్మనా హతముపఘ్నన్తో దేవాః కుర్వన్త్యున్మత్తమ్ ॥12॥

అ॥ దోషజోన్మాదములకంటె భిన్నములగు హేతువులును పూర్వరూపములును లక్షణములును బాధలును ఉపశయమును కలది ఆగంతుకోన్మాదముగ చెప్పబడును. ఈ ఆగంతుకోన్మాదమునకు పూర్వకృతపాపకర్మ కారణమని కొందరును, ప్రజ్ఞాపరాధము కారణమని ఆత్రేయుడును చెప్పిరి. ప్రజ్ఞాపరాధమువలన దేవతలు ఋషులు పితృదేవతలు గంధర్వులు యక్షులు రాక్షసులు పిశాచములు గురువులు వృద్ధులు సిద్ధులు, ఆచార్యులు పూజ్యులు వీరలను అవమానపరచి అహితములగు పనులనుచేయుటవలన లేక ఇట్టిఅప్రశస్తములగు ఇతరపనులను చేయుటవలన దేవతలు ఋషులు మొదలగువారు వానిని ఆవేశించి ఉన్మాదమును కలిగించెదరు.

## ఆగంతుకోన్మాదపూర్వరూపములు.

మూ॥ తత్ర దేవాదిప్రకోపనిమిత్తేనాగన్తుకోన్మాదేన పురస్కృతస్యేమాని పూర్వరూపాణి భవన్తి; తద్యథా = దేవగోబ్రాహ్మణతపస్వినాం హింసారుచిత్వం కోపనత్వం నృశంసాభిప్రాయతా అరతిరోజోవర్ణచ్ఛాయాబలవపుషాముపతప్తిః స్వప్నే చ దేవాదిభి

రభిభర్త్సనం ప్రవర్తనం చేత్యాగన్తునిమిత్తస్యోన్మాదస్య పూర్వ రూపాణి భవన్తి; తతోఽనన్తరమున్మాదాభినిర్వృత్తిః ॥13॥

అ॥ దేవతలను గోవులను బ్రాహ్మణులను తపశ్శాలురను హింసించుటయందు కోరిక, కోపస్వభావము, పరులను హింసించుటయందు కోరిక, దేనియందును ఇష్టములేక పోవుట, ఓజస్సు వర్ణము కాంతి బలము శరీరము ఇవి కృశించుట, స్వప్నమునందు దేవాదులచే భయపెట్టబడుట ప్రేరణచేయబడుట అనునవి ఆగంతుకోన్మాదమునకు పూర్వరూపములుగ నుండును. పిమ్మట ఉన్మాదము ఏర్పడును.

### దేవతాదులు ఉన్మాదమును కలిగించు విధము

మూ॥ తత్రాయమున్మాదకరాణాం భూతానామున్మాదయిష్యతా మారమ్భవిశేషః; తద్యథా-అవలోకయన్తో దేవా జనయన్త్యున్మాదం, గురువృద్ధసిద్ధర్షయోఽభిశపన్తః, పితరో ధర్షయన్తః,స్పృశన్తో గన్ధర్వాః, సమావిశన్తో యక్షాః, రాక్షసాస్త్వాత్మగన్ధమాఘ్రాపయన్తః, పిశాచాః పునరధిరుహ్య వాహయన్తః ॥14॥

అ॥ చూచుటవలన దేవతలును, శపించుటవలన గురువులు వృద్ధులు సిద్ధులు ఋషులును, భయపెట్టుటవలన పితృదేవతలును, స్పృశించుటవలన గంధర్వులును, ఆవేశించుటవలన యక్షులును, చెడువాసనను ఆఘ్రాణింప చేయుటవలన రాక్షసులును, అధిష్ఠించియుండుటవలన పిశాచములును ఉన్మాదమును కలిగించును.

### ఆగంతుకోన్మాదలక్షణములు

మూ॥ తస్యేమాని రూపాణి భవన్తి; తద్యథా-అమర్త్యబలవీర్యపౌరుషపరాక్రమగ్రహణధారణస్మరణజ్ఞానవచనవిజ్ఞానాని, అనియతశ్చోన్మాదకాలః ॥15॥

అ॥ బలము వీర్యము పౌరుషము పరాక్రమము గ్రహణశక్తి ధారణశక్తి స్మరణశక్తి జ్ఞానము మాటలాడుట విజ్ఞానము ఇవి మనుష్యశక్తిని అతిక్రమించియుండుట, ఉన్మాదకాలము నియమముగ లేకుండుట ఇవి ఆగంతుకోన్మాదలక్షణములుగనుండును.

### దేవాద్యావేశకాలము

మూ॥ ఉన్మాదయిష్యతామపి ఖలు దేవర్షిపితృగన్ధర్వయక్షరాక్షసపిశాచానాం గురువృద్ధసిద్ధానాం వా ఏష్వన్తరేష్వభిగమనీయాః పురుషా భవన్తి; తద్యథా-పాపస్య కర్మణః సమారమ్భే, పూర్వకృతస్య వా కర్మణః పరిణామకాలే, ఏకస్య వా శూన్యగృహవాసే, చతుష్పథాధిష్ఠానే వా, సన్ధ్యావేలాయాం, అప్రయతభావే వా,

పర్వసన్ధిషు వా, మిథునీభావే, రజస్వలాభిగమనే వా, విగుణే వాఽ ధ్యయనబలిమఙ్గలహోమప్రయోగే, నియమవ్రతబ్రహ్మచర్యభఙ్గే వా, మహాహవే వా, దేశకులపురవినాశే వా, మహాగ్రహోపగమనే వా స్త్రియా వా ప్రజననకాలే, వివిధభూతాశుభాశుచిస్పర్శనే వా, వమనవిరేచనరుధిరస్రావాశుచేః, అప్రియతస్య వా చైత్యదేవాయతనాభిగమనే వా, మాంసమధుతిలగుడమద్యోచ్ఛిష్టే వా, దిగ్వాససివా, నిశి నగరనిగమచతుష్పథోపవనశ్మశానాఘాతనాభిగమనేవా, ద్విజగురుసురపూజ్యాభిధర్షణే వా,ధర్మాఖ్యానవ్యతిక్రమే వా,అన్యస్య కర్మణోఽప్రశస్తస్యారమ్భే వేత్యాఘాతాః కాలావ్యాఖ్యాతాభవన్తి॥

అ॥ పాపకర్మచేయునపుడును, పూర్వకృతకర్మయొక్క పరిణామకాలమందును, శూన్యగృహమునందు ఒక్కడే ఉండునపుడును, నాలుగుత్రోవలుకలియు చోటనుండునపుడును, సంధ్యవేళలయందును, పనిలేనిసమయమునందును, పర్వదినములయందు మైథునము చేసినపుడును, రజస్వలయైనస్త్రీతోరమించునపుడును, అధ్యయనము బలిదానము మంగళకృత్యములు హోమము వీనియందు వ్యత్యాసము కలిగినపుడును, నియమములు వ్రతములు బ్రహ్మచర్యము వీనికి భంగముకలిగినప్పుడు, యుద్ధసమయమునందును, దేశము కులము పట్టణము ఇవి నశించుసమయమునందును, గొప్పగ్రహములు పుట్టినప్పుడును, స్త్రీలు ప్రసవించుకాలమునందును, అమంగళములైనట్టియు మలినములైనట్టియు అనేకవిధములగువానిని స్పృశించినప్పుడును, వమనము విరేచనమురక్తమోక్షణము వీనిని ఆచరించుకాలమునందును, అపవిత్రుడుగనుండి సమయముకానిసమయమునందు చైత్యవృక్షము దేవాలయము వీనికిసమీపమునకు వెళ్ళినపుడును, మాంసము తేనె నూనె బెల్లము మద్యము ఉచ్ఛిష్టపదార్థములు వీనిని సేవించినపుడును, దిగంబరుడుగనున్నపుడును, పట్టణములు పల్లెలు నాలుగుత్రోవలుకలియుప్రదేశములు ఉద్యానవనములు శ్మశానములు వధ్యస్థానము వీనియందు రాత్రిసమయమున ఏకాంతముగ సంచరించునపుడును, బ్రాహ్మణులు,గురువులు దేవతలు పూజ్యులు వీరిని తిరస్కరించినపుడును అధర్మముగ ప్రవర్తించునపుడును, ఇట్టిఅప్రశస్తములగు ఇతరకర్మలను ఆచరించినపుడును దేవతలు ఋషులు మొదలగు వారుఆవేశించి ఉన్మాదమును కలుగ జేయుదురు.

**ఉన్మాదమునుకలిగించుటవలన భూతములకుకలుగు ప్రయోజనము.**

మూ॥ త్రివిధం తు ఖలూన్మాదకరాణాం భూతానామున్మాదనేప్రయోజనం భవతి। తద్యథా-హింసా, రతిః,అభ్యర్చనం చేతి। తేషాం తత్ప్రయోజనమున్మత్తాచారవిశేషలక్షణైర్విద్యాత్ । తత్ర హింసార్థమున్మాద్యమనోఽగ్నిం ప్రవిశత్యప్సు వా నిమజ్జతి, స్థలాచ్ఛ్వభ్రే వా నిపతతి, శస్త్రకశాకాష్ఠలోష్టముష్టిభిర్హన్త్యాత్మాన

**మన్యచ్చ ప్రాణివధార్థమారభతే కించిత్, తమసాధ్యం విద్యాత్, సాధ్యౌ పునర్ద్వావితరౌ ॥17॥**

అ॥ ఉన్మాదము కలిగించుటవలన భూతములకు, హింసించుట క్రీడించుట పూజించుట అను మూడువిధములగు ప్రయోజనము కలుగును. ఉన్మాదముకలవాని యొక్క ఆచారమునుబట్టియు విశేషలక్షణములనుబట్టియు భూతప్రయోజనమును తెలిసికొనవచ్చును. అగ్నియందు ప్రవేశించుట, నీటియందు మునుగుట, ఎత్తునుండి పడుట, శస్త్రములు కొరడాకఱ్ఱలు కఱ్ఱలు రాళ్ళు పిడికిళ్ళు వీనిచే తననుకొట్టుకొనుట, ప్రాణములనుతీసికొనుటకు ప్రయత్నించుట ఇట్టిలక్షణములు హింసించునుద్దేశముతో కలుగచేయబడిన ఉన్మాదమునందు ఉండును. ఇది అసాధ్యముగ నుండును. ఇతరము లగురెండును సాధ్యములుగ నుండును.

## ఆగంతుకోన్మాదచికిత్స

మూ॥ **తయోః సాధనాని—మన్త్రౌషధిమణిమఙ్గలబల్యుపహార హోమనియమవ్రతప్రాయశ్చిత్తోపవాసస్వస్త్యయనప్రణిపాతగమనాదీనీతి! ఏవమేతే పఞ్చోన్మాదా వ్యాఖ్యాతా భవన్తి ॥18॥**

అ॥ మంత్రములు, ఓషధులు, మణులు, మంగళకర్మ, బలిదానము, భోజనములు పెట్టుట, హోమము, నియమములు, వ్రతములు, ప్రాయశ్చిత్తము, ఉపవాసములు, శాంతికర్మ, నమస్కారములు, తీర్థయాత్రలు ఇవి సాధ్యములగు ఆగంతుకోన్మాదము లకు చికిత్సలుగ నుండును. ఇట్లు అయిదువిధములగు ఉన్మాదములు చెప్పబడినవి.

మూ॥ **తే తు ఖలు నిజాగన్తువిశేషేణ సాధ్యాసాధ్యవిశేషేణ చ ప్రవిభజ్యమానాః పఞ్చసన్తో ద్వావేవ భవతః; తౌ పరస్పరమను బధ్నీతః కదాచిద్యథోక్తహేతుసంసర్గాదుభయోః సంసృష్టమేవ పూర్వరూపం భవతి, సంసృష్టమేవ లిఙ్గం చ। తత్రాసాధ్యసంయోగం సాధ్యాసాధ్యసంయోగం, వాఽసాధ్యం విద్యాత్; సాధ్యం తు సాధ్యసంయోగం, తస్యసాధనం సాధనసంయోగమేవవిద్యాదితి।19॥**

అ॥ ఉన్మాదములు అయిదువిధములుగనున్నను నిజాగంతుభేదముచేతను సాధ్యాసాధ్యభేదముచేతను విభజింపబడి రెండేసివిధములుగ నగును. ఆరెండువిధములును పరస్పరము ఒక్కొక్కప్పుడు కలియుచుండును. రెండింటియొక్క హేతువులు కలియుటవలన రెండింటియొక్క పూర్వరూపములును లక్షణములును కలుగును. అసాధ్యములురెండు కలిసినను సాధ్యాసాధ్యములు కలిసినను అసాధ్యముగ నుండును. సాధ్యములు కలిసినచో సాధ్యముగనే యుండును. అట్టిదానికి రెండింటియొక్క చికిత్సలు చేయవలయును,

మూ॥ నైవ దేవా న గన్ధర్వా న పిశాచా న రాక్షసాః న చాన్యే స్వయమక్లిష్టముపక్లిశ్యన్తిమానవమ్॥ యే త్వేనమనువర్తన్తే క్లిశ్యమానం స్వకర్మణా । న తన్నిమిత్తః క్లేశోఽసౌ న హ్యస్తికృతకృత్యతా॥ ప్రజ్ఞాపరాధాత్తంప్రాప్తే వ్యాధౌ కర్మజ ఆత్మనః । నాభిశంసేద్బుధో దేవాన్న పితౄన్నాపిరాక్షసాన్॥ఆత్మానమేవ మన్యేత కర్తారం సుఖదుఃఖయోః। తస్మాచ్ఛ్రేయస్కరం మార్గం ప్రతిపద్యేత నో త్రసేత్॥ దేవాదీనామపచితిర్హితానాం చోపసేవనమ్ । తే చ తేభ్యో విరోధశ్చ సర్వమాయత్తమాత్మని॥24॥

అ॥ దేవతలు గంధర్వులు పిశాచములు రాక్షసులు మొదలగువారు పాపరహితుడగు మానవుని పీడింపరు. చేయబడినది మరల చేయబడదు. కావున తనకర్మచే పీడింపబడుచున్న మనుజుని దేవతాదులు ఆవేశించినను అట్టిపీడకు వారిని కారణముగ నెంచకూడదు. స్వకర్మఫలమగు వ్యాధి ప్రజ్ఞాపరాధమువలన కలిగియుండగా దేవతలు మొదలగువారిని బుద్ధిమంతుడగు మనుజుడు నిందింపకూడదు. తనసుఖదుఃఖములకు తననే కర్తనుగ తలపవలయును. కావున శ్రేయస్కరమగు మార్గమునే అవలంబింపవలయును. భయపడనవసరములేదు. దేవతలు మొదలగువారినిపూజించుట, హితములగువారిని సేవించుట, దేవతలు మొదలగువారితో విరోధించుట మొదలగునవన్నియు తనయందే అధీనమై యుండును.

## అధ్యాయసంగ్రహము

మూ॥ సంఖ్యా నిమిత్తం ప్రాగ్రూపం లక్షణం సాధ్యతా న చ। ఉన్మాదానాం నిదానేఽస్మిన్ క్రియాసూత్రం చ భాషితమ్ ॥25॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే నిదానస్థానే ఉన్మాదనిదానం నామ సప్తమోఽధ్యాయః॥

అ॥ ఈఅధ్యాయమునందు ఉన్మాదములయొక్క సంఖ్య కారణములు పూర్వరూపములు లక్షణములు సాధ్యాసాధ్యములు చికిత్సాసంగ్రహము ఇవి చెప్పబడినవి.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామక కృష్ణమూర్తి శాస్త్రి ప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితావ్యాఖ్యానమునందు ఉన్మాదనిదానమనెడు సప్తమాధ్యాయము సమాప్తము.

# అష్టమాధ్యాయము.

మూ॥ అథాతోఽపస్మారనిదానం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట అపస్మారనిదానమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

## అపస్మారభేదములు

మూ॥ ఇహ ఖలు చత్వారోఽపస్మారా భవన్తి వాతపిత్తకఫసన్నిపాతనిమిత్తాః ॥3॥

అ॥ వాతాపస్మారము పిత్తాపస్మారము కఫాపస్మారము సన్నిపాతాపస్మారము అని అపస్మారము నాలుగువిధములుగ నుండును.

## అపస్మారముయొక్క నిదానము-సంప్రాప్తి

మూ॥ త ఏవంవిధానాం ప్రాణభృతాం క్షిప్రమభినిర్వర్తన్తే, తద్యథా - రజస్తమోభ్యాముపహతచేతసాముద్భ్రాన్తవిషమబహుదోషాణాం సమలవికృతోపహితాన్యశుచీన్యభ్యవహారజాతాని వైషమ్యయుక్తేనోపయోగవిధినోపయుఞ్జానానాం తన్త్రప్రయోగమపిచవిషమమాచరతామన్యాశ్చ శరీరచేష్టావిషమాః సమాచరతామత్యుపక్షీణదేహానాం వా దోషాః ప్రకుపితా రజస్తమోభ్యాముపహతచేతసామన్తరాత్మనః శ్రేష్ఠతమమాయతనం హృదయముపసృత్య పర్యవతిష్ఠన్తే తథేన్ద్రియాయతనాని;తత్రచావస్థితాః సన్తోయదాహృదయమిన్ద్రియాయతనాని చేరితాః కామక్రోధభయలోభమోహహర్షశోకచిన్తోద్వేగాదిభిర్భూయఃసహసాఽభిపూరయన్తి, తదా జన్తురపస్మరతి॥

అ॥ రజస్తమోగుణములచే మనస్సు చెడుట, ఇతరమార్గములనుపొందినవియు విషమములైనవియు నగు అధికదోషములను కలిగియుండుట, మలినముగనున్నట్టియు చెడిపోయినట్టియు అశుచిగనున్నట్టియు ఆహారమును విషమముగ నుపయోగించుట, శరీరవర్తనమును విషమముగనాచరించుట, శరీరకృత్యములను విషమముగనాచరించుట, శరీరము మిక్కిలి క్షీణించియుండుట వీనివలనప్రకోపించిన దోషములు ఆత్మకు ముఖ్యస్థానమగు హృదయమును ఇంద్రియస్థానములను పొంది కామము, కోపము, భయము, లోభము, మోహము, సంతోషము, దుఃఖము, చింత, ఉద్రేకము మొదలగువానిచే

హృదయమును ఇంద్రియస్థానములను వెంటనే చేరచును. అప్పుడు మనుజుడు అపస్మారముకలవాడగును.

### అపస్మారనిరూపణము

మూ॥ అపస్మారం పునః స్మృతిబుద్ధిసత్త్వసంప్లవాద్బీభత్సచేష్టమావస్థికం తమఃప్రవేశమాచక్షతే ॥5॥

॥అ॥ జ్ఞాపకశక్తి, బుద్ధి, సత్త్వగుణము ఇవి చెడుటవలన భయంకరమగు చేష్టలు కలిగి నిలుకడలేకుండ తమస్సుప్రవేశించుచుండుటయే అపస్మార మనబడును.

### అపస్మారపూర్వరూపములు

మూ॥ తస్యేమాని పూర్వరూపాణి భవన్తి; తద్యథా - భ్రూవ్యుదాసః సతతమక్ష్ణోర్వైకృతమశబ్దశ్రవణం లాలాశిఙ్ఘాణకప్రస్రవణమనన్నాభిలషణమరోచకావిపాకౌ హృదయగ్రహః కుక్షేరాటోపో దౌర్బల్యమఙ్గమర్దో మోహస్తమసో దర్శనం మూర్ఛా భ్రమశ్చాభీక్ష్ణం చ స్వప్నే మదనర్తనపీడనవేపథువ్యథనవ్యధనపతనాదీన్యపస్మారపూర్వరూపాణి భవన్తి; తతోఽనన్తరమపస్మారాభినిర్వృత్తిరేవ ॥6॥

అ॥ కనుబొమ్మలు ముడిచికొనియుండుట, ఎల్లప్పుడును నేత్రములు వికారములుగ నుండుట, శబ్దము వినపడకపోవుట, చొల్లుకారుట, చీమిడికారుచుండుట, ఆహారమునందు ఇష్టములేకపోవుట, అరుచి, ఆహారముజీర్ణముకాకుండుట, హృదయము బిగపట్టుట, కుక్షియందు ఆటోపము, దుర్బలత్వము, ఒడలునొప్పులు, మోహము, చీకట్లు క్రమ్ముట, మూర్ఛ, భ్రమ, మత్తును నృత్యమును పీడయు వణకును దుఃఖమును బాధపడుటయు మొదలగునవి నిద్రయందు కలుగుట ఇవి అపస్మారమునకు పూర్వరూపములుగ నుండును. అటుపిమ్మట అపస్మారము ఏర్పడును.

### వాతాపస్మారలక్షణములు

మూ॥ తత్రేదమపస్మారవిశేషవిజ్ఞానం భవతి; తద్యథా - అభీక్ష్ణమపస్మరన్తం క్షణే క్షణే సంజ్ఞాం ప్రతిలభమానముత్పిణ్డితాక్షమసామ్నా విలపన్తముద్వమన్తం ఫేనమతీవాధ్మాతగ్రీవమావిద్ధశిరస్కంవిషమవినతాఙ్గులికమనవస్థితసక్థి పాణిపాదమరుణపరుషశ్యావనఖనయనవదనత్వచమనవస్థితచపలపరుషరూక్షరూపదర్శినం వాతలానుపశయం విపరీతోపశయం వాతేనాపస్మరన్తం విద్యాత్ ॥7॥

అ॥ తలఁచు స్మృతితప్పుట, క్షణక్షణమున స్పృహవచ్చుట, నేత్రములు పిండాకారముగ నుండుట, బిగ్గరగ నేడ్చుట, నోటినుండి నురుగువచ్చుట, కంఠము ఉబ్బుట, శిరస్సు వంకరగ నుండుట, విషమములుగ వంచబడిన వేళ్ళుకలిగియుండుట, కాళ్ళు చేతులు పాదములు వీనిని వంకరగ నుంచుట, గోళ్ళు నేత్రములు ముఖము చర్మము ఇవి ఎఱ్ఱగను పరుషముగను శ్యామవర్ణముగను నుండుట, రూపములను నిలకడలేనివిగను చంచలములుగను పరుషములుగను రూక్షములుగను చూచుట, వాతవర్ధకములచే వృద్ధినొందుట, వానికివిపరీతములైనవానిచే శమించుట ఇవి వాతాపస్మారలక్షణములుగ నుండును.

## పిత్తాపస్మారలక్షణములు.

**మూ॥ అభీక్ష్ణమపస్మరన్తం క్షణే క్షణే సంజ్ఞాం ప్రతిలభమానమవకూజన్తమాస్ఫాలయన్తం చ భూమిం హరితహారిద్రతామ్రనఖనయనవదనత్వచం రుధిరోక్షితోగ్రభైరవప్రదీప్తరుషితరూపదర్శినం పిత్తలానుపశయం విపరీతోపశయం పిత్తేనాపస్మరన్తం విద్యాత్ ॥**

అ॥ తలఁచు స్మృతితప్పుట, క్షణక్షణమునకు స్పృహవచ్చుట, ధ్వనిచేయుచుండుట, భూమిని కొట్టుచుండుట, గోళ్ళు నేత్రములు ముఖము చర్మము ఇవి పచ్చగను పసుపుపచ్చగను తామ్రవర్ణముగను నుండుట, రూపములను రక్తముతో పూయబడినవిగను ఉగ్రములుగను భయంకరములుగను మండుచున్నవిగను కోపయుక్తములుగను చూచుట, పిత్తవర్ధకములచే వృద్ధినొందుట, వానికి విపరీతములైనవానిచే శమించుట ఇవి పిత్తాపస్మారలక్షణములుగ నుండును.

## శ్లేష్మాపస్మారలక్షణములు.

**మూ॥ చిరాదపస్మరన్తం చిరాచ్చ సంజ్ఞాం ప్రతిలభమానం పతన్తమనతివికృతచేష్టం లాలాముద్వమన్తం శుక్లనఖనయనవదనత్వచం శుక్లగురుస్నిగ్ధరూపదర్శినం శ్లేష్మలానుపశయం విపరీతోపశయం శ్లేష్మణాఽపస్మరితం విద్యాత్ ॥9॥**

అ॥ చిరకాలమునకు స్మృతితప్పుట, చిరకాలమునకు స్పృహవచ్చుట, పడిపోవుట, వికారచేష్టలు ఎక్కువగ లేకుండుట, చొల్లుకారుచుండుట, గోళ్ళు నేత్రములు ముఖము చర్మము ఇవి తెల్లగనుండుట, రూపములను తెల్లవిగను బరువుగను స్నిగ్ధములుగను చూచుట, శ్లేష్మవర్ధకములగువానిచే వృద్ధినొందుట, వానికి విపరీతములైనవానిచే శమించుట ఇవి శ్లేష్మాపస్మారలక్షణములుగ నుండును.

## సన్నిపాతాపస్మారలక్షణములు.

**మూ॥ సమవేతసర్వలిఙ్గమపస్మారం సాన్నిపాతికం విద్యాత్; తమసాధ్యమాచక్షతే । ఇతి చత్వారోఽపస్మారా వ్యాఖ్యాతాః॥10॥**

అ॥ మూడుదోషములయొక్క లక్షణములును ఉన్నచో సన్నిపాతాపస్మారము నుగ తెలిసికొనవలయును. ఇది అసాధ్యముగ నుండును, ఇట్లు, నాలుగువిధములగు అపస్మారములు చెప్పబడినవి.

## అపస్మారమునందు ఆగంతుసంబంధము.

మూ॥ తేషామాగన్తురనుబన్ధో భవత్యేవకదాచిత్, స ఉత్తర కాలముపదేక్ష్యతే । తస్య విశేషవిజ్ఞానం యథోక్తైర్లిఙ్గైర్లిఙ్గాధిక్య మదోషలిఙ్గానురూపం కించిత్ ॥11॥

అ॥ దోషజాపస్మారములకు ఒక్కొక్కప్పుడు ఆగంతుసంబంధము కలుగుచుండును. అది ముందు వివరింపబడును. ఇదివఱకు చెప్పబడిన లక్షణములు అధికముగ కనబడుట, ఇతరలక్షణములు కొన్నికనబడుట వీవనిలన ఆగంతుసంబంధమును తెలిసికొనవలయును.

## అపస్మారచికిత్సాసంగ్రహము.

మూ॥ హితాన్యపస్మారిభ్యస్తీక్ష్ణాని చైవ సంశోధనాన్యుపశమనాని యథాస్వం, మన్త్రాదీని చాగన్తుసంయోగే ॥12॥

అ॥ అపస్మారరోగులకు తీక్ష్ణములైన శోధనములును అనుకూలములైన ఉపశమనములును హితకరములుగ నుండును. అగంతుసంబంధముకల అపస్మారమునందు మంత్రాదులను ప్రయోగింపవలయును.

మూ॥ తస్మిన్ హి దక్షాధ్వరధ్వంసే దేహినాం నానాదిక్షు విద్రవతామతితరణప్లవనధావనలఙ్ఘనాద్యైర్దేహవిక్షోభనైః పురా గుల్మోత్పత్తిరభూత్, హవిష్ప్రాశాన్మేహకుష్ఠానాం, భయోత్త్రాసశోకైరున్మాదానాం, వివిధభూతాశుచిసంస్పర్శాదపస్మారాణాం, జ్వరస్తు ఖలు మహేశ్వరలలాటప్రభవః, తత్సంతాపాద్రక్తపిత్తం, అతివ్యవాయాత్పునర్నక్షత్రరాజస్య రాజయక్ష్మేతి ॥13॥

అ॥ పూర్వకాలమునందు దక్షయజ్ఞము ధ్వంసమైనప్పుడు నలుదిక్కులకును పారిపోయిన ప్రాణులకు-ఈదుట ఎగురుట పరుగెత్తుట దాటుట మొదలగు దేహక్షోభకరములచే గుల్మములును, హవిస్సును భుజించుటచే మేహములును కుష్ఠములును, భయము ఉద్వేగము దుఃఖము వీనిచే ఉన్మాదములును, అనేకవిధములైన అశుచిపదార్థములను స్పృశించుటచే అపస్మారములును, ఈశ్వరలలాటాగ్నిచే జ్వరమును, ఆజ్వరముయొక్క సంతాపముచే రక్తపిత్తమును, అధికమైథునముచే చంద్రునకు రాజయక్ష్మయు జనించెను.

మూ॥ అపస్మరతి వాతేనపిత్తేన చ కఫేన చ। చతుర్థః సన్నిపాతేన ప్రత్యాఖ్యేయస్తథావిధః॥ సాధ్యాంస్తు భిషజః ప్రాజ్ఞాః

సాధయన్తి సమాహితాః। తీక్ష్ణైః సంశోధనైశ్చైవ యథాస్వం శమనైరపి ॥ యదా దోషనిమిత్తస్య భవత్యాగన్తురన్వయః। తదా సాధారణం కర్మ ప్రవదన్తి భిషగ్వరాః ॥16॥

అ॥ వాతమువలనను పిత్తమువలనను కఫమువలనను సన్నిపాతమువలనను అపస్మారము జనించును. సన్నిపాతాపస్మారము అసాధ్యముగ నుండును. సాధ్యములగు ఇతరాపస్మారములను తీక్ష్ణములగు శోధనములచేతను అనుకూలములైన ఉపశమనములచేతను చికిత్సింపవలయును. దోషజాపస్మారమునందు ఆగంతుసంబంధ మున్నచో దోషనాశకచికిత్సను మంత్రాదులను ప్రయోగింపవలయును.

మూ॥ సర్వరోగవిశేషజ్ఞః సర్వౌషధవిశేషవిత్। భిషక్ సర్వామయాన్ హన్తి న చ మోహం సమృచ్ఛతి ॥17॥

అ॥ సమస్తవ్యాధులయొక్కయు సమస్తౌషధములయొక్కయు విశేషములను తెలిసిన వైద్యుడు భ్రాంతినొందక సమస్తవ్యాధులను నశింపజేయగలడు.

మూ॥ ఇత్యేతదఖిలేనోక్తం నిదానస్థానముత్తమమ్ ॥

అ॥ ఈవిధముగ ఉత్తమమైననిదానస్థానము చెప్పబడినది.

మూ॥ నిదానార్థకరో రోగో రోగస్యాప్యుపలక్ష్యతే। తద్యథా- జ్వరసంతాపాద్రక్తపిత్తముదీర్యతే॥ రక్తపిత్తాజ్జ్వరస్తాభ్యాం శోషశ్చాప్యుపజాయతే। ప్లీహాభివృద్ధ్యా జఠరం జఠరాచ్ఛోఫ ఏవ చ॥ అర్శోభ్యో జఠరం దుఃఖం గుల్మశ్చాప్యుపజాయతే। ప్రతిశ్యాయాదథో కాసః కాసాత్సంజాయతే క్షయః॥ క్షయో రోగస్య హేతుత్వే శోషస్యాప్యుపజాయతే। తే పూర్వం కేవలా రోగాః పశ్చాద్ధేత్వర్థకారిణః ॥ ఉభయార్థకరా దృష్టాస్తథైవైకార్థకారిణః। కశ్చిద్ధి రోగో రోగస్య హేతుర్భూత్వా ప్రశామ్యతి॥ న ప్రశామ్యతి చాప్యన్యో హేత్వర్థం కురుతేఽపిచ।ఏవం కృచ్ఛ్రతమా నృణాం దృశ్యన్తే వ్యాధిసఙ్కరాః। ప్రయోగాపరిశుద్ధత్వాత్తథా చాన్యోన్యసమ్భవాత్ ॥

అ॥ రోగముకూడ మఱియొకరోగమునకు హేతువుగ నుండవచ్చును. ఎటులననగా - జ్వరసంతాపమువలన రక్తపిత్తమును, రక్తపిత్తమువలన జ్వరమును, ఆరెండింటివలన శోషయు, ప్లీహాభివృద్ధివలన ఉదరవ్యాధియు, ఉదరవ్యాధివలన శోఫయు, అర్శస్సులవలన ఉదరవ్యాధియు గుల్మమును ప్రతిశ్యాయమువలన కాసయు, కాసవలన క్షయయు, క్షయవలన శోషయు జనించును. అవి మొదట కేవలరోగములుగనే యుండి పిదప ఇతరవ్యాధులను కలిగించును. కొన్నివ్యాధులు వ్యాధులుగనుండి ఇతర

వ్యాధులకు హేతువులుగకూడ నుండును. కొన్నివ్యాధులు ఇతరవ్యాధులకు హేతువులుగనే యుండును. కొన్నివ్యాధులు ఇతరవ్యాధులను కలిగించి పిదప శాంతించును. కొన్ని కలిగించినపిదప శాంతింపనేరవు. అపరిశుద్ధప్రయోగమువలనను ఒకదానివలన మరియొకటిపుట్టు స్వభావము కలవగుటవలనను కష్టసాధ్యములగు వ్యాధిసంకరములు ఏర్పడును.

## ప్రయోగద్వైవిధ్యము.

మూ॥ ప్రయోగః శమయేద్వ్యాధిం యోఽన్యమన్యముదీరయేత్ । నాసౌ విశుద్ధః శుద్ధస్తు శమయేద్యో న కోపయేత్ ॥25॥

అ॥ ఏప్రయోగము వ్యాధిని శమింపచేయుచు ఇతరమును ప్రకోపింపచేయునో అది అపరిశుద్ధప్రయోగ మనబడును. ఏది వ్యాధిని శమంపచేయుచు ఇతరమును ప్రకోపింపచేయదో అది పరిశుద్ధప్రయోగ మనబడును.

మూ॥ ఏకో హేతురనేకస్య తథైకస్యైక ఏవ హి । వ్యాధేరేకస్య చానేకో బహూనాం బహవోఽపి చ॥ జ్వరభ్రమప్రలాపాద్యా దృశ్యన్తే రూక్షహేతుజాః । రూక్షేణైకేన చాప్యేకో జ్వర ఏవోపజాయతే ॥ హేతుభిర్బహుభిశ్చైకో జ్వరో రూక్షాదిభిర్భవేత్ । రూక్షాదిభిర్జ్వరాద్యాశ్చ వ్యాధయః సమ్భవన్తి హి॥ లిఙ్గం చైకమనేకస్య తథైవైకస్య లక్ష్యతే । బహూన్యేకస్య చ వ్యాధేర్బహూనాం స్యుర్బహూని చ॥ విషమారమ్భమూలానాం లిఙ్గమేకం జ్వరో మతః । జ్వరస్యైకస్య చాప్యేకః సంతాపో లిఙ్గముచ్యతే ॥ విషమారమ్భమూలైశ్చ జ్వర ఏకో నిరుచ్యతే। లిఙ్గైరేతైర్జ్వరశ్వాసహిక్కాద్యాః సన్తి చామయాః॥ ఏకా శాన్తిరనేకస్య తథైవైకస్య లక్ష్యతే వ్యాధేరేకస్య చానేకో బహూనాం బహ్వ్య ఏవ చ ॥ శాన్తిరామాశయోత్థానాం వ్యాధీనాం లఙ్ఘనక్రియా । జ్వరస్యైకస్య చాఽప్యేకా శాన్తిర్లఙ్ఘనముచ్యతే॥ తథా లఘ్వశనాద్యాశ్చ జ్వరస్యైకస్యము శాన్తయః । ఏతాశ్చైవ జ్వరశ్వాసహిక్కాదీనాం ప్రశాన్తయః॥34॥

అ॥ అనేకవ్యాధులకు ఒకటేకారణముగ నుండవచ్చును. ఒకవ్యాధికి ఒక కారణ ముండవచ్చును. ఒకవ్యాధికి అనేకకారణము లుండవచ్చును. అనేకవ్యాధులకు అనేకకారణము లుండవచ్చును. రూక్షమువలన జ్వరము భ్రమ ప్రలాపము మొదలగు అనేకవ్యాధులు కలుగవచ్చును. ఒకరూక్షమువలననే జ్వరమొకటియే కలుగవచ్చును. రూక్షాద్యనేకహేతువులచే జ్వరమొక్కటి కలుగవచ్చును. రూక్షాద్యనేకహేతువులచే జ్వరము మొదలగు అనేకవ్యాధులుకూడ కలుగవచ్చును.అనేకవ్యాధులకు ఒకటేలక్షణ

ముండవచ్చును. ఒకవ్యాధికి ఒకలక్షణముండవచ్చును. ఒకవ్యాధికి అనేకలక్షణము లుండవచ్చును. అనేకవ్యాధులకు అనేకలక్షణములుండవచ్చును. విషమముగ నారంభించు వ్యాధులకన్నిటికిని జ్వరమొక్కటియే లక్షణముగనుండును. జ్వరమునకు సంతాప మొక్కటియే లక్షణముగనుండవచ్చును. జ్వరమునకు విషమముగనారంభించు అనేక లక్షణములుండవచ్చును. జ్వరము శ్వాస హిక్క మొదలగు అనేక వ్యాధులకు విషమముగ నారంభించు అనేకలక్షణము లుండవచ్చును. అనేక వ్యాధులకు ఒకటేచికిత్స ఉండవచ్చును. ఒకవ్యాధికి ఒకటే చికిత్స ఉండవచ్చును. ఒక వ్యాధికి అనేకచికిత్స లుండవచ్చును. అనేక వ్యాధులకు అనేకచికిత్స లుండవచ్చును. ఆమాశయమునందుపుట్టిన అనేకవిధములగు వ్యాధులకు లంఘనమొకటియె చికిత్సగ నుండవచ్చును. జ్వరమున కొక్కదానికి కూడ లంఘనమొక్కటియే చికిత్సగనుండ వచ్చును, జ్వరమునకొక్కదానికి లఘ్వాశనము మొదలగు అనేకచికిత్స లుండవచ్చును. ఇవియే జ్వరము శ్వాస హిక్క మొదలగు అనేకవ్యాధులకు చికిత్సగనుండవచ్చును.

## సాధ్యాసాధ్యయాప్యవిచారణ.

మూ॥ సుఖసాధ్యః సుఖోపాయః కాలేనాల్పేన సాధ్యతే। సాధ్యతే కృచ్ఛ్రసాధ్యస్తు యత్నేన మహతా చిరాత్ ॥ యాతి నాశేషతాం వ్యాధిరసాధ్యో యాప్యసంజ్ఞితః । పరోఽసాధ్యః క్రియాః సర్వాః ప్రత్యాఖ్యేయోఽతివర్తతే ॥ నాసాధ్యః సాధ్యతాం యాతి, సాధ్యో యాతి త్వసాధ్యతామ్ । పాదాపచారాద్దైవాద్వా యాన్తి భావాన్తరం గదాః ॥37॥

అ॥ సుఖసాధ్యమగువ్యాధి స్వల్పచికిత్సచే స్వల్పకాలముననే శాంతించును. కష్టసాధ్యమగువ్యాధి గొప్పప్రయత్నముచే చాలకాలమునకు శాంతించును. యాప్యవ్యాధి నిశ్శేషముగ శాంతింపదు. సమస్తక్రియలును నిరుపయోగములగును. కావున అసాధ్యవ్యాధిని చికిత్సింపనవసరములేదు. అసాధ్యవ్యాధి సాధ్యవ్యాధికానేరదు. సాధ్యవ్యాధి అసాధ్యవ్యాధిగ కావచ్చును. పాదచతుష్టయముయొక్క లోపమువలన గాని దైవవశమువలనగాని వ్యాధులు ఇతరభావములను పొందుచుండును.

మూ॥ వృద్ధిస్థానక్షయావస్థాం దోషాణాముపలక్షయేత్ । సుసూక్ష్మామపిచ ప్రాజ్ఞో దేహాగ్నిబలచేతసామ్ ॥ వ్యాధ్యవస్థావిశేషాన్హి జ్ఞాత్వా జ్ఞాత్వా విచక్షణః । తస్యాం తస్యామవస్థాయాం తత్తచ్ఛ్రేయః ప్రపద్యతే ॥39॥

అ॥ దోషములయొక్కయు దేహము జాఠరాగ్ని బలము మనస్సు వీని యొక్కయు అతిసూక్ష్మములగు వృద్ధి స్థానము క్షయము అను అవస్థలను, వ్యాధుల యొక్క అవస్థావిశేషములను తెలిసికొనిన వైద్యుడు అధికమగుశ్రేయస్సును పొందును,

తిర్యగ్గతదోషచికిత్స.

మూ॥ ప్రాయస్తిర్యగ్గతా దోషాః క్లేశయన్త్యాతురాంశ్చిరమ్ । తేషు న త్వరయా కుర్యాద్దేహాగ్నిబలవిత్క్రియామ్ ॥ ప్రయోగైః శమయేద్వా తాన్ సుఖం వా కోష్ఠమానయేత్ । జ్ఞాత్వా కోష్ఠ ప్రపన్నాంస్తాన్ యథాస్వం తం హరేద్బుధః ॥41॥

అ॥ తిర్యగ్గతములగు దోషములు రోగిని తరచుగ చాలకాలము పీడించును. అట్టి దోషములయందు శరీరము జాఠరాగ్ని బలము వీనిని గుర్తెరిగిన వైద్యుడు తొందరపడి చికిత్సలు చేయకూడదు. అట్టివానిని శమనచికిత్సలచే శమింపచేయవలయును. లేక కోష్ఠమును పొందింపవలయును. కోష్ఠమును పొందినపిమ్మట తగువిధమున బయలు వెడలింపవలయును.

మూ॥ జ్ఞానార్థం యాని చోక్తాని వ్యాధిలిఙ్గాని సంగ్రహే । వ్యాధయస్తే తదాత్వే తు లిఙ్గానీష్టాని నామయాః॥ వికారాః ప్రకృతిశ్చైవ ద్వయం సర్వం సమాసతః । తద్ధేతువశగం హేతోరభావాన్న ప్రవర్తతే ॥43॥

అ॥ ఈనిదానస్థానమునందు వ్యాధిజ్ఞానముకొఱకు లక్షణములుగ చెప్పబడిన వ్యాధులు లక్షణములుగనే యుండునుగాని ప్రత్యేకవ్యాధులుగ నుండవు. వైషమ్యము సమత్వము ఈ రెండును హేతువులననుసరించి యుండును. హేతువులు లేనిచో అవి ఉండనేరవు.

అధ్యాయసంగ్రహము.

మూ॥ హేతవఃపూర్వరూపాణి రూపాణ్యుపశయస్తథా । సంప్రాప్తిః పూర్వముత్పత్తిః సూత్రమాత్రం చికిత్సితమ్ ॥44॥

అ॥ ఈ అధ్యాయమునందు అపస్మారముయొక్క హేతువులు, పూర్వరూపములు, లక్షణములు, ఉపశయము, సంప్రాప్తి, ప్రారంభోత్పత్తి, చికిత్సాసంగ్రహము ఇవి చెప్పబడినవి.

నిదానస్థానసంగ్రహము.

మూ॥ జ్వరాదీనాం వికారాణామష్టానాం సాధ్యతా న చ । పృథగేకైకశశ్చోక్తా హేతులిఙ్గోపశాన్తయః॥ హేతుపర్యాయనామాని వ్యాధీనాం లక్షణస్య చ । నిదానస్థానమేతావత్సంగ్రహేణోపదిశ్యతే ॥46॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే నిదానస్థానేఽపస్మారనిదానం నామాష్టమోఽధ్యాయః ॥

అ॥ ఈనిదానస్థానమునందు జ్వరము మొదలగు ఎనిమిదివిధములగు వ్యాధులకును ప్రత్యేకప్రత్యేకముగ సాధ్యత్వము, అసాధ్యత్వము, హేతువులు, లక్షణములు, ఉపశయము ఇవి చెప్పబడినవి. మరియు హేతువుయొక్కయు వ్యాధియొక్కయు లక్షణముయొక్కయు పర్యాయపదములు చెప్పబడినవి. ఈవిధమున నిదానస్థానము సంగ్రహముగ చెప్పబడినది.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామకకృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితావ్యాఖ్యానమునందు అపస్మారనిదానమనెడు అష్టమాధ్యాయము సమాప్తము.

—o—

## నిదానస్థానము సమాప్తము.

—o—



# విమానస్థానము

## ప్రథమాధ్యాయము



మూ॥ అథాతో రసవిమానం వ్యాఖ్యాస్యామః॥ 1 ॥

అ॥ పిమ్మట రసవిమానమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః॥ 2 ॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ఇహఖలువ్యాధీనాం నిమిత్తపూర్వరూపోపశయసంఖ్యా ప్రాధాన్యవిధివికల్పబలకాలవిశేషానసుప్రవిశ్యానన్తరంరసద్రవ్యదోష వికారభేషజదేశకాలబలశరీరాహారసారసాత్మ్యసత్వ ప్రకృతివయసాం మానమవహితమనసా యథావజ్జ్ఞేయం భవతి భిషజా, రసాదిమాన జ్ఞానాయత్తత్వాత్ క్రియాయాః; న హ్యమానజ్ఞోరసదోషాదీనాం భిషక్ వ్యాధినిగ్రహసమర్థో భవతి; తస్మాత్ రసాదిమానజ్ఞానార్థం విమానస్థానముపదేక్ష్యామోఽగ్నివేశ! ॥ తత్రాదౌ రసద్రవ్యదోష వికారప్రభావాన్ వక్ష్యామః॥ 4 ॥

అ॥ వ్యాధులయొక్క - హేతువులు, పూర్వరూపములు, లక్షణములు, ఉపశయము, సంఖ్య, ప్రాధాన్యము, విధి, వికల్పము, బలకాలము వీనివిశేషములు ఇదివరలో చెప్పబడినవి. పిమ్మట రసము, ద్రవ్యము, దోషములు, వ్యాధులు, ఔషధములు, దేశము, కాలము, బలము, శరీరము, ఆహారసారము, సాత్మ్యము, మనస్సు, ప్రకృతి, వయస్సు వీనియొక్క విశేషములను చెప్పబోవుచున్నాము. వైద్యుడు సావధానమనస్సుకలవాడై వీనిని తెలిసికొనవలయును. చికిత్స రసాదివిశేషజ్ఞానము ననుసరించియుండును. రసాదివిశేషములను తెలిసికొననివైద్యుడు వ్యాధులను నశింపజేయుటయందు సమర్థుడుకాడు. కావున రసాదివిశేషములు తెలియునిమిత్తము విమానస్థానమును చెప్పుచున్నాము. అందు మొదట రసములు, ద్రవ్యములు, దోషములు, వ్యాధులు వీనియొక్క విశేషములను చెప్పుచున్నాము.

## రసవివరము.

మూ॥ రసాస్తావత్ షట్ - మధురామ్లలవణకటుతిక్తకషాయాః; తే సమ్యగుపయుజ్యమానాః శరీరం యాపయన్తి. మిథ్యోపయుజ్యమానాస్తు ఖలు దోషప్రకోపణాయోపకల్పయన్తి ॥5॥

అ॥ మధురము, అమ్లము, లవణము, కటువు, తిక్తము, కషాయము అని రసములు ఆరువిధములుగ నుండును. అవి సరిగ నుపయోగింపబడి శరీరము సమానస్థితిలో నుంచును సరిగనుపయోగింపబడనిచో దోషములను ప్రకోపము నొందించును.

## దోషవివరము.

మూ॥ దోషాః పునస్త్రయో - వాతపిత్తశ్లేష్మాణః; తే ప్రకృతిభూతాః శరీరోపకారకా భవన్తి, వికృతమాపన్నాః ఖలు నానావిధైర్వికారైః శరీరముపతాపయన్తి ॥6॥

అ॥ వాతము, పిత్తము, శ్లేష్మము అని దోషములు మూడువిధములుగ నుండును. అవి సమానస్థితియందున్నచో శరీరమున కుపకారమును చేయును. వికృతినొందినచో అనేకవిధములైన వ్యాధులను కలిగించ శరీరమునకు బాధను కలిగించును.

మూ॥ తత్ర దోషమేకైకం త్రయస్త్రయో రసా జనయన్తి, త్రయస్త్రయశ్చోపశమయన్తి; తద్యథా—కటుతిక్తకషాయా వాతం జనయన్తి, మధురామ్లలవణాస్త్వేనం శమయన్తి; కట్వామ్లలవణాః పిత్తం జనయన్తి. మధురతిక్తకషాయాస్త్వేనచ్ఛమయన్తి; మధురామ్లలవణాః శ్లేష్మాణం జనయన్తి, కటుతిక్తకషాయాస్త్వేనం శమయన్తి ॥7॥

అ॥ ఒక్కొక్క దోషమును మూడేసిరసములు వృద్ధినొందించును. మూడేసిరసములు శమింపజేయును. ఎట్లనగా—కటుతిక్తకషాయరసములు వాతమును వృద్ధినొందించును. మధురామ్లలవణరసములు వాతమును శమింపజేయును. కటుకామ్లలవణరసములు పిత్తమును వృద్ధినొందించును. మధురతిక్తకషాయరసములు పిత్తమును శమింపజేయును. మధురామ్లలవణరసములు శ్లేష్మమును వృద్ధినొందించును. కటుతిక్తకషాయరసములు శ్లేష్మమును శమింపజేయును.

మూ॥ రసదోషసన్నిపాతే తు యే రసా యైర్దోషైః సమానగుణాః సమానగుణభూయిష్ఠా వా భవన్తి తే తానభివర్ధయన్తి, విపరీతగుణాస్తు విపరీతగుణభూయిష్ఠా వా శమయన్త్యభ్యస్యమానాః; ఇత్యేతద్వ్యవస్థాహేతోః షట్త్వముపదిశ్యతేరసానాం పరస్పరేణాసం

సృష్టానాం, త్రిత్వం చ దోషాణాం; సంసర్గ వికల్పవిస్తారో హ్యేషామపరిసంఖ్యేయో భవతి, వికల్పభేదాపరిసంఖ్యేయత్వాత్ ॥ 8 ॥

అ॥ ఉపయోగింపబడిన రసములు ఏ దోషములతో సమానగుణములను గాని, సమానగుణములను అధికముగ గాని కలిగియుండునో ఆ దోషములను వృద్ధినొందించును. ఏ దోషములతో విపరీతగుణములను గాని, విపరీతగుణములను అధికముగ గాని కలిగి యుండునో ఆ దోషములను శమింపజేయును. పరస్పరము కలియని రసములు ఆరువిధములనియు పరస్పరము కలియని దోషములు మూడువిధములనియు సంక్షేపముగ చెప్పబడినవి. వికల్పముచే భేదములు అసంఖ్యాకములుగ నగును గావున రసములయొక్కయు దోషములయొక్కయు సంయోగవికల్పములు అసంఖ్యాకములుగ నుండును.

మూ॥ తత్ర ఖల్వనేకరసేషు ద్రవ్యేష్వనేకదోషాత్మకేషు చ వికారేషు రసదోషప్రభావమేకైకత్వేనాభిసమీక్ష్య తతో ద్రవ్యవికారప్రభావతత్త్వం వ్యవస్యేత్; న త్వేవం ఖలు సర్వత్ర, న హి వికృతివిషమసమవేతానాం నానాత్మకానాం ద్రవ్యాణాం పరస్పరేణ చోపహతానామన్యైశ్చ వికల్పనైర్వికల్పితానామవయవప్రభావానుమానేన సముదాయప్రభావతత్త్వమధ్యవసాతుం శక్యం, తథాయుక్తే హి సముదాయే సముదాయప్రభావతత్త్వమేవోపలభ్య తతో రసద్రవ్యవికారప్రభావతత్త్వం వ్యవస్యేత్ తస్మాద్రసప్రభావతశ్చ ద్రవ్యప్రభావతశ్చ దోషప్రభావతశ్చ వికారప్రభావతశ్చ తత్త్వముపదేక్ష్యామః — తత్రైష రసద్రవ్యదోషవికారప్రభావ ఉపదిష్టో భవతి ॥10॥

అ॥ ద్రవ్యములు అనేకరసములు కలవిగను వ్యాధులు అనేక దోషములు కలవిగను నుండును. రసములయొక్కయు దోషములయొక్కయు విశేషములను వివరముగ తెలిసికొని ద్రవ్యములయొక్కయు వ్యాధులయొక్కయు విశేషములను తెలిసికొనవలయును. అన్నిచోట్లను ఈవిధముగ తెలిసికొనుటకు వీలులేదు. వికృతిప్రత్యయారబ్ధములైనట్టియు విషమప్రత్యయారబ్ధములైనట్టియు అనేకవిధములైన హేతువులచే జనియించినట్టియు పరస్పరవ్యతిరేకములగు రసములు కలిగినట్టియు కల్పనలచే మార్పునొందింపబడినట్టియు ద్రవ్యములయొక్క సాముదాయకవిశేషమును రసాదివిశేషజ్ఞానముచేత తెలిసికొనుటకు శక్యముకాదు. అట్టిసమయమున రసములయొక్కయు, ద్రవ్యములయొక్కయు వ్యాధులయొక్కయు సాముదాయకవిశేషములనే మొదట తెలిసికొని పిమ్మట అవయవవిశేషములను తెలిసికొనవలయును. కావున రసములు ద్రవ్యములు దోషములు వ్యాధులు వీనియొక్క విశేషములను చెప్పబోవుచున్నాము. ఇట్లు రసములు ద్రవ్యములు దోషములు వ్యాధులు వీనియొక్క విశేషములు సామాన్యముగ చెప్పబడినవి.

## ద్రవ్యవిశేషవివరణము.

మూ॥ ద్రవ్యప్రభావం పునరుపదేక్ష్యామః — తైలసర్పిర్మధూని వాతపిత్తశ్లేష్మప్రశమనాని ద్రవ్యాణి భవన్తి। తత్ర, తైలం స్నేహౌష్ణ్యగౌరవోపపన్నత్వాద్వాతం జయతి సతతమభ్యస్యమానం, వాతో హి రౌక్ష్యశైత్యలాఘవోపపన్నో విరుద్ధగుణో భవతి, విరుద్ధగుణసన్నిపాతే హి భూయసాఽల్పమవజీయతే, తస్మాత్తైలం వాతం జయతి సతతమభ్యస్యమానం; సర్పిః ఖల్వేవమేవ పిత్తం జయతి, మాధుర్యాచ్ఛైత్యాన్మన్దవీర్యత్వాచ్చ, పిత్తం హ్యమధురముష్ణం తీక్ష్ణం చ; మధు చ శ్లేష్మాణం జయతి, రౌక్ష్యాత్తైక్ష్ణ్యాత్ కషాయత్వాచ్చ, శ్లేష్మా హి స్నిగ్ధో మన్దో మధురశ్చ॥ యచ్చాన్యదపి కించిద్ద్రవ్యమేవం వాతపిత్తకఫేభ్యో గుణతో విపరీతం విరుద్ధం తచ్చైతాఞ్జయత్యభ్యస్యమానమ్ ॥12॥

అ॥ ద్రవ్యములయొక్క విశేషములను వివరించి చెప్పుచున్నాము. తైలము వాతమును, ఘృతము పిత్తమును, తేనె కఫమును శమింపచేయును. తైలము ఎల్లప్పుడు సేవింపబడినదై స్నిగ్ధఉష్ణగురుగుణములు కలదగుటవలన విరుద్ధములగు రూక్షశీతలఘుగుణములుకల వాతమును శమింపజేయును. విరుద్ధగుణములు కలిసినప్పుడు అధికబలముకలవానిచే స్వల్పబలముకలవి జయింపబడును. కావున ఎల్లప్పుడు సేవింపబడిన తైలము వాతమును శమింపచేయును. ఇటులనే, మధురరసమును శీతగుణమును మందగుణమును వల ఘృతము మధురరసములేనట్టియు ఉష్ణగుణమును తీక్ష్ణగుణమును కల పిత్తమును శమింపచేయును. ఇటులనే, రూక్షగుణమును తీక్ష్ణగుణమును కషాయరసమును కల తేనె స్నిగ్ధగుణమును మందగుణమును మధురరసమును కల కఫమును శమింపచేయును. వాతపిత్తకఫములకు విరుద్ధములైన గుణములుకల ఇతరద్రవ్యములుకూడ ఈవిధముననే వాతపిత్తశ్లేష్మములను శమింపచేయును.

## అధికముగ సేవింపకూడని ద్రవ్యములు.

మూ॥ అథ ఖలు త్రీణి ద్రవ్యాణి నాత్యుపయుఞ్జీతాధికమన్యేభ్యో ద్రవ్యేభ్యః; తద్యథా - పిప్పలీః, క్షారం, లవణమితి ॥13॥

అ॥ పిప్పళ్ళు క్షారము లవణము వీనిని ఇతరద్రవ్యములకంటె అధికముగ సేవింపకూడదు.

## పిప్పళ్ళను అధికముగ సేవింపకుండుటకు కారణము.

మూ॥ పిప్పల్యో హి కటుకాః సత్యో మధురవిపాకా గుర్వ్యో నాత్యర్థం స్నిగ్ధోష్ణాః ప్రక్లేదిన్యో భేషజాభిమతాశ్చ. తాః సద్యః శుభా

శుభకారిణ్యో భవన్తి, ఆపాతభద్రాః ప్రయోగసమసాద్గుణ్యాత్, దోషసంచయానుబన్ధాః సతతముపయుజ్యమానా హి, గురుప్రక్లేది త్వాచ్ఛ్లేష్మాణముత్క్లేశయన్తి, ఔష్ణ్యాత్పిత్తం, న చ వాతప్రశమ నాయోపకల్పన్తేఽల్పస్నేహోష్ణభావాత్, యోగవాహిన్యస్తు ఖలు భవన్తి; తస్మాత్పిప్పలీర్నాత్యుపయుఞ్జీత ॥14॥

అ॥ పిప్పళ్ళు, కటురసముకలవై మధురవిపాకముకలవిగ నుండును. గురుగుణ మును స్వల్పములగు స్నిగ్ధోష్ణగుణములును క్లేదగుణమును కలవిగ నుండును. ఔషధ ముల నిమిత్తము ఉపయోగించును. వెంటనే శుభాశుభకార్యములను చేయును. సరిగ నుపయోగించినచో సద్గుణములను కలుగజేయును. తఱుచుగ నుపయోగించినచో దోష ములను వృద్ధినొందించుట. గురుగుణమును క్లేదగుణమును కలిగియుండుటవలన శ్లేష్మ మును, ఉష్ణగుణము కలిగియుండుటవలన పిత్తమును ఉద్రేకము నొందించును. స్నిగ్ధ ఉష్ణగుణములు స్వల్పముగ నుండుటవలన వాతమును శమింపచేయజాలవు. యోగవాహి యనెడి శక్తి కలవిగ నుండును. చెడుగుణములు అధికముగ నుండుటవలన పిప్పళ్ళను అధికముగ నుపయోగింపకూడదు.

### క్షారమును అధికముగ సేవింపకుండుటకు కారణము

మూ॥ క్షారః పునరౌష్ణ్యతైక్ష్ణ్యలాఘవోపపన్నః క్లేదయ త్యాదౌ పశ్చాద్విశోషయతి, స పచనదహనభేదనార్థముపయుజ్యతే; సోఽతిప్రయుజ్యమానః కేశాక్షిహృదయపుంస్త్వోపఘాతకరః సంప ద్యతే, యే హ్యేనం గ్రామనగరనిగమజనపదాః సతతముపయుఞ్జతే తే హ్యాన్ధ్యషాణ్డ్యఖాలిత్యపాలిత్యభాజో హృదయాపకర్తినశ్చ భవన్తి తద్యథా- ప్రాచ్యాశ్చీనాశ్చ; తస్మాత్ క్షారం నాత్యుపయుఞ్జీత ॥15॥

అ॥ క్షారము, ఉష్ణతీక్ష్ణలఘుగుణములు కలదై మొదట క్లేదమునొందించి పిమ్మట ఎండింపచేయును. పక్వముచేయుటకును దహింప చేయుటకును భేదించుటకును ఉప యోగించును. అధికముగ నుపయోగించినచో కేశములు నేత్రములు హృదయము పుంస్త్వము వీనిని చెరచును. గ్రామములు పురమును పట్టణములు పల్లెలు వీనియందు నివసించునట్టి ఎవరు ఎల్లప్పుడు సేవించెదరో వారు గ్రుడ్డితనము నపుంసకత్వము వెంట్రుకలూడుట వెంట్రుకలు నెరయుట హృదయమునందు పరికర్తనమనెడి బాధ వీనితోకూడినవా రగుదురు. ప్రాచ్యదేశస్థులును చీనాదేశస్థులుట తరుచు ఉపయో గించెదరు. చెడుగుణములు అధికముగనుండుటవలన క్షారమును అధికముగ నుపయో గింపకూడదు.

### లవణమును అధికముగ సేవింపకుండుటకు కారణము.

మూ॥ లవణం పునరౌష్ణ్యతైక్ష్ణ్యోపపన్నమనతిగుర్వనతిస్నిగ్ధ ముపక్లేది విష్యన్దనసమర్థమన్నద్రవ్యరుచికరం, ఆపాతభద్రం ప్ర

యోగసమసాద్గుణ్యాత్, దోషసంచయానుబన్ధం, తదో్రచనపాచనో పక్లేదనవిస్రంసనార్థముపయుజ్యతే; తదత్యర్థముప యుజ్యమానంగ్లాని శైథిల్యదౌర్బల్యాభినిర్వృత్తికరం శరీరస్య భవతి; యే హ్యేనద్గ్రామ నగరనిగమజనపదాః సతతముపయుఞ్జతే తే భూయిష్ఠం గ్లాస్నవః శిథిలమాంసశోణితా అపరిక్లేశసహాశ్చ భవన్తి, తద్యథా - బాహ్లీక సౌరాష్ట్రికస్సైన్ధవసౌవీరకాః, తే హి పయసాఽపి సదా లవణ మశ్నన్తి, యేఽపీహ భూమేరత్యూషరా దేశా స్తేష్వోషధీవీరుద్వన స్పతివానస్పత్యా న జాయన్తేఽల్పతేజసో వా భవన్తి లవణోపహత త్వాత్; తస్మాల్లవణం నాత్యుపయుఞ్జీత; యే హ్యతిలవణసాత్మ్యాః పురుషాస్తేషామపి ఖాలిత్యేన్ద్రలుప్తపాలిత్యాని తథా వలయశ్చా కాలే భవన్తి ॥16॥

అ॥ లవణము, ఉష్ణతీక్ష్ణగుణములుకలదై స్వల్పమగుగురుగుణమును స్వల్పమగు స్నిగ్ధగుణమును క్లేదగుణమును కలిగియుండును. మలాదులను స్రవింపజేయును. ఆహార పదార్థములయందు రుచిని కలిగించును. సరిగనుపయోగించినచో సద్గుణములను కలుగజే యును. తరుచుగ నుపయోగించినచో దోషములను వృద్ధినొందించును. రుచిని కలిగిం చుటకును పక్వమునొందించుటకును క్లేదమునొందించుటకును మలాదులను స్రవింప చేయుటకును ఉపయోగించును. అధికముగ నుపయోగించినచో బడలిక శైథిల్యము దౌర్బల్యము వీనిని కలిగించును. గ్రామములు పురములు పట్టణములు పల్లెలు వీనియందు నివసించునట్టి ఎవరు ఎల్లప్పుడు సేవించెదరో వారు బడలికయు మాంసశైథిల్యమును రక్తశైథిల్యమును కలవారగుదురు. కష్టమును సహింపజాలరు. బాహ్లీకదేశస్థులును సౌరాష్ట్రదేశస్థులును సింధుదేశసులును సౌవీరకదేశస్థులును తరుచు ఉపయోగించెదరు. మఱియు పాలయందుకూడ ఉపయోగించెదరు. ఊషరప్రదేశమునందు లవణసంబంధ ముండుటవలన అరటి మొదలగుచెట్లు పొదలు పనస మొదలగువృక్షములు మామిడి మొదలగువృక్షములు మొలవనేరవు, మొలచినను స్వల్పశక్తికలవిగ నుండును. చెడు గుణములు అధికముగ నుండుటవలన లవణమును అధికముగ నుపయోగింపకూడదు. లవణము అధికముగ అలవాటుకలవారలకు ఖాలిత్యము (పేనుకొరుకుట) వెంట్రుక లూడుట వెంట్రుకలునెరయుట శరీరము ముడతలుపడుట ఇవి తరుణవయస్సునందే కలుగును.

మూ॥ తస్మాత్ తేషాం తత్సాత్మ్యతః క్రమేణాపగమనం శ్రేయః; సాత్మ్యమపి హి క్రమేణోపనివర్త్యమానమదోషమల్ప దోషం వా భవతి ॥ 17 ॥

అ॥ క్షారలవణములను అధికముగ అభ్యాసముకలవాడు వానిని క్రమముగ తగ్గింపవలయును. సాత్మ్యమైనను క్రమముగ తగ్గించినచో చెరుపును కలిగింపదు. కలిగించినను స్వల్పముగనే కలిగించును.

## సాత్మ్యవివరణము.

మూ॥ సాత్మ్యం నామ తత్ యదాత్మన్యుపశేతే; సాత్మ్యార్థో హ్యుపశయార్థః। తత్ త్రివిధం-ప్రవరావరమధ్యవిభాగేన; సప్తవిధం చ-రసైకైకత్వేన, సర్వరసోపయోగాచ్చ। తత్ర సర్వరసం ప్రవరం, అవరమేకరసం, మధ్యమం తు ప్రవరావరమధ్యస్థమ్। తత్రావరమధ్యాభ్యాం సాత్మ్యాభ్యాం క్రమేణ ప్రవరముపపాదయేత్సాత్మ్యమ్। సర్వ సర్వాణ్యాహారవిధివిశేషాయతనాన్యభిసమీక్ష్య హితమేవానురుధ్యేత ॥ 19 ॥

అ॥ తనకు అనుకూలమైనది సాత్మ్యమని చెప్పబడును. అది ప్రవరమనియు అవరమనియు మధ్యమనియు మూడువిధములుగ నుండును. మరియు రసములను ప్రత్యేకముగ నుపయోగించుటనుబట్టియు రసములనన్నిటిని ఉపయోగించుటనుబట్టియు ఏడువిధములుగ నుండును. అందు రసములనన్నిటిని ఉపయోగించుట ప్రవరమనియు ఒక రసమును ఉపయోగించుట అవరమనియు కొన్నిరసముల నుపయోగించుట మధ్యమమనియు చెప్పబడును. ఒకరసమునుగాని కొన్నిరసములుగాని అభ్యాసముగనున్నప్పుడు క్రమముగ అన్నిరసములను అభ్యాసము చేయవలయును. సమస్తరసములును అభ్యాసమైనను ప్రకృతి మొదలైన ఎనిమిదివిధములగు ఆహారవిధివిశేషహేతువులను అనుసరించి హితకరమైన ఆహారమునే భుజింపవలయును.

## ఆహారవిధివిశేషహేతువులు.

మూ॥ తత్ర ఖల్విమాన్యష్టావాహారవిధివిశేషాయతనాని భవన్తి। తద్యథా- ప్రకృతికరణసంయోగరాశిదేశకాలోపయోగసంస్థోపయోక్త్రష్టమాని భవన్తి ॥20॥

అ॥ ప్రకృతి, కరణము, సంయోగము, రాశి, దేశము, కాలము, ఉపయోగసంస్థ, ఉపయోక్త అనునీ యెనిమిదియు ఆహారవిధివిశేషహేతువులుగ నుండును. అనగా భుజింపబడిన ఆహారముయొక్క హితాహితత్వములకు కారణములుగ నుండును.

## ప్రకృతివివరణము.

మూ॥ తత్ర ప్రకృతిరుచ్యతే—స్వభావో యః, స పునరాహారౌషధద్రవ్యాణాం స్వాభావికో గుర్వాదిగుణయోగః; తద్యథా - మాషముద్గయోః, సూకరైణయోశ్చ ॥21॥

అ॥ స్వభావము ప్రకృతియనబడును. అనగా ఆహారద్రవ్యములయందును ఔషధ ద్రవ్యములయందును గుర్వాదిగుణములు స్వతస్సిద్ధముగ నుండుట ప్రకృతియనబడును. ఎటులననగా - మినుములయందు గురుగుణమును, పెసలయందు లఘుగుణమును, పందిమాంసమునందు గురుగుణమును, లేడిమాంసమునందు లఘుగుణమును స్వభావముగనే యుండును.

### కరణవివరణము.

మూ॥ **కరణం పునః - స్వాభావికానాం ద్రవ్యాణామభిసంస్కారః, సంస్కారో హి గుణాన్తరాధానముచ్యతే। తే గుణాశ్చ తోయాగ్నిసంనికర్షశౌచమన్థనదేశకాలవశేన భావనాదిభిః కాలప్రకర్షభాజనాదిభిశ్చాభిధీయన్తే ॥22॥**

అ॥ స్వభావగుణయుక్తములగు ద్రవ్యములకు సంస్కారముచే ఇతరగుణములను కలిగించుట కరణమని చెప్పబడును. ఉదకము, అగ్ని, కడుగుట, మథించుట, ప్రదేశము, కాలము, భావన మొదలగునవి, సమయము, పాత్రలు మొదలగువానివలన ఇతరగుణములు కలుగును.

### సంయోగవివరణము.

మూ॥ **సంయోగస్తు-ద్వయోర్బహూనాం వా ద్రవ్యాణాం సంహతీభావః స విశేషమారభతే యన్నైకైకశో ద్రవ్యాణ్యారమ్భన్తే; తద్యథా - మధుసర్పిషోః, మధుమత్స్యపయసాం చ సంయోగః॥23॥**

అ॥ ద్రవ్యములు రెండుగాని అనేకములుగాని కలియుట సంయోగ మనబడును. అట్లు కలిసినప్పుడు ఆద్రవ్యములయందులేని విశేషగుణములు కలుగవచ్చును. ఎటులననగా - తేనెయు ఘృతమును కలిసినప్పుడును, తేనెయు చేపలును పాలును కలిసినప్పుడును వానియందు ప్రత్యేకముగ లేని చెడుగుణములు కలుగును.

### రాశివివరణము.

మూ॥ **రాశిస్తు-సర్వగ్రహపరిగ్రహౌ మాత్రామాత్రఫలవినిశ్చయార్థః ప్రకృతః; తత్ర సర్వస్యాహారస్య ప్రమాణగ్రహణమేకపిణ్డేన సర్వగ్రహః, సర్వగ్రహశ్చ పునఃప్రమాణగ్రహణమేకైకత్వేనాహారద్రవ్యాణాం; సర్వస్య హి గ్రహః సర్వగ్రహః, సర్వతశ్చ గ్రహః పరిగ్రహ ఉచ్యతే ॥24॥**

అ॥ పరిమాణము రాశియనబడును. ఆహారముయొక్క మాత్రామాత్రాఫలవినిశ్చయము పరిమాణమనుసరించి యుండును. పరిమాణము సర్వగ్రహమనియు పరిగ్రహమనియు రెండువిధములుగ నుండును. ఆహారమునంతను ఒకముద్దగ నేచేసి

తినుట సర్వగ్రహమనియు, ప్రత్యేకముగ తినుట పరిగ్రహమనియు చెప్పబడును. అనగా అన్నివస్తువులను ఏకముగా కలిపి తినుట సర్వగ్రహమనియు, ప్రత్యేకముగా కలిపి తినుట పరిగ్రహమనియు చెప్పబడును.

## దేశవివరణము.

మూ॥ **దేశః పునః - స్థానం, ద్రవ్యాణాముత్పత్తిప్రచారౌ దేశసాత్మ్యం చాచష్టే ॥25॥**

అ॥ దేశమనగా స్థానము. ఇది ద్రవ్యోత్పత్తిస్థానము సంచరించుస్థానము అభ్యాసమైనస్థానము అని మూడువిధములుగ నుండును.

## కాలవివరణము.

మూ॥ **కాలో హి-నిత్యగశ్చావస్థికశ్చ; తత్రావస్థికో వికార మపేక్షతే, నిత్యగస్తు ఖల్వృతుసాత్మ్యాపేక్షః ॥26॥**

అ॥ నిత్యగమనియు ఆవస్థికమనియు కాలము రెండువిధములుగ నుండును. అందు రోగావస్థల ననుసరించినది ఆవస్థికకాలమనియు ఋతువులననుసరించినది నిత్యగకాలమనియు చెప్పబడును.

## ఉపయోగసంస్థావివరణము.

మూ॥ **ఉపయోగసంస్థా తు - ఉపయోగనియమః, స జీర్ణలక్షణాపేక్షః ॥27॥**

అ॥ జీర్ణలక్షణములు కలిగినపిదప భుజించుట మొదలగు ఉపయోగనియమములు ఉపయోగసంస్థ యనబడును.

## ఉపయోక్తృవివరణము.

మూ॥ **ఉపయోక్తా పునః - యస్తమాహారముపయుంక్తే, యదాయత్తమోకసాత్మ్యమ్ ॥28॥**

అ॥ ఆహారమునుపయోగించువాడు ఉపయోక్త యనబడును. ఓకసాత్మ్యము అతనియందు అధీనమై యుండును.

మూ॥ **ఇత్యష్టావాహారవిధివిశేషాయతనాని భవన్తి, ఏషాం విశేషాః శుభాశుభఫలప్రదాః పరస్పరోపకారకా భవన్తి; తాన్ బుభుత్సేత, బుద్ధ్వా చ హితేప్సురేవ స్యాత్, న చ మోహాత్ప్రమాదాద్వా ప్రియమహితమసుఖోదర్కముపసేవ్యం కిఞ్చిదాహారజాతమన్యద్వా ॥29॥**

అ॥ ఈవిధమున ఎనిమిదివిధములగు ఆహారవిధివిశేషహేతువులు చెప్పబడినవి. శుభాశుభఫలములను కలిగించునట్టియు పరస్పరము ఉపకారమును చేసికొనునట్టియు వీనియొక్క విశేషములను తెలిసికొని హితమునే ఆచరింపవలయును. ప్రియమైనట్టియు అహితమైనట్టియు ఉత్తరకాలమునందు దుఃఖమును కలిగించునట్టియు ఆహారము ఔషధము మొదలగువానిని మోహమువలనగాని ప్రమాదమువలనగాని సేవింపగూడదు.

### ఆహారనియమము.

మూ॥ తత్రేదమాహారవిధివిధానమరోగాణామాతురాణాం చ కేషాంచిత్కాలే ప్రకృత్యైవ హితతమం భుఞ్జానానాం భవతి — ఉష్ణం స్నిగ్ధం మాత్రావజ్జీర్ణే వీర్యావిరుద్ధమిష్టే దేశే ఇష్టసర్వోపకరణం నాతిద్రుతం నాతివిలమ్బితం న జల్పన్నహసం స్తన్మనా భుఞ్జీతాత్మానమభిసమీక్ష్య సమ్యక్॥ తస్య సాద్గుణ్యముపదేక్ష్యామః॥

అ॥ సకాలమునందు భుజించు ఆరోగ్యవంతులకును కొంతమంది రోగులకును స్వభావముగనే హితకరమైన ఆహారనియమమును చెప్పబోవుచున్నాము. ఉష్ణముగను స్నిగ్ధముగను పరిమాణయుక్తముగను వీర్యావిరుద్ధముగను నున్న ఆహారమును, పూర్వాహారము జీర్ణమైనపిదప ఇష్టమైనప్రదేశమునందు ఇష్టములైన ఉపకరణములతో తొందర లేకుండగను ఆలస్యముకాకుండగను మాట్లాడకుండగను నవ్వకుండగను ఇతరధ్యానము లేనివాడై తన కనుకూలముగనుండునట్లు భుజింపవలయును. దానియొక్క ప్రశస్త గుణములను చెప్పబోవుచున్నాము.

### ఉష్ణభోజనగుణము.

మూ॥ ఉష్ణమశ్నీయాత్ — ఉష్ణం హి భుజ్యమానం స్వదతే, భుక్తం చాగ్నిమౌదర్యముదీరయతి, క్షిప్రం చ జరాం గచ్ఛతి, వాతం చానులోమయతి, శ్లేష్మాణం చ పరిశోషయతి, తస్మాదుష్ణమశ్నీయాత్ ॥31॥

అ॥ వేడిగనున్న ఆహారమును భుజించినచో రుచిగ నుండును. జాఠరాగ్నిని వృద్ధినొందించును. త్వరలో జీర్ణమగును. వాతమునకు అనులోమమును కలిగించును. శ్లేష్మమును నశింపచేయును. అందువలన వెచ్చగనున్న ఆహారమును భుజింపవలయును.

### స్నిగ్ధభోజనగుణము.

మూ॥ స్నిగ్ధమశ్నీయాత్ — స్నిగ్ధంహి భుజ్యమానం స్వదతే, భుక్తం హ్యౌదర్యమగ్నిముదీరయతి, క్షిప్రం జరాం గచ్ఛతి. వాతమను లోమయతి, దృఢీకరోతి శరీరోపచయం, బలాభివృద్ధిం చాభిజనయతి, వర్ణప్రసాదమపి చాభినిర్వర్త్తయతి, తస్మాత్స్నిగ్ధమశ్నీయాత్ ॥32॥

అ॥ చమురుతోకూడిన ఆహారమును భుజించినచో రుచిగ నుండును. జాఠరాగ్నిని వృద్ధినొందించును. త్వరలో జీర్ణమగును. వాతమునకు అనులోమమును కలిగించును. శరీరపుష్టిని దృఢపరచును. బలమును వృద్ధినొందించును. శరీరకాంతిని వృద్ధిపరచును. అందువలన చమురుతోకూడిన ఆహారమును భుజింపవలయును.

## పరిమాణభోజనగుణము.

మూ॥ మాత్రావదశ్నీయాత్ — మాత్రావద్ధి భుక్తం వాతపిత్తకఫానపీడయదాయురేవ వివర్ధయతి కేవలం, సుఖం గుదమనుపర్యేతి, న చోష్మాణముపహన్తి, అవ్యథం చ పరిపాకమేతి, తస్మాన్మాత్రావదశ్నీయాత్ ॥33॥

అ॥ పరిమాణయుక్తముగ భుజింపబడిన ఆహారము వాతపిత్తకఫములకు చెరుపును కలిగింపదు. ఆయువును సంపూర్ణముగ వృద్ధినొందించును. గుదమార్గమును సుఖముగ పొందును. జాఠరాగ్నిని నశింపచేయదు. బాధలేకుండ జీర్ణమగును. కావున పరిమితిగ భుజింపవలయును.

## జీర్ణానంతరభోజనగుణము.

మూ॥ జీర్ణేఽశ్నీయాత్ — అజీర్ణేహి భుఞ్జానస్యాభ్యవహృతమాహారజాతం పూర్వస్యాహారస్య రసమపరిణతముత్తరేణాహారరసేనోపసృజన్సర్వాన్దోషాన్ ప్రకోపయత్యాశు, జీర్ణే తు భుఞ్జానస్య స్వస్థానస్థేషు దోషేష్వగ్నౌ చోదీర్ణే జాతాయాం చ బుభుక్షాయాం వివృతేషు చ స్రోతసాం ముఖేషూద్గారే విశుద్ధే విశుద్ధే చ హృదయే వాతానులోమ్యే విసృష్టేషు చ వాతమూత్రపురీషవేగేష్వభ్యవహృతమాహారజాతం సర్వశరీరధాతూనప్రదూషయదాయురేవాభివర్ధయతి కేవలం, తస్మాజ్జీర్ణేఽశ్నీయాత్ ॥34॥

అ॥ జీర్ణముకానప్పుడు భుజించినచో పూర్వమునందు భుజింపబడిన ఆహారముయొక్క సరిగ తయారుకానిరసము తరువాత భుజింపబడిన ఆహారముయొక్క రసముతో కలిసి సమస్తదోషములను వెంటనే ప్రకోపింపచేయును. పూర్వమునందు భుజింపబడిన ఆహారము జీర్ణమై దోషములు స్వస్థానమునందుండుట, జాఠరదీప్తియు ఆకలియు కలుగుట, స్రోతోముఖములు తెరుచుకొనియుండుట, పరిశుద్ధమైన త్రేణుపులు వచ్చుట, హృదయము పరిశుద్ధముగ నుండుట, వాతము అనులోమముగ నుండుట, వాతమూత్రపురీషములు వెడలియుండుట ఈలక్షణములున్నప్పుడు భుజింపబడిన ఆహారము శరీరధాతువులను దూషింపచేయక ఆయువును సంపూర్ణముగ కలిగించును. కావున జీర్ణమైనపిమ్మట భుజింపవలయును.

## వీర్యావిరుద్ధభోజనగుణము.

మూ॥ వీర్యావిరుద్ధమశ్నీయాత్ — అవిరుద్ధవీర్యమశ్నన్ హి న విరుద్ధవీర్యాహారజై ర్వికారై రయముపసృజ్యతే, తస్మాద్వీర్యావిరుద్ధమశ్నీయాత్ ॥35॥

అ॥ విరుద్ధముకానిశక్తిగల ఆహారమును భుజించినచో విరుద్ధశక్తికల ఆహారమును భుజించుటవలనజనించు వ్యాధులు కలుగనేరవు. కావున విరుద్ధముకానిశక్తికల ఆహారమును భుజింపవలయును.

## ఇష్టదేశభోజనగుణము.

మూ॥ ఇష్టే దేశేఽశ్నీయాత్ — ఇష్టే హి దేశే భుఞ్జానో నానిష్టదేశజైర్మనోవిఘాతకరైర్భావైర్మనోవిఘాతం ప్రాప్నోతి, తథైవేష్టైః సర్వోపకరణైః, తస్మాదిష్టే దేశే తథేష్టసర్వోపకరణం చాశ్నీయాత్ ॥36॥

అ॥ ఇష్టమైనప్రదేశమునందు ఇష్టములైనఉపకరణములతో భుజించినయెడల మనోవిఘాతకరములగు భావములవలనకలుగు మనోవిఘాతము కలుగదు. కావున ఇష్టమైనప్రదేశమునందు ఇష్టములైన ఉపకరణములతో భుజింపవలయును.

## శీఘ్రభోజనగుణము.

మూ॥ నాతిద్రుతమశ్నీయాత్ — అతిద్రుతం హి భుఞ్జానస్యోత్స్నేహనం అవసదనం, భోజనస్యాప్రతిష్ఠానం, భోజ్యదోషసాద్గుణ్యోపలబ్ధిశ్చ ననియతా, తస్మాన్నాతిద్రుతమశ్నీయాత్ ॥37॥

అ॥ మిక్కిలితొందరగ భుజించినచో ఆహారము ఇతరమార్గములనుపొందుట, శరీరము కృశించుట, కోష్ఠమును సరిగపొందకుండుట, పదార్థములయందలి దోషమును రుచియు సరిగ తెలియకుండుట ఇవి కలుగును. కావున మిక్కిలితొందరగ భుజింపకూడదు.

## ఆలస్యభోజనగుణము.

మూ॥ నాతివిలమ్బితమశ్నీయాత్ - అతివిలమ్బితం హి భుఞ్జానో న తృప్తిమధిగచ్ఛతి, బహు భుంక్తే, శీతీభవతి చాహారజాతం విషమపాకం చ భవతి, తస్మాన్నాతివిలమ్బితమశ్నీయాత్ ॥38॥

అ॥ మిక్కిలి ఆలస్యముగభుజించినచో తృప్తి కలుగదు. అధికముగ భుజించును. ఆహారపదార్థములు చల్లబడును. ఆహారము విషమపాకము నొందును. కావున మిక్కిలి ఆలస్యముగ భుజింపకూడదు.

మౌనభోజన గుణము.

మూ॥ అజల్పన్నహసం స్తన్మనా భుఞ్జీత — జల్పతో హసతోఽన్యమనసో వా భుఞ్జానస్య త ఏవ హి దోషా భవన్తి య ఏవాతి ద్రుతమశ్నతః, తస్మాదజల్పన్నహసం స్తన్మనా భుఞ్జీత ॥39॥

అ॥ మాట్లాడుచుగాని నవ్వుచుగాని ఇతరధ్యానముకలవాడైకాని భుజించినచో మిక్కిలితొందరగ భుజించునప్పుడు కలుగునట్టియు ఆహారము ఇతరమార్గముల నొందుట మొదలగునట్టియు దోషములు కలుగును. కావున మాట్లాడకుండగను నవ్వకుండగను ఇతరధ్యానములేకుండగను భుజింపవలయును.

ఆత్మాభివీక్షణ భోజనగుణము.

మూ॥ ఆత్మానమభిసమీక్ష్య భుఞ్జీత సమ్యక్ - ఇదం మమోపశేతే, ఇదం నోపశేత ఇతి, విదితం హ్యస్య ఆత్మన ఆత్మసాత్మ్యం భవతి, తస్మాదాత్మానమభిసమీక్ష్య భుఞ్జీత సమ్యగితి ॥40॥

అ॥ "నాకు ఇది అనుకూలించును. ఇది అనుకూలింపదు." అని తనకు తెలియును. కావున తనకు అనుకూలమైనదానినే భుజింపవలయును.

మూ॥ రసాన్ద్రవ్యాణి దోషాంశ్చ వికారాంశ్చ ప్రభావతః ।
వేద యో దేశకాలౌ చ శరీరం చ స నో భిషక్ ॥41॥

అ॥ రసములు ద్రవ్యములు దోషములు వ్యాధులు దేశము కాలము శరీరము వీనియొక్క విశేషములను తెలిసినవాడే వైద్యుడనబడును.

అధ్యాయసంగ్రహము.

మూ॥ విమానార్థో రసద్రవ్యదోషరోగాః ప్రభావతః। ద్రవ్యాణి నాతిసేవ్యాని త్రివిధం సాత్మ్యమేవ చ॥ ఆహారాయతనాన్యష్టౌ భోజ్యసాద్గుణ్యమేవ చ । విమానే రససంఖ్యాతే సర్వమేతత్ప్రకాశితమ్॥43॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే విమానస్థానే రసవిమానం నామ ప్రథమోఽధ్యాయః ॥

అ॥ ఈ రసవిమానాధ్యాయమునందు విమానస్థానముయొక్క ప్రయోజనము, రసవిశేషములు, ద్రవ్యవిశేషములు, దోషవిశేషములు, వ్యాధివిశేషములు, అధికముగ సేవింపకూడని ద్రవ్యములు, మూడువిధములగు సాత్మ్యము, ఎనిమిదివిధములగు ఆహారవిధివిశేషహేతువులు, ఆహారనియమము ఇవిఅన్నియు చెప్పబడినవి.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామకకృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితావ్యాఖ్యానమునందు రసవిమానమనెడు ప్రథమాధ్యాయము సమాప్తము.



# ద్వితీయాధ్యాయము.

మూ॥ అథాతస్త్రివిధకుక్షీయం విమానం వ్యాఖ్యాస్యామః॥1॥

అ॥ పిమ్మట త్రివిధకుక్షీయవిమానమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ త్రివిధం కుక్షౌ స్థాపయేదవకాశాంశమాహారస్యాహార ముపయుఞ్జానః ; తద్యథా - ఏకమవకాశాంశం మూర్తానామాహార వికారాణాం, ఏకం ద్రవ్యాణాం, ఏకం పునర్వాతపిత్తశ్లేష్మణాఞ్చ । ఏతావతీం హ్యాహారమాత్రాముపయుఞ్జానో నామాత్రాహారజం కించిదశుభం ప్రాప్నోతి॥ న చ కేవలం మాత్రావత్త్వాదేవాహారస్య కృత్స్నమాహారఫలసౌష్ఠవమవాప్తుం శక్యం, ప్రకృత్యాదీనామష్టానామాహారవిధివిశేషాయతనానాం ప్రవిభక్తఫలత్వాత్ । తత్ర తావదాహారరాశిమధికృత్య మాత్రామాత్రఫలవినిశ్చయార్థః ప్రకృతః; ఏతావానేవ హ్యాహారరాశివిధివికల్పోయావన్మాత్రావత్త్వ మమాత్రావత్త్వం చ ॥5॥

అ॥ ఆహారమునుభుజించునప్పుడు కుక్షిప్రదేశమునందలి అవకాశమును మూడు విధములుగ విభజించుకొనవలయును. వానిలో ఒకభాగమును ఘనపదార్థములకును, ఒకభాగమును ద్రవపదార్థములకును, ఒకభాగమును వాతపిత్తశ్లేష్మములకును కల్పించుకొనవలయును. ఆహారమును ఇట్టిపరిమాణముగ నుపయోగించినచో పరిమితిలేకుండ భుజింపబడినఆహారమువలన కలుగు చెడుగుణములు కలుగనేరవు. ప్రకృతి మొదలైన ఎనిమిదివిధములగు ఆహారవిధివిశేషహేతువులవలన ఆహారముయొక్క ఫలము భిన్నముగ నుండును. కావున ఆహారమును పరిమాణముగ భుజించుటవలననే ఆహారఫలమునంతను పొందుటకు వీలులేదు. ఆహారపరిమాణమునను సరించి మాత్రామాత్రఫలవినిశ్చయము కలుగును. కావున మాత్రామాత్రత్వములు ఆహారపరిమాణముయొక్క విధివికల్పము ననుసరించియుండును.

## పరిమితాహారలక్షణములు.

మూ॥ తత్ర మాత్రావత్త్వం పూర్వముపదిష్టం కుక్ష్యంశవిభాగేన, తద్భూయో విస్తరేణానువ్యాఖ్యాస్యామః; తద్యథా —

కుక్షేరపీడనమాహారేణ, హృదయస్యానవరోధః, పార్శ్వయోరవిపాటనం, అనతిగౌరవముదరస్య, ప్రీణనమిన్ద్రియాణాం, క్షుత్పిపాసోపరమః, స్థానాసనశయనగమనప్రశ్వాసోచ్ఛ్వాసహాస్యసంకథాసు చ సుఖానువృత్తిః, సాయం ప్రాతశ్చ సుఖేన పరిణమనం, బలవర్ణోపచయకరత్వం చేతి మాత్రావతో లక్షణమాహారస్య భవతి ॥6॥

అ॥ కుక్షిప్రదేశముయొక్క అవకాశము ననుసరించి ఆహారముయొక్క పరిమాణము ఇదివరకు చెప్పబడినది. దానిని తిరిగి విస్తరించి చెప్పుచున్నాము. ఆహారమును పరిమితిగ భుజించినయెడల కుక్షిప్రదేశమునందు బాధ కలుగ నేరదు. హృదయమునకు అవరోధము కలుగదు. పార్శ్వములు పీడింపబడవు. ఉదరము మిక్కిలి బరువుగ నుండదు. ఇంద్రియములు తృప్తినొందును. ఆకలియు దప్పికయు తగ్గును. కూర్చుండుట, పరుండుట, నడుచుట, నిశ్వాస, ఉచ్ఛ్వాస, నవ్వుట, మాట్లాడుట, వీనియందు సుఖము కలుగును. సాయంకాలమునందును ఉదయమునందును భుజించిన ఆహారము సుఖముగ జీర్ణమగును. బలమును కాంతియు వృద్ధినొందును. ఆహారము పరిమితిగ భుజించినప్పుడు ఈ లక్షణములు కలుగును.

## హీనాధికాహారలక్షణములు.

మూ॥ అమాత్రావత్త్వం పునర్ద్వివిధమాచక్షతే - హీనమధికం చేతి; తత్ర హీనమాత్రమాహారరాశిం బలవర్ణోపచయక్షయకరమతృప్తికరముదావర్తకరమవృష్యమనాయుష్యమనౌజస్యం శరీరమనోబుద్ధీన్ద్రియోపఘాతకరం సారవిధమనమలక్ష్మ్యావహామశీతేశ్చ వాతవికారాణామాయతనమాచక్షతే ॥ అతిమాత్రం పునః సర్వదోషప్రకోపణమిచ్ఛన్తి సర్వకుశలాః ॥8॥

అ॥ అపరిమితత్వము హీనమనియు అధికమనియు రెండువిధములుగ నుండును. ఆహారమును తక్కువగ తినినచో బలమును కాంతియు తగ్గును. తృప్తి కలుగ నేరదు. ఉదావర్తము కలుగును. వీర్యవృద్ధియు ఆయువును ఓజస్సును కలుగవు. శరీరము మనస్సు బుద్ధి ఇంద్రియములు వీనికి విఘాతము కలుగును. ధాతుసారము కలుగదు. అలక్ష్మి కలుగును. ఎనుబదివిధములగు వాతవ్యాధులును కలుగును. అధికముగ భుజించినయెడల సమస్తదోషములును ప్రకోపించును.

మూ॥ యో హి మూర్తానామాహారవికారాణాం సౌహిత్యం గత్వా పశ్చాద్ద్రవైస్తృప్తిమాపద్యతే భూయః, తస్యామాశయగతా వాతపిత్తశ్లేష్మాణోఽభ్యవహారేణాతిమాత్రేణాతిప్రపీడ్యమానాః సర్వే యుగపత్ప్రకోపమాపద్యన్తే॥ తే ప్రకుపితాస్తమేవాహారరాశి

మపరిణతమావిశ్య కుక్ష్యేకదేశమన్నాశ్రితా విష్టమ్భయన్తః సహసా వాఽప్యుత్తరాధరాభ్యాం మార్గాభ్యాం ప్రచ్యావయన్తః పృథక్ పృథగిమాన్ వికారానభినిర్వర్తయన్త్యతిమాత్రభోక్తుః ॥ తత్ర, వాతః శూలానాహాఙ్గమర్దముఖశోషమూర్ఛాభ్రమాగ్ని వైషమ్యసిరాసంకోచసంస్తమ్భనాని కరోతి; పిత్తం పునర్జ్వరాతీసారా న్తర్దాహతృష్ణామదభ్రమప్రలాపాని; శ్లేష్మా తు ఛర్ద్యరోచకావిపాకశీతజ్వరాలస్య గాత్రగౌరవాభినిర్వృత్తికరః సంపద్యతే ॥ 11 ॥

అ॥ ఘనపదార్థములను తృప్తిగ భుజించి పిమ్మట ద్రవపదార్థములను అధికముగ భుజించినచో ఆమాశయగతములైన వాతపిత్తశ్లేష్మములు అతిమాత్రముగ భుజింపబడిన ఆ యాహారముచే మిక్కిలి పీడింపబడినవై ఒక్కమారుగనే ప్రకోపమునొందును. అట్లు ప్రకోపించినవై పక్వమునొందని ఆహారమును పొంది కుక్షియొక్క ఒకప్రదేశమును పొందినవై అన్నముతోకలిసి అన్నమును స్తంభింపచేసి ఊర్ధ్వాధోమార్గముల నుండి వెడలింపచేసి చెప్పబోవు ప్రత్యేకలక్షణములను కలిగించును. వానిలో వాతము— శూల, ఆనాహము, ఒడలునొప్పులు, నోరుఎండుట, మూర్ఛ, భ్రమ, అగ్నివైషమ్యము, సిరలు సంకోచమునొందుట, శరీరము స్తంభించుట ఈ లక్షణములను కలిగించును. పిత్తము—జ్వరము, అతిసారము, లోన తాపము, దప్పిక, మదము, భ్రమ, ప్రలాపము, వీనిని కలిగించును. కఫము—వాంతి, అరోచకము, జీర్ణముకాకపోవుట, శీతజ్వరము, మందత్వము, శరీరము బరువుగనుండుట వీనిని కలిగించును.

మూ॥ న ఖలు కేవలమతిమాత్రమేవాహారరాశిమామప్రదోషకరమిచ్ఛన్తి, అపి తు ఖలు గురురూక్షశీతశుష్కద్విష్టవిష్టమ్భివిదాహ్యశుచివిరుద్ధానామకాలే చాన్నపానానాముపసేవనం, కామక్రోధలోభమోహేర్ష్యాహ్రీశోకమానోద్వేగభయోపతప్తేన మనసా వా యదన్నపానముపయుజ్యతే తదప్యామమేవ ప్రదూషయతి ॥ శ్లో॥ మాత్రయాఽప్యభ్యవహృతం పథ్యం చాన్నం న జీర్యతి । చిన్తాశోకభయక్రోధదుఃఖశయ్యాప్రజాగరైః ॥ 1 ॥ తం ద్వివిధమామప్రదోషమాచక్షతే భిషజః —విసూచికామలసకం ॥ చ॥

అ॥ ఆమదోషము కేవలము అధికాహారమువలననే కలుగదు. గురుగుణమును రూక్షగుణమును శీతవీర్యమును కలిగినట్టియు ఎండినట్టియు ఇష్టముకానట్టియు విష్టంభమును కలిగించునట్టియు విదాహమునొందించునట్టియు అపరిశుభ్రమైనట్టియు విరుద్ధమైనట్టియు అన్నపానములను సేవించుట, అకాలమునందు అన్నపానములను సేవించుట, కామము, కోపము, లోభము మోహము, అసూయ, సిగ్గు, దుఃఖము అభిమానము ఉద్వేగము భయము వీనితోకూడిన మనస్సుకలవాడై అన్నపానములను సేవించుట

వీనివలనకూడ ఆమదోషము కలుగును. ఆలోచన శోకము భయము కోపము దుఃఖము ఎల్లప్పుడు పరుండుట రాత్రి మేలుకొనుట వీనితోకూడి హితకరమైన ఆహారమును పరిమితిగ భుజించినను జీర్ణముకానేరదు. ఆ ఆమదోషము విసూచికయనియు అలసక మనియు రెండువిధములుగ నుండును.

### విసూచికాలక్షణము

మూ॥ తత్ర విసూచికామూర్ధ్వం చాధశ్చ ప్రవృత్తామాం దోషాం యథోక్తరూపాం విద్యాత్ ॥14॥

అ॥ ఆమదోషము ఆయాలక్షణములతోకూడి ఊర్ధ్వాధోమార్గములనుండి బయలు వెడలినయెడల విసూచికయనబడును.

### అలసకలక్షణము.

మూ॥ అలసకముపదేక్ష్యామః — దుర్బలస్యాల్పాగ్నేర్బహు శ్లేష్మణో వాతమూత్రపురీష వేగధారిణః స్థిరగురుబహురూక్షశీత శుష్కాన్న సేవిన స్తదన్న పానమనిలప్రపీడితం శ్లేష్మణా చ విబద్ధమార్గ మతిమాత్రప్రలీనమలసత్వాన్న బహిర్ముఖీభవతి, తతశ్ఛర్ద్యతీసార వర్జ్యాన్యామప్రదోషలిఙ్గాని యథోక్తాన్యభిదర్శయత్యతిమాత్రాణి; అతిమాత్రప్రదుష్టాశ్చ దోషాః ప్రదుష్టామబద్ధమార్గాస్తిర్యగ్గచ్ఛన్తః కదాచిత్కేవలమేవాస్య శరీరం దణ్డవత్ స్తమ్భయన్తి, తతస్తమలసక మసాధ్యం బ్రువతే ॥15॥

అ॥ దుర్బలుడైనట్టియు అగ్నిమాంద్యము కలిగినట్టియు అధికశ్లేష్మము కలిగి నట్టియు వాతమూత్రపురీషములయొక్క వేగములను అరికట్టునట్టియు స్థిరగుణమును గురుగుణమును అధికప్రమాణమును రూక్షగుణమును శీతవీర్యమును కలదియు ఎండిన దియు నగు ఆహారమును భుజించునట్టియు మనుజునియొక్క అన్నపానములు వాతముచే పీడింపబడి కఫముచే అరికట్టబడినమార్గముకలవై మిక్కిలిఅణగియుండి మందముగ నుండుటవలన బయలువెడలనేరవు. అప్పుడు ఆమదోషమునకు చెప్పబడిన వాంతియు అతిసారమును గాక మిగిలినలక్షణములు అధికముగ కలుగును. మిక్కిలి ప్రకోపించిన దోషములు దుష్టమైనఆమముచే అరికట్టబడినమార్గముకలవై అడ్డముగ సంచరించుచు ఒకానొకప్పుడు శరీరమునంతను దండమునువలె స్తంభింపచేయును ఇది అలసక మనబడును. అసాధ్యముగ నుండును.

### ఆమవిషలక్షణము.

మూ॥ విరుద్ధాధ్యశనాజీర్ణాశనశీలినః పునరామదోషమామ విషమిత్యాచక్షతే భిషజః, విషసదృశలిఙ్గత్వాత్; తత్పరమసాధ్యం, ఆశుకారి త్వాద్విరుద్ధోపక్రమత్వాదితి ॥16॥

అ॥ విరుద్ధాహారమును భుజించునట్టియు భుజించినవెంటనే మరల భుజించునట్టియు పక్వముగాకుండ భుజించునట్టియు మనుజునియొక్క ఆమదోషము విషముతో సమానమైన లక్షణములు కలదగుటచే ఆమవిషమని చెప్పబడును. ఇది వెంటనే చంపునదగుటవలనను పరస్పరవిరుద్ధమైన చికిత్సకలదగుటవలనను అసాధ్యముగ నుండును.

## ఆమదోషచికిత్స.

మూ॥ తత్ర సాధ్యమామం ప్రదుష్టమలసీభూతముల్లేఖయేదాదౌ పాయయిత్వా లవణముష్ణం చ వారి; తతః స్వేదనవర్తిప్రణిధానాభ్యాముపాచరేదుపవాసయేచ్చైనమ్ ॥17॥

అ॥ సాధ్యమైనట్టియు అణిగియున్నట్టియు ఆమదోషమును, మొదట ఉప్పును వేడినీటిని త్రాగించి వెడలింపచేయవలయును. పిదప స్వేదనమును ఫలవర్తులను ప్రయోగింపవలయును. మరియు ఉపవాసమును చేయింపవలయును.

## విసూచికాచికిత్స.

మూ॥ విసూచికాయాం తు లఘనమేవాగ్రే విరిక్తవచ్చానుపూర్వీ ॥18॥

అ॥ విసూచివ్యాధియందు తొలుత లంఘనమును చేయింపవలయును. మరియు విరేచనములు చేయింపబడినవానికివలె సంసర్జనక్రమమును చేయింపవలయును.

## ఆమదోషచికిత్స.

మూ॥ ఆమప్రదోషేషు త్వన్నకాలే జీర్ణాహారం పునర్దోషావలిప్తామాశయం స్తిమితగురుకోష్ఠమనన్నాభిలాషిణమభిసమీక్ష్య పాయయేద్దోషశేషపాచనార్థమౌషధమగ్నిసంధుక్షణార్థం చ, న త్వేవాజీర్ణాశనం; ఆమప్రదోషదుర్బలో హ్యగ్నిర్యుగపద్దోషమౌషధమాహారజాతం చాశక్తః పక్తుం, అపి చామప్రదోషాహారౌషధవిభ్రమోఽతిబలత్వాదుపరతకాయాగ్నిం సహసైవాతురమబలమతిపాతయేత్ ॥19॥

అ॥ ఆమదోషమునందు అన్నకాలమున ఆహారము జీర్ణమైనపిదప ఆమాశయము దోషముచే పూయబడి కోష్ఠము స్తిమితముగను బరువుగను నుండుట ఆహారమునుకోరక పోవుట ఈలక్షణములున్నప్పుడు మిగిలినదోషము పక్వమగుటకును జఠరాగ్నివృద్ధిపొందుటకును ఔషధము నియ్యవలయును. ఆహారము జీర్ణముకాకుండనున్నప్పుడు ఔషధము నియ్యకూడదు. ఆమదోషముచే దుర్బలముగనున్న జాఠరాగ్ని ఆమదోషమును ఔషధమును ఆహారమును ఒకేసారి పక్వముచేయజాలదు. మరియు ఆమదోషము

ఆహారము ఔషధము వీనియొక్క కలయిక మిక్కిలిబలముకలదగుటవలన జాఠరాగ్ని నశించినట్టియు దుర్బలుడుగ నున్నట్టియు రోగిని వెంటనే చంపును.

## ఆమదోషజవ్యాధి చికిత్స.

మూ॥ ఆమప్రదోషజానాం పునర్వికారాణామపతర్పణేనై వోపరమోభవతి, సతి త్వనుబన్ధే కృతాపతర్పణానాం వ్యాధీనాం నిగ్రహే నిమిత్తవిపరీతమపాస్యౌషధమాతఙ్కవిపరీతమేవావచారయే ద్యథాస్వం; సర్వవికారాణామపిచ నిగ్రహే హేతువ్యాధివిపరీతమౌ షధమిచ్ఛన్తి కుశలాః, తదర్థకారి వా ॥20॥

అ॥ ఆమదోషమువలనకలిగిన వ్యాధులు లంఘనముచేతనే శమించును. అట్లు లంఘనమును చేయించినను శమింపక నిలిచియున్నచో హేతువిపరీతమగు లంఘన చికిత్సను విడిచిపెట్టి ఆయావ్యాధులకు చెప్పబడిన వ్యాధివిపరీతచికిత్సనే చేయింపవల యును. హేతువిపరీతమైనట్టిగాని వ్యాధివిపరీతమైనట్టిగాని హేతుసమానాకారకమై నట్టిగాని వ్యాధిసమానాకారకమైనట్టిగాని చికిత్స సమస్తవ్యాధులను నశింపచేయును.

## ఆమదోషమునశించినపిదప చేయదగిన చికిత్స.

మూ॥ విముక్తామప్రదోషస్య పునః పరిపక్వదోషస్య దీప్తే చాగ్నావభ్యఙ్గాస్థాపనానువాసనం విధివత్స్నేహపానం చ యుక్త్యా ప్రయోజ్యం ప్రసమీక్ష్య దోషభేషజదేశకాలబలశరీరాహారసాత్మ్య సత్త్వప్రకృతివయసామవస్థాన్తరాణి వికారాంశ్చ సమ్యగితి ॥21॥

అ॥ ఆమదోషము పక్వమై నశించి జాఠరదీప్తి కలిగినపిదప, దోషము ఔషధము దేశము కాలము బలము శరీరము ఆహారము అభ్యాసము సత్త్వము ప్రకృతి వయస్సు వ్యాధి వీనియొక్క అవస్థాభేదములను తెలిసికొనిన వైద్యుడు అభ్యంగమును ఆస్థాపన వస్తిని అనువాసనవస్తిని స్నేహపానమును తగువిధమున చేయింపవలయును.

మూ॥ అశితం ఖాదితం పీతం లీఢం చ క్వ విపచ్యతే। ఏత త్త్వాం ధీర! పృచ్ఛామస్తన్న ఆచక్ష్వ బుద్ధిమన్! ఇత్యగ్నివేశప్ర ముఖైః శిష్యైః పృష్టః పునర్వసుః। ఆచచక్షే తతస్తేభ్యోయతా హారో విపచ్యతే॥ నాభిస్తనాన్తరం జన్తోరామాశయ ఇతి స్మృతః। అశితం ఖాదితం పీతం లీఢం చాత్ర విపచ్యతే ॥ ఆమాశయగతః పాకమాహారః ప్రాప్య కేవలమ్। పక్వః సర్వాశ్రయం పశ్చాద్ధమనీభిః ప్రపద్యతే ॥25॥

అ॥ "మ్రింగబడినట్టియు నమలబడినట్టియు త్రాగబడినట్టియు నాకబడినట్టియు ఆహారము ఎచ్చట పక్వమగునో మాకు చెప్పుము" అని అగ్నివేశుడు మొదలగు శిష్యులచే అడుగబడిన ఆత్రేయుడు ఆహార మెచ్చట పక్వమగునో అవిషయమును చెప్పెను. నాభిప్రదేశమునకును స్తనప్రదేశమునకును మధ్యయందు మనుష్యునకు ఆమాశయ ముండును. అందు, మ్రింగబడినట్టియు నమలబడినట్టియు త్రాగబడినట్టియు నాకబడినట్టియు ఆహారము పక్వమగును. ఆహారము ఆమాశయమును పొంది పూర్తిగ పాకమును పొందినదై పిదప ధమనులద్వారా సమస్తశరీరమును వ్యాపించును.

## అధ్యాయసంగ్రహము.

మూ॥ తస్య మాత్రావతో లిఙ్గం ఫలం చోక్తం యథాయథమ్ । అమాత్రస్య తథా లిఙ్గం ఫలం చోక్తం విభాగశః॥ ఆహారవిధ్యాయతనాని చాష్టౌ సమ్యక్పరీక్ష్యాత్మహితం విదధ్యాత్ ।అన్యశ్చ యః కశ్చిదిహాస్తి మార్గో హితోపయోగేషు భజేత తం చ ॥27॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే విమానస్థానే త్రివిధకుక్షీయం విమానం నామ ద్వితీయోఽధ్యాయః॥

అ॥ పరిమాణయుక్తమగు ఆహారమునకు లక్షణమును, ఫలమును, హీనాధిక పరిమాణయుక్తములగు ఆహారములకు లక్షణములును, ఫలములును చెప్పబడినవి. ఎనిమిదివిధములగు ఆహారవిధివిశేషహేతువులను బాగుగ తెలిసికొని తనకు హితకరమైన దానిని సేవింపవలయును. మరియు నిట్టి హితకరములగు ఇతరమార్గములనుకూడ అనుసరింపవలయును.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామకకృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితావ్యాఖ్యానమునందు త్రివిధకుక్షీయవిమానమనెడు ద్వితీయాధ్యాయము సమాప్తము.

—o—

# తృతీయాధ్యాయము.



మూ॥ అథాతో జనపదోద్ధ్వంసనీయంవిమానం వ్యాఖ్యాస్యామః॥

అ॥ పిమ్మట జనపదోద్ధ్వంసనీయవిమానమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ జనపదమణ్డలే పఞ్చాలక్షేత్రే ద్విజాతివరాధ్యుషితాయాం కామ్పిల్యరాజధాన్యాం భగవాన్పునర్వసురాత్రేయోఽన్తేవాసిగణపరివృతః పశ్చిమే ఘర్మమాసే గఙ్గాతీరే వనవిచారమనువిచరఞ్ఛిష్యమగ్నివేశమబ్రవీత్ ॥ దృశ్యన్తేహి ఖలు సౌమ్య! నక్షత్రగ్రహచన్ద్రసూర్యానిలానలానాం దిశాం చ ప్రకృతిభూతానామృతువైకారికా భావాః, అచిరాదితో భూరపిచ న యథావద్రసవీర్యవిపాకప్రభావమోషధీనాం ప్రతివిధాస్యతి, తద్వియోగాచ్చాతఙ్కప్రాయతా నియతా; తస్మాత్ప్రాగుద్ధ్వంసాత్ప్రాక్ చ భూమేర్విరసీభావాదుద్ధరధ్వం సౌమ్య! భైషజ్యాని యావన్నోపహతరసవీర్యవిపాకప్రభావాణి భవన్తి; వయం చైషాం రసవీర్యవిపాకప్రభావానుపయోక్ష్యామహే, యే చాస్మాననుకాఙ్క్షన్తి, యాంశ్చ వయమనుకాఙ్క్షామః, నహి సమ్యగుద్ధృతేషు భైషజ్యేషు సమ్యగ్విహితేషు సమ్యగ్విచారచారితేషు జనపదోద్ధ్వంసకరాణాం వికారాణాం కించిత్ప్రతీకారగౌరవం భవతి ॥4॥

అ॥ అనేకగ్రామములతోకూడిన పాంచాలదేశమునందున్నట్టియు ద్విజాతులతో కూడినట్టియు కాంపిల్యరాజధానియందు శిష్యులతోకూడిన ఆత్రేయుడు గ్రీష్మఋతువు యొక్క అంతమునందు గంగాతీరమున వనవిహారమునుచేయుచు అగ్నివేశునితో ఇట్లు చెప్పెను. నక్షత్రములు గ్రహములు చంద్రుడు సూర్యుడు వాయువు అగ్ని దిక్కులు ఇవి స్వభావముగనే కనబడుచున్నను ఋతుధర్మములయందు మార్పులు కనబడుచున్నవి. శీఘ్రకాలములోనేభూమికూడ ఓషధులకు సరియైన రసము వీర్యము విపాకము ప్రభావము వీనిని కలిగింపచేయజాలనిదియగును. అందువలన వ్యాధులు అధికముగ కలుగును. ఋతుధర్మములు చెడుటకును భూమియందువిరసత్వమేర్పడుటకును ముందుగనే, రసము వీర్యము విపాకము ప్రభావము చెడని ఇవికల ఓషధులను సమకూర్పవలయును. అట్లు చేసినచో సరియైన రసవీర్యవిపాకప్రభావములను మనము అనుభవింపగలము. మఱియు మనలను ఆశ్రయించియుండువారును మనయొక్క ఇష్టులును అనుభవింపవచ్చును. సరియైనకాలమునందు గ్రహింపబడినట్టియు బాగుగతయారుచేయబడినట్టియు ఔషధములను ఆలోచించి ప్రయోగించినచో జనపదోద్ధ్వంసకరములగు వ్యాధులు బాధింపనేరవు.

## జనపదోద్ధ్వంసకారణములు.

మూ॥ ఏవంవాదినం భగవన్తమాత్రేయామగ్నివేశ ఉవాచ— ఉద్ధృతాని ఖలు భగవన్! భైషజ్యాని విహితాని చసమ్యక్ సమ్యగ్విచారచారితాని ; అపి తు ఖలు జనపదోద్ధ్వంసనమే

కేనైవ వ్యాధినా యుగపదసమానప్రకృత్యాహారదేహబలసాత్మ్య సత్త్వవయసాం మనుష్యాణాం కస్మాద్భవతీతి ॥ తమువాచ భగవానాత్రేయః—ఏవమసామాన్యానామేభిరగ్నివేశ ! ప్రకృత్యాదిభిర్భావైర్మనుష్యాణాంయేఽన్యే భావాఃసామాన్యాస్తద్వైగుణ్యాత్సమానకాలాఃసమానలిఙ్గాశ్చ వ్యాధయోఽభినిర్వర్తమానాజనపదముద్ధ్వంసయన్తి, తే తు ఖల్విమే భావాః సామాన్యా జనపదేషు భవన్తి; తద్యథా - వాయురుదకం దేశః కాల ఇతి ॥6॥

అ॥ ఓషధులను సకాలమునందే గ్రహించి సరియైన ఔషధములనుగ తయారు చేసి ఆలోచించి ప్రయోగింపవచ్చును. కాని ప్రకృతి ఆహారము దేహము బలము అభ్యాసము సత్త్వము వయస్సు ఇవి భిన్నముగగల చాలమంది మనుష్యులకు ఒకేవిధమైన వ్యాధి ఒకసమయముననే కలిగి గ్రామములను ఎట్లు నశింపచేయును ? అని అగ్నివేశుడు అడుగగా ఆత్రేయుడు ఇట్లు చెప్పెను. ప్రకృతిమొదలగు భావములు భిన్నములుగ నున్నను ఇతరములగు సామాన్యభావములు వైగుణ్యము నొందుటవలన సమానలక్షణములుకల వ్యాధి ఒకేసమయమునందు కలిగి గ్రామములను నశింపచేయును. వాయువు, ఉదకము, దేశము, కాలము అనునవి సామాన్యభావములుగ నుండును.

## దుష్టవాయులక్షణములు.

మూ॥ తత్ర వాతమేవంవిధమనారోగ్యకరం విద్యాత్ ; తద్యథా- యథర్తువిషమమతిస్తిమితమతిచలమతిపరుషమతిశీతమత్యుష్ణమతిరూక్షమత్యభిష్యన్దినమతిభైరవారావమతిప్రతిహతపరస్పరగతి మతికుణ్డలినమసాత్మ్యగన్ధ బాష్పసికతా పాంశుధూమోపహతమితి॥7॥

అ॥ ఋతువిపరీతధర్మకలదియు, వీచకుండుట వీచుట పారుష్యము చల్లదనము వెచ్చదనము రౌక్ష్యము తేమ భయంకరమైన ధ్వని కొట్టబడిన పరసర్పగమనము సుడి తిరుగుడు ఇవి అధికముగ కలదియు, అనిష్టగంధము ఆవిరి ఇసుక ధూళి పొగ వీనితో కూడినదియు నగు వాయువు అనారోగ్యకారణముగ నుండును.

## దుష్టోదకలక్షణములు.

మూ॥ ఉదకం తు ఖలు - అత్యర్థవికృతగన్ధవర్ణరసస్పర్శవత్క్లేదబహులమపక్రాన్తజలచరవిహఙ్గముపక్షీణజలాశయమప్రీతికరమపగతగుణం విద్యాత్ ॥8॥

అ॥ అధికముగ చెడిన గంధము వర్ణము రసము స్పర్శము ఇవి కలదియు అధికముగ క్లేదమునొందినదియు జలమునందు సంచరించు జంతువులచేతను పక్షులచేతను విడిచి

పెట్టబడినదియు శుష్కించిన జలాశయమునం దున్నదియు అసహ్యముగ నున్నదియు మంచిగుణములు నశించినదియు నగు ఉదకము అనారోగ్యకారణముగ నుండును.

## దుష్టదేశలక్షణములు.

**మూ॥** దేశం పునః—వికృతవర్ణగన్ధరసస్పర్శం క్లేదబహులము పసృష్టంసరీసృపవ్యాలమశకశలభమక్షికా మూషకోలూకశ్మాశానిక శకుని జమ్బుకాదిభిస్తృణోలూపవనవన్తం లతాప్రతానాదిబహులము పూర్వవదవపతితం శుష్కనష్టసస్యం ధూమ్రపవనం ప్రధ్మాతపతత్రి గణముత్క్రుష్టశ్వగణముద్భ్రాన్తవ్యథితవివిధమృగపక్షిసఙ్ఘముత్సృష్ట నష్టధర్మసత్యలజ్జాచారశీలగుణజనపదం శశ్వత్క్షుభితోదీర్ణసలిలాశయం ప్రతతోల్కాపాతనిర్ఘాతభూమికమ్పమతిభయారావరూపం రూక్ష తామ్రారుణసితాభ్రజాలసంవృతార్కచన్ద్రతారకమభీక్ష్ణం ససంభ్ర మోద్వేగమివ సత్రాసరుదితమివ సతమస్కమివ గుహ్యకాచరితమి వాక్రన్దితశబ్దబహులం చాహితం విద్యాత్ ॥౭॥

అ॥ చెడిన వర్ణము గంధము రసము స్పర్శము ఇవికలదియు, అధికమగు క్లేద ముతో కూడినదియు, పాములు త్రాచుపాములు దోమలు మిడతలు ఈగలు ఎలుకలు గుడ్లగూబలు గ్రద్దలు నక్కలు మొదలగువానితో కూడినదియు, గడ్డిచేతను దర్భల చేతను ఆవరింపబడిన ఉద్యానవనములు కలదియు, పొదలు మొదలగువానిచే ఆవరింప బడినదియు, క్రొత్తదానివలె కనబడుచున్నదియు, ఎండినట్టియు నశించినట్టియు సస్యము కలదియు, పొగతోకూడిన గాలికలదియు, అధికముగ ఎగురుచున్న పక్షుల యొక్క గుంపులు కలదియు, రోదనమును చేయుచున్న కుక్కలు కలదియు,ఇటునటు తిరుగుచున్నట్టియు వ్యాకులత నొందినట్టియు అనేకములైన మృగములయొక్కయు పక్షులయొక్కయు గుంపులుకలదియు, విడిచిపెట్టబడినట్టియు నశించినట్టియు ధర్మము సత్యము లజ్జ ఆచారము నడవడిక గుణములు ఇవికల జనసమూహముతో కూడినదియు, ఎల్లప్పుడును క్షోభనొందుచున్నట్టియు పొంగుచున్నట్టియు జలాశయములు కలదియు, తోకచుక్కలు పిడుగులు భూకంపములు ఇవి ఎల్లప్పుడును కలదియు, మిక్కిలి భయం కరమైన ధ్వనులతోకూడినదియు, రూక్షముగను తామ్రవర్ణముగను ఎర్రగను తెల్లగను మేఘములచే ఆవరింపబడినవిగను నుండు సూర్యుడును చంద్రుడును నక్షత్రములును కలదియు, సంభ్రమము ఉద్వేగము భయము రోదనము చీకటి వీనితో కూడినదానివలె నున్నదియు, పిశాచములు తిరుగుచున్నట్లు రోదనధ్వనులతో కూడినదియునగు దేశము అనారోగ్యకారణముగ నుండును.

## దుష్టకాలలక్షణములు.

మూ॥ కాలం తు ఖలు-యథ ర్తులిఙ్గాద్విపరీతలిఙ్గమతిలిఙ్గం హీన లిఙ్గం చాహితం వ్యవస్యేతే ॥10॥

అ॥ ఆయాఋతువులకు ఉండవలసిన ధర్మములు వ్యత్యాసముగగాని అధికముగ గాని తక్కువగగాని యున్నకాలము అనారోగ్యకారణముగ నుండును.

మూ॥ ఇమానేవందోషయుక్తాంశ్చతురో భావాన్ జనపదో ద్ధ్వంసకరాన్ వదన్తి కుశలాః; అతోఽన్యథాభూతాంస్తు హితాన్యా చక్షతే ॥11॥

అ॥ ఇట్టి దుష్టలక్షణములతో కూడిన ఈ నాలుగును జనపదోద్ధ్వంసమునకు కారణములుగ నుండును. మంచిలక్షణములతో కూడియున్నయెడల ఆరోగ్యకారణము లుగ నుండును.

మూ॥ విగుణేష్వపి తు ఖల్వేతేషు జనపదోద్ధ్వంసనకరేషు భావేషు భేషజేనోపపాద్యమానానామభయం భవతి రోగేభ్యఇతి 12॥

అ॥ జనపదోద్ధ్వంస కారణములగు వాయువు ఉదకము దేశము కాలము ఇవి దుష్టములైనను సరియగు ఔషధములను సేవించినచో రోగములవలన భయముకలుగదు.

మూ॥ వైగుణ్యముపపన్నానాం దేశకాలానిలామ్బుసామ్।గరీ యస్త్వం విశేషేణ హేతుమత్సం ప్రవక్ష్యతే॥ వాతాజ్జలం, జలాద్దేశం, దేశాత్కాలం , స్వభావతిః।విద్యాద్దుష్పరిహార్యత్వాద్గరీయ స్తరమర్థ విత్॥ వాయ్వాదిషు యథోక్తానాం దోషాణాం తు విశేషవిత్ । ప్రతీ కారస్య సౌకర్యే విద్యాల్లాఘవలక్షణమ్॥ చతుర్ష్వపి తు దుష్టేషు కాలాన్తేషు యదా నరాః। భేషజేనోపపాద్యన్తే న భవన్త్యాతురా స్తదా ॥16॥

అ॥ చెడిన దేశము కాలము వాయువు ఉదకము వీనిలో ఆధిక్యమును సకారణ ముగ చెప్పుచున్నాము. స్వభావముగనే విడిచిపెట్టుటకు వీలులేనివగుటవలన వాయువు కంటె ఉదకమును ఉదకముకంటె దేశమును దేశముకంటె కాలమును బలవత్తరమైన హేతువుగ నుండును. ఒకదానికంటెనొకటి విడిచిపెట్టుటకు వీలైనవగుటవలన కాలము కంటె దేశమును దేశముకంటె ఉదకమును ఉదకముకంటె వాయువును స్వల్పహేతు వుగ నుండును. ఇట్లు ఈ నాలుగింటియొక్క విశేషములను తెలిసికొనవలయును. వాయువు మొదలగు నాలుగును దుష్టములైనప్పుడు సరియైన ఔషధములను సేవించి నచో రోగములు కలుగనేరవు.

మూ॥ యేషాం న మృత్యుసామాన్యం సామాన్యం న చ కర్మణామ్ । కర్మ పఞ్చవిధం తేషాం భేషజం పరముచ్యతే ॥ రసాయనానాం విధివచ్చోపయోగః ప్రశస్యతే । శస్యతే దేహవృత్తిశ్చ భేషజైః పూర్వముద్ధృతైః॥ సత్యం భూతే దయా దానం బలయో దేవతార్చనమ్ ।సద్వృత్తస్యానువృత్తిశ్చ ప్రశమో గుప్తిరాత్మనః॥ హితం జనపదానాం చ శివానాముపసేవనమ్। సేవనం బ్రహ్మచర్యస్య తథైవ బ్రహ్మచారిణామ్॥ సంకథా ధర్మశాస్త్రాణాం మహర్షీణాం జితాత్మనామ్। ధార్మికైః సాత్త్వికైర్నిత్యం సహాస్యా వృద్ధసమ్మతైః॥ ఇత్యేతద్భేషజం ప్రోక్తమాయుషః పరిపాలనమ్ । యేషామనియతో మృత్యుస్తస్మిన్కాలే సుదారుణే ॥22॥

అ॥ ఎవరికి సంభవింపబోవు మృత్యువు సామాన్యముగ సంభవించునదికాదో ఎవరికి సంభవింపబోవు మృత్యువుయొక్క కారణములు సామాన్యముగ సంభవింపనివి కావో అట్టివారలకు పంచకర్మలు శ్రేష్ఠమైన చికిత్సగ నుండును. రసాయనౌషధములను విధిప్రకారముగ సేవించుట ఋతువులును భూమియు వికృతినొందుటకు పూర్వమునందు గ్రహింపబడిన ఔషధములను సేవించుట, సత్యము, భూతదయ, దానము, బలికర్మ, దేవతలను పూజించుట, మంచినడవడిక, శాంతము, ఆత్మరక్షణము, ప్రశస్తములగు గ్రామములయందు నివసించుట, బ్రహ్మచర్యమును అవలంబించుట, బ్రహ్మచారులను సేవించుట, ధర్మశాస్త్రసంబంధమైనట్టియు ఇంద్రియనిగ్రహముకల మహర్షుల సంబంధములైనట్టియు కథలను వినుట, ధార్మికులును సాత్వికులును వృద్ధులకు ఇష్టులును నగు వారలతో కలిసియుండుట ఇవి ఆయువును రక్షించుకొనుటకు సాధనములుగ నుండును. మరియు అకాలమృత్యువునుండి రక్షించుకొనుటకు కూడ సాధనములుగ నుండును.

### వాయ్వాదులు చెడుటకు కారణములు.

మూ॥ ఇతి శ్రుత్వా జనపదోద్ధ్వంసనే కారణాన్యాత్రేయస్య భగవతః పునరపి భగవన్తమాత్రేయమగ్నివేశ ఉవాచ-అథ ఖలు భగవన్! కుతో మూలమేషాం వాయ్వాదీనాం వైగుణ్యముత్పద్యతే, యేనోపపన్నా జనపదముద్ధ్వంసయన్తీతి॥ తమువాచ భగవానాత్రేయః— సర్వేషామగ్నివేశ! వాయ్వాదీనాం యద్వైగుణ్యముత్పద్యతే తస్య మూలమధర్మః, తన్మూలం వాసత్కర్మపూర్వకృతం; తయోర్యోనిః ప్రజ్ఞాపరాధ ఏవ । తద్యథా-యదా దేశనగరనిగమజనపదప్రధానా ధర్మముత్క్రమ్యాధర్మేణ ప్రజాం వర్తయన్తి, తదాశ్రితోపాశ్రితాః పౌరజనపదా వ్యవహారోపజీవినశ్చ తమధర్మమభివర్ధయన్తి,

తతః సోఽధర్మః ప్రసభం ధర్మమన్తర్ధత్తే, తతస్తేఽన్తర్హితధర్మాణో దేవతాభిరపి త్యజ్యన్తే, తేషాం తథాఽన్తర్హితధర్మాణామధర్మప్రధానానామపక్రాన్తదేవతానామృతవో వ్యాపద్యన్తే; తేన నాపో యథాకాలం దేవో వర్షతి న వా వర్షతి వికృతా వా వర్షతి, వాతా న సమ్యగభివాన్తి, క్షితిర్వ్యాపద్యతే, సలిలాన్యుపశుష్యన్తి, ఓషధయః స్వభావం పరిహాయాపద్యన్తే వికృతిం, తత ఉద్ధ్వంసన్తే జనపదాః స్పృశ్యాభ్యవహార్యదోషాత్ ॥24॥

అ॥ ఆత్రేయుని చేచెప్పబడిన జనపదోద్ధ్వంసనకారణములను విని అగ్నివేశుడు మరల ఇట్లు అడిగెను. వాయువు దేశము మొదలగునవి చెడుటకు కారణమేమి? అవి ఏవిధముగ జనపదోద్ధ్వంసమును చేయును ? అని అడగబడిన ఆత్రేయుడు ఇట్లు చెప్పెను. వాయువు మొదలగునవి చెడుటకు అధర్మముగాని పూర్వజన్మకృత పాపకర్మగాని కారణముగ నుండును. ఈ రెండింటికిని ప్రజ్ఞాపరాధము కారణముగ నుండును. ఎటులననగా- దేశము పురములు పట్టణములు పల్లెలు వీనియందలి అధికారులు ధర్మమును విడనాడి ప్రజలను అధర్మపరులనుగ చేయుదురు. అప్పుడు ఆశ్రితులును ఉపాశ్రితులును నగు ప్రజలును వ్యవహారములచేజీవించు ప్రజలును అట్టి అధర్మమును వృద్ధినొందించెదరు. పిమ్మట ఆ అధర్మము ధర్మమును వెంటనే నశింపచేయును. అట్లునశించిన ధర్మముకల ప్రజలను దేవతలు విడిచిపెట్టుదురు. ప్రజలు ధర్మమును విడిచిపెట్టి అధర్మపరులై దేవతలచే విడిచిపెట్టబడుటవలన ఋతుధర్మములు వైపరీత్యము నొందును. అందువలన సకాలమునందు వర్షింపకుండుటగాని ఎప్పుడును వర్షింపకుండుటగాని వికృతముగ వర్షించుటగాని కలుగును. వాయువు సరిగ వీచదు. భూమి చెడిపోవును. ఉదకము తగ్గిపోవును. ఓషధులు స్వాభావికగుణములను విడిచిపెట్టి వికృతగుణములను పొందును. ఇట్టివానిని స్పృశించుటవలనను సేవించుటవలనను జనపదోద్ధ్వంసము కలుగును.

## జనపదోద్ధ్వంసమునకు ఇతర కారణములు.

మూ॥ తథా శస్త్రప్రభవస్యాపి జనపదోద్ధ్వంసస్యాధర్మ ఏవ హేతుర్భవతి । యేఽతిప్రవృద్ధలోభరోషమోహమానాస్తే దుర్బలానవమత్యాత్మస్వజనపరోపఘాతాయ శస్త్రేణ పరస్పరమభిక్రామన్తి, పరాన్వాఽభిక్రామన్తి, పరైర్వాఽభిక్రామ్యన్తే। రక్షోగణాదిభిర్వా వివిధైర్భూతసఙ్ఘైస్తమధర్మమన్యద్వాఽప్యపచారాన్తరముపలభ్యాభిహన్యన్తే॥ తథాఽభిశాపప్రభవస్యాప్యధర్మ ఏవ హేతుర్భవతి; యే లుప్తధర్మాణో ధర్మాదపేతాస్తే గురువృద్ధసిద్ధర్షిపూజ్యానవమత్యాహితాన్యాచరన్తి, తతస్తాః ప్రజా గుర్వాదిభిరభిశప్తా భస్మతాముప

యాన్తి ప్రాగేవానేకపురుషకులవినాశాయ; నియతప్రత్యయోపల
మ్భాన్నియతాః, అనియతప్రత్యయోపలమ్భాదనియతాశ్చాపరే ॥27॥

అ॥ కొందఱు, అధికమైన లోభము రోషము మోహము అభిమానము ఇవికలవారై దుర్బలులను అవమానపరచి పరస్పరము కత్తులతో పోరాడి తనకును తనపరివారమునకును ఇతరులకును నాశనముకలుగునట్లు చేయుదురు. లేక కొందఱు పరులను నశింపచేయుదురు. కొందఱు పరులచే నశింపచేయబడుదురు. ఈవిధమునకలుగు జనపదోధ్వంసమునకుకూడ అధర్మమే కారణముగ నుండును. రాక్షసులు పిశాచములు మొదలగు అనేకవిధములైన భూతసముదాయమువలనకలుగు జనపదోధ్వంసమునకుకూడ అధర్మముగాని ఇట్టి ఇతరాపచారముగాని కారణముగ నుండును. శాపమువలనకలుగు జనపదోధ్వంసమునకుకూడ అధర్మమే కారణముగ నుండును. ఎవరు ధర్మమును విడిచిపెట్టి అధర్మపరులై గురువులను వృద్ధులను సిద్ధులను ఋషులను పూజ్యులను అవమానపరచి అహితముల నాచరించెదరో వారు అట్టిగురువులు మొదలగువారిచే శపింపబడి నశించెదరు. వెంటనే అనేకకులములు నశించును. నియమముగ శపించినచో అట్లు శపింపబడినవారును నియమములేకుండగ శపించినచో చాలమందియు నశించెదరు.

### యుగక్రమముననుసరించి ఆయుఃక్షీణించిన క్రమము.

మూ॥ ప్రాగపి చాధర్మాదృతే నాశుభోత్పత్తిరన్యతోఽ
భూత్ । ఆదికాలే హ్యదితిసుతసమౌజసోఽతివిమలవిపులప్రభావాః ప్రత్య
క్షదేవదేవర్షిధర్మయజ్ఞవిధివిధానాః శైలసారసంహతస్థిరశరీరాః
ప్రసన్నవర్ణేన్ద్రియాః పవనసమబలజవపరాక్రమాశ్చారుస్ఫిచోఽ
భిరూపప్రమాణాకృతిప్రసాదోపచయవన్తః సత్యార్జవానృశంస్యదాన
దమనియమతపఉపవాసబ్రహ్మచర్యవ్రతపరా వ్యపగతభయరాగద్వే
షమోహలోభక్రోధశోకమానరోగనిద్రాతన్ద్రాశ్రమక్లమాలస్యపరి
గ్రహాశ్చ పురుషా బభూవురమితాయుషః, తేషాముదారసత్త్వగుణకర్మ
ణామచిన్త్యరసవీర్యవిపాకప్రభావగుణసముదితాని ప్రాదుర్బభూవుః
సస్యాని సర్వగుణసముదితత్వాత్పృథివ్యాదీనాం కృతయుగస్యాదౌ।
భ్రశ్యతి తు కృతయుగే కేషాంచిదత్యాదానాత్సాంపన్నికానాం శరీర
గౌరవమాసీత్, శరీరగౌరవాత్ శ్రమః, శ్రమాదాలస్యం, ఆలస్యాత్
సంచయః, సంచయాత్ పరిగ్రహః, పరిగ్రహాల్లోభః ప్రాదుర్భూతః॥
తతస్త్రేతాయాం లోభాదభిద్రోహః, అభిద్రోహాదనృతవచనం, అనృ
తవచనాత్కామక్రోధమానద్వేషపారుష్యాభిఘాతభయతాపశోకచి
త్తోద్వేగాదయః ప్రవృత్తాః; తతస్త్రేతాయాం ధర్మపాదోఽన్తర్ధాన

**మగమాత్, తస్యాన్తర్ధానాత్ పృథివ్యాదీనాం గుణపాదప్రణాశోఽభూత్, తత్ప్రణాశకృతశ్చ సస్యానాం స్నేహవైమల్యరసవీర్యవిపాకప్రభావగుణపాదభ్రంశః; తతస్తాని ప్రజాశరీరాణి హీనగుణపాదైశ్చాహారవిహారైరయథాపూర్వముపష్టభ్యమానాన్యగ్నిమారుతపరీతాని ప్రాగ్వ్యాధిభిర్జ్వరాదిభిరాక్రాన్తాని, అతః ప్రాణినో హ్రాసమవాపురాయుషః క్రమశ ఇతి ॥29॥**

అ॥ పూర్వమునందుకూడ అధర్మము లేకుండగ ఇతరకారణములవలన అశుభము కలుగలేదు. ఆదికాలమునందు పురుషులు—దేవతలతో సమానమైన పరాక్రమము కలవారుగను, అధికమైన బలమును శక్తియు కలవారుగను, ప్రత్యక్షముగనున్న దేవతలును దేవర్షులును ధర్మమును యజ్ఞదేవతయు యజ్ఞవిధాయక వేదమును యజ్ఞకర్మయు కలవారుగను. పర్వతమువలె సారవంతముగను కలిసినదిగను స్థిరముగను నున్న శరీరము కలవారుగను, నిర్మలమైన శరీరకాంతియు ఇంద్రియములును కలవారుగను, వాయువుతో సమానమైన బలమును వేగమును పరాక్రమమును కలవారుగను, సుందరమైన పిరుదులు కలవారుగను, సరియైన ప్రమాణమును ఆకారమును తేజస్సును పుష్టియు కలవారుగను, సత్యము ఋజుప్రవర్తనము అహింస దానము ఇంద్రియనిగ్రహము నియమము తపస్సు ఉపవాసము బ్రహ్మచర్యము వ్రతములు వీనియందు ఆసక్తి కలవారుగను, భయము రాగము ద్వేషము మోహము లోభము క్రోధము దుఃఖము అభిమానము రోగము నిద్ర బడలిక శ్రమ క్లమము సోమరితనము మమత్వము ఇవి లేనివారుగను నై అమితమైన ఆయువును కలిగియుండిరి. ఉదారమైన సత్వగుణమును కర్మయు కలవారలకు కృతయుగముయొక్క ఆదియందు భూమి మొదలగునవి సమస్తగుణములతో కూడియుండుటవలన ఊహింపనలవికాని రసము వీర్యము విపాకము ప్రభావము గుణములు ఇవి కల ఓషధులు లభించినవి. కృతయుగము గడచినకొలదియు భాగ్యవంతులు కొందరు ఆహారమును అధికముగ సేవించుటవలన వారికి శరీరగౌరవము ఏర్పడెను. శరీరగౌరవము వలన శ్రమయు, శ్రమవలన సోమరితనమును, సోమరితనము వలస ధనమును సమకూర్చుటయందు ఇచ్ఛయు, ధనాపేక్షవలన మమత్వమును, మమత్వమువలన లోభమును కలిగెను. పిమ్మట త్రేతాయుగమునందు లోభమువలన ద్రోహచింతయు, ద్రోహచింతవలన అసత్యములాడుటయు, అసత్యమువలన కామము క్రోధము అభిమానము ద్వేషము పరుషత్వము అభిఘాతము భయము తాపము శోకము ఉద్రేకము మొదలగునవియు కలిగినవి. అందువలన త్రేతాయుగమునందు ధర్మములో నాల్గవవంతు క్షీణించెను. అట్లు క్షీణించుటవలన భూమి మొదలగువానియొక్క గుణములలో నాల్గవవంతు నశించెను. అందువలన సస్యములయందలి స్నేహగుణము విశదగుణము రసము వీర్యము విపాకము ప్రభావము గుణములు వీనిలో నాల్గవవంతు నశించెను. అప్పుడు క్షీణించిన నాల్గవవంతుగుణములు కలిగిన ఆహారవిహారములచే పూర్వముకంటె భిన్నముగ పోషింపబడుచున్నట్టియు విషమములైన అగ్నివాయువులతో కూడినట్టియు మనుజుల

యొక్క శరీరములు ముందుగ జ్వరము మొదలగువ్యాధులచే ఆక్రమింపబడినవి. అందు వలన ప్రాణులయొక్క ఆయువు క్రమముగ క్షీణించెను.

మూ॥ యుగే యుగే ధర్మపాదః క్రమేణానేన హీయతే। గుణపాదశ్చ భూతానామేవం లోకః ప్రలీయతే ॥ సంవత్సరశతే పూర్ణే యాతి సంవత్సరః క్షయమ్। దేహినామాయుషః కాలేయత్రయన్మాన మిష్యతే ॥31॥

అ॥ ఈప్రకారముగనే ప్రతియుగమునందును ధర్మములో ఒక్కొక్కపాదము క్షీణించెను. భూతములయొక్క గుణములుకూడ ఇట్లే నశించెను. లోకము ఇట్లు క్షీణించెను. యుగమునకు చెప్పబడిన పరిమాణములో నూరవవంతు గడచునప్పటికి ప్రాణులయొక్క ఆయుఃపరిమాణములో ఒక్కొకసంవత్సరము తగ్గుచుండును.

మూ॥ ఇతి వికారాణాం ప్రాగుత్పత్తిహేతురుక్తో భవతి॥ ఏవంవాదినం భగవన్తమాత్రేయమగ్నివేశ ఉవాచ—కిం ను ఖలు భగవన్ ! నియతకాలప్రమాణమాయుః సర్వం న వేతి ॥33॥

అ॥ ఈవిధమున వ్యాధులు ప్రారంభమునందుపుట్టినవిధము చెప్పబడినది. అని చెప్పిన ఆత్రేయునిగూర్చి అగ్నివేశుడు "ఆయువుయొక్క పరిమాణము నియతమా ? అనియతమా ?" అని అడిగెను.

మూ॥ ఇహాగ్నివేశ! భూతానామాయుర్యుక్తిమపేక్షతే। దైవే పురుషకారే చ స్థితం హ్యస్యబలాబలమ్॥ దైవమాత్మకృతం విద్యాత్కర్మయత్పౌర్వదైహికమ్। స్మృతః పురుషకారస్తు క్రియతేయదిహాపరమ్॥ బలాబలవిశేషోఽస్తి తయోరపి చ కర్మణోః। దృష్టం హి త్రివిధం కర్మ హీనం మధ్యమముత్తమమ్॥ తయోరుదారయోర్యుక్తిర్దీర్ఘస్య చ సుఖస్య చ। నియతస్యాయుషో హేతుర్విపరీతస్య చోత్తరా॥ మధ్యమా మధ్యమస్యేష్టా, కారణం శృణు చాపరమ్। దైవం పురుషకారేణ దుర్బలం హ్యుపహన్యతే ॥ దృష్ట్వా యదేకే మన్యన్తేనియతంమానమాయుషః। కర్మకించిత్క్వచిత్కాలే విపాకే నియతం మహత్। కించిత్త్వకాలనియతం ప్రత్యయైఃప్రతిబోధ్యతే ॥40॥

అ॥ ప్రాణులయొక్క ఆయువు యుక్తిననుసరించియుండును. ఆయువు యొక్క బలాబలములు దైవమును పురుషకారమును ఆశ్రయించియుండును. తనచే పూర్వజన్మయందుచేయబడిన కర్మ దైవమనియు ఈజన్మయందు చేయబడినకర్మ పురుషకారమనియు చెప్పబడును. అట్టి రెండుకర్మలయొక్కయు బలాబలములయందు విశే

షము కలదు. హీనము మధ్యమము ఉత్తమము అని కర్మ మూడువిధములుగ నుండును. అందు ఉత్తమకర్మలు పరిపూర్ణమైనట్టియు సుఖయుక్తమైనట్టియు నియమితమైనట్టియు ఆయువునకును, హీనకర్మలు అల్పమైనట్టియు కష్టయుక్తమైనట్టియు అనియతమైనట్టియు ఆయువునకును, మధ్యమకర్మలు మధ్యమవిధమైన ఆయువునకును కారణముగ నుండును. దైవము దుర్బలముగనున్నచో పురుషకారముచే తిరస్కరింపబడును. పురుషకారము దుర్బలముగనున్నచో దైవముచే తిరస్కరింపబడును. దీనినిబట్టి కొందరు ఆయువుయొక్క పరిమాణమును నియతమైనదానినిగ తలచెదరు. మహత్తరమగుకర్మ నియతకాలమునందు పరిపాకమునొందును. హీనబలముకల కర్మయొక్క పరిపాకకాలము అనియతముగ నుండును. ఇతరకారణములు కలిసినచో నియతకాలమునందు పరిపాకమునొందును.

మూ॥ తస్మాదుభయత్వాదేకాన్తగ్రహణమసాధు; నిదర్శన
మపి చాత్రోదాహరిష్యామః— యది హి నియతకాలప్రమాణమా
యుఃసర్వం స్యాత్, తదాయుష్కామాణాం న మన్త్రౌషధిమణిమఙ్గల
బల్యుపహారహోమనియమప్రాయశ్చిత్తోపవాసస్వస్త్యయనప్రణిపాత
గమనాద్యాః క్రియా ఇష్టయశ్చ ప్రయుజ్యేరన్, నోద్భ్రాన్తచణ్డ
చపలగోగజోష్ట్రతురగమహిషాదయః పవనాదయశ్చ దుష్టాః పరి
హార్యాః స్యుః, న ప్రపాతగిరివిషమదుర్గామ్బువేగాః, తథా న ప్ర
మత్తోన్మత్తోద్భ్రాన్తచణ్డచపలమోహలోభాకులమతయః, నారయ
న ప్రవృద్ధోఽగ్నిః, న చ వివిధవిషాశ్రయాః సరీసృపోరగాద
యః, న సాహసం. నాదేశకాలచర్యా, న నరేన్ద్రప్రకోపః; ఇత్యేవ
మాదయో భావా న భావకరాః స్యుః, ఆయుషః సర్వస్య
నియతకాలప్రమాణత్వాత్; న చానభ్యస్తాకాలమరణభయనివార
కాణామకాలమరణభయమాగచ్ఛేత్ప్రాణినాం, వ్యర్థాశ్చారమ్భ
కథాప్రయోగబుద్ధయః స్యుర్మహర్షీణాం రసాయనాధికారే,
నాపీన్ద్రో నియతాయుష్యం శత్రుం వజ్రేణాభిహన్యాత్, నాశ్వినా
వార్తం భేషజేనోపపాదయేతాం, న మహర్షయో యథేష్టమా
యుస్తపసా ప్రాప్నుయుః, న చ విదితవేదితవ్యా మహర్షయః ససురేశా
రసాయనాదీని సమ్యక్ పశ్యేయురుపదిశేయురాచరేయుర్వా; అపిచ
సర్వచక్షుషామేతత్పరం—యదైన్ద్రం చక్షుః, ఇదం చాస్మాకం ప్రత్య
క్షం, యథా—పురుషసహస్రాణాముత్థాయోత్థాయాహవం కుర్వతా
మకుర్వతాం చాతుల్యాయుష్ట్వం, తథా జాతమాత్రాణామప్రతీకా

రాత్ ప్రతీకారాచ్చ, అక్షవిషప్రాశినాం చాతుల్యాయుష్ట్వం, న చ తుల్యో యోగక్షేమ ఉదపానఘటానాం చిత్రఘటానాం చోత్సీదతాం, తస్మాద్ధితోపచారమూలం జీవితమతో విపర్యయాన్మృత్యుః; అపిచ దేశకాలాత్మగుణవిపరీతానాం కర్మణామాహారవిహారాణాంచ క్రియోపయోగం సమ్యక్ సర్వాతియోగసంధారణమసంధారణముదీర్ణానాం చ గతిమతాంసాహసానాం చ వర్జనమారోగ్యానువృత్తౌ హేతుముపలభామహే ఉపదిశామః సమ్యక్ పశ్యామశ్చేతి ॥41॥

అ॥ అందుచే రెండువిధములుగను నుండుటవలన, ఆయువు నియతమైనదని చెప్పుట యుక్తముకాదు. ఇందులకు నిదర్శనమును చెప్పుచున్నాము. ఆయుఃప్రమాణము నియతమైనకాలముకలదైనచో ఆయువుకొఱకు మంత్రములు ఓషధులు మణులు మంగళాచరణము బలికర్మ పూజ హోమము నియమము ప్రాయశ్చిత్తయ ఉపవాసము స్వస్తివాచనములు నమస్కారములు యాత్రలు క్రతువులు మొదలగువానిని ప్రయోగింపనవసరముండదు. మరియు ఉద్వేగమునొందినట్టియు కోపస్వభావముకలిగినట్టియు పరుగిడుచున్నట్టియు ఎద్దులు ఏనుగులు ఒంటెలు గాడిదలు గుఱ్ఱములు దున్నపోతులు మొదలగువానినుండియు దుష్టమైనవాయువు మొదలగువానినుండియు రక్షించుకొనవలసిన అవసరముండదు. కొండచరియలు కొండలు మిట్టపల్లములు దుర్గమప్రదేశములు నీటివేగము వీనివలన అపాయము కలుగదు. ప్రమత్తులైనట్టియు ఉన్మత్తులైనట్టియు ఉద్వేగము నొందినట్టియు కోపస్వభావముకలిగినట్టియు చపలురైనట్టియు మోహముచేతను లోభముచేతను వ్యాకులమైన మనస్సుకలిగినట్టియు మనుజులు ఏమియు చేయజాలరు. శత్రువులు, అగ్ని, అనేకవిధములైన విషముకలపాములు త్రాచుపాములు మొదలగునవి, సాహసకర్మ, దేశవైపరీత్యము, కాలవైపరీత్యము, ప్రభువుయొక్క కోపము వీనివలన భయము కలుగనేరదు. పూర్ణమైన ఆయువు నియతమైన కాలప్రమాణము కలదైనచో పూర్వమునందు చెప్పబడినవానియొక్క కృత్యములు నిష్ప్రయోజనములగును. అకాలమరణమును నశింపచేయు విధానములను ఆచరింపనివారలు అకాలమరణమువలన భయము నొందనవసరములేదు. మహర్షులచే ఆచరింపబడినట్టియు రసాయనప్రకరణమునందు చెప్పబడినట్టియు ప్రయోగింపబడినట్టియు విషయము వ్యర్థములగును. దేవేంద్రుడుగూడ శత్రువును వజ్రాయుధముచే చంపజాలడు. అశ్వినీదేవతలు రోగికి ఔషధము నియ్యనవసరములేదు. మహర్షులు తపస్సుచే ఆయురభివృద్ధిని పొందజాలరు. సమస్తమును తెలిసిన మహర్షులును దేవేంద్రుడును రసాయనము మొదలగువానిని తెలిసికొనుటగాని ఉపదేశించుటగాని ఆచరించుటగాని చేయనవసరములేదు. సమస్తప్రమాణములలోను ప్రత్యక్షప్రమాణము శ్రేష్ఠమైనది. కావున ప్రత్యక్షప్రమాణముచే నిరూపించుచున్నాము. యుద్ధమును చేయుచున్నవారలకును చేయనివారలకును, చికిత్సను పొందనివారలకును పొందినవారలకును, విషమును తిననివారలకును తినినవారలకును ఆయువు భిన్నముగ కనబడుచునేయున్నది. ఉపయోగింపబడుచున్న కుండకును ఉపయోగింపబడని కుండకును నశించుటయందు భేదము కనబడుచున్నది. అందువలన

ఆయువునకు హితకరమైన ఉపచారమే కారణముగ నుండును. అహితమైన ఉపచారము మృత్యువునకు కారణముగ నుండును. దేశము కాలము ప్రకృతి వీనికి విపరీతములు కాని కృత్యములను ఆహారవిహారములను సరిగ నాచరించుట, అతియోగముగ నాచరింపకుండుట, వేగధారణమును చేయకుండుట, సాహసకృత్యములను చేయకుండుట వీనిని ఆరోగ్యము చెడకుండగనుండుటకు కారణములనుగ పొందుచున్నాము. మరియు అట్లు చెప్పుచున్నాము. చూచుచున్నాము.

**కాలాకాలమృత్యువులయొక్క నిరూపణము.**

మూ॥ అతః పరమగ్నివేశ ఉవాచ—ఏవం సత్యనియతకాలం ప్రమాణాయుషాం భగవన్! కథమ కాలమృత్యురకాలమృత్యుర్వా భవతీతి॥ తమువాచ భగవానాత్రేయః—శ్రూయతామగ్నివేశ! యథా—యానసమాయుక్తోఽక్షః ప్రకృత్యైవాక్షగుణైరుపేతఃసర్వగుణోపపన్నో వాహ్యమానో యథాకాలం స్వప్రమాణక్షయాదేవావసానం గచ్ఛేత్, తథాఽఽయుః శరీరోపగతం బలవత్ప్రకృత్యా యథావదుపచర్యమాణం స్వప్రమాణక్షయాదేవావసానం గచ్ఛతి, స మృత్యుః కాలే; యథా చ స ఏవాక్షోఽతిభారాధిష్ఠితత్వాద్విషమపథాదపథాదక్ష చక్రభఙ్గాద్వాహ్యవాహకదోషాదణిమోక్షాదుపర్యసనాదనుపాఙ్గాచ్చాన్తరా వ్యసనమాపద్యతే, తథాఽఽయురప్యయథాబలమారమ్భాదయథాగ్న్యభ్యవహరణాద్విషమశరీరన్యాసాదతిమైథునాదసత్సంశ్రయాదుదీర్ణవేగవినిగ్రహాద్విధార్యవేగావిధారణాద్భూతవిషవాయ్వగ్న్యుపతాపాదభిఘాతాదాహారప్రతీకారవివర్జనాచ్చ యావదన్తరా వ్యసనమాపద్యతే, స మృత్యురకాలే; తథాజ్వరాదీనప్యాతఙ్కాన్మిథ్యోపచరితానకాలమృత్యూన్పశ్యామ ఇతి ॥43॥

ఆ॥ ఆయుఃపరిమాణకాలము నియతము కానిచో కాలమృత్యువును అకాలమృత్యువును ఎట్లు కలుగును? అని అగ్నివేశుడు అడుగగా ఆత్రేయుడు ఇట్లు చెప్పెను. యానమునకు (బండ్లు మొదలగువానికి) కూర్పబడిన ఇరుసు తనకుండవలసిన లక్షణములతోడను ఇతరలక్షణములతోడను కూడుకొని లాగబడుచున్నదై తనపరిమాణము క్రమముగ తగ్గుటవలననే సకాలమునకు నాశనమునొందును. ఈవిధముగనే శరీరగతమైన ఆయువు ప్రకృతికి అనుకూలముగ ఉపచరింపబడినదై తనపరిమాణము క్రమముగ క్షీణించుటవలననే సమాప్తము నొందును. ఇది కాలమృత్యువనబడును. అట్టి ఇరుసే అధికమైన బరువును వేయుటవలనను, హెచ్చుతగ్గులుగ నున్నమార్గమునందును మార్గముకానిపళ్ళమునందును వెళ్ళుటవలనను, చక్రములు విరుగుటవలనను, నడిపించువానియొక్కయు లాగువానియొక్కయు దోషమువలనను, కీలము (మేకు)

ఊడిపోవుటవలనను, ఇటునటు కొట్టుకొనుటవలనను, చమురు వేయకపోవుటవలనను మధ్యకాలములోనే నశించును. ఈవిధముగనే ఆయువుకూడ తన శక్తికిమించిన పనులను చేయుటవలనను, జాఠరాగ్నిబలమును మించి భుజించుటవలనను, విషమాహారమువలనను, శరీరమును హెచ్చుతగ్గులుగ నుంచుటవలనను, అధిక మైథునమువలనను, దుష్టసహవాసమువలనను, వేగధారణమువలనను, కామక్రోధాదులను అరికట్టకపోవుటవలనను, భూతములు విషము వాయువు అగ్ని వీనిచే తపింపచేయబడుటవలనను, అభిఘాతమువలనను, ఆహారనియమమును విడిచిపెట్టుటవలనను మధ్యకాలమునందే సమాప్తము నొందును. ఇది అకాలమృత్యువనబడును. సరిగ చికిత్సింపబడని జ్వరాదులవలన కూడ అకాలమృత్యువు సంభవించును.

## జ్వరితునకు ఉష్ణజలవిచారణ.

మూ॥ అథాగ్నివేశః పప్రచ్ఛ-కిం ను ఖలు భగవన్! జ్వరితేభ్యః పానీయముష్ణంభూయిష్ఠం ప్రయచ్ఛన్తిభిషజో న తథా శీతం, అస్తి చ శీతసాధ్యో ధాతుర్జ్వరకర ఇతి॥ తమువాచ భగవానాత్రేయః-జ్వరితస్య కాయసముత్థానదేశకాలానభిసమీక్ష్య పాచనార్థం పానీయముష్ణం ప్రయచ్ఛన్తి భిషజః; జ్వరో హ్యామాశయసముత్థః; ప్రాయో భేషజాని చామాశయసముత్థానాం వికారాణాం పాచనవమనాపతర్పణసమర్థాని భవన్తి పాచనార్థం చ పానీయముష్ణం, తస్మాదేతజ్జ్వరితేభ్యః ప్రయచ్ఛన్తిభిషజో భూయిష్ఠం; తద్ధ్యేషాం పీతం వాతమనులోమయతి, అగ్నిముదర్యముదీరయతి, క్షిప్రం జరాం గచ్ఛతి. శ్లేష్మాణం చ పరిశోషయతి, స్వల్పమపి చ పీతం తృష్ణాప్రశమనాయోపపద్యతే; తథాయుక్తమపి చైతన్నాత్యర్థోత్సన్నపిత్తే జ్వరే సదాహభ్రమప్రలాపాతిసారే వా ప్రదేయం, ఉష్ణేన హి దాహభ్రమప్రలాపాతిసారా భూయోఽభివర్ధన్తే, శీతేనోపశామ్యన్తీతి ॥ 15 ॥

అ॥ జ్వరముకలవారలకు ఉష్ణోదకమునే తరుచుగ ఇచ్చెదరు. అట్లు శీతలోదకమును ఎందుకు ఇయ్యరు ? శీతక్రియచే సాధ్యమగు దోషము(పిత్తము) కూడ జ్వరమును కలిగించుచున్నదికదా! అని అగ్నివేశుడు అడుగగా ఆత్రేయుడు ఇట్లు చెప్పెను. జ్వరితునకు, ప్రకృతి హేతువు దేశము కాలము వీనిని ఆలోచించి ఉష్ణోదకమును పాచననిమిత్తము ఇచ్చుచున్నారు. జ్వరము ఆమాశయము ననుసరించి పుట్టును. ఆమాశయము ననుసరించి జనించిన వ్యాధులకు పాచనములును, వమనకరములును అపతర్పణములును నగు ఔషధములను తరుచుగ ఉపయోగించెదరు. ఉష్ణోదకము పాచనమును చేయును. కావుననే జ్వరితులకు ఉష్ణోదకమును తరుచుగనిచ్చెదరు. అట్లు

ఆమాశయమననుసరించిజనించిన వ్యాధులకు పాచనములును వమనకరములును అప తర్పణములును నగు ఔషధములను తరుచుగ ఉపయోగించెదరు. ఉష్ణోదకము పాచన మును చేయును. కావుననే జ్వరితులకు ఉష్ణోదకమును తరుచుగ నిచ్చెదరు. అట్లు త్రాగబడిన ఉష్ణోదకము వాతమును అనులోమము నొందించును. మరియుజాఠరాగ్నిని వృద్ధిపరచును. త్వరలో జీర్ణమునొందించును. శ్లేష్మమును నశింపచేయును. కొద్దిగ త్రాగినను దప్పికను పోగొట్టును. అట్టిదైనను మిక్కిలి ఉద్రేకమునొందిన పిత్తముకల జ్వరమునందుగాని తాపము మోహము ప్రలాపము అతిసారము ఇవికల జ్వరమునందు గాని ఇయ్యకూడదు. ఉష్ణక్రియచే తాపము మోహము ప్రలాపము అతిసారము ఇవి అభివృద్ధినొందును. శీతలక్రియచే ఇవి శాంతించును. 

మూ॥ శీతేనోష్ణకృతాన్ రోగాన్ శమయన్తి భిషగ్విదః। యేతు శీతకృతా రోగా స్తేషాంచోష్ణం భిషగ్జితమ్ ॥46॥ 

అ॥ ఉష్ణవ్యాధులను శీతలక్రియలచేతను, శీతవ్యాధులను ఉష్ణక్రియలచేతను శాంతింపచేయుచున్నారు.

మూ॥ ఏవమితరేషామపి వ్యాధీనాం నిదానవిపరీతమౌషధం భవతి కార్యం; యథా—అపతర్పణనిమిత్తానామపి వ్యాధీనాంనాన్త రేణ పూరణమస్తిశాన్తిః; తథా పూరణనిమిత్తానాం నాన్తరేణాప తర్పణమితి॥ అపతర్పణమపి చ త్రివిధం— లఙ్ఘనం, లఙ్ఘనపాచనం, దోషావసేచనం చేతి ॥ తత్ర లఙ్ఘనమల్పబలదోషాణాం, లఙ్ఘనేన హ్యగ్నిమారుతవృద్ధ్యా వాతాతపపరీతమివాల్పముదకమల్పదోషః ప్రశోషమాపద్యతే॥ లఙ్ఘనపాచనే తు మధ్యబలదోషాణాం,లఙ్ఘన పాచనాభ్యాం హి మధ్యబలో దోషఃసూర్య సంతాపమారుతాభ్యాం పాంశుభస్మావకిరణైరివ చానతిబహూదకం ప్రశోషమాపద్యతే॥ బహుదోషాణాం పునర్దోషావసేచనమేవ కార్యం, న హ్యభిన్నే కేదారసేతౌ పల్వలాప్రసేకోఽస్తి, తద్వద్దోషావసేచనమ్॥ దోషావ సేచనంతు ఖల్వాన్యద్వా భేషజం ప్రాప్తకాలమప్యాతురస్య నైవంవి ధస్యకుర్యాత్, తద్యథా — అనపవాదప్రతీకారస్యాధనస్యాపరిచార కస్య వైద్యమానినశ్చణ్డస్యాసూయకస్య తీవ్రాధర్మరుచేరతిక్షీణబల మాంసశోణితస్యాసాధ్యరోగోపహతస్య ముమూర్షులిఙ్గైర్న్వితస్య చేతి। ఏవంవిధం హ్యాతురముపచరన్ భిషక్పాపీయసాఽయశసా యోగమృ చ్ఛతీతి ॥52॥

అ॥ ఈవిధమున నే ఇతరవ్యాధులయందుకూడ నిదానవిపరీతమగు ఔషధము నియ్యవచ్చును. ఎటులననగా - అపతర్పణమువలనజనించిన వ్యాధులు బృంహణచికిత్స చేతను, బృంహణమువలనజనించిన వ్యాధులు అపతర్పణచికిత్సచేతను శాంతించును. లంఘనము, లంఘనపాచనము, శోధనము అని అపతర్పణచికిత్స మూడువిధములుగ నుండును. స్వల్పబలముకలిగినదోషముకలవారలకు లంఘనమును చేయింపవలయును. స్వల్పముగనున్న ఉదకము గాలితోడను ఎండతోడను వ్యాప్తమైనదై ఎండిపోవురీతిని లంఘనముచే జాఠరాగ్నియు వాతమును వృద్ధినొందుటవలన స్వల్పమగుదోషము శాంతించును. మధ్యమబలముకలిగినదోషముకలవారలకు లంఘనపాచనములను చేయింపవలయును. మిక్కిలి అధికముగలేనిఉదకము సూర్యునివేడిమిచేతను వాయువుచేతను దుమ్మును బూడిదను చల్లుటచేతను నశించురీతిని మధ్యమబలముకలదోషము లంఘనపాచనములచే శాంతించును. అధికదోషముకలవారలకు శోధనచికిత్సనే చేయింపవలయును. నీరు అధికముగ నున్నచో మడియొక్కగట్టును తెగగొట్టకుండగ మడియందలి నీరంతయు పోజాలనిరీతిని శోధనచికిత్సనుచేయకుండగ దోషమంతయు నశింపజాలదు. అపవాదములను నివారింపచేసికొననట్టియు ధనములేనట్టియు పరిచారకులులేనట్టియు వైద్యుడననితలచుకొనునట్టియు కోపస్వభావమును అసూయయు కలిగినట్టియు తీవ్రమైన అధర్మములయందు అభిరుచికలిగినట్టియు బలమును మాంసమును రక్తమును మిక్కిలిక్షీణించినట్టియు అసాధ్యమైనవ్యాధికలిగినట్టియు మరణలక్షణములతో కూడినట్టియు రోగికి సమయమువచ్చినను శోధనౌషధమునుగాని ఇతరవిధమగుఔషధమునుగాని ఇయ్యకూడదు. ఇచ్చినచో పాపముతోకూడిన అపకీర్తిని పొందును.

మూ॥ అల్పోదకద్రుమో యస్తు ప్రవాతః ప్రచురాతపః। జ్ఞేయః స జాఙ్గలో దేశః స్వల్పరోగతమోఽపిచ ॥ప్రచురోదకవృక్షో యో నివాతో దుర్లభాతపః। అనూపో బహుదోషశ్చ, సమః సాధారణో మతః ॥54॥

అ॥ ఉదకమును వృక్షములును స్వల్పముగ కలదియు అధికములైన గాలియు ఎండయు కలదియు రోగములు స్వల్పముగ కలదియు నగు ప్రదేశము జాంగలదేశ మనబడును. ఉదకమును వృక్షములును అధికముగ కలదియు గాలియు ఎండయు స్వల్పముగ కలదియు రోగములు మిక్కిలి అధికముగలేనిదియు నగు ప్రదేశము అనూపదేశ మనబడును. పైనచెప్పబడిన రెండుదేశములయొక్కయు లక్షణములు మధ్యమముగకల ప్రదేశము సాధారణదేశ మనబడును.

మూ॥ తదాత్వే చానుబన్ధే వా యస్య స్యాదశుభం ఫలమ్। అకర్మణ స్తన్న కర్తవ్యమేతద్బుద్ధిమతాం మతమ్ ॥55॥

అ॥ ఏకర్మవలన తత్కాలమునందుగాని ఉత్తరకాలమునందుగాని అశుభఫలము కలుగునో అట్టికర్మను చేయకూడదు.

అధ్యాయసంగ్రహము.

మూ॥ పూర్వరూపాణి సామాన్యా హేతవః స్వస్వలక్షణాః। దేశోద్ధ్వంసస్య భైషజ్యం హేతూనాం మూలమేవ చ॥ ప్రాగ్వికార సముత్పత్తిరాయుషశ్చ క్షయక్రమః। మరణం ప్రతి భూతానాం కాలాకాలవినిశ్చయః॥ యథా చాకాలమరణం యథాయుక్తం చ భేషజమ్। సిద్ధిం యాత్యౌషధం యేషాం న కుర్యాద్యేన హేతునా॥ తదాత్రేయోఽగ్నివేశాయ నిఖిలం సర్వముక్తవాన్। దేశోద్ధ్వంసనిమిత్తీయే విమానే మునిసత్తమః॥59॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే విమానస్థానే జనపదోద్ధ్వంసనీయం విమానం నామ తృతీయోఽధ్యాయః॥

అ॥ ఈజనపదోద్ధ్వంసనీయాధ్యాయమునందు, జనపదోద్ధ్వంసమునకు మొదట కనబడులక్షణములు, సామాన్యకారణములు, చెడిన ఆకారణములకు కలుగులక్షణములు, ఆకారణములు చెడుటకు హేతువు, ఔషధములు, ప్రారంభమున వ్యాధులు పుట్టిన క్రమము, ఆయువుక్షీణించు క్రమము, కాలమృత్యువుయొక్కయు అకాలమృత్యువుయొక్కయు నిరూపణము, అకాలమృత్యువుకలుగు విధము, చికిత్స ఏవిధముగ చేయబడి సరిగనుపకరించునో అట్టివిధము, ఎవరలకు ఏకారణముచే చికిత్సచేయకూడదో ఆవిషయము ఇవన్నియు చెప్పబడినవి.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామకకృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపికయనెడి చరకసంహితావ్యాఖ్యానమునందు జనపదోద్ధ్వంసనీయవిమానమనెడు తృతీయాధ్యాయము సమాప్తము.

—o—

## చతుర్థాధ్యాయము.



మూ॥ అథాతస్త్రివిధరోగవిశేషవిజ్ఞానీయం విమానం వ్యాఖ్యాస్యామః॥1॥

అ॥ పిమ్మట త్రివిధరోగవిశేషజ్ఞానీయవిమానమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

### రోగవిశేషజ్ఞానోపాయములు.

మూ॥ త్రివిధం ఖలు రోగవిశేషవిజ్ఞానం భవతి । తద్యథా—ఆప్తోపదేశః ప్రత్యక్షమనుమానం చేతి ॥3॥

అ॥ ఆప్తోపదేశము ప్రత్యక్షము అనుమానము అను నీమూడును రోగవిశేషములను తెలిసికొనుటకు సాధనములుగ నుండును.

### ఆప్తోపదేశాదుల వివరణము.

మూ॥ తత్రాప్తోపదేశో నామ - ఆప్తవచనం; ఆప్తాహ్యవితర్క స్మృతివిభాగవిదో నిష్ప్రీత్యుపతాపదర్శినశ్చ; తేషామేవంగుణయోగాద్యద్వచనం తత్ప్రమాణం, అప్రమాణం పునర్మత్తోన్మత్తమూర్ఖ వక్తృదృష్టాదృష్టవచనమితి॥ ప్రత్యక్షం తు ఖలు తత్—యత్స్వయమిన్ద్రియైర్మనసా చోపలభ్యతే॥ అనుమానం ఖలు - తర్కోయుక్త్యపేక్షః ॥6॥

అ॥ ఆప్తులయొక్క వచనము ఆప్తోపదేశ మనబడును. నిశ్చయమైనట్టియు అనుభవపూర్వకమైనట్టియు సంపూర్ణమైనట్టియు జ్ఞానముతోకూడినవారును ప్రీతియు ద్వేషమును లేనివారును నగు పురుషులు ఆప్తు లనబడుదురు. ఇట్టిగుణములతోకూడి యుండువారగుటవలన వీరలయొక్క వచనము ప్రమాణముగ నుండును. మత్తులు ఉన్మత్తులు మూర్ఖులు వాచాలురు వీరియొక్క వచనములు దృష్టాదృష్టములైనవిగావున అప్రమాణములుగ నుండును. ఇంద్రియములచేతను మనస్సుచేతను స్వయముగ పొందబడిన జ్ఞానము ప్రత్యక్షప్రమాణముగ నుండును. యుక్తిననుసరించి ఊహించుటయే అనుమాన ప్రమాణ మనబడును.

మూ॥ త్రివిధేన ఖల్వనేన జ్ఞానసముదాయేన పూర్వం పరీక్ష్య రోగం సర్వథా సర్వమేవోత్తరకాలమధ్యవసానమదోషం భవతి; నహి జ్ఞానావయవేన కృత్స్నే జ్ఞేయే జ్ఞానముత్పద్యతే ॥ త్రివిధే త్వస్మిన్ జ్ఞానసముదాయే పూర్వమాప్తోపదేశాత్ జ్ఞానం, తతః ప్రత్యక్షానుమానాభ్యాం పరీక్షోపపద్యతే; కిం హ్యనుపదిష్టే పూర్వం ప్రత్యక్షానుమానాభ్యాం పరీక్షమాణో విద్యాత్; తస్మాత్ ద్వివిధా పరీక్షా జ్ఞానవతాం ప్రత్యక్షమనుమానం చేతి, త్రివిధా వా సహోపదేశేన ॥8॥

అ॥ ఈ మూడువిధములగు ప్రమాణములచేతను రోగమును పూర్తిగ పరీక్షించి తెలిసికొనినచో పిమ్మటచేయబడు ప్రయత్నము నిర్దుష్టముగ నుండును. ఒకప్రమాణము

చేత సంపూర్ణముగ తెలిసికొనుటకు శక్యముగ నుండదు. ఈ మూడువిధములగు ప్రమాణములలోను ఆప్తోపదేశమువలన మొదట తెలిసికొని పిమ్మట ప్రత్యక్షానుమాన ప్రమాణములచే పరీక్షింపవలయును. మొదట ఆప్తోపదేశజ్ఞానము లేనిచో ప్రత్యక్షానుమాన ప్రమాణములచే పరీక్షించి తెలిసికొనజాలడు. ఆప్తోపదేశజ్ఞానము కలిగినపిమ్మట పరీక్ష, ప్రత్యక్షము అనుమానము అని రెండువిధములుగ నుండును. ఆప్తోదేశముతో కూడి మూడువిధములుగ నగును.

## ఆప్తోపదేశమువలన కలుగు జ్ఞానము.

మూ॥ తత్రేదముపదిశన్తి బుద్ధిమన్తః-రోగమేకైకమేవంప్రకోపణమేవం యోనిమేవమాత్మానమేవమధిష్ఠానమేవంవేదనమేవంసంస్థానమేవంవృద్ధిస్థానక్షయసమన్వితమేవముదర్క-మేవంనామానమేవం యోగం విద్యాత్; తస్మిన్నియం ప్రతీకారార్థా ప్రవృత్తిరథవా నివృత్తిరిత్యుపదేశాద్ జ్ఞాయతే ॥9॥

అ॥ ప్రకోపించువిధము, కారణములు, స్వభావము, అధిష్ఠానము, బాధలు, స్వరూపము, వృద్ధి, సమత్వము, క్షీణించుట, ముందుజరుగుబోవువిధము, పేరు, యోగము, శమించుటకొరకు ఆచరింపతగినవిధము, విడిచిపెట్టతగిన విషయములు రోగసంబంధమగు వీనిని ఆప్తోదేశమువలన తెలిసికొనగలము.

## ప్రత్యక్షపరీక్ష

మూ॥ ప్రత్యక్షతస్తు ఖలు రోగతత్త్వం బుభుత్సుఃసర్వైరిన్ద్రియైః సర్వానిన్ద్రియార్థానాతురశరీరగతాన్పరీక్షేతాన్యత్ర రసజ్ఞానాత్; తద్యథా — అన్త్రకూజనం సన్ధిస్ఫోటనమఙ్గులీపర్వణాం చ స్వరవిశేషాయే చాన్యేఽపి కేచిచ్ఛరీరోపగతాః శబ్దాఃస్యుస్తాఞ్ఛ్రోత్రేణ పరీక్షేత; వర్ణసంస్థానప్రమాణచ్ఛాయాః శరీరప్రకృతివికారా చక్షుర్వైషయికాణి యాని చాన్యాని తాని చక్షుషా పరీక్షేత; రసంతు ఖల్వాతురశరీరగతమిన్ద్రియవైషయికమప్యనుమానాదవగచ్ఛేత్, న హ్యస్య ప్రత్యక్షేణ గ్రహణముపపద్యతే, తస్మాదాతురపరిప్రశ్నేనైవాతురముఖరసం విద్యాత్, యూకాపసర్పణేన త్వస్య శరీరవైరస్యం, మాక్షికోపసర్పణేన శరీరమాధుర్యం లోహితపిత్తసందేహే తు కిం ధారిలోహితం లోహితపిత్తం వేతి శ్వకాకభక్షణాద్ధారిలోహితమభక్షణాల్లోహితపిత్తమిత్యనుమాతవ్యం, ఏవమన్యానప్యాతురశరీరగతాన్ రసాదనుమిమీత; గన్ధాంస్తు ఖలు సర్వశరీరగతానాతు

రస్య ప్రకృతివైకారికాన్ ఘ్రాణేన పరీక్షేత; స్పర్శం చ పాణినా ప్రకృతివికృతియుక్తం; ఇతి ప్రత్యక్షతో౽నుమానైకదేశతశ్చ పరీక్షణముక్తమ్ ॥10॥

అ॥ రోగస్వభావమును ప్రత్యక్షప్రమాణమువలన తెలిసికొనదలచినవాడు తన యొక్క ఇంద్రియములచే రోగియొక్క శరీరమునందలి ఇంద్రియార్థములను (శబ్దస్పర్శ రూపరసగంధములను) పరీక్షింపవలయును. రసమునుమాత్రము వేరువిధమున పరీక్షింపవలయును. ప్రేగులరచుట, సంధులయందును వ్రేళ్ళకనుపులయందును కలుగు ధ్వని, స్వరభేదములు, శరీరగతమైన యిట్టి ఇతరధ్వనులు వీనిని శ్రవణేంద్రియముచే పరీక్షింపవలయును. వర్ణము (మలమూత్రనఖజిహ్వాదుల సంబంధమైనది), స్వరూపము, ప్రమాణము, కాంతి, శరీరప్రకృతివర్ణము, శరీరవికృతివర్ణము, నేత్రములతో చూడదగిన ఇతర విషయములు వీనిని చక్షురింద్రియముచే పరీక్షింపవలయును. రోగియొక్క శరీరసంబంధమైనరసము రసనేంద్రియముచే తెలిసికొనతగినదైనను దానిని అనుమానప్రమాణముచే తెలిసికొనవలయును. ప్రత్యక్షప్రమాణములచే తెలిసికొనుటకు తగియుండదు. అందువలన రోగియొక్క ముఖరసమును వానినడిగియే తెలిసికొనవలయును. పేలు ప్రాకుచుండుటచే శరీరము విరసముగనున్నదనియు ఈగలు వాలుచుండుటచే శరీరము మధురముగనున్నదనియు తెలిసికొనవలయును. రక్తపిత్తమునందు శుద్ధరక్తము వెడలుచున్నదా దుష్టరక్తము వెడలుచున్నదా యని సందేహముకలిగినప్పుడు ఆరక్తమును కుక్కలు కాకులు మొదలగువానికి వేసి అవి భక్షించినచో శుద్ధమైనదానినిగను భక్షింపకున్నచో దుష్టమైనదానినిగను తెలిసికొనవలయును. ఇట్లే రోగియొక్క శరీరగతమైన ఇతరరసములనుకూడ తెలిసికొనవలయును. రోగియొక్క శరీరగతములైన ప్రకృతిభిన్నములగు గంధములను ఘ్రాణేంద్రియముచే పరీక్షింపవలయును. ప్రకృతిగగాని వికృతిగగాని యున్న స్పర్శమును హస్తముచే పరీక్షింపవలయును. ఇట్లు ప్రత్యక్షప్రమాణమువలనను అనుమానప్రమాణములోని కొంతభాగమువలనను పరీక్షించువిధము చెప్పబడినది.

## అనుమానపరీక్ష.

మూ॥ ఇమే తు ఖల్వన్యే౽ప్యేవమేవ భూయో౽నుమానజ్ఞేయా భవన్తి భావాః; తద్యథా—అగ్నిం జరణశక్త్యా పరీక్షేత, బలం వ్యాయామశక్త్యా, శ్రోత్రాదీన్ శబ్దాదిగ్రహణేన, మనో౽ర్థావ్యభిచారేణ, విజ్ఞానం వ్యవసాయేన, రజః సఙ్గేన, మోహమవిజ్ఞానేన, క్రోధమభిద్రోహేణ, శోకం దైన్యేన, హర్షమామోదేన, ప్రీతింతోషేణ, భయం విషాదేన, ధైర్యమవిషాదేన, వీర్యముత్థానేన, అవస్థానమవిభ్రమేణ, శ్రద్ధామభిప్రాయేణ, మేధాం గ్రహణేన, సంజ్ఞాం నామగ్రహణేన, స్మృతింస్మరణేన, హ్రియమపత్రపేణ, శీలమనుశీలనేన, ద్వేషం ప్రతిషేధేన, ఉపధిమనుబన్ధేన, ధృతిమలౌల్యేన, వశ్య

త్తాం విధేయతయా, వయోభక్తిసాత్మ్యవ్యాధిసముత్థానానికాలదేశోపశమవేదనావిశేషేణ గూఢలిఙ్గం వ్యాధిముపశయానుపశయాభ్యాం, దోషప్రమాణవిశేషమపచారవిశేషేణ, ఆయుషః క్షయమరిష్టైః, ఉపస్థితశ్రేయస్త్వం కల్యాణాభినివేశేన, అమలం సత్త్వమవికారేణేతి, గ్రహణ్యాస్తు మృదుదారుణత్వం స్వప్నదర్శనమభిప్రాయం ద్విష్టేష్టసుఖదుఃఖాని చాతురపరిప్రశ్నేనైవ విద్యాదితి ॥11॥

అ॥ ఇట్లే కొన్నియితరభావములనుకూడ అనుమానప్రమాణముచే తెలిసికొనవలయును. ఎట్లనగా—జీర్ణశక్తిచే జాఠరాగ్నిని, వ్యాయామశక్తిచే బలమును, శబ్దాదివిషయములను గ్రహించుటనుబట్టి శ్రోత్రాదీంద్రియపటుత్వమును, ఇంద్రియార్థములను తెలిసికొనుటనుబట్టి మనశ్శక్తిని, ప్రయత్నమునుబట్టి జ్ఞానమును, ఆసక్తిచే రజోగుణమును, జ్ఞానము లేకపోవుటనుబట్టి మోహమును, ద్రోహచింతచే కోపమును, దీనత్వముచే శోకమును, ఆమోదించుటచే హర్షమును, సంతోషముచే ప్రీతిని, విషాదముచే భయమును, విషాదము లేకుండుటనుబట్టి ధైర్యమును, ఉత్సాహముచే పరాక్రమమును, మోహము లేకుండుటనుబట్టి స్థిరబుద్ధిని, కోరుటనుబట్టి యిచ్ఛను, గ్రహించుటనుబట్టి మేధాశక్తిని, పేరునుగ్రహించుటచే సంజ్ఞాజ్ఞానమును, స్మరించుటనుబట్టి జ్ఞాపకశక్తిని, సిగ్గుపడుటనుబట్టి సిగ్గును, ఆచరణనుబట్టి శీలమును, నిషేధించుటనుబట్టి ద్వేషమును, ఉత్తరకాలఫలమునుబట్టి మోసమును, ఆసక్తిలేకుండుటనుబట్టి యింద్రియనిగ్రహమును విధేయతనుబట్టి వశుడుగనుండుటను, కాలముననుసరించి వయస్సును, దేశమునుబట్టి ఆహారాదులయందలి యిచ్ఛను, అనుకూలతనుబట్టి సాత్మ్యమును, బాధలనుబట్టి వ్యాధిని, ఉపశయానుపశయములచే గూఢలక్షణములుకలవ్యాధిని, అపచారమునుబట్టి దోషప్రమాణమును, అరిష్టలక్షణములనుబట్టి ఆయుఃక్షయమును, శ్రేయస్కరకార్యముల నాచరించుటనుబట్టి శ్రేయస్సును, చెడుగుణములు లేకుండుటనుబట్టి సత్వగుణమును పరీక్షించి తెలిసికొనవలయును. గ్రహణీస్థానముయొక్క మందత్వతీవ్రత్వములను, స్వప్నములను, ఆహారాదులయం దిచ్ఛను, ద్వేషమును, ఇష్టమును, సుఖమును, దుఃఖమును ప్రశ్నించుటచే (రోగిని అడుగుటచే) తెలిసికొనవలయును.

మూ॥ ఆప్తతశ్చోపదేశేన ప్రత్యక్షకరణేన చ। అనుమానేన చ వ్యాధీన్ సమ్యగ్విద్యాద్విచక్షణః ॥ సర్వథా సర్వమాలోచ్య యథాసమ్భవమర్థవిత్ । అథాధ్యవస్యేత్తత్త్వే చ కార్యే చ తదనన్తరమ్॥ కార్యతత్త్వవిశేషజ్ఞః ప్రతిపత్తౌ న ముహ్యతి। అమూఢః ఫలమాప్నోతి యదమోహనిమిత్తజమ్॥ జ్ఞానబుద్ధిప్రదీపేన యో నావిశతి తత్త్వవిత్ । ఆతురస్యాన్తరాత్మానం న సరోగాంశ్చికిత్సతి ॥15॥

అ॥ ఆప్తోపదేశమువలనను, ప్రత్యక్షప్రమాణమువలనను, అనుమానప్రమాణము వలనను సర్వమును ఆలోచించి వ్యాధులను సరిగ తెలిసికొనవలయును. పిమ్మట వ్యాధి తత్వమును ఉపచారమును తెలిసికొనవలయును. అట్లు తెలిసికొనినచో ప్రతిక్రియల యందు మోహమునొందడు. సరియైనఫలమును పొందును. ఏవైద్యుడు జ్ఞానమును బుద్ధియు అనెడి దీపములతో రోగియొక్క అంతశ్శరీరమునందు ప్రవేశింపడో అట్టి వైద్యుడు రోగములను చికిత్సింపజాలడు.

## అధ్యాయసంగ్రహము.

మూ॥ సర్వరోగవిశేషాణాం త్రివిధం జ్ఞానసంగ్రహమ్ । యథా చోపదిశన్త్యాప్తాః ప్రత్యక్షం గృహ్యతే యథా॥ యే యథాచానుమానేన జ్ఞేయాస్తాంశ్చాప్యుదారధీః। భావాంస్త్రివిధవిజ్ఞానేవిమానే మునిరుక్తవాన్ ॥17॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే విమానస్థానే త్రివిధరోగవిశేషవిజ్ఞానీయవిమానం నామ చతుర్థోఽధ్యాయః॥

అ॥ ఈత్రివిధరోగవిశేషవిజ్ఞానీయాధ్యాయమునందు సర్వరోగములయొక్క విశేషములను తెలిసికొనుటకు సాధనములైన ఆప్తోపదేశము ప్రత్యక్షప్రమాణము అనుమానప్రమాణము ఇవియు, ఆప్తులు ఉపదేశించువిషయములును, ప్రత్యక్షప్రమాణముచే తెలియబడు విషయములును, అనుమానప్రమాణముచే తెలిసికొనదగినవిషయములును చెప్పబడినవి.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామకకృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపికయనెడి చరకసంహితావ్యాఖ్యానమునందు త్రివిధరోగవిశేషవిజ్ఞానీయవిమానమనెడు చతుర్థాధ్యాయము సమాప్తము.

—o—

# పంచమాధ్యాయము.

—oo—

మూ॥ అథాతఃస్రోతోవిమానం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట స్రోతోవిమానమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

స్రోతోవర్ణనము.

మూ॥ యావన్తః పురుషే మూర్తిమన్తో భావవిశేషాస్తావన్త ఏవాస్మిన్ స్రోతసాం ప్రకారవిశేషాః; సర్వభావా హి పురుషేనాంతరేణ స్రోతాంస్యభినిర్వర్తన్తే క్షయం వాఽప్యధిగచ్ఛన్తి; స్రోతాంసి ఖలు పరిణామమాపద్యమానానాం ధాతూనామభివాహీని భవన్త్యయనార్థేన। అపిచైకేమహర్షయః స్రోతసామేవ సముదయం పురుషమిచ్ఛన్తి, సర్వగతత్వాత్ సర్వసరత్వాచ్చ దోషప్రకోపణప్రశమానాం; నత్వేతదేవం, యస్య చ హి స్రోతాంసియచ్చ వహన్తి యచ్చావహన్తియత్ర చావస్థితాని, సర్వం తదన్యత్తేభ్యః। అతిబహుత్వాత్ ఖలు కేచిదపరిసంఖ్యేయాన్యాచక్షతే స్రోతాంసి, పరిసంఖ్యేయాని పునరన్యే ॥5॥

అ॥ పురుషశరీరమునందు మూర్తిమంతములగు భావములు ఎన్ని కలవో అన్ని స్రోతస్సులు కలవు. సమస్తభావముల యొక్కయు ఉత్పత్తిగాని క్షయముగాని స్రోతస్సులద్వారానే కలుగును. పరిణామము నొందుచున్న ధాతువులను స్రోతస్సులు తమమార్గములద్వారా వ్యాపింపచేయును. స్రోతస్సులు సర్వశరీరము నందును వ్యాపించియుండుటవలనను, దోషములను ప్రకోపింపచేయునట్టియు శమింపచేయునట్టియు ఆహారాదులను సర్వశరీరమునందును వ్యాపింపచేయుచుండుటవలనను స్రోతస్సముదాయమే పురుషుడని కొంతమంది మహర్షులు తలచుచున్నారు. స్రోతస్సులు వేనిని వహించుచున్నవో వేనిని వ్యాపింపజేయుచున్నవో వేనినాధారముగ చేసికొనియున్నవో అన్నియు (రసరక్తాదులు) స్రోతస్సులకంటె భిన్నమైనవగుటచే, స్రోతస్సముదాయమే పురుషుడు అనిచెప్పుటకు వీలులేదు. స్రోతస్సులు అత్యధికములుగ నుండుటవలన లెక్కపెట్టుటకు వీలులేనివిగ నుండునని కొందరు చెప్పుచున్నారు. లెక్కపెట్టుటకు వీలుగ నున్నవని కొందరు చెప్పుచున్నారు.

మూ॥ తేషాం తు ఖలు స్రోతసాం యథాస్థూలం కతిచిత్ప్రకారాన్మూలతశ్చ ప్రకోపవిజ్ఞానతశ్చానువ్యాఖ్యాస్యామః, యే భవిష్యన్త్యలమనుక్తార్థజ్ఞానాయ జ్ఞానవతాం విజ్ఞానాయ చాజ్ఞానవతాం, తద్యథా - ప్రాణోదకాన్నరసరుధిరమాంసమేదోఽస్థిమజ్జశుక్రమూత్రపురీషస్వేదవహాని, వాతపిత్తశ్లేష్మణాం పునఃసర్వశరీరచరాణాం సర్వస్రోతాంస్యయనభూతానీతి, తద్వదతీన్ద్రియాణాం పునః సత్త్వాదీనాం కేవలం చేతనావచ్ఛరీరమయనభూతమధిష్ఠానభూతం చ;తదేతత్స్రోతసాం ప్రకృతభూతత్వాన్న వికారైరుపసృజ్యతే శరీరమ్ ॥6॥

అ॥ కొన్ని స్రోతస్సులయొక్క మూలస్థానములను, చెడినప్పుడు కలుగు లక్షణములను చెప్పుచున్నాము. దీనివలన జ్ఞానవంతులకు తెలియనివిషయములు తెలియుటయు తెలియనివారలకు తెలియుటయు కలుగును. ప్రాణవాతము, ఉదకము, ఆహారము, రసము, రక్తము, మాంసము, మేదస్సు, ఎముకలు, మజ్జ, శుక్రము, మూత్రము, పురీషము, స్వేదము వీనిని స్రోతస్సులు వహించి వ్యాపింపచేయుచుండును. సర్వశరీరమునందును వ్యాపించు వాతపిత్తశ్లేష్మములను ఈ స్రోతస్సులన్నియు మార్గములుగ నుండును. చైతన్యముతోకూడిన శరీరము ఇంద్రియములకంటె భిన్నములైన మనస్సు మొదలగువానికి మార్గముగను అధిష్ఠానముగను నుండును. స్రోతస్సులు చెడకుండ నున్నచో శరీరమునందు రోగములు కలుగ నేరవు.

ప్రాణవహస్రోతస్సులయొక్క మూలస్థానము - దుష్టలక్షణములు.

మూ॥ తత్ర, ప్రాణవహానాం స్రోతసాం హృదయం మూలం మహాస్రోతశ్చ, ప్రదుష్టానాం ఖల్వేషామిదం విశేషజ్ఞానం భవతి— అతిసృష్టమతిబద్ధం కుపితమల్పాల్పమభీక్ష్ణం వా సశబ్దశూలముచ్ఛ్వసన్తం దృష్ట్వా ప్రాణవహాన్యస్య స్రోతాంసి ప్రదుష్టానీతివిద్యాత్॥

అ॥ ప్రాణవహస్రోతస్సులకు హృదయమును మహాస్రోతస్సును మూలస్థానములుగ నుండును. శ్వాస విడిపోయినట్లుగాని బిగపట్టినట్లుగాని తొందరగగాని కొద్దికొద్దిగగాని అధికముగగాని ధ్వనితోకూడిగాని బాధతోకూడిగాని వెడలుచున్నచో ఈ స్రోతస్సులు చెడినట్లు తెలిసికొనవలయును.

ఉదకవహస్రోతస్సులయొక్క మూలస్థానము-దుష్టలక్షణములు.

మూ॥ ఉదకవహానాం స్రోతసాం తాలు మూలం క్లోమ చ; ప్రదుష్టానాం ఖల్వేషామిదం విశేషవిజ్ఞానం భవతి. తద్యథా-జిహ్వాతాల్వోష్ఠకణ్ఠక్లోమశోషం పిపాసాం చాతిప్రవృద్ధాం దృష్ట్వోదకవహాన్యస్య స్రోతాంసి ప్రదుష్టానీతి విద్యాత్ ॥8॥

అ॥ ఉదకవహస్రోతస్సులకు తాలుప్రదేశమును క్లోమమును మూలస్థానములుగ నుండును. నాలుకయు తాలుప్రదేశమును పెదవులును కంఠమును క్లోమమును ఎండుచున్నట్లుండుట, దప్పిక అధికముగ కలుగుట ఈ లక్షణములవలన ఉదకవహస్రోతస్సులు చెడినట్లు తెలిసికొనవలయును.

అన్నవహస్రోతస్సులయొక్క మూలస్థానము - దుష్టలక్షణములు.

మూ॥ అన్నవహానాం స్రోతసామామాశయో మూలం వామం చ పార్శ్వం; ప్రదుష్టానాం తు ఖల్వేషామిదం విశేషవిజ్ఞానం భవతి,

తద్యథా— అనన్నాభిలషణమరోచకాఽవిపాకౌ ఛర్దించదృష్ట్వాఽన్న వహాని స్రోతాంసి ప్రదుష్టానీతి విద్యాత్ ॥9॥

అ॥ అన్నవహస్రోతస్సులకు ఆమాశయమును వామపార్శ్వమును మూలస్థానములుగ నుండును. ఆహారమునం దిచ్ఛలేకుండుట, అరోచకము, జీర్ణముకాకుండుట, వాంతి ఇవి యున్నచో అన్నవహస్రోతస్సులు చెడినట్లు తెలిసికొనవలయును.

ధాతువహస్రోతస్సులయొక్క మూలస్థానము - దుష్టలక్షణములు.

మూ॥ రసవహానాం స్రోతసాం హృదయం మూలం దశ చ ధమన్యః, శోణితవహానాం స్రోతసాం యకృన్మూలం ప్లీహాచ, మాంసవహానాం చ, స్రోతసాం స్నాయు మూలం త్వక్చ, మేదోవహానాం స్రోతసాం వృక్కౌ మూలం వపావహానాం చ, అస్థివహానాం స్రోతసాం మేదో మూలం జఘనం చ, మజ్జా వహానాం స్రోతసామస్థీని మూలం సంధయశ్చ, శుక్రవహానాం స్రోతసాం వృషణౌ మూలం శేఫశ్చ, ప్రదుష్టానాం తు ఖల్వేషాం రసాదిస్రోతసాం విజ్ఞానాన్యుక్తాని వివిధాశితపీతీయేఽధ్యాయే। యాన్యేవ హి ధాతూనాం ప్రదోషవిజ్ఞానాని తాన్యేవ యథాస్వం ధాతుస్రోతసామ్ ॥10॥

అ॥ రసవహస్రోతస్సులకు హృదయమును పదివిధములగు ధమనులును, రక్తవహస్రోతస్సులకు యకృత్తును ప్లీహమును, మాంసవహస్రోతస్సులకు స్నాయువును చర్మమును, మేదోవహస్రోతస్సులకు వృక్కలును వపఉండుస్థానమును, అస్థివహస్రోతస్సులకు మేదస్సును జఘనప్రదేశమును, మజ్జవహస్రోతస్సులకు ఎముకలును సంధులును, శుక్రవహస్రోతస్సులకు వృషణములును మేఢ్రమును మూలస్థానములుగ నుండును. ఈ ధాతువహస్రోతస్సులు చెడినప్పుడు కలుగు లక్షణములు వివిధాశితపీతీయాధ్యాయమునందు వివరింపబడినవి. ఆయా ధాతువులు చెడినప్పుడు కలుగు లక్షణములే వానివాని స్రోతస్సులు చెడినప్పుడుకూడ కలుగును.

మూత్రవహస్రోతస్సులయొక్క మూలస్థానము—దుష్టలక్షణములు.

మూ॥ మూత్రవహానాం స్రోతసాం వస్తిర్మూలం వఙ్క్షణౌ చ. ప్రదుష్టానాం ఖల్వేషామిదం విశేషవిజ్ఞానం భవతి; తద్యథా—అతిసృష్టమతిబద్ధం కుపితమల్పాల్పమభీక్ష్ణం వా బహలంసశూలంమూత్రయన్తం దృష్ట్వా మూత్రవహాన్యస్యస్రోతాంసిప్రదుష్టానీతివిద్యాత్॥

అ॥ మూత్రవహస్రోతస్సులకు వస్తిప్రదేశమును వంక్షణప్రదేశములును మూలస్థానములుగ నుండును. మూత్రము విడిపోయినట్లుగాని బిగపట్టినట్లుగాని తొందరగ

గాని కొద్దికొద్దిగగాని తరుచుగగాని అధికముగగాని బాధతోకూడిగాని వెడలుచున్నచో మూత్రవహస్రోతస్సులు చెడినట్లు తెలిసికొనవలయును.

**పురీషవహస్రోతస్సులయొక్క మూలస్థానము — దుష్టలక్షణములు.**

మూ॥ పురీషవహానాం స్రోతసాం పక్వాశయో మూలంస్థూలగుదశ్చ, ప్రదుష్టానాం తు ఏషామిదం విశేషవిజ్ఞానం భవతి; తద్యథా—కృచ్ఛ్రేణాల్పాల్పం సశూలమతిద్రవం గ్రథితమతిగ్రథితమతి బహు చోపవిశన్తం దృష్ట్వా పురీషవహాన్యస్య స్రోతాంసి ప్రదుష్టానీతి విద్యాత్ ॥12॥

అ॥ పురీషవహస్రోతస్సులకు పక్వాశయమును గుదప్రదేశమును మూలస్థానములుగ నుండును పురీషము కష్టముగగాని కొద్దికొద్దిగగాని బాధతోకూడికాని మిక్కిలి పలుచగగాని దుర్గంధముగగాని ఉండలుగగాని అధికముగగాని వెడలుచున్నచో పురీషవహస్రోతస్సులు చెడినట్లు తెలిసికొనవలయును.

**స్వేదవహస్రోతస్సులయొక్క మూలస్థానము — దుష్టలక్షణములు.**

మూ॥ స్వేదవహానాం స్రోతసాం మేదో మూలం రోమకూపాశ్చ, ప్రదుష్టానాం తు ఏషామిదం విశేషవిజ్ఞానం భవతి; తద్యథా-అస్వేదనమతిస్వేదనం పారుష్యమతి శ్లక్ష్ణతామఙ్గస్యపరిదాహం లోమహర్షం చదృష్ట్వా స్వేదవహాన్యస్య స్రోతాంసి ప్రదుష్టానీతివిద్యాత్॥

అ॥ స్వేదవహస్రోతస్సులకు మేదస్సును రోమకూపములును మూలస్థానములుగ నుండును. చెమట పట్టకుండుట లేక అధికముగపట్టుట, శరీరము గరుకుగగాని మిక్కిలి నునుపుగగాని యుండుట, తాపముకలుగుట, రోమహర్షము ఈలక్షణములనుబట్టి స్వేదవహస్రోతస్సులు చెడినవని తెలిసికొనవలయును.

మూ॥ స్రోతాంసి సిరా ధమన్యో రసవాహిన్యో నాడ్యః పన్థానో మార్గాః శరీరచ్ఛిద్రాణి సంవృతాసంవృతాని స్థానాన్యాశయా నిలయా నికేతాశ్చేతి శరీరధాత్వవకాశానాం లక్ష్యాలక్ష్యాణాం నామాని। తేషాం ప్రకోపాత్స్థానస్థా మార్గగాశ్చైవ శరీరధాతవః ప్రకోపమాపద్యన్తే; ఇతరేషాం చ ప్రకోపాదితరాణి; స్రోతాంసి స్రోతాంస్యేవ ధాతవశ్చ ధాతూనేవ ప్రదూషయన్తి ప్రదుష్టాః; తేషాం సర్వేషామేవ వాతపిత్తశ్లేష్మాణో దూషయితారో భవన్తి, దోషస్వభావాదితి ॥15॥

అ॥ కనపడునట్టియు కనబడనట్టియు ధాత్వాదులను వహించువానికి స్రోతస్సులు, సిరలు, ధమనులు, రసవాహినులు, నాడులు, పథములు, మార్గములు, శరీరచ్ఛిద్రములు, సంవృతాసంవృతములు, స్థానములు, ఆశయములు, నిలయములు, నికేతములు ఇవి పేరులుగ నుండును. ఇవి చెడినచో స్వస్థానమునందున్నట్టికాని మార్గములయందున్నట్టికాని ధాతువులు మొదలగునవి చెడును. చెడినస్రోతస్సులు సమీపమునందున్న స్రోతస్సులను, చెడినధాతువులు సమీపమునందున్న ధాతువులను చెరచును. చెడినవాతపిత్తశ్లేష్మములు తమయొక్క దోషస్వభావముచే వీనినన్నిటిని చెరచును.

## స్రోతస్సులు చెడుటకు కారణములు.

మూ॥ క్షయాత్సంధారణాద్రౌక్ష్యాద్వ్యాయామాత్ క్షుధితస్య చ। ప్రాణవాహీని దుష్యన్తి స్రోతాంస్యన్యైశ్చ దారుణైః॥ ఔష్ణ్యాదామాద్భయాత్పానాదతిశుష్కాన్నసేవనాత్ । అంబువాహీని దుష్యన్తి తృష్ణాయాశ్చాతిపీడనాత్॥ అతిమాత్రస్య చాకాలే చాహితస్య చ భోజనాత్ । అన్నవాహీని దుష్యన్తి వైగుణ్యాత్పావకస్య చ॥ గురుశీతమతిస్నిగ్ధమతిమాత్రం సమశ్నతామ్ । రసవాహీని దుష్యన్తి చిన్త్యానాం చాతిచిన్తనాత్॥ విదాహీన్యన్నపానాని స్నిగ్ధోష్ణాని ద్రవాణి చ। రక్తవాహీని దుష్యన్తి భజతాం చాతపానలౌ॥ అభిష్యన్దీని భోజ్యాని స్థూలాని చ గురూణి చ । మాంసవాహీని దుష్యన్తి భుక్త్వా చ స్వపతాం దివా॥ అవ్యాయామాద్దివాస్వప్నాన్మేధ్యానాం చాతిభక్షణాత్ । మేదోవాహీని దుష్యన్తి వారుణ్యాశ్చాతిసేవనాత్॥ వ్యాయామాదతిసంక్షోభాదస్థ్నామతివిఘట్టనాత్ । అస్థివాహీని దుష్యన్తి వాతలానాం చ సేవనాత్॥ ఉత్పేషాదత్యభిష్యన్దాదభిఘాతాత్ప్రపీడనాత్ । మజ్జావాహీని దుష్యన్తి విరుద్ధానాం చ సేవనాత్॥ అకాలాయోనిగమనాన్నిగ్రహాదతిమైథునాత్ । శుక్రవాహీని దుష్యన్తి శస్త్రక్షారాగ్నిభిస్తథా ॥ మూత్రితోదకభక్ష్యస్త్రీసేవనాన్మూత్రనిగ్రహాత్ । మూత్రవాహీనిదుష్యన్తిక్షీణస్యాథకృశస్య చ॥ విధారణాదత్యశనాదజీర్ణాధ్యశనాత్తథా। వర్చోవాహీని దుష్యన్తిదుర్బలాగ్నేః కృశస్య చ॥ వ్యాయామాదతిసంతాపాచ్ఛీతోష్ణాక్రమసేవనాత్ । స్వేదవాహీని దుష్యన్తి క్రోధశోకభయైస్తథా॥

అ॥ ధాతువులు క్షీణించుట, వేగధారణము, రౌక్ష్యము, వ్యాయామము, అధికముగు ఆకలిని పొందుట, ఇట్టి ఇతరములగు దారుణకృత్యములు వీనివలన ప్రాణవహ

స్రోతస్సులు చెడును. వేడిమి, ఆమాభివృద్ధి, భయము, మద్యాదులను అధికముగ త్రాగుట, అధికమైనట్టియు ఆరినట్టియు అన్నమును భుజించుట, దప్పికను మిక్కిలి అరికట్టుట వీనివలన ఉదకవహస్రోతస్సులు చెడును. అధికపరిమితిగాని అకాలము నందుగాని అహితమైనదానినిగాని భుజించుటవలనను జాఠరాగ్ని వికృతినొందుట వలనను అన్నవహస్రోతస్సులు చెడును. గురుగుణమును శీతవీర్యమును అధికముగుస్నిగ్ధ గుణమును అధికపరిమితియు కల ఆహారమును భుజించుటవలనను అధికముగ ఆలోచించుటవలనను రసవహస్రోతస్సులు చెడును. తాపజనకములును స్నిగ్ధగుణమును ఉష్ణ వీర్యమును కలవియు మిక్కిలి పలుచగనున్నవియు నగు అన్నపానములను సేవించుట వలనను ఎండను అగ్నిని అధికముగ సేవించుటవలనను రక్తవహస్రోతస్సులు చెడును. అభిష్యందగుణము కలవియు కఠినములును గురుగుణముకలవియు నగు పదార్థములను భుజించుటవలనను భుజించి పగలు నిద్రించుటవలనను మాంసవహస్రోతస్సులు చెడును. వ్యాయామమును చేయకుండుట, పగలునిద్రించుట, బుద్ధివర్ధకములగు పదార్థములను అధికముగ భుజించుట, వారుణియనెడు మద్యమును అధికముగ సేవించుట వీనివలన మేదోవహస్రోతస్సులు చెడును. వ్యాయామము, అధికమగు సంక్షోభము, ఎముకలకు అధికమగు రాపిడికలుగుట, వాతవర్ధకములగు వానిని సేవించుట వీనివలన అస్థివహ స్రోతస్సులు చెడును. అధికముగ పిసుకబడుట, అధికమగుక్లేదము, అభిఘాతము, అధికముగ పీడింపబడుట, విరుద్ధములగువానిని సేవించుట వీనివలన మజ్జవహస్రోతస్సులు చెడును. అకాలమునందు రమించుట, అనుచితమైన యోనియందు రమించుట, శుక్రము నరికట్టుట, మైథునమును అధికముగ నాచరించుట, శస్త్రకర్మ, క్షారకర్మ, దాహకర్మ, వీనివలన శుక్రవహస్రోతస్సులు చెడును. మూత్రవేగముకలవాడై ఉదకమునుగాని పదార్థములనుగాని స్త్రీనిగాని సేవించుట, మూత్రవేగమునరికట్టుట, క్షీణించుట, కృశించుట వీనివలన మూత్రవహస్రోతస్సులు చెడును. మలవేగమునరికట్టుట, అధిక ముగ భుజించుట, జీర్ణముకాకుండుట, భుజించినవెంటనే భుజించుట, జాఠరాగ్నిమంద ముగనుండుట, కృశించుట వీనివలన పురీషవహస్రోతస్సులు చెడును. వ్యాయామము అధికమగుసంతాపము, శీతోష్ణములను క్రమములేకుండ సేవించుట, కోపము, దుఃఖము, భయము వీనివలన స్వేదవహస్రోతస్సులు చెడును.

మూ॥ ఆహారశ్చ విహారశ్చ యః స్యాద్దోషగుణైస్సమః। ధాతుభిర్విగుణశ్చాపి స్రోతసాం స ప్రదూషకః॥ అతిప్రవృత్తిః సఙ్గో వా సిరాణాం గ్రన్థయోఽపి వా। విమార్గగమనం వాపి స్రోతసాం దుష్టిలక్షణమ్। స్వధాతుసమవర్ణాని వృత్తస్థూలాన్యణూని చ। స్రోతాంసి దీర్ఘాణ్యాకృత్యా ప్రతానసదృశాని చ ॥31॥

అ॥ దోషములకు సమానములైన గుణములుకలిగినట్టియు ధాతువులకువిపరీతము లైన గుణములు కలిగినట్టియు ఆహారవిహారములను సేవించుటవలన స్రోతస్సులు చెడును. ఆయాస్రోతస్సులచే వహింపబడు రసాదులు అధికముగ ప్రవర్తించుటగాని సరిగ ప్రవర్తింపకుండుటగాని ఇతరమార్గములనుపొందుటగాని కలుగుట, సిరలయందు

గ్రంథులేర్పడుట వీనిచే స్రోతస్సులుచెడినట్లు తెలిసికొనవలయును. స్రోతస్సులు, తమచే వహింపబడుధాతువులతో సమానమైనవర్ణముకలవిగను గుండ్రముగను లావుగను సన్నముగను పొడవుగను పొదవలెను నుండును.

## స్రోతస్సులు చెడినప్పుడు సామాన్యచికిత్స.

**మూ॥** ప్రాణోదకాన్న వాహానాం దుష్టానాం శ్వాసికీ క్రియా। కార్యా తృష్ణోపశమని తథైవామప్రదోషికీ ॥ వివిధాశితపీతీయే రసాదీనాం యదౌషధమ్ । రసాదిస్రోతసాం కుర్యాత్తద్యథాస్వముపక్రమమ్ ॥ మూత్రవిట్స్వేదవాహానాం చికిత్సా మూత్రకృచ్ఛ్రికీ-తథాఽతిసారికీ కార్యా తథా జ్వరచికిత్సికీ ॥34॥

అ॥ ప్రాణవహస్రోతస్సులు చెడినప్పుడు శ్వాసయందుచెప్పబడిన చికిత్సను, ఉదకవహస్రోతస్సులు చెడినప్పుడు తృష్ణయందుచెప్పబడినచికిత్సను, అన్నవహస్రోతస్సులు చెడినప్పుడు ఆమదోషమునకుచెప్పబడినచికిత్సను, రసాదిధాతువహస్రోతస్సులు చెడినప్పుడు వివిధాశితపీతీయాధ్యాయమునందు చెప్పబడినచికిత్సను, మూత్రవహస్రోతస్సులు చెడినప్పుడు మూత్రకృచ్ఛ్రచికిత్సను, పురీషవహస్రోతస్సులు చెడినప్పుడు అతిసారచికిత్సను, స్వేదవహస్రోతస్సులు చెడినప్పుడు జ్వరచికిత్సను చేయవలయును.

## అధ్యాయసంగ్రహము.

**మూ॥** త్రయోదశానాం మూలాని స్రోతసాందుష్టిలక్షణమ్ । సామాన్యం నామ పర్యాయాః కోపనాని పరస్పరమ్ ॥ దోష హేతుః పృథక్త్వేన భేషజోద్దేశ ఏవ చ । స్రోతోవిమానే నిర్దిష్టస్తథా చాదౌ వినిశ్చయః॥ కేవలం విదితం యస్య శరీరం సర్వభావతః। శారీరాః సర్వ రోగాశ్చ న స కర్మసు న ముహ్యతి ॥37॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే విమానస్థానే స్రోతోవిమానం నామ పఞ్చమోఽధ్యాయః ॥

అ॥ ఈ స్రోతోవిమానాధ్యాయమునందు పదుమూడువిధములగు స్రోతస్సుల యొక్క—మూలస్థానములు, దుష్టలక్షణములు, సామాన్యనామములు, పర్యాయవాచకములు, పరస్పరము దూషింపజేసికొనువిధము, చెడుటకుకారణములు, సామాన్యచికిత్స ఇవియు స్రోతోవినిశ్చయమును చెప్పబడినవి. శరీరగతములైన సమస్తభావములను సమస్తవ్యాధులను పూర్తిగ తెలిసికొనినవాడు చికిత్సలయందు మోహము నొందడు.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామకకృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితావ్యాఖ్యానమునందు స్రోతోవిమానమనెడు పంచమాధ్యాయము సమాప్తము.

— ౦ —

# షష్ఠాధ్యాయము

మూ॥ అథాతో రోగానీకం విమానం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట రోగానీకవిమానమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ ద్వే రోగానీకే భవతః ప్రభావభేదేన - సాధ్యం చాసాధ్యం చ, ద్వే రోగానీకే బలభేదేన - మృదు చ దారుణం చ, ద్వే రోగానీకేఽధిష్ఠానభేదేన - మనోఽధిష్ఠానం శరీరాధిష్ఠానం చ, రోగానీకే ద్వే నిమిత్తభేదేన - స్వధాతువైషమ్యనిమిత్తం చాగన్తునిమిత్తం చ, ద్వే రోగానీకే ఆశయభేదేన - ఆమాశయసముత్థం చ పక్వాశయసముత్థం చ; ఏవమేతత్ప్రభావబలాధిష్ఠాననిమిత్తాశయభేదాద్ద్వైధం సద్భేదప్రకృత్యన్తరేణ భిద్యమానమథవా సంధీయమానం స్యాదేకత్వం వా బహుత్వం వా। ఏకత్వం తావదేకమేవ రోగానీకం దుఃఖసామాన్యాత్, బహుత్వం తు దశరోగానీకాని ప్రభావభేదాదినా భవన్తి; బహుత్వమపి సంఖ్యేయం సాద్యసంఖ్యేయం వా స్యాత్; తత్ర సంఖ్యేయం తావద్యథోక్తమష్టోదరీయే, అపరిసంఖ్యేయం పునర్యథా—మహారోగాధ్యాయే, రుగ్వర్ణసముత్థానాదీనామసంఖ్యేయత్వాత్ ॥3॥

అ॥ రోగము—ప్రభావభేదముచే సాధ్యము అసాధ్యము అనియు, బలభేదముచే మృదువు దారుణము అనియు, అధిష్ఠానభేదముచే మానసికము శారీరకము అనియు, కారణభేదముచే దోషజము ఆగంతుకము అనియు, ఆశయభేదముచే ఆమాశయసముత్థము పక్వాశయసముత్థము అనియు రెండేసివిధములుగ నుండును. ఇట్లు ప్రభావము బలము అధిష్ఠానము కారణము ఆశయము వీనిననుసరించి రెండేసివిధములైన రోగము ఇతరకారణములచే భేదింపబడినచో అనేకవిధములుగను, సామాన్యవివక్షచే కలుపబడినచో ఒకేవిధముగ నుండును. దుఃఖమునుకలిగించుటయనెడి సామాన్యభావముచే ఒకేవిధముగను, ప్రభావాదిభేదములచే పదివిధములుగనుండి బహువిధములుగను నగును. ఇట్టిబహుత్వము లెక్కించుటకు వీలుగగాని అపరిసంఖ్యేయముగగాని యుండును. రోగములయొక్క సంఖ్య అష్టోదరీయాధ్యాయమునందు చెప్పబడినది. బాధలు వర్ణము హేతువులు మొదలగువాని ననుసరించి అపరిసంఖ్యేయములుగనుండు నని మహారోగాధ్యాయమునందు చెప్పబడినది.

మూ॥ న చ సంఖ్యేయాగ్రేషు భేదప్రకృత్యన్తరీయేషు దోషవతీ స్యాదత్ర కాచిత్ప్రతిజ్ఞా, న చావిగీతిరిత్యతః స్యాదదోషవతీ; భేత్తా హి భేద్యమన్యథా భినత్తి, అన్యథా పురస్తాద్భిన్నం భేదప్రకృత్యన్తరేణ భిన్దన్ భేదసంఖ్యావిశేషమాపాదయత్యనేకధా, న చ పూర్వం భేదాగ్రముపహన్తి, సమానాయామపి ఖలు భేదప్రకృతౌ ప్రకృతానుప్రయోగాన్తరమపేక్ష్యం; సన్తి హ్యర్థాన్తరాణి సమానశబ్దాభిహితాని, సన్తి చానర్థాన్తరాణి పర్యాయశబ్దాభిహితాని; సమానో హి రోగశబ్దో దోషేషు చ వ్యాధిషు చ దోషా వ్యాపి రోగశబ్దమాతఙ్కశబ్దం యక్ష్మశబ్దం దోషప్రకృతిశబ్దం వికారశబ్దం చ లభన్తే వ్యాధయశ్చ రోగశబ్దమాతఙ్కశబ్దం యక్ష్మశబ్దం దోషప్రకృతిశబ్దం వికారశబ్దం చ లభన్తే; తత్ర దోషేషు చైవ వ్యాధిషు చ రోగశబ్దః సమానః శేషేషు తు విశేషవాన్ ॥4॥

అ॥ సంఖ్యాప్రమాణములయందును ఇతరకారణములవలనకలుగు మార్పులయందును, భేదములను కల్పించుటలో విరోధము కనబడుచున్నను అయ్యది దోషముకానేరదు. ఎందుచేననగా — భేదములను కల్పించువాడు భేదములను కల్పింపదగినదానిని కొన్ని విధములుగ విభజించును. అట్లు విభజింపబడినదానిని ఇతరకారణములచే విభజించుచు అనేకభేదములను సంఖ్యావిశేషములను కల్పించును. కాని మొదట చెప్పబడిన భేదమునకుమాత్రము విరోధము కలుగదు. భేదప్రకృతి సమానముగనున్నను ఆయాప్రయోగములనుబట్టి భేదింపబడును. ఒకశబ్దమునకు అనేకార్థములును అనేకశబ్దములకు ఒకేఅర్థమును ఉండవచ్చును. ఒక్కరోగశబ్దముచేతనే దోషములును వ్యాధులును చెప్పబడును. రోగ, ఆతంక యక్ష్మ, దోషప్రకృతి, వికారము అను నీ అన్నిశబ్దములచేతను దోషములనెడి యొకయర్థముగాని వ్యాధులనెడి యొకయర్థముగాని చెప్పబడును. రోగశబ్దము సామాన్యార్థముచే దోషములయందును వ్యాధులయందును వర్తించును. విశేషార్థముచే ఇతరములయందుకూడ వర్తింపవచ్చును.

మూ॥ తత్ర వ్యాధయోఽపరిసంఖ్యేయా భవన్తి అతిబహుత్వాత్; దోషాస్తు ఖలు పరిసంఖ్యేయాః, అనతిబహుత్వాత్; తస్మాద్యథాచిత్రం వికారా ఉదాహరణార్థమనవశేషేణ చ దోషా వ్యాఖ్యాస్యన్తే। రజస్తమశ్చ మానసౌ దోషౌ, తయోర్వికారాః — కామక్రోధలోభమోహేర్ష్యామానమదశోకచిత్తోద్వేగభయహర్షాదయః। వాతపిత్తశ్లేష్మాణస్తు ఖలు శారీరా దోషాః, తేషామపి చ వికారాః — జ్వరాతీసారశోథశోషశ్వాసమేహకుష్ఠాదయ ఇతి దోషాః

కేవలా వ్యాఖ్యాతాః, వికారైకదేశశ్చ ॥6॥

అ॥ వ్యాధులు అనేకవిధములుగ నుండుటవలన అపరిసంఖ్యేయములుగ నుండును. దోషములు అధికముగ లేకపోవుటవలన లెక్కించుటకు వీలైనవిగ నుండును. అందువలన వ్యాధులను ఉదాహరణమాత్రముగను, దోషములను సంపూర్ణముగను చెప్పుచున్నాము. రజస్సును తమస్సును మానసికదోషములుగ నుండును. వీనివలన కామము క్రోధము లోభము మోహము ఈర్ష్య అభిమానము మదము దుఃఖము చిత్తోద్రేకము భయము హర్షము మొదలగు వికారములు కలుగును. వాతమును, పిత్తమును, శ్లేష్మమును శారీరకదోషములుగ నుండును. వీనివలన జ్వరము అతిసారము శోఫ శోష శ్వాస ప్రమేహము కుష్ఠము మొదలగు వ్యాధులు కలుగును. ఇట్లు దోషములు పూర్తిగను, వ్యాధులు ఉదాహరణమాత్రముగను చెప్పబడినవి.

మూ॥ తత్ర తు ఖల్వేషాం ద్వయానామపి దోషాణాం త్రివిధం ప్రకోపణం; తద్యథా- అసాత్మ్యేన్ద్రియార్థసంయోగః, ప్రజ్ఞాపరాధః, పరిణామశ్చేతి। ప్రకుపితాస్తు ఖలు ప్రకోపణవిశేషాద్దూష్యవిశేషాచ్చ వికారవిశేషానభినిర్వర్తయన్త్యపరిసంఖ్యేయాన్। తే వికారాః పరస్పరమనువర్తమానాః కదాచిదనుబధ్నన్తి కామాదయో జ్వరాదయశ్చ, నియతస్త్వనుబన్ధో రజస్తమసోః పరస్పరం న హ్యరజస్కం తమః ప్రవర్తతే। ప్రాయః శారీరదోషాణామేకాధిష్ఠానీయానాం సంనిపాతః సంసర్గో వా సమానగుణత్వాత్; దోషా హి దూషణైః సమానాః ॥7॥

అ॥ మానసికములును శారీరకములును నగు రెండువిధములైన దోషములు ప్రకోపించుటకు అసాత్మ్యేంద్రియార్థసంయోగము ప్రజ్ఞాపరాధము పరిణామము అను నీ మూడును కారణములుగ నుండును. దోషములు ప్రకోపించినవై హేతువిశేషములనుబట్టియు దూష్యవిశేషములనుబట్టియు అపరిసంఖ్యేయములగు వ్యాధులను కలిగించును. మానసికవికారములగు కామాదులును, శారీరకవికారములగు జ్వరాదులును ఒక్కొక్కప్పుడు పరస్పరము కలిసినవై చిరకాలము అనుసరించియుండును. రజస్సునకును తమస్సునకును పరస్పరసంబంధము నియతముగ నుండును. రజోగుణములేనిదే తమోగుణము ఉండదు. ఒకేఅధిష్ఠానముకల వాతపిత్తశ్లేష్మములు గుణసమానత్వమును బట్టి సన్నిపాతముగగాని సంసర్గముగగాని ఏర్పడుచుండును. దూషింపచేయు హేతువులు దోషములకు సమానములుగ నుండవచ్చును.

మూ॥ తత్రానుబన్ధ్యానుబన్ధవిశేషః - స్వతన్త్రో వ్యక్తలిఙ్గో యథోక్తసముత్థానప్రశమో భవత్యనుబన్ధ్యః, తద్విపరీతలక్షణస్త్వనుబన్ధః। అనుబన్ధ్యానుబన్ధలక్షణసమన్వితాస్తత్ర యది దోషా భవన్తి,

తత్త్రికం సంనిపాతమాచక్షతే, ద్వయం వా సంసర్గమ్।అనుబన్ధ్యాను బన్ధవిశేషకృతస్తు బహువిధో దోషభేదః। ఏవమేష సంజ్ఞాప్రకృతో భిషజాం దోషేషు చైవ వ్యాధిషు చ నానాప్రకృతివిశేషవ్యూహః ॥8॥

అ॥ అనుబన్ధ్యానుబన్ధవిశేషములను చెప్పుచున్నాము. స్వతంత్రమైనట్టియు స్పష్టములైనలక్షణములు కలిగినట్టియు తనకు చెప్పబడిన హేతువులచే వృద్ధినొందినట్టియు తనకు చెప్పబడినచికిత్సలచే శమించునట్టియు దోషము అనుబంధ్య (ప్రధాన) మైనదని చెప్పబడును. ఈలక్షణములకు విపరీతములైన లక్షణములుకలది అనుబంధ (అప్రధాన) మైనదని చెప్పబడును. ప్రధానాప్రధానలక్షణములుకల దోషములు మూడు కలిసియున్నచో సన్నిపాతమనియు రెండు కలిసియున్నచో సంసర్గమనియు చెప్పబడును. ప్రాధాన్యాప్రాధాన్యవిశేషములనుబట్టి దోషభేదములు అనేకవిధములుగ నుండును. ఇట్లు దోషములకును వ్యాధులకును కారణవిశేషములనుబట్టి సంజ్ఞావిశేషములు చెప్పబడినవి.

## జాఠరాగ్ని భేదములు

మూ॥ అగ్నిషు తు శారీరేషు చతుర్విధో విశేషో బలభేదేన భవతి; తద్యథా - తీక్ష్ణో మన్దః సమో విషమ ఇతి। తత్ర తీక్ష్ణోఽగ్నిః సర్వాపచారసహః, తద్విపరీతలక్షణో మన్దః సమస్తు ఖల్వపచారతో వికృతిమాపద్యతేఽనపచారతస్తు ప్రకృతావవతిష్ఠతే, సమలక్షణ విపరీతలక్షణస్తు విషమః; ఇత్యేతే చతుర్విధా భవన్త్యగ్నయశ్చతుర్విధానామేవ పురుషాణామ్। తత్ర, సమవాతపిత్తశ్లేష్మణాం ప్రకృతిస్థానాం సమా భవన్త్యగ్నయః, వాతలానాం తు వాతాభిభూతేఽగ్న్యధిష్ఠానే విషమా భవన్త్యగ్నయః, పిత్తలానాం తు పిత్తాభిభూతేఽగ్న్యధిష్ఠానే తీక్ష్ణా భవన్త్యగ్నయః, శ్లేష్మలానాం తు శ్లేష్మాభిభూతే హ్యగ్న్యధిష్ఠానే మన్దా భవన్త్యగ్నయః ॥10॥

అ॥ జాఠరాగ్ని — బలభేదమననుసరించి తీక్ష్ణము, మందము, సమము, విషమము అని నాలుగువిధములుగ నుండును. వానిలో తీక్ష్ణాగ్ని సమస్తములైన అపచారములను సహించును. మందాగ్ని అపచారములను సహింపనేరదు. సమాగ్ని అపచారములవలన వికృతినొందును. అపచారములు లేనిచో సమానస్థితియందుండును. విషమాగ్ని ఒకొ్కక్కప్పుడు సమలక్షణములుకలదిగను ఒకొ్కక్కప్పుడు విపరీత లక్షణములుకలదిగను నుండును. ఈ నాలుగువిధములగు అగ్నులు నాలుగువిధములగు పురుషులకు ఉండును. ఎట్లనగా - వాతపిత్తశ్లేష్మములు సమముగను ప్రకృతి ననుసరించియు నున్నవారికి జాఠరాగ్ని సమముగ నుండును. వాతప్రధానులయొక్క జాఠరాగ్ని వాతముచే చెడకొట్టబడినప్పుడు విషమముగ నుండును. పిత్తప్రధానుల

యొక్క జాఠరాగ్ని పిత్తముచే చెడగొట్టబడినప్పుడు తీక్ష్ణముగ నుండును. శ్లేష్మప్రధానులయొక్క జాఠరాగ్ని శ్లేష్మముచే చెడగొట్టబడినప్పుడు మందముగ నుండును.

మూ॥ తత్ర కేచి దాహుః—న సమవాతపిత్తశ్లేష్మాణో జన్తవః సన్తి, విషమాహారోపయోగిత్వాన్మనుష్యాణాం; తస్మాచ్చ వాతప్రకృతయః కేచిత్ కేచిత్పిత్తప్రకృతయః కేచిత్పునః శ్లేష్మప్రకృతయో భవన్తీతి। తచ్చానుపపన్నం; కస్మాత్కారణాత్; సమవాతపిత్తశ్లేష్మాణం హ్యారోగ్యమిచ్ఛన్తి భిషజః; యతః ప్రకృతిశ్చారోగ్యం, ఆరోగ్యార్థా చ భేషజప్రవృత్తిః, సా చేష్టరూపా, తస్మాత్సన్తి సమవాతపిత్తశ్లేష్మాణః। న తు ఖలు సన్తి వాతప్రకృతయః పిత్తప్రకృతయః శ్లేష్మప్రకృతయో వా; తస్య తస్య కిల దోషస్యాధికభావాత్సా దోషప్రకృతిరుచ్యతే మనుష్యాణాం; న చ వికృతేషు దోషేషు ప్రకృతిస్థత్వముపపద్యతే, తస్మాన్నైతాః ప్రకృతయః సన్తి; సన్తి తు ఖలు వాతలాః పిత్తలాః శ్లేష్మలాశ్చ। అప్రకృతిస్థాస్తు తే జ్ఞేయాః ॥11॥

అ॥ మనుజులు విషమములైన ఆహారములను ఉపయోగించువారలగుటవలన సమానములైన వాతపిత్తశ్లేష్మములుకలవారుగ నుండరు. అందువలన వాతప్రకృతికలవారుగాని పిత్తప్రకృతికలవారుగాని శ్లేష్మప్రకృతికలవారుగాని యుందురని కొందరు చెప్పుచున్నారు. అది యుక్తమైనదికాదు. ఎందువలననగా - వాతపిత్తశ్లేష్మములు సమముగనున్నచో ఆరోగ్యవంతు డనబడును. ప్రకృతి యనగా ఆరోగ్యమనబడును. ఆరోగ్యముకొఱకే చికిత్స చేయబడును. ఆ చికిత్స అనుకూలతననుసరించి యుండును. కావున సమానములైన వాతపిత్తశ్లేష్మములుకలవారుగ నుందురు. కాని వాతప్రకృతి కలవారును పిత్తప్రకృతికలవారును శ్లేష్మప్రకృతికలవారును నుండరు. మనుష్యులు జన్మాదియందు ఏదోషముయొక్క సంబంధము ఎక్కువకలవారుగనుందురో ఆదోషప్రకృతికలవారుగ చెప్పబడుదురు. వికృతినొందినదోషములనుబట్టి ప్రకృతిని నిర్ణయింపకూడదు. అందువలన ఇట్టిప్రకృతికలవారు ఉండరు. వారు వాతవృద్ధికలవారనికాని పిత్తవృద్ధికలవారనికాని శ్లేష్మవృద్ధికలవారనికాని చెప్పబడుదురు. ఆయా ప్రకృతికలవారుగ చెప్పబడరు.

మూ॥ తేషాం తు ఖలు చతుర్విధానాం పురుషాణాం చత్వార్యనుప్రణిధానాని శ్రేయస్కరాణి; తత్ర సమసర్వధాతూనాం సత్వాకారసమం, అధికదోషాణాం తు త్రయాణాం యథాస్వం దో

షాధిక్యమభిసమీక్ష్య దోషప్రతికూలయోగీని త్రీణ్యనుప్రణిధానాని శ్రేయస్కరాణి భవన్తి యావదగ్నేః సమీభావాత్, సమే తు సమమేవ తు కార్యం, ఏవం చేష్టా భేషజప్రయోగాశ్చాపరే, తాన్ విస్తరేణానువ్యాఖ్యాస్యామః ॥12॥

అ॥ నాలుగువిధములగు పురుషులకును నాలుగువిధములగు కృత్యములు శ్రేయస్కరములుగ నుండును. ధాతువులన్నియు సమముగనున్నప్పుడు సమమైన కృత్యముల నాచరింపవలయును. మూడుదోషములలో ఏదోషము వృద్ధినొందునో ఆదోషమునకు విపరీతమైన కృత్యమును జాఠరాగ్ని సమత్వము నొందువఱకు నాచరింపవలయును. సమముగ నున్నప్పుడు సమమైన కృత్యముల నాచరింపవలయును. ఇట్లే అనుకూలములగు ఔషధములను ప్రయోగింపవలయును. వానిని వివరించి చెప్పఁబోవు చున్నాము.

మూ॥ త్రయస్తు పురుషా భవన్త్యాతురా, త్వనాతురాస్తన్త్రాన్తరీయాణాం భిషజాం; తద్యథా - వాతలః పిత్తలః శ్లేష్మలశ్చేతి। తేషాం విశేషవిజ్ఞానం - వాతలస్య వాతనిమిత్తాః, పిత్తలస్య పిత్తనిమిత్తాః, శ్లేష్మలస్య శ్లేష్మనిమిత్తా వ్యాధయః ప్రాయేణ బలవన్తశ్చ భవన్తి ॥13॥

అ॥ వాతప్రధానుడు పిత్తప్రధానుడు శ్లేష్మప్రధానుడు అను మూడు విధములైన పురుషులు రోగులుగ నుందురు. శాస్త్రజ్ఞులగు కొంతమంది వైద్యులు వీరిని రోగులనుగ తలంపరు. వాతప్రధానునకు వాతమువలన జనించు వ్యాధులును, పిత్తప్రధానునకు పిత్తమువలన జనించు వ్యాధులును, కఫప్రధానునకు కఫమువలన జనించు వ్యాధులును తరుచు సంభవించును. అవి బలవత్తరములుగ గూడ నుండును.

### వాతప్రకోపకారణములు - సామాన్యచికిత్స.

మూ॥ తత్ర వాతలస్య వాతప్రకోపణోక్తాన్యాసేవమానస్య క్షిప్రం వాతః ప్రకోపమాద్యతే, న తథేతరౌ దోషౌ; స తస్య ప్రకోపమాపన్నో యథోక్తైర్వికారైః శరీరముపతపతి బలవర్ణసుఖాయుషాముపఘాతాయ; తస్యావజయనం - స్నేహస్వేదౌ విధియుక్తౌ మృదూని చ సంశోధనాని స్నేహోష్ణమధురామ్లలవణయుక్తాని, తద్వదభ్యవహార్యాణ్యుపనాహనోపవేష్టనోన్మర్దనపరిషేకావగాహనసంవాహనావపీడనవిత్రాసనవిస్మాపనవిస్మరణాని, సురాసవవిధానం, స్నేహాశ్చానేకయోనయో దీపనీయపాచనీయవాతహరవిరేచనీయోపహి

తాః, తథా శతపాకాః సహస్రపాకాః సర్వశశ్చప్రయోగార్థా వస్తయో, వస్తినియమః, సుఖశీలతా చేతి ॥14॥

అ॥ వాతప్రధానుడు వాతవర్ధకములగు పదార్థములను సేవించినయెడల వాతము వెంటనే ప్రకోపించును. పిత్తశ్లేష్మములు ఆవిధముగ వృద్ధినొందవు. అట్లు ప్రకోపించిన వాతము అట్టివానికి ఆయావ్యాధులను కలిగించి శరీరమును బాధించి బలమును, వర్ణమును, సుఖమును, ఆయువును నశింపచేయును. అట్టివానికి — విధిప్రకారముగ చేయబడిన స్నేహస్వేదములును, స్నిగ్ధగుణము ఉష్ణవీర్యము మధురరసము అమ్లరసము లవణరసము ఇవికల పదార్థములచే మృదుశోధనములును, స్నిగ్ధగుణము మొదలగునవి కల పదార్థములను భుజించుటయు, కాచుట చుట్టుట మర్దించుట తడుపుట ముంచుట పిసుకుట నొక్కుట భయపెట్టుట ఆశ్చర్యమును కలిగించుట మరపును కలిగించుట ఇవియు, మద్యములను ఆసవములను సేవించుటయు, అనేకవిధములైన స్నేహములను దీపనీయములు పాచనీయములు వాతహరములు విరేచనీయములు నగు ద్రవ్యములతో నూరుసారులుగాని వెయ్యిసారులుగాని తయారుచేసి వానిచే పానము అభ్యంగము వస్తి మొదలగువానిని చేయించుటయు, వస్తిక్రియలును, వస్తియందలి నియమమును, సుఖము ననుభవించుటయు సామాన్యచికిత్సలుగ నుండును.

పిత్తప్రకోపకారణములు - సామాన్యచికిత్స.

మూ॥ పిత్తలస్యాపి పిత్తప్రకోపణోక్తాన్యాసేవమానస్య క్షిప్రం పిత్తం ప్రకోపమాపద్యతే, తథా నేతరౌ దోషౌ; తదస్య ప్రకోపమాపన్న యథోక్తైర్వికారైః శరీరముపతపతి బలవర్ణ సుఖాయుషాముపఘాతాయః తస్యావజయనం — సర్పిష్పానం, సర్పిషా చ స్నేహనం, అధశ్చ దోషహరణం, మధురతిక్తకషాయశీతానాం చౌషధాభ్యవహార్యాణాముపయోగో, మృదుమధురసురభి శీతహృద్యానాం గన్ధానాం చోపసేవా, ముక్తామణిహారావలీనాం చ పరమశిశిరవారిసంస్థితానాం ధారణమురసా, క్షణే క్షణే చాగ్ర్యచన్దన ప్రియంగు కాలీయ మృణాలశీత వాతవారిభిరుత్పలకుముద కోకనద సౌగన్ధిక పద్మానుగతైశ్చ వారిభిరభిప్రోక్షణం, శ్రుతిసుఖమృదుమధుర మనోనుగానాం చ గీత వాదిత్రాణాం శ్రవణం. శ్రవణం చాభ్యుదయానాం, సుహృద్భిశ్చ సంయోగః, సంయోగశ్చేష్టాభిః స్త్రీభిః శీతోపహితాంశుకస్రగ్దామ హారధారిణీభిః, నిశాకరాంశుశీతలప్రవాతహర్మ్యవాసశ్శైలాన్తరపులిన శిశిరసదనవసనవ్యజనపవనానాం సేవా, రమ్యాణాం చోపవనానాంసుఖ

శిశిరసురభిమారుతోపవాతానాముపసేవనం, సేవనం చ నలినోత్పల పద్మకుముదసౌగన్ధికపుణ్డరీకశతపత్రహస్తానాం, చ సౌమ్యానాం సర్వ భావానామితి ॥15॥

అ॥ పిత్తప్రధానుడు పిత్తవర్ధకములగు పదార్థములను సేవించినచో పిత్తము వెంటనే ప్రకోపించును. వాతశ్లేష్మములు ఈవిధముగ వృద్ధినొందవు. అట్లు ప్రకోపించినపిత్తము అట్టివానికి ఆయావ్యాధులను కలిగించి శరీరమును బాధించి బలమును, వర్ణమును, సుఖమును, ఆయువును నశింపచేయును. అట్టివానికి - ఘృతమును పానము చేయుట, ఘృతముచే స్నేహకర్మను చేయుట, విరేచనములను చేయించుట, మధుర రసము తిక్తరసము కషాయరసము శీతవీర్యము ఇవికల ఔషధములను పదార్థములను సేవించుట, మృదువుగను మధురముగను పరిమళయుక్తముగను చల్లగను హృద్యముగను నున్న సుగంధద్రవ్యములను సేవించుట, ముత్యములయొక్కయు మణులయొక్కయు హారములను మిక్కిలి చల్లగనున్న నీటియందుంచి వానిని వక్షఃస్థలమునందు ధరించుట, పుష్పమాలికలు మంచిగంధము ప్రేంఖణము కృష్ణచందనము తామర తూండ్లు చల్లనిగాలి చల్లనిఉదకము వీనిని తరుచు సేవించుట, నల్లకలువ తెల్లకలువ ఎర్రకలువ ఎర్రపద్మము పద్మము వీనితో నీటిని తరుచుచల్లుట, చెవులకు ఇంపైనట్టియు మృదువైనట్టియు మధురములైనట్టియు మనస్సును ఆకర్షించునట్టియు సంగీతములను వాద్యములను వినుట, మంచివార్తలను వినుట, స్నేహితులతో కలిసియుండుట, ఇష్టురాండ్రైనట్టియు చల్లనివియగు వస్త్రములు శిరస్సునందును వక్షఃస్థలమందును ధరించు పుష్పమాలికలు హారములు వీనిని ధరించినట్టియు స్త్రీలతో కలిసియుండుట, చంద్ర కిరణములచే చల్లగనున్నట్టియు గాలితో గూడినట్టియు మేడలయందు నివసించుట, పర్వతప్రదేశములయందున్న ఇసుకతిన్నెలను చల్లనివియగు గృహములు వస్త్రములు విసనకర్రలు గాలి వీనిని మనోహరములైన ఉద్యానవనములను సుఖముగను చల్లగను పరిమళయుక్తముగను నున్న వాయువులను పిల్లవాయువులను సేవించుట, ఎర్రకలువ నల్లకలువ తామరపువ్వు తెల్లకలువ ఎర్రపద్మము తెల్లపద్మము కమలము వీనియొక్క సముదాయములను సేవించుట, చల్లనివియగు ఇట్టిఇతరములను సేవించుట ఇవి సామాన్య చికిత్సలుగ నుండును.

కఫప్రకోపకారణములు - సామాన్యచికిత్స.

మూ॥ శ్లేష్మలస్యాపి శ్లేష్మప్రకోపణాన్యాసేవమానస్య క్షిప్రం శ్లేష్మా ప్రకోపమాపద్యతే, నతథేతరౌ దోషౌ; సతస్య ప్రకోపమాపన్నో యథోక్తైర్వికారైః శరీరముపతపతి బలవర్ణసుఖాయుషాముపఘాతాయ; తస్యావజయనం-విధియుక్తాని తీక్ష్ణోష్ణాని సంశోధనాని, రూక్షప్రాయాణి చాభ్యవహార్యాణి కటుతిక్తకషాయోపహితాని, తథైవ ధావనలఙ్ఘనప్లవనపరిసరణజాగరణనియుద్ధవ్యవాయ

వ్యాయామోన్మర్దనస్నానోత్సాదనాను, విశేషత స్తీక్ష్ణానాందీర్ఘ కాల స్థితానాం మద్యానాముపయోగః, సధూమపానః సర్వశశ్చోపవాసః సుఖప్రతిషేధశ్చ సుఖార్థమేవేతి ॥16॥

అ॥ శ్లేష్మప్రధానుడు శ్లేష్మవర్ధకములగు పదార్థములను సేవించినచో శ్లేష్మము వెంటనే ప్రకోపించును. వాతపిత్తములు ఈవిధముగ వృద్ధినొందవు. అట్లు ప్రకోపించిన శ్లేష్మము అట్టివానికి ఆయావ్యాధులను కలిగించి శరీరమును బాధించి బలమును, వర్ణమును, సుఖమును, ఆయువును నశింపచేయును. అట్టివానికి — తీక్ష్ణగుణమును ఉష్ణవీర్యమును కల శోధనకర్మలను యథావిధిగ చేయించుట, అధికమగు రూక్షగుణమును కటుతిక్తకషాయరసములును కల పదార్థములను భుజించుట, పరుగెత్తుట, దాటుట, ఈదుట, గుండ్రముగ తిరుగుట, రాత్రి మేల్కొనుట, బాహుయుద్ధము, మైథునము, వ్యాయామము, బాగుగ మర్దించుట, అభ్యంగస్నానము, నలుగుడు పెట్టుట, తీక్ష్ణములైనట్టియు ప్రాతవైనట్టియు మద్యముల నధికముగ నుపయోగించుట, ధూమపానము, అన్నివిధములగు నుపవాసము, వెచ్చని గృహములయందు నివసించుట, సుఖము ననుభవింపకుండుట ఇవి సామాన్యచికిత్సలుగ నుండును.

మూ॥ సర్వరోగవిశేషజ్ఞః సర్వకార్యవిశేషవిత్ । సర్వభేషజతత్త్వజ్ఞో రాజ్ఞః ప్రాణపతిర్భవేత్ ॥17॥

అ॥ సమస్తరోగములయొక్కయు సమస్తక్రియలయొక్కయు సమస్తౌషధముల యొక్కయు విశేషములను తెలిసికొనినవాడు రాజుయొక్క ప్రాణములను కాపాడుటకు సమర్థుడుగ నుండును.

## అధ్యాయసంగ్రహము.

**మూ॥ ప్రకృత్యంతరభేదేన రోగానీకవికల్పనమ్ । పరస్పరావిరోధశ్చ సామాన్యం రోగదోషయోః॥ దోషసంఖ్యావికారాణామేకదోషప్రకోపణమ్ । జరణం ప్రతిచిన్తా చ కాయాగ్నేరుత్థితాని చ॥ నరాణాం వాతలాదీనాం ప్రకృతిస్థాపనానిచ। రోగానీకేవిమానేఽస్మిన్ వ్యాహృతాని మహర్షిణా॥20॥**

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే విమానస్థానే రోగానీకవిమానం నామ షష్ఠోఽధ్యాయః॥

అ॥ ఈరోగానీకాధ్యాయమునందు కారణభేదములచే రోగభేదములను పరికల్పించుట అట్టిపరికల్పనలయందు పరస్పరము విరోధము లేకపోవుట, రోగముల యందును దోషములయందును సమానమైన శబ్దము వర్తించుట, దోషసంఖ్య, రోగసంఖ్య, దోషములు ప్రకోపించుటకు కారణములు, జాఠరాగ్నివిచారణ, జాఠరాగ్నిని

సమత్వమునొందించువిధము, వాతప్రధానుడు మొదలగువారికి సామాన్యచికిత్స ఇవి చెప్పబడినవి.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామకకృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక
యనెడి చరకసంహితావ్యాఖ్యానమునందు రోగానీకవిమానమనెడు
షష్ఠాధ్యాయము సమాప్తము.

— ० —

# సప్తమాధ్యాయము

మూ॥ అథాతో వ్యాధితరూపీయం విమానంవ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట వ్యాధితరూపీయవిమానమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

## వ్యాధితపురుషభేదము.

మూ॥ ఇహ ఖలు ద్వౌ పురుషౌ వ్యాధితరూపౌ భవతః; తద్యథా-గురువ్యాధిత ఏకః బల సత్త్వశరీరసంపదుపేతత్వాల్లఘువ్యాధిత ఇవదృశ్యతే, లఘువ్యాధితో౽పరః సత్త్వాదీనామధమత్వాద్గురువ్యాధిత ఇవ దృశ్యతే, తయోరకుశలాః కేవలం చక్షుషైవరూపం దృష్ట్వా వ్యవస్యన్తో వ్యాధిగురులాఘవే విప్రతిపద్యన్తే॥ న హి జ్ఞానావయవేన కృత్స్నే జ్ఞేయే జ్ఞానముత్పద్యతే; విప్రతిపన్నాస్తు ఖలు రోగజ్ఞానే, ఉపక్రమయుక్తిజ్ఞానే చాపి విప్రతిపద్యన్తే। తే యదా గురువ్యాధితం లఘువ్యాధితరూపమాసాదయన్తి, తదా తమల్పదోషం మత్వా సంశోధనకాలే౽స్మై మృదుసంశోధనంప్రయచ్ఛన్తోభూయఏవాస్య దోషానుదీరయన్తి; యదా తు లఘువ్యాధితం గురువ్యాధితరూపమాసాదయన్తి, తం మహాదోషం మత్వాసంశోధనకాలే౽స్మై తీక్ష్ణం సంశోధనం ప్రయచ్ఛన్తో దోషానతినిర్హృత్యైవ శరీరమస్యక్షిణ్వన్తి; ఏవమవయవేన జ్ఞానస్య కృత్స్నే జ్ఞేయేజ్ఞానమితి మన్యమానాః పరిస్ఖలన్తి, విదితవేదితవ్యాస్తు భిషజః సర్వం సర్వథా యథాసంభవం పరీ-

త్స్యం పరీక్ష్యాధ్యవస్యన్తో న క్వచిదపి విప్రతిపద్యన్తే, యథేష్టమర్థ మభినిర్వర్తయన్తి చేతి ॥4॥

అ॥ వ్యాధికలపురుషులు రెండువిధములుగ కనబడెదరు. ఎట్లనగా - అధికమైన వ్యాధికలవాడు మనోబలమును శరీరసంపత్తును కలిగియున్నచో అల్పవ్యాధికలవానివలె కనబడును. అల్పవ్యాధికలవాడు మనోబలము మొదలగువానిని స్వల్పముగ కలిగి యున్నచో అధికవ్యాధికలవానివలె కనబడును. అట్టివారలయొక్క రూపమును కేవలచక్షుస్సుచేతనే చూచి వ్యాధియొక్క గురులాఘవములను నిర్ణయించినచో పొర పాటు నొందెదరు. తెలియదగిన విషయమంతయు జ్ఞానసాధనములలో నొక్కదాని చేతనే తెలియబడదు. రోగనిర్ణయమునందు పొరపాటుపడినచో చికిత్సయందుకూడ పొరపాటుపడెదరు. గురువ్యాధికలవానిని లఘువ్యాధికలవానినిగ తలచిన వైద్యులు, దోషము అల్పముగనున్నదనుకొని శోధనకాలమునందు మృదుశోధనమునే యిచ్చి దోషము నింకను ఉద్రేకము నొందించెదరు. లఘువ్యాధికలవానిని గురువ్యాధికలవాని నిగ తలచిన వైద్యులు, దోషము అధికముగనున్నదనుకొని శోధనకాలమునందు తీక్ష్ణ మైన శోధనమునిచ్చి దోషములను అధికముగ బయలువెడలింపచేసి శరీరమును కృశింప చేయుదురు. తెలియదగినవిషయమంతయు జ్ఞానసాధనములలో నొక్కదానిచేతనే తెలిసినదని తలచినవారు పొరపాటునొందెదరు. సమస్తమును తెలిసినవైద్యులు సమస్త విషయములను అన్నివిధముల తగునట్లు పరీక్షించి నిర్ణయించినచో ఒకప్పుడును పొర పాటునొందక అనుకూలమైన క్రియాసిద్ధి నొందెదరు.

మూ॥ సత్త్వాదీనాం వికల్పేన వ్యాధీనాం రూపమాతురే। దృష్ట్వా విప్రతిపద్యన్తే బాలా వ్యాధిబలాబలే॥ తే భేషజమయోగేన కుర్వన్త్యజ్ఞానమోహితాః। వ్యాధితానాం వినాశయ క్లేశాయ మహ తేఽపి వా॥ ప్రాజ్ఞాస్తు సర్వమాజ్ఞాయ పరీక్ష్యమిహసర్వథా। న స్ఖలన్తి ప్రయోగేషు భేషజానాం కదాచన ॥7॥

అ॥ అల్పజ్ఞులగు వైద్యులు వ్యాధిరూపమునుమాత్రమే చూచి మనోబలము మొదలగువానిని తెలిసికొనకుండ వ్యాధియొక్క బలాబలములను నిర్ణయించినచో పొరపాటునొందెదరు. అట్టివారు ఔషధమును సరిగ నుపయోగింపక రోగికి మరణ మునుగాని అధికమగుబాధనుగాని కలిగించెదరు. ప్రాజ్ఞులగువైద్యులు సమస్తవిషయము లను బాగుగ పరీక్షించి ఔషధములను ప్రయోగించుటయందు ఒకప్పుడును పొర పాటు నొందరు.

## క్రిమిభేదములు.

మూ॥ ఇతి వ్యాధితరూపాధికారే శ్రుత్వా వ్యాధితరూపాగ్ర సంభవం వ్యాధితరూపహేతుం విప్రతిపత్తౌ చ కారణం సాపవాదం సంప్రతిపత్తికారణం చానపవాదం భగవన్తమాత్రేయమగ్నివే

శ్లో॥ అతః పరం సర్వక్రిమీణాం పురుషసంశ్రయాణాం సముత్థానస్థానసంస్థానవర్ణనామప్రభావచికిత్సితవిశేషాన్ ప్రప్రచ్ఛైవసంగృహ్య పాదౌ॥ అథాస్మై ప్రోవాచ భగవానాత్రేయః—ఇహ ఖల్వగ్నివేశ! వింశతి విధాః క్రిమయః పూర్వముద్దిష్టా నానావిధేన ప్రవిభాగేనాన్యత్ర సహజేభ్యః, తే పునః ప్రకృతిభిర్విభజ్యమానాశ్చతుర్విధా భవన్తి; తద్యథా—పురీషజాః శ్లేష్మజాః శోణితజా మలజాశ్చేతి॥

అ॥ ఈవ్యాధితరూపాధికారమునందు చెప్పబడినవియగు వ్యాధితరూపము యొక్క సంఖ్యాప్రమాణము, వ్యాధితరూపమునకు హేతువు, నిర్ణయించుటయందు పొరపాటుపడుటకు కారణము, చికిత్సయందు పొరపాటుపడుటకు కారణము, పొరపాటుపడకుండుటకు కారణము వీనిని విని అగ్నివేశుడు ఆత్రేయునియొక్క పాదములను పట్టుకొని పురుషులను ఆశ్రయించియుండు సమస్తక్రిములయొక్క పుట్టుకస్థానము స్వరూపము వర్ణము పేరు కృత్యములు చికిత్స వీనివిశేషములను అడిగెను. అగ్నివేశుని గురించి ఆత్రేయు డిట్లు చెప్పెను. సహజక్రిములుకాక ఇతరక్రిములు అనేకవిధములైన విభాగములచే ఇరువదివిధములుగ పూర్వమునందు (అష్టోదరీయాధ్యాయమునందు) చెప్పబడినవి. అవి కారణభేదములననుసరించి పురీషజములు శ్లేష్మజములు శోణితజములు మలజములు అని నాలుగువిధములుగ నుండును.

## మలజక్రిమివివరణము

మూ॥ తత్ర మలో బాహ్యశ్చాభ్యన్తరశ్చ। తత్ర బాహ్యే మలే జాతాన్మలజానసంచక్ష్మహే; తేషాం సముత్థానం—మృజావర్జనం, స్థానం—కేశశ్మశ్రులోమపక్ష్మవాసాంసి, సంస్థానం—అణవస్తిలాకృతయో బహుపాదాః, వర్ణః—కృష్ణః శుక్లశ్చ, నామాని—యూకాః పిపీలికాశ్చ, ప్రభావః—కణ్డూజననం కోఠపిడకాభినిర్వర్తనం చ, చికిత్సితం త్వేషాం—అపకర్షణం మలోపఘాతో మలకరాణాం చ భావానామనుపసేవనమితి ॥10॥

అ॥ మలము బాహ్యమలమనియు ఆభ్యంతరమలమనియు రెండువిధములుగ నుండును. బాహ్యమలమునందు జనించిన క్రిములు మలజము లనబడును. వానిపుట్టుకకు అపరిశుభ్రత కారణముగ నుండును. వెంట్రుకలు మీసములు రోమములు కనురెప్పలు వస్త్రములు ఇవి స్థానములుగ నుండును. చిన్నవిగను నువ్వులవంటి ఆకారము కలవిగను అనేకపాదములుకలవిగను నుండును. నల్లగగాని తెల్లగగాని యుండును. యూకములు (పేలు) పిపీలికములు (ఈళ్ళు) అనెడి పేరులను గలిగియుండును. దురదను దద్దుర్లను బొబ్బలను కలిగించును. వానిని తీసివేయుట, మలమును తొలగించుట, మలమునుకలిగించు కృత్యములను విడిచిపెట్టుట ఇవి చికిత్సలుగ నుండును.

## శోణితజక్రిమివివరణము.

మూ॥ శోణితజానాం తు ఖలు కుష్ఠైః సమానం సముత్థానం, స్థానం—రక్తవాహిన్యో ధమన్యః, సంస్థానం—అణవో వృత్తపాదాశ్చపాదాశ్చ సూక్ష్మత్వాచ్చైకే భవన్త్యదృశ్యాః, వర్ణః-తామ్రః, నామాని—కేశాదా లోమాదా లోమద్వీపాః సౌరసా ఔదుమ్బరా జన్తుమాతరశ్చేతి, ప్రభావః—కేశశ్మశ్రునఖలోమపక్ష్మాపధ్వంసో వ్రణగతానాం చ హర్షకణ్డూతోదసంసర్పణాన్యతివృద్ధానాం చ త్వక్సిరాస్నాయుమాంసతరుణాస్థిభక్షణమితి, చికిత్సితమప్యేషాం కుష్ఠైః సమానం తదుత్తరకాలముపదేక్ష్యామః ॥11॥

ఆ॥ కుష్ఠములయొక్క కారణములే రక్తజక్రిములు పుట్టుటకు కారణములుగ నుండును. రక్తమునువహించు నాడులు వీనికి స్థానములుగ నుండును. చిన్నవిగను గుండ్రముగను పాదములులేనివిగను నుండును. సూక్ష్మముగనుండుటవలన కొన్ని అదృశ్యములుగ నుండును. తామ్రవర్ణముకలవిగ నుండును. కేశాదములు లోమాదములు లోమద్వీపములు సౌరసములు ఔదుంబరములు జంతుమాతరములు అనెడి పేరులను కలిగియుండును. వెంట్రుకలు మీసములు గోళ్ళు రోమములు కనురెప్పలు వీనిని ఊడిపోవునట్లు చేయును. ఇవి వ్రణములయందున్నప్పుడు పులకరింపు దురద బాధ ప్రాకినట్లుండుట వీనిని కలిగించును. ఈ క్రిములు మిక్కిలి వృద్ధినొందినప్పుడు చర్మము శిరలు స్నాయువులు మాంసము తరుణాస్థులు వీనిని తినివేయును. కుష్ఠవ్యాధికి చెప్పబడిన చికిత్సనే వీనికికూడ చేయింపవలయును. ఆచికిత్స చికిత్సాస్థానమునందు చెప్పబడగలదు.

## శ్లేష్మజక్రిమివివరణము.

మూ॥ శ్లేష్మజాః క్షీరగుడతిలమత్స్యానూపమాంసపిష్టాన్నపరమాన్నకుసుమ్భస్నేహాజీర్ణపూతిక్లిన్నసంకీర్ణవిరుద్ధాసాత్మ్యభోజనసముత్థానాః, తేషామామాశయః స్థానం, తే ప్రవర్ధమానాస్తూర్ధ్వమధో వా విసర్పన్త్యుభయతో వా, సంస్థానవర్ణవిశేషాస్తు—శ్వేతాః పృథుబ్రధ్నసంస్థానాః కేచిత్, కేచిద్వృత్తపరిణాహా గణ్డూపదాకృతయశ్చ శ్వేతాస్తామ్రావభాసాః, కేచిదణవో దీర్ఘాస్తన్త్వాకృతయః శ్వేతాః; తేషాం త్రివిధానాం శ్లేష్మనిమిత్తానాం క్రిమీణాం నామాని—అన్త్రాదాః, ఉదరాదాః, హృదయాదాః, చురవో, దర్భపుష్పాః, సౌగన్ధికాః, మహాగుదాశ్చేతి; ప్రభావో—హృల్లాసాస్య

సంసర్పణమరోచకావాకౌ జ్వరో మూర్ఛా జృమ్భా క్షవథురా నాహోఽఙ్గమర్దశ్ఛర్దిః కార్శ్యం పారుష్యమితి ॥12॥

అ॥ పాలు, బెల్లము, నువ్వులు, చేపలు, ఆనూపమాంసము, పిండితో తయారు చేయబడిన పదార్థములు, పాయసము, కుసుంభతైలము, అజీర్ణభోజనము, దుర్గంధము కలిగినట్టియు చెడిపోయినట్టియు సంకీర్ణమైనట్టియు విరుద్ధమైనట్టియు అభ్యాసము లేనట్టియు భోజనము వీనిని సేవించుటవలన కఫజక్రిములు పుట్టును. వీనికి ఆమాశయము స్థానముగ నుండును. ఇవి వృద్ధినొంది ఊర్ధ్వప్రదేశమునకుగాని అధఃప్రదేశమునకుగాని ఉభయప్రదేశములకుగాని వ్యాపించును. కొన్ని తెల్లగను మాంసపేశివలెను నుండును. కొన్ని గుండ్రముగను పొడుగుగను వానపాములయొక్క ఆకారముకలవిగను నుండి తెల్లగగాని తామ్రవర్ణము కలవిగగాని యుండును. కొన్ని సన్నముగను పొడుగుగను దారములయొక్క ఆకారము కలవిగను తెల్లగను నుండును. అంత్రాదములు ఉదరాదములు హృదయాదములు చురవములు దర్భపుష్పములు సౌగంధికములు మహాగుదములు అనెడి పేరులను కలిగియుండును. గుండెదడ, నోట నీరూరుట, అరుచి జీర్ణముకాకుండుట, జ్వరము, మూర్ఛ, ఆవలింతలు, తుమ్ములు, కడుపుబ్బుట, ఒడలునొప్పులు, వాంతి, కృశించుట, పరుషత్వము వీనిని కలిగించును.

## పురీషజక్రిమివివరణము.

మూ॥ పురీషజాస్తుల్యసముత్థానాః శ్లేష్మజైః, తేషాం స్థానం పక్వాశయః, ప్రవర్ధమానాస్త్వధో విసర్పన్తి, యస్య పునరామాశయాభిముఖాః స్యుస్తదనన్తరం తస్యోద్గారనిశ్వాసాః పురీషగన్ధినః స్యుః; సంస్థానవర్ణవిశేషాస్తు సూక్ష్మవృత్తపరీణాహాః శ్వేతా దీర్ఘా ఊర్ణాంశుకసంకాశాః కేచిత్, కేచిత్పునః స్థూలవృత్తపరీణాహాః శ్యావనీలహారితపీతాః; తేషాం నామాని—కకేరుకా మకేరుకా లేలిహాః సశూలకాః సౌసురాదాశ్చేతి; ప్రభావః—పురీషభేదః కార్శ్యం పారుష్యం లోమహర్షాభినిర్వర్తనం చ, త ఏవాఽన్య గుదముఖం పరితుదన్తః కణ్డూం చోపజనయన్తో గుదముఖం పర్యాసతే, త ఏవ జాతహర్షా గుదనిష్క్రమణమతివేలం కుర్వన్తి; ఇత్యేష శ్లేష్మజానాం పురీషజానాం చ కృమీణాం సముత్థానాదివిశేషః ॥13॥

అ॥ శ్లేష్మజక్రిములయొక్క కారణములే పురీషజక్రిములుపుట్టుటకు కారణములుగ నుండును. వీనికి పక్వాశయము స్థానముగ నుండును. ఇవి వృద్ధినొందినచో క్రిందిభాగమునకు వ్యాపించును. ఆమాశయాభిముఖములైనచో త్రేణుపులును నిశ్వాసమును పురీషగంధముకలవిగ నుండును. కొన్ని సన్నముగను గుండ్రముగను పలుచ

గను తెల్లగను పొడుగుగను ఉన్నిదారమువంటి ఆకారముకలవిగను నుండును. కొన్ని లావుగను గుండ్రముగను పలుచగను శ్యావవర్ణముకలవిగను నల్లగను పసుపుపచ్చవిగను పచ్చగను నుండును. కకేరుకములు మకేరుకములు లేలిహములు సశూలకములు సౌసురాదములు అనెడి పేరులను కలిగియుండును. విరేచనములు కృశించుట పరుషత్వము గగుర్పాటు వీనిని కలిగించును. గుదముఖమును పొందినప్పుడు బాధను దురదను కలిగించును. ఉద్రేకమునొంది తరుచు గుదప్రదేశమును పొందుచుండును. శ్లేష్మజక్రిములయొక్కయు పురీషజక్రిములయొక్కయు పుట్టుక మొదలగునవి చెప్పబడినవి.

శ్లేష్మజపురీషజక్రిమిసామాన్యచికిత్స.

మూ॥ చికిత్సితం తు ఖల్వేషాం సమాసేనోపదిశ్య పశ్చాద్విస్తరేణోపదేక్ష్యామః। తత్రసర్వక్రిమీణామపకర్షణమేవాదితః కార్యం; తతః ప్రకృతివిఘాతః, అనన్తరం నిదానోక్తానాం భావానామనుపసేవనమితి॥ తత్రాపకర్షణం—హస్తేనాభిగృహ్య విమృశ్యోపకరణవతాఽపనయనమనుపకరణేన వా, స్థానగతానాం తు క్రిమీణాం భేషజేనాపకర్షణం; న్యాయతస్తు తచ్చతుర్విధం; తద్యథా—శిరోవిరేచనం వమనం విరేచనమాస్థాపనమిత్యపకర్షణవిధిః॥ ప్రకృతివిఘాతస్త్వేషాం - కటుతిక్తకషాయక్షారోష్ణానాం ద్రవ్యాణాముపయోగో యచ్చాన్యదపి కించిచ్ఛ్లేష్మపురీషప్రత్యనీకభూతం తత్స్యాదితి ప్రకృతివిఘాతః॥ అనన్తరం నిదానోక్తానాం భావానామనుపసేవనమితి, యదుక్తం నిదానవిధౌ తస్య వర్జనం తథాప్రాయాణాం చాపరేషాం ద్రవ్యాణామితి, లక్షణతశ్చికిత్సితమనువ్యాఖ్యాతం; ఏతదేవ పునర్విస్తరేణోపదేక్ష్యతే ॥17॥

అ॥ ఈక్రిములకు సామాన్యచికిత్సను మొదటచెప్పి పిదప విశేషచికిత్సను చెప్పెదము. సమస్తక్రిములకును మొదట అపకర్షణమును, పిదప ప్రకృతివిఘాతమును చేయవలయును. పుట్టుటకు కారణములగువానిని విడిచిపెట్టవలయును. ఉపకరణములు కలిగినట్టికాని ఉపకరణములులేనట్టికాని హస్తముతో విమర్శించి పట్టుకొని తీసివేయుట, ఆభ్యంతరస్థానములయందున్నవానిని నస్యము వమనము విరేచనము ఆస్థాపనవస్తి అను నాలుగువిధములగు చికిత్సలచే తీసివేయుట ఇవి అపకర్షణవిధానముగ నుండును. కటురసమును తిక్తరసమును కషాయరసమును క్షారమును ఉష్ణవీర్యమును కల ద్రవ్యములను నుపయోగించుట, శ్లేష్మమును పురీషమును శుద్ధిచేయు నిట్టియితర ద్రవ్యముల నుపయోగించుట, ఇవి ప్రకృతివిఘాతముగ నుండును. హేతుభూతములుగ చెప్పబడినట్టికాని వానితో సమానమైనట్టికాని ద్రవ్యములను విడిచిపెట్టవలయును. క్రిమిచికిత్స సంగ్రహముగ చెప్పబడినది. విస్తరించి చెప్పబడగలదు.

## క్రిమివిశేషచికిత్స.

మూ॥ అథైనం క్రిమికోష్ఠమాతురమగ్రే షడ్రాత్రం సప్తరాత్రం వా స్నేహస్వేదాభ్యాముపపాద్య శ్వోభూతే ఏనం సంశోధనం పాయయితాఽస్మీతి క్షీరదధిగుడతిలమత్స్యానూపమాంసపిష్టాన్నపరమాన్నకుసుమ్భస్నేహసంప్రయుక్తైర్భోజ్యైః సాయం ప్రాతశ్చోపపాదయేత్సముదీరణార్థం చైవ క్రిమీణాం కోష్ఠాభిసరణార్థం చ భిషక్, అథ వ్యుష్టాయాం రాత్రౌ సుఖోషితం సుప్రజీర్ణభుక్తం చ విజ్ఞాయాస్థాపనవమనవిరేచనైస్తదహరేవోపపాదయేదుపపాదనీయశ్చేత్స్యాత్సర్వాన్ పరీక్ష్యవిశేషాన్ పరీక్ష్య సమ్యక్॥

అ॥ క్రిములుకల మనుజునకు మొదట ఆరురోజులుగాని ఏడురోజులుగాని స్నేహస్వేదములను చేయింపవలయును. క్రిములు ప్రేరేపింపబడి కోష్ఠమునుచేరుటకై పాలు పెరుగు బెల్లము నువ్వులు చేపలు ఆనూపమాంసము పిండితో తయారుచేయబడినపదార్థములు పాయసము కుసుంభతైలము వీరితోకూడిన ఆహారమును ఉదయమునందును సాయంకాలమునందును ఇచ్చి ఆరాత్రి గడచినపిదప మరునాడుదయమున సుఖవంతుడుగ నున్నట్టియు భుజించినఆహారము బాగుగ జీర్ణమైనట్టివానికి ఆస్థాపనవస్తి వమనము విరేచనము అనెడి శోధనకర్మలను ఆరోజుననే చేయింపవలెను. అట్లు చేయించునప్పుడు పరీక్షింపదగిన సమస్తవిషయములను బాగుగ పరీక్షింపవలయును.

## క్రిమిరోగికి ఆస్థాపనవస్తి.

మూ॥ అథాహరేతి బ్రూయాత్—మూలకసర్షపలశునకరఞ్జశిగ్రుమధుశిగ్రుకమఠఖరపుష్పాభూస్తృణసుముఖసురసకుఠేరకగణ్డీరకకాలమాలకపర్ణాసక్షవకఫణిజ్ఝకాని సర్వాణ్యథవా యథాలాభం, తాన్యాహృత్యాన్యభిసమీక్ష్య ఖణ్డశశ్ఛేదయిత్వా ప్రక్షాళ్య పానీయేన సుప్రక్షాళితాయాం స్థాల్యాం సమావాప్య గోమూత్రేణార్ధోదకేనాభ్యాసిచ్య సాధయేత్ సతతమవఘట్టయన్ దర్వ్యా, తస్మిన్ శీతీభూతే తూపయుక్తభూయిష్ఠేఽమ్భసి గతరసేష్వౌషధేషు స్థాలీమవతార్య, సుపరిపూతం కషాయం సుఖోష్ణం మదనఫలపిప్పలీవిడఙ్గకల్కతైలోపహితం, సర్జికాలవణితమభ్యాసిచ్య వస్తౌ విధివదాస్థాపయేదేనం; తథాఽర్కాలర్కకుటజాఢకీకుష్ఠకైడర్యకషాయేణ వా, తథా శిగ్రుపీలుకుస్తుమ్బురుకటుకాసర్షపకషాయేణ, తథాఽఽమలకశృఙ్గవేరదారుహరిద్రాపిచుమర్దకషాయేణ మదనఫలసంయోగసంయోజితేన త్రిరాత్రం సప్తరాత్రం వాఽఽస్థాపయేత్ ॥18॥

అ॥ ముల్లంగి ఆవాలు వెల్లుల్లి క్రానుగ మునగ ఎఱ్ఱమునగ అందుగ అడవి తులసి కామంచిపూరి ఎఱ్ఱఆవాలు తులసి గగ్గెర గురిజ నల్లగగ్గెర తెల్లగగ్గెర నల్ల ఆవాలు మరువము వీనినన్నిటిని గాని దొరికినన్ని గాని తీసికొనివచ్చి ముక్కలుగనఱికి కడిగి బాగుగ కడగబడిన పాత్రయందుంచి సగముడుదకము కలిసిన గోమూత్రమును పోసి గరిటెతో త్రిప్పుచు కాచవలెయును. ద్రవ్యములయందలి సారము సంక్రమించి నట్టియు ఉపయోగించుటకు అనుకూలముగ నున్నట్టియు చల్లారినట్టియు ఆకషాయమును వడపోసి గోరువెచ్చగనున్న దానియందు మంగకాయ పిప్పళ్ళు వాయువిడంగములు వీనికల్కమును తైలమును సర్జక్షారమును సైంధవలవణమును చేర్చి విధిప్రకారముగ ఆస్థాపన వస్తిని చేయింపవలయును. జిల్లేడు తెల్లజిల్లేడు కొడిసెపాల కందులు చెంగల్వ కోష్టు పెద్దవేప వీని కషాయమునందుగాని మునగ వరగోగు ధనియాలు కటుకరోహిణి ఆవాలు వీని కషాయమునందుగాని ఉసిరిక శుంఠి మ్రానిపసుపు వేపకనికషాయమునందు గాని పూర్వమునందువలెనే మ్రంగకాయ మొదలైనవానియొక్క కల్కము మొదలగు వానిని చేర్చి మూడురోజులుగాని ఏడురోజులుగాని ఆస్థాపనవస్తిని చేయింపవలయును.

## క్రిమిరోగికి వమనవిరేచనవిధి.

మూ॥ ప్రత్యాగతే చ పశ్చిమే వస్తౌ ప్రత్యాశ్వస్తం తదహ రేవోభయతోభాగహరణం సంశోధనం పాయయేద్యుక్త్యా, తస్య విధి రుపదేక్ష్యతే — మదనఫలపిప్పలీకషాయస్యార్ధాఞ్జలిమాత్రేణ త్రివృత్కల్కాక్షమాత్రమాలోడ్య పాతుమస్మై ప్రయచ్ఛేత్, తదస్య దోషముభయతో నిర్హరతి సాధు; ఏవమేవ కల్పోక్తాని వమనవిరేచనాని సంసృజ్య పాయయేదేనం బుద్ధ్యా సర్వవిశేషానవేక్షమాణో భిషక్ ॥19॥

అ॥ తుదివస్తిపూర్తియైనపిదప ఆరోజుననే వమనవిరేచనములను తగువిధమున చేయింపవలయును. వానియొక్క విధిని చెప్పుచున్నాము. రెండుపలముల మ్రింగగింజల కషాయమునందు కర్షపరిమితికల తెగడచూర్ణమును కలిపి త్రాగింపవలయును. ఇట్లుచేసినచో దోషమును రెండుమార్గములనుండియు వెడలింపచేయును. బుద్ధిమంతుడగు వైద్యుడు సకలవిషయములను బాగుగ నాలోచించి కల్పస్థానమునందు చెప్పబడిన వమనవిరేచనయోగములను ఇట్లే కలిపి యుపయోగింపవలయును.

## శోధనానంతరవిధి.

మూ॥ అథైనం సమ్యగ్విరిక్తం విజ్ఞాయాపరాహ్ణే శైఖరికకషాయేణ సుఖోష్ణేన పరిషేచయేత్, తేనైవ చ కషాయేణ బాహ్యాభ్యన్తరాన్ సర్వోదకార్థాన్ కారయేచ్ఛశ్వత్; తదభావే వా కటుతిక్తకషాయాణామౌషధానాం క్వాథైర్మూత్రక్షారైర్వా పరిషేచయేత్।

పరిషిక్తం చైనం నివాతమాగారమనుప్రవేశ్య పిప్పలీపిప్పలీమూలచవ్యచిత్రకశృఙ్గవేరసిద్ధేన యవాగ్వాదినా క్రమేణోపక్రామయేత్। విలేప్యాః క్రమాగతం చైనమనువాసయేద్విడఙ్గతైలేనైకాన్తరం ద్విస్త్రిర్వా ॥20॥

అ॥ శోధనము బాగుగ అయినట్లు తెలిసికొని అపరాహ్ణకాలమునందు వాయువిడంగములయొక్క గోరువెచ్చనికషాయముతో స్నానమును చేయింపవలయును. బాహ్యముగగాని అభ్యంతరముగగాని ఉదకమును ఉపయోగింపవలసివచ్చినప్పుడు వాయువిడంగకషాయమునే ఉపయోగింపవలయును. ఈకషాయములేనిచో కటురసము తిక్తరసము కల ద్రవ్యములచే సిద్ధముచేయబడిన కషాయములతోగాని క్షారముతో గూడిన మూత్రములతోగాని స్నానమును చేయింపవలయును. పిమ్మట వానిని గాలిచొరని యింటియందు ప్రవేశపెట్టి పిప్పళ్ళు మోడి చవ్యము చిత్రమూలము శుంఠి వీనితో తయారుచేయబడిన జావలు మొదలగువానిని క్రమప్రకారముగ నియ్యవలయును. అట్లు జావలు మొదలగువానినిచ్చుచు వాయువిడంగములయొక్క తైలముతో రెండుగాని మూడుగాని అనువాసనవస్తులను ఒకరోజు విడిచిపెట్టుచు చేయింపవలయును.

మూ॥ యదిపునరస్యాతిప్రవృద్ధాశ్శీర్షాదీన్క్రిమీన్మన్యేత శిరస్యేవాభిసర్పతః కాంశ్చిత్, తతః స్నేహస్వేదాభ్యామస్య శిర ఉపపాద్య విరేచయేదపామార్గతణ్డులాదినా శిరోవిరేచనేన ।21॥

అ॥ శిరోగతములగుక్రిములు మిక్కిలివృద్ధినొంది శిరస్సునందే సంచరించుచున్నచో శిరస్సునకు స్నేహస్వేదములనాచరించి ఉత్తరేణిగింజలు మొదలగు శిరోవిరేచన ద్రవ్యములతో నస్యకర్మను చేయింపవలయును.

### క్రిమిరోగికి ఆహారవిధి.

మూ॥ యస్త్వభ్యవహార్యవిధిః ప్రకృతివిఘాతాయోక్తః క్రిమీణాం, సోఽనువ్యాఖ్యాస్యతే—మూషికపర్ణీం సమూలాగ్రప్రతానామాహృత్య ఖణ్డశశ్ఛేదయిత్వా,ఉలూఖలే క్షోదయిత్వా పాణిభ్యాం పీడయిత్వా రసం గృహ్ణీయాత్, తేనరసేన లోహితశాలితణ్డులపిష్టం సమాలోడ్య పూపలికాః కృత్వా విధూమేష్వఙ్గారేషు విపాచ్య విడఙ్గతైలలవణోపహితాః క్రిమికోష్ఠాయ భక్షయితుం ప్రయచ్ఛేత్; అనన్తరం చామ్లకాఞ్జికముదశ్విద్వా పిప్పల్యాదిపఞ్చవర్గసంసృష్టం సలవణమనుపాయయేత్॥ అనేన కల్పేన మార్కవార్కసహచరనీపనిర్గుణ్డీసుముఖసురసకుఠేరకగణ్డీరకాలమాలకపర్ణాసక్షవకఫణిజ్ఝకవకులకుటజసువర్ణక్షీరీస్వరసానామన్యతమస్మిన్కారయేత్పూపలికాః,

తథా కిణిహీకిరాతతిక్తకసువహామలకహారీతకీవిభీతకస్వరసేషు కారయేత్పూపలికాః। స్వరసాంశ్చ తేషామేకైకశో ద్విద్విశః సర్వశో వా మధువిలులితాన్ పాత్రతరసన్నాయ పాతుం ప్రయచ్ఛేత్ ॥౨౩॥

అ॥ క్రిములయొక్క ప్రకృతివిఘాతముకొరకు చెప్పబడిన ఆహారవిధిని వివరించుచున్నాము. వేళ్ళు తీగలు మొదలైనవానితో కూడిన ఎలుకచెవిచెట్టును తీసికొనివచ్చి ముక్కలుగనరికి రోటియందు నలియకొట్టి చేతులతో పిసికి రసమునుతీసి ఆరసముతో ఎఱ్ఱవరిబియ్యపుపిండినికలిపి అప్పడములవలెచేసి పొగలేని నిప్పులమీదకాల్చి వాయువిడంగముల తైలమును సైంధవలవణమును చేర్చి క్రిమిరోగికి భక్షించుట కీయవలయును. పిమ్మట పులికడుగునందుగాని మజ్జిగయందుగాని పిప్పళ్ళు మొదలగు అయిదింటియొక్క చూర్ణమును సైంధవలవణమును చేర్చి పానమును చేయింపవలయును. ఈ కల్పము ననుసరించియే గుంటగలగర జిల్లేడు ములుగోరింట కడిమి వావిలి ఎఱ్ఱావాల చెట్టు తులసి గగ్గెర గురిజ నల్లగగ్గెర తెల్లగగ్గెర నల్లఆవాలచెట్టు మరువము పొగడ కొడిసె పాల స్వర్ణక్షీరి ఉత్తరేణి నేలవేము అందుగ ఉసిరిక కరకచెట్టు తానిచెట్టు వీనిలో దేనియొక్క స్వరసముతోనైనను అప్పడములను తయారుచేసి యీయవలయును. పైన చెప్పబడినవానియొక్క స్వరసములలో ఒకటినిగాని రెండింటినిగాని అన్నిటినిగాని గ్రహించి యందు తేనెనుకలిపి భుజింపకుండచున్నవానికి ప్రాతఃకాలమునందు పానము నిమిత్త మీయవలయును.

## కృమిరోగికిఔషధయోగములు.

మూ॥ అథాశ్వశ్ఛదాహృత్య మహతి కిలిఞ్జకే ప్రస్తీర్యాతపే శోషయిత్వోదూఖలే క్షోదయిత్వా దృషది పునః సూక్ష్మాణి చూర్ణాని కారయిత్వా విడఙ్గకషాయేణ త్రిఫలాకషాయేణ వాఽష్టకృత్వో దశకృత్వో వాఽఽతపే సుపరిభావితాని భావయిత్వా దృషది పునః సూక్ష్మాణి చూర్ణాని కారయిత్వా నవే కలశే సమావాప్యానుగుప్తం నిధాపయేత్; తేషాంతుఖలు చూర్ణానాం పాణితలం చూర్ణం యావద్వా సాధు మన్యేత, తత్ క్షౌద్రేణ సంసృజ్య కృమికోష్ఠాయ లేఢుం యచ్ఛేత్ ॥24॥

అ॥ గుఱ్ఱపుపెంటికలను పెద్దబల్లమీదపరచి ఎండయందెండించి రోటియందుదంచి రాతిమీద మెత్తగనూరి వాయువిడంగకషాయమునందుగాని త్రిఫలాకషాయమునందుగాని ఎనిమిదిలేకపదిమారులు బాగుగ భావనచేసి మరల రాతిమీద మెత్తగచూర్ణించి క్రొత్తపాత్రయందుంచి జాగ్రతచేయవలయును. ఆచూర్ణమును కర్ష ప్రమాణముగగాని తగునట్లుగగాని గ్రహించి తేనెతోకలిపి క్రిమిరోగి కీయవలయును.

మూ॥ తథా భల్లాతకాస్థీన్యాహృత్య కలశప్రమాణేన సంపోథ్య స్నేహభావితే దృఢే కలశే సూక్ష్మానేకచ్ఛిద్రబ్రధ్నే శరీరముపవేష్ట్య మృదావలిప్తే సమావాప్యోడుపేన పిధాయ భూమావాకణ్ఠం నిఖాతస్య స్నేహభావితస్యైవాన్యస్య దృఢస్య కుమ్భస్యోపరి సమారోప్య సమన్తాద్గోమయైరుపచిత్య దాహయేత్; స యదా జానీయాత్ సాధు దగ్ధాని గోమయాని గలితస్నేహాని భల్లాతకాస్థీనీతి. తతస్తం కుమ్భముద్ధారయేత్; అథ తస్మాద్ద్వితీయాత్కుమ్భాత్తం స్నేహమాదాయ విడఙ్గతణ్డులచూర్ణైః స్నేహార్ధమాత్రైః ప్రతిసంసృజ్యాతపే సర్వమహః స్థాపయిత్వా తతోఽస్మై మాత్రాం ప్రయచ్ఛేత్పానాయ, తేన సాధు విరిచ్యతే, విరిక్తస్య చానుపూర్వీ యథోక్తా॥ ఏవమేవ భద్రదారుసరళకాష్ఠస్నేహానుపకల్ప్య పాతుం ప్రయచ్ఛేత్, అనువాసయేచ్చైనమనువాసనకాలే ॥26॥

అ॥ జీడిగింజలను కలశపరిమితిగ గ్రహించి నలియకొట్టి చమురుతో మాగినట్టియు దృఢమైనట్టియు అడుగుభాగమున సన్నరంధ్రములు వేయబడినట్టియు పాత్రయందు పోసి మూకుడుతో మూసి అంతటనుచుట్టి మట్టిచే పూయవలయును. ఈపాత్రను, చమురుతో మాగినట్టియు దృఢమైనట్టియు భూమియందు కంఠపర్యంతము పాతబడినట్టియు పాత్రమీద నుంచి అంతటను పిడకలను పేర్చి పుటముపెట్టవలయును. పిడకలన్నియు బాగుగ కాలిపోయి జీడిగింజలనుండి చమురంతయు దిగినపిదప పైనున్న కుండను తీసివేసి క్రిందికుండయందున్న చమురును గ్రహించి దానిలో సగముపరిమితి కల వాయువిడంగచూర్ణమును కలిపి ఎండయం దొకరోజు పూర్తిగనుంచి తగుపరిమితిగ పానమును చేయించినచో బాగుగ విరేచనములు అగును. విరేచనములైనపిదప జావలు మొదలగువానియొక్క క్రమమును పూర్వమునందువలెనే చేయింపవలయును. దేవదారు సరలదేవదారు వీనియొక్క పుడకలనుండికూడ పూర్వమునందువలెనే చమురును తీసి పానమును చేయింపవలయును. అనువాసనవస్తికి అనుకూలమైన కాలమునందు దీనిచే అనువాసనవస్తినికూడ చేయింపవచ్చును.

మూ॥ అథ 'ఆహార' ఇతి బ్రూయాత్ — శారదాన్నవాంస్తిలాన్సమ్పదుపేతాన్ తానాహృత్య సునిష్పూయ శోధయిత్వావిడఙ్గకషాయే సుఖోష్ణే నిర్వాపయేదాదోషగమనాత్, గతదోషానభిసమీక్ష్య సుప్రలూనాన్ప్రలూచ్య పునరేవ సునిష్పూయ శోధయిత్వావిడఙ్గకషాయేణ త్రిస్సప్తకృత్వః సుపరిభావితాన్భావయిత్వాఽఽతపే శోషయిత్వోదూఖలే సంక్షుద్య దృషది పునః శ్లక్ష్ణపిష్టాన్కారయిత్వా ద్రోణ్యామభ్యవధాయ విడఙ్గకషాయేణ ముహుర్ముహురవసిఞ్చన్ పాణిమర్ద

మేవ మర్దయేత్; తస్మిన్ఖలు ప్రపీడ్యమానే యత్తైలముదియాత్తత్పా
ణిభ్యాం పర్యాదాయ శుచౌ దృఢే కలశే సమాసిచ్యానుగుప్తం నిధా
పయేత్ । అథ 'ఆహర' ఇతి బ్రూయాత్ — తిల్వకోద్దాలకయోర్ద్వౌ
బిల్వమాత్రౌ పిణ్డౌ శ్లక్ష్ణపిష్టౌ విడఙ్గకషాయేణ, తతోఽర్ధమాత్రౌ
శ్యామాత్రివృతయోరర్ధమాత్రౌ దన్తీద్రవన్త్యోస్తతోఽర్ధమాత్రౌ
చవ్యచిత్రకయోరిత్యేతం సమ్భారం విడఙ్గకషాయస్యాఢకమాత్రేణ
ప్రతిసంసృజ్య తతస్తైలప్రస్థమావాప్య సర్వమాలోడ్య మహతి ప
ర్యోగే సమాసిచ్యాగ్నావధిశ్రిత్య మహత్యాసనే సుఖోపవిష్టః సర్వతః
స్నేహమవలోకయన్నజస్రం మృద్వగ్నినా సాధయేద్దర్వ్యా సతతమవ
ఘట్టయన్; స యదా జానీయాద్విరమతి శబ్దః, ప్రశామ్యతి చ ఫేనః,
ప్రసాదమాపద్యతే స్నేహో, యథాస్వం గన్ధవర్ణరసోత్పత్తిః, సం
వర్తతే చ భేషజమఙ్గులిభ్యాం మృద్యమానమనతిమృద్వనతిదారుణమన
ఙ్గులిగ్రాహి చేతి, స కాలస్తస్యావతారణాయ, తతస్తమవతీర్ణం శీతీభూత
మహతేన వాససా పరిపూయ శుచౌ దృఢే కలశే సమాసిచ్య పిధా
నేన పిధాయ శుక్లేన వస్త్రపట్టేనావచ్ఛాద్య సూత్రేణ సుబద్ధం సుని
గుప్తం నిధాపయేత్ । తతోఽస్మై మాత్రాం ప్రయచ్ఛేత్పానాయ,
తేన సాధు విరిచ్యతే, సమ్యగపహృతదోషస్య చాస్యానుపూర్వీ య
థోక్తా; తతశ్చైనమనువాసయేదనువాసనకాలే; ఏతేనైవ చ పాక
విధినా సర్షపాతసీకరఞ్జకోషాతకీ స్నేహానుపకల్పయేత్సర్వ
విశేషాన వేక్ష్యమాణః; తేనాగదో భవతీతి ॥27॥

అ॥ శరదృతువునందు ఫలించినట్టియు వీర్యవంతములైనట్టియు నువ్వులను తీసికొనివచ్చి శుభ్రపరచి కడిగి వానియందలిదోషముపోవుటకు గోరువెచ్చని వాయువిడంగకషాయమునం దుంచవలయును. దోషముపోయినపిమ్మట పొట్టునుతీసివేసి మరల శుభ్రపరచి కడిగి వాయువిడంగకషాయమునందు ఇరువదియొకమారులు భావన చేసి ఎండయందెండించి రోటియందుదంచి రాతిమీద మెత్తగనూరి పాత్రయందుంచి వాయువిడంగకషాయముతో మాటిమాటికితడుపుచు చేతులతో పిండవలయును. అట్లు పిండునపుడువచ్చినతైలమును పరిశుభ్రమైనట్టియు దృఢమైనట్టియు పాత్రయందుంచి జాగ్రతగనుంచవలయును. వాయువిడంగకషాయముతో మెత్తగనూరబడిన లొద్దుగ విరిగి వీనియొక్క కల్కమును రెండుపలములుగను, నల్లతెగడ తెల్లతెగడ వీనియొక్క కల్కమును ఒకపలముగను, దంతి పెద్దదంతి వీనియొక్క కల్కమును అర్ధపలముగను, చవ్యము చిత్రమూలము వీనియొక్క కల్కమును పావుపలముగను గ్రహించి ఆఢకపరి

మితికల వాయువిడంగకషాయమునందు కలిపి అందు పూర్వోక్తతైలమును ప్రస్థపరిమితిగ చేర్చి వీనినన్నిటిని కలిపి పెద్దపాత్రలో పోసి ఎత్తైన ఆసనముమీదకూర్చుండి గరిటెతో మాటిమాటికి త్రిప్పుచు తరుచు చూచుచు మృద్వగ్నిచే ఈతైలమును కాచవలయును. తైలమునందలిధ్వని నశించి నురుగతగ్గి నైర్మల్యముకలిగి సరియగు గంధము వర్ణము రసము ఏర్పడి కల్కమును వ్రేళ్ళతో నలిపినయెడల మిక్కిలి మెత్తగగాని మిక్కిలి గట్టిగగాని యుండక వ్రేళ్ళకుఅంటుకొనకుండనున్నప్పుడు తయారైనట్లు తెలిసికొని దింపవలయును. చల్లారినపిదప మంచివస్త్రముతో ఒడియకట్టి పరిశుభ్రమైనట్టియు దృఢమైనట్టియు పాత్రయందు పోసి మూతపెట్టి తెల్లనిబట్టనుకప్పి త్రాడుతో బాగుగకట్టి జాగ్రతగ నుంచవలయును. పిమ్మట దీనిని తగుపరిమితిగ నిచ్చినచో బాగుగ విరేచనము లగును. దోషములు బాగుగ హరింపబడినపిదప పూర్వమునందువలెనే పేయాక్రమము నాచరింపవలయును. అనువాసనమున కర్హమైన కాలమునందు అనువాసనవస్తిని చేయింపవలయును. ఆవాలు అవిసెగింజలు కానుగవిత్తులు చేదుబీరగింజలు వీనియొక్క తైలమునుగూడ పూర్వోక్తవిధిప్రకారముగ తయారుచేసి సమస్తవిషయములను ఆలోచించి పానమును చేయింపవలయును. ఇట్లుచేసినచో రోగరహితుడగును.

మూ॥ ఇత్యేతద్ద్వయానాం శ్లేష్మపురీషసంభవానాం కృమీణాం సముత్థానస్థానసంస్థానవర్ణనామ ప్రభావచికిత్సితవిశేషా వ్యాఖ్యాతాః సామాన్యతః॥ విశేషతస్త్వల్పమాత్రమాస్థాపనానువాసనానులోమహరణభూయిష్ఠం తేష్వౌషధేషు పురీషజానాం కృమీణాంచికిత్సితం కార్యం, మాత్రాధికం పునశ్శిరోవిరేచనవమనోపశమనభూయిష్ఠం తేష్వౌషధేషు శ్లేష్మజానాం కృమీణాంచికిత్సితం కార్యమితి; ఏష కృమిఘ్నో భేషజవిధిరనువ్యాఖ్యాతో భవతి। తమనుతిష్ఠతాయథాస్వహేతువర్జనే ప్రయతితవ్యమ్ ॥30॥

అ॥ ఇట్లు శ్లేష్మజక్రిములయొక్కయు పురీషక్రిములయొక్కయు పుట్టుకస్థానము స్వరూపము వర్ణము నామము కృత్యములు చికిత్స వీనివిశేషములు సామాన్యముగ చెప్పబడినవి. పైనచెప్పబడిన చికిత్సలలో పురీషజకృములకు ఆస్థాపనవస్తి అనువాసనవస్తి అనులోమనచికిత్స వీనిని ప్రధానముగను ఇతరచికిత్సలను స్వల్పముగను చేయింపవలయును. శ్లేష్మజక్రిములకు నస్యకర్మ వమనము శమనచికిత్స వీనిని ప్రధానముగను ఇతరచికిత్సలను స్వల్పముగను చేయింపవలయును. ఇట్లు క్రిమిచికిత్స చెప్పబడినది. ఈచికిత్సను ఆచరించుచు అవిపుట్టుటకు కలహేతువులను విడిచిపెట్టవలయును.

మూ॥ యథోద్దేశమేవమిదం క్రిమికోష్ఠచికిత్సితం యథావదనువ్యాఖ్యాతం భవతీతి ॥31॥

అ॥ ఇట్లు క్రిమిరోగచికిత్స తగువిధమున చెప్పబడినది.

మూ॥ అపకర్షణమేవాదౌ కృమీణాం భేషజం స్మృతమ్। తతో విఘాతః ప్రకృతేర్నిదానస్య చ వర్జనమ్॥ అయమేవ వికారాణాం సర్వేషామపి నిగ్రహే । విధిర్దృష్టస్త్రిధా యోఽయం కృమీనుద్దిశ్య కీర్తితః॥ సంశోధనం సంశమనం నిదానస్య చ వర్జనమ్। ఏతావద్భిషజా కార్యం రోగే రోగే యథావిధి ॥34॥

అ॥ క్రిములకు ప్రథమమున అపకర్షణమును పిమ్మట ప్రకృతివిఘాతమును నిదానపరివర్జనమును చికిత్సలుగ నుండును. క్రిములకు చెప్పబడిన శోధనము శమనము నిదానపరివర్జనము అను నీమూడువిధములగు చికిత్సలు సమస్తవ్యాధులకును సామాన్య చికిత్సలుగ నుండును. వీనిని ఆయావ్యాధులయందు తగువిధమున చేయింపవలయును.

## అధ్యాయసంగ్రహము.

మూ। వ్యా. తౌ పురుషౌ జ్ఞాజ్ఞౌ భిషజౌ సప్రయోజనౌ।వింశతిః కృమయస్తేషాం హేత్వాదిః సప్తకో గణః ॥ ఉక్తో వ్యాధితరూపీయే విమానే పరమర్షిణా ।శిష్యసంబోధనార్థం చ వ్యాధిప్రశమనాయ చ ॥36॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే విమానస్థానే వ్యాధితరూపీయం విమానం నామ సప్తమోఽధ్యాయః॥

అ॥ ఈవ్యాధితరూపీయాధ్యాయమునందు రెండువిధములగు వ్యాధితరూపము కల పురుషులు, తెలిసికొనినట్టియు తెలిసికొననట్టియు వైద్యులు, తెలిసికొనుటవలనను తెలిసికొనకపోవుటవలనను కలుగు ప్రయోజనములు, ఇరువదివిధములగు క్రిములు, ఆక్రిములయొక్క పుట్టుక మొదలగు ఏడువిషయములు వీనినిగురించి శిష్యులకు తెలియుటకును వ్యాధులుశమించుటకును చెప్పబడినది.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామకకృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితావ్యాఖ్యానమునందు వ్యాధితరూపీయవిమానమనెడు సప్తమాధ్యాయము సమాప్తము.

— ౦ —

# అష్టమాధ్యాయము.

మూ॥ అథాతో రోగభిషగ్జితీయం విమానం వ్యాఖ్యాస్యామః॥
అ॥ పిమ్మట రోగభిషగ్జితీయవిమానమును చెప్పబోవుచున్నాము.
మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥
అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

శాస్త్రలక్షణము

మూ॥ బుద్ధిమానాత్మనః కార్యగురులాఘవే కర్మఫలమనుబన్ధం దేశకాలౌ చ విదిత్వా యుక్తిదర్శనాద్భిషగ్బుభూషుః శాస్త్రమేవాదితః పరీక్షేత। వివిధాని హి శాస్త్రాణి భిషజాం ప్రచరన్తి లోకే;తత్రయన్మన్యేత సుమహద్యశస్విధీరపురుషాసేవితమర్థబహులమాప్తజనపూజితంత్రివిధశిష్యబుద్ధిహితమపగతపునరుక్తదోషమార్షం సుప్రణీతసూత్రభాష్యసంగ్రహక్రమం స్వాధారమనవపతితశబ్దమకష్టశబ్దం పుష్కలాభిధానం క్రమాగతార్థమర్థతత్త్వవినిశ్చయప్రధానం సంగతార్థమసంకులప్రకరణమాశుప్రబోధకం లక్షణవచ్చోదాహరణవచ్చ, తమభిప్రపద్యేత శాస్త్రమ్। శాస్త్రం హ్యేవంవిధమమల ఇవాదిత్యస్తమో విధూయ ప్రకాశయతి సర్వమ్॥3॥

అ॥ వైద్యుడుకాదలచిన బుద్ధిమంతుడగు పురుషుడు తానుచేయబోవు కార్యము యొక్క ప్రయాసాప్రయాసములను, ఫలమును, ఉత్తరకాలఫలమును, తాను నివసించుదేశమును, తనవయస్సు మున్నగుకాలమును బాగుగ తెలిసికొని సరియగు ఉపపత్తి యున్నచో మొదట శాస్త్రమునుగూర్చి తెలిసికొనవలయును. వైద్యులకు లోకమునందు అనేకశాస్త్రములు కలవు. వానిలో ఏశాస్త్రము - గొప్పదిగను, కీర్తికలదిగను, యోగ్యులగుపురుషులచే సేవింపబడినదిగను, అనేకార్థములు కలదిగను, పూజ్యులచే గౌరవింపబడినదిగను, ఉత్కృష్టమధ్యమ అల్పబుద్ధులుకల శిష్యులకు అనుకూలమైనదిగను, పునరుక్తిదోషములు లేనిదిగను, ఋషులచే చెప్పబడినదిగను, బాగుగ చెప్పబడిన సూత్రములును వివరములును సంగ్రహములును కలదిగను, ఇతరగ్రంథములయొక్క సహాయము నపేక్షింపనిదిగను, అపశబ్దములు లేనిదిగను, ఉచ్చరించుటకు కష్టములేని శబ్దములుకలదిగను, సంపూర్ణముగ వివరింపబడినదిగను, పరిపాటిగస్ఫురించు అర్థము కలదిగను, అర్థతత్త్వమును నిశ్చయించుటయే ప్రధానముకలదిగను, సరియైన అర్థము

కలదిగను, సంకరములేని ప్రకరణములు కలదిగను, వెంటనే తెలియునదిగను, మంచి లక్షణములు కలదిగను, ఉదాహరణములతో కూడినదిగను నుండునో అట్టి శాస్త్రమును గ్రహింపవలయును. నిర్మలమైన సూర్యుడు చీకటిని పోగొట్టి ప్రకాశమును కలుగ చేయునట్లు ఇట్టిశాస్త్రము సమస్తవిషయములను ప్రకాశింపచేయును.

## ఆచార్యలక్షణము.

మూ॥ తతోఽనన్తరమాచార్యం పరీక్షేత । తద్యథా—పర్యవదాతశ్రుతం పరిదృష్టకర్మాణం దక్షం దక్షిణంశుచింజితహస్తముపకరణవన్తం సర్వేన్ద్రియోపపన్నం ప్రకృతిజ్ఞం ప్రతిపత్తిజ్ఞముపస్కృతవిద్యమనహఙ్కృతమనసూయకమకోపనం క్లేశక్షమం శిష్యవత్సలమధ్యాపకం జ్ఞాపనసమర్థంచేతి; ఏవంగుణో హ్యాచార్యః సుక్షేత్రమార్తవో మేఘ ఇవ సస్యగుణైః సుశిష్యమాశు వైద్యగుణైఃసంపాదయతి ॥4॥

అ॥ పిమ్మట ఆచార్యునిగూర్చి తెలిసికొనవలయును. శాస్త్రమును పూర్తిగ అభ్యసించునట్టియు సమస్తకర్మలను చూచినట్టియు సమర్థుడైనట్టియు దయాస్వభావము కలిగినట్టియు శుచికలిగినట్టియు హస్తకౌశల్యముకలిగినట్టియు సమస్తవైద్యోపకరణములతో కూడినట్టియు ఇంద్రియము లన్నియు కలిగినట్టియు ప్రకృతిని ప్రతిపత్తిని ఎరిగినట్టియు ఇతరవిద్యలు తెలిసినట్టియు అహంకారము అసూయ కోపము ఇవిలేనట్టియు కష్టములను సహించునట్టియు శిష్యులయందు ప్రేమకలిగినట్టియు సరిగ చెప్పునట్టియు బోధకతాశక్తికలిగినట్టియు గురువు, సకాలమునందలి మేఘము. యోగ్యమైన క్షేత్రమునందలిసస్యమును ఫలవంతముగ చేయురీతిని యోగ్యుడైన శిష్యుని వైద్యగుణములతో కూడినవానినిగ చేయును.

మూ॥ తముపసృత్యారాధయిషురుపచరేదగ్నివచ్చ దేవవచ్చ రాజవచ్చ పితృవచ్చ భర్తృవచ్చాప్రమత్తః; తతస్తత్ప్రసాదాత్కృత్స్నం శాస్త్రమధిగమ్య శాస్త్రస్యదృఢతాయామభిధానస్యసౌష్ఠవేఽర్థస్యవిజ్ఞానే వచనశక్తౌచ భూయో భూయః ప్రయతేత సమ్యక్॥ తతోఽపాయా వ్యాఖ్యాస్యన్తే—అధ్యయనమధ్యాపనం తద్విద్యసంభాషా చేత్యుపాయాః ॥6॥

అ॥ అట్టిగురువునుపొంది శుశ్రూషచేయదలచి అప్రమత్తుడై ఆగురువును అగ్నినివలెను దేవునివలెను రాజునువలెను తండ్రినివలెను యజమానునివలెను సేవింపవలయును. పిమ్మట వానియొక్క అనుగ్రహమువలన శాస్త్రమునంతను అభ్యసించి అట్టి శాస్త్రమును దృఢపరచుకొనుటకును, ఇతరులకు చెప్పు సామర్థ్యముకలుగుటకును, విశేష

జ్ఞానము కలుగుటకును, విషయములను విస్తరించి చెప్పు శక్తి కలుగుటకును మిక్కిలి ప్రయత్నింపవలయును. అవికలుగుటకు అధ్యయనము అధ్యాపనము తద్విద్యసంభాష అనునివి సాధనములుగ నుండును.

## అధ్యయనవిధి.

మూ॥ తత్రేయమధ్యయనవిధిః—కల్యః కృతక్షణః ప్రాతరుత్థాయోపవ్యూషం వా కృత్వాఽఽవశ్యకముపస్పృశ్యోదకం దేవగోబ్రాహ్మణగురువృద్ధసిద్ధాచార్యేభ్యో నమస్కృత్య సమే శుచౌ దేశే సుఖోపవిష్టో మనఃపురస్సరాభిర్వాగ్భిః సూత్రమనుక్రామన్ పునఃపునరావర్తయేద్బుద్ధ్యా సమ్యగనుప్రవిశ్యార్థతత్త్వం స్వదోషపరిహారపరదోషప్రమాణార్థం; ఏవంమధ్యందినేఽపరాహ్ణే రాత్రౌ చ శశ్వదపరిహాపయన్నధ్యయనమభ్యస్యేదిత్యధ్యయనవిధిః ॥7॥

అ॥ ఆరోగ్యవంతుడుగ నుండి తదేకధ్యానముకలవాడై ప్రాతఃకాలమునగాని తెల్లవారుజామునగాని నిద్రనుండిలేచి ఆవశ్యకకృత్యముల నాచరించి స్నానముచేసి దేవతలు గోవులు బ్రాహ్మణులు గురువులు వృద్ధులు సిద్ధులు ఆచార్యులు వీరలకు నమస్కరించి సమముగను పరిశుభ్రముగను నున్న ప్రదేశమునందు సుఖముగ కూర్చుండి పరిపూర్ణమనస్సుతోకూడిన వాక్కులతో సూత్రములను ఉచ్చరించుచు బుద్ధిచే అర్థమును సరిగ అవగాహనచేసికొనుచు తన అధ్యయనమునందలి దోషములను పోగొట్టుకొనుటకును ఇతరులదోషములను తెలిసికొనుటకును తరుచు ఆవర్తనమును చేయవలయును. ఇట్లు మధ్యాహ్నమునందును అపరాహ్ణమునందును రాత్రియందును ఎల్లప్పుడు విడువకుండ అధ్యయనమును చేయవలయును.

## అధ్యాపనవిధి.

మూ॥ అథాధ్యాపనవిధిః- అధ్యాపనే కృతబుద్ధిరాచార్యః శిష్యమేవాదితః పరీక్షేత। తద్యథా-ప్రశాన్తమార్యప్రకృతిమక్షుద్రకర్మాణమృజుచక్షుర్ముఖనాసావంశం తనురక్తవిశదజిహ్వమవికృతదన్తౌష్ఠమమిన్మిణం ధృతిమన్తమనహఙ్కృతం మేధావినం వితర్కస్మృతిసంపన్నముదారసత్త్వం తద్విద్యకులజమథవాతద్విద్యవృత్తం తత్త్వాభినివేశినమవ్యఙ్గమవ్యాపన్నేన్ద్రియం నిభృతమనుద్ధతవేషమవ్యసనినమర్థతత్త్వభావకమకోపనం శీలశౌచాచారానురాగదాక్ష్యప్రాదక్షిణ్యోపపన్నమధ్యయనాభికామమర్థవిజ్ఞానే కర్మదర్శనే చానన్యకార్యమలుబ్ధమనలసం సర్వభూతహితైషిణమాచార్యసర్వానుశిష్టిప్రతిపత్తికరమనురక్తమేవంగుణసముదితమధ్యాప్యమేవాహుః ॥

అ॥ అధ్యాపనమునందు (విద్య చెప్పుటయందు) అభిప్రాయముకల గురువు తొలుత శిష్యుని పరీక్షింపవలయును. శాంతస్వభావము కలిగినట్టియు శ్రేష్ఠమైన ప్రకృతి కలిగినట్టియు నీచకృత్యముల నాచరింపనట్టియు సరిగనున్న నేత్రములును ముఖమును నాసికయు కలిగినట్టియు పలుచగను ఎర్రగను స్వచ్ఛముగను నున్న నాలుక కలిగినట్టియు వికృతినొందని దంతములును పెదవులును కలిగినట్టియు నత్తిలేకుండగ మాట్లాడునట్టియు ధారణశక్తి కలిగినట్టియు అహంకారము లేనట్టియు మేధావంతుడైనట్టియు విమర్శనజ్ఞానమును జ్ఞాపకశక్తియు కలిగినట్టియు ఉదారమైన బుద్ధికలిగినట్టియు వైద్యవిద్యకల వంశమునందు పుట్టినవాడుగ గాని వైద్యవృత్తిని చేయుచున్నవాడుగగాని యున్నట్టియు తత్త్వమును తెలిసికొనుటయందు పట్టుదల కలిగినట్టియు సత్త్వేంద్రియములతో కూడినట్టియు వికృతినొందని యింద్రియములు కలిగినట్టియు వినయముకలిగినట్టియు అనవసరమగు వేషములులేనట్టియు వ్యసనములులేనట్టియు అర్థములు తెలిసికొనుటయందు అభిప్రాయముకలిగినట్టియు కోపములేనట్టియు మంచినడవడి శుచిత్వము ఆచారము అనురాగము సామర్థ్యము దయాస్వభావము వీనితో కూడినట్టియు అధ్యయనముచేయుటయందు కోరికగలిగినట్టియు విషయములను తెలిసికొనునప్పుడును సమస్తకర్మలను చూచునప్పుడును ఇతరధ్యానములేనట్టియు లుబ్ధుడుకానట్టియు సోమరితనము లేనట్టియు సర్వభూతములయొక్క మేలుకోరునట్టియు గురువుచే చెప్పబడిన వాని నన్నిటిని ఆచరించునట్టియు గురుప్రేమ కలిగినట్టియు శిష్యుడు అధ్యాపనమునకు అర్హుడుగ నుండును.

మూ॥ ఏవంవిధమధ్యయనార్థముపస్థితమారిరాధయిషుమాచార్యశ్చానుభాషేత-అథోదగయనే శుక్లపక్షే ప్రశస్తేఽహని తిష్యహస్తశ్రవణాశ్వయుజామన్యతమేన నక్షత్రేణ యోగముపగతే భగవతిశశిని కాల్యాణే కల్యాణేచ కరణే మైత్రేముహూర్తేముణ్డఃస్నాతః కృతోపవాసః కషాయవస్త్రసంవీతః సమిధోఽగ్నిమాజ్యముపలేపనముదకుమ్భాంశ్చ గన్ధహస్తో మాల్యదామప్రదీపహిరణ్యహేమరజతమణిముక్తావిద్రుమక్షౌమపరిధికుశలాజసర్షపాక్షతాంశ్చ శుక్లాంశ్చ సుమనసో గ్రథితాగ్రథితాంశ్చ మేధ్యాంశ్చ భక్ష్యాన్ గన్ధాంశ్చ ఘృష్టానాదాయోపతిష్ఠస్వేతి; అథ సోఽపి తథా కుర్యాత్ ॥8॥

అ॥ పూర్వమునందుచెప్పబడిన గుణములతోకూడినట్టియు శుశ్రూష చేయుచు అధ్యయనముచేయునిమిత్తము వచ్చినట్టియు శిష్యునిగూర్చి గురువు ఈక్రిందివిధమున చెప్పవలయును. ఉత్తరాయణమునందు శుక్లపక్షమునందు ప్రశస్తమైన తిథియందు పుష్యమి హస్త శ్రవణము అశ్విని వీనిలో దేనితోనైనను కలిసి చంద్రుడు శుభప్రదుడుగనున్న సమయమునందు శుభకరణమునందు మిత్రదేవతాకమైనముహూర్తమునందు క్షురకర్మను చేయించుకొని స్నానమునుజేసి ఉపవాసముచేసి కాషాయవస్త్రములను

ధరించి సమిధలు అగ్నిహోత్రము ఘృతము లేపనద్రవ్యములు జలపాత్రలు సుగంధద్రవ్యములు పుష్పమాలలు హారములు దీపము బంగారము బంగారుప్రతిమ వెండి మణులు ముత్యములు పగడములు పట్టువస్త్రము దండము దర్భలు పేలాలు ఆవాలు అక్షతలు కూర్చబడినట్టిగాని కూర్చబడనట్టిగాని తెల్లనిపుష్పములు మేధ్యములగుభక్ష్యములు అరుగతీయబడిన గంధములు వీనిని తీసికొనిరమ్ము అని చెప్పవలయును. శిష్యుడు అట్లు చేయవలయును.

మూ॥ తముపస్థితమాజ్ఞాయ సమే శుచౌ దేశే ప్రాక్ప్రవణే ఉదక్ప్రవణే వా చతుష్కిష్కుమాత్రం చతురస్రం స్థణ్డిలం గోమయోదకేనోపలిప్తం కుశాస్తీర్ణం సుపరిహితం పరిధిభిశ్చతుర్దిశం యథోక్తచన్దనోదకకుమ్భక్షౌమహేమహిరణ్యరజతమణిముక్తావిద్రుమాలఙ్కృతం మేధ్యభక్ష్యగన్ధశుక్లపుష్పలాజసర్షపాక్షతోపశోభితం కృత్వా, తత్ర పాలాశీభిరైఙ్గుదీభిరౌదుమ్బరీభిర్మాధుకీభిర్వా సమిద్భిరగ్నిముపసమాధాయ ప్రాఙ్ముఖః శుచిరధ్యయనవిధిమనువిధాయ మధుసర్పిర్భ్యాం త్రిస్త్రిర్జుహుయాదగ్నిమాశీఃసంప్రయుక్తైర్మన్త్రైర్బ్రహ్మాణమగ్నిం ధన్వన్తరిం ప్రజాపతిమశ్వినావిన్ద్రమృషీంశ్చ సూత్రకారానభిమన్త్రయమాణః పూర్వం స్వాహేతి॥ శిష్యశ్చైనమన్వాలభేత, హుత్వా చ ప్రదక్షిణమగ్నిమనుపరిక్రామేత్; తతోఽనుపరిక్రమ్య బ్రాహ్మణాన్ స్వస్తి వాచయేత్, భిషజశ్చాభిపూజయేత్ ॥10॥

అ॥ అట్టిపరికరములతో శిష్యుడువచ్చినపిదప, సమానమైనట్టియు శుభ్రమైనట్టియు ప్రదేశమునందు తూర్పుభాగమునగాని ఉత్తరభాగమునగాని నాలుగుమూరలు పరిమాణముకలిగినట్టియు నాలుగుకోణములు కలిగినట్టియు వేదికను నిర్మించి దానిమీద గోమయముకలిసిననీటితో అలికి దర్భలనుపరచి పలాశాదిదండములను నాలుగువైపుల యందును ఉంచి పూర్వమునందుచెప్పబడిన మంచిగంధము జలపాత్ర పట్టువస్త్రము బంగారుప్రతిమ బంగారము వెండి మణులు ముత్యములు పగడములు మేధ్యములగు భక్ష్యములు సుగంధద్రవ్యములు తెల్లనిపుష్పములు పేలాలు ఆవాలు అక్షతలు వీనితో అలంకరించి మోదుగ గార మేడి ఇప్ప వీనిలో దేనియొక్క సమిధలచేనైనను అగ్నిని ప్రతిష్ఠించి శుచియై తూర్పుముఖముగనుండి గురువు అధ్యయనవిధిననుసరించి, ఆశీర్వాదయుక్తములగు మంత్రములతో బ్రహ్మను అగ్నిని ధన్వంతరిని దక్షప్రజాపతిని అశ్వినీదేవతలను దేవేంద్రుని సూత్రకారులగుఋషులను "స్వాహా" అని ఆహ్వానించుచు తేనె నెయ్యి వీనితో మూడేసిసారులు అగ్నియందు హోమమును చేయవలయును. గురువుననుసరించి శిష్యుడుకూడ హోమమును చేయవలయును. హోమముచేసినపిదప అగ్నికి ప్రద

క్షిణమును చేయవలయును. పిదప బ్రాహ్మణులచే ఆశీర్వాదములనొంది వైద్యులను పూజింపవలయును.

మూ॥ అథైనమగ్నిసకాశే బ్రాహ్మణసకాశే భిషక్సకాశే చానుశిష్యాత్ - బ్రహ్మచారిణాశ్మశ్రుధారిణాఽ సత్యవాదినాఽ మాంసాదేన మేధ్యసేవినా నిర్మత్సరేణాశస్త్రధారిణా చ భవితవ్యం, న చ తే మద్వచనాత్కించిదకార్యం స్యాదన్యత్ర రాజద్విష్టాత్ప్రాణహరాద్విపులాదధర్మ్యాదనర్థసంప్రయుక్తాద్వాఽప్యర్థాత్, మదర్పణేన మత్ప్రధానేన మదధీనేన మత్ప్రియహితానువర్తినా చ శశ్వద్భవితవ్యం పుత్రవద్దాసవదర్థివచ్చోపచరతాఽనువస్తవ్యోఽహమనుత్సుకేనావహితేనానన్యమనసా వినీతేనావేక్ష్యకారిణాఽనసూయకేన చానభ్యనుజ్ఞాతేన ప్రవిచరితవ్యం, అనుజ్ఞాతేన ప్రవిచరితా పూర్వం గుర్వర్థోపాభ్యాహరణే యథాశక్తి ప్రయతితవ్యం, కర్మసిద్ధిమర్థసిద్ధిం యశోలాభం ప్రేత్య చ స్వర్గమిచ్ఛతా త్వయా గోబ్రాహ్మణమాదౌ కృత్వా సర్వప్రాణభృతాం శర్మాశాసితవ్యమహరహరుత్తిష్ఠతా చోపవిశతా చ, సర్వాత్మనా చాతురాణామారోగ్యే ప్రయతితవ్యం, జీవితహేతోరపి చాతురేభ్యో నాభిద్రోగ్ధవ్యం, మనసాఽపిచ పరస్త్రియో నాభిగమనీయాస్తథా సర్వమేవ పరస్వం, నిభృతవేషపరిచ్ఛదేన భవితవ్యమశౌణ్డేనాపాపేనాపాపసహాయేన చ శ్లక్ష్ణశుక్లధర్మ్యధన్యసత్యశర్మ్యహితమితవచసా దేశకాలవిచారిణా స్మృతిమతా జ్ఞానోత్థానోపకరణసంపత్సు నిత్యం యత్నవతా, నచ కదాచిద్రాజద్విష్టానాం రాజద్వేషిణాం వా మహాజనద్విష్టానాం మహాజనద్వేషిణాం వాఽప్యౌషధమనువిధాతవ్యం తథా సర్వేషామత్యర్థవికృతదుష్టదుఃఖశీలాచారోపచారాణామనపవాదప్రతీకారాణాం ముమూర్షూణాం చ తథైవాసంనిహితేశ్వరాణాం స్త్రీణామనధ్యక్షాణాం వా, నచకదాచిత్ స్త్రీదత్తమామిషమాదాతవ్యమననుజ్ఞాతం భర్త్రాఽథవాఽధ్యక్షేణ. ఆతురకులం చానుప్రవిశతా త్వయా విదితేనానుమతప్రవేశినా సార్ధం పురుషేణ సుసంవీతేనావాక్శిరసా స్మృతిమతా స్తిమితేనావేక్ష్యావేక్ష్యమనసా సర్వమాచరతా బుద్ధ్యా సమ్యగనుప్రవేష్టవ్యం, అనుప్రవిశ్య చ

వాఙ్మనోబుద్ధీన్ద్రియాణి న క్వచిత్ప్రణిధాతవ్యాన్యన్యత్రాతురాదాతురోపకారార్థాద్వాఽఽతురగతేష్వన్యేషు వాభావేషు, నచాతురకు ప్రవృత్తయో బహిర్నిశ్చారయితవ్యాః, హ్రసితం చాయుషః ప్రమాణమాతురస్య నవర్ణయితవ్యంజానతాఽపి తత్రయత్రోచ్యమానమాతురస్యాన్యస్య వాఽప్యుపఘాతాయ సంపద్యతే, జ్ఞానవతాఽపిచ నాత్యర్థమాత్మనో జ్ఞానే వికత్థితవ్యం, ఆప్తాదపిహివికత్థమానాదత్యర్థముద్విజన్త్యనేకే॥ 1॥

అ॥ పిమ్మట అగ్ని బ్రాహ్మణులు వైద్యులు వీరిసమక్షమున గురువు శిష్యుని ఈక్రిందివిధమున అనుశాసింపవలయును. బ్రహ్మచారివిగను మీసములు మొదలగువానిని ధరింపనివాడవుగను నిజమును పలుకువాడవుగను మాంసమును తిననివాడవుగను శుభ్రమైన పదార్థములను భుజించువాడవుగను మాత్సర్యము లేనివాడవుగను శస్త్రములను ధరింపనివాడవుగను నుండవలయును. రాజద్వేషమును ప్రాణహానియు అధర్మమును అనర్థకమును కలుగు సమయములయందుగాక ఇతరసమయములయందు కృత్యముల నన్నిటిని నాఆజ్ఞననుసరించి ఆచరింపవలయును. నాకు నమ్రుడవుగను నేనే ప్రధానముగ కలవాడవుగను నాకు అధీనుడవుగను నాకు ప్రియములును హితములును నగు వానిని ఆచరించువాడవుగను నుండవలయును. పుత్రుడువలెను దాసుడువలెను యాచకుడువలెను నన్ను సేవించుచుండవలయును. ఉద్రేకములేనివాడవుగను అప్రమత్తుడవుగను తదేకధ్యానము కలవాడవుగను నమ్రుడవుగను ఆలోచించి చేయువాడవుగను అసూయలేనివాడవుగను నుండవలయును. నాఆజ్ఞలేనిదే (చికిత్సయందు) ప్రవర్తింపకూడదు. నాయొక్క ఆజ్ఞను అనుసరించి ప్రవర్తించునపుడు ముందుగ గురుదక్షిణను సంపాదించుటకు శక్త్యనుసారముగ ప్రయత్నింపవలయును. కర్మలయొక్క సిద్ధిని ధనమును కీర్తిని ఇహసౌఖ్యమును స్వర్గసౌఖ్యమును పొందదలచిన నీవు గోవులను బ్రాహ్మణులను ప్రధానముగ నెంచి సమస్తప్రాణులయొక్కయు సుఖమును, కూర్చొనియున్నపుడును నిలబడియున్నపుడును ఎల్లపుడును కోరవలయును. రోగులయొక్క ఆరోగ్యముకొరకు సర్వవిధముల ప్రయత్నింపవలయును. తన జీవనము నిమిత్తముకూడ రోగులకు ద్రోహమును చేయకూడదు. పరస్త్రీలను పరధనమును మనస్సునందుగూడ ఆపేక్షింపగూడదు. ఆడంబరములేని వేషమును కలిగియుండవలయును. మద్యమును ప్రచారము చేయనివాడువుగను పాపరహితుడవుగను పాపాత్ములతో సహవాసము చేయనివాడవుగను మృదువులును స్వచ్ఛములును ధర్మయుక్తములును శ్రేష్ఠములును సత్యములును సుఖకరములును హితములును మితములును నగు వాక్యములను పలుకువాడవుగను దేశకాలములను ఆలోచించువాడవుగను జ్ఞాపకముంచుకొనువాడవుగను జ్ఞానమును కలుగజేయు విషయములకొరకు ప్రయత్నించువాడవుగను నుండవలయును. రాజుచే ద్వేషింపబడినవారలకును రాజును ద్వేషించు వారలకును గొప్పవారిచే ద్వేషింపబడినవారలకును గొప్పవారిని ద్వేషించువారలకును చెడునడవడియు

దుష్టాచారములును దుఃఖకరకృత్యములును కలవారలకును అపవాదములను మరలించు కొనినవారలకును చచ్చుటకు సిద్ధముగనున్నవారలకును భర్తగాని యజమానిగాని సమీపమున లేని స్త్రీలకును ఔషధమును ఇయ్యకూడదు. భర్తయొక్కగాని యజమానునియొక్కగాని ఆజ్ఞ లేనిదే స్త్రీ చేనియ్యబడిన మాంసమును పుచ్చుకొనకూడదు. నీవు రోగియొక్క గృహములోనికి మంచివస్త్రములను ధరించి నమ్రుడవై జ్ఞాపకముకల వాడవై సావధానముగనుండి మనస్సుతోడను బుద్ధితోడను సమస్తమును ఆలోచించుచు, తెలిసినట్టియు అంగీకరికపబడిన ప్రవేశము కలిగినట్టియు పురుషునితోగూడ ప్రవేశింపవలయును. ప్రవేశించినపిదప రోగియందును రోగికిచేయు ఉపకారమునందును గాక రోగిసంబంధమగు ఇతరవిషయములయందుగాని మరియొక విషయములయందు గాని నీయొక్క వాక్కు మనస్సు బుద్ధి ఇంద్రియములు వీనిని పోనియ్యకూడదు. రోగి యొక్క గృహసంబంధమగు విషయములను ఇతరులకు వెల్లడిచేయకూడదు. రోగి యొక్క ఆయుఃప్రమాణము తక్కువగ నున్నదని తెలిసినను చెప్పకూడదు. చెప్పినచో రోగికిగాని ఇతరులకుగాని హాని కలుగవచ్చును. గర్వముకలవానిని ఆప్తులుకూడ నిందించెదరు గావున జ్ఞానవంతుడవైనను నీజ్ఞానమువిషయమై గర్వింపగూడదు.

మూ॥ న చైవ హ్యాసినుతరామాయుర్వేదస్య పారం, తస్మాదప్రమత్తః శశ్వదభియోగమస్మిన్ గచ్ఛేత్ ఏతచ్చ కార్యం, ఏవం భూయశ్చ వృత్తసౌష్ఠవమనుసూయతా పరేభ్యోఽప్యాగమయితవ్యం, కృత్స్నో హి లోకో బుద్ధిమతామాచార్యః శత్రుశ్చాబుద్ధిమతాం అతశ్చాభిసమీక్ష్య బుద్ధిమతాఽమిత్రస్యాపి ధన్యం యశస్యమాయుష్యం పౌష్టికం లౌక్యమభ్యుపదిశతో వచః శ్రోతవ్యమనువిధాతవ్యం చేతి॥ అతః పరమిదం బ్రూయాత్ - దేవతాగ్నిద్విజాతిగురువృద్ధసిద్ధాచార్యేషు తే నిత్యం సమ్యగ్వర్తితవ్యం. తేషు తే సమ్యగ్వర్తమానస్యాయమగ్నిః సర్వగన్ధరసరత్నబీజాని యథేరితాశ్చ దేవతాః శివాయ స్యుః, అతోఽన్యథావర్తమానస్యాశివాయేతి. ఏవం బ్రువతి చాచార్యే శిష్యస్తథేతి బ్రూయాత్; యథోపదేశం చ కుర్వన్నధ్యాప్యోజ్ఞేయః, అతోఽన్యథా త్వనధ్యాప్యః; అధ్యాప్యమధ్యాపయన్ హ్యాచార్యో యథోక్తైశ్చాధ్యాపనఫలైర్యోగమాప్నోత్యన్యైశ్చానుక్తైః శ్రేయస్కరైర్గుణైః శిష్యమాత్మానం చ యునక్తి; ఇత్యుక్తావధ్యయనాధ్యాపనవిధీ యథావత్ ॥13॥

అ॥ ఆయుర్వేదశాస్త్రమునకు అంతము లేదు. కావున అప్రమత్తుడవై దీనివిషయమై యెల్లపుడును ప్రయత్నము చేయవలయును. పూర్వమునందు చెప్పబడిన ప్రకారముగ ఆచరించుచు అసూయ లేనివాడవై ఇతరులనుండికూడ శాస్త్రవిషయములను తెలిసికొనవలయును. సమస్తమైనలోకమును బుద్ధిమంతులకు గురువుగ (ఉపదేశించునది

దిగ) నుండును. బుద్ధిహీనులకు శత్రువుగ నుండును. బుద్ధిమంతుడగు మనుజుడు శ్రేయస్కరమైనట్టియు యశస్కరమైనట్టియు ఆయుర్వర్ధకమైనట్టియు హితకరమైనట్టియు లోకసంమతమైనట్టియు వాక్యములను శత్రువునుండికూడ విని ఆలోచించి ఆచరింపవలయును. దేవతలు అగ్ని బ్రాహ్మణులు గురువులు వృద్ధులు సిద్ధులు ఆచార్యులు వీరలకు అనుకూలముగ ప్రవర్తింపవలయును. అట్లు ప్రవర్తించినచో అగ్నియు సమస్తగంధములును రసములును రత్నములును బీజములును పైనచెప్పబడినదేవతలు మొదలగువారును నీకు శుభమును కలిగించెదరు. సరిగ ప్రవర్తింపకున్నచో చెడుగును కలిగించెదరు. గురువు ఇట్లు చెప్పగనే శిష్యుడు అట్లేయని అంగీకరింపవలయును. గురువు చెప్పినప్రకారముగ నాచరించు శిష్యునికే విద్యను చెప్పవలయును. అట్లు ఆచరింపని శిష్యునకు చెప్పకూడదు. అధ్యాపనార్హుడైన శిష్యునికి విద్యను చెప్పినగురువు, అధ్యాపనమువలనకలుగు ఫలితములను పొందును. మరియు శిష్యుడును తానును ఇతర విధములైనట్టియు శ్రేయస్కరములైనట్టియు గుణములను పొందుదురు. ఇట్లు అధ్యయనాధ్యాపన విధులు చెప్పబడినవి.

## తద్విద్యసంభాషావిధి.

మూ॥ అధ్యయనాధ్యాపనవిధివత్సంభాషావిధిమత ఊర్ధ్వం వ్యాఖ్యాస్యామః—భిషక్ భిషజాసహసంభాషేత, తద్విద్యసంభాషా హి జ్ఞానాభియోగసంహర్షకరీ భవతి, వైశారద్యమపి చాభినిర్వర్తయతి, వచనశక్తిమపి చాధత్తే, యశశ్చాభిదీపయతి, పూర్వశ్రుతే చ సందేహవతః పునః శ్రవణాత్ సందేహమపకర్షయతి, శ్రుతే చాసందేహవతో భూయోఽధ్యవసాయమభినిర్వర్తయతి, అశ్రుతమపి చ కంచిదర్థం శ్రోత్రవిషయమాపాదయతి, యచ్చాచార్యః శిష్యాయ శుశ్రూషవే ప్రసన్నః క్రమేణోపదిశతి గుహ్యాభిమతమర్థజాతం తత్పరస్పరేణ సహజల్పన్ పిండేన విజిగీషురాహ సంహర్షాత్, తస్మాత్తద్విద్యసంభాషామభిప్రశంసన్తి కుశలాః॥ ద్వివిధా తుఖలు తద్విద్యసంభాషా భవతి—సంధాయసంభాషా, విగృహ్యసంభాషా చేతి ॥15॥

అ॥ అధ్యయనాధ్యాపన విధులనువలె తద్విద్యసంభాషావిధిని చెప్పబోవుచున్నాము. వైద్యుడు వైద్యునితో సంభాషణమును చేయవలయును. అట్లు సంభాషించుటవలన జ్ఞానమువిషయమై పట్టుదలయు స్పర్ధము కలుగును. పాండిత్యము వృద్ధినొందును. వాక్పటుత్వము కలుగును. యశస్సు ప్రకాశించును. పూర్వమునందు చదివిన విద్యలోని సందేహములు పోవును. సందేహములు లేనిచో నిశ్చయజ్ఞానము అభివృద్ధినొందును. వినని విషయములనుగూడ కొన్నింటిని తెలిసికొనవచ్చును. శిష్యునియొక్క శుశ్రూషచే ప్రసన్నుడైన గురువు క్రమముగ ఉపదేశించిన రహస్యములగు విషయములను, పరస్పరము వాదించునపుడు పాండిత్యముచే జయింపదలచినవాడు స్పర్ధవలన

బయలుపరచును. అందువలన పండితులు తద్విద్యసంభాషను ప్రశస్తమైనదానినిగ తలంచుచున్నారు. ఆ తద్విద్యసంభాషసంధాయ సంభాష యనియు విగృహ్య సంభాష యనియు రెండువిధములుగ నుండును.

సంధాయసంభాష.

మూ॥ తత్ర జ్ఞానవిజ్ఞానవచనప్రతివచనశక్తిసంపన్నేనాకోపనేనానుపస్కృతవిద్యేనానసూయకేనానునయకోవిదే క్లేశక్షమేణ ప్రియసంభాషణేన చ సహ సంధాయ సంభాషా విధీయతే । తథావిధేన సహ కథయన్విశ్రబ్ధః కథయేత్. పృచ్ఛేదపిచవిశ్రబ్ధః, పృచ్ఛతే చాస్మై విశ్రబ్ధాయ విశదమర్థం బ్రూయాత్, నచ నిగ్రహభయాదుద్విజేత, నిగృహ్య చైనం న హృష్యేన్నచ పరేషు వికత్థేత, నచ మోహాదేకాన్తగ్రాహీ స్యాత్, న చావిదితమర్థమనువర్ణయేత్; సమ్యక్చానునయేనానునయేచ్చ. అనునయే తత్ర చావహితః స్యాదిత్యనులోమసంభాషావిధిః ॥16॥

అ॥ జ్ఞానము విజ్ఞానము వాక్పటుత్వము సమాధానశక్తి ఇవికలిగినట్టియు కోపము లేనట్టియు విద్యలనుమరచిపోనట్టియు అసూయలేనట్టియు నమ్రతకలిగినట్టియు కష్టములను సహించునట్టియు ప్రియముగ మాట్లాడునట్టియు పురుషునితో కలిసి సంభాషణ చేయవలయును. అట్టివానితో విశ్వాసముగ సంభాషణ చేయవలయును. మరియు విశ్వాసముతో నడుగవలయును. విశ్వాసముతో నడిగినప్పుడు విషయమును విశదముగ జెప్పవలయును. జయించునని భయపడవలదు, జయించితినని సంతోషింపవలదు. ఇతరులయొద్ద చెప్పకూడదు. వాదించుసమయమున మోహమునుపొంది స్వల్పవిషయమును మాత్రమే గ్రహింపకూడదు. ప్రతివాదికి తెలియని విషయమును వాదింపకూడదు. నమ్రతగను సావధానముగను సంభాషణ చేయవలయును. ఇట్లు అనులోమసంభాషా (సంధాయసంభాషా) విధి చెప్పబడినది.

విగృహ్యసంభాష.

మూ॥ అత ఊర్ధ్వమితరేణ సహ విగృహ్య సంభాషాయాం జల్పేత్ శ్రేయసా యోగమాత్మనః పశ్యన్; ప్రాగేవ చ జల్పాజ్జల్పాన్తరం పరావరాన్తరం పరిషద్విశేషాంశ్చ సమ్యక్పరీక్షేత, సమ్యక్పరీక్షా హి బుద్ధిమతాం కార్యప్రవృత్తినివృత్తికాలౌ శంసతి, తస్మాత్పరీక్షామభి ప్రశంసన్తి కుశలాః; పరీక్షమాణస్తు ఖలు పరావరాన్తరమిమాన్ జల్పకగుణాన్ శ్రేయస్కరాన్ దోషవతశ్చ పరీక్షేతసమ్యక్ తద్యథా-శ్రుతం విజ్ఞానం ధారణం ప్రతిభానం వచనశక్తిరిత్యేన్। తా

గుణాన్ శ్రేయస్కరానాహుః; ఇతరాంస్తు పునర్దోషవతః. తద్యథా— కోపనత్వమవైశారద్యం భీరుత్వమధారణత్వమనవహితత్వమితి। ఏతాన్ ద్వయానపి గుణాన్ గురులాఘవతః పరస్య చైవాత్మనశ్చ తోలయేత్ ॥17॥

అ॥ ఇతరునితోఁగూడ విగృహ్యసంభాషణమును చేయదలచినపుడు తనయొక్క శ్రేయస్సును కోరినవాఁడై వాదించుటకుముందుగ వాదవిశేషములను, తనయొక్కయు ఇతరునియొక్కయు సామర్థ్యమును, పరిషద్విశేషములను బాగుగ తెలిసికొనవలయును. అట్లు తెలిసికొనినచో వాదనయందు ప్రవర్తించుటకుగాని ప్రవర్తింపకుండుటకుగాని సమయమును తెలిసికొనవచ్చును. కావున ముందుగ తెలిసికొనుట మంచిదని పండితులు చెప్పెదరు. తనయొక్కయు ఇతరునియొక్కయు సామర్థ్యమును తెలిసికొనునపుడు ఇతరునియొక్క శ్రేష్ఠగుణములను దుష్టగుణములను బాగుగ పరీక్షించి తెలిసికొనవలయును. శాస్త్రజ్ఞానము విశేషజ్ఞానము ధారణాశక్తి ప్రతిభ వాక్పటుత్వము ఇవి శ్రేష్ఠగుణము లనబడును. కోపస్వభావము పాండిత్యము లేకపోవుట భయస్వభావము ధారణాశక్తి లేకపోవుట సావధానచిత్తము లేకుండుట ఇవి దుష్టలక్షణము లనబడును. తనయందలియు ఇతరునియందలియు ఈ రెండువిధములైన గుణములయొక్క హెచ్చుతగ్గులను సరిచూచుకొనవలయును.

మూ॥ తత్ర త్రివిధః పరః సంపద్యతే — ప్రవరః ప్రత్యవరః సమో వా గుణవినిక్షేపతః, నత్వేవ కార్త్స్న్యేన ॥ పరిషత్తు ఖలు ద్వివిధా — జ్ఞానవతీ, మూఢపరిషచ్చ; సైవ ద్వివిధా సతీ త్రివిధా పునరనేన కారణవిభాగేన — సుహృత్పరిషత్, ఉదాసీనపరిషత్, ప్రతినివిష్టపరిషచ్చేతి ॥ తత్ర ప్రతినివిష్టాయాం పరిషది జ్ఞానవిజ్ఞానవచనశక్తిసంపన్నాయామపి మూఢాయాం తు న కథంచిత్కేనచిత్సహ జల్పో విధీయతే, మూఢాయాం తు సుహృత్పరిషది ఉదాసీనాయాం వా జ్ఞానవిజ్ఞానవచనశక్తిమన్తరేణాప్యదీప్తయశసా మహాజనద్విష్టేన సహ జల్పో విధీయతే, తద్విధేన చ సహ కథయతా ఆవిద్ధదీర్ఘసూత్రసంకులైర్వాక్యదణ్డకైః కథయితవ్యం, అతిహృష్టం ముహుర్ముహురుపహసతా పరం రూపయతా చ పరిషదమాకారైర్బ్రువతా చాస్య వాక్యావకాశో న దేయః, కష్టశబ్దం బ్రువతా వక్తవ్యో 'నోచ్యతే' ఇతి, అథవా పునః 'హీనా తే ప్రతిజ్ఞా' ఇతి, పునశ్చాహ్వయమానః ప్రతివక్తవ్యః— పరిసంవత్సరో భవానపి శిక్షస్వ తావత్ పర్యాప్తమేతావత్తే, సకృదపి హి పరిక్షేపికం నిహతం నిహ

తమాహురితి నాస్య యోగః కర్తవ్యః, కథంచిదప్యేవం శ్రేయసా సహ విగృహ్య వక్తవ్యమిత్యాహురేకే; న త్వేవం జ్యాయసా సహ విగ్రహం ప్రశంసన్తి కుశలాః॥20॥

అ॥ గుణములనుబట్టి ప్రవరుడు (అధికుడు) అనియు ప్రత్యవరుడు (తక్కువవాడు) అనియు సమానమైనవాడు అనియు ప్రతివాది మూడువిధములుగ నుండును. జ్ఞానపరిషత్తు అనియు మూఢపరిషత్తు అనియు పరిషత్తు రెండువిధములుగ నుండును. మరియు కారణభేదము ననుసరించి సుహృత్పరిషత్తు అనియు ఉదాసీనపరిషత్తు అనియు ప్రతినివిష్ట (శత్రు) పరిషత్తు అనియు మూడువిధములుగ నుండును. జ్ఞానము విజ్ఞానము వాక్పటుత్వము సమాధానశక్తి వీనితో కూడికొనియున్నదైనను ప్రతినివిష్టపరిషత్తునందు మూఢపరీక్షకవర్గమున్నపుడు ఎవ్వరితోడను ఏవిధముగను సంభాషణమును చేయగూడదు. మూఢపరీక్షకవర్గముతో కూడియున్నదైనను సుహృత్పరిషత్తునందుగాని ఉదాసీనపరిషత్తునందుగాని జ్ఞానము విజ్ఞానము వాక్పటుత్వము ఇవి లేకపోయినను కీర్తిలేనివాడును గొప్పవారిచే ద్వేషింపబడినవాడును నగు వానితోకూడ వాదింపవచ్చును. అట్టివానితో వాదించునపుడు అపులేనట్టియు దీర్ఘములైనట్టియు సూత్రములచే వ్యాకులములైనట్టియు దండకరూపములైయున్న వాక్యములను ప్రయోగించవలయును. ప్రతివాదిని పరిషత్తును ఆకారములవలన తెలిసికొనుచు తరుచు నవ్వుచు అధికమగు సంతోషముతోకూడి మాట్లాడుచు ప్రతివాదికి మాట్లాడ నవకాశ మీయకూడదు. ప్రసిద్ధములుగాని వాక్యములను ప్రయోగించుచు "ఇక మాట్లాడ నవసరములేదు" అని గాని "నీయొక్క ప్రతిజ్ఞ తగ్గినది" అనిగాని అనవలయును. మరల పిలిచి "ఇంకొక సంవత్సరము శిక్షణము నొందుము. ఇంతటితో చాలును." అని చెప్పవలయును. జయించబడితివని ఆక్షేపకవాక్యములను ఎప్పుడును పలుకకూడదు. గొప్పవానితో గూడ విరోధించి వాదమును చేయవచ్చునని కొందరు అనిరి. గొప్పవానితో విరోధించుట మంచిదికాదని పండితులు చెప్పెదరు.

మూ॥ ప్రత్యవరేణ తు సహ సమానాభిమతేన వా విగృహ్య జల్పతా సుహృత్పరిషది కథయితవ్యం, అథవాఽప్యుదాసీనపర్షది అవధానశ్రవణజ్ఞానవిజ్ఞానోపధారణవచనశక్తిసంపన్నాయాం కథయతా చావహితేన పరస్య సాద్గుణ్యదోషబలమవేక్షితవ్యం; సమవేక్ష్య చ యత్రైనం శ్రేష్ఠం మన్యేత, నాస్య తత్ర జల్పం యోజయేదనావిష్కృతమయోగం కుర్వన్; యత్ర త్వేనమవరం మన్యేత, తత్రైవైనమాశు నిగృహ్ణీయాత్। తత్ర ఖల్విమే ప్రత్యవరాణామాశు నిగ్రహే భవన్త్యుపాయాః; తద్యథా-శ్రుతహీనం మహతా సూత్రపాఠేనాభిభవేత్, విజ్ఞానహీనం పునః కష్టశబ్దేన వాక్యేన, వాక్యధారణాహీనమావిద్ధదీర్ఘసూత్రసంకులైర్వాక్యదణ్డకైః, ప్రతిభాహీనం పునర్వచనేనైకవిధేనానేకార్థవాచ

నా, వచనశక్తిహీనమర్థోక్తస్యవాక్యస్యాక్షేపేణ,అవిశారదమపత్రాపణేన, కోపనమాయాసనేన, భీరుం విత్రాసనేన, అనవహితం నియమనేన. ఇత్యేవమేతైరుపాయైః పరమవరమభిభవేత్ ॥21॥

అ॥ తక్కువవానితోగాని సమానునితోగాని సుహృత్పరిషత్తునందు విగృహ్యాసంభాషణమును చేయవలయును. సావధానము గ్రహణశక్తి విశేషజ్ఞానము ధారణశక్తి వాక్పటుత్వము ఇవిగల ఉదాసీనపరిషత్తునందు సంభాషణమును చేయునపుడు సావధానముగలవాడై ఇతరునియందలి శ్రేష్ఠగుణములయొక్కయు దుష్టగుణములయొక్కయు బలమును తెలిసికొనవలయును. శ్రేష్ఠగుణములు బలముగనున్నచో తనయొక్క హీనబలము తెలియకుండ సంభాషణచేయుటను మానవలయును. తనకంటె తక్కువవానినిగ తలచినచో ఈక్రింది ఉపాయములచే ఓడింపవలయును. శాస్త్రహీనుని గొప్పసూత్రములయొక్క ప్రయోగముచేతను, విశేషజ్ఞానములేనివానిని కష్టశబ్దములుగలవాక్యములచేతను, ధారణాశక్తిలేనివానిని అపులేనట్టియు దీర్ఘములైనట్టియు సూత్రములచే వ్యాకులములైనట్టియు దండకరూపములైన వాక్యములచేతను, ప్రతిభలేనివానిని ఒకేవిధమైనట్టియు అనేకార్థములు కలిగినట్టియు వాక్యములచేతను, వాక్పటుత్వములేని వానిని సగముచెప్పుచుండగనే ఆక్షేపించుటచేతను, పాండిత్యములేనివానిని సిగ్గునుగలిగించుటచేతను, కోపముగలవానిని శ్రమనుకలిగించుటచేతను, భయస్వభావముగలవానిని భయపెట్టుటచేతను, సావధానములేనివానిని నియమములచేతను ఓడింపవలెను.

మూ॥ విగృహ్య కథయేద్యుక్త్యా యుక్తం చ ననివారయేత్। విగృహ్యభాషా తీవ్రం హి కేషాంచిద్రోపమావహేత్॥ నాకార్యమస్తి క్రుద్ధస్య నావాచ్యమపి విద్యతే। కుశలా నాభినన్దన్తి కలహం సమితౌ సతామ్॥23॥ ఏవం ప్రవృత్తే వాదే కుర్యాత్ ॥24॥

అ॥ విగృహ్యసంభాషణమును యుక్తిచే చేయవలయును. యుక్తముగనున్న విషయమును అడ్డగింపకూడదు. విగృహ్యసంభాషణము కొందరికి తీవ్రమగుకోపమును కలిగించును. కోపముగలవానికి చేయతగనికార్యములుగాని ఉచ్చరింపగూడనిమాటలుగాని ఉండవు. పండితులు పెద్దలయొక్క సభయందు కలహమును అంగీకరింపరు. వాదము ప్రవర్తించినచో పూర్వమునందు చెప్పబడినవిధమున చేయవలయును.

మూ॥ ప్రాగేవ తావదిదం కర్తుం యతేత—సంధాయ పరిషదాఽయనభూతమాత్మనః ప్రకరణమాదేశయితవ్యం యద్వా పరస్య భృశదుర్గం స్యాత్, పక్షమథ వాపరస్య భృశంవిముఖమానయేత్, పరిషది చోపసంహితాయామశక్యమస్మాభిర్వక్తుమేషైవ తే పరిషద్యథేష్టం యథాయోగ్యం యథాభిప్రాయం వాదం వాదమర్యాదాం చ స్థాపయిష్యతీత్యుక్త్వాతూష్ణీమాసీత ॥25॥

అ॥ వాదముకలుగుటకుముందుగ ఈక్రిందివిధమున చేయవలయును. తనకు బాగుగ తెలిసిన విషయమునుగాని ప్రతివాదికి దుర్గ్రాహ్యమగు విషయమునుగాని పరిషత్తుయొక్క అనుమతితో ప్రారంభింపవలయును. లేక పరునకు విముఖత్వమును కలిగించు వాదమును ప్రారంభింపవలయును. పరిషత్తు తనకు అనుకూలముగనున్నచో విషయమును నిర్ణయించుటయందు మనము అశక్తులమని చెప్పాచు ఈపరిషత్తే నీకు అనుకూలముగను యోగ్యముగను ఇష్టానుసారముగను వాదమును వాదమర్యాదను నిర్ణయింపగలదని చెప్పి ఊరకొనవలయును.

మూ॥ తత్రేదం వాదమర్యాదాలక్షణం భవతి—ఇదం భవతి వాచ్యమిదమవాచ్యమేవం సతి పరాజితో భవతీతి॥ 26॥

అ॥ ఇది వాదింపతగినదనియు ఇది వాదింపతగనిదనియు ఇట్లయినచో పరాజితుడనియు నిర్ణయించుట వాదమర్యాద యనబడును.

వాదమునిమిత్తము తెలియదగినవిషయములు.

మూ॥ ఇమాని ఖలు పదాని వాదమార్గజ్ఞానార్థమధిగమ్యాని భవన్తి; తద్యథా—వాదో,ద్రవ్యం, గుణాః, కర్మ,సామాన్యం, విశేషః, సమవాయః, ప్రతిజ్ఞా, స్థాపనా, ప్రతిష్ఠాపనా, హేతుః,ఉపనయః,నిగమనం,ఉత్తరం,దృష్టాన్తః,సిద్ధాన్తః,శబ్దః,ప్రత్యక్షం, అనుమానం,ఐతిహ్యం, ఔపమ్యం, సంశయః, ప్రయోజనం, సవ్యభిచారః, జిజ్ఞాసా, వ్యవసాయః, అర్థప్రాప్తిః, సంభవః, అనుయోజ్యం,అననుయోజ్యం,అనుయోగః, ప్రత్యనుయోగః, వాక్యదోషః, వాక్యప్రశంసా,ఛలం, అహేతుః,అతీతకాలం,ఉపాలమ్భః,ః, పరిహారః,ప్రతిజ్ఞాహానిః, అభ్యనుజ్ఞా, హేత్వన్తరం, అర్థాన్తరం, నిగ్రహస్థానమితి ॥27॥

అ॥ వాదము, ద్రవ్యము, గుణములు, కర్మ, సామాన్యము, విశేషము, సమవాయము, ప్రతిజ్ఞ, స్థాపన, ప్రతిష్ఠాపన, హేతువు, ఉపనయము, నిగమనము, ఉత్తరము, దృష్టాంతము, సిద్ధాంతము, శబ్దము, ప్రత్యక్షము, అనుమానము, ఐతిహ్యము, ఔపమ్యము, సంశయము, ప్రయోజనము, సవ్యభిచారము, జిజ్ఞాస, వ్యవసాయము, అర్థప్రాప్తి, సంభవము, అనుయోజ్యము, అననుయోజ్యము, అనుయోగము, ప్రత్యనుయోగము, వాక్యదోషము, వాక్యప్రశంస, ఛలము, అహేతువు, అతీతకాలము, ఉపాలంభము, పరిహారము, ప్రతిజ్ఞాహాని, అభ్యనుజ్ఞ, హేత్వంతరము, అర్థాంతరము, నిగ్రహస్థానము ఇవి వాదమునిమిత్తము తెలియతగిన విషయములుగ నుండును.

వాదవివరణము.

మూ॥తత్ర వాదో నామ—యత్ పరః పరేణ సహ శాస్త్రపూర్వకం విగృహ్య కథయతి।స వాదో ద్వివిధః సంగ్రహేణ—

జల్పో వితణ్డా । తత్ర పక్షాశ్రితయోర్వచనం, జల్పః, జల్పవిపర్యయో వితణ్డా। యథా —ఏకస్య పక్షః—పునర్భవోఽస్తీతి, నాస్తీత్యపరస్య; తౌ చ హేతుభిః స్వస్వపక్షం స్థాపయతః పరపక్షముద్భావయతః, ఏష జల్పః; జల్పవిపర్యయో వితణ్డా, వితణ్డా నామ—పరపక్షే దోషవచనమాత్రమేవ ॥28॥

అ॥ శాస్త్రమునను సరించి అన్యోన్యము విరోధించి సంభాషించుట వాద మన బడును. అది సామాన్యముగ జల్పమనియు వితండమనియు రెండువిధములుగ నుండును. అందు స్వపక్షము ననుసరించి వాదించుట జల్పవాద మనియు దానికి వ్యతిరేకమైనది వితండవాద మనియు చెప్పబడును. ఎట్లనగా పునర్జన్మ యున్నదని యొకరును లేదని మరియొకరును వాదించునపుడు కారణములచే తమతమ పక్షమును నిరూపించుకొనకుండగ కేవలము పరపక్షమునందు దోషమును ఎంచుట వితండ మనబడును.

## ద్రవ్యాదులవివరణము.

మూ॥ ద్రవ్యగుణకర్మసామాన్యవివేషసమవాయాః స్వలక్షణైః శ్లోకస్థానేపూర్వముక్తాః॥ అథ ప్రతిజ్ఞా—ప్రతిజ్ఞా నామ సాధ్యవచనం, యథా—నిత్యః పురుష ఇతి ॥30॥

అ॥ ద్రవ్యము గుణములు కర్మ సామాన్యము విశేషము సమవాయము ఇవి వాని వాని లక్షణములతో సూత్రస్థానమునందు వివరించి చెప్పబడినవి. "పురుషుఁడు నిత్యుడు" అను సాధింపదగిన విషయము ప్రతిజ్ఞ యనబడును.

## స్థాపనాప్రతిష్ఠాపనములయొక్క వివరణము.

మూ॥ అథ స్థాపనా — స్థాపనా నామ తస్యా ఏవ పతిజ్ఞాయా హేతుదృష్టాన్తోపనయనిగమైః స్థాపనా; పూర్వం హి ప్రతిజ్ఞా, పశ్చాత్స్థాపనా, కిం హ్యప్రతిజ్ఞాతం స్థాపయిష్యతి; యథా—నిత్యః పురుష ఇతి ప్రతిజ్ఞా, హేతుః—అకృతకత్వాదితి, దృష్టాన్తః—అకృతకమాకాశం తచ్చ నిత్యం, ఉపనయో—యథా చాకృతమాకాశం తథా పురుషః, నిగమనం—తస్మాన్నిత్య ఇతి॥ అథ ప్రతిష్ఠాపనా—ప్రతిష్ఠాపనా నామ యా పరప్రతిజ్ఞాయా విపరీతార్థస్థాపనా యథా—అనిత్యః పురుష ఇతి ప్రతిజ్ఞా, హేతుః—ఐన్ద్రియకత్వాత్, దృష్టాన్తః ఘటః ఐన్ద్రియకః స చానిత్యః, ఉపనయో—యథా ఘటస్తథా పురుషః, నిగమనం—తస్మాదనిత్య ఇతి ॥32॥

అ॥ ఆ ప్రతిజ్ఞను హేతువులు దృష్టాంతము ఉపనయము నిగమము వీనిచే నిర్ధారణచేయుట స్థాపన యనబడును. ప్రతిజ్ఞ లేనిచో స్థాపింపదగిన విషయము ఉండదు గావున మొదట ప్రతిజ్ఞయు పిమ్మట స్థాపనయు చేయవలయును. ఎట్లనగా- పురుషుడు నిత్యుడు అనునది ప్రతిజ్ఞగ నుండును. పురుషుడు అకల్పితుడగుటవలన నిత్యుడు. అకల్పితమైన ఆకాశము నిత్యమైనది. అకల్పితమైన ఆకాశమువలె పురుషుడును నిత్యుడు. ఇట్లు హేతువు దృష్టాంతము ఉపనయము నిగమము వీనిచే ప్రతిజ్ఞ స్థాపింపబడినది. పరుని యొక్క ప్రతిజ్ఞకు వ్యతిరేకభావమును స్థాపించుట ప్రతిష్ఠాపన యనబడును. ఎట్లనగా—"పురుషుడు అనిత్యుడు" అనునది ఇందు ప్రతిజ్ఞగ నుండును. పురుషుడు ఇంద్రియగోచరుడగుటవలన అనిత్యుడు. ఇంద్రియగోచరమైన ఘటము అనిత్యమైనది. ఇంద్రియగోచరమైన ఘటమువలె పురుషుడు అనిత్యుడు. అందువలన పురుషుడు అనిత్యుడు. ఇది ప్రతిష్ఠాపన యనబడును.

## హేత్వాదివివరణము.

మూ॥ అథ హేతు — హేతుర్నామోపలబ్ధికారణం, తత్ప్రత్యక్షమనుమానమైతిహ్యమౌపమ్యమితి; ఏభిర్హేతుభిర్యదుపలభ్యతే, తత్తత్త్వమ్ ॥ ఉపనయో నిగమనం చోక్తం స్థాపనాప్రతిష్ఠాపనావ్యాఖ్యాయామ్ ॥34॥

అ॥ సాధించుటకు కారణమైనది హేతు వనబడును. అది ప్రత్యక్షము అనుమానము ఐతిహ్యము ఔపమ్యము అని నాలుగువిధములుగ నుండును. ఈ హేతువులచే పొందబడినవిషయము నిర్ధారితమైనదిగ నుండును. ఉపనయము నిగమము ఇవి స్థాపనాప్రతిష్ఠాపనలయొక్క వివరణమునందు వివరింపబడినవి.

## ఉత్తరవివరణము.

మూ॥ అథోత్తరం—ఉత్తరం నామ సాధర్మ్యోపదిష్టే వా హేతౌ వైధర్మ్యవచనం, వైధర్మ్యోపదిష్టే వా సాధర్మ్యవచనం యథా — హేతుసధర్మాణో వికారాః, శీతకస్య హి వ్యాధేర్హేతు, సాధర్మ్యవచనం—హిమశిశిరవాతసంస్పర్శా ఇతి బ్రువతః పరో బ్రూయాత్ — హేతువిధర్మాణో వికారాః యథా శరీరవయవానాం దాహౌష్ణ్యకోథప్రపచనే హేతువైధర్మ్యం హిమశిశిరవాతసంస్పర్శా ఇతి, ఏతత్సవిపర్యయముత్తరమ్ ॥35॥

అ॥ కార్యము కారణములతో సమానమై ధర్మములను కలిగియుండునని చెప్పినచో వ్యతిరేకధర్మములను కలిగియుండుననియు, వ్యతిరేకధర్మములను కలిగియుండునని చెప్పినచో సమానధర్మములను కలిగియుండుననియు చెప్పుట ఉత్తర మనబడును. ఎట్లనగా—"వ్యాధులు హేతువులతో సమానమైన ధర్మములను కలిగియుండును;

మంచును చలిగాలియు తగులుట శీతవ్యాధికి సమానమైన ధర్మములుగల హేతువుగ నుండు”నని హేతుసాధర్మ్యమును చెప్పినప్పుడు “వ్యాధులు హేతువులకు వ్యతిరేక ధర్మములను కలిగియుండును. శరీరావయవములయందు కలుగు తాపము వేడిమి కుళ్ళుట పక్వమునొందుట వీనికి వ్యతిరేకధర్మములు కల మంచును చలిగాలియు తగులుట హేతువుగ నుండు”నని ఇతరుడు హేతువైధర్మ్యమును చెప్పవలయును. ఈవిధముగనే హేతువైధర్మ్యమును చెప్పినప్పుడు ఇతరుడు హేతుసాధర్మ్యమును చెప్పవలయును.

## దృష్టాంతవివరణము.

మూ॥ అథ దృష్టాన్తః—దృష్టాన్తో నామ యత్ర మూర్ఖవిదుషాం బుద్ధిసామ్యం, యో వర్ణ్యం వర్ణయతి, యథా-అగ్నిరుష్ణో ద్రవముదకం స్థిరా పృథివీ ఆదిత్యః ప్రకాశక ఇతి, యథా వాఽఽదిత్యః ప్రకాశకస్తథా సాంఖ్యవచనం ప్రకాశకమితి ॥36॥

అ॥ పామరులకును పండితులకును తెలిసియున్నదై సాధింపదగిన విషయమును స్పష్టపరచునది దృష్టాంత మనబడును. ఎట్లనగా — అగ్ని ఉష్ణముగ నుండుననియు ఉదకము ద్రవముగ నుండుననియు భూమి స్థిరముగ నుండుననియు సూర్యుడు ప్రకాశింపజేయువాడనియు ఎట్లు సూర్యుడు ప్రకాశింపజేయునో అట్లే సాంఖ్యవచనము ప్రకాశింపజేయుననియు చెప్పుట దృష్టాంతముగ నుండును.

## సిద్ధాంత వివరణము.

మూ॥ అథ సిద్ధాన్తః — సిద్ధాన్తో నామ యః పరీక్షకైర్బహువిధం పరీక్ష్య హేతుభిః సాధయిత్వా స్థాప్యతే నిర్ణయః స సిద్ధాన్తః, స చోక్తశ్చతుర్విధః — సర్వతన్త్రసిద్ధాన్తః, ప్రతితన్త్రసిద్ధాన్తః, అధికరణసిద్ధాన్తః, అభ్యుపగమసిద్ధాన్తః, ఇతి। తత్ర సర్వతన్త్రసిద్ధాన్తో నామ-సర్వతన్త్రేషు యత్ప్రసిద్ధం-సన్తినిదానాని సన్తి వ్యాధయః సన్తి సిద్ధ్యుపాయాః సాధ్యానామితి; ప్రతితన్త్రసిద్ధాన్తోనామ తస్మింస్తస్మింస్తన్త్రే తత్తత్ప్రసిద్ధం, యథా - అన్యత్రాష్టౌ రసాః షడత్ర, పఞ్చేన్ద్రియాణి యథాఽత్రాన్యత్ర షడిన్ద్రియాణి, వాతాదికృతాః సర్వవికారా యథాఽత్రాన్యత్ర వాతాదికృతా భూతకృతాశ్చ ప్రసిద్ధాః; అధికరణసిద్ధాన్తో నామ యస్మిన్నధికరణే సంస్తూయమానే సిద్ధాన్యన్యాన్యప్యధికరణాని భవన్తి, యథా — న ముక్తః కర్మానుబన్ధికం కురుతే నిస్పృహత్వాదితి ప్రస్తుతే సిద్ధాః కర్మఫలమోక్షపురుషప్రేత్యభావా భవన్తి; అభ్యుపగమసిద్ధాన్తో నామ —యమర్థం సిద్ధమపరీక్షితమనుప

దిష్టమహేతుకం వా వాదకాలేఽభ్యుపగచ్ఛన్తి భిషజః, తద్యథా-ద్రవ్యం న ప్రధానమితి కృత్వా వక్ష్యామః, గుణాః ప్రధానా ఇతి కృత్వా వక్ష్యామ; ఇత్యేవమాదిశ్చతుర్విధః సిద్ధాన్తః ॥37॥

అ॥ పరీక్షకులచే అనేకవిధములుగ పరీక్షింపబడి హేతువులచే సాధింపబడినదై స్థాపింపబడిన నిర్ణయము సిద్ధాంతమనబడును. అది సర్వతంత్రసిద్ధాంతమనియు ప్రతితంత్రసిద్ధాంతమనియు అధికరణసిద్ధాంతమనియు అభ్యుపగమసిద్ధాంతమనియు నాలుగు విధములుగ నుండును. వ్యాధిహేతువులును వ్యాధులును సాధ్యవ్యాధులకు చికిత్సలును కలవనెడి, సర్వతంత్రములయందును ప్రసిద్ధమైన సిద్ధాంతము సర్వతంత్రసిద్ధాంతముగ నుండును. ఆయాతంత్రమునందు ప్రసిద్ధమైనసిద్ధాంతము ప్రతితంత్రసిద్ధాంత మనబడును. ఎట్లనగా—ఇతర తంత్రములయందు రసములు ఎనిమిదనియు ఈ తంత్రమునందు ఆరనియు, ఈ తంత్రమునందు ఇంద్రియములు అయిదనియు ఇతర తంత్రములయందు ఆరనియు చెప్పబడినది. మరియు సమస్తవ్యాధులును వాతాదులవలననే కలుగునని ఈ తంత్రమునందును, వాతాదులవలనను భూతములవలనను కలుగునని ఇతర తంత్రములయందును చెప్పబడినది. ఇట్టి సిద్ధాంతము ప్రతితంత్రసిద్ధాంతముగ నుండును. ఒక విషయమును నిర్ణయించునపుడు ఇతరవిషయములయొక్క నిర్ణయము కూడ సిద్ధించుట అధికరణసిద్ధాంత మనబడును. ఎట్లనగా — మోక్షార్హుడు కోరికలు లేనివాడగుటవలన ఉత్తరజన్మయం దనుభవించదగిన కర్మలను చేయడని నిర్ణయించునపుడు కర్మ కర్మఫలము మోక్షము పురుషుడు పునర్జన్మ ఇవి కలవని సిద్ధించును. ఇది అధికరణసిద్ధాంతముగ నుండును. వాదించుకాలమునందు, పరీక్షింపబడకుండగను ఉపదేశింపబడకుండగను అహేతుకముగను సిద్ధించునట్టి "ద్రవ్యము ప్రధానమైనదికాదు" "గుణములు ప్రధానమైనవి" అను సిద్ధాంతము అభ్యుపగమసిద్ధాంత మనబడును. ఇట్లు నాలుగువిధములుగ నుండు సిద్ధాంతము చెప్పబడినది.

## శబ్ద వివరణము.

మూ॥ అథ శబ్దః — శబ్దో నామ వర్ణసమామ్నాయః; స చతుర్విధః-దృష్టార్థశ్చాదృష్టార్థశ్చ సత్యశ్చానృతశ్చేతి; తత్ర దృష్టార్థః—త్రిభిర్హేతుభిర్దోషాః ప్రకుప్యన్తి, షడ్భిరుపక్రమైశ్చ ప్రశామ్యన్తి, శ్రోత్రాదిసద్భావే శబ్దాదిగ్రహణమితి, అదృష్టార్థః పునః-అస్తి ప్రేత్యభావోఽస్తి మోక్ష ఇతి; సత్యో నామ యథార్థభూతః—సన్త్యాయుర్వేదోపదేశాః, సన్త్యుపాయాః సాధ్యానాం, సన్త్యారమ్భఫలానీతి; సత్యవిపర్యయాచ్చానృతః ॥38॥

అ॥ అక్షరములయొక్క కూడిక శబ్దమనబడును. అది చూడబడిన అర్థము కలదనియు చూడబడని అర్థము కలదనియు సత్యమైనదనియు అసత్యమైనదనియు నాలుగువిధములుగ నుండును, ప్రజ్ఞాపరాధము మొదలగు మూడుకారణములచే దోషములు ప్రకోపించును. లంఘనము మొదలగు ఆరుచికిత్సలచే శాంతించును. శ్రోత్రా

దీంద్రియములు సరిగనున్నచో శబ్దాదివిషయములు గ్రహింపబడును. ఇవి దృష్టార్థములుగ నుండును. పునర్జన్మ కలదు. మోక్షము కలదు. ఇవి అదృష్టార్థములుగ నుండును. ఆయుర్వేదోపదేశములు కలవు. సాధ్యవ్యాధులకు చికిత్సలు కలవు. ఆరంభించిన దానికి ఫలితముండును. ఇట్టి యథార్థములైన శబ్దములు సత్యము లనబడును. సత్యము నకు వ్యతిరేకములైనవి అసత్యము లనబడును.

## ప్రత్యక్షాదివివరణము.

మూ॥ అథ ప్రత్యక్షం—ప్రత్యక్షం నామ తద్యదాత్మనా పఞ్చేన్ద్రియైశ్చ స్వయముపలభ్యతే; తత్రాత్మప్రత్యక్షాః సుఖదుఃఖేచ్ఛాద్వేషాదయః, శబ్దాదయ స్త్విన్ద్రియప్రత్యక్షాః॥ అథానుమానం—అనుమానం నామ తర్కో-యుక్త్యపేక్షః। యథోక్తం—అగ్నిం జరణశక్త్యా, బలం వ్యాయామశక్త్యా, శ్రోత్రాదీని శబ్దాదిగ్రహణేనేత్యేవమాది॥ అథైతిహ్యం—ఐతిహ్యం నామాప్తోపదేశో వేదాదిః॥ అథౌపమ్యం—ఔపమ్యం నామ యదన్యేనాన్యస్య సాదృశ్యమధికృత్య ప్రకాశనం. యథా—దణ్డేన దణ్డకస్య, ధనుషా ధనుస్స్తమ్భస్య, ఇష్వాసినా ఆరోగ్యదస్యేతి॥42॥

అ॥ మనస్సు చేతను పంచేంద్రియములచేతను స్వయముగ గ్రహింపబడువిషయము ప్రత్యక్ష మనబడును. సుఖము దుఃఖము ఇచ్ఛ ద్వేషము మొదలగునవి మనస్సునకును, శబ్దాదివిషయములు ఇంద్రియములకును ప్రత్యక్షములుగ నుండును. యుక్తి ననుసరించి ఊహించుట అనుమాన మనబడును. ఎట్లనగా—జీర్ణశక్తినిబట్టి జాఠరాగ్ని శక్తిని, వ్యాయామశక్తినిబట్టి బలమును. శబ్దాదులనుగ్రహించుశక్తినిబట్టి శ్రోత్రాదీంద్రియముల యొక్క శక్తిని ఊహింపవచ్చును. ఆప్తులచేచెప్పబడిన వేదము మొదలగు ఉపదేశము ఐతిహ్య మనబడును. ఒకదానిని మరియొకదానితో పోల్చి వివరించుట ఔపమ్య మనబడును. ఎట్లనగా—దండకవాతముకలరోగిని దండములతోడను, ధనుస్తంభవాతముకలరోగిని ధనస్సుతోడను, వైద్యుని ధనుర్ధరునితోడను పోల్చి చెప్పుట ఔపమ్యముగ నుండును.

## సంశయవివరణము.

మూ॥ అథ సంశయః—సంశయో నామ సందేహలక్షణానుసంధిగ్ధేష్వర్థేష్వనిశ్చయః। యథా—దృష్టా హ్యాయుష్యలక్షణైరుపేతాశ్చానుపేతాశ్చ తథా సక్రియాశ్చాక్రియాశ్చ పురుషాః శీఘ్రభఙ్గాశ్చిరజీవినశ్చ, ఏతదుభయదృష్టత్వాత్సంశయః—కిన్ను ఖల్వస్త్యకాలమృత్యురస్త్యుతనాస్తీతి ॥43॥

అ॥ సందేహలక్షణములతో కూడిన విషయములయందు నిశ్చయజ్ఞానము లేకపోవుట సంశయ మనబడును. ఎట్లనగా__ఆయుష్యలక్షణములతో కూడినట్టియు సరిగ చికిత్సింప బడినట్టియు మనుజులు శీఘ్రకాలమునందు మృతి నొందుచున్నారు. ఆయుష్యలక్షణములులేనట్టియు చికిత్సింపబడినట్టియు మనుజులు చిరకాలము జీవించుచున్నారు. ఇట్లు రెండువిధములుగ కనబడుచుండుటవలన అకాలమృత్యువు కలదా లేదా యని సంశయము కలుగుచున్నది.

## ప్రయోజనాదివివరణము.

మూ॥ అథ ప్రయోజనం--ప్రయోజనం నామ యదర్థమారభ్యన్త ఆరమ్భాః। యథా -- యద్యకాలమృత్యురస్తితతోఽహమాత్మానమాయుష్యైరుపచర్యామ్యనాయుష్యాణి చ పరిహరిష్యామి, కథంమామకాలమృత్యుః ప్రసహేతేతి। అథసవ్యభిచారం--సవ్యభిచారంనామ యద్వ్యభిచరణం; యథా--భవేదిదమౌషధం తస్మిన్ వ్యాధౌ యౌగికమథవానేతి। అథజిజ్ఞాసా--జిజ్ఞాసా నామ పరీక్షా; యథా--భేషజపరీక్షోత్తరకాల ముపదేక్ష్యతే॥ అథ వ్యవసాయః--వ్యవసాయో నామనిశ్చయః, యథా --వాతిక ఏవాయం వ్యాధిః ఇదమేవాస్య భేషజమితి ॥47॥

అ॥ కృత్యములు దేనినుద్దేశించి చేయబడునో అది ప్రయోజన మనబడును. ఎట్లనగా__అకాలమృత్యువు ఉన్నయెడల నేను ఆయువును వృద్ధిచేయునట్టి కృత్యములను ఆచరించెదను. ఆయువును క్షీణింపజేయు కృత్యములను విడిచిపెట్టెదను. అట్లు చేసినచో అకాలమృత్యువు నాకు ఎట్లు సంభవింపగలదు? ఇట్టి ప్రయత్నము దేనినుద్దేశించి బడినదో అట్టి అకాలమృత్యునివారణము ప్రయోజనముగ నుండును. నిలకడ లేకుండుట సవ్యభిచార మనబడును. ఈ ఔషధము ఈవ్యాధిని నశింపచేయనచ్చును. నశింపచేయక పోవచ్చును. ఇట్లు నిలకడ లేకపోవుట సవ్యభిచారముగ నుండును. పరీక్షించుట జిజ్ఞాసయనబడును. ఎట్లనగా__భేషజపరీక్ష ముందు చెప్పబడగలదు. నిశ్చయించుట వ్యవసాయ మనబడును. ఎట్లనగా__ఈ వ్యాధి వాతమువలననే పుట్టినది. ఈ వ్యాధికి ఈఔషధమే అనుకూలమైనది. అని నిశ్చయించుట వ్యవసాయ మనబడును.

## అర్థప్రాప్తివివరణము.

మూ॥ అథార్థప్రాప్తిః--అర్థప్రాప్తిర్నామ యత్రైకేనార్థేనోక్తేనాపరస్యానుక్తస్యసిద్ధిః; యథా--నాయం సన్తర్పణసాధ్యో వ్యాధిరిత్యుక్తేభవత్యర్థప్రాప్తిః-అపతర్పణసాధ్యోఽయమితి, నానేన దివా భోక్తవ్యమిత్యుక్తే భవత్యర్థప్రాప్తిః--నిశిభోక్తవ్యమితి ॥48॥

అ॥ ఒక విషయమును చెప్పుటచే చెప్పబడని మరియొక విషయము ప్రాప్తించుట అర్థప్రాప్తి యనబడును. ఎట్లనగా—ఈవ్యాధి బృంహణమువలన సాధ్యముకాదని చెప్పినప్పుడు లంఘనమువలన సాధ్యమగుననియు, పగలు భోజనముచేయకూడదని చెప్పినప్పుడు రాత్రి భోజనముచేయవచ్చుననియు ప్రాప్తించుట అర్థప్రాప్తి గనుండును.

### సంభవాదివివరణము.

మూ॥ అథ సంభవః—సంభవో నామ యో యతః సంభవతి స తస్య సంభవః; యథా—షడ్ ధాతవో గర్భస్య, వ్యాధే రహితం, హితమారోగ్యస్యేతి ॥49॥

అ॥ ఏది దేనివలన కలుగునో అది దానికి సంభవ మనబడును. గర్భమునకు షడ్ధాతువులును (పంచభూతములు ఆత్మ), వ్యాధికి అహిత సేవనమును, ఆరోగ్యమునకు హిత సేవనమును సంభవములుగ నుండును.

### అనుయోజ్యప్రత్యనుయోజ్యముల వివరణము.

మూ॥ అథానుయోజ్యం — అనుయోజ్యం నామ యద్వాక్యం వాక్యదోషయుక్తం తదనుయోజ్యముచ్యతే, సామాన్యోదాహృతేష్వరేషు వా విశేషగ్రహణార్థం యద్వాక్యం తదనుయోజ్యం; యథా—సంశోధనసాధ్యోఽయం వ్యాధిరిత్యుక్తే కిం వమనసాధ్యః? కిం వా విరేచనసాధ్యః? ఇత్యనుయుజ్యతే॥ అథాననుయోజ్యం—అననుయోజ్యం నామాతో విపర్యయేణ; యథా—అయమసాధ్యః ॥51॥

అ॥ వాక్యదోషముతోకూడిన వాక్యముగాని విషయము సామాన్యముగ చెప్పబడినప్పుడు విశేషజ్ఞానముకొఱకు ప్రయోగింపతగిన వాక్యముగాని అనుయోజ్య మనబడును; ఎట్లనగా—ఈవ్యాధి శోధనసాధ్యమైనదని చెప్పినప్పుడు వమనసాధ్యమైనదా? విరేచనసాధ్యమైనదా? అని అడుగదగిన వాక్యము అనుయోజ్యముగ నుండును. అనుయోజ్యమునకు వ్యతిరేకమైనది. అననుయోజ్య మనబడును. ఎట్లనగా—"ఈవ్యాధి అసాధ్యమైనది." అనునది అననుయోజ్యముగ నుండును.

### అనుయోగప్రత్యనుయోగముల వివరణము.

మూ॥ అథానుయోగః—అనుయోగో నామ యత్తద్విద్యానాం తద్విద్యైరేవ సార్ధం తన్త్రే తన్త్రైకదేశే వా ప్రశ్నః ప్రశ్నైకదేశో వా జ్ఞానవిజ్ఞానవచనప్రతివచనపరీక్షార్థమాదిశ్యతే; యథా—నిత్యః పురుష ఇతి ప్రతిజ్ఞాతే, యత్పరః కో హేతుః? ఇత్యాహ సోఽనుయోగః ॥ అథ ప్రత్యనుయోగః—ప్రత్యనుయోగో నామాను

యోగస్యానుయోగః; యథా—అస్యానుయోగస్య పునః కో హేతు రితి ॥53॥

అ॥ ఆయావిద్యలుకలవారు ఆయావిద్యలుకలవారితో జ్ఞానమువిజ్ఞానమువాక్పటుత్వము సమాధానము వీనిని తెలిసికొనుటకు పూర్తిశాస్త్రమునందుగాని శాస్త్రైకదేశమునందుగాని ప్రశ్నచేయుట అనుయోగ మనబడును. ఎట్లనగా—"పురుషుడు నిత్యుడు" అని చెప్పినప్పుడు ఏ కారణమువలన? అని ఇతరుడు ప్రశ్నించుట అనుయోగముగ నుండును. అనుయోగమునుగూర్చి ప్రశ్నించుట ప్రత్యనుయోగ మనబడును. ఎట్లనగా — నీవు అట్లు ప్రశ్నించుటకు ఏమికారణము? అని తిరిగిప్రశ్నించుట ప్రత్యనుయోగముగ నుండును.

## వాక్యదోష వివరణము.

మూ॥ అథ వాక్యదోషః—వాక్యదోషో నామ యథా — ఖల్వస్మిన్నర్థే న్యూనమధికమనర్థకమపార్థకం విరుద్ధం చేతి । ప్రతిజ్ఞాహేతూదాహరణోపనయనిగమనానామన్యతమేనాపిన్యూనం న్యూనం భవతి, యద్వా బహూపదిష్టహేతుకమేకేన సాధ్యతే హేతునా తచ్చ న్యూనం, ఏతాని హ్యన్తరేణ ప్రకృతోఽర్థః ప్రణశ్యేత్; అథాధికం—అధికం నామ యదాయుర్వేదే భాష్యమాణే బార్హస్పత్యమౌశనసమన్యద్వా యత్కిఞ్చిదప్రతిసంబద్ధార్థముచ్యతే, యద్వా పునః ప్రతిసంబద్ధార్థమపి ద్విరభిధీయతే తత్పునరుక్తత్వాదధికం, తచ్చ పునరుక్తం ద్వివిధం అర్థపునరుక్తం, శబ్దపునరుక్తం చ, తత్రార్థపునరుక్తం నామ యథా—భేషజమౌషధం సాధనమితి, శబ్దపునరుక్తం నామ పునః భేషజం భేషజమితి; అనర్థకం—అనర్థకం నామ యద్వచనమక్షరగ్రామమాత్రమేవస్యాత్పఞ్చవర్గవన్న చార్థతో గృహ్యతే; అథాపార్థకం—అపార్థకంనామయదర్థవచ్చ పరస్పరేణ చాయుజ్యమానార్థకం, యథా—చక్రనక్రవంశవజ్రనిశాకరా ఇతి; అథ విరుద్ధం—విరుద్ధంనామయద్దృష్టాన్తసిద్ధాన్తసమయైర్విరుద్ధం, తత్ర దృష్టాన్తసిద్ధాన్తావుక్తౌ, సమయః పునస్త్రిధా భవతి, యథా—ఆయుర్వైదికసమయో యాజ్ఞికసమయో మోక్షశాస్త్రికసమయ ఇతి, తత్రాయుర్వైదికసమయశ్చతుష్పాదం భేషజమితి, ఆలభ్యాఃపశవ ఇతి యాజ్ఞికసమయః, సర్వభూతేష్వహింసేతి మోక్షశాస్త్రికసమయః, తత్ర స్వసమయవిపరీతముచ్యమానం విరుద్ధం భవతీతి వాక్యదోషాః ॥54॥

అ॥ న్యూనముగ గాని అధికముగగాని అర్థరహితముగ గాని అపార్థకముగ గాని విరుద్ధముగ గాని చెప్పుట వాక్యదోష మనబడును. ప్రతిజ్ఞ హేతువు ఉదాహరణము ఉపనయము నిగమనము వీనిలో ఏదైనను లేకుండగ చెప్పుటగాని అనేక హేతువులు కలదానిని ఒక హేతువుచే చెప్పుటగాని న్యూనమనబడును. ఇట్లు చెప్పినచో సంపూర్ణమైనఅర్థము కలుగనేరదు. ఆయుర్వేదవిషయమును సంభాషించునప్పుడు జ్యోతిశ్శాస్త్రము నీతిశాస్త్రము మొదలగు సంబంధములేని ఇతరశాస్త్రవిషయములను చెప్పుట ఆధిక్య మనబడును. సంబంధముకలవిషయమునైనను మరల చెప్పుట పునరుక్తమైనదగుటవలన ఆధిక్య మనబడును. పునరుక్తము అర్థపునరుక్తమనియు శబ్దపునరుక్తమనియు రెండువిధములుగ నుండును. ఒకేఅర్థముగల భేషజము ఔషధము సాధనము అను వేరువేరుశబ్దములచే ఔషధము అనుఅర్థము మరలమరల వచ్చునట్లు చెప్పుట అర్థపునరుక్త మనబడులు. భేషజమను ఒకేశబ్దమును భేషజము భేషజము అని మరల మరల ప్రయోగించుట శబ్దపునరుక్త మనబడును. పంచవర్గలు (కవర్గ మొదలైనవి) వలె అర్థములేని అక్షరసముదాయమును ప్రయోగించుట అనర్థక మనబడును. అర్థముగల శబ్దములను పరస్పరము సంబంధము లేకుండగ ప్రయోగించుట అపార్థక మనబడును. ఎట్లనగా — "చక్రనక్రవంశవజ్రనిశాకరాః" అని ప్రయోగించుట అపార్థకముగ నుండును. దృష్టాంతము సిద్ధాంతము ఆచారము వీనికి విరుద్ధముగ చెప్పుట విరుద్ధ మనబడును. వానిలో దృష్టాంతమును సిద్ధాంతమును ఇదివరలో వివరింపబడినవి. ఆచారము ఆయుర్వేదాచారమనియు యజ్ఞాచారమనియు మోక్షమనియు మూడువిధములుగ నుండును. పాదచతుష్టయము భేషజ (రోగహర) మను నిది ఆయుర్వేదాచారముగ నుండును. పశువులను చంపవలయునను నిది యజ్ఞాచారముగ నుండును. భూతములను (ప్రాణులను) హింసింపకూడదను నిది మోక్షశాస్త్రాచారముగ నుండును. ఆయాశాస్త్రాచారములను వ్యతిరేకముగ చెప్పుట సమయవిరుద్ధముగ నుండును. ఇట్లు వాక్యదోషములు చెప్పబడినవి.

## వాక్యప్రశంసావివరణము.

**మూ॥ అథ వాక్యప్రశంసా — వాక్యప్రశంసా నామ యథా ఖల్వస్మిన్నర్థే త్వన్యూనమనధికమర్థవదనపార్థకమవిరుద్ధమధిగతపదార్థం చేతియత్తద్వాక్యమనుయోజ్యమితి ప్రశస్యతే॥ 55॥**

అ॥ వాక్యము న్యూనాధికములులేనిదిగను అర్థవంతముగను అపార్థములు లేనిదిగను విరుద్ధము కానిదిగను పదములయొక్క అర్థమంతయు పొందబడినదిగను అనను యోజ్యముగను నుండి ప్రశంసింపబడుట వాక్యప్రశంస యనబడును.

## ఛలవివరణము.

**మూ॥ అథ ఛలం — ఛలం నామ పరిశఠమర్థాభాసమపార్థకం వాగ్వస్తుమాత్రమేవ। తద్ద్వివిధం వాక్ఛలం, సామాన్యచ్ఛలం చ। తత్ర**

వాక్ఛలం నామయథా—కశ్చిద్బ్రూయాన్నవతన్త్రోఽయంభిషగితి, భిషగ్బ్రూయాత్—నాహం నవతన్త్రః ఏకతన్త్రోఽహమితి, పరో బ్రూయాత్—నాహం బ్రవీమి నవతన్త్రాణి తవేతి,అపితు నవాభ్యస్తం హి తేతన్త్రమితి, భిషగ్బ్రూయాత్—న మయానవాభ్యస్తం, తన్త్రమనేకధాఽభ్యస్తం నమయా తన్త్రమితి ఏతద్వాక్ఛలం; సామాన్యచ్ఛలంనామ యథా— వ్యాధిప్రశమనాయౌషధమిత్యుక్తే పరో బ్రూయాత్—సత్ సత్ప్రశమనాయేతి భవానాహ, సన్ హి రోగః, సదౌషధం, యది చ సత్ సత్ప్రశమనాయ భవతి, తత్ర సన్ హి కాసః, సత్ క్షయః, సత్సామాన్యాత్కాసస్తే క్షయప్రశమనాయ భవిష్యతీతి; ఏతత్సామాన్యచ్ఛలమ్॥56॥

అ॥ వంచింప నుద్దేశింపబడినట్టియు అర్థాభాసకలిగినట్టియు అపార్థముకలిగినట్టియు వాక్యములను ప్రయోగించుట ఛల మనబడును. అది వాక్ఛలమనియు సామాన్యచ్ఛలమనియు రెండువిధములుగ నుండును. వానిలో వాక్ఛలమెట్లనగా — "ఈ వైద్యుడు నవతంత్రుడు" అని ఒకడు చెప్పినప్పుడు "నేను తొమ్మిదిశాస్త్రములు కలవాడను కాను. ఒకేశాస్త్రము కలవాడను" అని వైద్యుడు చెప్పవలయును. అప్పుడు పరుడు "నీవు తొమ్మిదిశాస్త్రములుకలవాడవని నేను చెప్పలేదు. నవాభ్యస్తతంత్రుడవని చెప్పితిని" అని మరల అనవలయును. వైద్యుడు మరల "నేను శాస్త్రమును తొమ్మిదిసారులే చదువుకొనలేదు. చాలసారులు చదువుకొంటిని" అని అనవలయును. ఇట్లు చెప్పుట వాక్ఛలముగ నుండును. సామాన్యచ్ఛలమెట్లనగా—ఒకడు "ఔషధము వ్యాధిని శమింపజేయును" అని చెప్పినప్పుడు పరుడు "సత్పదార్థమును శమింపజేయునని నీవు చెప్పితివి కదా! రోగము సత్పదార్థము ఔషధము సత్పదార్థము. సత్పదార్థము సత్పదార్థమును నశింపజేయునని నీ అభిప్రాయమైన యెడల సత్పదార్థమైన కాస సత్పదార్థమైన క్షయను సత్పదార్థసామాన్యమునుబట్టి శమింపజేయవలసియుండును" అని అనవలయును. ఇట్లు అనుట సామాన్యచ్ఛలముగ నుండును.

అహేతువివరణము.

మూ॥అథాహేతుః — అహేతుర్నామ ప్రకరణసమః సంశయసమో వర్ణ్యసమ ఇతి। తత్ర ప్రకరణసమో నామహేతుర్యథా— అన్యః శరీరాదాత్మా నిత్య ఇతి పక్షే బ్రూయాత్—యస్మాదన్యచ్ఛరీరాదాత్మాతస్మాన్నిత్యః;శరీరం హ్యనిత్యమతో విధర్మిణా చాత్మనా భవితవ్యమిత్యేష చాహేతుః, న హి య ఏవ పక్షః స ఏవ హేతుః;సంశయసమో నామాహేతుర్య ఏవ సంశయహేతుః స ఏవ

సంశయచ్ఛేదహేతుః, యథా-అయమాయుర్వేదైకదేశమాహ, కింన్వయం చికిత్సకః స్యాన్నవేతి సంశయే పరో బ్రూయాత్ —యస్మాదయమాయుర్వేదైకదేశమాహ తస్మాచ్చికిత్సకోఽయమితి, న చ సంశయహేతుం విశేషయత్యేష చాహేతుః, న హి య ఏవ సంశయహేతుః స ఏవ సంశయచ్ఛేదహేతుర్భవతి; వర్ణ్యసమో నామాహేతుర్యో హేతుర్వర్ణ్యావిశిష్టః, యథా—పరో బ్రూయాత్-అస్పర్శత్వాద్బుద్ధిరనిత్యా శబ్దవదితి, అత్ర వర్ణ్యః శబ్దో బుద్ధిరపి వర్ణ్యా, తదుభయవర్ణ్యావిశిష్టత్వాద్వర్ణ్యసమోఽప్యహేతుః॥ 57॥

అ॥ ఆ హేతువు ప్రకరణసమమనియు సంశయసమమనియు వర్ణ్యసమమనియు మూడువిధములుగ నుండును. వానిలో ప్రకరణసమాహేతువు ఎట్లనగా — "ఆత్మ శరీరముకంటె భిన్నమైనది. నిత్యమైనది" అని ఒకడు చెప్పినప్పుడుపరుడు "శరీరము అనిత్యమైనది. శరీరముకంటె ఆత్మ భిన్నధర్మమును కలిగియుండవలయును. అందువలన, శరీరముకంటె ఆత్మభిన్నమైన ఆత్మనిత్యమైనది" అని చెప్పుట ప్రకరణ సమాహేతువుగ నుండును. ఎందువలననగా—ఏది పక్షమో అదియే హేతువుగ నుండజాలదు. ఏది సంశయహేతువో అదియే సంశయచ్ఛేదహేతువుగ నుండుట సంశయసమాహేతు వనబడును. ఎట్లనగా—ఇతడు ఆయుర్వేదమునందలి ఒకభాగమునే చెప్పుచున్నాడు గావున చికిత్సకుడవునా కాదా యని సందేహము కలిగినపుడు "ఆయుర్వేదమునందలి ఏకభాగమును చెప్పుచుండుటవలననే ఇతడు చికిత్సకుడు" అని పరుడుచెప్పుట సంశయసమాహేతువుగ నుండును. దీనివలన సంశయచ్ఛేదము విశేషించి కలుగదు. ఏది సంశయహేతువో అదియే సంశచ్ఛేదహేతువుగ నుండజాలదు. వర్ణింపతగినదానికంటె విశేషముగనుండని హేతువు వర్ణ్యసమాహేతు వనబడును. ఎట్లనగా—బుద్ధి స్పర్శలేనిదగుటవలన శబ్దమువలె అనిత్యమైనది. అని చెప్పుట వర్ణ్యసమాహేతువుగ నుండును. ఇచ్చట శబ్దమును బుద్ధియు వర్ణింపదగినవిగ నున్నవి రెండిటియొక్క సాధించుటయందు విశేషహేతువులేకపోవుటవలన వర్ణ్యసమాహేతువుగ నుండును.

## అతీతకాలాదివివరణము.

మూ॥ అథాతీతకాలం—అతీతకాలం నామ యత్పూర్వం వాచ్యం తత్పశ్చాదుచ్యతే, తత్కాలాతీతత్వాదగ్రాహ్యం భవతి; పూర్వం వా నిగ్రహప్రాప్తమనిగృహ్య పక్షాన్తరితం పశ్చాన్నిగృహ్ణీతే తత్తస్యాతీతకాలత్వాన్నిగ్రహవచనమసమర్థం భవతీతి॥ అథోపాలమ్భః ఉపాలమ్భో నామ హేతోర్దోషవచనం; యథా—పూర్వమహేతవో హేత్వాభాసా వ్యాఖ్యాతాః। అథ పరిహారః-పరిహారో నామ తస్యైవ దోషవచనస్య పరిహరణం, యథా-నిత్యమాత్మని శరీరస్థే జీవలిఙ్గాన్యు

పలభ్యన్తే, తస్య చాపగమాన్నోపలభ్యన్తే, తస్మాదన్యః శరీరాదాత్మానిత్యశ్చేతి॥ అథ ప్రతిజ్ఞాహానిః—ప్రతిజ్ఞాహానిర్నామ సా పూర్వపరిగృహీతాం ప్రతిజ్ఞాం పర్యనుయుక్తః పరిత్యజతి। యథా—ప్రాక్ ప్రతిజ్ఞాతిం కృత్వా నిత్యః పురుష ఇతి పర్యనుయుక్తస్త్వాహ—అనిత్య ఇతి॥61॥

అ॥ పూర్వమునందు చెప్పవలసినవిషయమును తరువాత చెప్పుట అతీతకాల మనబడును. అతీతకాలమైనదగుటవలన దానిని గ్రహింపకూడదు. మఱియు జయింపదగిన కాలమునందు జయింపక ఇతరపక్షమునవలంబించి తానుజయింపబడినవాడై అప్పుడు పరునిజయించుటకు చెప్పువాక్యములు అతీతకాలమైనవగుటవలన అసమర్థములుగ నుండును. చెప్పబడినహేతువునకు దోషమునుకల్పించుట ఉపాలంభ మనబడును. పూర్వమునందు చెప్పబడినట్టియు హేతువులవలెకనబడునట్టి అహేతువులు దీనికి ఉదాహరణములుగ నుండును. దోషయుక్తవిషయమునుపరిహరించుట పరిహార మనబడును. ఎట్లనగా–ఎల్లప్పుడును శరీరమునందు ఆత్మయుండుటవలన జీవలక్షణములు కలుగుచున్నవి. ఆత్మలేక పోయినచో జీవలక్షణములుండవు. కావున ఆత్మశరీరముకంటె అన్యమైనదిగను నిత్యమైనదిగను ఉండును. ఇట్లు చెప్పుట పరిహార మనబడును. పరునియొక్క యుక్తికిలోబడి పూర్వమునందు చెప్పబడిన తనయొక్క ప్రతిజ్ఞను విడచిపెట్టుట ప్రతిజ్ఞాహాని యనబడును. ఎట్లంగా—"పురుషుడు నిత్యుడు" అని ముందుగ చెప్పి పిమ్మట పరునియుక్తికిలోబడి "అనిత్యుడు" అని చెప్పుట ప్రతిజ్ఞాహానిగ నుండును.

## అభ్యనుజ్ఞాదివివరణము.

మూ॥ అథాభ్యనుజ్ఞా—అభ్యనుజ్ఞా నామ య ఇష్టానిష్టాభ్యుపగమః॥ అథ హేత్వన్తరం—హేత్వన్తరం నామ ప్రకృతిహేతౌ వాచ్యే యద్వికృతిహేతుమాహ॥ అథార్థాన్తరం—అర్థాన్తరం నామ ఏకస్మిన్వక్తవ్యే పరం యదాహ; యథా—జ్వరలక్షణే వాచ్యే ప్రమేహలక్షణమాహ॥ అథ నిగ్రహస్థానం—నిగ్రహస్థానం నామ పరాజయప్రాప్తిః, త్రిరభిహితస్య వాక్యస్యావిజ్ఞానం పరిషది విజ్ఞానవత్యాం; యద్వా అననుయోజ్యస్యానుయోగోఽనుయోజ్యస్య చాననుయోగః; ప్రతిజ్ఞాహానిరభ్యనుజ్ఞా కాలాతీతవచనమహేతుర్న్యూనమతిరిక్తం వ్యర్థమనర్థకం పునరుక్తం విరుద్ధం హేత్వన్తరమర్థాన్తరం నిగ్రహస్థానమ్ ఇతి వాదమార్గపదాని యథోద్దేశమభినిర్దిష్టాని భవన్తి॥66॥

అ॥ ఇష్టమైనట్టియు అనిష్టమైనట్టియు విషయమును పొందుట అభ్యనుజ్ఞ యనబడును. సరియైన హేతువును చెప్పవలసియుండగ వికృతిహేతువును చెప్పుట హేత్వంతర మనబడును. చెప్పవలసినవిషయమును గాక మరియొకవిషయమును చెప్పుట అర్థాంతర

మనబడును. ఎట్లనగా - జ్వరలక్షణములను చెప్పవలసియుండగ ప్రమేహలక్షణములను చెప్పుట అర్థాంతరముగ నుండును. పరాజయమునుపొందుట నిగ్రహస్థాన మనబడును. పరిషత్తునకు తెలిసినను ముమ్మారుచెప్పినను కూడ తెలియకుండుట, ప్రశ్నింపతగనివిషయమును ప్రశ్నించుట, ప్రశ్నింపతగినవిషయమును ప్రశ్నింపకుండుట ఇవి నిగ్రహస్థానములుగ నుండును. మరియు ప్రతిజ్ఞాహాని, అభ్యనుజ్ఞ, అతీతకాలము, అహేతువు, న్యూనము, అధికము, అపార్థకము, అనర్థకము, పునరుక్తము, విరుద్ధము, హేత్వంతరము, అర్థాంతరము ఇవికూడ నిగ్రహస్థానములుగ నుండును.

మూ॥ ఇతి వాదమార్గపదాని యథోద్దేశమభినిర్దిష్టాని భవన్తి॥

అ॥ వాదమునిమిత్తము తెలియతగిన విషయములు ఇట్లు తగువిధమున వివరింపబడినవి.

మూ॥ వాదస్తు ఖలు భిషజాం వర్తమానో వర్తేతాయుర్వేద ఏవ, నాన్యత్ర॥ అత్ర హి వాక్యప్రతివాక్యవిస్తారాః కేవలాశ్చోపపత్తయశ్చ సర్వాధికరణేషు; తాః సర్వాః సమ్యగవేక్ష్యావేక్ష్య సర్వం వాక్యం బ్రూయాత్, నాప్రకృతకమశాస్త్రమపరీక్షితమసాధకమాకులమజ్ఞాపకం వా, సర్వం చ హేతుమద్బ్రూయాత్, హేతుమన్తో హ్యకలుషాః సర్వ ఏవ వాదవిగ్రహాశ్చికిత్సితే కారణభూతాః ప్రశస్తబుద్ధివర్ధకత్వాత్, సర్వారమ్భసిద్ధిం హ్యావహత్యనుపహతా బుద్ధిః ॥68॥

అ॥ వైద్యులకుజరుగువాదము ఆయుర్వేదమునుగూర్చియే జరుగవలయును. కాని ఇతరవిషయములనుగూర్చి జరుగకూడదు. వాక్యప్రతివాక్యములయొక్క వివరణము ఈస్థానమునందు చెప్పబడినది. ఇతరస్థానములయందు అనేకవిధములగువిషయములు వివరింపబడినవి. వానినన్నిటిని బాగుగ ఆలోచించియే మాట్లాడవలయును. సందర్భములేనట్టియు, శాస్త్రీయముకానట్టియు, పరీక్షింపబడినట్టియు, ప్రమాణము, కానట్టియు, వ్యాకులమైనట్టియు, విషయమును తెలియజేయనట్టియు వాక్యములను ప్రయోగింపకూడదు. ప్రతివాక్యమును సకారణముగ మాట్లాడవలయును. సకారణములైనట్టియు నిష్కల్మషములైనట్టియు వాదములుప్రశస్తమైన బుద్ధిని కలిగించునవగుటవలన చికిత్సకు ఉపయోగకరములుగ నుండును. ప్రశస్తమైనబుద్ధి సమస్తప్రయత్నములకును సరియగు ఫలమును కలిగించును.

## జ్ఞానాభివృద్ధికొరకు తెలిసికొనతగిన విషయములు.

మూ॥ ఇమాని ఖలు తావదిహ కానిచిత్ప్రకరణాని బ్రూమో భిషజాం జ్ఞానార్థం, జ్ఞానపూర్వకం కర్మణాం సమారమ్భం ప్రశంసన్తి కుశలాః॥ జ్ఞాత్వా హి కారణకరణకార్యయోనికార్యకార్యఫలా

నుబన్ధదేశకాలప్రకృత్యుపాయాన్సమ్యగభినిర్వర్తమానః కార్యాభినిర్వృత్తావిష్టఫలానుబన్ధం కార్యమభినిర్వర్తయత్యనతిమహతా ప్రయత్నేన కర్తా ॥70॥

అ॥ కార్యములను జ్ఞానపూర్వకముగ చేసినచో బుద్ధిమంతులు ప్రశంసించెరు. కావున జ్ఞానాభివృద్ధికొరకు వైద్యుడు తెలిసికొనతగిన కొన్నివిషయములను చెప్పుచున్నాము. కారణము, కరణము, కార్యయోని, కార్యము, కార్యఫలము, అనుబంధము, దేశము, కాలము, ప్రవృత్తి, ఉపాయము వీనిని బాగుగ తెలిసికొని కార్యముల నాచరించినచో ఇష్టఫలము నొందును. మరియు అధికప్రయత్నములేకుండగ నేకార్యము నిర్వర్తించును.

కారణాదివివరణము.

మూ॥ తత్ర కారణం నామ తత్, యత్కరోతి, స ఏవ హేతుః, స కర్తా॥ కారణం పునస్తత్, యదుపకరణాయోపకల్పతే కర్తుః కార్యాభినిర్వృత్తౌ ప్రయతమానస్య కార్యయోనిస్తు సా, యా వ్రిక్రియమాణా కార్యత్వమాపద్యతే కార్యం తు తత్, యస్య ప్రయోజనా కార్యాభినిర్వృత్తిరిష్యతే॥ అనుబన్ధస్తు ఖలు సః, యః కర్తారమవశ్యమనుబధ్నాతి కార్యాదుత్తరకాలం కార్యనిమిత్తః శుభో వాఽప్యశుభో వా భావః॥ దేశస్త్వధిష్ఠానమ్ ॥ కాలః పునః పరిణామః ॥ ప్రవృత్తిస్తు ఖలు చేష్టా కార్యార్థా. సైవ క్రియా కర్మ యత్నః కార్యసమారమ్భశ్చ॥ ఉపాయః పునస్త్రయాణాం కారణాదీనాం సౌష్ఠవమభివిధానం చ సమ్యక్ కార్యకార్యఫలానుబన్ధవర్జ్యానాం, కార్యాణామభినిర్వర్తక ఇత్యతస్తూపాయః; కృతే నోపాయార్థోఽస్తి, న చ విద్యతే తదాత్వే, కృతాచ్చోత్తరకాలం ఫలం ఫలాచ్చానుబన్ధ ఇతి॥

అ॥ కార్యమునుఎవడుచేయునో వాడు కారణ మనబడును. మరియు హేతువనియు కర్తయనియుకూడ చెప్పబడును. కార్యమునుచేయువానికి కార్యమునునిర్వర్తించుటయందు సాధనమైనది ఉపకర మనబడును. ఏది మార్పునొందుటవలన కార్యముగవగునో యది కార్యయోని యనబడును. దేనిని చేయుటకు కర్తప్రవర్తించునో అది కార్య మనబడును. ఏప్రయోజనము నుద్దేశించి కార్యమును చేయునో అది కార్యఫల మనబడును. కార్యమువలన కలుగు శుభరూపమైనట్టిగాని అశుభపరూమైనట్టిగాని ఏఫలము కర్తను ఉత్తరకాలమునందు అనుసరించియుండునో అది అనుబంధ మనబడును. కార్యమునకు అధిష్ఠానమైనది దేశ మనబడును. ఋత్వాదిరూపమైనపరిణామము కాలమనబడును. కార్యముకొరకుప్రవర్తించుట ప్రవృత్తి యనబడును. అదియే క్రియయనియు కర్మయనియు యత్నమనియు కార్యసమారంభ

మనియు చెప్పబడును. కార్యము కార్యఫలము అనుబంధము ఇవిగాక మిగిలిన కారణము మొదలగుమూడును కార్యమునిమిత్తము సరిగనుపయోగింబడుట ఉపాయ మనబడును. కార్యముచేయబడిన పిదప ఉపాయమునకు అవసర ముండదు. కార్యోత్పత్తికి పూర్వము కార్యము ఉండదు. కార్యముచేయబడినపిమ్మట ఫలమును ఫలమువలన అనుబంధమును కలుగును.

మూ॥ ఏతద్దశవిధమగ్రే పరీక్ష్యం, తతోఽనన్తరం కార్యార్థా ప్రవృత్తిరిష్టా; తస్మాద్భిషక్ కార్యం చికీర్షుః ప్రాక్కార్యసమారమ్భాత్పరీక్షయా కేవలం పరీక్ష్యం పరీక్ష్యాథ కర్మసమారభేత కర్తుమ్ ॥81॥

అ॥ పైన చెప్పబడిన పదివిధములగు విషయములను ముందుగ పరీక్షించి పిమ్మట కార్యమునుచేయుటకు ప్రయత్నించుట అనుకూలమైనదిగ నుండును. కావున వైద్యుడు బాగుగ పరీక్షించి కార్యమును చేయవలయును.

మూ॥ తత్రచేద్భిషగభిగ్వా భిషజం కశ్చిదేవం పృచ్ఛేత్—వమనవిరేచనాస్థాపనానువాసనశిరోవిరేచనాని ప్రయోక్తుకామేన భిషజా కతివిధయా పరీక్షయా కతివిధమేవ పరీక్ష్యం, కశ్చాత్ర పరీక్ష్యవిశేషః, కథం చ పరీక్షితవ్యః, కింప్రయోజనా చ పరీక్షా, క్వ చ వమనాదీనాం ప్రవృత్తిః క్వ చ నివృత్తిః ప్రవృత్తినివృత్తిలక్షణసంయోగే చ కిం నైష్ఠికం, కాని చ వమనాదీనాం భేషజద్రవ్యాణ్యుపయోగం గచ్ఛన్తీతి ॥82॥

అ॥ వమనము విరేచనము ఆస్థాపనవస్తి అనువాసనవస్తి నస్యకర్మ వీనిని చేయింపదలచినవైద్యుడు ఎన్ని విధములగు పరీక్షలచే ఎన్నివిధములుగ పరీక్షింపవలయును? ఇందు పరీక్షింపతగినవిశేష మేది? ఎట్లు పరీక్షింపవలయును? పరీక్షించుటవలన ప్రయోజన మేమి? వమనాదులు ఎట్టిసమయమున సరిగ ప్రవర్తించును? ఎట్టి సమయమున సరిగ ప్రవర్తింపకుండును? సరిగ ప్రవర్తించుటయొక్కయు సరిగప్రవర్తింపకుండుటయొక్కయు లక్షణములు కలిసియున్నపుడు ఏమిచేయుటకు నిశ్చయింపవలయును? వమనాదికర్మలకు ఏద్రవ్యములు ఉపయోగించును? అని వైద్యుడుగాని వైద్యేతరుడుగాని వైద్యునిఅడుగవచ్చును.

మూ॥ స ఏవం పృష్టో యది మోహయితుమిచ్ఛేత్, బ్రూయాదేనం—బహువిధా హి పరీక్షా తథా పరీక్ష్యవిధిభేదః, కతమేన విధిభేదప్రకృత్యన్తరేణ భిన్నయా పరీక్షయా కేన వా విధిభేదప్రకృత్యన్తరేణ పరీక్ష్యస్య భిన్నస్య భేదాగ్రం భవాన్పృచ్ఛత్యాఖ్యాయమానం, నేదానీం భవతోఽన్యేన విధిభేదప్రకృత్యన్తరేణ భిన్నయా పరీ

క్ష యాఽన్యేన వా విధిభేదప్రకృత్యన్తరేణ పరీక్ష్యస్య భిన్నస్యాభిలషితమర్థం శ్రోతుమహమన్యేన పరీక్షావిధిభేదప్రకృత్యన్తరేణాన్యేన వా విధిభేదప్రకృత్యన్తరేణ పరీక్ష్యం భిత్త్వాఽన్యథాచక్షాణ ఇచ్ఛాం ప్రపూరయేయమితి ॥83॥

అ॥ ఏవిధముగ అడుగబడిన వైద్యుడు వానిని మోహమునొందింపదలచినచో ఈక్రింవివిధముగ అనవలయును. పరీక్ష అనేకవిధములుగ నుండును. పరీక్షింపతగినవిషయములుకూడ అనేకవిధములుగ నుండును. ఏవిధమైనకారణభేదముచేభిన్నమైన పరీక్షచేతఏవిధమైన కారణభేదముచేభిన్నమైన పరీక్షింపతగిన విషయముయొక్క భేదములను నీవు అడిగితివి? నీవు ఒకవిధమైనకారణభేదముచే భిన్నమైన పరీక్షచేత ఒకవిధమైన కారణభేదముచేభిన్నమైన పరీక్షింపతగినవిషయముయొక్క భేదమును వినదలచినప్పుడు నేను మరియొకవిధమైనకారణభేదముచేభిన్నమైన పరీక్షచేత మరియొకవిధమైనకారణభేదముచేభిన్నమైన పరీక్షింపతగినవిషయముయొక్క భేదమును చెప్పినయెడల నీయొక్క ఇచ్ఛను పూరింపజాలను. అని అనవలయును.

మూ॥ స యదుత్తరం బ్రూయాత్తత్పరీక్ష్యోత్తరం వాక్యం స్యాద్యథోక్తం ప్రతివచనవిధిమవేక్ష్య; సమ్యగ్యది తు బ్రూయాత్, న చైనం మోహయితుమిచ్ఛేత్; ప్రాప్తం తు వచనకాలం మన్యేత కామమస్మై బ్రూయాదాప్తమేవ నిఖిలేన ॥84॥

అ॥ అప్పుడు పరుడుచెప్పిన సమాధానమును పరీక్షించి తగినసమాధానమును సమాధానవిధిననుసరించి చెప్పవలయును. పరుడు సరియగుసమాధానమును చెప్పినచో వానికి మోహముకలిగింప నుద్దేశింపకూడదు. చెప్పుటకు అనుకూలమైన కాలమని తలచి సమస్తమైన విషయమును యథార్థముగ చెప్పవలయును.

మూ॥ ద్వివిధా ఖలు పరీక్షా జ్ఞానవతాం ప్రత్యక్షమనుమానం చ, ఏతద్ధి ద్వయముపదేశశ్చ పరీక్షా స్యాత్; ఏవమేషా ద్వివిధా పరీక్షా, త్రివిధా వా సహోపదేశేన ॥85॥

అ॥ జ్ఞానవంతులకు పరీక్ష ప్రత్యక్షమనియు అనుమానమనియు రెండువిధములుగ నుండును, ఆప్తోపదేశముకూడ పరీక్షగ నుండును. అందువలన పరీక్ష రెండువిధములుగ గాని ఆప్తోపదేశముతోకలిసి మూడువిధములుగ గాని యుండును.

కారణము మొదలగువానికి ఉదాహరణములు.

మూ॥ దశవిధం తు పరీక్ష్యం కారణాది యదుక్తమగ్రే, తదిహ భిషగాదిషు సంసార్య సందర్శయిష్యామః-ఇహ కార్యప్రాప్తేః కారణం భిషక్, కరణం పునర్భేషజం, కార్యయోనిర్ధాతువైషమ్యం,

కార్యం ధాతుసామ్యం, కార్యఫలం సుఖావాప్తిః, అనుబన్ధస్తుఖల్వాయుః, దేశో భూమిరాతురశ్చ, కాలః పునః సంవత్సరశ్చాతురావస్థా చ, ప్రవృత్తిః ప్రతికర్మసమారమ్భః, ఉపాయస్తు భిషగాదీనాం సౌష్ఠవమభివిధానం చ సమ్యక్; ఇహాప్యస్యోపాయస్య విషయః పూర్వైస్త్వైవోపాయవిశేషేణ వ్యాఖ్యాత ఇతి కారణాదీని దశ దశను భిషగాదిషు సంసార్య సందర్శితాని, తథైవానుపూర్వ్యా ఏతద్దశవిధం పరీక్ష్యముక్తం ॥ తస్య యో యో విశేషో యథా యథా చ పరీక్షితవ్యః, స తథా తథా వ్యాఖ్యాస్యతే ॥87॥

అ॥ పూర్వమునందు చెప్పబడినట్టియు పరీక్షింపదగినట్టియు పదివిధములగు కారణాదులకు వైద్యుడు మొదలగువారిని ఉదాహరణములుగ చెప్పుచున్నాము. కార్యమును సాధించుటకు వైద్యుడు కారణముగ నుండును. ఔషధము సాధనముగ నుండును. ధాతువైషమ్యము కార్యయోనిగ నుండును. ధాతుసామ్యముకలుగుట కార్యముగ నుండును. సుఖముపొందుట కార్యఫలముగ నుండును. ఆయురభివృద్ధి అనుబంధముగ నుండును. భూమియు రోగియు దేశమనబడును. సంవత్సరమును రోగిస్థితియు కాలమనబడును. కార్యమునుగూర్చి ప్రవర్తించుట ప్రవృత్తి యనబడును. వైద్యుడు మొదలగు విషయములు సరిగ ప్రవర్తించుట ఉపాయ మనబడును. ఉపాయముయొక్క విశేషమును పూర్వమునందు చెప్పబడినవిధముననే ఇచ్చటకూడ తెలిపికొనవలయును. కారణము మొదలగు పరీక్షింపతగినపదివిషయములను వైద్యుడు మొదలగుపదింటియందును ఉదాహరణములుగ క్రమమునను సరించి చెప్పబడినవి. వానియొక్క విశేషములను ఏవిధముగ పరీక్షింపవలయునో ఆవిధమును చెప్పుచున్నాము.

కారణ వివరణము.

మూ॥ కారణం భిషగిత్యుక్తమగ్రే, తస్య పరీక్షా-భిషఙ్నామ స యో భిషజ్యతి, యః సూత్రార్థప్రయోగకుశలః, యస్య చాయుః సర్వథా విదితం; యథావత్సర్వధాతుసామ్యం చికీర్షన్నాత్మానమేవాదితః పరీక్షేత గుణిషు గుణతః కార్యాభినిర్వృత్తిం పశ్యన్-కచ్చిదహమస్య కార్యస్యాభినిర్వర్తనే సమర్థో న వేతి; తత్రేమే భిషగ్గుణా యైరుపపన్నో భిషగ్ధాతుసామ్యాభినిర్వర్తనే సమర్థో భవతి; తద్యథా-పర్యవదాతశ్రుతతా పరిదృష్టకర్మతా దాక్ష్యం శౌచం జితహస్తతా ఉపకరణవత్తా సర్వేన్ద్రియోపపన్నతా ప్రకృతిజ్ఞతా ప్రతిపత్తిజ్ఞతా చేతి ॥౮౮॥

అ॥ వైద్యుడు కారణమని యిదివరలో చెప్పబడినది. వానియొక్క పరీక్షను చెప్పుచున్నాము. శాస్త్రవిషయములను ప్రయోగించుటయందు నేర్పరియు ఆయువును బాగుగ తెలిసికొనినవాడును బాగుగ చికిత్సించువాడును వైద్యు డనబడును. సర్వధాతువులకును సామ్యమును తగినవిధమున కలుగ చేయందలచిన వైద్యుడు తొలుత "నాయొక్క గుణములనుబట్టి నేను ఈకార్యమును నెరవేర్చుటకు సమర్థుడనా! కాదా!" అని తనగుణములను పరీక్షించుకొనవలయును. వైద్యుడు ఏగుణములనుకలిగి యున్నయెడల ధాతుసామ్యమును కలిగించుటకు సమర్థుడుగనుండునో అట్టిగుణములను చెప్పుచున్నాము. శాస్త్రమును బాగుగ నభ్యసించుట, కర్మాభ్యాసమును కలిగియుండుట, సమర్థుడుగనుండుట, శుచిగనుండుట, హస్తకౌశలమును కలిగియుండుట, ఉపకరణములను కలిగియుండుట, సమస్తేంద్రియములను కలిగియుండుట, ప్రకృతిని తెలిసికొనియుండుట, ప్రతిక్రియలను తెలిసికొనియుండుట ఇవి వైద్య గుణములుగ నుండును.

**కరణవివరణము.**

మూ॥ కరణం పునర్భేషజం; భేషజం నామ తద్యదుపకరణాయోపకల్ప్యతే భిషజో ధాతుసామ్యాభినిర్వృత్తౌ ప్రయతమానస్య విశేషతశ్చోపాయాన్తరేభ్యః । తద్ద్వివిధం వ్యపాశ్రయభేదాత్ - దైవవ్యపాశ్రియం,యుక్తివ్యపాశ్రియం చేతి ।తత్ర దైవవ్యపాశ్రియం-మన్త్రౌషధమణిమఙ్గలబల్యుపహారహోమనియమప్రాయశ్చిత్తోపవాసస్వస్త్యయనప్రణిపాతగమనాది, యుక్తివ్యపాశ్రియం-సంశోధనోపశమనే చేష్టాశ్చ దృష్టఫలాః । ఏతచ్చైవ భేషజమఙ్గభేదాదపి ద్వివిధం ద్రవ్యభూతమద్రవ్యభూతం చ। తత్ర యదద్రవ్యభూతం తదుపాయాభిప్లుతం, ఉపాయో నామ భయదర్శనవిస్మాపనవిస్మారణక్షోభణహర్షణభర్త్సనవధబన్ధస్వప్నసంవాహనాదిరమూర్తో భావవిశేషో యథోక్తాః సిద్ధ్యుపాయాశ్చోపాయాభిప్లుతా ఇతి । యత్తు ద్రవ్యభూతం తద్వమనాదిషు యోగముపైతి;తస్యాపీయం పరీక్షా-ఇదమేవంప్రకృత్యా ఏవంగుణమేవంప్రభావమస్మిన్దేశే జాతమస్మిన్నృతావేవంగృహీతమేవంనిహితమేవముపస్కృతమనయా మాత్రయా. యుక్తమస్మిన్రోగే ఏవంవిధస్య పురుషస్యైతావన్తం దోషమపకర్షయత్యుపశమయతి వా,యదన్యదపి చైవంవిధం భేషజం భవేత్తచ్చానేన చానేన విశేషణేన యుక్తమితి ॥89॥

అ॥ ఔషధము కరణమని చెప్పబడినది. ధాతుసామ్యమును కలిగించుటకు ప్రయత్నించుచున్న వైద్యునకు ఇతర ఉపాయములకంటె విశేషించి సాధనముగ నుండు

నది భేషజ మనబడును. అది ఆశ్రయభేదమునుబట్టి దైవవ్యపాశ్రయమనియు యుక్తి వ్యపాశ్రయమనియు రెండువిధములుగ నుండును. వానిలో మంత్రములు, ఓషధులను ధరించుట, మణులనుధరించుట, మంగళవాచకములు, బలిదానము, కానుకలిచ్చుట, హోమములు, నియమములు, ప్రాయశ్చిత్తము, ఉపవాసము, ఆశీర్వచనములు, నమస్కారములు, తీర్థయాత్రలు మొదలగునవి దైవవ్యపాశ్రయములుగ నుండును. సంశోధనము, సంశమనము, దృష్టఫలముగలమనశ్చేష్టలు ఇవి యుక్తివ్యపాశ్రయములుగ నుండును. యుక్తివ్యపాశ్రయమైన ఔషధము అంగభేదమునుసరించి ద్రవ్యభూతమనియు అద్రవ్యభూతమనియు రెండువిధములుగ నుండును. అందు ద్రవ్యభూతము ఉపాయముననుసరించియుండును. భయపెట్టుట, విస్మయమును కలించుట, మరపును కలిగించుట, క్షోభనుకలిగించుట, సంతోషమును కలిగించుట, అపకారవాక్యములను పలుకుట, కొట్టుట, కట్టివేయుట, నిద్ర, పిసుకుట మొదలగు అమూర్తిమంతములగు కృత్యములును ఇతరములగు సాధనక్రియలును ఉపాయము లనబడును. వమనాదికర్మలయందుపయోగించునది ద్రవ్యభూతముగ నుండును. దానియొక్క పరీక్ష చెప్పబడుచున్నది. ఈద్రవ్యము ఈప్రకృతికలది. ఈగుణములుకలది. ఈప్రభావముకలది. ఇట్టి దేశమునందు పుట్టినది. ఈఋతువునందు ఈవిధముగ గ్రహింపబడినది. ఈవిధముగ నుంచబడినది. ఇట్లు సంస్కారముచేయబడినది. ఇట్టిపరిమాణముతో నుపయోగింపబడి ఈవ్యాధియందు ఇట్టిపురుషునకు ఇంతదోషమును శోధించుటకాని శమింపజేయుటకాని చేయును. అని తెలిసికొనుట పరీక్షగ నుండును. ఇతరౌషధముకూడ ఇట్టివిశేషములతో కూడియుండును.

## కార్యయోనివివరణము.

మూ॥ **కార్యయోనిర్ధాతువైషమ్యం, తస్య లక్షణం వికారాగమః,** పరీక్షాత్వస్య వికారప్రకృతేశ్చైవోనాతిరిక్తలిఙ్గవిశేషావేక్షణం **వికారస్య చ సాధ్యాసాధ్యమృదుదారుణలిఙ్గవిశేషావేక్షణమితి ॥౪౦॥**

అ॥ ధాతువైషమ్యము కార్యయోనియని చెప్పబడినది. రోగము లేర్పడుట దానికి లక్షణములుగ నుండును. దానియొక్క పరీక్ష చెప్పబడుచున్నది. రోగము లేర్పడుటకుకారణములగు దోషములయొక్క న్యూనాధిలక్షణములను తెలిసికొనుట, వ్యాధియొక్క సాధ్యాసాధ్యమృదుదారుణలక్షణములను తెలిసికొనుట ఇవి పరీక్షలుగ నుండును.

## కార్యవివరణము.

మూ॥ **కార్యంధాతుసామ్యం,** తస్య **లక్షణం** వికారోపశమః పరీక్షాత్వస్య రుగపగమనం స్వరవర్ణయోగః శరీరోపచయః **బల** వృద్ధిరభ్యవహార్యాభిలాషో రుచిరాహారకాలేఽభ్యవహృతస్యచాహారస్య కాలే సమ్యగ్జరణం నిద్రాలాభో యథాకాలం వైకారికాణాం

చ స్నస్నానామదర్శనం సుఖేన చ ప్రతిబోధనం వాతమూత్రపురీష రేతసాంవిముక్తిశ్చసర్వాకారైర్మనోబుద్ధీన్ద్రియాణాంచావ్యాపత్తిరితి॥

అ॥ ధాతుసామ్యము కార్యమని చెప్పబడినది. రోగముశమించుట ధాతుసామ్యమునకు లక్షణముగనుండును. దానియొక్క పరీక్ష చెప్పబడుచున్నది. బాధశమించుట స్వరమును వర్ణమును సరిగనుండుట, శరీరమునకు పుష్టికలుగుట బలమువృద్ధియగుట, ఆహారమునందిష్టముకలుగుట, రుచికలుగుట, భుజింపబడిన ఆహారము సరిగజీర్ణమగుట, సరియైనకాలమునందు నిద్రకలుగుట, దుష్టస్వప్నములు కలుగకుండుట, సుఖముగ మేల్కొనుట, వాతము మూత్రముపురీషము శుక్రము ఇవి సరిగప్రవర్తించుట, మనస్సు బుద్ధి ఇంద్రియములు ఇవి అన్నివిధముల సరిగనుండుట శమించినరోగమునకు ఇవి లక్షణములుగ నుండును.

కార్యఫలము యొక్కయు అనుబంధముయొక్కయు వివరణము.

మూ॥ కార్యఫలం సుఖావాప్తిః, తస్య లక్షణం మనోబుద్ధీన్ద్రియశరీరతుష్టిః॥ అనుబన్ధస్తు ఖల్వాయుః తస్య లక్షణం ప్రాణైః సహ సంయోగః ॥93॥

అ॥ సుఖమును పొందుట కార్యఫలమని చెప్పబడినది. మనస్సు బుద్ధి ఇంద్రియములు శరీరము ఇవి తృప్తిగనుండుట సుఖమునకు లక్షణముగ నుండును. ఆయువు అనుబంధముగ చెప్పబడినది. శరీరము ప్రాణములతో కూడియుండుట ఆయు వనబడును.

దేశవివరణము.

మూ॥ దేశస్తు భూమిరాతురశ్చ తత్రభూమిపరీక్షా—ఆతురపరిజ్ఞానహేతోర్వాస్యాదౌషధపరిజ్ఞానహేతోర్వా। తత్ర తావదియమాతురపరిజ్ఞానహేతోః; తద్యథా—కస్మిన్నయం భూమిదేశే జాతః సంవృద్ధో వ్యాధితో వేతి; తస్మింశ్చ భూమిదేశే మనుష్యాణామిదమాహారజాతమిదం విహారజాతమేతద్బలమేవంవిధంసత్త్వమేవంవిధం సాత్మ్యమేవంవిధో దోషో భక్తిరియమిమే వ్యాధయో హితమిదమహితమిదమితి, ఔషధపరిజ్ఞానహేతోస్తుకల్పేషు భూమిపరీక్షా వక్ష్యతే॥ ఆతురస్తు ఖలు కార్యదేశః, తస్యపరీక్షా ఆయుషః ప్రమాణజ్ఞానహేతోర్వా స్యాద్బలదోషప్రమాణజ్ఞానహేతోర్వా; తత్రతావదియం బలప్రమాణజ్ఞానహేతోః— దోషప్రమాణానురూపో హి భేషజప్రమాణవికల్పో బలప్రమాణవిశేషాపేక్షో భవతి; సహసాహ్యతి బలమౌషధ మపరీక్షకప్రయుక్తమల్పబలమాతురమభిఘాతయేత్,

న హ్యతిబలాన్యాగ్నేయసౌమ్యవాయవీయాన్యౌషధాన్యగ్ని క్షార శస్త్రకర్మాణి వా శక్యన్తేఽల్పబలైః సోఢుం, అసహ్యాతితీక్ష్ణవేగత్వాద్ధి సద్యఃప్రాణహరాణిస్యుః; ఏతచ్చైవ కారణమపేక్షమాణా హీనబలమాతురమవిషాదకరైర్మృదుసుకుమారప్రాయైరుత్తరోత్తరగురుభిరవిభ్రమైరనాత్యయికైశ్చోపచరన్త్యౌషధైః,విశేషతశ్చ నారీః, తా హ్యనవస్థితమృదువృత్తవిక్లవహృదయాః ప్రాయః సుకుమార్యోఽబలాః పరసంస్తభ్యాశ్చ; తథా బలవతి బలవద్వ్యాధిపరిగతే స్వల్పబలమౌషధమపరీక్షకప్రయుక్తమసాధకం భవతి ॥95॥

అ॥ భూమియు రోగియు దేశమని చెప్పబడినది. అందు భూమిపరీక్ష చెప్పబడుచున్నది. ఈపరీక్ష రోగిస్వభావమును తెలిసికొనుటకును, ఔషధస్వభావమును తెలిసికొనుటకును ఉపయోగించును. భూమినిబట్టి రోగిస్వభావమును తెలిసికొనుట యెట్లనగా- ఇతను పుట్టినట్టియు పెరిగినట్టియు వ్యాధిగ్రస్తుడైనట్టియు దేశమునందునివసించు మనుష్యులకు ఇట్టి ఆహారముండును. ఇట్టివిహారముండును. ఇట్టిబలముండును. ఇట్టిసత్త్వముండును. ఇట్టి అభ్యాస ముండును. ఇట్టిదోష ముండును. ఇట్టికోరిక యుండును. ఇట్టివ్యాధులు కలుగును. ఇట్టిది హితముగ నుండును. ఇట్టిది అహితముగ నుండును. ఈవిషయములను తెలిసికొనవచ్చును. భూమినిబట్టి ఔషధస్వభావమును తెలిసికొనువిధము కల్పస్థానమునందు చెప్పబడగలదు. రోగి కార్యమునకు అధిష్ఠానముగ నుండును. రోగియొక్క పరీక్ష చెప్పబడుచున్నది. ఈపరీక్ష రోగియొక్క ఆయుఃపరిమాణమును తెలిసికొనుటకును బలప్రమాణమును దోషప్రమాణమును తెలిసికొనుటకును ఉపయోగించును. ఈపరీక్ష ననుసరించి బలప్రమాణమును దోషప్రమాణమును తెలిసికొనుటకు హేతు వేమనగా__దోషప్రమాణమునకు అనుకూలమైన ఔషధపరిమాణమును రోగియొక్క బలప్రమాణము ననుసరించి ఈయవలసియుండును. అధికబలముకల ఔషధము పరీక్షింపకుండ ప్రయోగింపబడినదై స్వల్పబలముగల రోగిని వెంటనే చంపును. ఆగ్నేయౌషధములు సౌమ్యౌషధములు వాయవీయౌషధములు అధికబలముకల వీనినిగాని అగ్నికర్మ క్షారకర్మ శస్త్రకర్మ వీనినిగాని అల్పబలముకలవారు సహింపజాలరు. ఇట్టి ఔషధములు సహింపశక్యముకానివిగను తీక్ష్ణమైనవేగముకలవిగను నుండుటవలన వెంటనే ప్రాణములను హరించును. ఈకారణమును తెలిసికొని అల్పబలముకల రోగులకు బాధను కలిగింపనట్టియు మృదువుగనుండునట్టియు సుకుమారములైనట్టియు వికారమును కలిగింపనట్టియు విపత్తును కలిగింపనట్టియు ఔషధములచే చికిత్సింపవలయును. మఱియు అధికబలముకల ఔషధమునుక్రమముగ నీయవలయును. స్త్రీలకు విశేషించి ఇట్లుచేయవలయును. వారు స్థిరములేనట్టియు గాంభీర్యములేనట్టియు బాధలను సహింపలేనట్టియు మనస్సుతో కూడినవారుగను సుకుమారులగను బలములేనివారుగను పరులచే నోదార్పతగినవారుగను నుందురు. బలవంతుడగు పురుషునకు అధికబలము

కల వ్యాధియందు స్వల్పబలముకల ఔషధమును పరీక్షింపకుండ నుపయోగించినచో నిష్ప్రయోజకమగును.

రోగియొక్క బలమును తెలిసికొనుటకు పరీక్షింపతగినవి.

మూ॥ తస్మాదాతురం పరీక్షేత - ప్రకృతితశ్చ వికృతితశ్చ సారతశ్చ సంహననతశ్చ ప్రమాణతశ్చ సాత్మ్యతశ్చ సత్వతశ్చాహార శక్తితశ్చ వ్యాయామశక్తితశ్చ వయస్తశ్చేతి బలప్రమాణవిశేష గ్రహణహేతోః ॥96॥

అ॥ బలప్రమాణముయొక్క విశేషమును తెలిసికొనునిమిత్తము రోగిని ప్రకృతి, వికృతి, సారము, సంహననము, ప్రమాణము, సాత్మ్యము, సత్త్వము, ఆహారశక్తి, వ్యాయామశక్తి, వయస్సు వీనివలన పరీక్షింపవలయును.

ప్రకృతివివరణము.

మూ॥ తత్రామీ ప్రకృత్యాదయో భావాః। తద్యథా— శుక్రశోణితప్రకృతిం కాలగర్భాశయప్రకృతిం మాతురాహార విహారప్రకృతిం మహాభూతవికారప్రకృతిం చ గర్భశరీరమపేక్షతే। ఏతా హి యేన యేన దోషేణాధికతమేనైకేనానేకేన వా సమను బధ్యన్తే తేన తేన దోషేణ గర్భోఽనుబధ్యతే, తతః సా సా దోష ప్రకృతిరుచ్యతే మనుష్యాణాం గర్భాదిప్రవృత్తా। తస్మాద్వాత లాః ప్రకృత్యా కేచిత్, పిత్తలాః కేచిత్, శ్లేష్మలాః కేచిత్, సంసృ ష్టాః కేచిత్, సమధాతవః ప్రకృత్యా కేచిద్భవన్తి ॥ తేషాం హి లక్షణాని వ్యాఖ్యాస్యామః ॥

అ॥ ప్రకృతి మొదలగు భావములను వివరించెదము. శుక్రశోణితస్వభావమును బట్టియు కాలస్వభావమునుబట్టియు గర్భాశయస్వభావమునుబట్టియు తల్లియొక్క ఆహారవిహారస్వభావమునుబట్టియు పంచమహాభూతస్వభావమునుబట్టియు గర్భస్థశిశువునకు ప్రకృతి యేర్పడును. పూర్వమునందు చెప్పబడిన భావములు వృద్ధిపొందినట్టి ఎట్టి ఒకదోషములతోగాని అనేక దోషములతోగాని కూడియుండునో అట్టిదోషముతో గర్భస్థశిశువునకు సంబంధ మేర్పడును. గర్భమునందు ఏదోషమునకు సంబంధ మధిక ముగ నుండునో మనుజులు అట్టిదోషప్రకృతికలవారుగ చెప్పబడుదురు. అందువలన కొందరు వాతప్రకృతికలవారుగను, కొందరు పిత్తప్రకృతికలవారుగను, కొందరు శ్లేష్మప్రకృతికలవారుగను, కొందరు ద్వంద్వప్రకృతికలవారుగను, కొందరు సమధాతుప్రకృతికలవారుగను నుందురు. వానియొక్క లక్షణములను చెప్పుచున్నాము.

## శ్లేష్మప్రకృతి లక్షణములు.

మూ॥ శ్లేష్మా హి స్నిగ్ధశ్లక్ష్ణమృదుమధురసారసాన్ద్రమన్దస్తిమితగురుశీతపిచ్ఛిలాచ్ఛః; తస్య స్నేహాత్ శ్లేష్మలాః స్నిగ్ధాఙ్గాః, శ్లక్ష్ణత్వాచ్ఛ్లక్ష్ణాఙ్గాః, మృదుత్వాద్దృష్టిసుఖసుకుమారావదాతగాత్రాః, మాధుర్యాత్ప్రభూతశుక్రవ్యవాయాపత్యాః. సారత్వాత్ సారసంహతస్థిరశరీరాః, సాన్ద్రత్వాదుపచితపరిపూర్ణసర్వాఙ్గాః, మన్దత్వాన్మన్దచేష్టాహారవిహారాః, స్తైమిత్యాదశీఘ్రారమ్భాల్పక్షోభవికారాః, గురుత్వాత్సారాధిష్ఠితావస్థితగతయః, శైత్యాదల్పక్షుత్తృష్ణాసంతాపస్వేదదోషాః, పిచ్ఛిలత్వాత్సుశ్లిష్టసారసన్ధిబన్ధనాః, తథాఽచ్ఛత్వాత్ప్రసన్నదర్శనాననాః, ప్రసన్నవర్ణస్వరాశ్చ; తఏవంగుణయోగాచ్ఛ్లేష్మలా బలవన్తో వసుమన్తో విద్యావన్త ఓజస్వినః శాన్తా ఆయుష్మన్తశ్చ భవన్తి ॥98॥

అ॥ శ్లేష్మము స్నిగ్ధ, శ్లక్ష్ణ, మృదు, సార, సాంద్ర, మంద, స్తిమిత, గురు, శీత, పిచ్ఛిల, విశద అనెడి గుణములను మధురరసమును కలిగియుండును. శ్లేష్మప్రకృతికలవారు శ్లేష్మముయొక్క స్నిగ్ధగుణమువలన స్నిగ్ధమైన అంగము కలవారుగను, శ్లక్ష్ణగుణమువలన నునుపైన అవయవములు కలవారుగను, మృదుగుణమువలన సుందరమైనట్టియు సుకుమారమైనట్టియు స్వచ్ఛమైనట్టియు శరీరము కలవారుగను, మధురరసమువలన అధికములైన శుక్రమును మైథునశక్తియు సంతానమును కలవారుగను, సారగుణమువలన దృఢమైనట్టియు కలిసియున్నట్టియు స్థిరమైనట్టియు శరీరము కలవారుగను, సాంద్రగుణమువలన పుష్టిగను పరిపూర్ణముగను నున్న సమస్తశరీరము కలవారుగను, మందగుణమువలన మందమైన కృత్యములును ఆహారమును విహారమును కలవారుగను, స్తిమితగుణమువలన కార్యములను శీఘ్రముగ ప్రారంభింపకుండుట అల్పమైనక్షోభవ్యాధులు తరుచు సంభవింపకుండుట ఇవి కలవారుగను, గురుగుణమువలన తొట్రుపాటు లేనట్టియు దృఢమైనట్టియు నిలుకడకలిగినట్టియు గమనము కలవారుగను, శీతగుణమువలన ఆకలి దప్పిక తాపము స్వేదదోషము ఇవి స్వల్పముగ కలవారుగను, పిచ్ఛిల గుణమువలన బాగుగ కలిసియున్నట్టియు దృఢమైనట్టియు సంధిబంధనములు కలవారుగను, విశదగుణమువలన నిర్మలములైన దృష్టి ముఖము వర్ణము స్వరము ఇవి కలవారుగను ఉందురు. శ్లేష్మప్రకృతికలవారు ఇట్టిగుణములు కలవారగుటవలన బలవంతులుగను ధనవంతులుగను విద్యావంతులుగను ఓజోవంతులుగను శాంతముకలవారుగను ఆయుష్మంతులుగను ఉందురు.

## పిత్తప్రకృతిలక్షణములు.

మూ॥ పిత్తముష్ణం తీక్ష్ణం ద్రవం విస్రమమ్లం కటుకం చ; తస్యౌష్ణ్యాత్పిత్తలా భవన్త్యుష్ణాసహాః, ఉష్ణముఖాః, సుకుమారావదాతగాత్రాః, ప్రభూతపిప్లువ్యఙ్గతిలకపిడకాః, క్షుత్పిపాసావన్తః, క్షిప్రవలీపలితఖాలిత్యదోషాః, ప్రాయో మృద్వల్పకపిలశ్మశ్రులోమకేశాః; తైక్ష్ణ్యాత్తీక్ష్ణపరాక్రమాః, తీక్ష్ణాగ్నయః, ప్రభూతాశనపానాః, క్లేశాసహిష్ణవో, దన్దశూకాః; ద్రవత్వాచ్ఛిథిలమృదుసన్ధిబన్ధమాంసాః, ప్రభూతసృష్టస్వేదమూత్రపురీషాశ్చ; విస్రత్వాత్ప్రభూతపూతికక్ష్యాస్యశిరఃశరీరగన్ధాః; కట్వమ్లత్వాదల్పశుక్రవ్యవాయాపత్యాః; త ఏవంగుణయోగాత్పిత్తలా మధ్యబలా మధ్యాయుషో మధ్యజ్ఞానవిజ్ఞానవిత్తోపకరణవన్తశ్చ భవన్తి॥౯౭॥

అ॥ పిత్తము ఉష్ణ, తీక్ష్ణ, ద్రవ, విస్ర అనెడి గుణములను అమ్లకటురసములను కలిగియుండును. పిత్తప్రకృతికలవారు పిత్తముయొక్క ఉష్ణగుణమువలన ఉష్ణమును సహింపలేనివారుగను ఉష్ణమైన ముఖముకలవారుగను సుకుమారమైనట్టియు నిర్మలమైనట్టియు శరీరము కలవారుగను బొబ్బలు వ్యంగము తిలకాలకము పిటికలు ఇవి అధికముగ కలవారుగను ఆకలియు దప్పికయు అధికముగ కలవారుగను శరీరము ముడుతలుపడుట వెంట్రుకలు నెరయుట బట్టతల ఇవి శీఘ్రముగ కలుగువారుగను తరుచుగ మృదువుగను అల్పముగను కపిలవర్ణముగను నుండు మీసములు రోమములు వెంట్రుకలు ఇవి కలవారుగను నుందురు. తీక్ష్ణగుణమువలన తీవ్రమైన పరాక్రమము కలవారుగను తీక్ష్ణమైన జాఠరాగ్ని కలవారుగను అన్నపానముల నధికముగ సేవించువారుగను కష్టములను సహింపలేనివారుగను ఆహారమును మాటిమాటికిని సేవించువారుగను నుందురు. ద్రవగుణమువలన శిథిలముగను మృదువుగను నుండు సంధిబంధనములు మాంసము ఇవి కలవారుగను స్వేదము మూత్రము పురీషము ఇవి అధికముగ ప్రవర్తించువారుగను నుందురు. విస్రగుణమువలన చంకలు నోరు శిరస్సు శరీరము వీనియందు అధికమగు దుర్వాసన కలవారుగను నుందురు. కట్వమ్లరసములవలన అల్పములైన శుక్రమును మైథునశక్తియు సంతానమును కలవారుగను నుందురు. పిత్తప్రకృతికలవారు ఇట్టిగుణములు కలవారగుటవలన బలము ఆయువు జ్ఞానము విజ్ఞానము ధనసాధనములు ఇవి మధ్యమముగ కలవారుగ నుందురు.

## వాతప్రకృతిలక్షణములు,

మూ॥ వాతస్తు రూక్షలఘుచలబహుశీఘ్రశీతపరుషవిశదః; తస్య రౌక్ష్యాద్వాతలా రూక్షాపచితాల్పశరీరాః, ప్రతతరూక్షక్షామభిన్నసన్నసక్తజర్జరస్వరాః, జాగరూకాశ్చ; లఘుత్వాచ్చ

లఘుచపలగతిచేష్టాహారాః; చలత్వాదనవస్థితసన్ధ్యక్షిభ్రూహన్వోష్ఠజిహ్వాశిరఃస్కన్ధపాణిపాదాః; బహుత్వాద్బహుప్రలాపకణ్డరాసిరాప్రతానాః; శీఘ్రత్వాచ్ఛీఘ్రసమారమ్భక్షోభవికారాః, శీఘ్రోత్త్రాసరాగవిరాగాః, శ్రుతగ్రాహిణోఽల్పస్మృతయశ్చ; శైత్యాచ్ఛీతాసహిష్ణవః, ప్రతతశీతకోద్వేపకస్తమ్భాః; పారుష్యాత్పరుషకేశశ్మశ్రురోమనఖదశనవదనపాణిపాదాఙ్గాః; వైశద్యాత్స్ఫుటితాఙ్గావయవాః, సతతసన్ధిశబ్దగామినశ్చ భవన్తి; త ఏవంగుణయోగాద్వాతలాః ప్రాయేణాల్పబలాశ్చాల్పాయుషశ్చాల్పాపత్యాశ్చాల్పసాధనాశ్చాధన్యాశ్చ భవన్తి ॥100॥

అ॥ వాతము, రూక్ష, లఘు, చల, బహు, శీఘ్ర, శీత, పరుష, విశద, అనెడి గుణములను కలిగియుండును. వాతప్రకృతికలవారు వాతముయొక్క రూక్షగుణమువలన రూక్షమైనట్టియు కృశించినట్టియు అల్పమైనట్టియు శరీరము కలవారుగను ఎల్లప్పుడు రూక్షమైనట్టియు, క్షీణించినట్టియు. భిన్నమైనట్టియు, మందమైనట్టియు; అడ్డుగలిగినట్టియు, శిథిలమైనట్టియు స్వరము కలవారుగను జాగరణస్వభావము కలవారుగను నుందురు. లఘుగుణమువలన లఘువైనట్టియు చంచలమైనట్టియు గమనమును కృత్యములును ఆహారమును కలవారుగ నుందురు. చలగుణమువలన సంధులు ఎముకలు కనుబొమలు అంకిళ్ళు పెదవులు నాలుక శిరస్సు భుజశిరస్సులు హస్తములు పాదములు ఇవి స్తిమితముగలేనివారుగ నుందురు. బహుగుణమువలన ప్రలాపము కండరములు సిరాసమూహము ఇవి అధికముగకలవారుగ నుందురు. శీఘ్రగుణమువలన కార్యములయందు ప్రయత్నించుట క్షోభ వ్యాధి ఇవి శీఘ్రముగకలుగువారుగను భయము అనురాగము విరాగము ఇవి శీఘ్రముగకలుగువారుగను వినినవెంటనే గ్రహించువారుగను జ్ఞాపకశక్తి స్వల్పముగ కలవారుగను నుందురు. శీతగుణమువలన శీతమును సహింపలేనివారుగను చలి వణుకు బిగదీయుట ఇవి అధికముగకలవారుగను నుందురు. పరుషగుణమువలన వెంట్రుకలు మీసములు రోమములు గోళ్ళు దంతములు ముఖము హస్తములు పాదములు అవయవములు ఇవి పరుషములుగ నుండువారుగ నుందురు. విశదగుణమువలన పగిలియున్న అంగప్రత్యంగములు కలవారుగను ఎల్లప్పుడును సంధులయందు శబ్దముకలవారుగను నుందురు. వాతప్రకృతికలవారు ఇట్టిగుణములను కలిగియుండుట వలన తరుచుగ బలము ఆయువు సంతానము ఉపకరణములు ఇవి అల్పముగ కలవారుగను ధనములేనివారుగను నుందురు.

మూ॥ సంసర్గాత్సంసృష్టలక్షణాః; సర్వగుణసముదితాస్తు సమధాతవః; ఇత్యేవం ప్రకృతితః పరీక్షేత ॥101॥

అ॥ పైనచెప్పబడిన ప్రకృతులలో రెండేసి ప్రకృతులయొక్క లక్షణములు కలిసియున్నచో ద్వంద్వప్రకృతులనబడును. సమస్తగుణములతో కూడియున్నచో సమధాతుప్రకృతి యనబడును. ఈవిధముగ ప్రకృతిననుసరించి పరీక్షింపవలయును,

### వికృతివివరణము.

మూ॥ వికృతితశ్చేతి—వికృతిరుచ్యతే వికారః। తత్ర వికారం హేతుదోషదూష్యప్రకృతి దేశకాలబలవిశేషైర్లిఙ్గతశ్చ పరీక్షేత, న హ్యన్తరేణ హేత్వాదీనాం బలవిశేషం వ్యాధిబలవిశేషోపలబ్ధిః; యస్య హి వ్యాధేర్దోషదూష్యప్రకృతిదేశకాలబలసామ్యం భవతి మహచ్చ హేతులిఙ్గబలం స వ్యాధిర్బలవాన్ భవతి, తద్విపర్యయాచ్చాల్పబలః, మధ్యబలస్తు దోషాదీనామన్యతమసామాన్యాద్ధేతులిఙ్గమధ్యబలత్వాచ్చోపలభ్యతే ॥102॥

అ॥ వికృతిననుసరించి పరీక్షించువిధము చెప్పబడుచున్నది. వికృతి వ్యాధి యనబడును. హేతువులు, దోషములు, దూష్యములు, ప్రకృతి, దేశము, కాలము వీని యొక్క బలవిశేషములనుబట్టియు లక్షణములనుబట్టియు వ్యాధిని పరీక్షింపవలయును. హేతువులు మొదలగువానియొక్క బలవిశేషమును తెలుసికొనినచో వ్యాధియొక్క బలవిశేషమును తెలిసికొనుటకు వీలుకలుగదు. దోషములు దూష్యములు ప్రకృతి దేశము కాలము వీనియొక్క బలమునకు సామ్యమున్నట్టియు హేతువులును లక్షణములును అధికముగనున్నట్టియు వ్యాధి బలవత్తరముగ నుండును. దానికి వ్యతిరేకలక్షణములు కలది అల్పబలముకలదిగ నుండును. దోషములు మొదలగువానిలో కొన్ని మాత్రము సామ్యముగనున్నట్టియు హేతువులును లక్షణములును మధ్యమబలముగ నున్నట్టియు వ్యాధి మధ్యమబలము కలదిగ నుండును.

### సారవివరణము.

మూ॥ సారతశ్చేతి—సారాణ్యష్టౌ పురుషాణాం బలమానవిశేషజ్ఞానార్థముపదిశ్యన్తే। తద్యథా — త్వగ్రక్తమాంసమేదోస్థిమజ్జశుక్రసత్త్వాని ॥103॥

అ॥ సారముననుసరించి పరీక్షించు విధము చెప్పబడుచున్నది. త్వక్కు, రక్తము మాంసము, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్రము, సత్త్వము ఎనిమిదివిధములగు వీనియొక్క సారములనుబట్టి పురుషులయొక్క బలవిశేషమును తెలిసికొనవలయును.

### త్వక్సార లక్షణము.

మూ॥ తత్ర స్నిగ్ధశ్లక్ష్ణమృదుప్రసన్నసూక్ష్మాల్పగమ్భీరసుకుమారలోమా సప్రభేవ చ త్వక్ త్వక్సారాణాం; సా సారతా సుఖసౌభాగ్యైశ్వర్యోపభోగబుద్ధివిద్యారోగ్యప్రహర్షణాన్యాయుష్ట్వం చానుత్వరమాచష్టే ॥104॥

అ॥ త్వక్సారముకలవారలయొక్క చర్మము స్నిగ్ధముగను నునుపుగను మృదువుగను నిర్మలముగను సూక్ష్మముగను కొంచెము గంభీరముగను సుకుమారముగను రోమయుక్తముగను కాంతికలదిగను నుండును. ఇట్టి త్వక్సారమును కలిగియుండుటవలన సుఖము, శుభములు, ఐశ్వర్యము, భోగములు, బుద్ధి, విద్య, ఆరోగ్యము, సంతోషము, దీర్ఘాయువు, వీనిని కలిగియుండును.

## రక్తసారలక్షణములు.

మూ॥ కర్ణాక్షిముఖజిహ్వానాసౌష్ఠ పాణిపాదతలనఖలలాటమేహనం స్నిగ్ధరక్తం శ్రీమత్ భ్రాజిష్ణు రక్తసారాణాం, సా సారతా సుఖముదగ్రతాం మేధాం మనస్విత్వం సౌకుమార్యమనతిబలమక్లేశ సహిష్ణుత్వముష్ణాసహిత్వం చాచష్టే ॥105॥

అ॥ రక్తసారముకలవారలయొక్క చెవులు, నేత్రములు, ముఖము, నాలుక, ముక్కు, పెదవులు, చేతులు, కాళ్ళు, గోళ్ళు, నుదురు, మేఢ్రము ఇవి స్నిగ్ధముగను రక్తవర్ణముగను శోభాయుక్తములుగను కాంతియుక్తములుగను నుండును. రక్తసారమును కలిగియుండుటవలన సుఖము, అధికమగు మేధాశక్తి, అభిమానము, సౌకుమార్యము, అల్పబలము, కష్టములను సహింపలేకుండుట, ఉష్ణమును సహింపలేకుండుట వీనిని కలిగి యుందురు.

## మాంససారలక్షణము.

మూ॥ శంఖలలాటకృకాటికాక్షిగణ్డహనుగ్రీవాస్కన్ధోదరకక్షవక్షఃపాణిపాదసన్ధయః గురుస్థిరమాంసోపచితా మాంససారాణాం సా సారతా క్షమాం ధృతిమలౌల్యం విత్తం విద్యాం సుఖమార్జవమారోగ్యం బలమాయుశ్చ దీర్ఘమాచష్టే ॥ 106॥

అ॥ మాంససారము కలవారియొక్క కణతలు, నుదురు, కృకాటికాప్రదేశము, నేత్రములు, చెక్కిళ్ళు, అంకిళ్ళు, మెడ, భుజశిరస్సులు, ఉదరము, చంకలు, వక్షఃస్థలము, చేతులు, కాళ్ళు, సంధులు ఇవి గురువుగను స్థిరముగను మాంసపుష్టికలవిగను నుండును. మాంససారమును కలిగియుండుట వలన ఓర్పు, ధైర్యము, లోభములేకుండుట ధనము, విద్య, సుఖము, ఋజుస్వభావము, ఆరోగ్యము, బలము, దీర్ఘాయువు వీని కలిగి యుందురు.

## మేదస్సారలక్షణము.

మూ॥ వర్ణస్వరనేత్రకేశలోమనఖదన్తౌష్ఠమూత్రపురీషేషు విశేషతః స్నేహో మేదఃసారాణాం; సా సారతా విత్తైశ్వర్యసుఖోపభోగప్రదానాన్యార్జవం సుకుమారోపచారతాం చాచష్టే ॥ 107 ॥

అ॥ మేదస్సారముకలవారియొక్క వర్ణము, స్వరము, నేత్రములు, వెంట్రుకలు, రోమములు, గోళ్ళు, దంతములు, పెదవులు, మూత్రము, పురీషము ఇవి విశేషించి స్నిగ్ధముగ నుండును. మేదస్సారమును కలిగియుండుటవలన ధనము, ఐశ్వర్యము, సుఖము, భోగములు, దానముచేయుట, ఋజుస్వభావము, సుకుమారత్వము, ఉపచార స్వభావము వీనిని కలిగియుందురు.

### అస్థిసారలక్షణము.

మూ॥ పార్ష్ణిగుల్ఫజాన్వరత్నిజత్రుచిబుకశిరఃపర్వస్థూలాః స్థూలాస్థినఖదన్తాశ్చాస్థిసారాః, తే మహోత్సాహాః క్రియావన్తః క్లేశసహాః సారస్థిరశరీరాః భవన్త్యాయుష్మన్తశ్చ ॥108॥

అ॥ అస్థిసారముకలవారియొక్క మడిమలు, చీలమండలు, మోకాళ్ళు, అరత్ని ప్రదేశము, మెడకొంకులు, గడ్డము, శిరస్సు, కణుపులు, ఎముకలు, గోళ్ళు, దంతములు ఇవి స్థూలముగ నుండును. అస్థిసారమునుకలిగియుండుటవలన అధికమగు ఉత్సాహము, క్రియాసామర్థ్యము, కష్టములనుసహించుశక్తి, సారవంతమైనట్టియు దృఢమైనట్టియు శరీరము, దీర్ఘాయువు వీనిని కలిగియుందురు.

### మజ్జసారలక్షణము.

మూ॥ తన్వఙ్గా బలవన్తః స్నిగ్ధవర్ణస్వరాః స్థూలదీర్ఘవృత్తసంధయశ్చ మజ్జసారాః; తే దీర్ఘాయుషో బలవన్తః శ్రుతవిజ్ఞానవిత్తాపత్యసంమానభాజశ్చ భవన్తి ॥ 109॥

అ॥ మజ్జసారముకలవారు సూక్ష్మమైన శరీరముకలవారుగను, బలవంతులుగను, స్నిగ్ధమైనవర్ణమును స్వరమును కలవారుగను, స్థూలముగను దీర్ఘముగను గుండ్రముగను నుండు సంధులుకలవారుగను నుందురు. మరియు దీర్ఘాయువుకలవారుగను, బలవంతులుగను, శాస్త్రము విజ్ఞానము ధనము సంతానము గౌరవము ఇవి కలవారుగను నుందురు.

### శుక్రసారలక్షణము.

మూ॥ సౌమ్యాః సౌమ్యప్రేక్షిణశ్చ క్షీరపూర్ణలోచనా ఇవ ప్రహర్షబహులాః స్నిగ్ధవృత్తసారసమసంహతశిఖరిదశనాః ప్రసన్నస్నిగ్ధవర్ణస్వరా భ్రాజిష్ణవో మహాస్ఫిచశ్చ శుక్రసారాః తే స్త్రీప్రియా। ప్రియోపభోగాబలవన్తఃసుఖైశ్వర్యారోగ్యవిత్తసంమానాపత్యభాజశ్చభవన్తి ॥110॥

అ॥ శుక్రసారముకలవారు సౌమ్యులుగను, సుందరమైనరూపముకలవారుగను, క్షీరపూర్ణమైనట్లున్న నేత్రములుకలవారుగను, అధికమైన సంతోషముకలవారుగను, స్నిగ్ధములుగను గుండ్రములుగను దృఢములుగను సమములుగను కలిసినవిగను కోణములుకలవిగను నుండు దంతములుకలవారుగను, నిర్మలముగను స్నిగ్ధముగను నుండు వర్ణమును స్వరమును కలవారుగను, కాంతికలవారుగను, గొప్పనితంబప్రదేశము కలవారుగను నుందురు. మరియు స్త్రీలకు ప్రియమైనవారుగను, అనుకూలమైన భోగములు కలవారుగను, బలవంతులుగను, సుఖము ఐశ్వర్యము ఆరోగ్యము ధనము సన్మానము సంతానము ఇవి కలవారుగను నుందురు.

## సత్త్వసారలక్షణము.

మూ॥ స్మృతిమన్తో భక్తిమన్తః కృతజ్ఞాః ప్రాజ్ఞాః శుచయో మహోత్సాహా దక్షా ధీరాః సమరవిక్రాన్తయోధినస్త్యక్తవిషాదాః స్వవస్థితగతిగమ్భీరబుద్ధిచేష్టాః కల్యాణాభినివేశినశ్చ సత్త్వసారాః; తేషాం స్వలక్షణైరేవ గుణా వ్యాఖ్యాతాః ॥111॥

అ॥ సత్త్వసారముకలవారు జ్ఞాపకశక్తికలవారుగను ,భక్తికలవారుగను, కృతజ్ఞులుగను, బుద్ధిమంతులుగను, శుచివంతులుగను, అధికమైన ఉత్సాహముకలవారుగను, సమర్థులుగను, ధీరులుగను, యుద్ధమునందు పరాక్రమముతో పోరాడువారుగను, దుఃఖములేనివారుగను, సరియైనగమనముకలిగినట్టియు గంభీరమైనట్టియు బుద్ధియు చేష్టలును కలవారుగను, శుభములయందు ఇచ్ఛకలవారుగను నుందురు. ఈలక్షణములనుబట్టియే గుణములనుకూడ తెలిసికొనవలయును.

## సర్వసారలక్షణము.

మూ॥ తత్ర సర్వైస్సారైరుపేతాః పురుషాః భవన్త్యతిబలాః పరమగౌరవయుక్తాః క్లేశసహాః సర్వారమ్భేష్వాత్మని జాతప్రత్యయాః కల్యాణాభినివేశినః స్థిరసమాహితశరీరాః సుసమాహితగతయః సానునాదస్నిగ్ధగమ్భీరమహాస్వరాః సుఖైశ్వర్యవిత్తోపభోగసంమానభాజో మన్దజరసో మన్దవికారాః ప్రాయస్తుల్యగుణవిస్తీర్ణాపత్యాశ్చిరజీవినశ్చ భవన్తి ॥112॥

అ॥ సమస్తసారములతోకూడియుండు పురుషులు అధికమైనబలముకలవారుగను, అధికమైన గౌరవముకలవారుగను, కష్టములనుసహించువారుగను, సమస్తకృత్యములను తామేచేయవలయునను కోరికకలవారుగను, శుభములయందు ఇచ్ఛకలవారుగను, స్థిరమైనట్టియు బాగుగకలిసియున్నట్టియు శరీరముకలవారుగను, సరియైనగమనముకలవారుగను, ప్రతిధ్వనించునట్టియు స్నిగ్ధమైనట్టియు గంభీరమైనట్టియు గొప్పస్వరము కలవారుగను, సుఖము ఐశ్వర్యము ధనము భోగము సన్మానము ఇవి కలవారుగను,

ముసలితనమును వ్యాధులును శీఘ్రముగ కలుగనివారుగను, తరుచుగ తమతో సమానమైన గుణములుకల అధికసంతానముకలవారుగను, దీర్ఘాయువుకలవారుగను నుందురు.

మూ॥ అతో విపరీతా స్త్వసారాః ॥ మధ్యానాం మధ్యైః సారవిశేషైర్గుణవిశేషా వ్యాఖ్యాతా భవన్తి । ఇతి సారాణ్యష్టౌ పురుషాణాం బలప్రమాణవిశేషజ్ఞానార్థాన్యుపదిష్టాని భవన్తి ॥114॥

అ॥ పూర్వమునందు చెప్పబడిన సారలక్షణములు లేనివారు సారహీను లనబడుదురు. సారలక్షణములు మధ్యమముగనున్నవారు మధ్యసారముకలవారని చెప్పబడుదురు. పురుషులయొక్క బలప్రమాణవిశేషములను తెలిసికొనుటకు ఇట్లు ఎనిమిదివిధములగు సారములు చెప్పబడినవి.

మూ॥ కథం ను శరీరమాత్రదర్శనాదేన భిషఙ్ముహ్యేదయ ముపచితత్వాద్బలవాన్, అయమల్పబలః కృశత్వాత్, మహాబలవానయం మహాశరీరత్వాత్, అయమల్పశరీరత్వాదల్పబల ఇతి; దృశ్యన్తే హ్యల్పశరీరాః కృశాశ్చైకే బలవన్తః, తత్ర పిపీలికాభారహరణవత్సిద్ధిః । అతశ్చ సారతః పరీక్షేతేత్యుక్తమ్ ॥115॥

అ॥ శరీరమునుమాత్రము చూచి లావుగనుండుటవలన బలవంతుడనియు, సన్నముగనుండుటవలన బలములేనివాడనియు, గొప్పశరీరమునుకలిగియుండుటవలన మహాబలవంతుడనియు, అల్పశరీరమునుకలిగియుండుటవలన తక్కువబలముకలవాడనియు వైద్యుడు మోహమునుపొందకూడదు. అల్పశరీరముకలిగినట్టియు సన్నముగనున్నట్టియు కొంతమంది బలవంతులుగ నుందురు. వారు 'చీమలు భారమును మోయునట్లు' చాలకార్యములను చేయుదురు. ఇందువలన సారముబట్టి పరీక్షింపవలయునని చెప్పబడినది.

### సంహననవివరణము.

మూ॥ సంహననతశ్చేతి—సంహననం సంఘాతః సంయోజనమిత్యేకోఽర్థః తత్ర సమసువిభక్తాస్థిసుబద్ధసన్ధిసునివిష్టమాంసశోణితం సుసంహతం శరీరమిత్యుచ్యతే । తత్ర సుసంహతశరీరాః పురుషా బలవన్తః, విపర్యయేణాల్పబలాః, ప్రవరావరమధ్యత్వాత్సంహననస్య మధ్యబలా భవన్తి ॥116॥

అ॥ సంహననమునను సరించి పరీక్షించువిధము చెప్పబడుచున్నది. సంహననము సంఘాతము సంయోజనము అను మూడుశబ్దములును 'కూడియుండుట' అను ఒకే అర్థమును కలిగియుండును. సమానములుగనున్నట్టియు సువిభక్తములైనట్టియు ఎముకలను, బాగుగబంధింపబడియున్న సంధులను, బాగుగకూడియున్న మాంసరక్తములను కలిగియున్న శరీరము సుసంహతశరీర మనబడును. సుసంహతమైన బలశరీరముకలపురుషులు

వంతులుగ నుందురు. సుసంహతమైనశరీరములేనివారు అల్పబలముకలవారుగ నుందురు. శరీరముయొక్క సంహననము (కూడిక) మధ్యమముగ నున్నయెడల మధ్యమబలము కలవారుగ నుందురు.

## ప్రమాణవివరణము.

మూ॥ ప్రమాణతశ్చేతి—శరీరప్రమాణం పునర్యథాస్వేనాఙ్గులిప్రమాణేనోపదేక్ష్యతే ఉత్సేధవిస్తారాయామైర్యథాక్రమమ్। తత్ర పాదౌ చత్వారి షట్ చతుర్దశ చాఙ్గులాని, జఙ్ఘే త్వష్టాదశాఙ్గులే షోడశాఙ్గులిపరిక్షేపే జానునీ చతురఙ్గులీషోడశాఙ్గులిపరిక్షేపే, త్రింశదఙ్గులపరిక్షేపావష్టాదశాఙ్గులావూరూ, షడఙ్గులదీర్ఘౌ వృషణావష్టాఙ్గులిపరిణాహౌ, శేఫః షడఙ్గులిదీర్ఘం పఞ్చాఙ్గులపరిణాహం, ద్వాదశాఙ్గులపరిమితో భగః, షోడశాఙ్గులవిస్తారా కటీ, దశాఙ్గులం వస్తిశిరః, దశాఙ్గులవిస్తారం ద్వాదశాఙ్గులముదరం, దశాఙ్గులవిస్తీర్ణే ద్వాదశాఙ్గులాయామే పార్శ్వే, ద్వాదశాఙ్గులవిస్తారం స్తనాన్తరం, ద్వ్యఙ్గులం స్తనపర్యన్తం, చతుర్వింశత్యఙ్గులవిశాలం ద్వాదశాఙ్గులోత్సేధమురః, ద్వ్యఙ్గులం హృదయం, అష్టాఙ్గులౌ స్కన్ధౌ, షడఙ్గులావంసౌ, షోడశాఙ్గులౌ ప్రబాహూ, పఞ్చదశాఙ్గులౌ ప్రపాణీ, హస్తౌ ద్వాదశాఙ్గులౌ, కక్షావష్టాఙ్గులౌ, త్రికం ద్వాదశాఙ్గులోత్సేధం, అష్టాదశాఙ్గులోత్సేధం పృష్ఠం, చతురఙ్గులోత్సేధా ద్వావింశత్యఙ్గులపరిణాహా శిరోధరా, ద్వాదశాఙ్గులోత్సేధం చతుర్వింశత్యఙ్గులపరిణాహమాననం, పఞ్చాఙ్గులమాస్యం, చిబుకౌష్ఠకర్ణాక్షిమధ్యనాసికాలలాటం చతురఙ్గులం, షోడశాఙ్గులోత్సేధం ద్వాత్రింశదఙ్గులపరిణాహం శిరః, ఇతి పృథక్త్వేనాఙ్గావయవానాం మానముక్తం; కేవలం పునః శరీరమఙ్గులిపర్వాణి చతురశీతి తదాయామవిస్తారసమం సముచ్యతే, తత్రాయుర్బలమోజః సుఖమైశ్వర్యం విత్తమిష్టాశ్చాపరే భావా భవన్త్యాయత్తాః ప్రమాణవతి శరీ విపర్యయస్త్వతో హీనేఽధికే వా॥ 117॥

అ॥ ప్రమాణమునననుసరించి పరీక్షించువిధము చెప్పబడుచున్నది. శరీరపరిమాణము వానివానియొక్క అంగుళిపరిమాణముతో ఎత్తు వెడల్పు పొడుగు వీనిననుసరించి యథాక్రమముగ చెప్పబడుచున్నది. పాదములు నాలుగంగుళముల ఎత్తుగను ఆరంగుళముల వెడల్పుగను పదునాలుగంగుళముల పొడుగుగను నుండును, పిక్కలు

పదునెనిమిదంగుళములపొడవుగను పదునారంగుళముల చుట్టుకొలతకలవిగను నుండును. మోకాళ్ళు నాలుగంగుళముల పొడుగుగను పదునారంగుళముల చుట్టుకొలతకలవిగను నుండును. తొడలు ముప్పదంగుళముల చుట్టుకొలతకలవిగను పదునెనిమిదంగుళముల పొడుగుగను నుండును. వృషణములు ఆరంగుళముల పొడుగుగను ఎనిమిదంగుళముల చుట్టుకొలతకలవిగను నుండును. మేఢ్రము ఆరంగుళముల పొడవుగను అయిదంగుళముల చుట్టుకొలతకలదిగను నుండును. యోని పండ్రెండంగుళముల పరిమితిగను, కటి ప్రదేశము పదునారంగుళముల వైశాల్యముకలదిగను, వస్తిప్రదేశము పదియంగుళముల పరిమితిగను నుండును. ఉదరము పదియంగుళముల వెడల్పుగను పండ్రెండంగుళముల పొడుగుగను, పార్శ్వములు పదియంగుళముల వెడల్పుగను పండ్రెండంగుళముల పొడుగుగను నుండును. స్తనములయొక్క మధ్యప్రదేశము పండ్రెండంగుళముల పరిమితిగ నుండును. స్తనప్రదేశము రెండంగుళముల పరిమితిగ నుండును. వక్షఃస్థలము ఇరువది నాలుగంగుళముల వైశాల్యముగను పండ్రెండంగుళముల ఎత్తుగను నుండును. హృదయము రెండంగుళముల పరిమితిగను, భుజశిరస్సులు ఎనిమిదంగుళముల పరిమితిగను, అంస ఫలకములు ఆరంగుళముల పరిమితిగను, ప్రగండములు (మోచేతి పైభాగము) పదునారంగుళముల పొడుగుగను, ప్రకోష్ఠములు (మోచేతి క్రిందిభాగము) పదునైదంగుళముల పొడుగుగను, అరచేతులు పదియంగుళముల పొడుగుగను, చంకలు ఎనిమిదంగుళముల పరిమితిగను, త్రికప్రదేశము పండ్రెండంగుళముల ఎత్తుగను, పృష్ఠప్రదేశము పదునెనిమిదంగుళముల పరిమితిగను నుండును. మెడ నాలుగంగుళముల పొడవుగను ఇరువదిరెండంగుళముల చుట్టుకొలతకలదిగను నుందును. ముఖము పండ్రెండంగుళముల పొడుగుగను ఇరువదినాలుగంగుళముల వైశాల్యముకలదిగను నుండును. నోరు అయిదంగుళముల పరిమితిగ నుండును. గడ్డము పెదవులు చెవులు నేత్రముల మధ్యభాగము ముక్కునుదురు ఇవి నాలుగేసి అంగుళముల పరిమితిగ నుండును. శిరస్సు పదునారంగుళముల ఎత్తుగను ముప్పదిరెండంగుళముల చుట్టుకొలతకలదిగను నుండును. ఇట్లు శరీరావయవములయొక్క పరిమాణము వేరువేరుగ చెప్పబడినది. సమస్తశరీరమును ఎనుబదినాలుగంగుళముల పొడుగుకలదిగ నుండును. పొడుగును వెడల్పును పైనచెప్పబడినవిధమున నున్నచో సమశరీర మనబడును. పరిమాణయుక్తమగు శరీరముగలవారు ఆయువు బలము ఓజస్సు సుఖము ఐశ్వర్యము ధనము ఇష్టములగు ఇతరభావములు వీనిని కలిగియుందురు. పరిమాణము హీనముగగాని అధికముగగాని యున్నచో పైనచెప్పబడిన భావములు సరిగనుండవు.

## సాత్మ్యవివరణము.

మూ॥ సాత్మ్యతశ్చేతి—సాత్మ్యంనామతద్యత్సాతత్యేనోపయుజ్యమానముపశేతే। తత్రయే ఘృతక్షీరతైలమాంసరససాత్మ్యాః సర్వరససాత్మ్యాశ్చ, తేబలవన్తః క్లేశసహాశ్చిరజీవినశ్చభవన్తి; రూక్షసాత్మ్యాః పునరేకరససాత్మ్యాశ్చ యే, తే ప్రాయేణాల్పబలాశ్చ

క్లేశసహా అల్పాయుషోఽల్పసాధనాశ్చ; వ్యామిశ్రసాత్మ్యాస్తు యే, తే మధ్యబలాః సాత్మ్యనిమిత్తతో భవన్తి ॥118॥

అ॥ సాత్మ్యమునను సరించి పరీక్ష చెప్పబడుచున్నది. ఏది ఎల్లపుడు ఉపయోగింపబడుచు శరీరమునకు అనుకూలముగనుండునో అది సాత్మ్య మనబడును. నెయ్యి పాలు నూనె మాంసరసము ఇవి అలవాటుకలవారును సమ స్తరసములును అలవాటుకలవారును బలవంతులుగను కష్టములను సహించువారుగను దీర్ఘాయువు కలవారుగనుండురు. రూక్షద్రవ్యము అలవాటుకలవారును ఒకేరస మలవాటుకలవారును తరుచు అల్పబలము కలవారుగను కష్టములను సహింపలేనివారుగను అల్పాయువు కలవారుగను అల్పోపకరణములు కలవారుగను నుందురు. పూర్వమునందు చెప్పబడిన రెండు విధములగు అలవాటును కలవారు మధ్యమబలము కలవారుగ నుందురు.

సత్త్వవివరణము.

మూ॥ సత్త్వతశ్చేతి — సత్త్వముచ్యతే మనః, తచ్ఛరీరస్య తన్త్రకమాత్మసంయోగాత్ । తత్త్రివిధం బలభేదేన - ప్రవరం మధ్యమవరం చేతి । అతశ్చ ప్రవరమధ్యావరసత్త్వాశ్చ భవన్తి పురుషాః । తత్ర ప్రవరసత్త్వాః సత్త్వసారాః తే సారేషూపదిష్టాః, స్వల్పశరీరా హ్యపి తే నిజాగన్తునిమిత్తాసు మహతీష్వపి పీడాస్వవ్యగ్రా దృశ్యన్తే, సత్త్వగుణవైశేష్యాత్ ; మధ్యసత్త్వాస్త్వపరానాత్మన్యుపనిధాయ సంస్తమ్భయన్త్యాత్మనాఽఽత్మానం పరైర్వాపి సంస్తభ్యన్తే; హీనసత్త్వాస్తు నాత్మనా, న చ పరైః సత్త్వబలం ప్రతిశక్యన్తే ఉపస్తమ్భయితుం, మహాశరీరా హ్యపి తే స్వల్పనామపి వేదనానామసహా దృశ్యన్తే, సంనిహితభయశోకలోభమోహమానా రౌద్రభైరవద్విష్టబీభత్సవికృతసంకథాస్వపి చ పశుపురుషమాంసశోణితాని చావేక్ష్య విషాదవైవర్ణ్యమూర్చ్ఛోన్మాదభ్రమప్రపతనానామన్యతమమాప్నువన్త్యథవా మరణమితి ॥119॥

అ॥ సత్త్వమునను సరించి పరీక్ష చెప్పబడుచున్నది. మనస్సు సత్త్వమని చెప్పబడును. మనస్సు శరీరమునకు ఆత్మసంయోగమువలన ప్రేరణను కలిగించుచుండును. అది బలభేదమునను సరించి ప్రవరము మధ్యమము అవరము అని మూడువిధములుగ నుండును. ఇందువలన పురుషులు ప్రవరసత్త్వముకలవారనియు మధ్యమసత్త్వము కలవారనియు అవరసత్త్వముకలవారనియు మూడువిధములుగ నుందురు. సత్త్వసారము కలవారు ప్రవరసత్త్వముకలవారుగ నుందురు. వారినిగురించి సారవివరణమునందు చెప్పబడినది. వారు అల్పశరీరము కలవారుగ నున్నను సత్త్వగుణవిశేషమునుబట్టి నిజాగంతు కారణములవలన పుట్టిన గొప్పవైన బాధలయందుకూడ వ్యాకులత నొందరు. మధ్యమ

సత్త్వముకలవారు ఇతరులను చూచిగాని ఇతరులచే ఓదార్పబడిగాని బాధలను సహించెదరు. అల్పసత్త్వము కలవారు స్వయముగానైనను ఇతరులచే ఓదార్పబడియైనను కష్టములను సహింపజాలరు. వారు గొప్పశరీరము కలవారైనను స్వల్పబాధలనుకూడ సహింపలేరు. భయము దుఃఖము లోభము మోహము ఇవి కలవారై రౌద్రములైనట్టియు భయంకరములైనట్టియు ద్వేషమును కలిగించునట్టియు అసహ్యకరములైనట్టియు వికృతములైనట్టియు కథలను వినుటవలనను జంతువులయొక్కయు మనుజులయొక్కయు మాంసమును రక్తమును చూచుటవలనను దుఃఖము, వివర్ణత్వము, మూర్ఛ, ఉన్మాదము, భ్రమ, పడిపోవుట వీనిలో దేనినైననుగాని మరణమునుగాని పొందును.

### ఆహారశక్తియొక్కయు వ్యాయామశక్తియొక్కయు వివరణము.

మూ॥ ఆహారశక్తితశ్చేతి--ఆహారశక్తిరభ్యవహరణశక్త్యా జరణశక్త్యా చ పరీక్ష్యా, బలాయుషీ హ్యాహారాయత్తే॥ వ్యాయామశక్తితశ్చేతి -- వ్యాయామశక్తిరపి కర్మశక్త్యా పరీక్ష్యా, కర్మశక్త్యా హ్యనుమీయతే బలత్రైవిధ్యమ్ ॥121॥

అ॥ ఆహారశక్తి ననుసరించి పరీక్షించువిధము చెప్పబడుచున్నది. ఆహారము భుజించుశక్తినిబట్టియు జీర్ణశక్తినిబట్టియు ఆహారశక్తిని తెలిసికొనవలయును. బలమును ఆయువును ఆహారమునకు అధీనములైయుండును. వ్యాయామశక్తి ననుసరించి పరీక్షించు విధము చెప్పబడుచున్నది. కర్మలనాచరించు శక్తినిబట్టి వ్యాయామశక్తిని తెలిసికొనవలయును. కర్మశక్తినిబట్టి మూడువిధములగు బలమును ఊహింపవచ్చును.

### వయస్సుయొక్క వివరణము.

మూ॥ వయస్తశ్చేతి -- కాలప్రమాణవిశేషాపేక్షిణీ హి శరీరావస్థా వయోఽభిధీయతే। తద్వయో యథాస్థూలభేదేన త్రివిధం--- బాలం మధ్యం జీర్ణమితి; తత్ర బాలమపరిపక్వధాతుమజాతవ్యఞ్జనం సుకుమారమక్లేశసహమసంపూర్ణబలం శ్లేష్మధాతుప్రాయమాషోడశవర్షం, వివర్ధమానధాతుగుణం పునః ప్రాయేణానవస్థితసత్త్వమాత్రింశద్వర్షముపదిష్టం, మధ్యం పునః సమత్వాగతబలవీర్యపౌరుషపరాక్రమగ్రహణధారణస్మరణవచనవిజ్ఞానసర్వధాతుగుణం బలస్థితమవస్థితసత్త్వమవిశీర్యమాణధాతుగుణం పిత్తధాతుప్రాయమాషష్టివర్షముపదిష్టం, అతః పరం పరిహీయమానధాత్విన్ద్రియబలవీర్యపౌరుషపరాక్రమగ్రహణధారణస్మరణవచనవిజ్ఞానం భ్రశ్యమానధాతుగుణం వాతధాతుప్రాయం క్రమేణ జీర్ణముచ్యతే ఆవర్షశతం, వర్షశతం ఖల్వాయుషః ప్రమాణమస్మిన్కాలే; సన్తి పునరధికోనవర్షశతజీవినో మనుష్యాః।

తేషాం వికృతివర్జ్యైః ప్రకృత్యాదిబలవిశేషైరాయుషో లక్షణతశ్చ ప్రమాణముపలభ్య వయస్త్రిత్వం విభజేత ॥122॥

అ॥ వయస్సుననుసరించి పరీక్షించువిధము చెప్పబడుచున్నది. కాలప్రమాణము ననుసరించియుండు శరీరస్థితి వయస్సు అనబడును. అట్టివయస్సు స్థూలదృష్టి ననుసరించి బాల్యము మధ్యమము వార్ధక్యము అని మూడువిధములుగ నుండును. ధాతువులు పూర్తిగ వృద్ధినొందకపోవుట మీసములు మొదలగునవి పుట్టకుండుట సుకుమారముగ నుండుట కష్టములను సహింపలేకుండుట బలము సంపూర్ణముగ కలుగకుండుట శ్లేష్మము వృద్ధిగనుండుట ఈ లక్షణములతో కూడిన పదునారుసంవత్సరములవరకును నుండు వయస్సును, వృద్ధినొందుచున్న ధాతువులును గుణములును కలిగి తరుచు స్తిమితముగనుండని సత్త్వమును కలిగి ముప్పదిసంవత్సరముల వరకును నుండు వయస్సును బాల్యముగ నుండును. బలము వీర్యము పౌరుషము పరాక్రమము గ్రహణశక్తి ధారణశక్తి జ్ఞాపకశక్తి సంభాషణశక్తి విజ్ఞానము సమస్తధాతుగుణములు ఇవి సంపూర్ణముగ నున్నట్టియు అధికమగు బలముకలిగినట్టియు స్తిమితమైనసత్త్వము కలిగినట్టియు క్షీణింపని ధాతుగుణములు కలిగినట్టియు పిత్తము ప్రధానముగ నుండునట్టియు అరువదిసంవత్సరముల వరకు నుండునట్టి వయస్సు మధ్యమముగ నుండును. ధాతువులు ఇంద్రియపటుత్వము బలము వీర్యము పౌరుషము పరాక్రమము గ్రహణశక్తి ధారణశక్తి జ్ఞాపకశక్తి సంభాషణశక్తి విజ్ఞానము ఇవి క్రమముగ క్షీణించుచున్నట్టియు ధాతుగుణములు నశించునట్టియు వాతము ప్రధానముగ నుండునట్టియు నూరుసంవత్సరములవరకు నుండునట్టి వయస్సు వార్ధక్య మనబడును. ఈ కలికాలమునందు ఆయుఃపరిమాణము నూరుసంవత్సరములుగ నుండును. కొంతమంది నూరుసంవత్సరములకంటె అధికముగగాని తక్కువగగాని జీవించుచున్నారు. వికృతిగాక ఇతరములైన ప్రకృతిమొదలగువానియొక్క బలవిశేషముల ననుసరించియు ఆయువుయొక్క లక్షణముల ననుసరించియు ప్రమాణమును తెలిసికొని వయస్సును మూడువిధములుగ విభజింపవలయును.

మూ॥ ఏవం ప్రకృత్యాదీనాం వికృతివర్జ్యానాం భావానాం ప్రవరమధ్యావరవిభాగేన బలవిశేషం విభజేత। వికృతిబలత్రైవిధ్యేన తు దోషబలం త్రివిధమనుమీయతే। తతో భైషజ్యస్య తీక్ష్ణమృదుమధ్యవిభాగేన త్రిత్వం విభజ్యయథాదోషం భైషజ్యమవచారయేదితి॥ ఆయుషః ప్రమాణజ్ఞానహేతోః పునరిన్ద్రియేషు జాతిసూత్రీయే చ లక్షణాన్యుపదేక్ష్యన్తే ॥124॥

అ॥ వికృతి కంటె ఇతరములైన ప్రకృతి మొదలగు భావములయొక్క ప్రవర మధ్యమ అవర విభాగముచే బలవిశేషమునుకూడ విభజింపవలయును. వికృతియొక్క మూడువిధములగు బలముచే దోషములయొక్క మూడువిధములగు బలమును ఊహింపవచ్చును. ఔషధమును తీక్ష్ణ మృదు మధ్యమ విభాగముచే మూడువిధములుగ విభజించి దోషబలానుసారముగ నుపయోగింపవలయును. ఆయువుయొక్క ప్రమాణమును

తెలిసికొనుటకు నుపకరించు లక్షణములింకను ఇంద్రియస్థానమునందును శారీరస్థానము నందలి జాతిసూత్రీయాధ్యాయమునందును చెప్పబడగలవు.

కాలవివరణము.

మూ॥ కాలః పునః సంవత్సరశ్చాతురావస్థా చ; తత్ర సంవత్సరో ద్విధా త్రిధా షోఢా ద్వాదశధా భూయశ్చాప్యతః ప్రవిభజ్యతే తత్తత్కార్యమభిసమీక్ష్య; తం తు ఖలు తావత్షోఢా ప్రవిభజ్య కార్యముపదేక్ష్యతే—హేమన్తో గ్రీష్మో వర్షాశ్చేతి శీతోష్ణవర్షలక్షణాస్త్రయ ఋతవో భవన్తి; తేషామన్తరేష్వితరే సాధారణలక్షణాస్త్రయ ఋతవః ప్రావృట్ శరద్వసన్తా ఇతి; ప్రావృడితి ప్రథమః ప్రవృష్టేః కాలః, తస్యానుబన్ధో హి వర్షా; ఏవమేతే సంశోధనమధికృత్య షడ్విభజ్యన్తే ఋతవః ॥125॥

అ॥ సంవత్సరమును రోగిస్థితియు కాలమనబడునని చెప్పబడినది. అందు సంవత్సరము ఆయాప్రయోజనముల ననుసరించి రెండువిధములుగను మూడువిధములుగను ఆరువిధములుగను పండ్రెండువిధములుగను అంతకంటె అధికముగను విభజింపబడినది. సంవత్సరముయొక్క ఆరువిధములగు విభాగము ననుసరించి ప్రయోజనమును చెప్పుచున్నాము. శీతము ఉష్ణము వర్షము అను లక్షణములు యథాక్రమముగ ప్రధానముగగల హేమంతఋతువు గ్రీష్మఋతువు వర్షఋతువు అను మూడుఋతువు లుండును. వానియొక్క మధ్యయందు పైనచెప్పబడిన లక్షణములు సాధారణముగగల ప్రావృడృతువు శరదృతువు వసంతఋతువు అను మూడుఋతువు లుండును. వర్షములు అధికముగ కురియుటకు ప్రథమమునందు కాలము ప్రావృడృతువు అనబడును. దానికి పిమ్మట నుండు కాలము వర్షఋతు వనబడును. శోధనకర్మనుద్దేశించి ఈప్రకారముగ ఆరుఋతువులు విభజింపబడినవి.

మూ॥ తత్ర సాధారణలక్షణేష్వృతుషు వమనాదీనాం ప్రవృత్తిర్విధీయతే, నివృత్తిరితరేషు । సాధారణలక్షణా హి మన్దశీతోష్ణవర్షత్వాత్సుఖతమాశ్చ భవన్త్యవికల్పకాశ్చ శరీరౌషధానాం ఇతరే పునరత్యర్థశీతోష్ణవర్షత్వాద్దుఃఖతమాశ్చ భవన్తి వికల్పకాశ్చ శరీరౌషధానామ్ ॥126॥

అ॥ వానిలో సాధారణ లక్షణములుగల ప్రావృడృతువు మొదలగు మూడు ఋతువులయందు వమనాదికర్మలను చేయింపవలయును. ఇతర ఋతువులయందు చేయింపకూడదు. సాధారణలక్షణములుగల ఆ ఋతువులు శీతమును ఉష్ణమును వర్షమును తక్కువగకలవగుటవలన సుఖకరములుగను శరీరమునకును ఔషధమునకును

వికృతిని కలిగింపనివిగను నుండును. హేమంతఋతువు మొదలగు ఇతరఋతువులు శీతమును ఉష్ణమును వర్షమును అధికముగ కలవగుటవలన దుఃఖకరములుగను శరీరమునకును ఔషధమునకును వికృతిని కలిగించునవిగను నుండును.

మూ॥ తత్ర హేమన్తే హ్యతిమాత్రశీతోపహతత్వాచ్ఛరీరమసుఖోపపన్నం భవత్యతిశీతవాతాధ్మాతమతిదారుణీభూతమాబద్ధదోషం చ, భేషజం పునః సంశోధనార్థముష్ణస్వభావం శీతోపహతత్వాన్మన్దవీర్యత్వమాపద్యతే, తస్మాత్తయోః సంయోగే సంశోధనమయోగాయోపపద్యతే, శరీరమపి చ వాతోపద్రవాయ; గ్రీష్మే పునర్భృశోష్ణోపహతత్వాచ్ఛరీరమసుఖోపపన్నం భవత్యుష్ణవాతాతపాధ్మాతమతిశిథిలమత్యన్తప్రవిలీనదోషం, భేషజం పునః సంశోధనార్థముష్ణస్వభావముష్ణానుగమనాత్తీక్ష్ణతరత్వమాపద్యతే, తస్మాత్తయోః సంయోగే సంశోధనమతియోగాయోపపద్యతే, శరీరమపి పిపాసోపద్రవాయ; వర్షాసు తు మేఘజాలావతతే గూఢార్కచన్ద్రతారే ధారాకులే వియతి భూమావపఙ్కజలపటలసంవృతాయామత్యర్థోపక్లిన్నశరీరేషు భూతేషు విహతస్వభావేషు చ కేవలేష్వౌషధగ్రామేషు తోయతోయదానుగతమారుతసంసర్గాద్గురుప్రవృత్తీని వమనాదీని భవన్తి, గురుసముత్థానాని చ శరీరాణి; తస్మాద్వమనాదీనాం నివృత్తిర్విధీయతే వర్షాన్తేష్వృతుషు న చేదాత్యయికం కర్మ, ఆత్యయికే పునః కర్మణి, కామమృతుం వికల్ప్య కృత్రిమగుణోపధానేనయథర్తుగుణవిపరీతేన భైషజ్యం సంయోగసంస్కారప్రమాణవికల్పేనోపపాద్య ప్రమాణవీర్యసమం కృత్వా తతః ప్రయోజయేదుత్తమేన యత్నేనావహితః ॥127॥

అ॥ హేమంతఋతువునందు శరీరము అధికమగుశీతముచే బాధింపబడినదగుటవలన సుఖములేనిదిగను, అతిశీతలమగువాయువుచే పూరింపబడినదిగను, అతిదారుణమైనదిగను, స్తంభించినదోషములు కలదిగను నుండును. అప్పుడు శోధనమునిమిత్తముపయోగింపబడినట్టియు ఉష్ణస్వభావము కలిగినట్టియు ఔషధము శీతముచే వికృతినొందింపబడినదగుటవలన అల్పశక్తి కలదిగ నగును. అట్టిశరీరమును అట్టియౌషధమును కలియుటవలన శోధనము సరిగ కానేరదు. మరియు శరీరమునకు వాతసంబంధమగు ఉపద్రవములు కలుగును. గ్రీష్మఋతువునందు శరీరము అధికమగుఉష్ణముచే బాధింపబడినదగుటవలన సుఖములేనిదిగను, అత్యుష్ణములగు గాలి ఎండ వీనిచే బాధింపబడినదిగను, మిక్కిలి శిథిలమైనదిగను, మిక్కిలి అణగియున్న దోషములుకలదిగను నుండును,

అప్పుడు శోధనమునిమిత్తముపయోగింపబడినట్టియు ఉష్ణస్వభావము కలిగినట్టియు ఔషధము ఉష్ణముతో కలియుటవలన అధికమగు తీక్ష్ణత్వము నొందును. అందువలన అట్టిశరీరమును అట్టి యౌషధమును కలిసినప్పుడు శోధనము అతియోగముగ నగును. మరియు శరీరమునకు దప్పిక మున్నగు ఉపద్రవములు కలుగును. వర్షఋతువునందు ఆకాశము జలయుక్తమగు మేఘములతో కూడినదిగను, కనబడని సూర్యుడు చంద్రుడు నక్షత్రములు ఇవి కలదిగను, వర్షధారలచే వ్యాకులమైనదిగను నుండును. భూమి బురదతోడను జలముతోడను కూడినదిగ నుండును. ప్రాణులు మిక్కిలి క్లిన్నమైన శరీరముకలవారుగ నుందురు. సమస్తౌషధములు చెడినగుణములుకలవిగ నుండును. అట్టి సమయమునందు ప్రయోగింపబడిన వమనాదికర్మలు జలముయొక్కయు మేఘములతో కూడినగాలియొక్కయు సంబంధమువలన సుఖములేని ప్రవృత్తికలవి యగును. శరీరములు శోధనముచే బాధింపబడినవి యగును. కావున హేమంతఋతువు మొదలగు ఋతువుల యందు అత్యవసరములేనిచో వమనాదికర్మలను చేయింపకూడదు. అత్యవసరము కలిగినచో ఔషధమునందు ఆయాఋతువులకు విపరీతమైన గుణములను కృత్రిమవిధానముచే కలుగజేసి సంయోగము సంస్కారము ప్రమాణము వీనియొక్క వికల్పములచే ప్రమాణమును శక్తిని సమానముగ నుండునట్లు చేసి పిమ్మట అప్రమత్తుడై సరియగు ప్రయత్నముతో ప్రయోగింపవలయును.

మూ॥ ఆతురావస్థాస్వపి తు కార్యాకార్యం ప్రతి కాలాకాలసంజ్ఞా । తద్యథా—అస్యామవస్థాయామస్య భేషజస్య కాలోఽకాలః పునరస్యేతి, ఏతదపి హి భవత్యవస్థావిశేషేణ, తస్మాదాతురావస్థాస్వపి హి కాలాకాలసంజ్ఞా । తస్య పరీక్షా—ముహుర్ముహురాతురస్య సర్వావస్థావిశేషావేక్షణం యథావద్భేషజప్రయోగార్థం, న హ్యతిపతితకాలమప్రాప్తకాలం వా భేషజముపయుజ్యమానం యౌగికం భవతి; కాలో హి భైషజ్యప్రయోగపర్యాప్తిమభినిర్వర్తయతి॥128॥

అ॥ రోగియొక్క ఆయాఅవస్థలయందు చికిత్స చేయతగినసమయము కాలమనియు చికిత్సచేయతగనిసమయము అకాలమనియు చెప్పబడును. ఎట్లనగా – ఈఅవస్థయందు ఈ ఔషధమునకు తగినకాలమనియు ఈ ఔషధమునకు తగనికాలమనియు తెలిసికొనుట అవస్థావిశేషమునుబట్టి కలుగును. అందువలన రోగియొక్క స్థితులయందుకూడ కాలాకాలసంజ్ఞ కలుగును. దానియొక్క పరీక్ష చెప్పబడుచున్నది. ఔషధమును ప్రయోగించు నిమిత్తము రోగియొక్క సర్వావస్థలయొక్క విశేషములను తరుచు చూచుచుండవలయును. సమయమునుమించిగాని సమయమురాకుండగాని ఉపయోగింపబడిన యౌషధము సరిగ నుపకరింపజాలదు. ప్రయోగింపబడిన ఔషధముయొక్క సిద్ధికాలము ననుసరించియే యుండును.

ప్రవృత్తియొక్కయు ఉపాయముయొక్కయు వివరణము.

మూ॥ ప్రవృత్తిస్తు ప్రతికర్మసమారమ్భః; తస్య లక్షణం— భిషగాతురౌషధపరిచారకాణాం క్రియాసమాయోగః॥ ఉపాయఃపున ర్భిషగాదీనాం సౌష్ఠవమభివిధానం చ సమ్యక్ । తస్య లక్షణం--భిష గాదీనాంయథోక్తగుణ సంపద్భిర్దేశకాలప్రమాణసాత్మ్యక్రియాదిభిశ్చ సిద్ధికారణైః సమ్యగుపపాదితస్యౌషధస్యావచారణమితి ॥130॥

అ॥ చికిత్సనుగూర్చి ప్రవర్తించుట ప్రవృత్తియని చెప్పబడినది. వైద్యుడు, రోగి, ఔషధము, పరిచారకుడు వీరు చికిత్సనిమిత్తము కలిసి ప్రవర్తించుట ప్రవృత్తిగ నుండును. వైద్యుఁడు మొదలగువిషయములు సరిగ ప్రవర్తించుట ఉపాయమని చెప్ప బడినది. వైద్యుడు మొదలగువారికి చెప్పబడిన గుణములతో కూడినట్టియు దేశము కాలము ప్రమాణము సాత్మ్యము క్రియలు మొదలగునట్టి సిద్ధికారణముల ననుసరించి సరిగ తయారుచేయబడిన ఔషధమును ప్రయోగించుట ఉపాయమనకు లక్షణముగ నుండును.

మూ॥ ఏవమేతే దశ పరీక్ష్యవిశేషాః పృథక్పృథక్ పరీక్షి తవ్యా భవాన్తి ॥

అ॥ ఇట్లు పైనచెప్పబడిన పదివిధములగు పరీక్షింపదగినవిషయములను వేరు వేరుగ పరీక్షింపవలయును.

మూ॥ పరీక్షాయాస్తు ఖలు ప్రయోజనం ప్రతిపత్తిజ్ఞానం; ప్రతిపత్తిర్నామ -- యో వికారో యథా ప్రతిపత్తవ్యస్తస్య తథాఽ నుష్ఠానజ్ఞానమ్ ॥131॥

అ॥ పరీక్షవలన ప్రతిపత్తిజ్ఞానము కలుగును. ఏవ్యాధియందు ఎట్లు చికిత్సింప వలయునో దాని నట్లు చికిత్సించుట ప్రతిపత్తి యనబడును.

మూ॥ యత్ర తు ఖలు వమనాదీనాం ప్రవృత్తిర్యత్ర చ నివృ త్తిస్తద్వ్యాసతః సిద్ధిషూత్తరకాలముపదేక్ష్యతే సర్వమ్ । ప్రవృత్తి నివృత్తిలక్షణసంయోగే తు ఖలు గురులాఘవం సంప్రధార్య సమ్య గధ్యవస్యేదన్యతరనిష్ఠాయామ్ । సన్తి హి వ్యాధయః శాస్త్రేషూత్స ర్గాపవాదైరుపక్రమం ప్రతినిర్దిష్టాః। తస్మాద్గురులాఘవం సంప్రధార్య సమ్యగధ్యవస్యేదిత్యుక్తమ్ ॥132॥

అ॥ వమనాదులను ఎప్పుడు చేయింపవచ్చునో ఎప్పుడు చేయింపకూడదో ఆవిష యము ముందు సిద్ధిస్థానమునందు వివరించి చెప్పబడగలదు. ప్రవృత్తినివృత్తిలక్షణములు కలిసియున్నప్పుడు వానియొక్క గురులఘుత్వములను తెలిసికొని ఏదియేని ఒకయవ

స్థను బాగుగ నిర్ధారణ చేయవలయును. శాస్త్రములయందు వ్యాధులకు చికిత్స సామాన్యముగను విశేషముగను చెప్పబడినది. అందువలన గురులఘుత్వములను తెలిసికొని బాగుగ నిర్ధారణచేయవలయునని చెప్పబడినది.

**వమనద్రవ్యములు – తత్కల్పనావిషయము.**

మూ॥ యాని తు ఖలు వమనాదిషు భేషజద్రవ్యాణ్యుపయోగం గచ్ఛన్తి తాన్యనువ్యాఖ్యాస్యన్తే; తద్యథా—ఫలజీమూతకేక్ష్వాకుధామార్గవకుటజకృతవేధనఫలాని, ఫలజీమూతకేక్ష్వాకుధామార్గవపత్రపుష్పాణి; ఆరగ్వధవృక్షకమదనస్వాదుకణ్టకపాఠాపాటలాశార్ఙ్గేష్టామూర్వాసప్తపర్ణనక్తమాలపిచుమర్దపటోలసుషవీగుడూచీసోమవల్కచిత్రకద్వీపిశిగ్రుమూలకషాయైశ్చ, మధుమధూకకోవిదారకర్బుదారనీపవిదులబిమ్బీశణపుష్పీసదాపుష్పీప్రత్యక్పుష్పీకషాయైశ్చ, ఏలాహరేణుప్రియఙ్గుపృథ్వీకాకుస్తుమ్బురుతగరనలదహ్రీబేరతాలీసగోపీకషాయైశ్చ, ఇక్షుకాణ్డేక్ష్వ్వక్షువాలికాదర్భపోటగలకాలంకృతకషాయైశ్చ, సుమనాసౌమనస్యాయనీహరిద్రాదారుహరిద్రావృశ్చీరపునర్నవామహాసహాక్షుద్రసహాకషాయైశ్చ, శాల్మలిశాల్మకభద్రపర్ణ్యేలాపర్ణ్యుపోదికోద్దాలకధన్వనరాజాదనోపచితాగోపీశృఙ్గాటికాకషాయైశ్చ, పిప్పలీపిప్పలీమూలచవ్యచిత్రకశృఙ్గవేరసర్షపఫాణితక్షీరక్షారలవణోదకైశ్చ, యథాలాభం యథేష్టం వాఽప్యుపసంస్కృత్య వర్తిక్రియాచూర్ణావలేహస్నేహకషాయమాంసరసయవాగూయూషకామ్బలికక్షీరోపధేయానోన్మదకానన్యాంశ్చ యోగాన్ వివిధాననువిధాయ యథార్హం వమనార్థాయ దద్యాద్విధివద్వమనమితి కల్పసంగ్రహో వమనద్రవ్యాణాం; కల్పస్త్వేషాం విస్తరేణోత్తరకాలముపదేక్ష్యతే॥

అ॥ వమనమునిమిత్తము ఉపయోగించు ద్రవ్యములనుగూర్చి వివరించి చెప్పుచున్నాము. మఱ్ఱింగకాయ, దేవదాళి, చేదుసార, పెద్దచేదుబీర, కొడిసెపాల, చిన చేదుబీర వీనియొక్క విత్తులను; మంగకాయ, దేవదాళి, చేదుసార, పెద్దచేదుబీర వీనియొక్క ఆకులను పువ్వులను; రేల కొడిసెపాల మఱ్ఱింగకాయ పల్లేరు చిరుబొద్ది కలిగొట్టు గురివింద చాగ ఏడాకులఅరటి కానుగ వేప చేదుపొట్ల కాకర తిప్పతీగె తెల్లచంద్ర చిత్రమూలము వాకుడు మునగవేళ్ళు వీనియొక్క కషాయములతోడను, యష్టిమధుకము ఇప్ప ఎఱ్ఱదేవకాంచనము తెల్లదేవకాంచనము కడిమి ప్రబ్బలి దొండ తేలుమణిచెట్టు ప్రత్తి ఉత్తరేణు వీనియొక్క కషాయముల తోడను, ఏలకులు రేణుకలు ప్రేంఖణము పెద్దజీలకర్ర ధనియాలు గ్రంధితగరము

వట్టివేళ్ళు వురువేరు తాలీసపత్రి సుగంధిపాల వీనియొక్క కషాయములతోడను, చెరుకు తెల్లచెరుకు రెల్లు దర్భలు కిక్కసగడ్డి కసివింద వీనియొక్క కషాయములతోడను, జాపత్రి మాలతి పసుపు మ్రానిపసుపు గలిజేరు తెల్లగలిజేరు కారుమినుము కారుపెసర వీనియొక్క కషాయములతోడను, బూరుగు దాసెనచెక్క పెద్దగుమ్మడు సన్నరాస్నము బచ్చలి విరిగి తడచెట్టు పాలచెట్టు దంతి సుగంధిపాల మనుబాల వీనియొక్క కషాయములతోడను, పిప్పళ్ళు మోడి చవ్యము చిత్రమూలము శొంఠి ఆవాలు వీనియొక్క కషాయములతోడను, చెరుకుపాకము పాలు క్షారోదకము లవణోదకము వీనితోడను సంస్కరించి వర్తులు చూర్ణములు లేహములు స్నేహములు కషాయములు మాంసరసములు యవాగులు యూషములు కాంబలికములు పాలు మోదకములు మొదలగు ననేకవిధములైనవానిని తయారుచేసి వమనమును చేయింపతగినవానికి తగువిధముగ నీయవలయును. పూర్వమునందు చెప్పబడిన ద్రవ్యములను లభించునట్లుగగాని యిష్టానుసారముగగాని గ్రహింపవలయును. వమనద్రవ్యములయొక్క కల్పనాసంగ్రహ మీవిధముగ చెప్పబడినది. వీనియొక్క కల్పనలను విస్తరించి ముందు చెప్పగలము.

## విరేచనద్రవ్యములు-తత్కల్పనావిషయము.

మూ॥ విరేచనద్రవ్యాణి తు-శ్యామాత్రివృచ్చతురఙ్గులతిల్వకమహావృక్షసప్తలాశఙ్ఖినీదన్తీద్రవన్తీనాం క్షీరమూలత్వక్పత్రపుష్పఫలాని యథాయోగం తైస్తైః క్షీరమూలత్వక్పత్రపుష్పఫలైర్వికల్పైర్విక్లిప్తైరజగన్ధాశ్వగన్ధాజశృఙ్గీక్షీరిణీనీలినీక్లీతకకషాయైశ్చ, ప్రకీర్యోదకీర్యామసూరవిదలాకమ్పిల్లకవిడఙ్గగవాక్షీకషాయైశ్చ, పీలుప్రియాలమృద్వీకాకాశ్మర్యపరూషకబదరదాడిమామలకహరీతకీ విభీతకవృశ్చీరపునర్నవావిదారిగన్ధాదికషాయైశ్చ, శీధుసురాసౌవీరకతుషోదకమైరేయమేదకమదిరామధుమధూలకధాన్యామ్లకువలబదరఖర్జూరకర్కన్ధుశీధుభిశ్చ,దధిదధిమణ్డోదశ్విద్భిశ్చ, గోమహిష్యజావీనాం చ క్షీరమూత్రైర్యథాలాభం యథేష్టం వాఽప్యుపసంస్కృత్య వర్తిక్రియాచూర్ణాసవలేహస్నేహకషాయమాంసరసయూషకామ్బలికయవాగూక్షీరోపధేయాన్మోదకానన్యాంశ్చ భక్ష్యప్రకారాన్వివిధాంశ్చ యోగాననువిధాయయథార్హంవిరేచనార్హాయ దద్యాద్విరేచనమితికల్పసంగ్రహో విరేచనద్రవ్యాణాం;కల్పస్త్వేషాం విస్తరేణ యథావదుత్తరకాలముపదేక్ష్యతే॥134॥

అ॥ విరేచనద్రవ్యములను చెప్పుచున్నాము. నల్లతెగడ తెల్లతెగడ రేల లొద్దుగ జెముడు సంబరేణు ఈశ్వరి దంతి పెద్దదంతి వీనియొక్క పాలు వేళ్ళు పట్టలు ఆకులు

పువ్వులు కాయలు వీనిని ఆయా పాలు వేళ్ళు పట్టలు ఆకులు పువ్వులు కాయలు వీనితో తగువిధమున సంయోగము చేసిగాని సంయోగము చేయకగాని గ్రహించి అజామోదము పెన్నేరు దుష్టపు పాలగుమ్మడి నీలి యష్టిమధుకము వీనియొక్క కషాయములతోడను, ములుగ్రానుగ కానుగ నల్లతెగడ కంపిల్లకము వాయువిడంగములు భరణిక వీనియొక్క కషాయములతోడను, కొండగోగు సార ద్రాక్ష పెగ్గుమ్ముడు చిట్టీత రేగు దానిమ్మ ఉసిరిక కరక్కాయ తానిక్కాయ గలిజేరు తెల్లగలిజేరు విదారి గంధాదిగణము వీనియొక్క కషాయములతోడను శీధువు సుర సౌవీరకము తుషోదకము మైరేయము మేదకము మదిర తేనె మద్యము ధాన్యామ్లము వీనితోడను పెదరేగు చినరేగు ఖర్జూరపుకాయలు పులరేగు వీనితో తయారుకాబడిన శీధువులతోడను పెరుగు పెరుగుమీదితేట మజ్జిగ వీనితోడను ఆవు గేదె మేక గొఱ్ఱె వీనియొక్క పాలు మూత్రము వీనితోడను సంస్కరించి వర్తులు చూర్ణములు ఆసవములు లేహములు స్నేహములు కషాయములు మాంసరసములు యూషములు కాంబలికములు యవాగువులు పాలు మోదకములు మొదలగు అనేకవిధములైన భక్ష్యవిశేషములను తయారుచేసి విరేచనము చేయింపతగినవానికి తగువిధమున ఈయవలయును. పూర్వమునందు చెప్పబడిన ద్రవ్యములను లభించునట్లుగగాని ఇష్టానుసారముగగాని గ్రహింపవలయును. విరేచనద్రవ్యములయొక్క కల్పనాసంగ్రహ మీవిధముగ చెప్పబడినది. వీనియొక్క కల్పనలను విస్తరించి ముందు చెప్పగలము.

ఆస్థాపనవస్తికల్పనావిషయము.

మూ॥ ఆస్థాపనేషు తు భూయిష్ఠకల్పాని ద్రవ్యాణి యాని యోగముపయాన్తి తేషు తేష్వవస్థాన్తరేష్వాతురాణాం తాని ద్రవ్యాణి నామతో విస్తరేణోపదిశ్యమానాన్యపరిసంఖ్యేయాని స్యురతిబహుత్వాత్, ఇష్టశ్చానతిసంక్షేపవిస్తరోపదేశస్తన్త్రే, ఇష్టం చ కేవలం జ్ఞానం, తస్మాద్రసత ఏవ తాన్యనువ్యాఖ్యాస్యన్తే। రససంసర్గవికల్పవిస్తరో హ్యేషామపరిసంఖ్యేయః, సమవేతానాం రసానామంశాంశబలవికల్పాతిబహుత్వాత్ । తస్మాద్ద్రవ్యాణాం చైకదేశముదాహరణార్థం రసేష్వనువిభజ్య రసైకైకత్వేన రసైకైవల్యేన చ నామలక్షణార్థం షడాస్థాపనస్కన్ధాన్ రససమాహారతోఽనువిభజ్య వ్యాఖ్యాస్యన్తే। యత్ షడ్విధమాస్థాపనమేకరసమిత్యాచక్షతే భిషజస్తద్దుర్లభతరం, సంసృష్టరసభూయిష్ఠత్వాద్ద్రవ్యాణామ్। తస్మాన్మధురాణి చ మధురప్రాయాణి చ మధురవిపాకాని చ మధురప్రభావాణి చ మధురస్కన్ధే మధురాణ్యేవ కృత్వోపదేక్ష్యన్తే థేతతరాణి ద్రవ్యాణ్యపి॥

అ॥ రోగియొక్క ఆయా అవస్థలనుబట్టి ఆస్థాపనవస్తులయందు ఉపయోగింపబడునట్టియు అనేకవిధములగు కల్పములు కలిగినట్టియు ఏద్రవ్యములు కలవో అవి

అత్యధికములుగ నుండుటవలన పేరునుబట్టి విభజించినచో అసంఖ్యేయములుగ నగును. శాస్త్రమునందు చెప్పబడు విషయములు అతిసంగ్రహముగ గాని అతివిపులముగ గాని యుండక సంపూర్ణజ్ఞానమును కలిగించునవిగ నుండవలయును. అందువలన అట్టిద్రవ్యములు రసమునుబట్టి చెప్పబడుచున్నవి. కలసియుండి రసములయొక్క అంశాంశబల సంబంధమగు వికల్పములు అత్యధికముగ నుండును. అట్టి సంసర్గరసములయొక్క వికల్పములనుబట్టి రసములు అసంఖ్యేయములుగ నుండును. అందువలన కొన్నిద్రవ్యములను మాత్రము రసములనుబట్టి విభజించి ప్రత్యేకరసములచే నామములను కల్పించి ఆరు విధములగు ఆస్థాపనస్కంధములు చెప్పబడుచున్నవి. వీనినిబట్టి సంసర్గములనుకూడ కల్పించుకొనవచ్చును. ఆస్థాపనవస్తువులు ఒక్కొక్కరసము ననుసరించి ఆరువిధములుగ నుండునని వైద్యులు చెప్పుచున్నారు. కాని సంసర్గరసములుగల ద్రవ్యములు అనేకములుండుటవలన అట్లుచెప్పుట సరియైనదికాదు. మధురరసము కలిగినట్టియు మధురరసప్రధానమైనట్టియు మధురవిపాకము కలిగినట్టియు మధురరసముయొక్క శక్తికలిగినట్టియు ద్రవ్యములను మధురరస ద్రవ్యములనుగ నెంచి మధురస్కంధము నందు చెప్పుచున్నాము. ఇటులనే ఇతరద్రవ్యములుకూడ వివరింపబడును.

### మధురస్కంధము-దానినుపయోగించువిధము.

మూ॥ తద్యథా—జీవకర్షభకౌ జీవన్తీవీరాతామలకీకాకోలీక్షీరకాకోల్యభీరుముద్గపర్ణీమాషపర్ణీశాలపర్ణీపృశ్నిపర్ణ్యసనపర్ణీమేదామహామేదాకర్కటశృఙ్గీశృఙ్గాటికాఛిన్నరుహాఛత్రాతిచ్ఛత్రాశ్రావణీమహాశ్రావణ్యలమ్బుషాసహదేవావిశ్వదేవాశుక్లాక్షీరశుక్లాబలాతిబలావిదారీక్షీరవిదారీక్షుద్రసహామహాసహర్ష్యగన్ధాశ్వగన్ధాపయస్యావృశ్చీరపునర్నవాబృహతీకణ్టకారికైరణ్డమోరటశ్వదంష్ట్రాసంహర్షాశతావరీశతపుష్పామధూకపుష్పీయష్టిమధుమధూలికామృద్వీకాఖర్జూరపరూషకాత్మగుప్తాపుష్కరబీజకశేరుకారాజకశేరుకారాజాదనకతకనకాశ్మర్యశీతపాక్యోదనపాకీతాలఖర్జూరమస్తకేక్ష్వేక్షువాలికాదర్భకుశకాశశాలిగున్ద్రేత్కటకశరమూలరాజక్షవకర్ష్యప్రోక్తాద్వారదాభారద్వాజీవనత్రపుష్యాభీరుపత్రీహంసపదీకాకనాసాకులిఙ్గక్షీరవల్లీకపోతవల్లీగోపవల్లీమధువల్యః సోమవల్లీ చేతి; ఏషామేవంవిధానామన్యేషాం చ మధురవర్గపరిసంఖ్యాతానామౌషధద్రవ్యాణాం ఛేద్యాని ఖణ్డశశ్ఛేదయిత్వా భేద్యాని చాణుశో భేదయిత్వా ప్రక్షాల్య పానీయేన సుప్రక్షాలితాయాం స్థాల్యాం సమవాప్య పయసాఽర్ధోదకేనాభ్యాసిచ్యాసిచ్య సాధయేద్దర్వ్యా సతతమవఘట్టయన్, తదుపయుక్తభూయిష్ఠేఽమ్బుని గతరసేష్వౌషధేషు పయసి చానుపదగ్ధే స్థాలీముపహృత్య సుపరిపూతంపయః సుఖో

ష్ణం ఘృతతైలవసామజ్జలవణఫాణితోపహితం వస్తిం వాతవికారిణే విధిజ్ఞో విధివద్దద్యాత్, శీతం తు మధుసర్పిర్భ్యాముపసంసృజ్యాపి త్తవికారిణే విధివద్దద్యాదితి మధురస్కన్ధః॥ 136॥

అ॥ జీవకము ఋషభకము పాలకూర నేలతాడి నేలఉసిరిక కాకోళి క్షీరకాకోళి పిల్లిపీచర కారుపెసర కారుమినుము ముయ్యాకుపొన్న కోలపొన్న సోమెంద మేద మహామేద కర్కాటకశృంగి మనుబాల తిప్పతీగె గొలిమిడి ఎర్రగొలిమిడి బోడతరము పెద్దబోడతరము మంజిష్ఠ సహదేవి ఎర్రసహదేవి గుమ్మడు పాలగుమ్ముడు ముత్తవపులగము పెద్దపుత్తవపులగము నేలగుమ్ముడు పాలనేలగుమ్ముడు కలుబంద గోరింట వృద్ధదారు పెన్నేరు పిన్నపాల గలజేరు తెల్లగలిజేరు పెద్దవాకుడు వాకుడు ఆముదపుచెట్టు చాగ పల్లేరు బదనిక పెద్దపిల్లిపీచర సదాప నీటియష్టిమధుకము యష్టిమధుకము నల్లద్రాక్ష తెల్లద్రాక్ష ఖర్జూరము చిట్టిత దూలగొండి మెట్టతామర నమ్మదుంప పెద్దనమ్మదుంప పాలచెట్టు చిల్లగింజ పెగ్గుమ్ముడు గురివింద నల్లపువ్వులగోరింట తాడి పెద్దఖర్జూరము చెరుకు రెల్లు దర్భలు కుశదర్భలు తిప్పరిల్లు కిక్కసగడ్డి పెద్దరెల్లు ఇత్కటమనెడి రెల్లు కాకిరెల్లు చిలకకూర తెల్లముత్తవపులగము శేకు అడవిప్రత్తి అడవిదోస పిల్లిపీచరభేదము హంసపాది కాకిదొండ నీరుల్లి క్షీరకాకోళిభేదము సన్నఏలకులు సుగంధిపాల అతిమధురభేదము సోమలత వీనిని, మధురవర్గములోచేరు ఇట్టి ఇతరద్రవ్యములను గ్రహించి నరకతగినవానిని ముక్కలుగ నరికి బ్రద్దలుకొట్టతగిన వానిని చిన్నచిన్నముక్కలుగ బ్రద్దలుకొట్టి నీటితో కడిగి బాగుగ కడగబడిన పాత్రయందుంచి సగము నీళ్ళుకలిసిన పాలనుపోసి గరిటెతో బాగుగ కలియత్రిప్పుచు కాచవలయును. నీళ్ళు అనుకూలముగ ఇగిరి ద్రవ్యములయొక్క రసము బాగుగ సంక్రమించి పాలు ఇగరకుండగ నున్నప్పుడు ఆ పాత్రను దింపి బాగుగ వడియగట్టి గోరువెచ్చగ నున్న ఆ పాలయందు ఘృతము తైలము వస మజ్జ సైంధవలవణము చెరుకుపాకము వీనిని కలిపి దానితో వాతవ్యాధికలవానికి వస్తిని విధిప్రకారముగ చేయింపవలయును. చల్లారిన ఆ పాలయందు తేనెను నేతిని కలిపి దానితో పిత్తవ్యాధికలవానికి విధిప్రకారముగ వస్తిని చేయింపవలయును. మధురస్కంధము ఇట్లు చెప్పబడినది.

### అమ్లస్కంధము:-దానినుపయోగించువిధము.

మూ॥ ఆమ్రామ్రాతకలకుచకరమర్దవృక్షామ్లామ్లవేతసకువలబదరదాడిమమాతులుఙ్గగణ్డీరామలకనన్దీతకశీతకతిన్తిడీకదన్తశఠైరావతకకోషామ్రధన్వనానాం ఫలాని, పత్రాణిచామ్రాతకాశ్మన్తకచాఙ్గేరీణాం చతుర్విధానాం చామ్లికానాం ద్వయోః కోలయోశ్చామశుష్కయోర్ద్వయోశ్చ శుష్కామ్లికయోర్గ్రామ్యారణ్యయోః, ఆసవద్రవ్యాణి చ సురాసౌవీరతుషోదకమైరేయమేదకమదిరామధుశీధుశుక్తదధిమణ్డోదశ్విద్ధాన్యామ్లాదీని చ; ఏషామేవంవిధానాం చాన్యేషాం చామ్ల

వర్గపరిసంఖ్యాతానామౌషధద్రవ్యాణాంఛేద్యాని ఖణ్డశశ్ఛేదయిత్వా భేద్యాని చాణుశో భేదయిత్వా ద్రవైః స్థిరాణ్యవసిచ్య సాధయిత్వోపసంస్కృత్య యథార్హం తైలవసామధుమజ్జలవణఫాణితోపహితం సుఖోష్ణం వస్తిం వాతవికారిణేవిధిజ్ఞో విధివద్దద్యాదిత్యమ్లస్కన్ధః ॥137॥

అ॥ మామిడి రాచమామిడి నిమ్మ ఓక పుల్లపావిలి పుల్లప్రబ్బలి చిన్నరేగు పెద్దరేగు దానిమ్మ మాదీఫలము గురిజకూర ఉసిరిక నందీతకము చింత వెలగ నారింజ పుల్లమామిడి తడచెట్టు వీనియొక్క కాయలను, రాచమామిడి అమ్లవాస్తుకము పులిచింత నాలుగువిధములగు అమ్లశాకములు వీనియొక్క ఆకులను, రెండువిధములగు రేగులయొక్క పచ్చియాకులను ఎండాకులను, చింత అడవిచింత వీనియొక్క ఎండాకులను, సుర సౌవీరకము తుషోదకము మైరేయము మేదకము మదిర మధుశుక్తము శీధువు పెరుగు పెరుగుమీదితేట మజ్జిగ ధాన్యామ్లము మొదలగు ఆసవద్రవ్యములను, అమ్లవర్గములోచేరు ఇట్టి ఇతరద్రవ్యములను గ్రహించి వానిలో నరకతగినవానిని ముక్కలుగ నరికియు బ్రద్దలుకొట్టతగినవానిని చిన్నచిన్నముక్కలుగ బ్రద్దలుకొట్టియు గట్టిగనుండు వానిని ద్రవ్యములతో తడిపియు కాచి తయారుచేసి అందు తైలము వస తేనె మజ్జ లవణము చెరుకుపాకము వీనిని తగినట్లు చేర్చి గోరువెచ్చగనున్నప్పుడు వాతవ్యాధికలవానికి వస్తికర్మనిమిత్తము విధిప్రకారముగ నుపయోగింపవలయును. అమ్లస్కంధము ఇట్లు చెప్పబడినది.

## లవణస్కంధము-దానినుపయోగించువిధము.

మూ॥ సైన్ధవసౌవర్చలకాలబిడపాక్యానూపకూప్యబాలకైలమూలకసాముద్రరోమకోద్భిదౌషరపాటేయకపాంశుజానీత్యేవం ప్రకారాణి చాన్యాని లవణవర్గపరిసంఖ్యాతాని, ఏతాన్యమ్లోపహితాన్యుష్ణోదకోపహితాని వా స్నేహవన్తి సుఖోష్ణం వస్తిం వాతవికారిణే విధిజ్ఞో విధివద్దద్యాదితి లవణస్కన్ధః ॥138॥

అ॥ సైంధవము సౌవర్చలము కృష్ణము బిడము పాక్యము ఆనూపము కూప్యము బాలకను. ఐలము మాలకము సాముద్రము రోమకము ఔద్భిదము ఔషరము పాటేయకము పాంశుజము అనెడి లవణములను లవణవర్గములోచేరు ఇట్టి ఇతరలవణములను గ్రహించి అమ్లద్రవమునందుగాని ఉష్ణోదకమునందుగాని కలిపి యందు చమురునుకలిపి గోరువెచ్చగనున్నపుడు దానితో వాతవ్యాధికలవారికి తగువిధమున వస్తిని చేయింపవలయును. లవణస్కంధము ఇట్లు చెప్పబడినది.

## కటుకస్కంధము-దానినుపయోగించువిధము.

మూ॥ పిప్పలీపిపలీమూలహస్తిపిప్పలీచవ్యచిత్రకశృఙ్గవేరమరిచాజమోదార్ద్రకవిడఙ్గకుస్తుమ్బురుపీలుతేజోవత్యేలాకుష్ఠభల్లాతకాస్థి

హిఙ్గుకిలిమమూలకసర్షపలశునకరఞ్జశిగ్రుకమధురశిగ్రుకఖరపుష్పాభూస్తృణసుముఖసురసకుతేరకార్జకగణ్డీరకాల మాలకపర్ణాసక్షవకఫణిజ్జకక్షారమూత్రపిత్తానామేవంవిధానాం చాన్యేషాం కటుకవర్గపరిసంఖ్యాతానామౌషధద్రవ్యాణాం ఛేద్యాని ఖణ్డశశ్ఛేదయిత్వా భేద్యాని చాణుశో దయిత్వా గోమూత్రేణ సహ సాధయిత్వోపసంస్కృత్య యథావన్మధుతైలలవణోపహితం సుఖోష్ణం వస్తిం శ్లేష్మవికారిణే విధిజ్ఞోవిధివద్దద్యాదితి కటుకస్కన్ధః ॥139॥

అ॥ పిప్పళ్ళు మోడి గజపిప్పళ్ళు చవ్యము చిత్రమూలము శొంఠి మిరియాలు అజామోదము అల్లము వాయువిడంగములు ధనియాలు కొండగోగు వెక్కుడు ఏలకులు చెంగల్వకోష్ఠు జీడిగింజలు ఇంగువ దేవదారు ముల్లంగి ఆవాలు వెల్లుల్లి కానుగు మునగ తెల్లమునగ కారుతులసి బోదకసవు ఎర్రావాలు తులసి తెల్లగగ్గెర కారుతులసిభేదము కాకర నల్లగగ్గెర గగ్గెర నల్లావాలు మరువము క్షారములు మూత్రములు పిత్తద్రవములు వీనిని, కటుకవర్గములోచేరు ఇట్టి ఇతరద్రవ్యములను గ్రహించి నరకతగినవానిని ముక్కలుగ నరికి బ్రద్దలుకొట్టతగినవానిని చిన్నచిన్నముక్కలుగ బ్రద్దలుకొట్టి గోమూత్రముతో కాచి తయారుచేసి అందు తేనె తైలము సైంధవలవణము వీనిని తగురీతిగ కలిపి గోరువెచ్చగనున్నపుడు శ్లేష్మవ్యాధికలవానికి వస్తికర్మనిమిత్తము విధిప్రకారముగ నుపయోగింపవలయును.

## తిక్తస్కంధము—దానినుపయోగించువిధము.

మూ॥ చన్దననలదకృతమాలనక్తమాలనిమ్బతుమ్బురుకుటజహరిద్రాదారుహరిద్రాముస్తమూర్వాకిరాతతిక్తకటురోహిణీత్రాయమాణాకారవేల్లికాకరవీరకేబుకకఠిల్లకవృషమణ్డూకపర్ణీకర్కోటకవార్తాకుకర్కశకాకమాచీకాకోదుమ్బరికాసుషవ్యతివిషాపటోలకులకపాఠాగుడూచీవేత్రాగ్రవేతసవికఙ్కతవకులసోమవల్కసప్తపర్ణసుమనార్కావల్గుజవచాతగరాగురుబాలకోశీరాణామేవంవిధానాంచాన్యేషాంతిక్తవర్గపరిసంఖ్యాతానామౌషధద్రవ్యాణాంఛేద్యానిఖణ్డశశ్ఛేదయిత్వా భేద్యాని చాణుశో భేదయిత్వా ప్రక్షాళ్య పానీయేనాభ్యాసిచ్య సాధయిత్వోపసంస్కృత్య యథావన్మధుతైలలవణోపహితం సుఖోష్ణం వస్తిం శ్లేష్మవికారిణే విధిజ్ఞోవిధివద్దద్యాత్ ;శీతం తు మధుసర్పిర్భ్యాముపసంసృజ్యపిత్తవికారిణే విధిజ్ఞోవిధివద్దద్యాదితి తిక్తస్కన్ధః ॥140॥

అ॥ చందనము వట్టివేళ్ళు రేల పెద్దకానుగు వేపతుంబుర్లు కొడిసెపాల పసుపు మ్రానిపసుపు తుంగగడ్డలు చాగ నేలవేము కటుకరోహిణి కలుత్రాసుగు కాకర

గన్నేరు కోవిదుంప పెద్దకాకర అడ్డరసము మండూకబ్రహ్మి చేదుదోస వంగ పొట్ల కామంచి మేడి పొట్టికాకర అతివస చేదపొట్లభేదము చిరుబొద్ది తిప్పతీగె వేము ప్రబ్బలి కాంద్రేగు పొగడ వెలిచంద్ర ఏడాకుల అరటి మాలతి జిల్లేడు బావంచి వస గ్రంధితగరము కృష్ణాగరు కురువేరు నల్లవట్టివేళ్ళు వీనిని, తిక్తవర్గములోచేరు ఇట్టి ఇతర ద్రవ్యములను గ్రహించి నరకతగినవానిని ముక్కలుగనరికి బ్రద్దలుకొట్టతగిన వానిని చిన్నచిన్న ముక్కలుగ బ్రద్దలుకొట్టి నీటితో కడిగి నీళ్ళుపోసి కాచి తయారుచేసి గోరువెచ్చగనున్నపుడు అందు తేనె తైలము సైంధవలవణము వీనిని తగురీతిని చేర్చి దానితో శ్లేష్మవ్యాధికలవానికి వస్తిని విధిప్రకారముగ చేయింపవలయును. చల్లారిన పిదప తేనెను నేతిని కలిపి దానితో పిత్తవ్యాధికలవానికి విధిప్రకారముగ వస్తిని చేయింపవలయును. తిక్తస్కంధము ఇట్లు చెప్పబడినది.

### కషాయస్కంధము-దానినుపయోగించువిధము.

మూ॥ ప్రియఙ్గ్వనన్తామ్రాస్థ్యమ్బష్ఠకీకట్వఙ్గలోధ్రమోచరసస మఙ్గాధాతకీపుష్పపద్మాపద్మకేశరజమ్బ్వామ్రప్లక్షవటకపీతనోదుమ్బ రాశ్వత్థభల్లాతకాశ్మన్తకశిరీష శింశుపాసోమవల్కతిన్దుకప్రియాలబదరఖ దిరస ప్తపర్ణాశ్వకర్ణస్యన్దనార్జునాసనారిమేదైలవాలుకపరిపేలవకదమ్బశ ల్లకీజిఙ్గినీకాశక శేరుకాకట్ఫలవంశపద్మకాశోకశాల ధవసర్జభూర్జశణపు ష్పీ శమీమాచీకతుఙ్గాజక ర్ణాశ్వకర్ణస్ఫూర్జకవిభీతక పుష్కరబీజబిస మృణాలతాలఖర్జూరతరూణామేవంవిధానాం చాన్యేషాం కషాయవర్గ పరిసంఖ్యాతానామౌషధద్రవ్యాణాం ఛేద్యాని ఖణ్డశశ్ఛేదయిత్వా భేద్యాని చాణుశో భేదయిత్వా ప్రక్షాళ్య పానీయేన సహ సాధయి త్వోపసంస్కృత్య యథావన్మధుతైలలవణోపహితం సుఖోష్ణం వస్తిం శ్లేష్మవికారిణే విధిజ్ఞో విధివద్దద్యాత్; శీతం తు మధుసర్పిర్భ్యాముప సంసృజ్య పిత్తవికారిణే దద్యాదితి కషాయస్కన్ధః ॥141॥

ఆ॥ ప్రేంఖణము సుగంధిపాల మామిడిపప్పు చిరుబొద్ది తుమికి లొద్దుగ బూరుగ బంక మంజిష్ఠి ఆరెపువ్వు పద్మము పద్మకింజల్కములు నేరేడు మామిడి జువ్వి మఱ్ఱి పోక మేడి రావి జీడి విరిగి దిరిసెన ఇరుగుడు వెలిచంద్ర ఈడ సార రేగుచంద్ర ఏపి తెల్లమద్ది నెమ్మి మద్ది వేగిస తుమ్మ కూతురుబుడమ తుంగముస్తలు కడిమిఅందుగు గిలిగి రింత రెల్లు నాగరముస్తలు పెద్దనాగరముస్తలు పెగ్గుమ్ముడు వెదురు పద్మకాష్ఠము అశోకము చిరుపనస ధవవృక్షము సర్జవృక్షము భుజపత్రవృక్షము జనుము జమ్మి దేవదారు వరగలు చిన్నజమ్మి పెద్దఏపి పెదమాను తానిచెట్టు పొన్న పుష్కరమూలము తామరదుంప తామరతూండ్లు తాడిచెట్టు ఖర్జూరము వీనిని, కషాయవర్గములోచేరు ఇట్టి ఇతరద్రవ్యములను గ్రహించి నరకతగినవానిని ముక్కలుగనరికి బ్రద్దలుకొట్టతగిన

వానిని చిన్నచిన్నముక్కలుగ బ్రద్దలుకొట్టి నీటితో కడిగి నీళ్ళుపోసి కాచి తయారు చేసి గోరువెచ్చగనున్నపుడు అందు తేనె తైలము సైంధవలవణము వీనిని తగురీతిని చేర్చి దానితో శ్లేష్మవ్యాధికలవానికి వస్తిని విధిప్రకారముగ చేయింపవలయును. చల్లారినపిదప తేనెను నేతిని కలిపి దానితో పిత్తవ్యాధికలవానికి విధిప్రకారముగ వస్తిని చేయింపవలయును. కషాయస్కంధము ఇట్లు చెప్పబడినది.

మూ॥ షడ్వర్గాః పరిసంఖ్యాతా యఏతేరసభేదతః। ఆస్థాపనమభిప్రేత్యతాన్విద్యాత్సార్వయౌగికాన్॥ సర్వతోహి ప్రణిహితాః సర్వరోగేషు జానతా।సర్వాన్ రోగాన్నియచ్ఛన్తియేభ్య ఆస్థాపనంహితమ్॥ యేషాం యేషాం ప్రశాన్త్యర్థం యే యే న పరికీర్తితాః। ద్రవ్యవర్గా వికారాణాం తేషాం తే పరికోపనాః ॥144॥

అ॥ ఆస్థాపనవస్తినుద్దేశించి రసభేదములనుబట్టి చెప్పబడిన ఆరువిధములగు స్కంధములు సమస్తరోగములయందును ఉపయోగించునని తెలిసికొనవలయును. ఆస్థాపనవస్తి కర్మను చేయింపతగినవారికి బుద్ధిమంతుడగువానిచే సరిగ ప్రయోగింపబడి సమస్త రోగములను పోగొట్టును. ఏద్రవ్యస్కంధములో ఏదోషములను శమింపజేయునని చెప్పబడలేదో ఆ ద్రవ్యస్కంధములను వృద్ధినొందించును.

మూ॥ ఇత్యేతేషడాస్థాపనస్కన్ధా రసతోఽనువిభజ్య వ్యాఖ్యాతాః। తేభ్యో భిషగ్బుద్ధిమాన్పరిసంఖ్యాతమపి యద్యద్ద్రవ్యమయౌగికం మన్యేత తత్తదపకర్షయేత్, యద్యచ్చానుక్తమపి యౌగికం వా మన్యేత తత్తద్దద్యాత్, వర్గమపి వర్గేణోపసంసృజేదేకమేనానేకేన వా యుక్తిం ప్రమాణీకృత్య। ప్రచరణమివ భిక్షుకస్య బీజమివ కర్షకస్య సూత్రం బుద్ధిమతామల్పమప్యనల్పజ్ఞానాయతనం భవతి; తస్మాద్బుద్ధిమతామూహాపోహవితర్కాః॥, మన్దబుద్ధేస్తు యథోక్తానుగమనమేవ శ్రేయః; యథోక్తం హి మార్గమనుగచ్ఛన్ భిషక్ సంసాధయతి వా కార్యమనతిమహత్త్వాద్వా నిపాతయత్యనతిహ్రస్వత్వాదుదాహరణస్యేతి॥145॥

అ॥ ఇట్లు ఆరువిధములగు ఆస్థాపనస్కంధములు రసమునుబట్టి విభజించి చెప్పబడినవి. బుద్ధిమంతుడగు వైద్యుఁడు ఈ స్కంధములయందు చెప్పబడినదైనను ఏద్రవ్యమును తగనిదనితలచునో దానిని విడిచిపెట్టవలయును. చెప్పబడకున్నను ఏద్రవ్యమును తగినదని తలచునో దానిని గ్రహింపవచ్చును. యుక్తిననుసరించి ఒకవర్గమును మరియొక వర్గముతోగాని అనేకవర్గములతోగాని కలుపవచ్చును. బిచ్చగానికి పిడికిలిపరిమాణమగు ధాన్యమును, కర్షకునకు స్వల్పమగు విత్తనమును ఎట్లు అధికఫలమును కలిగించునో

అట్లే బుద్ధిమంతులకు అల్పమైనసూత్రముకూడ జ్ఞానాభివృద్ధిని కలిగించును. అందువలన బుద్ధిమంతులకు ఊహాపోహాలును, విమర్శనాశక్తియు కలుగును. మందబుద్ధికలవారు, చెప్పబడిన విషయమును అనుసరించుటయే శ్రేయస్కరముగ నుండును. వైద్యుడు శాస్త్రమునందు చెప్పబడిన పద్ధతిని అనుసరించినప్పుడు అట్టిపద్ధతులు శాస్త్రమునందు విపులముగ చెప్పబడియున్నచో కార్యమును సాధింపకలుగును. విపులముగ చెప్పబడకున్నచో సాధింపలేడు.

## అనువాసనవస్తికల్పనావిషయము.

మూ॥ అతః పరమనువాసనద్రవ్యాణ్యనువ్యాఖ్యాస్యన్తే-అనువాసనం తు స్నేహ ఏవ। స్నేహస్తు ద్వివిధః—స్థావరో జఙ్గమాత్మకశ్చ। తత్రస్థావరాత్మకః స్నేహస్తైలమతైలం చ।తద్ద్వయం తైలమేవ కృత్వోపదిశ్యతే, సర్వతస్తైలప్రాధాన్యాత్। జఙ్గమాత్మకస్తు-వసా, మజ్జా, సర్పిరితి॥ తేషాం తు తైలవసామజ్జసర్పిషాం తు యథోపూర్వం శ్రేష్ఠం వాతశ్లేష్మవికారేష్వనువాసనీయేషు, యథోత్తరం పిత్తవికారేషు. సర్వఏవవా సర్వవికారేష్వపి చ యోగమాయాన్తిసంస్కార విశేషాదితి ॥147॥

అ॥ పిమ్మట అనువాసనవస్తికి ఉపయోగించు ద్రవ్యములు చెప్పబడుచున్నవి. అనువాసనవస్తి స్నేహప్రధానముగ నుండును. స్నేహము స్థావరాత్మకమనియు జంగమాత్మకమనియు రెండువిధములుగ నుండును. అందు స్థావరాత్మకమైనస్నేహము తిలసంబంధమైనదనియు ఇతరసంబంధమైనదనియు రెండువిధములుగ నుండును. తిలసంబంధమైనది తరుచు ప్రధానముగనుండునుగావున స్థావరాత్మక తైలములకన్నిటికిని తైలశబ్దమును ప్రధానముగజేసి చెప్పెదము. వస మజ్జ ఘృతము అని జంగమాత్మక స్నేహము మూడువిధములుగ నుండును. తైలము వస మజ్జ ఘృతము ఇవి అనువాసనము నిమిత్తము వాతశ్లేష్మవ్యాధులయందు యథాపూర్వముగను, పిత్తవ్యాధులయందు యథోత్తరముగను ఒకదానికంటె నొకటి శ్రేష్ఠములుగ నుండును. సమస్తస్నేహములను సంస్కారవిశేషములవలన సమస్తవ్యాధులయందును అనువాసనమునిమిత్త ముపయోగింపవచ్చును.

## శిరోవిరేచనద్రవ్యములు.

మూ॥శిరోవిరేచనద్రవ్యాణిపునరపామార్గపిప్పలీమరిచవిడఙ్గశిగ్రుశిరీషకుస్తుమ్బురుపిల్వాజాజ్యజమోదావార్తాకీపృథ్వీకైలాహరేణుకాఫలాని చ; సుముఖసురసకుఠేరకగణ్డీరకకాలమాలకపర్ణాసక్షవకఫణిజ్ఝకహరిద్రాశృఙ్గవేరమూలకలశునతర్కారీసర్షపపత్రాణి చ. అర్కాలర్కకుష్ఠనాగదన్తీవచాభార్గీశ్వేతాజ్యోతిష్మతీగవాక్షీగణ్డీరపుష్పీ

వృశ్చికాలీవయస్థాతివిషామూలాని చ, హరిద్రాశృఙ్గవేరమూలకలశున కన్దాశ్చ, లోధ్రమదనసప్తపర్ణనిమ్బార్కపుష్పాణిచ, దేవదార్వగురు సరలశల్లకీజిఙ్గిన్యసనహిఙ్గు నిర్యాసాశ్చ, తేజోవతీవరాఙ్గేఙ్గుదీశోభాఞ్జన బృహతీకణ్టకారికాత్వచః; ఇతిశిరోవిరేచనంసప్తవిధం ఫలపత్రమూల కన్దపుష్పనిర్యాసత్వగాశ్రయభేదాత్ ; లవణకటుతిక్తకషాయాణి చేన్ద్రియోపశయాని తథాఽపరాణ్యనుక్తాన్యపి ద్రవ్యాణి యథా యోగవిహితాని శిరోవిరేచనార్థముపదిశ్యన్త ఇతి॥148॥

అ॥ శిరోవిరేచనద్రవ్యములను చెప్పుచున్నాము. ఉత్తరేణు పిప్పళ్ళు మిరియాలు వాయువిడంగములు మునగ దిరిసెన తుంబుర్లు వరగోగు జీలకర్ర వాము వంగ పెద్దజీలకర్ర ఏలకులు రేణుకలు వీనియొక్క గింజలును, ఎర్రావాలు తులసి తెల్లగగ్గెర కాకర నల్లగగ్గెర గగ్గెర నల్లావాలు మరువము పసుపు అల్లము ముల్లంగి వెల్లుల్లి సోవింద ఆవాలు వీనియొక్క ఆకులును, జిల్లేడు తెల్లజిల్లేడు చెంగల్వకోష్టు వస తెల్లగురివింద జ్యోతిష్మతి భరిణిక కాకర బ్రహ్మదండి తేలుమణిచెట్టు సరస్వతి అతివస వీనియొక్క వేళ్ళును, పసుపు అల్లము ముల్లంగి వెల్లుల్లి వీనియొక్క దుంపలును, లొద్దుగ బ్రంగ ఏడాకులఅరటి వేప జిల్లేడు వీనియొక్క పుష్పములును, దేవదారు అగరు సరళదేవ దారు అందుగు నల్లబూరుగ వేగిస ఇంగువచెట్టు వీనియొక్క జిగురులును, వెక్కుడు తీగె లవంగపుతీగె గారచెట్టు మునగ పెద్దవాకుడు వాకుడు వీనియొక్క పట్టలును శిరోవిరేచనద్రవ్యములుగ నుండును. ఇట్లు ఇవి, గింజలు ఆకులు వేళ్ళు దుంపలు పుష్పములు జిగురు పట్టలు వీనియొక్క ఆశ్రయభేదమునను సరించి ఏడువిధములుగ నుండును. లవణరసము కటురసము తిక్తరసము కషాయరసము ఇవి కలిగినట్టియు ఇంద్రియములకు విఘాతమును కలిగింపనట్టియు ద్రవ్యములను, ఇట్టి ఇతరద్రవ్యములను తగువిధమున నస్యకర్మనిమిత్తముపయోగింపవచ్చును

## అధ్యాయసంగ్రహము.

మూ॥లక్షణాచార్యశిష్యాణాం పరీక్షాకారణం చ యత్।అధ్యే యాఽధ్యాపనవిధిః సమ్భాషావిధిరేవ చ।షడ్భిర్న్యూనాని పఞ్చాశద్వా దమార్గపదాని చ। పదాని దశచాన్యాని కారణాదీని తత్త్వతః॥సం ప్రశ్నశ్చ పరీక్షాదేర్నవకో వమనాదిషు। భిషగ్జితీయే రోగాణాంవి మానే సంప్రదర్శితః॥151॥

అ॥ ఈ రోగభిషగ్జితీయాధ్యాయమునందు శాస్త్రమును గురువును శిష్యుని పరీక్షించుటకొరకల కారణము, అధ్యయనవిధి, అధ్యాపనవిధి, సంభాషావిధి,నలుబదినాలుగు

విధములగు వాదమార్గములు, కారణము మొదలగు పదివిషయములు, వమనాదుల విషయమై తొమ్మిదివిధములగు ప్రశ్నలు ఇవి చెప్పబడినవి.

మూ॥ బహువిధమిదముక్తమర్థజాతం బహువిధవాక్యవిచిత్రమర్థకాన్తమ్। బహువిధశుభశబ్దసన్ధియుక్తంబహువిధవాదనిషూదనంపరేషామ్॥ ఇమాం మతిం బహువిధహేతుసంశ్రయాం విజజ్ఞివాన్పరమతవాదసూదనీమ్। న సజ్జతే పరవచనావమర్దనైర్నశక్యతే పరవచనైశ్చమర్దితుమ్॥ 153॥

అ॥ అనేకవిధములగు అర్థములతోకూడినట్టియు అనేకవిధములగు వాక్యములతో చిత్రముగనున్నట్టియు మనోహరమైన అర్థముకలిగినట్టియు అనేకవిధములైన శుభశబ్దములతోడను సంధులతోడను కూడినట్టియు ఇతరులయొక్క అనేకవిధములగు వాదనలను ఓడించుట కనుకూలమైనట్టియు విషయము చెప్పబడినది. అనేకవిధములగు హేతువులతో కూడినట్టియు ఇతరులయొక్క వాదమును ఓడించుట కనుకూలమైనట్టియు ఈవిషయమును బాగుగ తెలిసికొనినవాడు ఇతరులయొక్క వాక్యములను ఖండించుటయందు సమర్థుడుగ నుండును. ఇతరులయొక్క వాక్యములచే ఓడింపబడడు.

## విమానస్థానసంగ్రహము.

మూ॥ దోషాదీనాం తు భావానాం సర్వేషామేవ హేతుమత్।
మానాత్సమ్యగ్విమానాని నిరుక్తాని విభాగశః ॥ 154॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే విమానస్థానే రోగభిషగ్జితీయవిమానం నామాష్టమోఽధ్యాయః॥

అ॥ ఈవిమానస్థానమునందు దోషములు మొదలగు సమస్తభావములయొక్కయు మానమునననుసరించి సకారణముగ విశేషవిషయములు వివరించి చెప్పబడినవి.

ఇత్థంబున, శ్రీపాదోపనామకకృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపికయనెడి
చరకసంహితావ్యాఖ్యానమునందు రోగభిషగ్జితీయవిమానమనెడు
అష్టమాధ్యాయము సమాప్తము.

— 0 —

## విమానస్థానము సమాప్తము.

— 0 —

# శారీరస్థానము

## ప్రథమాధ్యాయము

మూ॥ అథాతః కతిధాపురుషీయం శారీరం వ్యాఖ్యాస్యామః॥1॥

అ॥ పిమ్మట కతిధాపురుషీయశారీరమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతిహ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ కతిధా పురుషో ధీమన్! ధాతుభేదేన భిద్యతే। పురుషః కారణం కస్మాత్, ప్రభవః పురుషస్య కః॥కిమజ్ఞో జ్ఞః సనిత్యః కిం కిమనిత్యో నిదర్శితః ప్రకృతిః కావికారాః కే కిం లిఙ్గం పురుషస్య చ॥నిష్క్రియం చ స్వతన్త్రం చ వశినం సర్వగం విభుమ్। వదన్త్యాత్మానమాత్మజ్ఞాః క్షేత్రజ్ఞం సాక్షిణం తథా॥ నిష్క్రియస్య క్రియా తస్య భగవన్! విద్యతే కథమ్। స్వతన్త్రశ్చేదనిష్టాసు కథం యోనిషు జాయతే॥ వశీ యద్యసుఖైః కస్మాద్భావైరాక్రమ్యతే బలాత్ ।సర్వాః సర్వగతత్వాచ్చ వేదనాః కిం న వేత్తి స న పశ్యతి విభుః కస్మా చ్ఛైలకుడ్యతిరస్కృతమ్। క్షేత్రజ్ఞః క్షేత్రమథవా కిం పూర్వమితి సంశయః॥ జ్ఞేయం క్షేత్రం వినా పూర్వం క్షేత్రజ్ఞో హి న యుజ్యతే। క్షేత్రం చ యది పూర్వం స్యాత్ క్షేత్రజ్ఞః స్యాదశాశ్వతః। సాక్షిభూతశ్చ కస్యాయం కర్తా హ్యన్యో న విద్యతే।స్యాత్కథం చావికారస్య విశేషో వేదనాకృతః॥ అథ చార్తస్య భగవం స్త్రిసృణాం కాం చికిత్సతి। అతీతాం వేదనాం వైద్యో వర్తమానాం భవిష్యతీమ్। భవిష్యన్త్యా అసంప్రాప్తిరతీతాయా అనాగమః। సాంప్రతిక్యా అపిస్థానం నాస్త్యర్తేః సంశయో హ్యతః॥ కారణం వేదనానాంకిం కిమధిష్ఠానముచ్యతే। క్వ చైతా వేదనాః సర్వా నివృత్తిం యాన్త్యశేషతః॥ సర్వవిత్సర్వ

సంన్యాసీ సర్వసంయోగనిఃసృతః । ఏకః ప్రశాన్తో భూతాత్మా కైర్లి ఙ్గైరుపలభ్యతే ॥ ఇత్యగ్నివేశస్య వచః శ్రుత్వా మతిమతాం వరః। సర్వం యథావత్ప్రోవాచ ప్రశాన్తాత్మా పునర్వసుః ॥15॥

అ॥ ధాతుభేదము ననుసరించి పురుషుడు ఎన్నివిధములుగ నుండును ? ఎందువలన పురుషుడు కారణముగ నుండును ? పురుషునకు కారణ మేది ? పురుషుడు తెలిసినవాడా తెలియనివాడా ? నిత్యుడా అనిత్యుడా ? ప్రకృతి ఏది ? వికారము లేవి? పురుషునియొక్క లక్షణము లేవి ? ఆత్మవిషయమును తెలిసినవారు ఆత్మను క్రియలులేనిదానినిగను స్వతంత్రమైనదానినిగను స్వేచ్ఛాప్రవృత్తి కలదానినిగను సర్వమును పొందినదానినిగను సమర్థమైనదానినిగను క్షేత్రమును తెలిసినదానినిగను సాక్షిభూతమైనదానినిగను చెప్పుచున్నారు. క్రియలులేని ఆత్మకు క్రియలు ఎట్లుండును ? ఆత్మ స్వతంత్రమైనదైనచో అనిష్టయోనులయందు ఎట్లుపుట్టును ? స్వేచ్ఛాప్రవృత్తికలదైనచో అసుఖకరములయిన భావములచే ఎందువలన ఆక్రమింపబడును ? సర్వమును పొందినదైనచో సమస్తమైన వేదనలను ఎందుకు తెలిసికొనలేదు ? సమర్థమైనదైనచో పర్వతములయొక్కయు గోడలయొక్కయు చాటుననున్నవానిని ఎందుకు చూడలేదు? తెలిసికొనదగిన క్షేత్రము లేనిదే క్షేత్రజ్ఞు డుండుటకు వీలులేదు. క్షేత్రమేపూర్వమునందున్నచో క్షేత్రజ్ఞుడు అనిత్యుడగును. అందువలన "క్షేత్రజ్ఞుడుపూర్వమా క్షేత్రము పూర్వమా" అను సంశయము కలుగుచున్నది. మరియొక కర్త లేనప్పుడు ఆత్మ దేనికి సాక్షిభూతముగ నుండును ? నిర్వికారమైన ఆత్మకు వేదనాసంబంధమగు విశేషములు ఎట్లుకలుగును ? గతించినవి జరుగుచున్నవి రాబోవునవి అని మూడువిధములగు వ్యాధులలో దేనిని చికిత్సించును ? అను సంశయము, రాబోవువ్యాధులు ఇంకను సంభవింపకపోవుటచేతను గతించిన వ్యాధులు తిరిగి రాకపోవుటవలనను జరుగుచున్న వ్యాధులకు నిమిత్తము లేకపోవుటవలనను కలుగుచున్నది. వేదనలకు ఏది కారణముగ నుండును ? ఏది అధిష్ఠానముగ నుండును ? సమస్తమైన వేదనలును ఎప్పుడు నిశ్శేషముగ పోవును? సర్వజ్ఞుడైనట్టియు సర్వభావములను విడిచిపెట్టినట్టియు బంధరహితుడైనట్టియు ఒకటేరూపముగ నుండునట్టియు శాంతస్వభావుడైన జీవాత్మ ఎట్టిలక్షణములతో కూడుకొనియుండును ? అని అగ్నివేశుడు అడుగగా బుద్ధిమంతులలో శ్రేష్ఠుడైనట్టియు నిర్మలమైన ఆత్మ కలిగినట్టియు ఆత్రేయుడు ఈ క్రిందివిధముగ చెప్పెను.

మూ॥ ఖాదయశ్చేతనాషష్ఠా ధాతవః పురుషఃస్మృతః। చేతనాధాతురప్యేకః స్మృతః పురుషసంజ్ఞకః ॥16॥

అ॥ పంచమహాభూతములు ఆత్మ అనెడి ఆరుధాతువులును కలిసి పురుషుడనబడును. ఆత్మ ఒక్కటియుకూడ పురుషుడనబడును.

మూ॥ పునశ్చ ధాతుభేదేన చతుర్వింశతికః స్మృతః । మనో దశేన్ద్రియాణ్యర్థాః ప్రకృతిశ్చాష్టధాతుకీ ॥17॥

అ॥ పురుషుడు — మనస్సు పది ఇంద్రియములు ఐదు ఇంద్రియార్థములు ఆకాశము మొదలగు ఎనిమిది ధాతువులు అనెడి ఇరువదినాలుగు ధాతువుల ననుసరించి మరల ఇరువదినాలుగు విధములుగ నుండును.

## మనోవివరణము.

మూ॥ లక్షణం మనసో జ్ఞానస్యాభావో భావ ఏవ చ । సతి హ్యాత్మేన్ద్రియార్థానాం సంనికర్షేణ వర్తతే ॥ వైవృత్త్యాన్మనసో జ్ఞానం, సాంనిధ్యాత్తచ్చ వర్తతే । అణుత్వమథ చైకత్వం ద్వౌ గుణౌ మనసః స్మృతౌ॥ చిన్త్యం విచార్యమూహ్యం చ ధ్యేయం సంకల్ప్యమేవ చ । యత్కించిన్మనసో జ్ఞేయం తత్సర్వం హ్యర్థసంజ్ఞకమ్॥ ఇన్ద్రియాభిగ్రహః కర్మ మనసః స్వస్య నిగ్రహః । ఊహో విచారశ్చ, తతః పరం బుద్ధిః ప్రవర్తతే । ఇన్ద్రియేణేన్ద్రియార్థో హి సమనస్కేన గృహ్యతే కల్ప్యతే మనసా తూర్ధ్వం గుణతో దోషతో యథా॥ జాయతే విషయే తత్ర యా బుద్ధిర్నిశ్చయాత్మికా । వ్యవస్యతి తయా వక్తుం కర్తుం వా బుద్ధిపూర్వకమ్ ॥23॥

అ॥ జ్ఞానము కలుగకుండుటయు కలుగుటయు మనస్సునకు లక్షణముగ నుండును. ఆత్మ ఇంద్రియములు ఇంద్రియార్థములు వీనియొక్క సంబంధ మున్నను మనస్సుయొక్క సంబంధములేనిచో జ్ఞానముకలుగ నేరదు. మనస్సుయొక్క సంబంధమున్నచో జ్ఞానము కలుగును. అణుత్వమును ఏకత్వమును మనస్సుయొక్క గుణములుగ నుండును. ఆలోచింపతగినవియు విమర్శింపతగినవియు ఊహింపతగినవియు ధ్యానింపతగినవియు సంకల్పింపతగినవియు నగు మనస్సుచే తెలిసికొనతగిన విషయములు మనస్సునకు విషయములుగ నుండును. ఇంద్రియములను నియమించుట తనను నియమించుకొనుట ఊహించుట విమర్శించుట ఇవి మనస్సుయొక్క కర్మలుగ నుండును. ఊహయు విమర్శయు కలిగినపిమ్మట బుద్ధిప్రవర్తించును. మనస్సుతోకూడిన ఇంద్రియముచేతనే ఇంద్రియార్థము గ్రహింపబడును. పిమ్మట మనస్సుచేత గుణదోషములు కల్పింపబడును. అట్లు కల్పింపబడిన విషయమునందు నిశ్చయాత్మకమగు ఏబుద్ధి కలుగునో అట్టిబుద్ధి ననుసరించి చెప్పుటకుగాని చేయుటకుగాని బుద్ధిపూర్వకముగ ప్రవర్తించును.

## ఇంద్రియ వివరణము.

మూ॥ ఏకైకాధికయుక్తాని ఖాదీనామిన్ద్రియాణి తు । పఞ్చ కర్మానుమేయాని యేభ్యో బుద్ధిః ప్రవర్తతే ॥ హస్తౌ పాదౌ గుదోపస్థే జిహ్వేన్ద్రియమథాపి చ । కర్మేంద్రియాణి పఞ్చైవ, పాదౌ

గమనకర్మణి॥ పాయూపస్థౌ విసర్గార్థేహస్తౌ గ్రహణధారణే।జిహ్వా వాగిన్ద్రియం, వాక్చ సత్యా జ్యోతి స్తమోఽనృతా ॥26॥

అ॥ ఆకాశము మొదలగు పంచమహాభూతములలో క్రమముగ ఒక్కొక్క దానియొక్క గుణము అధికముగకలిగినట్టియు వానివానియొక్క కర్మలచే ఊహింపదగినట్టియు అయిదుఇంద్రియములు కలవు. ఈ ఇంద్రియములవలన బుద్ధి ప్రవర్తించును. ఇవి జ్ఞానేంద్రియము లనబడును. హస్తములు పాదములు గుదము ఉపస్థజిహ్వా అను నీ అయిదును కర్మేంద్రియము లనబడును. పాదములకు గమనమును, గుదము ఉపస్థ వీనికి విసర్గమును (మలమూత్రాది విసర్జనమును), హస్తములకు గ్రహణధారణములును, జిహ్వకు వాక్కును కర్మలుగ నుండును. వాక్కు జ్యోతిస్స్వరూపమగు సత్యమనియు తమస్స్వరూపమగు అసత్యమనియు రెండువిధములుగ నుండును.

## పంచమహాభూతవివరణము.

మూ॥ మహాభూతాని ఖం వాయురగ్నిరాపః క్షితి స్తథా। శబ్దః స్పర్శశ్చ రూపం చ రసో గన్ధశ్చ తద్గుణాః॥ తేషామేకగుణః పూర్వో, గుణవృద్ధిః పరే పరే। పూర్వః పూర్వగుణశ్చైవ క్రమశో గుణిషు స్మృతః॥ ఖరద్రవచలోష్ణత్వం భూజలానిలతేజసామ్। ఆకాశస్యాప్రతీఘాతో దృష్టం లిఙ్గం యథాక్రమమ్॥ లక్షణం సర్వమేవైతత్స్పర్శనేన్ద్రియగోచరమ్। స్పర్శనేన్ద్రియవిజ్ఞేయః స్పర్శో హి సవిపర్యయః ॥30॥

అ॥ ఆకాశము వాయువు అగ్ని జలము పృథివి అను నివి పంచమహాభూతము లనబడును. శబ్దము స్పర్శము రూపము రసము గంధము అను నీ అయిదును క్రమముగ వానియొక్కగుణములుగ నుండును. మొదటిదగు ఆకాశము ఒకగుణమును ఉత్తరోత్తర భూతములు క్రమముగ గుణవృద్ధిని కలిగియుండును. అనగా - ఆకాశము పూర్వగుణమగు శబ్దమును కలిగియుండును. ఉత్తరోత్తరభూతములు క్రమమునననుసరించి వాని కుండవలసిన గుణమును పూర్వభూతములయొక్క గుణములను కలిగియుండును. పృథివి జలము వాయువు అగ్ని ఆకాశము ఇవి ఖరత్వము ద్రవత్వము చలత్వము ఉష్ణత్వము అస్పర్శత్వము అను గుణములను యథాక్రమముగ కలిగియుండును. ఖరత్వము మొదలగు గుణములు స్పర్శనేంద్రియముచే గ్రహింపబడును. అస్పర్శత్వమునుగూడ స్పర్శనేంద్రియముచేతనే గ్రహింపవచ్చును.

మూ॥ గుణాః శరీరే గుణినాం నిర్దిష్టాశ్చిహ్న మేవ చ।అర్థాః శబ్దాదయో జ్ఞేయా గోచరా విషయా గుణాః॥ యా యదిన్ద్రియ

మాశ్రిత్య జన్తోర్బుద్ధిః ప్రవర్తతే। యాతి సా తేన నిర్దేశం మనసా చ మనోభవా॥ భేదాత్కార్యేన్ద్రియార్థానాం బహ్వ్యోవై బుద్ధయః స్మృతాః। ఆత్మేన్ద్రియమనోర్థానామేకైకా సంనికర్షజా॥ అఙ్గుల్యఙ్గుష్ఠతలజ స్తన్త్రీవీణానఖోద్భవః। దృష్టః శబ్దోయథాబుద్ధిర్దృష్టా సంయోగజా తథా॥ బుద్ధీన్ద్రియమనోర్థానాం విద్యాద్యోగధరం పరమ్। చతుర్వింశక ఇత్యేష రాశిః పురుషసంజ్ఞకః ॥35॥

అ॥ శబ్దాదులు శరీరమునందలి సూక్ష్మరూపములగు పంచమహాభూతముల యొక్క చిహ్నములుగ నుండును. శబ్దాదులు అర్థములనియు గోచరములనియు విషయములనియు గుణములనియు చెప్పబడును. ఏ బుద్ధి ఏ ఇంద్రియము నాశ్రయించి ప్రవర్తించునో ఆ బుద్ధి ఆ ఇంద్రియముయొక్క పేరుచే చెప్పబడును. మనస్సు నాశ్రయించి ప్రవర్తించు బుద్ధి మనోబుద్ధి యనబడును. ఆత్మ ఇంద్రియములు మనస్సు ఇంద్రియార్థములు వీనియొక్క ప్రత్యేక సన్నికర్షమువలన కలుగు బుద్ధులు కార్యములు ఇంద్రియార్థములు వీనియొక్క భేదమనుసరించి అనేకవిధములుగ నుండును. నడిమివ్రేలు బొటనవ్రేలు అరచెయ్యి వీనియొక్క సంయోగమువలన కలుగు శబ్దమును తంత్రులు వీణ గోళ్ళు వీనియొక్క సంయోగమువలన కలుగు శబ్దమును వేరువేరుగ నుండునటుల సంయోగమువలనకలుగు బుద్ధులుకూడ వేరువేరుగ నుండును. అవ్యక్తము మొదలగు ఇతరతత్త్వములు, బుద్ధి ఇంద్రియములు మనస్సు ఇంద్రియార్థములు వీనియొక్క యోగమును ధరించియుండును. పూర్వమునందు చెప్పబడిన ఇరువదినాలుగు తత్త్వముల యొక్క రాశి పురుషుడనబడును.

మూ॥ రజస్తమోభ్యాం యుక్తస్య సంయోగోఽయమనన్తవాన్। తాభ్యాం నిరాకృతాభ్యాం తు సత్త్వబుద్ధ్యా నివర్తతే॥ అత్రకర్మఫలం చాత్రజ్ఞానం చాత్రప్రతిష్ఠితమ్। అత్ర మోహః సుఖం దుఃఖం జీవితం మరణంస్వతా॥ ఏవం యో వేదతత్త్వేన స వేదప్రలయోదయా। పారంపర్యం చికిత్సాం చ జ్ఞాతవ్యం యచ్చ కిఞ్చన ॥36॥

అ॥ రజస్తమోగుణములతోకూడిన పురుషునకు చతుర్వింశతితత్త్వసంయోగము అనంతముగ నుండును. రజస్తమోగుణములను విడిచిపెట్టినచో సత్త్వగుణము కలుగుట చేత ఆ సంయోగము నివర్తించును (మోక్షము కలుగును). కర్మఫలము జ్ఞానము మోహము సుఖము దుఃఖము జీవితము మరణము మమత్వము అనునివి పురుషునియం దధీనమై యుండును. ఇట్టివిషయమును పూర్తిగ తెలిసికొనినవాడు జీవితమరణములను శరీరపరంపరను చికిత్సను తెలిసికొనదగిన ఇతరవిషయములను తెలిసికొనగలుగును.

మూ॥ భాస్తమః సత్యమనృతం వేదాః కర్మ శుభాశుభమ్। న స్యాత్కర్తా వేదితా చ పురుషో న భవేద్యది॥ నాశ్రయో న

సుఖం నార్తిర్న గతిర్నాగతిర్న వాక్ । న విజ్ఞానం న శాస్త్రాణి న జన్మ మరణం న చ॥ న బన్ధో న చ మోక్షః స్యాత్పురుషో న భవేద్యది। కారణం పురుషస్తస్మాత్కారణజ్ఞైరుదాహృతః॥ న చేత్కారణమాత్మా స్యాద్భాదయః స్యురహేతుకాః। న చైషు సమ్భవేత్ జ్ఞానం న చ తైః స్యాత్ప్రయోజనమ్ ॥42॥

అ॥ పురుషుడు లేనిచో వెలుగు చీకటి సత్యము అసత్యము వేదములు శుభాశుభ కర్మలు చేయువాడు తెలిసికొనువాడు ఆశ్రయము సుఖము దుఃఖము గతి ఆగతి వాక్కు విజ్ఞానము శాస్త్రములు జననము మరణము బంధము మోక్షము అనునివి ఉండ నేరవు. అందువలన పురుషుడు కారణమని కారణజ్ఞులచే చెప్పబడినది. ఆత్మ(పురుషుడు) కారణము కానిచో వెలుగు మొదలగునవి అహేతుకము లగును. వానియందు జ్ఞానము కలుగదు. వానివలన ప్రయోజనము ఉండదు.

మూ॥ కృతం మృద్దణ్డచక్రైశ్చ కుమ్భకారాదృతే ఘటమ్॥ కృతం మృత్తృణకాష్ఠైశ్చ గృహకారాద్వినా గృహమ్॥ యో వదేత్స వదేద్దేహం సంభూయ కరణైః కృతమ్। వినా కర్తారమజ్ఞానాద్యుక్త్యాగమబహిష్కృతః॥ కారణం పురుషః సర్వైః ప్రమాణైరుపలభ్యతే। యేభ్యః ప్రమేయం సర్వేభ్య ఆగమేభ్యః ప్రమీయతే ॥45॥

అ॥ కుండలను చేయువాడు లేకుండగనే మన్ను దండము చక్రము వీనిచే కుండలు చేయబడుననియు గృహమును నిర్మించువాడు లేకుండగనే మన్ను గడ్డి కఱ్ఱలు వీనిచే గృహము నిర్మింపబడుననియు ఎవడు చెప్పునో యుక్తిని శాస్త్రమును తెలియని అట్టివాడు కర్త లేకుండగనే భూతములు మొదలగు సాధనములచే దేహము నిర్మింపబడునని అజ్ఞానమువలన చెప్పును. తెలిసికొనతగిన విషయము ఏ ప్రమాణములచే తెలియబడుచున్నదో అట్టి సమస్తప్రమాణములచేతను పురుషుడు కారణమని చెప్పబడుచున్నది.

మూ॥ న తే తత్సదృశాస్త్వన్యే పారంపర్యసముత్థితాః। సారూప్యాద్యే త ఏవేతి నిర్దిశ్యన్తే నవా నవాః॥ భావాస్తేషాం సముదయో నిరీశః సత్త్వసంజ్ఞకః॥ కర్తా భోక్తా న స పుమానితి కేచిద్వ్యవస్థితాః॥ తేషామన్యైః కృతస్యాన్యే భావాభావైర్నవాః ఫలమ్। భుఞ్జతే సదృశాః ప్రాప్తం యైరాత్మా నోపదిశ్యతే॥ కరణాన్యాన్యతా దృష్టా కర్తుః కర్తా స ఏవ తు। కర్తా హి కరణైర్యుక్తః కారణం సర్వకర్మణామ్॥ నిమేషకాలాద్భావానాం కాలః శీఘ్రతరోఽత్యయే। భగ్నానాం న పునర్భావః కృతం నాన్యముపైతి చ॥

మతం తత్త్వవిదామేతద్యస్మాత్తస్మాత్ స కారణమ్। క్రియోపభోగే భూతానాం నిత్యః పురుషసంజ్ఞకః॥ అహఙ్కారః ఫలం కర్మ దేహాన్తరగతిః స్మృతిః। విద్యతే సతి భూతానాం కారణే దేహమన్తరా ॥52॥

అ॥ "పరంపరగ పుట్టినట్టియు వెనుకటివానితో సమానమైనట్టియు ఇతరములైన ఏభావములుకలవో అవి సారూప్యమునుబట్టి వెనుకటిభావములేయని చెప్పబడుచున్నవి కాని అవి వెనుకటిభావములు కావు. నూతనములుగనే యుండును. అట్టిభావముల యొక్క ఆత్మరహితమగు సముదాయమే ప్రాణి యనబడును. పురుషుడు కర్తయు భోక్తయు కానేరడు" అని కొందరు చెప్పుచున్నారు. ఆత్మను అంగీకరింపకున్నచో ఇతరభావములచే చేయబడిన కర్మవలన ప్రాప్తమగు ఫలమును అట్టిభావములతో సమానములైనట్టియు నూతనములైనట్టియు ఇతరభావములు అనుభవింపవలసి యుండును. కర్తకు (ఆత్మకు)ను శరీరమునకును అన్యోన్యత్వము ఉండును. కర్త నశింపడు. కర్త సాధనములతోకూడినవాడై సమస్తకర్మలకును కారణముగ నుండును. సమస్త భావములును నిమేషకాలములో నశించిపోవును. నశించిపోయిన భావములు మరల పుట్టవు. కర్మఫలమును మరియొకడు అనుభవింపడు. ఇదితత్త్వవేత్తలయొక్క మతమైయున్నది. అందువలన భూతములయొక్క క్రియలను అనుభవించుటకు నిత్యుడగు పురుషుడు కారణముగ నుండును. దేహములేకున్నను భూతములకు కారణమగు ఆత్మయున్నచో అహంకారమును కర్మఫలమును కర్మయు పునర్జన్మయు స్మృతియు నుండును.

మూ॥ ప్రభవో న హ్యనాదిత్వాద్విద్యతే పరమాత్మనః।
పురుషో రాశిసంజ్ఞస్తు మోహేచ్ఛాద్వేషకర్మజః ॥53॥

అ॥ పరమాత్మ ఆదిలేనిదగుటవలన దీనికి పుట్టుక కారణము లేదు. చతుర్వింశతి తత్త్వసముదాయరూపమగు పురుషుడుమాత్రము మోహము ఇచ్ఛ ద్వేషము కర్మ వీని వలన జనించును.

మూ॥ ఆత్మాజ్ఞః, కరణైర్యోగాత్ జ్ఞానం త్వస్య ప్రవర్తతే। కరణానామవైమల్యాదయోగాద్వా న వర్తతే॥ పశ్యతోఽపి యథాఽదర్శే సంక్లిష్టేనాస్తి దర్శనమ్। తత్త్వం జలే వా కలుషే చేతస్యుపహతే తథా॥ కరణాని మనో బుద్ధిర్బుద్ధికర్మేన్ద్రియాణి చ। కర్తుః సంయోగజం కర్మ వేదనా బుద్ధిరేవ చ। నైకః ప్రవర్తతే కర్తుం భూతాత్మానాశ్నుతే ఫలమ్। సంయోగాద్వర్తతే సర్వం మృత్వాతేనాస్తి కించన। న హ్యేకో వర్తతే భావో వర్తతేనాప్యహేతుకః। శీఘ్రగత్వాత్స్వభావాత్త్వభావో న వ్యతివర్తతే ॥58।

అ॥ ఆత్మ జ్ఞానముకలదిగ నుండును. దీనికి సాధనములతో సంబంధము కలిగి నప్పుడు జ్ఞానము ప్రవర్తించును. సాధనములు నిర్మలములుగ లేకపోవుటవలనగాని సాధనములతో సంబంధము కలుగకపోవుటవలనగాని జ్ఞానము ప్రవర్తింపదు. మలినముతో కూడిన అద్దమునందుగాని కలుషమైన నీటియందుగాని చూచెడివానికి రూపము కనుబడనివిధమున మనస్సు నిర్మలముగ లేనప్పుడు జ్ఞానము కలుగదు. మనస్సు, బుద్ధి, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు ఇవి సాధనములుగ నుండును. ఆత్మకు సాధనములతో సంబంధము కలిగినప్పుడు కర్మ, దుఃఖము, జ్ఞానము ఇవి కలుగును. భూతాత్మ యొక్కటియే కార్యములను చేయుటకు ప్రవర్తింపదు. మరియు కార్యఫలమును పొందదు. సాధనములయొక్క సంయోగమువలననే సర్వమును ప్రవర్తించును. సంయోగములేనిచో ఏమియు కలుగనేరదు. కారణరూపమగు భావయొక్కటియే కార్యమునందు ప్రవర్తింపదు మరియు ఏభావమును అహేతుకముగ ప్రవర్తింపదు. స్వభావమువలన శీఘ్రగమనముకల ఆభావము తనస్వభావమును విడిచిపెట్టక అహేతుకముగనే యుండును.

మూ॥ అనాదిః పురుషో నిత్యో విపరీతస్తు హేతుజః। సదకారణవన్నిత్యం దృష్టం హేతుజమన్యథా॥ తదేవ భావాదగ్రాహ్యం నిత్యత్వం న మతశ్చన। భావాత్ జ్ఞేయం తదవ్యక్తమచిన్త్యం వ్యక్తమన్యథా॥ అవ్యక్తమాత్మా క్షేత్రజ్ఞః శాశ్వతో విభురవ్యయః। తస్మాద్యదన్యత్తద్వ్యక్తం వక్ష్యతే చాపరం ద్వయమ్॥ వ్యక్తం చైన్ద్రియకం చైవ గృహ్యతే తద్యదిన్ద్రియైః। అతోఽన్యత్పునరవ్యక్తం లిఙ్గగ్రాహ్యమతీన్ద్రియమ్ ॥62॥

అ॥ ఆదిరహితుడైన పురుషుడు నిత్యుడుగ నుండును. భావములయొక్క సముదాయరూపమగు పురుషుడు అనిత్యుడుగ నుండును. కారణరహితమైనది నిత్యముగను కారణసహితమైనది అనిత్యముగను నుండును. రాశిరూపమగు పురుషుడు ఇతరభావములననుసరించికాక ఉత్పత్తిరూపహేతువు ననుసరించియే నిత్యుడు కాదని గ్రహింపవలయును. నిత్యమైనదానిని అచింత్యమైన అవ్యక్తమునుగ తెలిసికొనవలయును. అనిత్యమైనదానిని వ్యక్తమునుగ తెలిసికొనవలయును. క్షేత్రజ్ఞుడైనట్టియు శాశ్వతుడైనట్టియు సమర్థుడైనట్టియు అవ్యయుడైనట్టియు ఆత్మ అవ్యక్తముగ నుండును, దానికంటె భిన్నమైనది వ్యక్తముగ నుండును. వ్యక్తము ఇంద్రియములచే గ్రహింప బడినదగుటవలన ఐంద్రియికమనబడును. అవ్యక్తము ఇంద్రియములచే గ్రహింపబడనిదిగను ఊహాచే గ్రహింపబడునదిగను నుండుటవలన అతీంద్రియ మనబడును.

మూ॥ ఖాదీని బుద్ధిరవ్యక్తమహఙ్కార స్తథాఽష్టమః। భూతప్రకృతిరుద్దిష్టా వికారాశ్చైవ షోడశ॥ బుద్ధీన్ద్రియాణి పఞ్చైవ పఞ్చ కర్మేన్ద్రియాణి చ॥ సమనస్కాశ్చ పఞ్చార్థా వికారా ఇతి సంజ్ఞితాః॥

ఇతి క్షేత్రం సముద్దిష్టం సర్వమవ్యక్తవర్జితమ్। అవ్యక్తమస్య క్షేత్రస్య క్షేత్రజ్ఞమృషయో విదుః॥ జాయతే బుద్ధిరవ్యక్తాద్బుద్ధ్యాఽహమితి మన్యతే। పరం ఖాదీన్యహఙ్కారాదుత్పద్యన్తే యథాక్రమమ్॥ తతః సంపూర్ణసర్వాఙ్గో జాతోఽభ్యుదిత ఉచ్యతే। పురుషః ప్రలయే చేష్టైః పునర్భావైర్వియుజ్యతే ॥ అవ్యక్తాద్వ్యక్తతాం యాతి వ్యక్తాదవ్యక్తతాం పునః। రజస్తమోభ్యామావిష్టశ్చక్రవత్పరివర్తతే॥ యేషాం ద్వన్ద్వే పరాఽఽసక్తిరహఙ్కారపరాశ్చ యే। ఉదయప్రలయౌ తేషాం, న తేషాం యే త్వతోఽన్యథా ॥69॥

అ॥ పంచమహాభూతములు బుద్ధి అవ్యక్తము అహంకారము అనునీ ఎనిమిదియు భూతప్రకృతి యనబడును. పంచజ్ఞానేంద్రియములు పంచకర్మేంద్రియములు మనస్సు పంచేంద్రియార్థములు అనునీ పదునారును వికారము లనబడును. అవ్యక్త వర్జితమైన భూతప్రకృతియు వికారములును కలిసి క్షేత్రి మనబడును. అవ్యక్తము క్షేత్రజ్ఞు డన బడును. అవ్యక్తమునుండి బుద్ధియు బుద్ధినుండి అహంకారమును, అహంకారమునుండి భూతసూక్ష్మావస్థలగు పంచతన్మాత్రలును ఏకాదశేంద్రియములును క్రమముగ పుట్టును. పిమ్మట సంపూర్ణములైన సర్వావయవములతోడను కూడినట్టి పురుషుడు పుట్టును. అట్టిపురుషుడు ప్రళయసమయమున సమస్తభావములను విడిచిపెట్టును. పురుషుడు రజస్తమోగుణములతో కూడినవాడై అవ్యక్తమునుండి వ్యక్తత్వమును వ్యక్తము నుండి అవ్యక్తత్వమును పొందుచు చక్రమువలె పరివర్తనము నొందుచుండును. రజస్తమోగుణములును అహంకారమును ఎవరికి ఉండునో వారికి జన్మమరణము లుండును. అట్టిగుణము లెవరికి ఉండవో వారికి జన్మమరణము లుండవు.

మూ॥ ప్రాణాపానౌ నిమేషాద్యా జీవనం మనసో గతిః। ఇన్ద్రియాన్తరసంచారః ప్రేరణం ధారణం చ యత్॥ దేశాన్తరగతిః స్వప్నే పఞ్చత్వగ్రహణం తథా। దృష్టస్య దక్షిణేనాక్ష్ణా సవ్యేనావగమస్తథా॥ ఇచ్ఛా ద్వేషః సుఖం దుఃఖం ప్రయత్నశ్చేతనా ధృతిః। బుద్ధిః స్మృతిరహఙ్కారో లిఙ్గాని పరమాత్మనః ॥ యస్మాత్సముపలభ్యన్తే లిఙ్గాన్యేతాని జీవతః। న మృతస్యాత్మలిఙ్గాని తస్మాదాహుర్మహర్షయః॥ శరీరం హి గతే తస్మిఞ్ఛూన్యాగారమచేతనమ్। పఞ్చభూతావశేషత్వాత్పఞ్చత్వం గతముచ్యతే ॥74॥

అ॥ ఉచ్ఛ్వాసనిశ్వాసములు, కండ్లుమూయుట తెరచుట, జీవించుట, మనస్సు యొక్క గమనము, ఇంద్రియాంతరములందు సంచరించుట, ప్రేరేపించుట, ధారణా శక్తి, స్వప్నమునందు దేశాంతరగమనము, మరణజ్ఞానము, కుడికంటితో చూడబడిన

దానిని ఎడమకంటితోఁకూడ తెలిసికొనుట, ఇచ్ఛ, ద్వేషము, సుఖము, దుఃఖము, ప్రయత్నము, జ్ఞానము, ధైర్యము, బుద్ధి, స్మరణము, అహంకారము ఇవి ఆత్మయొక్క లక్షణములుగ నుండును. ఇవి జీవించియున్నవానియందు కనబడుచుండుటవలనను మరణించినవానియందు కనబడకపోవుటవలనను పరమాత్మయొక్క లక్షణములని మహర్షులు చెప్పుచున్నారు. ఆత్మ వెడలిపోయియుండగా శూన్యాగారమువలెనుండునట్టియు చేతనారహితమైనట్టియు శరీరము పంచభూతములు మిగులుగా కలదగుటవలన పంచత్వమును (మరణమును) పొందినదని చెప్పబడుచున్నది.

మూ॥ అచేతనం క్రియావచ్చ మనశ్చేతయితా పరః యుక్తస్య మనసా తస్య నిర్దిశ్యన్తే విభోః క్రియాః ॥ చేతనావాన్ యతశ్చాత్మాతతః కర్తానిరుచ్యతే। అచేతనత్వాచ్చ మనః క్రియావదపి నోచ్యతే॥ యథాస్వేనాత్మనాఽఽత్మానం నయతే సర్వయోనిషు। ప్రాణైస్తన్త్రయతే ప్రాణీ న హ్యన్యోఽస్త్యస్య తన్త్రకః॥ వశీ తత్కురుతే కర్మయత్కృత్వా ఫలమశ్నుతే। వశీ చేతః సమాధత్తే వశీ సర్వం నిరస్యతి ॥ దేహీ సర్వగతో హ్యాత్మా స్వే స్వే సంస్పర్శనేన్ద్రియే। సర్వాః సర్వాశ్రయస్థాస్తు వాత్మాఽతో వేత్తి వేదనాః ॥79॥

అ॥ మనస్సు అచేతనముగను క్రియలుకలదిగను నుండును. అట్టిమనస్సును ఆత్మ ప్రేరేపించునదిగ నుండును. అందువలన మనస్సుతోఁకూడిన ఆత్మకు క్రియలుకలవని చెప్పబడుచున్నది. ఆత్మ చేతనముకలదగుటవలన కర్త యని చెప్పబడుచున్నది. మనస్సు క్రియలుకలదైనను అచేతనమగుటవలన కర్తగ చెప్పబడుటలేదు. ఆత్మ స్వయముగనే సమస్తయోనులయందును ప్రవేశించి ప్రాణములను కలిగించును. ఆత్మను ప్రేరేపించువాడు మరియొకడు లేడు. ఆత్మ స్వేచ్ఛాప్రవృత్తికలదగుటవలన ఏకర్మవలన శుభాశుభఫలము కలుగునో అట్టికర్మలను చేయగలుగును. మనస్సును నిగ్రహింపగలుగును. సమస్తమును విడిచిపెట్టకలుగును. ఆత్మ సమస్తదేహమును వ్యాపించియున్నను తన సంబంధమైన స్పర్శజ్ఞానముకల అవయవములయందలి బాధలను తెలిసికొనకలుగును. కాని ఇతరబాధలను తెలిసికొనజాలదు.

మూ॥ విభుత్వమత ఏవాస్య యస్మాత్సర్వగతో మహాన్ । మనసశ్చ సమాధానాత్పశ్యత్యాత్మా తిరస్కృతమ్ ॥ నిత్యానుబన్ధం మనసా దేహకర్మానుపాతినా । సర్వయోనిగతం విద్యాదేకయోనావపి స్థితమ్॥ ఆదిర్నాస్త్యాత్మనః క్షేత్రపారమ్పర్యమనాదికమ్। అతస్తయోరనాదిత్వాత్కిం పూర్వమితినోచ్యతే। జ్ఞః సాక్షీత్యుచ్యతేనాజ్ఞః సాక్షీ హ్యాత్మా హ్యతః స్మృతః। సర్వే భావా హి సర్వేషాం

భూతానామాత్మసాక్షికాః॥ నైకః కదాచిద్భూతాత్మా లక్షణైరుపలభ్యతే। విశేషోఽనుపలభ్యస్య తస్య నైకస్య విద్యతే॥ సంయోగపురుషస్యేష్టో విశేషో వేదనాకృతః। వేదనా యత్ర నియతా విశేషస్తత్ర తత్కృతః ॥85॥

అ॥ ఆత్మ సర్వగతమైనదగుటవలనను గొప్పదైనదగుటవలనను విభువుగ (సమర్థమైనదిగ) నుండును. ఇట్టి ఆత్మ-పర్వతములు గోడలు మొదలగువానియొక్క చాటుననున్నవానిని మనస్సమాధివలన తెలిసికొనగలుగును. దేహసంబంధమగు కర్మను అనుసరించియుండు మనస్సుతో నిత్యసంబంధముకల ఆత్మను సర్వయోనులయందు వ్యాపించియున్నదైనను ఒకయోనియందున్నదానినిగనే తెలిసికొనవలయును. ఆత్మ ఆదిరహితమైనది. క్షేత్రపారంపర్యముకూడ ఆదిరహితమైనది. అందువలన ఈ రెండింటిలో ఏది మొదటిదియో చెప్పుటకు వీలులేదు. తెలిసినవాడు సాక్షియనబడును. తెలియనివాడు సాక్షియనబడడు. అందువలన ఆత్మ సాక్షిగ నుండును. సమస్తభూతములయొక్క సమస్తభావములును ఆత్మసాక్షికములుగ నుండును. భూతాత్మ ఒక్కటియే ప్రత్యేకముగ ఒకానొకప్పుడును లక్షణములచే పొందబడదు. అట్లు పొందబడని భూతాత్మకు వేదానావిశేషము కలుగదు. వేదనాసంబంధమగు విశేషము సంయోగపురుషునకే కలుగును. వేదనలు ఎచ్చట నియమితములుగ నుండునో అచ్చటనే వేదనావిశేషములు ఉండును.

మూ॥ చికిత్సతి భిషక్సర్వాస్త్రికాలా వేదనా ఇతి। యయా యుక్త్యా వదన్త్యేకే సా యుక్తిరుపధార్యతామ్॥ పునస్తచ్ఛిరసః శూలం జ్వరః స పునరాగతః। పునః స కాసో బలవాంశ్ఛర్దిః సా పునరాగతా॥ ఏభిః ప్రసిద్ధవచనైరతీతాగమనం మతమ్। కాలశ్చాయమతీతానామార్తీనాం పునరాగతః॥ తమర్తికాలముద్దిశ్య భేషజం యత్ప్రయుజ్యతే। అతీతానాం ప్రశమనం వేదనానాం తదచ్యతే॥ ఆపస్తాః పునరాయాతా యాభిః శస్యం పురా హతమ్। యథా ప్రక్రియతే సేతుః ప్రతికర్మ తథాఽఽశ్రయే॥ పూర్వరూపం వికారాణాం దృష్ట్వా ప్రాదుర్భవిష్యతామ్। యా క్రియా క్రియతే సా చ వేదనాం హన్త్యనాగతమ్॥ పారమ్పర్యానుబన్ధస్తు దుఃఖానాం వినివర్తతే। సుఖహేతూపచారేణ సుఖం చాపి ప్రవర్తతే॥ న సమాయాన్తి వైషమ్యం విషమాః సమతాం న చ। హేతుభిః సదృశా నిత్యం జాయన్తే దేహధాతవః॥ యుక్తిమేతాం పురస్కృత్య త్రికాలాం వేదనాం భిషక్। హన్తీత్యుక్తా చికిత్సా తు నైష్ఠికీ యా వినోపధామ్ ॥94॥

అ॥ వైద్యుడు భూతభవిష్యద్వర్తమానకాలములయందలి బాధలను నశింపచేయునని ఏయుక్తిననుసరించి చెప్పబడుచున్నదో అట్టియుక్తిని వివరించుచున్నాము. ఆశిరశ్శూల మరల వచ్చినది. ఆజ్వరము మరలవచ్చినది. బలవంతమగు ఆకాస మరల వచ్చినది. ఆఛర్ది మరల వచ్చినది. ఇట్టి ప్రసిద్ధవాక్యములచే, గతించిన బాధలు మరల వచ్చునని చెప్పబడుచున్నది. గతించిన బాధలయొక్క కాలము మరల వచ్చినది. బాధలసంబంధమగు అట్టి కాలము నుద్దేశించి ప్రయోగింపబడు ఔషధము గతించినబాధలను శమింపచేయునదిగ నుండును. పూర్వము ఏఉదకముచే సస్యము చెడగొట్టబడినదో అట్టిఉదకము మరల వచ్చినప్పుడు సేతువు (కట్ట) ఏవిధముగ నిర్మింపబడునో ఆవిధముగనే శరీరమునందు గతించినవ్యాధులు మరల వచ్చినప్పుడు చికిత్స చేయబడును. రాబోవు వ్యాధులయొక్క పూర్వరూపములను చూచి ఏచికిత్స చేయబడునో అది రాబోవువ్యాధులను శమింపచేయునదిగ నుండును. బాధలయొక్క పరంపరారూపమగు అనుబంధము సుఖనిమిత్తములగు ఉపచారములచే నివర్తించును. మరియు సుఖము కలుగును. సమముగనున్న దేహధాతువులు వైషమ్యమును, విషమముగనున్న దేహధాతువులు సమత్వమును స్వయముగ పొందవు. అవి హేతువులననుసరించి యుండును. వైద్యుడు ఈయుక్తిననుసరించి మూడుకాలములయందలి బాధలను నశింపచేయును. కోరికలు లేకుండగ చేయబడు చికిత్స మోక్షఫలమును కలిగించునదిగ నుండును.

మూ॥ ఉపధా హి పరో హేతుర్దుఃఖదుఃఖాశ్రయప్రదః । త్యాగః సర్వోపధానాం చ సర్వదుఃఖవ్యపోహకః ॥ కోషకారో యథా హ్యంశూనుపాదత్తే వధప్రదాన్ । ఉపాదత్తే తథాఽర్థేభ్య స్తృష్ణామజ్ఞః సదాతురః॥ యస్త్వగ్నికల్పానర్థాన్ జ్ఞో జ్ఞాత్వా తేభ్యో నివర్తతే। అనారమ్భాదసంయోగాత్తం దుఃఖం నోపతిష్ఠతే ॥97॥

అ॥ కోరికలు దుఃఖములకును దుఃఖాశ్రయములకును ప్రధానకారణములుగ నుండును. అట్టికోరికలను విడిచిపెట్టినచో ఏవిధమగు దుఃఖములును కలుగనేరవు. పట్టుపురుగు తనను చంపునట్టి దారములను సమకూర్చుకొనువిధమున అజ్ఞానుడు విషయములయందు కోరికలను పొంది ఎల్లపుడును దుఃఖించుచుండును. జ్ఞానవంతుడు విషయములను అగ్నితో సమానమైనవానినిగ తలచి వానిని విడిచిపెట్టును. అట్టివాడు ఆవిషయములను ఆరంభింపకపోవుటవలనను వానితో సంబంధములేనివాడగుటవలనను ఆ దుఃఖములను పొందడు.

మూ॥ ధీధృతిస్మృతివిభ్రంశః సంప్రాప్తిః కాలకర్మణామ్। అసాత్మ్యార్థాగమశ్చేతి జ్ఞాతవ్యా దుఃఖహేతవః। విషమాభినివేశో యో నిత్యానిత్యే హితాహితే। జ్ఞేయఃసబుద్ధివిభ్రంశః,సమం బుద్ధిర్హి పశ్యతి॥ విషయప్రవణం చిత్తం ధృతిభ్రంశాన్న శక్యతే । నియన్తుమహితాదర్థాద్ధృతిర్హి నియమాత్మికా॥ తత్త్వజ్ఞానేస్మృతిర్యస్య రజో

మోహావృతాత్మనః ॥ భ్రశ్యతే స స్మృతిభ్రంశః, స్మర్తవ్యం హి స్మృతౌ స్థితమ్ ॥101॥

అ॥ బుద్ధియు ధృతియు స్మృతియు చెడిపోవుట, కాలము కర్మ వీనియొక్క అయోగములు, అసాత్మ్యేంద్రియార్థ సంయోగము ఇవి వ్యాధులకు హేతువులుగ నుండును. నిత్యములు అనిత్యములు హితములు అహితములు వీనిని విషమములుగ నిర్ణయించుట బుద్ధివిభ్రంశ మనబడును. వీనిని సరిగ నిర్ణయించుట సమబుద్ధి యనబడును. ధృతికి విభ్రంశము కలిగినచో విషయములందు లగ్నమైయుండు మనస్సును అహితమైన కృత్యములనుండి మరల్చుటకు శక్యముకాదు. ధృతి మనస్సును నియమించువదిగ నుండును. రజోగుణము మోహము వీనితోకూడినవానియొక్క స్మృతి తత్త్వజ్ఞానము లేనిదిగ నుండుట స్మృతివిభ్రంశ మనబడును. స్మరింపదగినదంతయు స్మృతి ననుసరించి యుండును.

మూ॥ ధీధృతిస్మృతివిభ్రష్టః కర్మ యత్కురుతేఽశుభమ్ । ప్రజ్ఞాపరాధం తం విద్యాత్సర్వదోషప్రకోపణమ్ ॥ ఉదీరణం గతిమతాముదీర్ణానాం చ నిగ్రహః । సేవనం సాహసానాం చ నారీణాం చాతిసేవనమ్ ॥ కర్మకాలాతిపాతశ్చ మిథ్యారమ్భశ్చ కర్మణామ్। వినయాచారలోపశ్చ పూజ్యానాం చాభిధర్షణమ్॥ జ్ఞాతానాం స్వయమర్థానామహితానాం నిషేవణమ్ । పరమౌన్మాదికానాం చ ప్రత్యయానాం నిషేవణమ్॥ అకాలాదేశసంచారౌ మైత్రీ సంక్లిష్టకర్మభిః ! ఇన్ద్రియోపక్రమోక్తస్య సద్వృత్తస్య చ వర్జనమ్ ॥ ఈర్ష్యామానభయక్రోధలోభమోహమదభ్రమాః । తజ్జం వా కర్మ యత్క్లిష్టం యద్వా తద్దేహకర్మ చ॥ యచ్చాన్యదీదృశం కర్మ రజోమోహసముత్థితమ్ । ప్రజ్ఞాపరాధం తం శిష్టా బ్రువతే వ్యాధికారణమ్॥ బుద్ధ్యా విషమవిజ్ఞానం విషమం చ ప్రవర్తనమ్ । ప్రజ్ఞాపరాధం జానీయాన్మనసో గోచరం హి తత్ ॥109॥

అ॥ బుద్ధి ధృతి స్మృతి వీనియొక్క విభ్రంశముకలవాడై అశుభములైనట్టియు సమస్తదోషములను ప్రకోపింపచేయునట్టియు కార్యములను చేయుట ప్రజ్ఞాపరాధమనబడును. మలమూత్రాదివేగములను ప్రేరేపించుట, వేగములను అడ్డగించుట, సాహస కృత్యములను చేయుట, స్త్రీలను అధికముగ రమించుట, సకాలమునందు చికిత్సను చేయకుండుట, కర్మలయొక్క మిథ్యాయోగము, వినయమును ఆచారమును లేకుండుట, పూజ్యులను తిరస్కరించుట, తెలిసియుండియు అహితములైన కృత్యములను ఆచరించుట, మనస్థిమితములేని కార్యములను ఆచరించుట, అకాలమునందును చెడుదేశమునందును సంచరించుట, పాపాత్ములతో స్నేహమును చేయుట, ఇంద్రియోపక్రమణీ

యాధ్యాయమునందు జెప్పబడిన సద్వర్తనమును ఆచరింపకుండుట, ఈర్ష్య అభిమానము భయము కోపము లోభము మోహము మదము భ్రమ వీనిని కలిగియుండుట, వీనిని కలిగియుండి దుష్టకార్యములను చేయుట, రజోగుణము మోహము వీనితోకూడి దేహసంబంధమైనట్టియు మనస్సంబంధమైనట్టియు చెడుకార్యములను చేయుట ఇవి ప్రజ్ఞాపరాధములుగ నుండును. ఇవి వ్యాధులకు కారణములుగ నుండును. మరియు బుద్ధిచేత విషమముగ నాలోచించుట, విషమముగ ప్రవర్తించుట ఇవి ప్రజ్ఞాపరాధ మనబడును. ఇది మనస్సునకు అధీనముగ నుండును.

మూ॥ నిర్దిష్టా కాలసంప్రాప్తిర్వ్యాధీనాం హేతుసంగ్రహే। చయప్రకోపప్రశమాః పిత్తాదీనాం యథా పురా ॥ మిథ్యాతిహీనలిఙ్గాశ్చ వర్షాన్తా రోగహేతవః। జీర్ణభుక్తప్రజీర్ణాన్నకాలఃకాలస్థితిశ్చ యా ॥ పూర్వమధ్యాపరాహ్ణాశ్చ రాత్ర్యా యామాస్త్రయశ్చ యే। తేషు కాలేషు నియతా యే రోగాస్తే చ కాలజాః॥ అన్యేద్యుష్కద్వ్యహగ్రాహి తృతీయక చతుర్థకాః। స్వే స్వే కాలే ప్రవర్తన్తే కాలే హ్యేష్యాం బలాగమః॥ ఏతే చాన్యే చ యే కేచిత్కాలజా వివిధా గదాః। అనాగతే చికిత్స్యాస్తే బలకాలౌ విజానతా ॥ కాలస్య పరిణామేన జరామృత్యునిమిత్తజాః। రోగాః స్వాభావికా దృష్టాః, స్వభావో నిష్ప్రతిక్రియః॥ నిర్దిష్టం దైవశబ్దేన కర్మ యత్పౌర్వదేహికమ్। హేతుస్తదపి కాలేన రోగాణాముపలభ్యతే॥ న హి కర్మ మహత్కించిత్ఫలం యస్య న భుజ్యతే। క్రియాఘ్నాః కర్మజా రోగాః, ప్రశమం యాన్తి తత్క్షయాత్ ॥17॥

అ॥ పిత్తాదిదోషములకు ఋతువులనుబట్టి చయప్రకోపప్రశమములు కలుగుననెడి వాక్యముచే కియంతశ్శిరసీయాధ్యాయమునందు కాలసంప్రాప్తి చెప్పబడినది. హీనమిథ్యాతిలక్షణములతోకూడిన వర్షాంతమగు ఋతువులు. ఆహారము జీర్ణించిన కాలము భుజించినకాలము జీర్ణమగుచున్నకాలము, బాల్యము యౌవనము వార్ధక్యము పూర్వాహ్ణము మధ్యాహ్నము అపరాహ్ణము, రాత్రియొక్క పూర్వకాలము మధ్యకాలము అంత్యకాలము వీనిననుసరించి కలిగిన వ్యాధులు కాలజవ్యాధు లనబడును. అన్యేద్యుష్కజ్వరము చతుర్థకవిపర్యయజ్వరము తృతీయకజ్వరము చాతుర్థికజ్వరము ఇవి తమయొక్క కాలమునందు బలమునుపొంది ప్రవర్తించుచుండును. బలకాలములను తెలిసినవైద్యునిచే ఈవ్యాధులును కాలసంబంధమువలన జనించు ఇట్టి ఇతరవ్యాధులును జనించుటకుపూర్వమునందే చికిత్సింపతగినవిగ నుండును. కాలముయొక్క పరిణామముననుసరించి జరామృత్యురూపములగు స్వాభావికవ్యాధులు కలుగును. ఇవి చికిత్స లేనివిగ నుండును. దైవమనిచెప్పబడు పూర్వజన్మకృతకర్మకూడ కాలపరిణామముచే

రోగములకు కారణమగును. పూర్వజన్మకృతకర్మ గొప్పదైనను స్వల్పమైనదైనను దాని యొక్క ఫలమును అనుభవింపవలసియుండును. కర్మవలనకలిగిన వ్యాధులకు చికిత్స లేదు. ఆ వ్యాధులు కర్మపరిపక్వమునొందగనే నశించును.

మూ॥ అత్యుగ్రశబ్దశ్రవణాచ్ఛ్రవణాత్సర్వశో న చ। శబ్దానాం చాతిహీనానాం భవన్తి శ్రవణాజ్జడాః॥ పరుషోద్భీషణాశస్తాప్రియవ్యసనసూచకైః। శబ్దైః శ్రవణసంయోగో మిథ్యాయోగః స ఉచ్యతే॥ అసంస్పర్శోఽతిసంస్పర్శో హీనసంస్పర్శ ఏవ చ। స్పృశ్యానాం సంగ్రహేణోక్తః స్పర్శనేన్ద్రియబాధకః॥ యో భూతవిషవాతానామకాలేనాగతశ్చ యః। స్నేహశీతోష్ణసంస్పర్శో మిథ్యాయోగః స ఉచ్యతే॥ రూపాణాం భాస్వతాం దృష్టిర్వినశ్యతి హి దర్శనాత్। దర్శనాచ్చాతిసూక్ష్మాణాం సర్వశశ్చాప్యదర్శనాత్॥ ద్విష్టభైరవబీభత్సదూరాతిశ్లిష్టదర్శనాత్। తామసానాం చ రూపాణాం మిథ్యాసంయోగ ఉచ్యతే॥ అత్యాదానమనాదానమోకసాత్మ్యాదభిశ్చ యత్। రసానాం విషమాదానమల్పాదానం చ దూషణమ్॥ అతిమృద్వతితీక్ష్ణానాం గన్ధానాముపసేవనమ్। అసేవనంసర్వశశ్చ ఘ్రాణేన్ద్రియవినాశనమ్॥ పూతిభూతవిషద్విష్టా గన్ధా యే చాప్యనార్తవాః। తైర్గన్ధైర్ఘ్రాణసంయోగో మిథ్యాయోగః స ఉచ్యతే। ఇత్యసాత్మ్యేన్ద్రియసంయోగ స్త్రివిధో దోషకోపనః॥ అసాత్మ్యమితి తద్విద్యాద్యన్న యాతి సహాత్మతామ్ ॥ 27॥

అ॥ మిక్కిలి ఉగ్రమైనశబ్దములను వినుట, శబ్దములను వినకుండుట, మిక్కిలి హీనములైన శబ్దములను వినుటయు, కఠినములైనట్టియు భయంకరములైనట్టియు అమంగళములైనట్టియు ఇష్టముకానట్టియు దుఃఖసూచకములైనట్టియు శబ్దములను వినుట ఇవి శ్రోత్రేంద్రియమునకు అసమ్యగ్యోగములుగ నుండును. వీనివలన దీనికి జడత్వము కలుగును. స్పర్శ లేకుండుట, అధికమగు స్పర్శకలుగుట, స్వల్పమగు స్పర్శకలుగుట, భూతములయొక్కయు విషవాయువులయొక్కయు స్పర్శ కలుగుట, స్నేహముయొక్కయు శీతముయొక్కయు ఉష్ణముయొక్కయు స్పర్శ అకాలమున కలుగుట ఇవి స్పర్శనేంద్రియమునకు అసమ్యగ్యోగములుగ నుండును. వీనివలన దీనికి బాధ కలుగును. మిక్కిలి ప్రకాశించుచున్న రూపములను చూచుట, అతిసూక్ష్మములైన రూపములను చూచుట రూపములను చూడకుండుట, ద్వేషింపబడినట్టియు భయంకరములైనట్టియు బీభత్సములైనట్టియు దూరమునందున్నట్టియు మిక్కిలి దగ్గరగ నున్నట్టియు తామసములైనట్టియు రూపములను చూచుట ఇవి చక్షురింద్రియమునకు అసమ్యగ్యోగములుగ

సుండును. వీనివలన దీనికి నాశనము కలుగును. అధికముగ సేవించుట, సేవింపకుండుట, అభ్యాసములకు విపరీతములైనవానిని సేవించుట, అల్పముగ సేవించుట ఇవి రసనేంద్రియమునకు అసమ్యగ్యోగములుగ నుండును. వీనివలన ఇది చెడును. మిక్కిలి మృదువైనట్టియు మిక్కిలితీక్ష్ణమైనట్టియు గంధములను సేవించుట, సేవింపకుండుట, దుర్గంధము కలిగినట్టియు విషయుక్తమైనట్టియు ద్వేషింపబడినట్టియు ఋతువిపరీతమైనట్టియు గంధములను ఆఘ్రాణించుట ఇవి ఘ్రాణేంద్రియమునకు అసమ్యగ్యోగములుగ నుండును. ఇవి దీనియొక్క శక్తిని తగ్గించును. ఇట్లు హీనమిథ్యాతియోగములచే మూడువిధములగు అసాత్మ్యేంద్రియార్థసంయోగము చెప్పబడినది. దీనివలన దోషములు ప్రకోపించును. అనుకూలముకానిది అసాత్మ్య మనబడును.

మూ॥ మిథ్యాతిహీనయోగేభ్యో యో వ్యాధిరుపజాయతే। శబ్దాదీనాం స విజ్ఞేయో వ్యాధిరైన్ద్రియకో బుధైః॥ వేదనానామసాత్మ్యానామిత్యేతే హేతవః స్మృతాః। సుఖహేతుర్మతస్త్వేకః సమయోగః సుదుర్లభః॥ నేన్ద్రియాణి న చైవార్థాః సుఖదుఃఖస్య హేతవః। హేతుస్తు సుఖదుఃఖస్య యోగో దృష్టశ్చతుర్విధః॥ నస్తీన్ద్రియాణి సన్త్యర్థా యోగో న చ న చాస్తిరుక్। న సుఖం, కారణం తస్మాద్యోగ ఏవ చతుర్విధః॥ నాత్మేన్ద్రియమనోబుద్ధిగోచరం కర్మ వా వినా। సుఖదుఃఖం యథా యచ్చ బోద్ధవ్యం తత్తథోచ్యతే॥ స్పర్శనేన్ద్రియసంస్పర్శః స్పర్శో మానస ఏవ చ। ద్వివిధః సుఖదుఃఖానాం వేదనానాం ప్రవర్తకః॥ ఇచ్ఛాద్వేషాత్మికా తృష్ణా సుఖదుఃఖాత్ప్రవర్తతే। తృష్ణా చ సుఖదుఃఖానాం కారణం పునరుచ్యతే। ఉపాదత్తే హి సా భావాన్ వేదనాశ్రయసంజ్ఞకాన్। స్పృశ్యతే నానుపాదానే నాస్పృష్టో వేత్తి వేదనాః॥135॥

అ॥ శబ్దాదివిషయములయొక్క హీనమిథ్యాతియోగముల వలన ఏవ్యాధి జనించునో అది ఐంద్రియకవ్యాధి యనబడును. అసాత్మ్యములగు బాధలకు హేతువులు పైవిధమున చెప్పబడినవి. శబ్దాదివిషయములయొక్క సమ్యగ్యోగము సుఖమునకు హేతువుగ నుండును. ఇది దుర్లభమైనది. కేవలము ఇంద్రియములు గాని ఇంద్రియార్థములు గాని సుఖదుఃఖములకు హేతువులుగ నుండవు. వీనియొక్క హీనమిథ్యాతిసమ్యగ్యోగ రూపమగు నాలుగువిధములైన సంయోగములే సుఖదుఃఖములకు హేతువులుగ నుండును. ఇంద్రియము లున్నను ఇంద్రియార్థములున్నను వీనికి సంయోగము లేనియెడల దుఃఖము గాని సుఖముగాని కలుగనేరదు. కావున నాలుగువిధములగు సంయోగమే కారణమని చెప్పబడినది. ఆత్మ ఇంద్రియములు మనస్సు బుద్ధి వీనికి గోచరములైన సుఖదుఃఖములు కర్మలేకుండగ ప్రవర్తింపవు; దానిని తెలిసికొనువిధము చెప్పెదము. స్పర్శనేంద్రియ

సంబంధమగు స్పర్శ మనస్సంబంధమగు స్పర్శ ఈరెండును సుఖదుఃఖములు బాధలు వీనిని ప్రవర్తింపచేయునవిగ నుండును. సుఖదుఃఖములవలన ఇచ్ఛాద్వేష రూపమగు అభిలాష కలుగును. అభిలాషయే సుఖదుఃఖములకు కారణముగ నుండును. అభిలాషయే వేదనలకు కారణములగు హీనమిథ్యాతియోగరూపమగు భావములను గ్రహించునదిగ నుండును. గ్రహింపతగిన విషయము లేనప్పుడు స్పర్శ కలుగ నేరదు. స్పర్శలేనిచో బాధలు తెలియ నేరవు.

మూ॥ వేదనానామధిష్ఠానం మనో దేహశ్చ సేన్ద్రియః। కేశలోమనఖాగ్రాన్న మలద్రవగుణైర్వినా॥ యోగే మోక్షే చ సర్వాసాం వేదనానామవర్తనమ్। మోక్షే నివృత్తిర్నిఃశేషా యోగో మోక్షప్రవర్తకః॥ ఆత్మేన్ద్రియమనోర్థానాం సన్నికర్షాత్ప్రవర్తతే। సుఖదుఃఖమనారమ్భాదాత్మస్థే మనసి స్థిరే॥ నివర్తతే తదుభయం వశిత్వం చోపజాయతే। సశరీరస్య యోగజ్ఞాస్తం యోగమృషయో విదుః॥ ఆవేశశ్చేతసో జ్ఞానమర్థానాం ఛన్దతః క్రియా। దృష్టిః శ్రోత్రం స్మృతిః కాన్తిరిష్టతశ్చాప్యదర్శనమ్। ఇత్యష్టవిధమాఖ్యాతం యోగినాం బలమైశ్వరమ్। శుద్ధసత్త్వసమాధానాత్తత్సర్వముపజాయతే॥ మోక్షో రజస్తమోఽభావాద్బలవత్కర్మసంక్షయాత్। వియోగః కర్మసంయోగైరపునర్భావ ఉచ్యతే ॥142॥

అ॥ కేశములు రోమములు గోళ్ళయొక్క చిరవభాగములు ఆహారము మలములు ద్రవపదార్థములు ఇవిగాక మిగిలిన ఇంద్రియములతో కూడిన దేహమును మనస్సును బాధలకు అధిష్ఠానములుగ నుండును. యోగమునందును మోక్షమునందును సమస్తమగు బాధలును నివర్తించును. యోగము మోక్షమునకు సాధనముగ నుండును. మోక్షమునందు సమస్తమగు బాధలును నిశ్శేషముగ నివర్తించును. ఆత్మ ఇంద్రియములు మనస్సు విషయములు వీనియొక్క సంబంధమువలన సుఖదుఃఖములు కలుగును. మనస్సు విషయములనుండి మరలి స్థిరమైనదై ఆత్మజ్ఞానమునందున్నప్పుడు సుఖదుఃఖములు నివర్తించును. అప్పుడు శరీరముతో కూడిన మనస్సునకు వశిత్వము కలుగును. దీనిని ఋషులు యోగమని చెప్పుచున్నారు. పరకాయప్రవేశము, ఇతరులయొక్క మనస్సును తెలిసికొనుట, క్రియలను ఇష్టప్రకారము చేయుట, అతీంద్రియదృష్టి, అతీంద్రియశ్రవణము, సర్వతత్త్వజ్ఞానము, దివ్యకాంతి, ఇష్టమువనుసరించి అదృశ్యుడగుట ఈ ఎనిమిదివిధములగు శ్రేష్ఠమైన బలము యోగీశ్వరులకు కలుగును. ఈ బలమంతయు శుద్ధమైన మనస్సమాధివలననే కలుగును. రజస్తమోగుణములు నశించుటవలనను బలవత్తరమైన కర్మ క్షీణించుటవలనను సమస్తకర్మలయొక్క సంయోగమునకు వియోగముకలిగి పునర్జన్మ కలుగనేరదు. దీనినే మోక్షమని చెప్పుదురు.

మూ॥ సతాముపాసనం సమ్యగసతాం పరివర్జనమ్। వ్రతచర్యోపవాసశ్చ నియమాశ్చ పృథగ్విధాః ॥ ధారణం ధర్మశాస్త్రాణాం విజ్ఞానం విజనేరతిః। విషయేష్వరతిర్మోక్షే వ్యవసాయః పరా ధృతిః ॥ కర్మణామసమారమ్భః కృతానాం చ పరిక్షయః। నైష్క్రమ్యమనహఙ్కారః సంయోగే భయదర్శనమ్॥ మనోబుద్ధిసమాధానమర్థతత్త్వపరీక్షణమ్। తత్త్వస్మృతేరుపస్థానాత్సర్వమేతత్ప్రవర్తతే ॥146॥

అ॥ సత్పురుషులను సేవించుట, దుష్టులను విడిచిపెట్టుట, వ్రతములను ఉపవాసములను ఆచరించుట, అనేకవిధములగు నియమములను కలిగియుండుట, ధర్మశాస్త్రములను పఠించుట, విశేషజ్ఞానము, నిర్జనప్రదేశమునందుకోరిక, విషయములయందిచ్ఛలేకుండుట, మోక్షముకొరకు ప్రయత్నించుట, మనోనియమనము, కర్మల నాచరింపకుండుట, పూర్వకర్మలు క్షీణించుట, సంసారమును విడిచిపెట్టుటయందు కోరిక, అహంకారములేకుండుట, పునర్జన్మయందు భయము, మనస్సునకును బుద్ధికిని నియమము కలుగుట, విషయములయందలి తత్త్వమును పరీక్షించుట ఇవి స్థిరమైన ఆత్మజ్ఞానము వలన కలుగును.

మూ॥ స్మృతిః సత్సేవనాద్యైశ్చ ధృత్యన్తైరుపలభ్యతే। స్మృత్వాస్వభావం భావానాం స్మరన్ దుఃఖాత్ప్రముచ్యతే ॥147॥

అ॥ సత్పురుషులను సేవించుట మొదలుకలిగినట్టియు మనోనియమనము అంతమందుకలిగినట్టియు నియమములచే స్మృతి కలుగును. స్మృతివలన భావములయొక్క స్వభావమును తెలిసికొని దుఃఖములేనివాడగును.

మూ॥ వక్ష్యన్తే కారణాన్యష్టౌ స్మృతిర్యైరుపజాయతే। నిమిత్తరూపగ్రహణాత్సాదృశ్యాత్సవిపర్యయాత్ ॥ సత్త్వానుబన్ధాదభ్యాసాజ్జ్ఞానయోగాత్పునఃశ్రుతాత్। దృష్టశ్రుతానుభూతానాం స్మరణాత్స్మృతిరుచ్యతే ॥149॥

అ॥ స్మృతికలుగుటకుగల ఎనిమిదికారణములు చెప్పబడుచున్నవి. కారణములను చూచుట, సమానరూపమును చూచుట, సదృశమైనవానిని చూచుట, విపరీతరూపమును చూచుట, మనస్సునకు స్తిమితము, అభ్యాసము, తత్త్వజ్ఞానము, మరల వినుట వీనివలన స్మృతి కలుగును. చూచుటచేగాని వినుటచేగాని అనుభూతమైనవిషయమును స్మరించుట స్మృతియనబడును.

మూ॥ ఏతత్తదేకమయనం ముక్తైర్మోక్షస్య దర్శితమ్। తత్త్వస్మృతిబలం, యేన గతా న పునరాగతాః ॥ అయనం పునరాఖ్యాత

మేతద్యోగస్య యోగిభిః। సంఖ్యాతధర్మైః సాంఖ్యైశ్చ ముక్తైర్మోక్షస్య చాయనమ్ ॥151॥

అ॥ తత్త్వజ్ఞానబలమే మోక్షమునకు శ్రేష్ఠమైన మార్గమని జీవన్ముక్తులు చెప్పుచున్నారు. తత్త్వజ్ఞానముచే మోక్షమును పొందినవారికి పునర్జన్మ కలుగ నేరదు. తత్త్వజ్ఞానము యోగమునకు సాధనమని యోగులచే చెప్పబడినది. మరియు విఖ్యాతధర్మము కలిగినట్టియు జీవన్ముక్తులైనట్టియు సాంఖ్యులచే మోక్షమునకు సాధనమని చెప్పబడినది.

మూ॥ సర్వం కారణవద్దుఃఖమస్వం చానిత్యమేవ చ। నచాత్మకృతకం తద్ధి తత్ర చోత్పద్యతే స్వతా॥ యావన్నోత్పద్యతే సత్యా బుద్ధిర్నైతదహం యయా। నైతన్మమ చ విజ్ఞాయ జ్ఞః సర్వమతివర్తతే॥ తస్మింశ్చరమసంన్యాసే సమూలాః సర్వవేదనాః। అసంజ్ఞాజ్ఞానవిజ్ఞానా నివృత్తిం యాన్త్యశేషతః ॥ 54॥

అ॥ ఉత్పత్తిహేతువుకలిగినట్టియు ఆత్మకంటె వ్యతిరిక్తమైనట్టియు సమస్తభావములును దుఃఖహేతువులుగను అనిత్యములుగను నుండును. అన్నియు ఆత్మచే చేయబడవు. "ఇదంతయు నేనుకాదు" అనెడి సత్యమైన బుద్ధి కలుగువరకు బుద్ధ్యాదులయందు మమత్వము కలుగదు. "ఇదంతయు నాదికాదు" అని తెలిసికొనినవాడు సమస్తమును అతిక్రమించును. కర్మసంన్యాసము కలిగినవానికి కారణముతోకూడిన సమస్తమైన బాధలును మోహమును జ్ఞానమును విజ్ఞానమును నిశ్శేషముగ నశించును.

మూ॥ అతః పరం బ్రహ్మభూతో భూతాత్మా నోపలభ్యతే। నిఃసృతః సర్వభావేభ్యశ్చిహ్నం యస్య న విద్యతే॥ గతిర్బ్రహ్మవిదాం బ్రహ్మ తచ్చాక్షరమలక్షణమ్। జ్ఞానం బ్రహ్మవిదాం చాత్ర నాజ్ఞస్తత్ జ్ఞాతుమర్హతి ॥156॥

అ॥ పిమ్మట సమస్తభావములనుండియు విముక్తుడైనట్టియు లక్షణరహితుడైనట్టియు బ్రహ్మస్వరూపమును పొందినట్టియు భూతాత్మ కలుగ నేరదు. నశింపనట్టియు లక్షణరహితమైనట్టియు బ్రహ్మను బ్రహ్మజ్ఞానముకలవారు తెలిసికొనగలరు. అట్టి జ్ఞానములేనివారు తెలిసికొనజాలరు.

## అధ్యాయసంగ్రహము.

మూ॥ ప్రశ్నాః పురుషమాశ్రిత్య త్రయోవింశతిరుత్తమాః। కతిధాపురుషీయేఽస్మిన్నిర్ణీతాస్తత్త్వదర్శినా ॥157॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే శారీరస్థానే కతిధాపురుషీయం శారీరం నామ ప్రథమోఽధ్యాయః ॥

అ॥ ఈకతిధాపురుషీయాధ్యాయమునందు పురుషసంబంధమైన ఉత్తమములగు ఇరువదిమూడుప్రశ్నలు వివరింపబడినవి.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామకకృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపికయనెడి చరకసంహితావ్యాఖ్యానమునందు కతిధాపురుషీయశారీరమనెడు ప్రథమాధ్యాయము సమాప్తము.

— 0 —

# ద్వితీయాధ్యాయము

............

మూ॥ అథాతోఽతుల్యగోత్రీయం శారీరం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట అతుల్యగోత్రీయశారీరమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ అతుల్యగోత్రస్య రజఃక్షయాన్తే రహోవిసృష్టం మిథునీకృతస్య। కిం స్యాచ్చతుష్పాత్ప్రభవం చ షడ్భ్యో యత్స్త్రీషు గర్భత్వముపైతి పుంసః ॥3॥

అ॥ స్త్రీగోత్రముతో సమానముకాని గోత్రముకలిగినట్టియు రజఃప్రవృత్త్యనంతరమున మైథునమునుచేసినట్టియు పురుషునిచే రహస్యముగ విడిచిపెట్టబడినదియు నాలుగు భూతములయొక్క గుణములుకలదియు ఆరురసములవలన జనించునదియు స్త్రీలయందు గర్భమును కలిగించునదియు నగు ఏది కలదో అది యేమిటి ?

మూ॥ శుక్రం తదస్య ప్రవదన్తి ధీరా యద్ధీయతే గర్భసముద్భవాయ। వాయ్వగ్నిభూమ్యబ్గుణపాదవత్ తత్, షడ్భ్యో రసేభ్యః ప్రభవశ్చ తస్య ॥4॥

అ॥ ఏది గర్భమును కలిగించునో వాయువు అగ్ని భూమి ఉదకము అను ఈ నాల్గింటియొక్క గుణములను కలిగియుండునో ఆరురసములనుండియు జనించునో అట్టి దీనిని పెద్దలు శుక్రమని చెప్పెదరు.

మూ॥ సంపూర్ణదేహః సమయే సుఖం చ గర్భః కథం కేన చ జాయతే స్త్రీ। గర్భం చిరాద్విన్దతి సప్రజాఽపి భూత్వాఽథవా నశ్యతి కేన గర్భః ॥౯॥

అ॥ గర్భము సంపూర్ణదేహముకలదిగ ఎట్లగును? సమయమునందు ఎట్లు ప్రాదుర్భవించును? సుఖముగ ఎట్లు ప్రాదుర్భవించును? వంధ్యకాకపోయినను ఎందువలన చిరకాలమునకు గర్భమునుపొందును? గర్భము కలిగి ఎందువలన నశించును?

మూ॥ శుక్రాసృగాత్మాశయకాలసంపద్యస్యోపచారశ్చ హితైస్తథాఽర్థైః। గర్భశ్చ కాలే చ సుఖీ సుఖం చ సంజాయతే సంపరిపూర్ణదేహః॥ యోనిప్రదోషాన్మనసోఽభితాపాచ్ఛుక్రాసృగాహారవిహారదోషాత్। అకాలయోగాద్బలసంక్షయాచ్చ గర్భం చిరాద్విన్దతి సప్రజాఽపి॥ అసృఙ్నిరుద్ధం పవనేన నార్యా గర్భం వ్యవస్యన్త్యబుధాః కదాచిత్। గర్భస్య రూపం హి కరోతి తస్యాస్తదస్రమస్రావి వివర్ధమానమ్॥ తదగ్నిసూర్యశ్రమశోకరోగైరుష్ణాన్నపానైరథవా ప్రవృత్తమ్॥ దృష్ట్వాఽసృగేకే న చ గర్భమజ్ఞాః కేచిన్నరా భూతహృతం వదన్తి॥ ఓజోశనానాం రజనీచరాణామాహారహేతోర్న శరీరమిష్టమ్। గర్భం హరేయుర్యది తే న మాతుర్లబ్ధావకాశా న హరేయురోజః ॥10॥

అ॥ శుక్రము ఆర్తవము ఆత్మ గర్భాశయము కాలము వీనియొక్క సంపత్తుకలిగినట్టియు హితములైన ఉపచారములుకలిగినట్టియు గర్భము పరిపూర్ణదేహముకలదియై సకాలమునందు సుఖముగ ప్రాదుర్భవించును. స్త్రీ వంధ్యకానిదైనను యోనిదోషమువలనను మనోదోషమువలనను శుక్రము ఆర్తవము ఆహారము విహారము వీనియొక్క దోషమువలనను అకాలమునందలి సంయోగమువలనను బలముక్షీణించుటవలనను చిరకాలమునకు గర్భమును ధరించును. స్త్రీయొక్క ఆర్తవము వాయువుచే అడ్డగింపబడి గర్భరూపముగ ఏర్పడును. అప్పుడు ఆర్తవము స్రవింపక గర్భాశయమునందు వృద్ధిపొందును. దీనిని మూఢులు గర్భమని నిర్ణయించెదరు. అగ్ని వేడిమి ఎండవేడిమి శ్రమ దుఃఖము వ్యాధులు వీనిచేగాని ఉష్ణకరములైన అన్నపానములచేగాని బయలువెడలిన అట్టి ఆర్తవమును చూచి తెలియనివారు "గర్భము భూతములచే హరింపబడిన" దని తలచెదరు. ఓజస్సునుభుజించు పిశాచములు మొదలగువానికి ఆహారమునిమిత్తము శరీరము అనుకూలముగ నుండదు. అవకాశముగల ఆ పిశాచాదులు గర్భమును హరించినప్పుడు తల్లియొక్క ఓజస్సును హరింపకుండ నుండవు.

మూ॥ కన్యాం సుతం వా సహితౌ పృథగ్వా సుతౌ సుతే వా తనయాన్బహూన్వా। కస్మాత్ప్రసూతే సుచిరేణ గర్భమేకోఽభివృద్ధిం చ యమేఽభ్యుపైతి ॥11॥

అ॥ కన్యక ఎందువలన జనించును ? పుత్రుడు ఎందువలన జనించును ? ఇద్దరును ఒకేసారి ఎందువలన జనించెదరు ? ఇద్దరు పుత్రులు ఒకేసారి ఎందువలన జనించెదరు ? ఇద్దరు కన్యకలు ఒకేసారి ఎందువలన జనించెదరు ? చాలమంది ఒకేసారి ఎందువలన జనించెదరు ? గర్భమును ఎందువలన చిరకాలమునకు ప్రసవించును ? యమలగర్భము నందు ఒకశిశువుమాత్రమే వృద్ధిపొందుటకు కారణమేమి ?

మూ॥ రక్తేన కన్యామధికేన పుత్రం శుక్రేణ, తేన ద్వివిధీకృతేన। బీజేన కన్యాం చ సుతం చ సూతే యథాస్వబీజాన్యతరాధికేన॥ శుక్రాధికం ద్వైధముపైతి బీజం యస్యాః సుతౌ సా సహితౌ ప్రసూతే। రక్తాధికం వా యది భేదమేతి ద్విధా సుతే సా సహితే ప్రసూతే॥ భినత్తి యావద్బహుధా ప్రపన్నః శుక్రార్తవం వాయురతిప్రవృద్ధః। తావన్త్యపత్యాని యథావిభాగం కర్మాత్మకాన్యస్వవశాత్ప్రసూతే॥ ఆహారమాప్నోతి యదా న గర్భః శోషం సమాప్నోతి పరిస్రుతిం వా। తం స్త్రీ ప్రసూతే సుచిరేణ గర్భం పుష్టో యదా వర్షగణైరపి స్యాత్ ॥ కర్మాత్మకత్వాద్విషమాంశభేదాచ్ఛుక్రాసృజోర్వృద్ధిముపైతి కుక్షౌ। ఏకోఽధికో న్యూనతరో ద్వితీయ ఏవం యమేఽప్యభ్యధికో విశేషః ॥16॥

అ॥ శుక్రశోణితసంయోగమున ఆర్తవమధికముగ కలిసినచో కన్యక జనించును. శుక్రమధికముగ కలిసినచో పుత్రుడు జనించును. ఒకభాగమునందు ఆర్తవమును ఒక భాగమునందు శుక్రమును అధికముగ నుండునట్లు శుక్రశోణితసంయోగము రెండుభాగములుగ విభజింపబడినచో కన్యకయు పుత్రుడును ఒకేసారి జనించెదరు. శుక్రమధికముగకల శుక్రశోణితసంయోగము రెండుభాగములుగ విభజింపబడినచో ఇద్దరుపుత్రులు ఒకేసారి జనించెదరు. ఆర్తవమధికముగకల శుక్రశోణితసంయోగము రెండుభాగములుగ విభజింపబడినచో ఇద్దరుకన్యకలు ఒకేసారి జనించెదరు. వృద్ధిపొందినవాతము శుక్రశోణితసంయోగమును అనేకభాగములుగ విభజించినచో ఆవిభాగముల ననుసరించి చాలమంది ఒకేసారి జనించెదరు. ఇట్టిసంతానము కర్మవశము ననుసరించి జనించును. గర్భము ఆహారమును పొందనిచో కృశించును. లేక స్రావముకలుగును. అట్టిగర్భము నవ పుష్టికలిగిన పిదప అనేక సంవత్సరములకుకూడ ప్రసవించును. యమలగర్భము నందు కర్మవశమువలన శుక్రశోణితములు విషమాంశములుగ చేరుటచే ఒకభాగము అధికముగను రెండవభాగము స్వల్పముగను వృద్ధినొందును.

మూ॥ కస్మాద్ద్విరేతాః పవనేన్ద్రియో వా సంస్కారవాహీ నరనారిషణ్డౌ। వక్రీ తథేర్ష్యాభిరతిః కథం వా సంజాయతే వాతికషణ్డకో వా ॥17॥

అ॥ ద్విరేతస్కుడు, పవనేంద్రియుడు, సంస్కారవాహి, నరషండుడు, నారిషండుడు, వక్రి, ఈర్ష్యాభిరతుడు, వాతికషండుడు అనెడి వీరలు ఏకారణములవలన జనించెదరు ?

మూ॥ బీజాత్సమాంశాదుపతప్తబీజాత్స్త్రీపుంసలిఙ్గీ భవతి ద్విరేతాః। శుక్రాశయం గర్భగతస్య హత్వా కరోతి వాయుః పవనేన్ద్రియత్వమ్॥ శుక్రాశయద్వారవిఘట్టనేన సంస్కారవాహం హి కరోతి వాయుః। మన్దాల్పబీజావబలావహర్షౌ క్లీబౌ చ హేతుర్వికృతిద్వయస్య॥ మాతుర్వ్యవాయప్రతిఘేన వక్రీ స్యాద్బీజదౌర్బల్యతయా పితుశ్చ। ఈర్ష్యాభిభూతావపి మన్దహర్షావీర్ష్యారతేరేవ వదన్తి హేతుమ్॥ వాయ్వగ్నిదోషాద్వృషణౌ తు యస్య నాశం గతౌ వాతికషణ్డకః సః। ఇత్యేవమష్టౌ వికృతిప్రకారాః కర్మాత్మకానాముపలక్షణీయాః ॥21॥

అ॥ శుక్రశోణితములు రెండును సమానముగ కలియుటవలనను అవి తపింపచేయబడుటవలనను స్త్రీపురుషలక్షణములుకల ద్విరేతస్కుడు జనించును. గర్భాశయమునందలి శిశువుయొక్క శుక్రాశయమును వాతము చెడగొట్టుటవలన పవనేంద్రియుడు జనించును. గర్భస్థశిశువుయొక్క శుక్రాశయమార్గమును వాతము దూషింపచేయుటవలన సంస్కారవాహి జనించును. మందవేగముకలిగి స్వల్పముగనుండు బీజము కలిగినట్టియు బలములేనట్టియు ఉత్సాహములేనట్టియు పురుషునివలన నరషండుడు జనించును. ఇట్టి లక్షణములుగల స్త్రీవలన నారిషండుడు జనించును. మైథునకాలమునందు తల్లి అవయవములను విషమముగ నుంచుటవలనను తండ్రియొక్క బీజదౌర్బల్యమువలనను వక్రి జనించును. ఈర్ష్యచే ప్రేరేపింపబడినట్టియు ఉత్సాహములేనట్టియు తల్లిదండ్రులవలన ఈర్ష్యారతుడు జనించును. గర్భస్థశిశువుయొక్క వృషణములను వాయువు అగ్ని ఇవి చెడగొట్టుటవలన వాతికషండుడు జనించును. ఈ యెనిమిది విధములగు నపుంసకులును పూర్వజన్మకృతకర్మవలన జనించెదరు.

మూ॥ గర్భస్య సద్యోఽనుగతస్య కుక్షౌ స్త్రీపుంనపుంసాముదరస్థితానామ్। కిం లక్షణం కారణమిష్యతే కిం సరూపతాం యేన చ యాత్యపత్యమ్ ॥22॥

అ॥ సద్యోగృహీతగర్భలక్షణము లెవ్వి ? గర్భస్థశిశువుయొక్క స్త్రీపురుషనపుంసకభేదములను ఏలక్షణములనుబట్టి తెలిసికొనవచ్చును ? ఆయారూపములుకల సంతానము జనించుటకు కారణమేమి ?

మూ॥ నిష్ఠీవికా గౌరవమఙ్గసాదస్తన్ద్రాప్రహర్షౌ హృదయవ్యథా చ। తృప్తిశ్చ బీజగ్రహణం చ యోన్యాం గర్భస్య సద్యోఽనుగతస్య

లిఙ్గమ్॥ సవ్యాఙ్గచేష్టా పురుషార్థినీ స్త్రీ స్త్రీస్వప్న పానాశనశీల చేష్టా। సవ్యాత్తగర్భా న చ వృత్తగర్భా సవ్యప్రదుగ్ధా స్త్రియమేవ సూతే॥ పుత్రిం త్వతో లిఙ్గవిపర్యయేణ, వ్యామిశ్రలిఙ్గా ప్రకృతిం తృతీయామ్। గర్భోపపత్తౌ తు మనః స్త్రియా యం జన్తుం వ్రజేత్తత్సదృశం ప్రసూతే। గర్భస్య చత్వారి చతుర్విధాని భూతాని మాతా పితృసంభవాని। ఆహారజాన్యాత్మకృతాని చైవ సర్వస్య సర్వాణి భవన్తి దేహే॥ తేషాం విశేషాద్బలవన్తి యాని భవన్తి మాతాపితృకర్మజాని। తాని వ్యవస్యేత్సదృశత్వహేతుం సత్త్వం యథానూకమపి వ్యవస్యేత్ ॥27॥

అ॥ నోటనీరుకారుట, శరీరము బరువుగనుండుట, శరీరము కృశించుట, బడలిక, ఉత్సాహములేకుండుట, హృదయమునందుబాధ, తృప్తిగనుండుట, యోని బీజమును గ్రహించుట ఇవి సద్యోగృహీతగర్భలక్షణములుగ నుండును. ఎడమపార్శ్వమునందలి అవయవములచే పనులను చేయుట, పురుషుని కోరుచుండుట, స్త్రీసంబంధములగు స్వప్నములు పానము ఆహారము స్వభావము చేష్టలు వీనిని కలిగియుండుట, గర్భము ఎడమ పార్శ్వమునందుండుట, గర్భము పొడవుగనుండుట, ఎడమ స్తనమునందు పాలు అధికముగ ఏర్పడుట ఇట్టిలక్షణములుగల స్త్రీకి కన్యక జనించును. ఈలక్షణములకు వ్యతిరేకమైన లక్షణములుగల స్త్రీకి పుత్రుడు జనించును. ఈ రెండువిధములగు లక్షణములును మిశ్రమముగనున్న స్త్రీకి నపుంసకుడు జనించును. గర్భమాకలుగు సమయమున స్త్రీయొక్క మనస్సు ఎట్టిరూపమును తలచునో అట్టిరూపముగల సంతానము జనించును. తల్లివలనను తండ్రివలనను తల్లియొక్క ఆహారమువలనను ఆత్మవలనను నాలుగువిధములగు భూతములకు గర్భముతో సంబంధము కలుగును. అందు తల్లిదండ్రుల వలనను ఆత్మకర్మవలనను ఏర్పడిన భూతములలో ఏవి బలవత్తరముగనుండునో వాని సంబంధమగు రూపము ఏర్పడును. పూర్వజన్మమునందలి సత్త్వముకూడ రూపమునకు హేతువుగ నుండును.

మూ॥ కస్మాత్ప్రజాం స్త్రీ వికృతాం ప్రసూతే హీనాధికాఙ్గీం వికలేన్ద్రియాం చ। దేహాత్కథం దేహముపైతి చాన్యమాత్మా సదా కైరనుబధ్యతే చ ॥28॥

అ॥ హీనమైనట్టిగాని అధికమైనట్టిగాని వికలములైనట్టిగాని అవయవములుకలిగి వికృతమైన సంతానము ఎందువలన కలుగును ? ఆత్మ ఒకదేహమునుండి మరియొకదేహమును ఎట్లు పొందును ? ఆత్మ ఎల్లప్పుడును వేనితోకూడియుండును ?

మూ॥ బీజాత్మకర్మాశయకాలదోషైర్మాతు స్తథాఽఽహార విహారదోషైః। కుర్వన్తి దోషా వివిధాని దుష్టాః సంస్థానవర్ణేన్ద్రియ

వైకృతాని ॥ వర్షాసు కాష్ఠాశ్మఘనామ్బువేగా స్తరోః సరిత్స్రోతసి సంస్థితస్య। యథైవ కుర్యుర్వికృతిం తథైవ గర్భస్య కుక్షౌ నియతస్య దోషాః ॥30॥

అ॥ బీజము, ఆత్మకర్మ, గర్భాశయము, కాలము వీనియొక్క దోషములచేతను తల్లియొక్క ఆహారవిహారదోషములచేతను దుష్టములైన వాతపిత్తశ్లేష్మములు గర్భము యొక్క ఆకారము వర్ణము ఇంద్రియములు వీనియందు వైకల్యమును కలిగించును. నది యందున్న వృక్షమునకు వర్షాకాలమునందు కర్రలు రాళ్ళు ఉదకము వీనియొక్క వేగములు వికృతిని కలిగించువిధమున, కుక్షియందున్న గర్భమునకు దోషములు వికృతిని కలిగించును.

మూ॥ భూతైశ్చతుర్భిః సహితః సుసూక్ష్మైర్మనోజవో దేహముపైతి దేహాత్। కర్మాత్మకత్వాన్న తు తస్య దృశ్యం దివ్యం వినా దర్శనమస్తి రూపమ్॥ స సర్వగః సర్వశరీరభృచ్చ స విశ్వకర్మా స చ విశ్వరూపః। స చేతనాధాతురతీన్ద్రియశ్చ స నిత్యయుక్ సానుశయః స ఏవ॥ రసాత్మమాతాపితృసంభవాని భూతాని విద్యాద్దశ షట్ చ దేహే। చత్వారి తత్రాత్మని సంశ్రితాని స్థితస్తథాऽऽత్మా చ చతుర్షు తేషు॥ భూతాని మాతాపితృసంభవాని రజశ్చ శుక్రం చ వదన్తి గర్భే। ఆప్యాయ్యతే శుక్రమసృక్చ భూతైర్యైస్తాని భూతాని రసోద్భవాని॥ భూతాని చత్వారి తు కర్మజాని యాన్యాత్మలీనాని విశన్తి గర్భమ్। స బీజధర్మా హ్యపరాపరాణి దేహాన్తరాణ్యాత్మని యాతి యాతి॥ రూపాద్ధి రూపప్రభవః ప్రసిద్ధః కర్మాత్మకానాం మనసో మనస్తః। భవన్తి యే త్వాకృతిబుద్ధిభేదా రజస్తమస్తత్ర చ కర్మ హేతుః ॥36॥

అ॥ ఆత్మసూక్ష్మములైన నాలుగువిధములగు భూతములతో కూడి కర్మవశమున ఒకదేహమునుండి మరియొకదేహమును పొందును. దృశ్యమగు రూపము ఆత్మకులేదు. దివ్యదృష్టి లేనన్నచో ఆత్మయొక్క రూపమును చూచుటకు వీలులేదు. ఆత్మ సర్వమును వ్యాపించినదగుటకును సర్వశరీరములను భరించునదిగను సమస్తకర్మలను చేయుటయందు సమర్థమైనది ను సమస్తరూపములనుపొందునదిగను చేతనాధాతువుగను ఇంద్రియములకు గోచరముకానిదిగను ఎల్లప్పుడును బుద్ధ్యాదులతోకూడినదిగను రాగాదులతోకూడినదిగను నుండును. ఆహారరసము, ఆత్మ, తల్లి, తండ్రి వీరివలన గర్భమునందు పదునారు భూతములు ఏర్పడును. అందు నాలుగుభూతములు ఆత్మనాశ్రయించినవిగ నుండును. ఆత్మ ఆనాలిగింటిని ఆశ్రయించియుండును. ఆర్తవమును అనుసరించికలిగిన భూతములు

తల్లివలన కలిగినవిగను శుక్రము ననుసరించి కలిగిన భూతములు తండ్రివలన కలిగినవిగను నుండును. శుక్రమును ఆర్తవమును ఏ భూతములచే పోషింపబడునో ఆ భూతములు ఆహారరసమువలన కలిగినవిగ నుండును. ఆత్మయందులీనమై గర్భమునప్రవేశించు నాలుగుభూతములును కర్మవలన కలిగినవిగ నుండును. ఈ భూతసముదాయము బీజధర్మమును కలిగియుండును. ఇది ఆత్మయందుండి ఆయాశరీరములను పొందించుచుండును. కర్మానుబంధము కలవారలకు భౌతికశరీరమునుండి భౌతికశరీరమును, మనస్సునుండి మనస్సును పుట్టును. ఆకారమునందును బుద్ధియందును భేదములు కలుగుటకు రజోగుణమును తమోగుణమును కర్మయు కారణములుగ నుండును.

మూ॥ అతీన్ద్రియైస్తైరతిసూక్ష్మరూపైరాత్మా కదాచిన్న వియుక్తరూపః। న కర్మణా నైవ మనోమతిభ్యాం న చాప్యహఙ్కారవికారదోషైః॥ రజస్తమోభ్యాం తు మనోఽనుబద్ధం జ్ఞానం వినా తత్ర హి సర్వదోషాః। గతిప్రవృత్త్యోస్తు నిమిత్తముక్తం మనః సదోషం బలవచ్చ కర్మ ॥38॥

అ॥ అతీంద్రియములైనట్టియు అతిసూక్ష్మములైనట్టియు భూతములతోడను, కర్మ మనస్సు బుద్ధి వీనితోడను, అహంకారము వికారము అనెడి దోషములతోడను, ఆత్మ ఎల్లప్పుడును కూడియుండును. మనస్సు రజస్తమోగుణములతో కూడియుండును. అందువలన జ్ఞానములేనిచో మనస్సునందు సమస్తదోషములును కలుగును. అట్టిదోషములతోకూడిన మనస్సును బలవత్తరమైన కర్మయు దేహాంతరగమనమునకును ధర్మాధర్మకార్యముల నాచరించుటకును కారణములుగ నుండును.

మూ॥ రోగాః కుతః సంశమనం కిమేషాం హర్షస్య శోకస్య చ కిం నిమిత్తమ్। శరీరసత్త్వప్రభవా వికారాః కథం న శాన్తాః పునరావతేయుః ॥39॥

అ॥ వ్యాధులు ఎందువలన కలుగును ? ఎట్లు శాంతించును ? సంతోషము ఎందువలన కలుగును ? దుఃఖము ఎందువలన కలుగును ? శారీరకములైనట్టియు మానసికములైనట్టియు వ్యాధులు శాంతించినవై మరల ఎట్లు కలుగకుండును ?

మూ॥ ప్రజ్ఞాపరాధో విషమాస్తథాఽర్థా హేతుస్తృతీయః పరిణామకాలః। సర్వామయానాం త్రివిధా చ శాన్తిర్జ్ఞానార్థకాలాః సమయోగయుక్తాః॥ ధర్మ్యాః క్రియా హర్షనిమిత్తముక్తాస్తతోఽన్యథా శోకవశం నయన్తి। శరీరసత్త్వప్రభవాస్తు దోషాస్తయోరవృత్త్యా న భవన్తి భూయః॥ రూపస్య సత్త్వస్య చ సంతతిర్యా నోక్తస్తదాదిర్న హి సోఽస్తి కశ్చిత్ । తయోరవృత్తిః క్రియతే పరాభ్యాం

ధృతిస్మృతిభ్యాం పరయా ధియా చ॥ సత్త్వాశ్రయే వా ద్వివిధే యథోక్తే పూర్వం గదేభ్యః ప్రతికర్మ నిత్యమ్। జితేన్ద్రియం నానుపతన్తి రోగాస్తత్కాలయుక్తం యది నాస్తి దైవమ్॥ దైవం పురా యత్కృతముచ్యతే తత్, తత్పౌరుషం యత్త్విహ కర్మ దృష్టమ్। ప్రవృత్తిహేతుర్విషమః స దృష్టో నివృత్తిహేతుస్తు సమః స ఏవ ॥44॥

అ॥ ప్రజ్ఞాపరాధము, అసాత్మ్యేంద్రియార్థసంయోగము, కాలపరిణామము వీని వలన వ్యాధులు కలుగును. కర్మ, ఇంద్రియార్థములు, కాలము వీనియొక్క సమ్యగ్యోగములవలన శాంతించును. ధర్మకార్యములవలన సంతోషము కలుగును. అధర్మకార్యములవలన దుఃఖము కలుగును. మోక్షముకలిగి శరీరమునకును మనస్సునకును సంబంధము పోయినచో శారీరకములైనట్టి గాని మానసికములైనట్టి గాని వ్యాధులు మరల కలుగ నేరవు. శరీరముయొక్కయు మనస్సుయొక్కయు ఏ పరంపరాసంబంధము కలదో దానికి ఆది చెప్పబడలేదు. దానికి ఆది స్వభావముగనే లేదు. శ్రేష్ఠములైన ధృతి స్మృతి బుద్ధి వీనివలన శరీరసత్త్వములయొక్క పరంపరాసంబంధము నివర్తించును. పైని చెప్పబడిన శరీరమనోరూపములగు రెండువిధములైన ఆశ్రయములున్నను, వ్యాధులు కలుగుటకు పూర్వమునందే ప్రతిక్రియను చేసికొనునట్టి జితేంద్రియునకు తత్కాలమునందనుభవింపతగిన పూర్వకృతకర్మ లేకున్నచో వ్యాధులు కలుగ నేరవు. పూర్వజన్మయందు చేయబడిన కర్మ దైవమనబడును. ఈ జన్మయందు చేయబడిన కర్మ పౌరుషమనబడును. అట్టికర్మ విషమమైనదైనచో రోగహేతువుగను సమమైనదైనచో ఆరోగ్య హేతువుగను నుండును.

మూ॥ హైమన్తికం దోషచయం వసన్తే ప్రవాహయన్ గ్రైష్మికమభ్రకాలే। ఘనాత్యయే వార్షికమాశు సమ్యక్ప్రాప్నోతి రోగానృతుజాన్న జాతు ॥45॥

అ॥ హేమంతఋతువునందు చయమునొందిన దోషమును వసంతఋతువునందును, గ్రీష్మఋతువునందు చయమునొందిన దోషమును వర్షఋతువునందును, వర్షఋతువునందు చయమునొందిన దోషమును శరదృతువునందును శోధించుచున్నచో ఋతువులననుసరించి కలుగు వ్యాధులు ఒకానొకప్పుడును కలుగ నేరవు.

మూ॥ నరో హితాహారవిహారసేవీ సమీక్ష్యకారీ విషయేష్వసక్తః। దాతా సమః సత్యపరః క్షమావానాప్తోపసేవీ చ భవత్యరోగః॥ మతిర్వచః కర్మ సుఖానుబన్ధి సత్త్వం విధేయం విశదా చ బుద్ధిః। జ్ఞానం తపస్తత్పరతా చ యోగే యస్యాస్తి తం నానుపతన్తి రోగాః ॥47॥

అ॥ హితములైన ఆహారవిహారములను సేవించునట్టియు ఆలోచించికార్యములను చేయునట్టియు విషయలోలుడు కానట్టియు దాతగను సమబుద్ధికలవాడుగను సత్యవంతుడుగను ఓర్పుకలవాడుగను ఆప్తులను సేవించువాడుగను నుండునట్టియు మనుజుడు వ్యాధిరహితుడుగ నుండును. యోగ్యములైన మతియు వాక్కును కర్మయు కలిగినట్టియు అధీనమైనమనస్సు కలిగినట్టియు నిర్మలమైన బుద్ధికలిగినట్టియు తత్త్వజ్ఞానమును తపస్సును యోగమునందు తత్పరతయు కలిగినట్టియు మనుజునకు వ్యాధులు కలుగ నేరవు.

అధ్యాయసంగ్రహము.

మూ॥ ఇహాగ్నివేశస్య మహార్థయుక్తం షట్త్రింశకం ప్రశ్నగణం మహర్షిః। అతుల్యగోత్రే భగవాన్ యథావన్నిర్ణీతవాన్జ్ఞానవివర్ధనార్థమ్॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే శారీరస్థానే అతుల్యగోత్రీయశారీరం నామ ద్వితీయోఽధ్యాయః॥

అ॥ ఈ అతుల్యగోత్రీయాధ్యాయమునందు, అగ్నివేశునిచే అడుగబడినట్టియు గొప్ప అర్థముకలిగినట్టియు ముప్పదియారుప్రశ్నలకు సమాధానమును భగవంతుడగు ఆత్రేయుడు జ్ఞానాభివృద్ధికొరకు తగురీతిని చెప్పెను.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామకకృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపికయనెడి చరకసంహితావ్యాఖ్యానమునందు అతుల్యగోత్రీయశారీరమనెడు ద్వితీయాధ్యాయము సమాప్తము.

— 0 —

# తృతీయాధ్యాయము

............

మూ॥ అథాతః ఖుడ్డీకాం గర్భావక్రాన్తిం శారీరం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట ఖుడ్డీకాగర్భావక్రాంతిశారీరమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః॥ 2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ పురుషస్యానుపహతరేతసః స్త్రియాశ్చాప్రదుష్టయోనిశోణితగర్భాశయాయా యదా భవతిసంసర్గః ఋతుకాలే, యదా చానయోస్తథాయుక్తే చ సంసర్గే శుక్రశోణితసంసర్గమన్తర్గర్భా

శయగతం జీవోఽవక్రామతి సత్త్వసంప్రయోగాత్తదా గర్భోఽభినిర్వర్తతే, స సాత్మ్యరసోపయోగాదరోగోఽభిసంవర్ధతే సమ్యగుపచారైశ్చోపచర్యమాణః, తతః ప్రాప్తకాలః సర్వేన్ద్రియోపపన్నః పరిపూర్ణసర్వశరీరో బలవర్ణసత్త్వసంహననసంపదుపేతః సుఖేన జాయతే సముదాయాదేషాం భావానామ్ ॥౩॥

అ॥ పరిశుద్ధముగనున్న శుక్రముకల పురుషునకును పరిశుద్ధములుగనున్న యోని ఆర్తవము గర్భాశయము ఇవికల స్త్రీకిని ప్రశస్తమైన ఋతుకాలమునందు సంయోగము కలుగగా అట్టి స్త్రీపురుషులయొక్క ఆసంయోగమునందు గర్భాశయముయొక్క లోపలిభాగమునుపొందిన శుక్రశోణితములయొక్క సంయోగమును ఎప్పుడు జీవుడు మనోగమనమువలన పొందునో అప్పుడు గర్భము ఏర్పడును. హితకరములైన రసములను తల్లి ఉపయోగించుటవలనను అనుకూలములైన ఉపచారములచే ఉపచరింపబడుటవలనను అట్టిగర్భము రోగములులేనిదై వృద్ధినొందుచు సమస్తేంద్రియములతోడను కూడుకొని పరిపూర్ణమైన సమస్తదేహముకలదై బలము వర్ణము సత్త్వము నిర్మాణము వీనియొక్క సంపత్తుతో కూడినదై శుక్రశోణితాదిభావములయొక్క సముదాయమువలన సకాలమునందు సుఖముగ జనించును.

మూ॥ మాతృజశ్చాయం గర్భః పితృజశ్చాత్మజశ్చ సాత్మ్యజశ్చ రసజశ్చాస్తి చ సత్త్వమౌపపాదికమితి హోవాచ భగవానాత్రేయః॥ నేతి భరద్వాజః । కిం కారణం, హి న మాతా న పితా నాత్మా న సాత్మ్యం న పానాశనభక్ష్యలేహ్యోపయోగా గర్భం జనయన్తి, న చ పరలోకాదేత్య గర్భం సత్త్వమవక్రామతి॥5॥

అ॥ గర్భము మాతృజముగను పితృజముగను ఆత్మజముగను సాత్మ్యజముగను రసజముగను నుండుననియు సత్త్వము ఔపపాదికముగ నుండుననియు భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను. అట్లుకాదని భరద్వాజుడు చెప్పెను. ఎందువలననగా _ తల్లిగాని తండ్రిగాని ఆత్మగాని సాత్మ్యముగాని పానము ఆహారము భక్ష్యము లేహ్యము వీనియొక్క ఉపయోగములుగాని గర్భమును కలిగింపవు. మరియు మనస్సు పరలోకమునుండివచ్చి గర్భమునందు ప్రవేశింపదు.

మూ॥ యది హి మాతాపితరౌ గర్భం జనయేతాం భూయస్యః స్త్రియః పుమాంసశ్చ భూయాంసః పుత్రకామాః, తే సర్వే పుత్రజన్మాభిసంధాయ మైథునధర్మమాపద్యమానాః పుత్రానేవ జనయేయుర్దుహితౄర్వా దుహితృకామాః, న చ కాశ్చిత్ స్త్రియః కేచిద్వా పురుషా నిరపత్యాః స్యుః అపత్యకామాశ్చ పరిదేవేరన్ ॥6॥

అ॥ తల్లిదండ్రులు గర్భమును కలిగించునెడల చాలమంది స్త్రీలును చాలమంది పురుషులును పుత్రులను కోరినవారై మైథునము నాచరించి పుత్రులను కలిగించెదరు. పుత్రికలను కోరినవారై పుత్రికలను కలిగించెదరు. ఏస్త్రీగాని ఏపురుషుడుగాని సంతానము లేనివారుగ నుండరు. మరియు సంతానమును కోరినవారై దుఃఖింపనవసరములేదు.

మూ॥ న చాత్మా౽౽త్మానం జనయతి; యది హ్యాత్మా౽౽త్మానం జనయేజ్జాతో వా జనయేదాత్మానమజాతో వా? తచ్చోభయథా౽ప్యయుక్తం, న హి జాతో జనయతి, సత్త్వాత్; న చాజాతో జనయతి, అసత్త్వాత్; తస్మాదుభయథా౽ప్యనుపపత్తిః; తిష్ఠతు తావదేతత్; యద్యయమాత్మానం శక్తో జనయితుం స్యాత్, న త్వేవమిష్టాస్వేవ కథం యోనిషు జనయేద్వశినమప్రతిహతగతిం కామరూపిణం తేజోబలజవవర్ణసత్త్వసంహననముదితమజరమరుజమమరం; ఏవంవిధం హ్యాత్మా౽౽త్మానమిచ్ఛత్యతో వా భూయః॥7॥

అ॥ ఆత్మ తనను కలిగింపదు. ఆత్మ తనను కలిగించునెడల పుట్టిగాని పుట్టకగాని తనను కలిగింపవలసియుండును. అట్టి రెండువిధములును అయుక్తములుగ నుండును. ఎందువలననగా — పుట్టినది ఉండుటవలన పుట్టింపనేరదు. పుట్టనిది, లేనిదగుటవలన పుట్టింపనేరదు. ఇందువలన పైరెండువిధములును అయుక్తములుగ నుండును. ఆవిషయమును అట్లుండనిమ్ము. ఆత్మ తనను పుట్టించుటకు సమర్థమైనదైనయెడల తనను ఇష్టమైన యోనులయందు పుట్టుదానినిగను వశిత్వము అడ్డులేనిగమనము కామరూపము తేజస్సు బలము వేగము వర్ణము సత్త్వము నిర్మాణము ఇవి కలదానినిగను ముసలితనము వ్యాధులు మరణము ఇవి లేనిదానినిగను ఎందుకుచేయదు? ఆత్మ తనకు ఇట్టిగుణములుగాని ఇంతకంటె అధికమైన గుణములుగాని ఉండునట్లు కోరుకొనునుగదా?

మూ॥ అసాత్మ్యజశ్చాయం గర్భః; యది హి సాత్మ్యజః స్యాత్, తర్హి సాత్మ్యసేవినామేకాన్తేన ప్రజా స్యాత్, అసాత్మ్యసేవినశ్చ నిఖిలేనానపత్యాః స్యుః, తచ్చోభయముభయత్రైవ దృశ్యతే॥

అ॥ గర్భము సాత్మ్యసేవనమువలన కలుగదు. సాత్మ్యసేవనమువలన గర్భము కలుగునెడల సాత్మ్యమును సేవించువారలకే తప్పక సంతానము కలుగవలసియుండును. అసాత్మ్యమును సేవించువారందరును సంతానములేనివారుగ నుండవలసియుండును. కాని సాత్మ్యమును సేవించువారుకూడ సంతానములేనివారుగను అసాత్మ్యమును సేవించువారుకూడ సంతానముకలవారుగనున్నారు.

మూ॥ అరసజశ్చాయం గర్భః, యది హి రసజః స్యాత్, న కేచిత్ స్త్రీపురుషేష్వనపత్యాః స్యుః, న హి కశ్చిదస్త్యేషాం యో

రసానోప్సయుక్తైః శ్లేష్మరసోపయోగినాం చేద్గర్భా జాయన్తే ఇత్యతోఽభిప్రేతం, ఇత్యేవం సత్యాజౌరభ్రమార్గమాయూరగో క్షీరదధిఘృతమధుతైలసైన్ధవేక్షురసముద్గశాలిభృతానామేవైకాన్తేన ప్రజా స్యాత్, శ్యామాకవరకోద్దాలకకోరదూషకకన్దమూలభక్ష్యాశ్చ నిఖిలేనానపత్యాః స్యుః, తచ్చోభయముభయత్రైవ దృశ్యతే॥9॥

అ॥ గర్భము రసమువలన కలుగదు. రసమువలన గర్భము కలుగునెడల ఏస్త్రీగాని ఏపురుషుడుగాని సంతానములేనివారుగ నుండరు. రసముల నుపయోగింపనివారెవ్వరును ఉండరుగదా! శ్లేష్మములైన రసముల నుపయోగించువారలకు గర్భము కలుగునని తలచునెడల మేక గొఱ్ఱె లేడి నెమలి వీనియొక్క మాంసరసములను ఆవుయొక్క పాలను పెరుగును ఘృతమును తేనెను తైలమును సైంధవలవణమును చెఱుకురసమును పెసలను శాలిధాన్యమును ఉపయోగించువారలకే తప్పక సంతానము కలుగవలసియుండును. చామలు వరగలు అడవిఆరిగెలు కొఱ్ఱలు దుంపలు వేళ్ళు వీనిని ఉపయోగించువార లందరును సంతానములేనివారుగ నుండవలసియుండును. కాని శ్లేష్మములైన రసముల నుపయోగించువారుకూడ సంతానములేనివారుగను శ్లేష్మములుకాని రసముల నుపయోగించువారుకూడ సంతానముకలవారుగను నున్నారు.

మూ॥ న ఖల్వపి పరలోకాదేత్య సత్త్వం గర్భమవక్రామతి; యది హ్యేనమవక్రామేత్, నాస్య కించిదేవ పౌర్వదేహికం స్యాదవిదితమదృష్టం వా, న చ కించిదపి స్మరతి॥10॥

అ॥ సత్త్వము పరలోకమునుండివచ్చి గర్భమునందు ప్రవేశింపదు. అట్లు ప్రవేశించునెడల పూర్వదేహమునందలి విషయములు తెలియబడుచును చూడబడుచును నుండవలయును. ఏమియు స్మరింపబడుటలేదుకదా!

మూ॥ తస్మాదేతద్బ్రూమహే-అమాతృజశ్చాయం గర్భోఽపితృజశ్చానాత్మజశ్చాసాత్మ్యజశ్చారసజశ్చ, న చాస్తి సత్త్వమౌపపాదిక మితి హోవాచ భరద్వాజః॥ నేతి భగవానాత్రేయః, సర్వేభ్య ఏభ్యో భావేభ్యః సముదితేభ్యో గర్భోఽభినిర్వర్తతే॥12॥

అ॥ అందువలన ఇట్లు చెప్పుచున్నాము. గర్భము మాతృజముకాదనియు పితృజముకాదనియు ఆత్మజముకాదనియు సాత్మ్యజముకాదనియు రసజముకాదనియు సత్త్వము ఔపపాదికముకాదనియు భరద్వాజుడు చెప్పెను. ఇట్లుచెప్పుట యుక్తముకాదనియు ఈ సమస్తభావములును కలియుటవలన గర్భము ఏర్పడుచున్నదనియు భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను,

మూ॥ మాతృజశ్చాయం గర్భః; న హి మాతుర్వినా గర్భోత్పత్తిః స్యాన్న చ జన్మ జరాయుజానాం; యాని ఖల్వస్య గర్భస్య మాతృజాని, యాని చాస్య మాతృతః సంభవతః సంభవన్తి, తాన్యనువ్యాఖ్యాస్యామః। తద్యథా—త్వక్ చ లోహితం చ మాంసం చ మేదశ్చ నాభిశ్చ హృదయం చ క్లోమ చ యకృచ్చ ప్లీహా చ వృక్కౌ చ వస్తిశ్చ పురీషాధానం చామాశయశ్చ పక్వాశయశ్చోత్తరగుదం చాధంగుదం చ క్షుద్రాన్త్రం చ స్థూలాన్త్రం చ వపా చ వపావహనంచేతి మాతృజాని ॥13॥

అ॥ గర్భము తల్లివలన ఏర్పడును. తల్లిలేనిచో గర్భోత్పత్తియు జరాయుజములకు (మనుష్యాదులకు) జన్మయు కలుగనేరదు. ఈగర్భమునకును జనించినదానికిని తల్లివలన ఏవి కలుగునో వానిని చెప్పుచున్నాము. చర్మము, రక్తము, మాంసము, మేదస్సు, నాభి, హృదయము, క్లోమము, యకృత్తు, ప్లీహము, వృక్కములు, వస్తి, పురీషాశయము, ఆమాశయము, పక్వాశయము, గుదప్రదేశముయొక్క ఊర్ధ్వాధోభాగములు, పిల్లప్రేగులు, పెద్దప్రేగులు, వప, వపావహనము అను నివి తల్లివలన కలుగును.

మూ॥ పితృజశ్చాయం గర్భః; న హి పితుర్ఋతే గర్భోత్పత్తిః స్యాన్న చ జన్మ జరాయుజానాం, యాని ఖల్వస్య గర్భస్య పితృజాని, యాని చాస్య పితృతః సంభవతః సంభవన్తి, తాన్యనువ్యాఖ్యాస్యామః। తద్యథా — కేశశ్మశ్రునఖలోమదన్తాస్థిసిరాస్నాయుధమన్యః శుక్రమితి పితృజాని ॥14॥

అ॥ గర్భము తండ్రివలన ఏర్పడును. తండ్రిలేనిచో గర్భోత్పత్తియు జరాయుజములకు జన్మయు కలుగనేరదు. ఈగర్భమునకును జనించినదానికిని తండ్రివలన ఏవి కలుగునో వానిని చెప్పుచున్నాము. కేశములు, మీసములు, గోళ్ళు, రోమములు, దంతములు, ఎముకలు, నిరలు, స్నాయువులు, ధమనులు, శుక్రము అను నివి తండ్రి వలన కలుగును.

మూ॥ ఆత్మజశ్చాయం గర్భః; గర్భాత్మా హ్యన్తరాత్మా యః, తం జీవ ఇత్యాచక్షతే శాశ్వతమరుజమజరమమరమక్షయమభేద్యమచ్ఛేద్యమలోడ్యం విశ్వరూపం విశ్వకర్మాణమవ్యక్తమనాదిమనిధనమక్షరమపి; స గర్భాశయమనుప్రవిశ్య శుక్రశోణితాభ్యాం సంయోగమేత్య గర్భత్వేన జనయత్యాత్మానం, ఆత్మసంజ్ఞా హి గర్భే, తస్య పునరాత్మనో జన్మానాదిత్వాన్నోపపద్యతే, తస్మాదజాత ఏవాయం

గర్భం జనయతి, అజాతో హ్యాయమజాతం గర్భం జనయతి; స చైవ గర్భః కాలాన్తరేణ బాలయువస్థవిరభావానవాప్నోతి, స యస్యాం యస్యామవస్థాయాం వర్తతే తస్యాం తస్యాం జాతో భవతి, యా త్వస్య పురస్కృతా తస్యాం జనిష్యమాణశ్చ; తస్మాత్స ఏవ జాతశ్చాజాతశ్చ యుగపద్భవతి, యస్మింశ్చైతదుభయం సంభవతి జాతత్వం జనిష్యమాణత్వం చ, స చ జాతో జన్యతే, స చైవానాగతేష్వవస్థాన్తరేష్వజాతో జనయత్యాత్మనాఽఽత్మానం; సతో హ్యవస్థాన్తరగమనమాత్రమేవ హి జన్మ చోచ్యతే తత్ర తత్ర వయసి తస్యాం తస్యామవస్థాయాం, యథా సతామేవ శుక్రశోణితజీవానాం ప్రాక్సంయోగాద్గర్భత్వం న భవతి, తచ్చ సంయోగాద్భవతి, యథా సతస్తస్యైవ చ పురుషస్య ప్రాగపత్యాత్పితృత్వం న భవతి, తచ్చాపత్యాద్భవతి, తథా సతస్తస్యైవ గర్భస్య తస్యాం తస్యామవస్థాయాం జాతత్వమజాతత్వం చోచ్యతే ॥15॥

అ॥ గర్భము ఆత్మవలన ఏర్పడును. అంతరాత్మయైన గర్భాత్మ జీవుడనబడును. అట్టి జీవుని శాశ్వతునిగను బాధలులేనివానినిగను ముసలితనములేనివానినిగను మరణములేనివానినిగను నశింపనివానినిగను భేధింపబడనివానినిగను ఛేదింపబడనివానినిగను కలత లేనివానినిగను సమస్తరూపములు కలవానినిగను సమస్తకర్మలు కలవానినిగను వ్యక్తముకానివానినిగను ఆదిరహితునిగను అంతములేనివానినిగను మార్పుచెందనివానినిగను చెప్పుచున్నారు. అట్టి అంతరాత్మ గర్భాశయమునందు ప్రవేశించి శుక్రశోణితములతో సంసర్గమును పొంది తనను గర్భరూపముగ కలిగించును. అప్పుడు గర్భమునందు ఆత్మయనుసంజ్ఞ కలుగును. ఆదిరహితమైనదగుటవలన అట్టిఆత్మకు జన్మ కలుగదు. అందువలన ఈఆత్మ పుట్టకయే గర్భమును పుట్టించును. పుట్టని ఈ ఆత్మ పుట్టియుండని గర్భమును పుట్టించును. అట్టిగర్భమే కాలక్రమమునుబట్టి బాల్యయౌవనవార్ధక్యములనెడి యవస్థలను పొందును. అది ఏయే అవస్థయందు ఉండునో ఆ యవస్థయందు పుట్టినదిగ నుండును. దీనికి ఏయే అవస్థ కలుగనున్నదో దానియందు పుట్టబోవునదిగ నుండును. అందువలన అదియే పుట్టినదిగను పుట్టనదిగనుకూడ ఒకమారుగనే అగుచున్నది. పుట్టినదిగను పుట్టబోవునదిగను నుండు గర్భమునందు ఆత్మ పుట్టినదై తనను పుట్టించును. గర్భమునకు ఈ నానాఅవస్థలుకలుగుటకు పూర్వమునందు ఆత్మ పుట్టనిదై తనను పుట్టించును. ఉన్నట్టి వంటి ఆత్మకు ఆయావయస్సునందు ఆయాఅవస్థలను పొందుటయే జన్మయనబడును. ఉన్నటువంటి శుక్రశోణితజీవులకు గర్భమనుసంజ్ఞ సంయోగముకలుగుటకంటె పూర్వమునందు కలుగక సంయోగము కలిగినపిమ్మట ఎట్లుకలుగునో ఉన్నటువంటి పురుషునికి తండ్రియనుసంజ్ఞ సంతానముకలుగుటకంటె పూర్వమునందు కలుగక

సంతానముకలిగినపిమ్మట ఎట్లుకలుగునో అట్లే ఉన్నటువంటి ఆగర్భమునకే ఆయా అవస్థలనుబట్టి పుట్టుటయు పుట్టకుండుటయు చెప్పబడుచున్నది.

మూ॥ న తు ఖలు గర్భస్య మాతుర్న పితుర్నాత్మనః సర్వభావేషు యథేష్టకారిత్వమస్తి; తే కించిత్స్వవశాత్కుర్వన్తి కించిత్కర్మవశాత్, క్వచిచ్చైషాం కరణశక్తిర్భవతి క్వచిన్న భవతి. యత్ర సత్త్వాదికరణసంపత్తత్ర యథాబలమేవ యథేష్టకారిత్వమతోఽన్యథా విపర్యయః; న చ కరణదోషాదకారణమాత్మా సంభవతి గర్భజననే, దృష్టం చేష్టయోన్యైశ్వర్యం మోక్షశ్చాత్మవిద్భిరాత్మాయత్తం, న హ్యన్యః సుఖదుఃఖయోః కర్తా; న చాన్యతో గర్భో జాయతే జాయమానః న చాఙ్కురోత్పత్తిరబీజాత్ ॥16॥

అ॥ తల్లికిగాని తండ్రికిగాని ఆత్మకుగాని గర్భముయొక్క సమస్తభావములయందును యథేష్టకారిత్వము లేదు. వారు తమవశమువలన కొంచెమును, కర్మవశమువలన కొంచెమును చేయుదురు సాధనసంపత్తి ననుసరించి వీరికి ఒక్కొక్కచోట యథేష్టకారిత్వము కలుగును. ఒక్కొక్కచోట కలుగదు. ఎప్పుడు మనస్సు మొదలగుసాధనములయొక్క సంపత్తుఉండునో అప్పుడు వానియొక్క బలమునను సరించి వలన కొంచెమును చేయుదురు. సాధనసంపత్తిననుసరించి వీరికి ఒక్కొక్కచోట యథేష్టకారిత్వము కలుగుచుండును. లేనిచో కలుగదు. సాధనములయందు దోషము ఉన్నను ఆత్మ గర్భమునుకలిగించుటకు కారణము కాకపోదు. ఇష్టయోనిగమనమును ఐశ్వర్యమును మోక్షమును ఆత్మకు అధీనములుగ నుండునని ఆత్మవేత్తలు చెప్పుచున్నారు. సుఖదుఃఖములకు ఆత్మకంటె ఇతరమైనకర్త లేదు. పుట్టునట్టిగర్భము ఆత్మకంటె ఇతరమైనదానివలన పుట్టదు. బీజముకానిదానివలన అంకురోత్పత్తి కానేరదు.

మూ॥ యాని తు ఖల్వస్య గర్భస్యాత్మజాని, యాని చాస్యాత్మతః సంభవతః సంభవన్తి, తాన్యనువ్యాఖ్యాస్యామః; తద్యథా— తాసు తాసు యోనిషూత్పత్తిరాయురాత్మజ్ఞానం మన ఇన్ద్రియాణి ప్రాణాపానౌ ప్రేరణం ధారణమాకృతిస్వరవర్ణవిశేషాః సుఖదుఃఖే ఇచ్ఛాద్వేషౌ చేతనా ధృతిర్బుద్ధిః స్మృతిరహఙ్కారః ప్రయత్నశ్చేత్యాత్మజాని ॥17॥

టీ॥ ఈగర్భమునకును జనించినదానికిని ఆత్మవలన ఏవి కలుగునో వానిని చెప్పుచున్నాము. ఆయాయోనులయందు పుట్టుక, ఆయువు, ఆత్మజ్ఞానము, మనస్సు, ఇంద్రియములు, ప్రాణవాయువు, అపానవాయువు, ప్రేరేపించుట, ధరించుట, ఆకారము, స్వరము, వర్ణము, సుఖము, దుఃఖము, ఇచ్ఛ, ద్వేషము, చైతన్యము, ధారణాశక్తి, బుద్ధి, స్మరణము, అహంకారము, ప్రయత్నము అనునివి ఆత్మవలన కలుగును.

మూ॥ సాత్మ్యజశ్చాయం గర్భః; న హ్యసాత్మ్యసేవిత్వమన్తరేణ స్త్రీపురుషయోర్వన్ధ్యత్వమస్తి గర్భేషు వాఽప్యనిష్టో భావః; యావత్ఖల్వసాత్మ్యసేవినాం స్త్రీపురుషాణాం త్రయో దోషాః ప్రకుపితాః శరీరముపసర్పన్తో న శుక్రశోణితగర్భాశయోపఘాతాయోపపద్యన్తే, తావత్సమర్థా గర్భజననాయ భవన్తి; సాత్మ్యసేవినాం పునఃస్త్రీపురుషాణామనుపహతశుక్రశోణితగర్భాశయానామృతుకాలే సంనిపతితానాం జీవస్యానవక్రమణాద్గర్భా న ప్రాదుర్భవన్తి; న హి కేవలం సాత్మ్యజ ఏవాయం గర్భః, సముదాయోఽత్ర కారణముచ్యతే; యాని తు ఖల్వస్య గర్భస్య సాత్మ్యజాని, యాని చాస్య సాత్మ్యతః సంభవతః సంభవన్తి, తాన్యనువ్యాఖ్యాస్యామః॥ తద్యథా— ఆరోగ్యమనాలస్యమలోలుపత్వమిన్ద్రియప్రసాదః స్వరవర్ణబీజసంపత్ప్రహర్షభూయస్త్వం చేతి సాత్మ్యజాని ॥18॥

ఆ॥ గర్భము సాత్మ్యసేవవలన ఏర్పడును. అసాత్మ్యసేవన లేనిచో స్త్రీపురుషులకు వంధ్యత్వముగాని గర్భములయందు అనిష్టభావముగాని ఉండదు అసాత్మ్యసేవనమును చేయు స్త్రీపురుషులకు ఎంతవరకు మూడుదోషములును ప్రకోపించిశరీరమునందువ్యాపించినవై శుక్రము శోణితము గర్భాశయము వీనికి విఘాతమును కలిగింపనో అంతవరకు గర్భములు కలుగును. సాత్మ్యమును సేవించునట్టియు పరిశుద్ధములుగనున్న శుక్రమును శోణితమును గర్భాశయమునుకలిగినట్టియు ప్రశస్తమైనఋతుకాలమునందు సంయోగమునొందినట్టియు స్త్రీపురుషులకు, జీవుడు, సంక్రమింపకపోయినచో గర్భములు కలుగనేరవు. గర్భము కేవలసాత్మ్యసేవనమువలననే కలుగనేరదు. శుక్రశోణితాదులయొక్క సముదాయమువలన కలుగును. ఈగర్భమునకును జనించినదానికిని సాత్మ్యసేవనమువలన ఏవికలుగునో వానిని చెప్పుచున్నాము. ఆరోగ్యము, సోమరితనములేకుండుట విషయాసక్తిలేకుండుట, ఇంద్రియనైర్మల్యము, స్వరము, వర్ణము, బీజసంపత్తు, సంతోషము, ఇవి సాత్మ్యసేవనమువలన కలుగును.

మూ॥ రసజశ్చాయం గర్భః; న హి రసాదృతే మాతుః ప్రాణయాత్రాఽపి స్యాత్కింపునర్గర్భజన్మ, న చైవమసమ్యగుపయుజ్యమానా రసా గర్భమభినిర్వర్తయన్తి, చ కేవలం సమ్యగుపయోగాదేవ రసానాం గర్భాభినిర్వృత్తిర్భవతి, సముదాయోఽప్యత్ర కారణముచ్యతే; యాని తు ఖల్వస్య గర్భస్య రసజాని, యానిచాస్య రసతః సంభవతః సంభవన్తి, తాన్యనువ్యాఖ్యాస్యామః; తద్యథా—

శరీరస్యాభినిర్వృత్తిరభివృద్ధిః ప్రాణానుబన్ధస్తృప్తిః పుష్టిరుత్సాహశ్చేతి రసజాని ॥ 9 ॥

అ॥ గర్భము రసమువలన ఏర్పడును. రసములను సేవింపనిచో తల్లియొక్క ప్రాణమే ఉండనేరదు. అట్టితరి గర్భోత్పత్తికలుగదని వేరుగ చెప్పవలయునా ? రసములను సరిగనుపయోగింపనిచో గర్భము కలుగనేరదు. కేవలము రసములను సరిగ నుపయోగించుటవలననే గర్భము కలుగదు. గర్భము కలుగుటకు సముదాయముకూడ కారణముగ నుండును. ఈగర్భమునకును జనించినదానికిని రసమువలన ఏవి కలుగునో వానిని చెప్పుచున్నాము. అంగప్రత్యంగములయొక్క ఏర్పాటు, అభివృద్ధి, బలము, తృప్తి, పుష్టి ఉత్సాహము ఇవి రసమువలన కలుగును.

మూ॥ అస్తి ఖల్వపి సత్త్వమౌపపాదికం యజ్జీవస్పృక్ శరీరేణాభిసంబధ్నాతి; యస్మిన్నపగమనపురస్కృతే శీలమస్య వ్యావర్తతే, భక్తిర్విపర్యస్యతే, సర్వేన్ద్రియాణ్యుపతప్యన్తే, బలం హీయతే, వ్యాధయ ఆప్యాయన్తే, యస్మాద్ధీనః ప్రాణాఞ్జహాతి, యదిన్ద్రియాణామభిగ్రాహకం చ మన ఇత్యభిధీయతే; తత్త్రివిధమాఖ్యాయతే — శుద్ధం రాజసం తామసం చేతి। యేనాస్య ఖలు ప్రయత్నో భూయిష్ఠం, తేన ద్వితీయాయామాజాతౌ సంప్రయోగో భవతి; యదా తు తేనైవ శుద్ధేన సంయుజ్యతే తదా జాతేరతిక్రాన్తాయా అపి స్మరతి; స్మార్తం హి జ్ఞానమాత్మనస్తస్యైవ మనసోఽనుబన్ధాదనువర్తతే, యస్యానువృత్తిం పురస్కృత్య పురుషో జాతిస్మర ఇత్యుచ్యతే ఇతి సత్త్వముక్తమ్। యాని ఖల్వస్య గర్భస్య సత్త్వజాని, యాని చాస్య సత్త్వతః సంభవతః సంభవన్తి తాన్యనువ్యాఖ్యాస్యామః; తద్యథా — భక్తిః శీలం శౌచం ద్వేషః స్మృతిర్మోహస్త్యాగో మాత్సర్యం శౌర్యం భయం క్రోధస్తన్ద్రీరుత్సాహస్తైక్ష్ణ్యం మార్దవం గామ్భీర్యమనవస్థితత్వమిత్యేవమాదయశ్చాన్యే, తే సత్త్వజా వికారాః; తానుత్తరకాలం సత్త్వభేదమధికృత్య ఉపదేక్ష్యామ ఇతి సత్త్వజాని । నానావిధాని ఖలు సత్త్వాని తాని సర్వాణ్యేకపురుషే భవన్తి, న చ భవన్త్యేకకాలం, ఏకం తు ప్రాయోవృత్త్యాఽఽహ ॥ 20॥

అ॥ మనస్సు ఔపపాదికముగ నుండును. ఏది ఆత్మను స్పర్శయుక్తముగు శరీరముతో కూర్చునో, ఏదిపోవుటకు ఉన్ముఖముగనున్నప్పుడు శీలము మారునో ఇచ్ఛ మార్పుచెందునో సమస్తేంద్రియములు తపింపజేయబడునో బలము క్షీణించునో వ్యాధులు

వృద్ధిపొందునో, ఏది పోయినయెడల ప్రాణములుపోవునో ఏది ఇంద్రియములను ధరించియుండునో అది మనస్సు అని చెప్పబడును. అట్టిమనస్సు సాత్త్వికమనియు రాజసమనియు తామసమనియు మూడువిధములుగ నుండును. మనస్సునకు సత్త్వరజస్తమోగుణములలో దేనితో ఎక్కువ సంబంధముండునో అట్టి గుణముయొక్క సంబంధము రెండవజన్మయందు ఉండును. ఎప్పుడు మనస్సు సత్త్వగుణముతో కూడియుండునో అప్పుడు గడచిపోయినజన్మనుకూడ స్మరించును. స్మరింపబడినజ్ఞానము ఆత్మకు అట్టిమనస్సుయొక్క సంబంధమువలననే అనుసరించిఉండును. అట్లుఅనుసరించియుండుటను ఆధారముగచేసికొని పురుషుడు జాతిస్మరుడుఅని చెప్పబడుచున్నాడు. ఈవిధమున సత్త్వము చెప్పబడినది. ఈగర్భమునకును జనించినదానికిని సత్త్వమువలన ఏవి కలుగునో వానిని చెప్పుచున్నాము. ఇచ్ఛ స్వభావము శౌచము ద్వేషము స్మృతి మోహము త్యాగము మాత్సర్యము శౌర్యము భయము కోపము పాలుమాలిక ఉత్సాహము తీక్ష్ణత్వము మృదుత్వము గాంభీర్యము నిలుకడలేకుండుట ఇవియు ఇట్టియితరములును సత్త్వమువలన కలుగును. ఇతరభావములు సత్త్వభేదముల నాధారముగచేసికొని ముందుచెప్పబడగలవు. అన్నివిధములగుసత్త్వములును ఒకేపురుషునియందు ఉండును. కానిఒకేకాలమునందు ఉండవు. ఏసత్త్వమధికముగనుండునో అట్టిసత్త్వముకలవాడుగ చెప్పుదురు.

మూ॥ ఏవమయం నానావిధానామేషాం గర్భకరాణాం భావానాం సముదాయాదభినిర్వర్తతే గర్భః, యథా కూటాగారం నానాద్రవ్యసముదాయాత్, యథా వా రథో నానారథాఙ్గసముదాయాత్; తస్మాదేతదవోచామ—మాతృజశ్చాయం గర్భః పితృజశ్చాత్మజశ్చ సాత్మ్యజశ్చ రసజశ్చ, అస్తి చ సత్త్వమౌపపాదుకమితి హోవాచ భగవానాత్రేయః ॥ 31॥

అ॥ అనేకవిధములైన పరికరములయొక్క సముదాయమువలన గృహమును, అనేకవిధములైనరథపరికరములయొక్క సముదాయమువలన రథమును ఏర్పడువిధమున అనేకవిధములైనట్టియు గర్భకరములైనట్టియు భావములయొక్క సముదాయవలన గర్భము ఏర్పడును. అందువలన గర్భము మాతృజముగను పితృజముగను ఆత్మజముగను సాత్మ్యజముగను రసజముగను ఉండుననియు సత్త్వము ఔపపాదికమనియు చెప్పితిమని ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ భరద్వాజ ఉవాచ — యద్యయమేషాం నానావిధానాం గర్భకరాణాం భావానాం సముదాయాదభినిర్వర్తతే గర్భః, కథమయం సన్ధీయతే, యది చాపి సంధీయతే కస్మాత్సముదాయప్రభవః సన్ గర్భో మనుష్యవిగ్రహేణ జాయతే, మనుష్యశ్చ మనుష్యప్రభవ ఉచ్యతే ॥ తత్ర చేదిష్టమేతద్యస్మాన్మనుష్యో మనుష్యప్రభ

వస్తస్మాదేవ మనుష్యవిగ్రహేణ జాయతే, యథా—గౌర్గోప్రభవః, యథా చాశ్వోఽశ్వప్రభవః ఇత్యేవంసతి యదుక్తమగ్రే సముదాయాత్మక ఇతి తదయుక్తం; యది చ మనుష్యో మనుష్యప్రభవః, కస్మాజ్జడాన్ధకుబ్జమూకవామనమిన్మినవ్యఙ్గోన్మత్తకుష్ఠికిలాసిభ్యో జాతాః పితృశదృశరూపా న భవన్తి। అథాత్రాపి బుద్ధిరేవం స్యాత్ - స్వేనైవాయమాత్మా చక్షుషా రూపాణి వేత్తి, శ్రోత్రేణ శబ్దాన్, ఘ్రాణేన గన్ధాన్, రసనేన రసాన్, స్పర్శనేన స్పర్శాన్, బుద్ధ్యా బోద్ధవ్యమిత్యనేన హేతునా న జడాదిభ్యో జాతాః పితృసదృశా భవన్తి; అత్రాపి ప్రతిజ్ఞాహానిదోషః స్యాత్, ఏవముక్తే హ్యాత్మా సత్స్విన్ద్రియేషు జ్ఞః స్యాదసత్స్వజ్ఞః, యత్ర చైతదుభయం సంభవతి జ్ఞత్వమజ్ఞత్వం చ. స వికారశ్చాత్మాత్మా। యది చ దర్శనాదిభిరాత్మా విషయాన్వేత్తి, నిరిన్ద్రియో దర్శనాదివిరహాదజ్ఞః స్యాత్ అజ్ఞత్వాదకారణం, అకారణత్వాచ్చ నాత్మేతి వాగ్వస్తుమాత్రమేతద్వచనమనర్థకం స్యాదితి హోవాచ భరద్వాజః ॥22॥

ఆ॥ అనేకవిధములైనట్టియు గర్భకరములైనట్టియు ఈభావములయొక్క సముదాయమువలన గర్భము ఏర్పడునెడల ఇది ఎట్లు కలియును? అట్లుకలిసినను సముదాయమువలన ఏర్పడు గర్భము మనుష్యవిగ్రహముగ ఎట్లు పుట్టును? మనుష్యుడు మనుష్యప్రభవుడని చెప్పబడుచున్నాడు. మనుష్యుడు మనుష్యప్రభవుడని అంగీకరించినచో గోవు గోవువలనపుట్టునట్లును గుఱ్ఱము గుఱ్ఱమువలనపుట్టునట్లును మనుష్యుడు మనుష్యునివలనపుట్టును. అట్లయినచో గర్భముసముదాయాత్మకమని పూర్వమునందు చెప్పబడిన విషయము అయుక్తముగ నుండును. మనుష్యుడు మనుష్యప్రభవుడైనచో మందుడు గ్రుడ్డివాడు గూనివాడు మూగవాడు పొట్టివాడు నత్తివాడు మంగుకలవాడు ఉన్మాదముకలవాడు కుష్ఠముకలవాడు బొల్లికలవాడు వీరివలన పుట్టినవారు ఎందువలన అట్టి తల్లిదండ్రులతో సమానమైన రూపముకలవారుగ నుండుటలేదు? ఈవిషయమైకూడ ఇట్టి అభిప్రాయము కలుగవచ్చును. ఎట్లనగా - ఆత్మ తనసంబంధమైనచక్షురింద్రియముచే రూపములను, శ్రోత్రేంద్రియముచే శబ్దములను, ఘ్రాణేంద్రియముచే గంధములను, రసనేంద్రియముచే రసములను, స్పర్శనేంద్రియముచే స్పర్శములను తెలిసికొనును. బుద్ధిచే తెలిసికొనతగినదానిని తనబుద్ధిచే తెలిసికొనును. ఈకారణముచే మందుడు మొదలగువారివలనపుట్టినవారు తల్లిదండ్రులతో సమానమైనరూపముకలవారుగ నుండుటలేదు. ఇట్టిఅభిప్రాయము ఉన్నచో ప్రతిజ్ఞాహాని అనెడిదోషము కలుగును ఎందువలననగా - ఇంద్రియములున్నచో ఆత్మ తెలిసినవాడుగను ఇంద్రియములులేనిచో తెలియనివాడుగను నుండవలసియుండును. ఇటు తెలియుట తెలియకపోవుట అను

రెండును సంభవించినచో ఆత్మ సవికారముగ నుండవలయును. ఆత్మ చక్షురాదీంద్రియములచే విషయములను తెలిసికొనునెడల ఇంద్రియరహితుడగుఆత్మ చక్షురాదీంద్రియములు లేనివాడగుటవలన అజ్ఞుడగును. అజ్ఞుడగుటవలన కారణభూతుడుకాకపోవును. కారణభూతుడు కాకపోవుటవలన "ఆత్మ అర్థరహితమైన శబ్దముమాత్రమే" యను వాక్యము అర్థరహితముగ నుండును. ఇట్లు భరద్వాజుడు చెప్పెను.

మూ॥ ఆత్రేయ ఉవాచ–పురస్తాదేతత్ ప్రతిజ్ఞాతం – సత్త్వం జీవస్పృక్ శరీరేణాభిసంబధ్నాతీతి; యస్మాత్తు సముదాయప్రభవఃసన్ గర్భో మనుష్యవిగ్రహేణ జాయతే, మనుష్యో మనుష్యప్రభవ ఇత్యుచ్యతే, తద్వక్ష్యామః ॥23॥

అ॥ ఆత్రేయుడు ఇట్లు చెప్పెను. ఎట్లనగా—సత్త్వము ఆత్మను స్పర్శయుక్త శరీరముతోకూర్చునని పూర్వమునందు చెప్పబడినది. గర్భము సముదాయమువలన ఏర్పడి మనుష్యవిగ్రహముగ ఎట్లుపుట్టునదియు మనుష్యుడు మనుష్యునివలన ఎట్లు జనించునదియు చెప్పబడుచున్నది.

మూ॥ భూతానాం చతుర్విధా యోనిర్భవతి – జరాయ్వణ్డస్వేదోద్భిదః। తాసాం ఖలు చతసృణామపి యోనీనామేకైకా యోనిరపరిసంఖ్యేయభేదా భవతి, భూతానామాకృతివిశేషాపరిసంఖ్యేయత్వాత్। తత్ర జరాయుజానామణ్డజానాం చ ప్రాణినామేతే గర్భకరాభావా యాం యాం యోనిమాపద్యన్తే తస్యాం తస్యాం యోనౌ తథాతథారూపా భవన్తి; తద్యథా– కనకరజతతామ్రత్రపుసీసకాన్యాసిచ్యమానాని తేషు తేషు మధూచ్ఛిష్టవిగ్రహేషు, తే యదా మనుష్యబిమ్బమాపద్యన్తే తదా మనుష్యవిగ్రహేణ జాయన్తే, తస్మాత్సముదాయాత్మకః సన్ గర్భో మనుష్యవిగ్రహేణ జాయతే, మనుష్యో మనుష్యప్రభవ ఇత్యుచ్యతే, తద్యోనిత్వాత్ ॥24॥

అ॥ భూతములయొక్క జాతులు—జరాయుజములు, అండజములు, స్వేదజములు, ఔద్భిదములు అని నాలుగువిధములుగ నుండును. భూతములయొక్క ఆకృతివిశేషములు అపరిసంఖ్యేయములుగనుండుటవలన ఈనాలుగువిధములైనజాతులలో ప్రతిజాతియు అపరిసంఖ్యేయముగనుండును. గర్భకరములగుభావములు జరాయుజములయొక్కయు అండజములయొక్కయు ఏయేయోనిని పొందునో ఆయాయోనియందు ఆయారూపములుకలవిగ నగును. ఎటులననగా—బంగారము వెండి రాగి తగరము సీసము వీనినికరిగించి ఆయామైనపుబొమ్మలయందు పోసినచో ఆయారూపములుకలవిగ నగునట్లు గర్భకరములగుభావములు ఆయారూపములుకలవిగ నగును. ఆభావములు

మనుష్యబింబమునుపొందినప్పుడు మనుష్యవిగ్రహముగ పుట్టును. అందువలన గర్భము సముదాయాత్మకమై మనుష్యవిగ్రహముగ పుట్టును. మనుష్యునినుండిపుట్టుటవలన మనుష్యుడు మనుష్యప్రభవుడని చెప్పబడుచున్నాడు.

మూ॥ యచ్చోక్తం—యది చ మనుష్యో మనుష్య ప్రభవః కస్మాన్న జడాదిభ్యో జాతాః పితృసదృశరూపా భవన్తీతి, తత్రోచ్యతే—యస్య యస్య హ్యఙ్గావయవస్య బీజే బీజభాగ ఉపతప్తో భవతి తస్య తస్యాఙ్గావయవస్య వికృతిరుపజాయతే, నోపజాయతే చానుపతాపాత్, తస్మాదుభయోపపత్తిరప్యత్ర; సర్వస్య చాత్మజానీన్ద్రియాణి, తేషాం భావాభావహేతుర్దైవం, తస్మాన్నైకాన్తతో జడాదిభ్యో జాతాః పితృసదృశరూపా భవన్తి ॥25॥

అ॥ మనుష్యుడు మనుష్యప్రభవుడైనచో మందుడు మొదలగువారివలనపుట్టువారు అట్టి తల్లిదండ్రులతో సమానమైనవారుగ ఎందుకుఉండరో ఆవిషయమై చెప్పబడుచున్నది బీజమునందు ఏయే అవయవమునకుసంబంధించిన బీజభాగము దూషింపబడునో ఆయా అవయవమునకు వికృతి కలుగును. బీజభాగము దూషింపబడనిచో వికృతి కలుగదు. అందువలన రెండువిధములుగను సంభవింపవచ్చును. ఇంద్రియములు ఆత్మవలన పుట్టును. ఇంద్రియములు కలుగుటకుగాని కలుగకుండుటకుగాని తనయొక్క పూర్వజన్మకృతకర్మ కారణముగ నుండును. అందువలన మందుడు మొదలగువారివలన పుట్టువారు అట్టి తల్లిదండ్రులతో సమానమైనవారుగ నుండవలయుననెడి నియమము లేదు.

మూ॥ న చాత్మా సత్స్విన్ద్రియేష్వసత్సు వా భవత్యజ్ఞః; న హ్యసత్త్వః కదాచిదాత్మా; సత్త్వవిశేషాచ్చోపలభ్యతే జ్ఞానవిశేష ఇతి ॥26॥

అ॥ ఇంద్రియములు ఉన్నను లేకున్నను ఆత్మ తెలిసినవాడుగనే యుండును. ఆత్మ ఒకానొకప్పుడును సత్త్వరహితుడుగ నుండదు. కావున సత్త్వవిశేషమువలన జ్ఞానవిశేషము కలుగును.

మూ॥ న కర్తురిన్ద్రియాభావాత్కార్యజ్ఞానం ప్రవర్తతే। యైః క్రియా వర్తతే యా తు సా వినా తైర్న వర్తతే॥ జానన్నపి మృదోఽభావాత్కుమ్భకృన్న ప్రవర్తతే। శ్రూయతాం చేదమధ్యాత్మమాత్మజ్ఞానబలం మహత్ ॥ ఇన్ద్రియాణి చ సఙ్క్షిప్య మనః సంగృహ్య చఞ్చలమ్। ప్రవిశ్యాధ్యాత్మమాత్మజ్ఞః స్వే జ్ఞానే పర్యవస్థితః॥ సర్వత్ర విహితజ్ఞానః సర్వభావాన్ పరీక్షతే। గృహ్ణీష్వ చేద

మపరం భరద్వాజ! వినిర్ణయమ్॥ నివృత్తేన్ద్రియవాక్చేష్టః సుప్తః స్వప్నగతాన్ యదా। విషయాన్ సుఖదుఃఖే చ వేత్తి నాజ్ఞోఽస్యతః స్మృతిః॥ ఆత్మజ్ఞానాదృతే చైకం జ్ఞానం కించిన్న వర్తతే। న హ్యేకో వర్తతే భావో వర్తతే నాప్యహేతుకః॥ తస్మాజ్జ్ఞః ప్రకృతిశ్చాత్మా ద్రష్టా కారణమేవ చ। సర్వమేతద్భరద్వాజ! నిర్ణీతం జహి సంశయమ్ ॥౩౭॥

అ॥ ఇంద్రియములులేకున్నచో కర్తకు కార్యజ్ఞానము కలుగదు. ఏభావములచే ఏక్రియ ప్రవర్తించునో ఆభావములు లేనియెడల ఆక్రియ ప్రవర్తింపదు. కుమ్మరివాడు తెలిసియున్నను మట్టిలేనిచో కుండలను చేయజాలడు. ఆత్మసంబంధమైనట్టియు గొప్పదైనట్టియు ఆత్మజ్ఞానబలమును వినుము. ఇంద్రియములను విషయములనుండి మరలించి చంచలమైనమనస్సును అరికట్టి ఆత్మయందుప్రవేశించి ఆత్మజ్ఞానమునుపొందినట్టియు స్తిమితమైనజ్ఞానముకలిగినట్టియు ఆత్మజ్ఞుడు సమస్తభావములను తెలిసికొనుచున్నాడు. మరియొకనిర్ణయమును వినుము. ఇంద్రియములు వాక్కు— వీనియొక్క వ్యాపారములేనివాడై నిద్రించుచున్నను స్వప్నగతములైనవిషయములను సుఖదుఃఖములను తెలిసికొనుచున్నాడు. అందువలన ఆత్మ తెలిసినవాడుగ నుండును. ఆత్మజ్ఞానములేనిదే ఎట్టిజ్ఞానమును కలుగనేరదు. ఏభావమైనను కారణములేకుండగగాని కర్తలేకుండగగాని ప్రవర్తింపదు. అందువలన ఆత్మ తెలిసినవాడనియు ప్రకృతియనియు ద్రష్టయనియు కారణభూతుడనియు నిర్ణయింపబడినది. అందువలన ఓభరద్వాజుడా! నీసంశయమును విడిచిపెట్టుము.

## అధ్యాయ సంగ్రహము.

మూ॥ హేతుర్గర్భస్య నిర్వృత్తౌ వృద్ధౌ జన్మని చైవ యః। పునర్వసుమతిర్యా చ భరద్వాజమతిశ్చ యా॥ ప్రతిజ్ఞాప్రతిషేధశ్చ విశదశ్చాత్మనిర్ణయః॥ గర్భావక్రాన్తిముద్దిశ్య ఖుడ్డీకాం తత్ ప్రకాశితమ్॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే సిద్ధిస్థానే ఖుడ్డీకాగర్భావక్రాన్తిశారీరం నామ తృతీయోఽధ్యాయః॥

అ॥ ఈఖుడ్డీకాగర్భావక్రాంతిశారీరాధ్యాయమునందు గర్భము ఏర్పడుటకు కారణము, వృద్ధిపొందుటకు కారణము, పుట్టుటకు కారణము, ఆత్రేయునియొక్క మతము, భరద్వాజునియొక్క మతము, ప్రతిజ్ఞాప్రతిషేధము, పరిపూర్ణమైన ఆత్మనిర్ణయము ఇవి చెప్పబడినవి.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు ఖుడ్డీకాగర్భావక్రాన్తిశారీరమనెడు తృతీయాధ్యాయము సమాప్తము.

—౦—

# చతుర్థాధ్యాయము.

మూ॥ అథాతో మహతీం గర్భావక్రాన్తిం శారీరం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట మహతీగర్భావక్రాంతిశారీరమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ యతశ్చ గర్భః సంభవతి, యస్మింశ్చ గర్భసంజ్ఞా, యద్వికారశ్చ గర్భో, యథాచానాపూర్వ్యాఽభినిర్వర్తతే కుక్షౌ, యశ్చాస్య వృద్ధిహేతుః, యతశ్చాస్యాజన్మ భవతి, యతశ్చ జాయమానః కుక్షౌ వినాశం ప్రాప్నోతి, యతశ్చ కార్త్స్న్యేనావినశ్యన్వికృతిమాపద్యతే, తదనువ్యాఖ్యాస్యామః ॥3॥

అ॥ గర్భము దేనివలన కలుగును ? దేనికి గర్భమనెడిసంజ్ఞ కలుగును ? గర్భము దేనియొక్కస్వరూపము ? గర్భము కుక్షియందు ఏక్రమముగ ఏర్పడును? గర్భము ఎట్లువృద్ధినొందును? గర్భము ఏర్పడకుండుటకు కారణమేమి? కుక్షియందు గర్భము ఎందువలన వినాశమునొందును? ఎందువలన గర్భముపూర్తిగనశింపక వికృతినొందును? ఈవిషయములన్నిటిని చెప్పుచున్నాము.

మూ॥ మాతృతః పితృత ఆత్మతః సాత్మ్యతో రసతః సత్త్వత ఇత్యేతేభ్యో భావేభ్యః సముదితేభ్యో గర్భః సంభవతి । తస్య యే యేఽవయవా యతో యతః సంభవతః సంభవన్తి తాన్విభజ్య మాతృజాదీనవయవాన్ పృథక్పృథగుక్తమగ్రే ॥4॥

అ॥ తల్లి తండ్రి ఆత్మ సాత్మ్యసేవనరసము సత్త్వము అనునీ భావములయొక్క సముదాయమువలన గర్భము ఏర్పడును. అట్టిగర్భమునకు తల్లిమొదలగువానివలనఏయే అవయవములు కలుగునో వానిని ప్రత్యేకముగ వివరించి ఇదివరలో చెప్పితిమి.

మూ॥ శుక్రశోణితజీవసంయోగే తు ఖలు కుక్షిగతే గర్భసంజ్ఞా భవతి ॥5॥

అ॥ కుక్షినిపొందిన శుక్రము శోణితము జీవము వీనియొక్క సంయోగము గర్భమనబడును.

మూ॥ గర్భస్తు ఖల్వన్తరిక్షవాయ్వగ్నితోయభూమివికారశ్చేతనాధిష్ఠానభూతః; ఏవమనయా యుక్త్యా పఞ్చమహాభూతవికారసముదాయాత్మకో గర్భశ్చేతనాధాత్వధిష్ఠానభూతః, స హ్యస్య షష్ఠో ధాతురుక్తః ॥6॥

ఆ॥ గర్భము—ఆకాశము వాయువు అగ్ని జలము భూమి వీనియొక్క స్వరూపముగనుండి చైతన్యమునకు అధిష్ఠానముగ నుండును. అందువలన పంచమహాభూతసముదాయాత్మకముగను చేతనాధాతువునకు అధిష్ఠానభూతముగను నుండును. ఆ చేతనాధాతువు గర్భమునకు ఆరవధాతువుగనుండును.

మూ॥ యథా చాయమానుపూర్వ్యాఽభినిర్వర్తతే కుక్షౌ తదనువ్యాఖ్యాస్యామః—గతే పురాణే రజసి నవే చావస్థితే, శుద్ధస్నాతాం స్త్రియమవ్యాపన్నయోనిశోణితగర్భాశయామృతుమతీమాచక్ష్మహే, తయా సహ తథాభూతయా యదా పుమానవ్యాపన్నబీజో మిశ్రీభావం గచ్ఛతి, తదా తస్య హర్షోదీరితః పరః శరీరధాత్వాత్మా శుక్రభూతోఽఙ్గాదఙ్గాత్సంభవతి । స తథా హర్షభూతేనాత్మనోదీరితశ్చాధిష్ఠితశ్చ బీజరూపో ధాతుః పురుషశరీరాదభినిష్పత్యోచితేన పథా గర్భాశయమనుప్రవిశ్యార్తవేనాభిసంసర్గమేతి ॥7॥

ఆ॥ గర్భము కుక్షియందు ఏక్రమముగ ఏర్పడునో దానిని చెప్పుచున్నాము. ప్రాతఆర్తవము పోయి క్రొత్తఆర్తవము ఏర్పడినట్టియు శుద్ధస్నానము చేసినట్టియు పరిశుద్ధములుగనున్న యోనియు శోణితమును గర్భాశయమును కలిగినట్టియు స్త్రీ ఋతుమతియనబడును. అట్టిస్త్రీతో పరిశుద్ధముగనున్న శుక్రముగల పురుషుడు ఎప్పుడు సంయోగము నొందునో అప్పుడు అట్టిపురుషునియొక్క సంతోషముచే ప్రేరేపింపబడినట్టియు సారభూతమైనట్టియు శరీరధాతుస్వరూపమైనట్టియు శుక్రము ప్రతి అవయవమునుండియు సంభవించును. అట్లుసంభవించినట్టియు సంతోషముతోకూడిన ఆత్మచే ప్రేరేపింపబడినట్టియు అట్టిఆత్మచేతఅధిష్ఠింపబడినట్టియు బీజరూపమైనట్టియు శుక్రము పురుషశరీరమునుండి బయలువెడలి ఉచితమైన మార్గముద్వారా గర్భాశయమునందు ప్రవేశించి ఆర్తవముతో సంయోగమునొందును.

మూ॥ తత్ర పూర్వం చేతనాధాతుః సత్త్వకరణో గుణగ్రహణాయ ప్రవర్తతే । స హి హేతుః కారణం నిమిత్తమక్షరం కర్తా మన్తా వేదితా బోద్ధా ధాతా బ్రహ్మా విశ్వకర్మా విశ్వరూపః పురుషః ప్రభవోఽవ్యయో నిత్యో గుణీ గ్రహణం ప్రధానమవ్యక్తం జీవో జ్ఞః పుద్గలశ్చేతనావాన్విభుర్భూతాత్మా చేన్ద్రియాత్మా చాన్త

రాత్మా చేతి॥ స గుణోపాదానకాలేఽన్తరిక్షం పూర్వతరముపాదత్తే; యథా ప్రళయాత్యయే సిసృక్షుర్భూతాన్యక్షరభూతః సత్త్వోపాదానః పూర్వతరమాకాశం సృజతి, తతః క్రమేణ వ్యక్తతరగుణాన్ధాతూన్వాయ్వాదీంశ్చతురః; తథా దేహగ్రహణేఽపి ప్రవర్తమానః పూర్వతరమాకాశమేవోపాదత్తే, తతః క్రమేణవ్యక్తతరగుణాన్ధాతూన్వాయ్వాదీంశ్చతురః, సర్వమపి తు ఖల్వేతద్గుణోపాదానమణునా కాలేన భవతి ॥౯॥

అ॥ అట్టిశుక్రశోణితసంయోగమునందు సత్త్వముతోకూడిన చేతనాధాతువు భూతములయొక్క గుణమును గ్రహించుటకొరకు ముందుగ ప్రవర్తించును. అట్టిచేతనాధాతువు - హేతువు, కారణము, నిమిత్తము, అక్షరము, కర్త, మన్త, వేదిత, బోద్ధ, ద్రష్ట, ధాత, బ్రహ్మ, విశ్వకర్మ, విశ్వరూపుడు, పురుషుడు, ప్రభవుడు, అవ్యయుడు, నిత్యుడు, గుణి, గ్రహణము, ప్రధానము, అవ్యక్తము; జీవుడు, జ్ఞుడు, పుద్గలుడు, చేతనావంతుడు, విభుడు, భూతాత్మ, ఇంద్రియాత్మ, అంతరాత్మ అని చెప్పబడును. ఆచేతనాధాతువు భూతములను గ్రహించు కాలమునందు ఇతరభూతములకంటెముందుగ ఆకాశమును గ్రహించును. ప్రళయాంతమునందు భూతములను సృష్టింపదలచినట్టియు సత్త్వముతోకూడినట్టియు చేతనాధాతువు ముందుగ ఆకాశమును సృష్టించి పిమ్మట క్రమముగ వ్యక్తతరములైన గుణములుకలిగినట్టి వాయువు మొదలగు నాలుగుభూతములను ఎట్లుసృష్టించునో అటులనే దేహమును గ్రహించుటకు ప్రవర్తించినదై ముందుగ ఆకాశమునే గ్రహించి పిమ్మట క్రమముగ వ్యక్తతరములైన గుణములుకల వాయువు మొదలగు నాలుగుభూతములను గ్రహించును. ఈగ్రహించుటంతయు సూక్ష్మకాలములోనే జరుగును.

మూ॥ స సర్వగుణవాన్ గర్భత్వమాపన్నః ప్రథమే మాసి సంమూర్ఛితః సర్వధాతుకలుషీకృతః ఖేటభూతో భవత్యవ్యక్తవిగ్రహః సదసద్భూతాఙ్గావయవః ॥ ద్వితీయే మాసి ఘనః సంపద్యతే—పిణ్డః పేశ్యర్బుదం వా, తత్ర పిణ్డః పురుషః, స్త్రీ పేశీ, అర్బుదం నపుంసకమ్ ॥౧౦॥

అ॥సమస్తగుణములతోకూడిన ఆచేతనాధాతువుగర్భత్వమునుపొందినదై మొదటిమాసమునందు సంమూర్ఛితమునను సర్వధాతువులచే కలుషముగ చేయబడినదిగను శ్లేష్మపుముద్దవలెనుండునదిగను అవ్యక్తమైన విగ్రహముకలదిగను ఉన్నట్టియు లేనట్టియు అంగప్రత్యంగములుకలదిగను నుండును. రెండవమాసమునందు ముద్దవలెగాని పేశివలెనాని అర్బుదమువలెగాని ఘనీభావమునొందును. ముద్దవలెనున్నచో పురుషుడును. పేశివలెనున్నచో స్త్రీయును, అర్బుదమువలెనున్నచో నపుంసకుడును పుట్టును.

మూ॥ తృతీయే మాసి సర్వేన్ద్రియాణి సర్వాఙ్గావయవాశ్చ యౌగపద్యేనాభినిర్వర్తన్తే ॥ తత్రాస్య కేచిదఙ్గావయవా మాతృజాదీనవయవాన్విభజ్య పూర్వముక్తా యథావత్, మహాభూతవికారప్రవిభాగేన త్విదానీమస్య తాంశ్చైవాఙ్గావయవాన్ కాంశ్చిత్పర్యాయాన్తరేణాపరాంశ్చానువ్యాఖ్యాస్యామః; మాతృజాదయోఽప్యస్య మహాభూతవికారా ఏవ, తత్రాస్యాకాశాత్మకం—శబ్దః శ్రోత్రం లాఘవం సౌక్ష్మ్యం వివేకశ్చ; వాయ్వాత్మకం — స్పర్శః స్పర్శనం రౌక్ష్యం ప్రేరణం ధాతువ్యూహనం చేష్టాశ్చ శారీర్యః; అగ్న్యాత్మకం—రూపం దర్శనం ప్రకాశః పక్తిరౌష్ణ్యం చ; అబాత్మకం - రసో రసనం శైత్యం మార్దవం స్నేహః క్లేదశ్చ; పృథివ్యాత్మకం - గన్ధో ఘ్రాణం గౌరవం స్థైర్యం మూర్తిశ్చ ॥13॥

అ॥ మూడవమాసమునందు సమస్తేంద్రియములును సమస్తములైన అంగప్రత్యంగములును ఒక్కమారుగ ఏర్పడును. తల్లి మొదలగువారివలనకలుగు అవయవములను విభజించిచెప్పినప్పుడు కొన్ని అంగప్రత్యంగములు చెప్పబడినవి. ఇప్పుడు మహాభూతవికారవిభాగముననుసరించి ఆఅంగప్రత్యంగములలో కొన్నిటిని పర్యాయపదములతోడను ఇతరములైనఅంగప్రత్యంగములను చెప్పుచున్నాము. తల్లి మొదలగువారివలనకలుగుఅంగప్రత్యంగములుకూడ మహాభూతములుగనే యుండును. శబ్దము శ్రోత్రేంద్రియము లఘుత్వము సూక్ష్మత్వము విభజించుట ఇవి ఆకాశాత్మకములుగ నుండును, స్పర్శము త్వగింద్రియము రూక్షత్వము ప్రేరణము ధాతువులనుసరిగనుంచుట శరీరసంబంధమగు సర్వచేష్టలు ఇవి వాయ్వాత్మకములుగ నుండును. రూపము చక్షురింద్రియము కాంతి పక్వమగుట ఉష్ణము ఇవిఅగ్న్యాత్మకములుగ నుండును. రసము రసనేంద్రియముశీతము మృదుత్వము స్నేహము క్లేదము ఇవి అబాత్మకములుగ నుండును. గంధము ఘ్రాణేంద్రియము గురుత్వము స్థైర్యము కఠినత్వము ఇవి పృథివ్యాత్మకములుగ నుండును.

మూ॥ ఏవమయం లోకసంమితః పురుషః యావన్తో హి లోకే భావవిశేషాః, తావన్తః పురుషే; యావన్తః పురుషే, తావన్తో లోకే; ఇతి బుధాస్త్వేవం ద్రష్టుమిచ్ఛన్తి ॥14॥

అ॥ ఇట్లు పురుషుడు లోకముతోతుల్యమైనవాడుగ నుండును. లోకమునందున్న భావవిశేషములన్నియు పురుషునియందును నుండును. పురుషునియందున్న భావవిశేషములన్నియు లోకమునం దుండును. అందువలన పండితులు ఈవిధముగ చెప్పుచున్నారు.

మూ॥ ఏవమస్యేన్ద్రియాణ్యఙ్గావయవాశ్చ యౌగపద్యేనాభి నిర్వర్తన్తే, అన్యత్ర తేభ్యో భావేభ్యో యేఽస్య జాతస్యోత్తరకాలం జాయన్తే; తద్యథా–దన్తా వ్యఞ్జనాని వ్యక్తీభావః, తథాయుక్తాని చాపరాణి, ఏషా ప్రకృతిః; వికృతిః పునరతోఽన్యథా। సన్తిఖల్వస్మిన్ గర్భే కేచిచ్చ నిత్యా భావాః, సన్తి చానిత్యాః కేచిత్। తస్య య ఏవాఙ్గావయవాః సంతిష్ఠన్తే, త ఏవ స్త్రీలిఙ్గం పురుషలిఙ్గం నపుంసకలిఙ్గం వా బిభ్రతి; తతః స్త్రీపురుషయోర్యే వైశేషికా భావాః ప్రధాన సంశ్రయా గుణసంశ్రయాశ్చ, తేషాం యతో భూయస్త్వం తతోఽన్యతరభావః। తద్యథా–క్లైబ్యం భీరుత్వమవైశారద్యమనవస్థానమధోగురుత్వమసంహననం శైథిల్యం మార్దవం తథాయుక్తాని చాపరాణి స్త్రీకరాణి, అతో విపరీతాని పురుషకరాణి, ఉభయభాగావయవా నపుంసకకరాణి ॥15॥

అ॥ జనించిన పిదప క్రమముగ కలుగు భావములుగాక ఇంద్రియములును అంగప్రత్యంగములును గర్భమునకు ఒకమారుగనే ఏర్పడును. దంతములు మీసములు శుక్రము ఆర్తవము మొదలగు భావములు గర్భమునకు జనించినపిదప వ్యక్తములగును. ఇట్లు కలుగుట ప్రకృతిగ నుండును. దీనికి భిన్నముగ కలుగుట వికృతిగ నుండును. గర్భమునందలి భావములలో కొన్ని నిత్యములుగను కొన్ని అనిత్యములుగనునుండును. వానిలో నిత్యములైన ఏ అంగప్రత్యంగములు గలవో అవియే స్త్రీలక్షణములను గాని పురుషలక్షణములను గాని నపుంసకలక్షణములను గాని తెలియజేయును. స్త్రీపురుష సంబంధమగు విశేషభావములు ఆత్మవలనను పంచభూతములవలనను కలుగును అట్లు కలుగు భావములలో ఏభావము అధికముగ నుండునో వాని ననుసరించి స్త్రీ గాని పురుషుడు గాని నపుంసకుడుగాని జనించును. ఎట్లనగా – ధీరత్వము లేకపోవుట, భీరుత్వము, మోహము, స్తిమితములేకుండుట, అధోభాగమునందు గురుత్వము, దృఢత్వము లేకుండుట, శిథిలత్వము, మృదుత్వము ఈభావములవలనను ఇట్టి ఇతరభావములవలనను స్త్రీ జనించును. స్త్రీని కలిగించు భావములకు వ్యతిరేకములైన భావములవలన పురుషుడు జనించును. స్త్రీ జనించుటకును పురుషుడు జనించుటకును కారణములగు భావములు కలియుటవలన నపుంసకుడు జనించును.

మూ॥ తస్య యత్కాలమేవేన్ద్రియాణి సంతిష్ఠన్తే, తత్కాలమేవాస్య చేతసి వేదనా నిబన్ధం ప్రాప్నోతి, తస్మాత్తదా ప్రభృతి గర్భః స్పన్దతే ప్రార్థయతే చ, తద్ద్వైహృదయమాచక్షతే వృద్ధాః। మాతృజం చాస్య హృదయం మాతృహృదయేనాభి సంబద్ధం భవతి

రసవాహినీభిః సంవాహినీభిః తస్మాత్తయోస్తాభిర్భక్తిః సంపద్యతే। తచ్చైవ కారణమవేక్షమాణా న ద్వైహృదయస్య విమానితం గర్భమిచ్ఛన్తి కర్తుం, విమాననే హ్యస్య దృశ్యతే వినాశో వికృతిర్వా. సమానయోగక్షేమా హి మాతా తదా గర్భేణ కేషుచిదర్థేషు; తస్మాత్ప్రియహితాభ్యాం గర్భిణీం విశేషేణోపచరన్తి కుశలాః ॥6॥

అ॥ ఆగర్భమునకు ఎప్పుడు ఇంద్రియములు ఏర్పడునో అప్పుడే మనస్సునందు సుఖదుఃఖానుబంధము కలుగును. అందువలన అప్పటినుండి గర్భము కదలుచుండును, మరియు ఆయావిషయములను కోరుచుండును. దానిని ద్వైహృదయమని చెప్పుచున్నారు. తల్లివలన జనించిన గర్భముయొక్క హృదయము తల్లియొక్క హృదయముతో రసవాహకములగు నాడులచే కట్టబడియుండును. అందువలన తల్లికిని గర్భమునకును నాడులద్వారా కోరికలు కలుగుచుండును అందువలననే గర్భిణీస్త్రీయొక్క కోరికలను తిరస్కరించుటకు అంగీకరింపరు. తిరస్కరించినచో గర్భమునకు వినాశము వికృతిగాని కలుగును. కొన్నివిషయములయందు తల్లి గర్భముతో సమానులై యోగక్షేమములు కలదిగ నుండును. కావున గర్భిణీస్త్రీకి ఇష్టములైనట్టియు హితములైనట్టియు ఉపచారములను తప్పక చేయవలయును.

మూ॥ తస్యా గర్భాపత్తేర్ద్వైహృదయస్య చ విజ్ఞానార్థం లిఙ్గాని సమాసేనోపదేక్ష్యామః; ఉపచారసాధనం హ్యస్య జ్ఞానే, జ్ఞానం చ లిఙ్గతః; తస్మాదిష్టో లిఙ్గోపదేశః। ఆర్తవాదర్శనమాస్యసంస్రవణమనన్నాభిలాషశ్ఛర్దిరరోచకోఽమ్లకామతా చ విశేషేణ శ్రద్ధాప్రణయనం చోచ్చావచేషు భావేషు గురుగాత్రత్వం చక్షుషోర్గ్లానిః స్తనయోస్స్తన్యమోష్ఠయోః స్తనమణ్డలయోశ్చ కార్ష్ణ్యమత్యర్థం శ్వయథుః పాదయోరీషల్లోమరాజ్యుద్గమో యోన్యాశ్చాటాలత్వమితి గర్భే పర్యాగతే రూపాణి భవన్తి ॥7॥

అ॥ గర్భమునొందిన స్త్రీకిని ద్వైహృదయమునకునుకలుగు లక్షణములను తెలియుటనిమిత్తము సంక్షేపముగ చెప్పుచున్నాము. జ్ఞానమువలన ఉపచారములను చేయుటకు వీలుగనుండును. లక్షణములవలన జ్ఞానము కలుగును. అందువలన లక్షణములను చెప్పవలసియున్నది. ఆర్తవముకనబడకుండుట, నోటనీరుకారుట, అన్నమునందిచ్ఛలేకుండుట, వాంతి. అరోచకము, విశేషించి పులుపును కోరుట, ఉత్కృష్టములైనట్టియు నింద్యములైనట్టియు భావములయందు ఇచ్ఛకలుగుట, శరీరము బరువుగనుండుట, నేత్రములు వాడుట, స్తనములయందు స్తన్యముఏర్పడుట, పెదవులయందును స్తనమండలములయందును మిక్కిలి నలుపుఏర్పడుట, పాదములయందు కొద్దిగవాపుజనించుట, రోమపంక్తి ఏర్పడుట, యోని విస్తరించుట, ఈలక్షణములు గర్భమేర్పడినపిదప కలుగును.

మూ॥ సా యద్యదిచ్ఛేత్తత్తదస్యై దద్యాదన్యత్ర గర్భోపఘాతకరేభ్యో భావేభ్యః । గర్భోపఘాతకరాస్త్విమే భావాః । తద్యథా - సర్వమతిగురూష్ణతీక్ష్ణం దారుణాశ్చ చేష్టాః, ఇమాంశ్చాన్యానుపదిశన్తి వృద్ధాః-దేవతారక్షోఽనుచరపరిరక్షణార్థం న రక్తాని వాసాంసి బిభృయాన్న మదకరాణి చాద్యాన్యభ్యవహరేన్న యానమధిరోహేన్న మాంసమశ్నీయాత్సర్వేన్ద్రియ ప్రతికూలాంశ్చ భావాన్ దూరతః పరివర్జయేదన్యచ్చాపి కించిత్స్త్రియో విద్యుః ॥18॥

అ॥ గర్భిణీ స్త్రీ వేనినికోరునో వానిని ఇయ్యవలయును. గర్భమునకు విఘాతమును కలిగించువానిని మాత్రము ఇయ్యకూడదు. గర్భమునకు విఘాతమునుకలిగించు భావములను చెప్పుచున్నాము. అధికమగు గురుగుణమును ఉష్ణవీర్యమును తీక్ష్ణగుణమునుకల పదార్థముల నన్నిటిని సేవింపకూడదు. దారుణమైన చేష్టలను చేయకూడదు. ఎఱ్ఱని వస్త్రములను ధరింపకూడదు. అట్లు ధరించినచో దేవతలును రాక్షసులును వారి అనుచరులును పీడించెదరు. మత్తును కలిగించు పదార్థములను తినకూడదు. వాహనములను ఎక్కరాదు. మాంసమును తినకూడదు. ఇంద్రియములకు ప్రతికూలమైన విషయముల నన్నిటిని తప్పక వర్జింపవలయును. గర్భమునకు విఘాతమును కలిగించు ఇట్టి ఇతర భావములు స్త్రీలకు తెలియును. వానినికూడ విడిచిపెట్టవలయును.

మూ॥ తీవ్రాయాం తు ఖలు ప్రార్థనాయాం కామమహితమప్యస్యై హితేనోపహితం దద్యాత్ప్రార్థనా వినయనార్థం; ప్రార్థనా సంధారణాద్ధి వాయుః కుపితోఽన్తః శరీర మనుచరన్ గర్భస్యాపద్యమానస్య వినాశం వైరూప్యం వా కుర్యాత్ ॥19॥

అ॥ తీవ్రముగ కోరుచున్నచో అహితమైన దానినైనను హితమైనవానితోకూడ కోరిక నెరవేరునిమిత్తము ఇయ్యవలయును. కోరికను అడ్డగించినచో వాతము ప్రకోపించి శరీరములోపల సంచరించి పొందబడిన గర్భమునకు నాశనమునుగాని వికృతిని గాని కలిగించును.

మూ॥ చతుర్థే మాసి స్థిరత్వమాపద్యతే గర్భః, తస్మాత్తదా గర్భిణీ గురుగాత్రత్వ మధికమాపద్యతే విశేషేణ ॥ పఞ్చమే మాసి గర్భస్య మాంసశోణితోపచయో భవత్యధిక మన్యేభ్యో మాసేభ్యః; తస్మాత్తదా గర్భిణీ కార్శ్యమాపద్యతే విశేషేణ ॥ షష్ఠే మాసి గర్భస్య బలవర్ణోపచయో భవత్యధికమన్యేభ్యో మాసేభ్యః; తస్మాత్తదా గర్భిణీ బలవర్ణహానిమాపద్యతే విశేషేణ ॥ సప్తమే మాసి

గర్భః సర్వభావై రాప్యాయ్యతే, తస్మాత్తదా గర్భిణీ సర్వాకారైః క్లాన్తతమా భవతి ॥24॥

అ॥ నాలుగవమాసమునందు గర్భము దృఢత్వమును పొందును. అందువలన అప్పుడు గర్భిణీస్త్రీ అధికమగుశరీరగౌరవమును విశేషించి పొందును. అయిదవమాసమునందు గర్భమునకు మాంసశోణితముల యొక్క వృద్ధి ఇతరమాసములయందుకంటె అధికముగ కలుగును. అందువలన అప్పుడు గర్భిణీస్త్రీ కృశత్వమును విశేషించి పొందును. ఆరవమాసమునందు గర్భమునకు బలమును వర్ణమును ఇతరమాసములయందు కంటెఅధికముగ వృద్ధినొందును. అందువలన అప్పుడు గర్భిణీస్త్రీకి బలమును వర్ణమును విశేషించి క్షీణించును. ఏడవమాసమునందు గర్భము సర్వభావములతోడను వృద్ధినొందును. అందువలన అప్పుడు గర్భిణీస్త్రీ అన్నివిధముల కృశించును.

మూ॥ అష్టమే మాసి గర్భశ్చ మాతృతో గర్భతశ్చ మాతా రసవాహినీభిః సంవాహినీభిర్ముహుర్ముహురోజః పరస్పరత ఆదదాతే గర్భస్యాసంపూర్ణత్వాత్, తస్మాత్తదా గర్భిణీ ముహుర్ముహుర్ముదాయుక్తా భవతి ముహుర్ముహుశ్చ గ్లానా తథా గర్భః, తస్మాత్తదా గర్భస్య జన్మ వ్యాపత్తిమద్భవత్యోజసోఽనవస్థితత్వాత్; తంచైవమభిసమీక్ష్యాష్టమం మాసమగణ్యమిత్యాచక్షతే కుశలాః॥ తస్మిన్నేకదివసాతిక్రాన్తేఽపి నవమం మాసముపాదాయ ప్రసవకాలమిత్యాహురాదశమాన్మాసాత్, ఏతావాన్కాలః, వైకారికమతః పరంకుక్షావవస్థానం గర్భస్య ॥25॥

అ॥ ఎనిమిదవమాసమునందు గర్భము సంపూర్ణముగనుండక పోవుటవలన తల్లి నుండి గర్భమును, గర్భమునుండితల్లియు రసవాహకములగునాడులద్వారా ఓజస్సును పరస్పరము మాటిమాటికి గ్రహించుచుందురు. అందువలన అప్పుడు గర్భిణీస్త్రీ ఒకొక్కప్పుడు సంతోషముకలదిగ ఒకొక్కప్పుడు ఉత్సాహము లేనిదిగను నుండును. గర్భముకూడ అటులనే యుండును. ఓజస్సుస్థిరముగ నుండకపోవుటవలన ఎనిమిదవమాసమునందు గర్భముయొక్క పుట్టుక ఆపత్తుతోకూడియుండును. ఎనిమిదవ మాసము ఇట్టిదగుటవలన ఈవిషయమును గర్భిణీస్త్రీకి చెప్పకూడదని బుద్ధిమంతులు చెప్పుచున్నారు. ఎనిమిదవమాసముగడిచితొమ్మిదవమాసముయొక్క మొదటిరోజు మొదలు పదియవమాసముయొక్క తుదిరోజువరకునుగల కాలము ప్రశస్తమైన ప్రసవకాలము నుండును. పిమ్మట కుక్షియందున్నగర్భము వికృతిగ నుండును.

మూ॥ ఏవమనయాఽఽనుపూర్వ్యాఽభినిర్వర్తతే కుక్షౌ ॥26॥

అ॥ పూర్వమునందు చెప్పబడినక్రమమున గర్భము కుక్షియందు ఏర్పడును.

మూ॥ మాత్రాదీనాం తు ఖలు గర్భకరాణాం భావానాం సంపదస్తథా వృత్తస్య సౌష్ఠవాన్మాతృతశ్చైవోపస్నేహోపస్వేదాభ్యాం కాలపరిణామాత్స్వభావసంసిద్ధేశ్చ కుక్షౌ వృద్ధిం ప్రాప్నోతి॥ మాత్రాదీనాం తు ఖలు గర్భకరాణాం భావానాం వ్యాపత్తినిమిత్తమస్యాజన్మ భవతి॥ యే త్వస్య కుక్షౌ వృద్ధిహేతుసమాఖ్యాతా భావాస్తేషాం విపర్యయాదుదరే వినాశమాపద్యతేఽథవాఽప్యచిరజాతః స్యాత్ ॥29॥

అ॥ గర్భమును కలిగించునట్టియు తల్లి మొదలుగా గలిగినట్టియు భావముల యొక్క సంపత్తువలనను, తల్లియొక్క ఆహారసౌష్ఠవమువలనను, తల్లివలనకలుగు ఉపస్నేహ ఉపస్వేదములవలనను, కాలక్రమమువలనను, స్వభావము వలనను గర్భము కుక్షియందు వృద్ధినొందును. తల్లి మొదలగునట్టియు గర్భమును కలిగించునట్టియు భావములు దుష్టములుగ నుండుటవలన గర్భము ఏర్పడదు. కుక్షియందు గర్భము వృద్ధినొందుటకు హేతువులుగ చెప్పబడిన భావములు విపరీతములుగ నున్నచో గర్భము కుక్షియందు వినాశము నొందును. లేదా చిరకాలమునకు జనించును.

మూ॥ యతస్తు కార్త్స్న్యేనావినశ్యన్వికృతిమాపద్యతే తదనువ్యాఖ్యాస్యామః-యదా స్త్రియా దోషప్రకోపణోక్తాన్యాసేవమానాయా దోషాః ప్రకుపితాః శరీరముపసర్పన్తః శోణితగర్భాశయావుపపద్యన్తే న తు కార్త్స్న్యేన శోణితగర్భాశయౌ దూషయన్తి తదేయం గర్భం లభతే స్త్రీ; యదా గర్భస్య తస్య మాతృజానామవయవానామన్యతమోఽవయవో వికృతిమాపద్యతే ఏకోఽథవానేకే, యస్య యస్య హ్యవయవస్య బీజే బీజభాగే వా దోషాః ప్రకోపమాపద్యన్తే, తం తమవయవం వికృతిరావిశతి; యదా హ్యస్యాః శోణితే గర్భాశయబీజభాగః ప్రదోషమాపద్యతే, తదా వన్ధ్యాం జనయతి; యదా పునరస్యాః శోణితే గర్భాశయబీజభాగావయవః ప్రదోషమాపద్యతే, తదా పూతిప్రజాం జనయతి; యదా త్వస్యాః శోణితే గర్భాశయ బీజభాగావయవః స్త్రీకరాణాం చ శరీరబీజభాగానామేకదేశః ప్రదోషమాపద్యతే, తదా స్త్ర్యాకృతిభూయిష్ఠామస్త్రియం వార్తాం నామ జనయతి; తాం స్త్రీవ్యాపదమాచక్షతే ॥30॥

అ॥ గర్భము పూర్తిగనశింపక వికృతినొందుటకు కారణమును చెప్పుచున్నాము. దోషములను ప్రకోపింపచేయునవిగ చెప్పబడిన వానిని సేవించు స్త్రీకి దోషములు ప్రకో

పించి శరీరమునందువ్యాపించినదై ఆర్తవమును గర్భాశయమునుపొంది దానినిపూర్తిగ దూషింపచేయనియెడల గర్భము కలుగవచ్చును. అట్టిగర్భముయొక్క మాతృజములగు అవయవములలో ఒకటిగాని చాలగాని వికృతినొందును. ఏయే అవయవముయొక్క బీజమునందుగాని బీజభాగమునందుగాని దోషములు ప్రకోపించునో ఆయాఅవయవము వికృతినొందును. ఆర్తవమునందలి గర్భాశయమునుకలిగించు బీజభాగమంతయు మిక్కిలిదూషింపబడినయెడల వంధ్యాస్త్రీయును, కొంతభాగముమిక్కిలిదూషింపబడినయెడల దుర్గంధముకలఅవయవములతోకూడిన స్త్రీయును, కొంతభాగముస్త్రీలక్షణజనకములగుబీజభాగములలో కొంతభాగమును మిక్కిలిదూషింపబడినచో స్త్రీయొక్క ఆకారముకలిగినట్టియు స్త్రీలక్షణములేనట్టియు "వార్త" యనబడునట్టి స్త్రీయును జనించును. పైనచెప్పబడినవికృతులు స్త్రీవ్యాపత్తు లనబడును.

మూ॥ ఏవమేవ యదా పురుషస్య బీజే బీజభాగః ప్రదోష మాపద్యతే, తదా వన్ధ్యం జనయతి; యదా పునరస్య బీజే బీజ భాగావయవః ప్రదోషమాపద్యతే, తదా పూతిప్రజాం జనయతి; యదా త్వస్య బీజే బీజభాగావయవః పురుషకరాణాం చ శరీరబీజ భాగానామేకదేశః ప్రదోషమాపద్యతే, తదా పురుషాకృతిభూయిష్ఠ మపురుషం తృణపూలికం నామ జనయతి, తాం పురుషవ్యాపదమా చక్షతే ॥31॥

అ॥ స్త్రీకిచెప్పినవిధముననే పురుషునియొక్క శుక్రమునందలి బీజభాగమంతయు మిక్కిలిదూషింబడినయెడల వంధ్యపురుషుడును, కొంతభాగముమిక్కిలిదూషింబడినయెడల దుర్గంధముకలఅవయవములతోకూడిన పురుషుడును, కొంతభాగమును పురుషలక్షణజనకములగుబీజభాగములలో కొంతభాగమును మిక్కిలిదూషింపబడినచో పురుషునియొక్క ఆకారముకలిగినట్టియు పురుషలక్షణములులేనట్టియు "తృణపూలిక" యనబడునట్టి పురుషుడును జనించును. పైనచెప్పబడినవికృతులు పురుషవ్యాపత్తు లనబడును.

మూ॥ ఏతేన మాతృజానాం పితృజానాం చావయవానాం వికృతివ్యాఖ్యానేన సాత్మ్యజానాం రసజానాం సత్త్వజానాం చావయవానాం వికృతిర్వ్యాఖ్యాతా ॥32॥

అ॥ తల్లివలనను తండ్రివలనను కలుగు అవయవములకుచెప్పబడిన వికృతిననుసరించియే సాత్మ్యమువలనను రసమువలనను సత్త్వమువలనను కలుగు అవయవముల యొక్క వికృతినికూడ తెలిసికొనవలయును.

మూ॥ నిర్వికారః పరస్త్వాత్మా సర్వభూతానాం నిర్విశేషః; సత్త్వశరీరయోస్తు విశేషాద్విశేషోపలబ్ధిః ॥33॥

తా॥ ఆత్మ సమస్తభూతములలో సమానమైనదిగను ఉత్కృష్టమైనదిగను వికారరహితమైనదిగను నుండును. కాని మనస్సుయొక్కయు శరీరముయొక్కయు విశేషము ననుసరించి సుఖదుఃఖాదిరూపమగు విశేషము కలుగుచుండును.

మూ॥ తత్ర త్రయస్తు శరీరదోషాః—వాతపిత్తశ్లేష్మాణః, తే శరీరం దూషయన్తి; ద్వౌ పునః సత్త్వదోషౌ—రజస్తమశ్చ, తౌ సత్త్వం దూషయతః; తాభ్యాం చ సత్త్వశరీరాభ్యాం దుష్టాభ్యాం వికృతిరుపజాయతే, నోపజాయతే చాప్రదుష్టాభ్యామ్॥ తత్ర శరీరం యోనివిశేషాచ్చతుర్విధముక్తమగ్రే ॥36॥

అ॥ వాతము పిత్తము శ్లేష్మము ఈమూడును శరీరదోషములుగ నుండును. ఇవి శరీరమును దూషింపచేయును. రజోగుణము తమోగుణము ఈ రెండును మనోదోషములుగ నుండును. ఇవి మనస్సును దూషింపచేయును. మనస్సును శరీరమును దూషింపబడినచో వికారములు కలుగును. దూషింపబడనిచో వికారములు కలుగవు. శరీరము కారణవిశేషముననుసరించి నాలుగువిధములుగ నుండునని ఇదివరలో చెప్పబడినది.

మూ॥ త్రివిధం ఖలు సత్త్వం — శుద్ధం, రాజసం, తామసమితి। తత్ర శుద్ధదోషమాఖ్యాతం కల్యాణాంశత్వాత్, రాజసం సదోషమాఖ్యాతం రోషాంశత్వాత్, తథా తామసమపి సదోషమాఖ్యాతం మోహాంశత్వాత్ ॥ తేషాం తు త్రయాణామపి సత్త్వానామేకైకస్య భేదాగ్రమపరిసంఖ్యేయం తరతమయోగాచ్ఛరీరయోనివిశేషేభ్యశ్చాన్యోన్యానువిధానత్వాచ్చ। శరీరమపి సత్త్వమనువిధీయతే, సత్త్వం చ శరీరం; తస్మాత్కతిచిచ్ఛ సత్త్వభేదాననూకసాదృశ్యాభినిర్దేశేన నిదర్శనార్థమనువ్యాఖ్యాస్యామః ॥37॥

అ॥ సత్త్వము శుద్ధమనియు రాజసమనియు తామసమనియు మూడువిధములుగ నుండును. వానిలో శుద్ధసత్త్వము కళ్యాణాంశకలదగుటవలన దోషములు లేనిదిగ నుండును. రోషాంశకలదగుటవలన రాజససత్త్వమును, మోహాంశకలదగుటవలన తామససత్త్వమును దోషసహితములుగ నుండును. ఈమూడువిధములగు సత్త్వములును ప్రత్యేకముగ తరతమాది భేదములవలనను, శరీరవిశేషములవలనను, యోనివిశేషములవలనను, మనశ్శరీరములు పరస్పర మనుసరించుటవలనను అపరిసంఖ్యేయము భేదములను పొందును. సత్త్వము శరీరమునను సరించును. శరీరముకూడ సత్త్వము ననుసరించును. కొన్ని సత్త్వభేదములను సామాన్యదృశ్యనిర్దేశములో ఉదాహరణనిమిత్తము చెప్పుచున్నాము.

మూ॥ తద్యథా — శుచిం సత్యాభిసంధం జితాత్మానం సంవిభాగినం జ్ఞానవిజ్ఞాన వచనప్రతివచనశక్తిసంపన్నం స్మృతిమన్తం కామక్రోధలోభమానమోహేర్ష్యాహర్షామర్షోపేతం సమం సర్వభూతేషు బ్రాహ్మం విద్యాత్॥ ఇజ్యాధ్యయనవ్రతహోమబ్రహ్మచర్య పరమాతిథివ్రతముపశాన్త మదమానరాగద్వేష మోహలోభరోషం ప్రతిభావచనవిజ్ఞానోపధారణశక్తిసంపన్నమార్షం విద్యాత్॥ ఐశ్వర్యవన్తమాదేయవాక్యం యజ్వానం శూరమోజస్వినం తేజసోపేతమక్లిష్టకర్మాణం దీర్ఘదర్శినం ధర్మార్థకామాభిరతమైన్ద్రం విద్యాత్॥ లేఖాస్థవృత్తం ప్రాప్తకారిణమసంప్రహార్యముత్థానవన్తం స్మృతిమన్తమైశ్వర్యాలమ్బినం వ్యపగతరాగద్వేషమోహం యామ్యం విద్యాత్॥ శూరం ధీరం శుచిమశుచిద్వేషిణం యజ్వానమమ్భోవిహారరతిమక్లిష్టకర్మాణం స్థానకోపప్రసాదం వారుణం విద్యాత్॥ స్థానమానోపభోగపరివారసంపన్నం సుఖవిహారం ధర్మార్థకామనిత్యం శుచిం వ్యక్తకోపప్రసాదం కౌబేరం విద్యాత్॥ ప్రియనృత్యగీతవాదిత్రోల్లాపకశ్లోకాఖ్యాయికేతిహాస పురాణేషు కుశలం గన్ధమాల్యానులేపనవసన స్త్రీవిహారనిత్య మనసూయకం గాన్ధర్వం విద్యాత్॥ ఇత్యేవం శుద్ధస్య సత్త్వస్య సప్తవిధం భేదాంశం విద్యాత్కల్యాణాంశత్వాత్, సంయోగాత్తు బ్రాహ్మమత్యన్తశుద్ధం వ్యవస్యేత్ ॥45॥

అ॥ శుచి, సత్యసంధత, ఇంద్రియనిగ్రహము. విభజనశక్తి, జ్ఞానము, విజ్ఞానము, సంభాషణశక్తి, సమాధానశక్తి, స్మరణజ్ఞానము, కామమును క్రోధమును లోభమును అభిమానమును మోహమును ఈర్ష్యయు అనురాగమును మాత్సర్యమును లేకుండుట, సమస్తభూతములయందును సమత్వము వీనితోకూడినవానిని బ్రాహ్మసత్త్వము కలవానినిగ తెలిసికొనవలయును. యాగము అధ్యయనము వ్రతములు హోమములు బ్రహ్మచర్యము అతిథిపూజ వీనిని ఆచరించునట్టియు మదము అభిమానము రాగము ద్వేషము మోహము లోభము కోపము ఇవిలేనట్టియు ప్రతిభవచనశక్తి విజ్ఞానము ధారణాశక్తి వీనితోకూడినట్టియు మనుజుని ఆర్షసత్త్వముకలవానినిగ తెలిసికొనవలయును. ఐశ్వర్యము గ్రహింపదగిన వాక్యములు యాగములు శౌర్యము ఓజస్సు తేజస్సు యోగ్యమైనకర్మలు దూరదృష్టి ధర్మార్థకామములయందు కోరిక వీనితో కూడినవానిని ఐంద్రసత్త్వముకలవానినిగ తెలిసికొనవలయును. కర్తవ్యాకర్తవ్యములు తెలిసినట్టియు కార్యములను సకాలమునందుచేయునట్టియు వారింపశక్యముకానట్టియు ఔన్నత్యము కలిగినట్టియు స్మరణశక్తి కలిగినట్టియు ఐశ్వర్యముకలిగినట్టియు రాగమును ద్వేషమును

మోహమును లేనట్టియు మనుజుని యామ్యసత్త్వముకలవానినిగ తెలిసికొనవలయును. శౌర్యము, ధైర్యము, శుచి, అపరిశుభ్రతను ద్వేషించుట, యాగములను చేయుట, జలవిహారమునందుకోరిక, యోగ్యమైనకర్మలు, కోపమును దయయు సకాలమునందు కలుగుట వీనితో కూడినవానిని వారుణసత్త్వము కలవానినిగ తెలిసికొనవలయును. అభిమానము ఉపభోగములు పరివారము వీనితో సకాలమునందుకూడుకొనునట్టియు సుఖవిహారమును ధర్మార్థకామములను శుచిత్వమును కలిగినట్టియు వ్యక్తములైనకోపమును దయయుకలిగినట్టియు మనుజుని కౌబేరసత్త్వము కలవానినిగ తెలిసికొనవలయును. నృత్యముగానము వాద్యము స్తోత్రము శ్లోకములు చరిత్రలు ఇతిహాసము పురాణము ఇష్టములైనవీనియందు నేర్పరియైనట్టియు సుగంధములు పుష్పమాలికలు మైపూతలు వస్త్రములు స్త్రీలు విహారములు వీనియందు ఆసక్తికలిగినట్టియు అసూయలేనట్టియు మనుజుని గాంధర్వసత్త్వము కలవానినిగ తెలిసికొనవలయును. ఈ ఏడువిధములను కళ్యాణాంశకలవగుటవలన శుద్ధసత్త్వముయొక్క భేదములనుగ తెలిసికొనవలయును. కళ్యాణాంశ అధికముగ కలదగుటవలన బ్రాహ్మసత్త్వమును మిక్కిలిశుద్ధమైనదానినిగ తెలిసికొనవలయును.

మూ॥ శూరం చణ్డమసూయకమైశ్వర్యవన్తమౌపధికం రౌద్రమననుక్రోశమాత్మపూజకమాసురం విద్యాత్ ॥ అమర్షిణమనుబద్ధకోపం ఛిద్రప్రహారిణం క్రూరమాహారాతిమాత్రరుచిమామిషప్రియతమం స్వప్నాయాసబహులమీర్షుం రాక్షసం విద్యాత్॥ మహాశనం స్త్రైణం స్త్రీరహస్కామమశుచిం శుచిద్వేషిణం భీరుం భీషయితారం వికృతవిహారాహారశీలం పైశాచం విద్యాత్॥ క్రుద్ధశూరమక్రుద్ధభీరుం తీక్ష్ణమాయాసబహులం సంత్రస్తగోచరమాహారవిహారపరం సార్పం విద్యాత్ ॥ ఆహారకామమతిదుఃఖశీలాచారోపచారమసూయకమసంవిభాగినమతిలోలుపమకర్మశీలం ప్రైతం విద్యాత్॥ అనుషక్తకామమజస్రమాహారవిహారపరమనవస్థితమమర్షిణమసంచయం శాకునం విద్యాత్॥ ఇత్యేవం ఖలు రాజసస్య సత్త్వస్య షడ్విధం భేదాంశం విద్యాద్రోషాంశత్వాత్ ॥5౭॥

అ॥ శౌర్యము, అధికమగుకోపము, అసూయ, ఐశ్వర్యము, కపటము, రౌద్రస్వభావము, విచారింపదగకుండుట, తనను కొనియాడుకొనుట వీనితో కూడినవానిని ఆసురసత్త్వముకలవానినిగ తెలిసికొనవలయును అసహనము, కోపముచిరకాలముండుట, తరుచుతప్పులుకలుగుట, క్రౌర్యము, ఆహారమునందధికమగుఅభిలాష, మాంసమునందధికమగుఇచ్ఛ, అధికనిద్ర, అధికపరిశ్రమ, ఈర్ష్య వీనితో కూడినవానిని రాక్షససత్త్వముకలవానినిగ తెలిసికొనవలయును. అధికమగుమాంద్యము, స్త్రీలతోనుండుట స్త్రీలతోరహస్యముగనుండుటయందుకోరిక, అపరిశుభ్రత, పరిశుభ్రతను, ద్వేషించుట,

భయస్వభావము, భయపెట్టుట, విహారాహారములను వికృతముగ సేవించు స్వభావము వీనితో కూడినవానిని పైశాచసత్త్వము కలవానిగ తెలిసికొనవలయును. కోపము కలిగినప్పుడు శౌర్యము, కోపము లేనప్పుడు భయస్వభావము, తీవ్రత, అధికపరిశ్రమ, భయమునకు గోచరుడగుట, ఆహారమునందును విహారమునందును ఆసక్తి వీనితో కూడినవానిని సార్పసత్త్వము కలవానినిగ తెలిసికొనవలయును. ఆహారమునందు కోర్కె, దుఃఖకరములైన స్వభావమును ఆచారములను ఉపచారములను కలిగియుండుట, అపహానము, విభజనశక్తి లేకుండుట, విషయాసక్తి, కర్మలయందు దిట్టము లేకుండుట వీనితో కూడినవానిని ప్రైతసత్త్వము కలవానినిగ తెలిసికొనవలయును. ఎల్లప్పుడును కోరికలు, ఆహారవిహారములయందు ఎల్లప్పుడును కోరిక, స్తిమితము లేకుండుట, అసహనము, సంచయము లేకుండుట వీనితో కూడినవానిని శాకునసత్త్వము కలవానినిగ తెలిసికొనవలయును. ఈ ఆరువిధములును రోషాంశకలుగుటవలన రాజససత్త్వముయొక్క భేదములనుగ తెలిసికొనవలయును.

మూ॥ నిరాకరిష్ణు మధమువేషం జుగుప్సితాచారాహారం మైథునపరం స్వప్నశీలం పాశవం విద్యాత్ ॥ భీరుమబుధమాహారలుబ్ధమనవస్థితమనుషక్త కామక్రోధం సరణశీలం తోయకామం మాత్స్యం విద్యాత్ ॥ అలసం కేవలమభినివిష్టమాహారే సర్వబుద్ధ్యా హీనం వానస్పత్యం విద్యాత్ ॥ ఇత్యేవం ఖలు తామసస్య సత్త్వస్య త్రివిధం భేదాంశం విద్యాన్మోహాంశత్వాత్ ॥56॥

ఆ॥ నిందించుస్వభావము, నీచమైనవేషము, నిందితములైన ఆచారములను ఆహారములను సేవించుట, ఎల్లప్పుడును మైథునమునందాసక్తి, ఎల్లప్పుడును నిద్రించుస్వభావము వీనితో కూడినవానిని పాశవసత్త్వము కలవానినిగ తెలిసికొనవలయును. భయస్వభావము, మూర్ఖత్వము, ఆహారమునం దధికమగుఆసక్తి, స్తిమితత్వము లేకపోవుట, కామమును కోపమును ఎల్లప్పుడు నుండుట, గమనస్వభావము, నీటియందు కోరిక వీనితో కూడినవానిని మాత్స్యసత్త్వము కలవానినిగ తెలిసికొనవలయును. మాంద్యము. ఆహారమునం దేకోరిక, ఏవిధమైన బుద్ధియు లేకుండుట వీనినితో కూడినవానిని వానస్పత్యసత్త్వము కలవానినిగ తెలిసికొనవలయును. ఈ మూడు విధములును మోహాంశకలవగుటవలన తామససత్త్వముయొక్క భేదములనుగ తెలిసికొనవలయును.

మూ॥ ఇత్య పరిసంఖ్యేయ భేదానాం ఖలు త్రయాణామపి సత్త్వానాం భేదైకదేశో వ్యాఖ్యాతః, శుద్ధస్య సత్త్వస్య సప్తవిధో బ్రహ్మార్షి శక్రవరుణ యమకుబేరగన్ధర్వసత్త్వానుకారేణ, రాజసస్య షడ్విధో దైత్యరాక్షసపిశాచ సర్పప్రేతశకుని సత్త్వానుకారేణ, తామసస్య త్రివిధః పశుమత్స్య వనస్పతి సత్త్వానుకారేణ; కథంచ యథా

సత్త్వముపచారః స్యాదితి । కేవలశ్చాయముద్దేశో యథోద్దేశ మభినిర్దిష్టో భవతి గర్భావక్రాన్తి సంప్రయుక్తః; తస్యార్థస్య విజ్ఞానే సామర్థ్య—గర్భకరాణాం చ భావానామనుసమాధిర్విఘాతశ్చ విఘాతకరాణాం భావానామితి ॥57॥

అ॥ అపరిసంఖ్యేయములైన భేదములుకల మూడువిధములగు సత్త్వములయొక్క భేదములలో కొద్దిభాగముమాత్రము ఈవిధమున చెప్పబడినది. బ్రహ్మ, ఋషులు, దేవేంద్రుడు, వరుణుడు, యముడు, కుబేరుడు, గంధర్వులు వీరలయొక్క సత్త్వముల ననుసరించి శుద్ధసత్త్వము ఏడువిధములుగ చెప్పబడినది. దైత్యులు, రాక్షసులు, పిశాచములు, సర్పములు, ప్రేతములు, పక్షులు వీనియొక్క సత్త్వముల ననుసరించి రాజససత్త్వములననుసరించి తామససత్త్వము మూడువిధములుగ చెప్పబడినది. ఆయాసత్త్వములననుసరించి ఉపచారముచేయవలయును. గర్భావక్రాంతిసందర్భమున ఈవిషయమంతయు ఉద్దేశముననుసరించి చెప్పబడినది. దీనిని తెలిసికొనినచో గర్భమునకు హితకరములైనభావములను ఆచరించుటయు విఘాతకరములైనభావములను విడిచిపెట్టుటయు కలుగును.

## అధ్యాయ సంగ్రహము.

మూ॥ నిమిత్తమాత్మా ప్రకృతిర్వృద్ధిః కుక్షౌ క్రమేణ చ । వృద్ధిహేతుశ్చ గర్భస్య పఞ్చార్థాః శుభసంజ్ఞితాః॥ అజన్మని చ యో హేతుర్వినాశే వికృతావపి । ఇమాంస్త్రీనశుభాన్ భావానాహుర్గర్భవిఘాతకాన్ ॥ శుభాశుభసమాఖ్యాతానష్టౌ భావానిమాన్ భిషక్ । సర్వథా వేద యః సర్వాన్ స రాజ్ఞః కర్తుమర్హతి ॥ అవాప్త్యుపాయాన్ గర్భస్య స ఏవం జ్ఞాతుమర్హతి । యే చ గర్భవిఘాతోక్తా భావాస్తాంశ్చాప్యుదారధీః ॥61॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతి సంస్కృతే శారీరస్థానే మహతీగర్భావక్రాన్తి శారీరం నామ చతుర్థోఽధ్యాయః ॥

అ॥ గర్భముయొక్క కారణములు, ఆత్మ, ప్రకృతి, కుక్షియందువృద్ధినొందుక్రమము, వృద్ధినొందుటకుహేతువులు శుభనిమిత్తములగు ఈఅయిదును;గర్భముఏర్పడకుండుటకు కారణము, వినాశము నొందుటకుకారణము, వికృతినొందుటకు కారణము అశుభనిమిత్తములగు ఈమూడును; ఈఅధ్యాయమునందు చెప్పబడినవి. శుభాశుభనిమిత్తములగు ఈఎనిమిదిభావములను బాగుగ తెలిసికొనినవైద్యుడు రాజులకువైద్యముచేయు

టకు తగియుండును. కావున గర్భకరములగు భావములను గర్భవిఘాతకరములగు భావములను తెలిసికొనవలయును.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు మహతీగర్భావక్రాంతి శారీరమనెడు చతుర్థాధ్యాయము సమాప్తము.

---

# పంచమాధ్యాయము.

**మూ॥** అథాతః పురుషవిచయం శారీరం వ్యాఖ్యాస్యామః ॥1॥

**అ॥** పిమ్మట పురుషవిచయశారీరమును చెప్పబోవుచున్నాము.

**మూ॥** ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

**అ॥** అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

**మూ॥** పురుషోఽయం లోకసంమిత ఇత్యువాచ భగవాన్పునర్వసురాత్రేయః; యావన్తో హి లోకే మూర్తిమన్తో భావవిశేషాస్తావన్తః పురుషే, యావన్తః పురుషే తావన్తో లోకే, ఇత్యేవంవాదినం భగవన్తమాత్రేయమగ్నివేశ ఉవాచ—నైతావతా వాక్యేనోక్తం వాక్యార్థమవగాహామహే, భగవతా బుద్ధ్యా భూయస్తరమనువ్యాఖ్యాయమానం శుశ్రూషామహ ఇతి; తమువాచ భగవానాత్రేయః—అపరిసంఖ్యేయాః; లోకావయవవిశేషాః, పురుషావయవవిశేషా అప్యపరిసంఖ్యేయాః; తేషాం యథాస్థూలం భావాన్ సామాన్యమభిప్రేత్యోదాహరిష్యామః; తానేకమనా నిబోధ సమ్యగుపవర్ణ్యమానానగ్నివేశ! షడ్ధాతవః సముదితాః 'లోక' ఇతి శబ్దం లభన్తే; తద్యథా—పృథివ్యాపస్తేజో వాయురాకాశం బ్రహ్మ చావ్యక్తమిత్యేత ఏవ చ షడ్ధాతవః సముదితాః 'పురుష' ఇతి శబ్దం లభన్తే ॥3॥

**అ॥** లోకమునందు మూర్తిమంతములగు భావవిశేషములు ఎన్నికలవో అన్ని భావవిశేషములును పురుషునియందు కలవు. ఎన్ని పురుషునియందు కలవో అన్నిలోకమునందుకలవు. కావున పురుషుడులోకముతో తుల్యమైనవాడుగ నుండునని చెప్పిన

ఆత్రేయుని అగ్నివేశుడు క్రిందివిధముగ అడిగెను. ఇంతమాత్రముగ చెప్పుటచే ఈ విషయము మాకు తెలియుటలేదు. భగవంతులగు మీచే ఇంతకంటె అధికముగ వివరింపబడు దీనిని వినవలయునని కోరుచున్నాము. అనిఅడిగెను. దానినిగూర్చి ఆత్రేయుడు క్రిందివిధముగ చెప్పెను. లోకసంబంధమగు అవయవవిశేషములును పురుషసంబంధమగు అవయవవిశేషములును అపరిసంఖ్యేయములుగ నుండును. వానిలో స్థూలములైన భావములను సామాన్యముగ ఉదాహరణనిమిత్తము చెప్పుచున్నాము. బాగుగ వర్ణింపబడుచున్నవానిని ఏకాగ్రచిత్తముగలవాడవై తెలిసికొనుము. భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, అవ్యక్తమైన బ్రహ్మ అను నీ ఆరుధాతువులయొక్కయు సముదాయము లోకమని చెప్పబడును. ఈ ఆరుధాతువులయొక్క సముదాయమే పురుషుడనికూడ చెప్పబడును.

మూ॥ తస్య పురుషస్య పృథివీ మూర్తిః, ఆపః క్లేదః, తేజోఽభిసంతాపో, వాయుః ప్రాణో, వియచ్ఛిద్రాణి, బ్రహ్మాఽన్తరాత్మా, యథా ఖలు బ్రాహ్మీ విభూతిర్లోకే తథా పురుషేఽప్యాన్తరాత్మికీ విభూతిః, బ్రహ్మణో విభూతిర్లోకే ప్రజాపతిరన్తరాత్మనో విభూతిః పురుషే సత్త్వం, యస్త్విన్ద్రో లోకే స పురుషేఽహఙ్కారః, ఆదిత్యాస్తు ఆదానం, రుద్రో రోషః, సోమః ప్రసాదో, వసవః సుఖం, అశ్వినౌ కాన్తిః, మరుదుత్సాహో, విశ్వేదేవాః సర్వేన్ద్రియాణి సర్వేన్ద్రియార్థాశ్చ, తమో మోహో, జ్యోతిర్జ్ఞానం, యథా లోకస్య సర్గాదిస్తథా పురుషస్య గర్భాధానం, యథా కృతయుగమేవం బాల్యం, యథా త్రేతా తథా యౌవనం, యథా ద్వాపరస్తథా స్థావిర్యం, యథా కలిరేవమాతుర్యం, యథాయుగాన్తస్తథా మరణమితి; ఏవమనుమానేనానుక్తానామపి లోకపురుషయోరవయవవిశేషాణామగ్నివేశ! సామాన్యం విద్యాత్ ॥4॥

అ॥ పురుషునియందు భూమి కాఠిన్యరూపముగను, జలము క్లేదరూపముగను, అగ్ని సంతాపరూపముగను, వాయువు ప్రాణరూపముగను, ఆకాశము రంధ్రరూపముగను, బ్రహ్మ అంతరాత్మరూపముగను నుండును. లోకమునందు బ్రహ్మసంబంధమగువిభూతి యుండునటుల పురుషునియందు అంతరాత్మసంబంధమగు విభూతి యుండును. లోకమునందు దక్షప్రజాప్రతి బ్రహ్మసంబంధమగు విభూతిగ నుండునటుల పురుషునియందు మనస్సు అంతరాత్మసంబంధమగు విభూతిగ నుండును. లోకమునందలి ఇంద్రుడు పురుషునియందు అహంకారముగను, సూర్యుడు గ్రహణశక్తిగను, ఈశ్వరుడు కోపరూపముగను, చంద్రుడు శాంతరూపముగను, వసువులు సుఖరూపముగను, అశ్వినీదేవతలు కాంతిరూపముగను, వాయుదేవుడు ఉత్సాహరూపముగను, విశ్వదేవతలుసమస్త

ఇంద్రియములుగను ఇంద్రియార్థములుగను, చీకటి మోహనరూపముగను, వెలుతురు జ్ఞానరూపముగను నుండును. లోకమునకు సృష్టియొక్క ఆదికాలమువలె పురుషునకు గర్భాధానకాల ముండును. లోకమునందు కృతయుగమువలె పురుషునియందు బాల్యమును త్రేతాయుగమువలె యౌవనమును. ద్వాపరయుగమువలె వార్ధక్యమును, కలియుగమువలె వ్యాధిగ్రస్తతయు, యుగాంతమువలె మరణమును నుండును. లోక పురుషుల సంబంధమైన చెప్పబడని అవయవ విశేషములయొక్క సాదృశ్యమును ఊహించి ఇటులనే తెలిసికొనవలయును.

మూ॥ ఇత్యేవంవాదినం భగవన్తమాత్రేయమగ్నివేశ ఉవాచ—ఏవమేతత్సర్వమనపవాదం యథోక్తం భగవతా లోకపురుషయోః సామాన్యం; కింత్వస్య సామాన్యోపదేశస్య ప్రయోజనమితి॥ భగవానువాచ—శృణ్వగ్నివేశ! సర్వలోకమాత్మన్యాత్మానం చ సర్వలోకే సమనుపశ్యతః సత్యా బుద్ధిరుత్పద్యత ఇతి, సర్వలోకం హ్యాత్మని పశ్యతో భవత్యాత్మైవ సుఖదుఃఖయోః కర్తా నాన్య ఇతి, కర్మాత్మకత్వాచ్చ హేత్వాదిభిర్యుక్తః సర్వలోకోఽహమితి విదిత్వా జ్ఞానం పూర్వముత్థాప్యతేఽపవర్గాయేతి; తత్ర సంయోగాపేక్షీ లోకశబ్దః; షడ్ధాతుసముదాయో హి సామాన్యతః సర్వలోకః॥ తస్య హేతురుత్పత్తిర్వృద్ధిరుపప్లవో వియోగశ్చ। తత్ర హేతురుత్పత్తికారణం, విభాగో వియోగః, స జీవాపగమః, స ప్రాణనిరోధః, స భఙ్గః, స లోకస్వభావః తస్య మూలం సర్వోపప్లవానాం చ ప్రవృత్తిః, నివృత్తిరుపరమః, ప్రవృత్తిర్దుఃఖం నివృత్తిః సుఖమితి యజ్జ్ఞానముత్పద్యతే తత్సత్యం, తస్య హేతుః సర్వలోకసామాన్యజ్ఞానం, తత్ప్రయోజనం సామాన్యోపదేశస్యేతి ॥7॥

అ॥ పైవిధముగ చెప్పుచున్న ఆత్రేయుని అగ్నివేశుడు క్రిందివిధముగ అడిగెను. మీచే లోకపురుషులకు చెప్పబడిన సాదృశ్యము నిర్వివాదముగ నున్నది. కాని ఇట్టి సాదృశ్యమును చెప్పుటవలన ప్రయోజన మేమి? అని అడుగగా ఆత్రేయుడు ఇట్లు చెప్పెను. సర్వలోకమును తననుగను, తనను సర్వలోకముగను చూచువానికి సత్యమైన బుద్ధి కలుగును. సర్వలోకమును తననుగ చూచువాడు సుఖదుఃఖములకు ఆత్మయే కర్తయనియు ఇతరుడు కాడనియు తెలిసికొనును. కర్మవశమువలన హేత్వాదులతో కూడినసర్వలోకమును నేనేఅని తెలిసికొనినవాడుజ్ఞానమును పొంది మోక్షము కొరకు ప్రయత్నించును. లోకశబ్దము పురుషుని అపేక్షించియుండును. సమస్త లోకమును సామాన్యముగ షడ్ధాతుసముదాయరూపముగ నుండును. అట్టి లోకము

నకు హేతువు, ఉత్పత్తి, వృద్ధి, ఉపప్లవము, వియోగము ఇవి యుండును. ఉత్పత్తి కారణము హేతు వనబడును. జన్మ ఉత్పత్తి యనబడును. ఆప్యాయనముపొందుట వృద్ధి యనబడును. దుఃఖములుకలుగుట ఉపప్లవ మనబడును. షడ్ధాతువులువిడిపోవుట వియోగమనియు జీవాపగమమనియు ప్రాణనిరోధమనియు భంగమనియు చెప్పబడును. ఇదిలోకస్వభావముగ నుండును. లోకము రాగద్వేషాదులతోకూడి ప్రవర్తించుట సమస్తదుఃఖములుకలుగుటకు కారణముగ నుండును. రాగద్వేషాదులు లేకుండుట దుఃఖములు కలుగకుండుటకు కారణముగ నుండును. ప్రవృత్తి దుఃఖముగను నివృత్తి సుఖముగను ఉండునని కలుగుజ్ఞానము సత్యజ్ఞానముగ నుండును. పురుషుడును లోకమును తుల్యముగనుండుననెడి జ్ఞానము సత్యజ్ఞానమునకు హేతువుగ నుండును. ఇదియే లోకపురుషసామ్యమును చెప్పుటకు ప్రయోజనముగ నుండును.

మూ॥ అథాగ్నివేశ ఉవాచ—కింమూలా భగవన్! ప్రవృత్తినివృత్త్యో వా ఉపాయ ఇతి ॥ భగవానువాచ—మోహేచ్ఛాద్వేషకర్మమూలా ప్రవృత్తిః, తజ్జా హ్యహఙ్కారసఙ్గసంశయాభిసంప్లవాభ్యవపాతవిప్రత్యయావిశేషానుపాయా స్తరుణమివ ద్రుమమతివిపులశాఖా స్తరవోఽభిభూయ పురుషమవతత్యోత్తిష్ఠన్తే, యైరభిభూతో న సత్తామతివర్తతే; తత్రైవంజాతిరూపవిత్తవృత్తబుద్ధిశీలవిద్యాభిజనవయోవీర్యప్రభావసంపన్నోఽహమిత్యహఙ్కారః, యద్వాఙ్మనోవాక్కాయకర్మ నాపవర్గాయ స సఙ్గః, కర్మఫలమోక్షపురుష ప్రేత్య భావాదయఃసన్తి వా నేతి సంశయః, సర్వావస్థాస్వనన్యోఽహమహం స్రష్టా స్వభావసంసిద్ధోఽహమహం శరీరేన్ద్రియబుద్ధిస్మృతివిశేషరాశిరితి గ్రహణమభిసంప్లవః, మమ మాతృపితృభ్రాతృదారాపత్యబన్ధుమిత్రభృత్యగణో గణస్య చాహమిత్యభ్యవపాతః, కార్యాకార్యహితాహితశుభాశుభేషు విపరీతాభినివేశో విప్రత్యయః, జ్ఞాజ్ఞయోః ప్రకృతివికారయోః ప్రవృత్తినివృత్త్యోశ్చ సామాన్యదర్శనమవిశేషః, ప్రోక్షణానశనాగ్నిహోత్రత్రిషవణాభ్యుక్షణావాహనయజనయాజన యాచన సలిలహుతాశనప్రవేశాదయః సమారమ్భాః ప్రోచ్యన్తే హ్యనుపాయాః; ఏవమయమధీధృతిస్మృతిరహఙ్కారాభినివిష్టః సక్తః ససంశయోఽభిసంప్లుతబుద్ధిరభ్యవపతితోఽన్యథాదృష్టిరవిశేషగ్రాహీ విమార్గగతి ర్నివాసవృక్షః సత్త్వశరీరదోషమూలానాం మూలంసర్వదుఃఖానాం భవతి; ఇత్యేవమహఙ్కారాదిభిర్దోషైర్భ్రామ్యమాణో నాతివర్తతే ప్రవర్తిం, సా చ మూలమఘస్య ॥9॥

ఆ॥ ప్రవృత్తికిగాని నివృత్తికిగాని కారణమగు ఉపాయమేమి? అని అగ్నివేశుడు అడుగగా ఆత్రేయుండు ఈ క్రిందివిధముగ చెప్పెను. మోహము, ఇచ్ఛ, ద్వేషము, కర్మ వీనివలన ప్రవృత్తికలుగును. ప్రవృత్తివలనకలిగిన అహంకారము, సంగము, సంశయము, అభిసంప్లవము, అభ్యవపాతము, విప్రత్యయము, అవిశేషము, అనుపాయము ఇవి పురుషుని "అధికముగ వృద్ధిపొందిన కొమ్మలుగల వృక్షములు చిన్నవృక్షమునువలె" ఆవరించియుండును. వీనిచే ఆవరింపబడిన పురుషుడు ప్రవృత్తిహేతువును అతిక్రమింపజాలడు. జాతి, రూపము, ధనము, ఆచారము, బుద్ధి, నడవడిక, విద్య, కులము, వయస్సు. శక్తి, ప్రభావము వీనిచే నేను శ్రేష్ఠుడనని తలచుట అహంకార మనబడును. మనోవాక్కాయములచే చేయబడు కర్మలను మోక్షముకొరకు చేయకుండుట సంగ మనబడును. కర్మఫలము. మోక్షము, ఆత్మ, పునర్జన్మ ఇవి కలవా లేవా అని తలచుట సంశయ మనబడును. సమస్తవిషయములయందును నాతో సమానుడులేడనియు నేనుసృష్టించువాడననియు స్వభావసిద్ధుడననియుశరీరము ఇంద్రియములు బుద్ధి స్మృతి వీనివిశేషములయొక్క సమూహమే నేననియు తలచుట అభిసంప్లవ మనబడును. తల్లి తండ్రి సోదరులు భార్యసంతానము బంధువులు మిత్రులు సేవకులు వీరు నాసంబంధమైనవారనియు నేను వారిసంబంధమైన వాడననియు తలచుట అభ్యవపాత మనబడును. కార్యములు అకార్యములు హితములు అహితములు శుభములు అశుభములు వీనిని వ్యతిరేకముగతలచుట విప్రత్యయ మనబడును. తెలిసినవాడు తెలియనివాడు, ప్రకృతి వికృతి, ప్రవృత్తి నివృత్తి వీనియందు సామాన్యదృష్టి కలుగుట అవిశేష మనబడును. ప్రోక్షణము. ఉపవాసము, అగ్నిహోత్రము, మూడు కాలములయందు స్నానముచేయుట, అభ్యుక్షణము, ఆవాహనముచేయుట, యజ్ఞములనుచేయుట, యజ్ఞములనుచేయించుట, యాచింపకుండుట, సలిలప్రవేశము, అగ్నిప్రవేశము మొదలగుకృత్యములు అనుపాయము లనబడును. బుద్ధి ధృతి స్మృతి ఇవి లేనివాడై అహంకారము, సంగము, సంశయము, అభిసంప్లవము, అభ్యవపాతము, విప్రత్యయము, అవిశేషము, అనుపాయము వీనితోకూడిన మనుజుడు మనస్సంబంధమైనట్టియు శరీరసంబధమైనట్టియు దోషములవలన కలుగు సమస్తదుఃఖములకును నివాసస్థానముగ నుండును. అహంకారము మొదలగు దోషములతో కూడుకొనినవాడు పునర్జన్మను పొందుచు ప్రవృత్తిని అతిక్రమింపజాలడు. ఆప్రవృత్తి పాపకర్మలకు కారణముగ నుండును.

మూ॥ నివృత్తిరపవర్గస్తత్పరం తత్ప్రశాన్తం తదక్షరం తద్బ్రహ్మ స మోక్షః। తత్ర ముముక్షూణాముదయనాని వ్యాఖ్యాస్యామః—తత్ర లోకదోషదర్శినో ముముక్షోరాదిత ఏవాచార్యాభిగమనం, తస్యోపదేశానుష్ఠానం, అగ్నే రేవోపచర్యా, ధర్మశాస్త్రానుగమనం, తదర్థావబోధః, తేనావష్టమ్భః, తత్ర యథోక్తాః క్రియాః, సతాముపాసనమసతాం పరివర్జనం, అసజ్గతిర్దుర్జనేన, సత్యం సర్వభూత

హితమపరుష మనతికాలే పరీక్ష్య వచనం, సర్వప్రాణిష్వాత్మనీవావేక్షా, సర్వాసామస్మరణ మసంకల్పనమప్రార్థనా నభిభాషణం చ స్త్రీణాం, సర్వపరిగ్రహత్యాగః, కౌపీనం ప్రచ్ఛాదనార్థంధాతురాగనివసనం, కన్థాసీవనహేతోః సూచీపిప్పలకం, శౌచాధానహేతోర్జలకుణ్డికా, దణ్డధారణం, భైక్ష్యచర్యార్థం పాత్రం, ప్రాణధారణార్థ మేకకాలమగ్రామ్యో యథోపపన్న ఏవాభ్యవహారః, శ్రమాపనయనార్థం శీర్ణశుష్కపర్ణతృణాస్తరణోపధానం, ధ్యానహేతోః కాయనిబన్ధనం, వనేష్వనికేతవాసః, తన్ద్రానిద్రాలస్యాది కర్మవర్జనం, ఇన్ద్రియార్థేష్వనురాగోపతాప నిగ్రహః, సుప్తస్థితగత ప్రేక్షితాహార ప్రత్యఙ్గచేష్టాదికేష్వారమ్భేషు స్మృతిపూర్వికా ప్రవృత్తిః. సత్కారస్తుతిగర్హావమానక్షమత్వం, క్షుత్పిపాసాయాసశ్రమశీతోష్ణవాతవర్షాసుఖదుఃఖ సంస్పర్శసహత్వం, శోకదైన్యోద్వేగమదమానలోభరాగేర్ష్యా భయక్రోధాదిభిరసంచలనం, అహఙ్కారాదిషూపసర్గసంజ్ఞా, లోకపురుషయోః సర్గాదిసామాన్యావేక్షణం, కార్యకాలాత్యయభయం, యోగారమ్భే సతతమనిర్వేదః, సత్త్వోత్సాహః, అపవర్గాయ ధీధృతి స్మృతిబలాధానం, నియమన మిన్ద్రియాణాం చేతసి చేతస ఆత్మని, ఆత్మనశ్చ ధాతుభేదేన శరీరావయవ సంఖ్యానం, అభీక్ష్ణం సర్వం కారణవద్దుఃఖమస్వమనిత్యమిత్యభ్యుపగమః, సర్వప్రవృత్తిషు దుఃఖసంజ్ఞా, సర్వసంన్యాసే సుఖమిత్యభినివేశః ఏష మార్గోఽపవర్గాయ; అతోఽన్యథా బధ్యత ఇత్యుదయనాని వ్యాఖ్యాతాని ॥10॥

అ॥ నివృత్తి, అపవర్గము, పరము, ప్రశాంతము, అక్షరము, బ్రహ్మ, మోక్షము ఇవి సమానార్థకములుగ నుండును. మోక్షమును కోరువారలకు ఉపాయములను చెప్పుచున్నాము. లోకమును దోషయుక్తమైనదానినిగ తెలిసికొని మోక్షమునుకోరిన వానికి—ప్రథమమున గురువునొద్దకు వెళ్ళుట, గురువుయొక్క ఉపదేశములను అనుష్ఠించుట,అగ్నిని ఉపచరించుట,ధర్మశాస్త్రములను పఠించుట,వానియొక్క అర్థమును తెలిసికొనుట, దానిచే ధైర్యమునుకలిగియుండుట, వానియందు చెప్పబడినప్రకారము క్రియలనాచరించుట, సత్పురుషులను సేవించుట, దుర్మార్గులను సేవింపకుండుట, దుర్జనులతో సాంగత్యమును చేయకుండుట, సత్యమైనట్టియు సర్వప్రాణులకును హితమైనట్టియు పరుషముగ లేనట్టియు అధికముగ లేనట్టియు వాక్యములను యోచించి అవసరమైన కాలమునందుపలుకుట, సమస్తప్రాణులను తనవలెచూచుట,స్మరించుట సంకల్పించుట ప్రార్థించుట మాట్లాడుట వీనినివీస్త్రీతోనైనను చేయకుండుట,సమస్తకోరిక

లను విడిచిపెట్టుట, గైరికాదిధాతువులతో రంగువేయబడిన కాపీనమును ధరించుట, బొంతలనుకట్టుకొనుటనిమిత్తము సూదులతోకూడిన పాత్రలను ఉంచుకొనుట, శౌచ కర్మనిమిత్తము జలపాత్రను ఉంచుకొనుట, దండమును ధరించుట, భిక్షాటనము నిమిత్తము భిక్షాపాత్రను ఉంచుకొనుట, ప్రాణధారణమునిమిత్తము గ్రామ్యముకానట్టి ఆహారమును లభ్యమైనంతమాత్రమే ఒకకాలమునందే భుజించుట, బడలికనుపోగొట్టుకొను నిమిత్తము రాలియెండిన ఆకులచేతను గడ్డిచేతను శయ్యను కల్పించుకొనుట, ధ్యానము నిమిత్తము యోగపట్టను ధరించుట, గృహములేకుండ వనమునందు నివసించుట, పాలుమాలిక నిద్ర సోమరితనము మొదలగువానినివిడిచిపెట్టుట, ఇంద్రియార్థములయందు అనురాగముగాని ద్వేషముగాని లేకుండుట, నిద్ర స్థితి గమనము చూచుట ఆహారము అంగప్రత్యంగచేష్టలు మొదలగు కృత్యములయందు ఆలోచించిప్రవర్తించుట, సత్కారము స్తోత్రము నింద అవమానము వీనియందు సమభావమును కలిగియుండుట, ఆకలి దప్పిక బడలిక శ్రమ శీతము వేడిమి గాలి వర్షము సుఖము దుఃఖము వీనిని సహించుట, దుఃఖము దీనత్వము ఉద్రేకము మదము అభిమానము లోభము అనురాగము ద్వేషము భయము కోపము మొదలగువానిచే చలింపకుండుట, అహంకారము మొదలగువానిని అనర్థకములైనవానినిగ తలచుట, లోకమునకు పురుషునకును ఉత్పత్తి మొదలగువానియందుకల సామ్యమును తెలిసికొనుట, కార్యములను ఆచరింపతగినకాలమును అతిక్రమింపకుండుట, యోగము నారంభించుటయందు ఎల్లప్పుడును ప్రేమనుకలిగియుండుట, మనస్సంబధమైన ఉత్సాహమును కలిగియుండుట, మోక్షముకొరకు బుద్ధి ధృతి స్మృతి వీనియొక్క బలమును కలిగియుండుట, ఇంద్రియములను మనస్సునందును మనస్సును ఆత్మయందును అరికట్టుట, ధాతుభేదములచే తనయొక్క శరీరముసందలిఅవయవములను తెలిసికొనుట, ఆత్మవ్యతిరిక్తమైనట్టియు కారణయుక్తమైనట్టియు సమస్తమును దుఃఖరూపమైనదానినిగ తెలిసికొనుట, సమస్తప్రవృత్తులను దుఃఖకరములైనవానినిగ తెలిసికొనుట, సమస్తమును విడిచిపెట్టుటను సుఖకరమైనదానినిగ తలచుట ఇవి మోక్షమునుకలిగించుటకు ఉపాయములుగ నుండును. వీనికి వ్యతిరేకములైనవి మోక్షమునకుప్రతిబంధకములుగ నుండును. ఇట్లు మోక్షోపాయములువివరింపబడినవి.

మూ॥ ఏతైరవిమలం సత్త్వం శుద్ధ్యుపాయైర్విశుధ్యతి । మృజ్యమాన ఇవాదర్శస్తైలచేలకచాదిభిః॥ గ్రహాంబ్వుదరజోధూమనీహారైరసమావృతమ్ । యథాఽర్కమణ్డలం భాతి భాతి సత్త్వం తథాఽమలమ్॥ జ్వలత్యాత్మని సంరుద్ధం తత్సత్త్వం సంవృతాయనే । శుద్ధః స్థిరః ప్రసన్నార్చిర్దీపో దీపాశయే యథా ॥ 1౩॥

అ॥ కల్మషయుక్తమైనమనస్సు పైనచెప్పబడిన మోక్షోపాయములచే శుద్ధినొందును. అట్లు శుద్ధినొందినసత్త్వము తైలము వస్త్రము కుంచ మొదలగువానిచే తుడువబడిన అద్దమువలెను, గ్రహములు మేఘములు దుమ్ము పొగ మంచు వీనిచే

ఆవరింపబడని సూర్యమండలమువలెను. ప్రకాశించును నియమింపబడిన ఇంద్రియములుగల ఆత్మయందు అరికట్టబడిన మనస్సు మూయబడినద్వారములుగల గృహమునందు శుద్ధమైనట్టియు స్థిరమైనట్టియు నిర్మలమైనజ్వాలకలిగినట్టియు దీపమువలె ప్రకాశించును.

మూ॥ శుద్ధసత్త్వస్య యా శుద్ధా సత్యా బుద్ధిః ప్రవర్తతే। యయా భినత్త్యతిబలం మహామోహమయం తమః॥ సర్వభావస్వభావజ్ఞో యయా భవతి నిస్పృహః। యోగం యయా సాధయతే సాంఖ్యః సంపద్యతే యయా॥ యయా నోపైత్యహఙ్కారం నోపాస్తే కారణం యయా॥ యయా నాలమ్బతే కించిత్సర్వం సంన్యస్యతే యయా॥ యాతి బ్రహ్మ యయా నిత్యమజరం శాన్తమక్షరమ్। విద్యా సిద్ధిర్మతిర్మేధా ప్రజ్ఞాజ్ఞానం చ సా మతా ॥17॥

అ॥ శుద్ధసత్త్వముగలవానికి శుద్ధమైనట్టియు స్వచ్ఛమైనట్టియు ఏబుద్ధి కలుగునో అతిబలవంతమైనట్టియు మహామోహ స్వరూపమైనట్టియు అజ్ఞానము దేనిచే భేదింపబడునో దేనివలన సర్వభావములయొక్క స్వభావమును తెలిసికొనినవాడై నిస్పృహుడగునో దేనిచే యోగమును సాధించునో దేనిచే తత్త్వజ్ఞానము కలవాడగునో దేనివలన అహంకారమును పొందడో దేనివలన సుఖదుఃఖములకు కారణములైనవానిని సేవింపడో దేనివలన దేనిని అవలంబింపడో దేనివలన సర్వమునువిడిచిపెట్టునో నిత్యమైనట్టియు నశింపనట్టియు శాంతమైనట్టియు క్షీణింపనట్టియు మోక్షమును దేనివలన పొందునో అదివిద్యయనియు సిద్ధియనియు మతియనియు మేధయనియు ప్రజ్ఞయనియు జ్ఞానమనియు చెప్పబడును.

మూ॥ లోకే వితతమాత్మానం లోకం చాత్మని పశ్యతః। పరావరదృశః శాన్తిః జ్ఞానమూలా న నశ్యతి॥ పశ్యతః సర్వభూతాని సర్వావస్థాసు సర్వదా। బ్రహ్మభూతస్య సంయోగో న శుద్ధస్యోపపద్యతే॥ నాత్మనః కరణాభావాల్లిఙ్గమప్యుపలభ్యతే। స సర్వకరణత్యాగాన్ముక్త ఇత్యభిధీయతే ॥20॥

అ॥ తనను లోకమునందువ్యాపించినవానినిగను లోకమును తనయందువ్యాపించిన దానినిగను చూచుచు ఆత్మ ప్రకృతి మొదలగువానిని తెలిసికొనినవానికి జ్ఞానమూలమైన శాంతి నశింపదు. ఎల్లప్పుడును సర్వావస్థలయందు సమస్తభూతములను చూచుచున్నను జీవన్ముక్తుడైనట్టియు శుద్ధుడైనట్టియు పురుషునకు దేనితోడను సంబంధము కలుగదు. ముక్తిపొందిన ఆత్మకు మనస్సు మొదలగు కరణములులేక పోవుటవలన ఏవిధమగులక్షణమును ఉండనేరదు. అట్టిఆత్మ సర్వకరణములునులేని వాడగుటవలన ముక్తుడని చెప్పబడును.

మూ॥ విపాపం విరజః శాన్తం పరమక్షరమవ్యయమ్।అమృతం బ్రహ్మ నిర్వాణం పర్యాయైః శాన్తిరుచ్యతే॥ ఏతత్తత్సౌమ్య । విజ్ఞానం యత్ జ్ఞాత్వా ముక్తసంశయాః । మునయః ప్రశమం జగ్ముర్వీతమోహరజఃస్పృహాః ॥22॥

అ॥ విపాపము, విరజస్సు శాంతము, పరము, అక్షరము, అవ్యయము, అమృతము, బ్రహ్మ, నిర్వాణము ఇవి శాంతికి పర్యాయపదములుగ నుండును. మునీశ్వరులు విజ్ఞానమునుపొంది సంశయమును మోహమును రజోగుణమును స్పృహయు లేనివారై ఏ మోక్షమును పొందుచున్నారో అదియే శాంతి యని చెప్పబడును.

## అధ్యాయ సంగ్రహము.

మూ॥ సప్రయోజనముద్దిష్టం లోకస్య పురుషస్య చ । సామాన్యం మూలముత్పత్తౌ నివృత్తౌ మార్గ ఏవ చ ॥ శుద్ధసత్త్వసమాధానం సత్యాబుద్ధిశ్చ నైష్ఠికీ। విచయేపురుషస్యోక్తా నిష్ఠా చ పరమర్షిణా॥24॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతి సంస్కృతే శారీరస్థానే పురుషవిచయ శారీరం నామ పఞ్చమోఽధ్యాయః ॥

అ॥ ఈపురుషవిచయశారీరాధ్యాయమునందు - లోకపురుషులకుగల సాదృశ్యమును, అట్టిసాదృశ్యమును చెప్పుటవలనకలుగు ప్రయోజనమును, ప్రవృత్తి కలుగుటకు కారణములును, నివృత్తి కలుగుటకు మార్గములును, శుద్ధసత్త్వముయొక్క స్థితియు, మోక్షమును కలిగించునట్టి సత్యమైన బుద్ధియు, మోక్షవిషయమును చెప్పబడినవి.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామకకృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు పురుషవిచయశారీర మనెడు పంచమాధ్యాయము సమాప్తము.

—0—

# షష్ఠాధ్యాయము.

మూ॥ అథాతః శరీరవిచయం శారీరం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట శరీరవిచయ శారీరమును చెప్పబోవుచున్నాను.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ శరీరవిచయః శరీరోపకారార్థమిష్యతే భిషగ్విద్యాయాం, జ్ఞాత్వా హి శరీరతత్త్వం శరీరోపకారకరేషు భావేషు జ్ఞానముత్పద్యతే; తస్మాచ్ఛరీరవిచయం ప్రశంసన్తి కుశలాః ॥3॥

ఆ॥ వైద్యశాస్త్రమునందు శరీరమును తెలిసికొనినచో శరీరముయొక్క ఆరోగ్యమునిమిత్తము ఉపయోగించును. శరీరతత్త్వమును తెలిసికొనినచో శరీరమునకు ఉపకారమునుకలిగించు భావములయందు జ్ఞానము కలుగును. అందువలన శరీరభాగమును తెలిసికొనుట శ్రేష్ఠమైనదని బుద్ధిమంతులు చెప్పుచున్నారు.

మూ॥ తత్ర శరీరం నామ చేతనాధిష్ఠానభూతం పఞ్చభూతవికారసముదాయాత్మకం సమయోగవాహి; యదా హ్యస్మిన్ శరీరే ధాతవో వైషమ్యమాపద్యన్తే తదా క్లేశం వినాశం వా ప్రాప్నోతి; వైషమ్యగమనం హి పునర్ధాతూనాం వృద్ధిహ్రాసగమనమకార్త్స్న్యేన ప్రకృత్యా చ ॥4॥

ఆ॥ ఆత్మకు ఆధారమైనదిగను పంచమహాభూతవికారసముదాయరూపమైనదిగను ధాత్వాదులనుసమముగ వహించునదిగనునుండునది శరీరమనబడును. ఇట్టి శరీరమునందు ఎప్పుడు ధాతువులు వైషమ్యమును పొందునో అప్పుడు క్లేశమునుగాని వినాశమునుగాని పొందును. ధాతువులు ఏకదేశముగ గాని సంపూర్ణముగ గాని వృద్ధినైనను క్షయమునైనను పొందుటయే వైషమ్యమనబడును.

మూ॥ యౌగపద్యేన తు విరోధినాం ధాతూనాం వృద్ధిహ్రాసౌ భవతః యద్ధి యస్య ధాతోర్వృద్ధికరం తత్తతో విపరీతగుణస్య ధాతోః ప్రత్యవాయకరం తు సంపద్యతే ॥ తదేవ తస్మాద్భేషజం సమ్యగపచార్యమాణం యుగపన్న్యూనాతిరిక్తానాం ధాతూనాం సామ్యకరం భవతి; అధికమపకర్షతి, న్యూనమాప్యాయయతి ॥6॥

ఆ॥ పరస్పరవిరోధ స్వభావముకల ధాతువులకు వృద్ధిక్షయములు ఒకేసారిగ కలుగును. ఏది ఏధాతువునకు వృద్ధినికలించునో అది ఆధాతువుతోవిపరీతమైనగుణములు కల ధాతువునకు క్షయమును కలిగించును. అందువలన నౌషధము సరిగనుపయోగింపబడినదై వృద్ధిపొందియు క్షీణించియు నున్న ధాతువులకు ఒకమారుగనే సమత్వమును కలిగించును. ఎట్లనగా-వృద్ధిపొందినదానిని క్షీణింపచేసియు క్షీణించినదానిని వృద్ధిపొందించియు సమత్వమును కలిగించును.

మూ॥ ఏతావదేవ హి భైషజ్యప్రయోగే ఫలమిష్టం స్వస్థవృత్తానుష్ఠానే చ యావద్ధాతూనాం సామ్యం స్యాత్; స్వస్థా హ్యపి ధాతూనాం సామ్యానుగ్రహార్థమేవ కుశలా రసగుణానాహారవికా

రాంశ్చ పర్యాయేణేచ్ఛన్త్యుపయోక్తుం సాత్మ్యసమాజ్ఞాతాన్, ఏక ప్రకారభూయిష్ఠా శ్చోపయుఞ్జానా_స్తద్విపరీతకరసమాజ్ఞాతయా చేష్టయా సమ మిచ్ఛన్తి కర్తుమ్ ॥7॥

అ॥ ఔషధమునుపయోగించుటకును స్వస్థవృత్తము నాచరించుటకును ధాతుసామ్యము కలుగుటయే బలముగ నుండును. ఆరోగ్యవంతులుకూడ ధాతు సామ్యము కలిగియుండుటకొరకే, సాత్మ్యములుగ చెప్పబడిన రసములను గుణములను ఆహారవికారములను ఉచితమైనక్రమముగ నుపయోగింపవలయును. ఒకేవిధమైనవానినిఉపయోగించువారు వానికిపవిరీతముగ చెప్పబడినకృత్యములచేసమత్వమును కలిగించుకొనెదరు.

మూ॥ దేశకాలాత్మగుణవిపరీతానాం హి కర్మణామాహార వికారాణాం చ క్రియోపయోగః సమ్యక్ సర్వాతియోగసంధారణ మసంధారణ ముదీర్ణానాం చ గతిమతాం సాహసానాం చ వర్జనం స్వస్థవృత్త మేతావద్ధాతూనాం సామ్యానుగ్రహార్థముపదిశ్యతే ॥ ॥

అ॥ ధాతుసామ్యమునుకలిగియుండుటకు ఆరోగ్యవంతుడు — దేశము కాలము శరీరము వీనికివిపరీతములైనగుణములుకల కర్మలను ఆహారవికారములను సరిగనుపయోగించుట, అసమ్యగ్యోగముల నన్నిటిని విడిచిపెట్టుట, మలమూత్రాదివేగములను అరికట్టకుండుట, బలమునకు మించినపనులను చేయకుండుట వీని నాచరింపవలయును.

మూ॥ ధాతవః పునః శారీరాః సమానగుణైః సమానగుణ భూయిష్ఠైర్వాఽప్యాహారవిహారై రభ్యస్యమానై ర్వృద్ధిం ప్రాప్నువన్తి, హ్రాసంతువిపరీతగుణై ర్విపరీతగుణభూయిష్ఠైర్వాఽప్యభ్యస్యమానైః ॥9॥

అ॥ శరీరమునందలి ధాతువులు తమతో సమానమైన గుణములుకలిగినట్టికాని సమానగుణము అధికముగ కలిగినట్టికాని ఆహారవిహారములను సేవించుటచే వృద్ధిని పొందును. తమతో విపరీతగుణములు కలవానినిగాని విపరీతగుణములధికముగ గలవానిని గాని సేవించుటచే క్షయమును పొందును.

మూ॥ తత్రేమే శరీరధాతుగుణాః సంఖ్యాసామర్థ్యకరాః; తద్యథా—గురులఘుశీతోష్ణస్నిగ్ధరూక్షమన్ద తీక్ష్ణస్థిరసరమృదుకఠిన విశద పిచ్ఛిలశ్లక్ష్ణఖరసూక్ష్మస్థూలసాన్ద్రద్రవాః; తేషు యే గురవ_స్తేగురుభి రాహారగుణై రభ్యస్యమానై రాప్యాయ్యన్తే లఘవశ్చ హ్రసన్తి; లఘవస్తు లఘుభిరాప్యాయ్యన్తే గురవశ్చ హ్రసన్తి; ఏవమేవ సర్వధాతుగుణానాం సామాన్యయోగాద్వృద్ధిర్విపర్యయాద్ధ్రాసః; ఏతస్మాన్మాంసమాప్యాయ్యతే మాంసేన భూయ_స్తరమన్యేభ్యః శరీర

ధాతుభ్యః, తథా లోహితం లోహితేన, మేదో మేదసా, వసా వసయా, అస్థి తరుణాస్థ్నా. మజ్జా మజ్జయా, శుక్రం శుక్రేణ, గర్భస్త్వామగర్భేణ ॥ 0॥

ఆ॥ సంఖ్యాజ్ఞానముతోఁ గూడిన శరీరధాతుగుణములు చెప్పబడుచున్నవి. ఎటులననగా - గురు లఘు శీత ఉష్ణ స్నిగ్ధ రూక్ష మంద తీక్ష్ణ స్థిర సర మృదు కఠిన విశద పిచ్ఛిల శ్లక్ష్ణ ఖర సూక్ష్మ స్థూల సాంద్ర ద్రవ అనునివి గుణములుగ నుండును. గురుగుణములగల ఆహారములను ఉపయోగించినచో గురుగుణముకల ధాతువులు వృద్ధిని పొందును. మరియు లఘుగుణములుకల ధాతువులు క్షయమును పొందును లఘుగుణము కలవానిని ఉపయోగించినచో లఘుగుణములవి వృద్ధినిపొందును. గురుగుణముకలవి క్షయమును పొందును. ఇటులనే సమస్తధాతుగుణములకును సమానమైనవానిని ఉపయోగించుటచే వృద్ధియు విపరీతములైనవానిని ఉపయోగించుటచే క్షయమునుకలుగును. అందువలన మాంసమును ఉపయోగించినచో శరీరమునందు ఇతరధాతువులకంటె మాంసము వృద్ధిని పొందును. ఇటులనే రక్తము నుపయోగించుటవలన రక్తమును. మేదస్సు నుపయోగించుటవలన మేదస్సును, వసకలన వసయు, తరుణాస్థులవలన ఎముకలును, మజ్జవలన మజ్జయు, శుక్రమువలన శుక్రమును, అమగర్భమువలన (గుడ్లు మొదలగువానివలన) గర్భమును వృద్ధిపొందును.

మూ॥ యత్ర త్వేవంలక్షణేన సామాన్యేన సామాన్యవతామాహారవికారాణామసాంనిధ్యం స్యాత్ సంనిహితానాం వాఽయుక్తత్వాన్నోపయోగో ఘృణిత్వాదన్యస్మాద్వా కారణాత్, స చ ధాతురభివర్ధయితవ్యః స్యాత్, తస్య యే సమానగుణాః స్యురాహారవికారా అసేవ్యాశ్చ, తత్ర సమానగుణభూయిష్ఠానామన్యప్రకృతీనామప్యాహారవికారాణాముపయోగః స్యాత్; తద్యథా—శుక్రక్షయే క్షీరసర్పిషోరుపయోగో మధురస్నిగ్ధసమాఖ్యాతానాం చాపరేషామేవ ద్రవ్యాణాం, మూత్రక్షయే పునరిక్షురసవారుణీమణ్డద్రవమధురామ్లలవణోపక్లేదినాం, పురీషక్షయే కుల్మాషమాషకుష్కుణ్డాజమధ్యయవశాకధాన్యామ్లానాం, వాతక్షయే కటుతిక్తకషాయరూక్షలఘుశీతానాం, పిత్తక్షయేఽమ్లలవణకటుక్షారోష్ణతీక్ష్ణానాం, శ్లేష్మక్షయే స్నిగ్ధగురుమధురసాన్ద్రపిచ్ఛిలానాం ద్రవ్యాణాం; కర్మాపి చ యద్యస్య ధాతోర్వృద్ధికరం తత్తదాసేవ్యం; ఏవమన్యేషామపి శరీరధాతూనాం సామాన్యవిపర్యయాభ్యాం వృద్ధిహ్రాసౌ యథాకాలం కార్యౌ; ఇతి సర్వధాతూనామేకైకశోఽతిదేశతశ్చ వృద్ధిహ్రాసకరాణి వ్యాఖ్యాతాని భవన్తి ॥ 1॥

తా॥ పైన చెప్పబడినవిధమున తుల్యజాతిరూపమగు సామాన్యముచే సమానధర్మములుగల ఆహారవికారములు లభింపనప్పుడుగాని లభించినను అయుక్తముగనుండుట వలనను అసహ్యముగనుండుటవలనను ఇతరకారణములవలనను ఉపయోగించుటకువీలు లేనప్పుడుగాని ధాతువునువృద్ధిపొందింపవలసియున్నయెడల సమానగుణములుగలవిగ చెప్పబడిన ఆహారవికారములు సేవింపతగనివిగనుండుటవలన అప్పుడు, సమానగుణము లధికముగకలిగినట్టియు ఇతరవిధములైనట్టియు ఆహారవికారములను ఉపయోగింపవలయును. ఎట్లనగా.—శుక్రముక్షీణించినప్పుడు పాలను నేతిని మధురరసముకలిగినట్టియు స్నిగ్ధగుణముకలిగినట్టియు ఇతరద్రవ్యములను ఉపయోగింపవలయును. మూత్రము క్షీణించినప్పుడు చెరుకురసమును వారుణీమద్యముయొక్క తేటను ద్రవపదార్థములను మధుర అమ్లలవణరసములు కలిగినట్టియు క్లేదగుణముకలిగినట్టియు ద్రవ్యములను ఉపయోగింపవలయును. పురీషము క్షీణించినప్పుడు ఉలవలు మినుములు కుష్కుండ మనెడి ద్రవ్యవిశేషము మేకయొక్క అంతిరాధికమందుండెడి మాంసము యవలు ఆకుకూరలు ధాన్యామ్లము వీనిని ఉపయోగింపవలయును. వాతము క్షీణించినప్పుడు కటుతిక్తకషాయరసములను రూక్షలఘుశీతగుణములను కలిగియున్న ద్రవ్యముల నుపయోగింపవలయును. పిత్తముక్షీణించినప్పుడు అమ్లలవణ కటురసములను క్షారమును ఉష్ణతీక్ష్ణగుణములనుకలిగియున్న ద్రవ్యములనుపయోగింపవలయును శ్లేష్మముక్షీణించినప్పుడు మధురరసమును స్నిగ్ధగురుసాంద్రపిచ్ఛిలగుణములను కలిగియున్న ద్రవ్యముల నుపయోగింపవలయును. ఆయాధాతువులనువృద్ధిపొందించు కర్మలనుకూడ ఆచరింపవలయును. ఇటులనే, ఇతరశరీర ధాతువులకుకూడ సమానములైనగుణములుకల ద్రవ్యములచే వృద్ధిని, విపరీతములైనగుణములుకల ద్రవ్యములచే క్షయమును సకాలమునందు కలిగింపవలయును. ఈవిధముగ సమస్తధాతువులకును వృద్ధిక్షయములనుకలిగించు ద్రవ్యములు ప్రత్యేకముగను వివరముగను చెప్పబడినవి.

మూ॥ కార్త్స్న్యేన శరీరపుష్టికరాస్త్విమే భావాః —కాలయోగః స్వభావసంసిద్ధిరాహారసౌష్ఠవమవిఘాతశ్చేతి। బలవృద్ధికరాస్త్విమే భావా భవన్తి; తద్యథా—బలవత్పురుషే దేశే జన్మ బలవత్పురుషే కాలే చ సుఖశ్చ కాలయోగో బీజక్షేత్రగుణసంపచ్చాహారసంపచ్చ శరీరసంపచ్చ సాత్మ్యసంపచ్చ సత్త్వసంపచ్చ స్వభావసంసిద్ధిశ్చ యౌవనం చ కర్మ చ సంహర్షశ్చేతి॥ ఆహారపరిణామకరాస్త్విమే భావా భవన్తి; తద్యథా — ఊష్మా వాయుః క్లేదః స్నేహః కాలః సమయోగశ్చేతి; తత్ర తు ఖల్వేషామూష్మాదీనామాహారపరిణామకరాణాం భావానామిమే కర్మవిశేషా భవన్తి, తద్యథా— ఊష్మాపచతి, వాయురపకర్షతి, క్లేదః శైథిల్యమాపాదయతి, స్నేహో మార్దవం జనయతి, కాలః పర్యాప్తిమభినిర్వర్తయతి, సమయోగస్త్వే

షాం పరిణామధాతుసామ్యకరః సంపద్యతే॥ పరిణామతస్త్వాహారస్య గుణాః శరీరగుణభావమాపద్యన్తే యథాస్వమవిరుద్ధాః, విరుద్ధాశ్చ విహన్యుర్విహతాశ్చ విరోధిభిః శరీరమ్ ॥14॥

అ॥ యౌవనము మొదలగుకాలము, అదృష్టరూపమైనస్వభావము, ఆహారసౌష్ఠవము, విఘాతములు లేకుండుట ఇవి సమస్తశరీరమునకును వృద్ధిని కలిగించునవిగ నుండును. బలమును వృద్ధిచేయు భావములు చెప్పబడుచున్నవి ఎట్లనగా—బలవంతులైన పురుషులుకల దేశమునందు జనించుట, పురుషులు బలవంతులుగనుండు హేమంతాదికాలములయందు జనించుట, కాలము సుఖకరముగ నుండుట, శుక్రశోణితములును గర్భాశయమును శుద్ధములుగనున్నప్పుడు జన్మించుట, ఆహారసౌష్ఠవము, శరీరసౌష్ఠవము, యోగ్యములైనవానిని అభ్యాసముగ సేవించుట, మనోదార్ఢ్యము, ప్రకృతిస్వభావము, యౌవనము, వ్యాయామము మొదలగుకర్మలు, సంతోషము ఇవి బలమును వృద్ధిచేయు భావములుగ నుండును. వేడిమి, వాయువు, క్లేదము, స్నేహము, కాలము, ఆహారవిధివిశేషములయొక్క సమ్యగ్యోగము ఇవి ఆహారపరిణామమును కలిగించునవిగ నుండును. ఆహారపరిణామమునుకలిగించు వేడి మొదలగు భావములయొక్క కృత్యములు చెప్పబడుచున్నవి. ఎట్లనగా-ఆహారమును వేడిమి పక్వముచేయును. వాయువు ఆకర్షించును. క్లేదము శైథిల్యమును కలిగించును. స్నేహము మృదుత్వమును కలిగించును. కాలము పాకమునకు పర్యాప్తిని కలిగించును. ఆహారవిధివిశేషములయొక్క సమ్యగ్యోగము పాకమునకు ధాతుసామ్యమును కలిగించును. పరిణామమునొందిన ఆహారముయొక్క అవిరుద్ధములైన గుణములు శరీరసంబంధమైన గుణములయొక్క భావమును పొందును. విరుద్ధములైనగుణములు వానిని నశింపచేయును. విరోధిగుణములచే నశింపచేయబడిన శరీరగుణములు శరీరమునకు చెరుపును కలిగించును.

మూ॥ శరీరధాతవః పునర్ద్వివిధాః సంగ్రహేణ—మలభూతాః, ప్రసాదభూతాశ్చ; తత్ర మలభూతాస్తేయే శరీరస్య బాధకరాః స్యుః; తద్యథా—శరీరచ్ఛిద్రేషూపదేహాః పృథగ్జన్మానో బహిర్ముఖాః పరిపక్వాశ్చ ధాతవః ప్రకుపితాశ్చ వాతపిత్తశ్లేష్మాణో యేచాన్యేఽపి కేచిచ్ఛరీరే తిష్ఠన్తో భావాః శరీరస్యోపఘాతాయోపపద్యన్తే సర్వాంస్తాన్మలే సంప్రచక్ష్మహే, ఇతరాంస్తు ప్రసాదే, గుర్వాదీంశ్చ ద్రవాన్తాన్ గుణభేదేన, రసాదీంశ్చ శుక్రాన్తాన్ ద్రవ్యభేదేన ॥15॥

అ॥ శరీరధాతువులు మలస్వరూపములనియు ప్రసాదస్వరూపములనియు సామాన్యముగ రెండువిధములుగ నుండును. ఏవి శరీరమునకు బాధను కలించునవిగ నుండునో అవి మలము లనబడును. ఏవి అనగా—శరీరరంధ్రములయందుండునట్టియు అనేకవిధములైనట్టియు బయటికివెడలుస్వభావముకలిగినట్టి చీమిడి మొదలగు మలములును, పరిపక్వమునొంది మలరూపమునొందిన ధాతుభాగములును, ప్రకోపించిన వాత

పిత్తశ్లేష్మములును, శరీరమునందుండి శరీరమునకు బాధను కలిగించు ఇట్టి ఇతరములన్నియును మలములుగ నుండును వీనికిభిన్నములైనవి ప్రసాద స్వరూపములుగ నుండును. గురుగుణము ఆదియందుకలిగి ద్రవగుణముఅంతమునందుకల గుణభేదములును, రసముఆదియందుకలిగి శుక్రముఅంతమునందుకల ద్రవ్యభేదములును చెప్పబడినవి.

మూ॥ తేషాం సర్వేషామేవ వాతపిత్తశ్లేష్మాణో దుష్టా దూషయితారో భవన్తి దోషత్వాత్, వాతాదీనాం పునర్ధాత్వన్తరే కాలాన్తరే ప్రదుష్టానాం వివిధాశితపీతీయేఽధ్యాయే విజ్ఞానాన్యుక్తాని, ఏతావత్యేవదుష్టదోషగతిర్యావత్సం స్పర్శనాచ్ఛరీరధాతూనాం; ప్రకృతిభూతానాం ఖలు వాతాదీనాం ఫలమారోగ్యం, తస్మాదేషాం ప్రకృతిభావే ప్రయతితవ్యం బుద్ధిమద్భిః ॥శ్లో॥ సర్వదా సర్వథా సర్వంశరీరం వేద యోభిషక్॥ ఆయుర్వేదం కార్త్స్న్యేన వేద లోకసుఖప్రదమ్ ॥17॥

అ॥ వాతపిత్తశ్లేష్మములు చెడినవైతమయందలి దోషస్వభావమువలన రసము పురీషము మొదలగువాని నన్నిటిని దూషింపచేయును. ఆయా ధాతువులయందును కాలాంతరమునందును వాతపిత్తశ్లేష్మములు ప్రకోపించినప్పుడుకలుగు లక్షణములు వివిధాశితపీతీయాధ్యాయమునందు చెప్పబడినవి. దుష్టమైన దోషములయొక్క గమనము స్పర్శజ్ఞానముకల శరీరధాతువులయందే కలుగును. వాతపిత్తశ్లేష్మములు సమానస్థితియందున్నచో ఆరోగ్యము కలుగును. అందుచేత వాతపిత్తశ్లేష్మములు సమానస్థితియందుండునట్లు ప్రయత్నింపవలయును. ఏవైద్యుడు శరీరమును అన్నివిధముల చేతను సంపూర్ణముగ ఎల్లప్పుడును తెలిసికొనునో అట్టివాడు లోకమునకు సుఖమును కలిగించు ఆయుర్వేదమును పూర్తిగ తెలిసికొనినవాడగును.

మూ॥ తమేవముక్తవన్తం భగవన్తమాత్రేయమగ్నివేశ ఉవాచ—శ్రుతమేతద్యదుక్తం భగవతా శరీరాధికారే వచః, కిం ను ఖలు గర్భస్యాఙ్గం పూర్వమభినిర్వర్తతే కుక్షౌ, కుతోముఖః కథం వా చాన్తర్గతస్తిష్ఠతి, కిమాహారశ్చ వర్తయతి, కథంభూతశ్చ నిష్క్రామన్, కైశ్చాయమాహారోపచారైర్జాతః సద్యో హన్యతే,జాతస్తు కై ర్వ్యాధిరభివర్ధతే, కిం చాస్య దేవాదిప్రకోపనిమిత్తావికారాస్స భవన్తి కిహో స్విన్న, కంచాస్య కాలాకాలమృత్యోర్భావాభావయోర్భగవానధ్యవస్యతి, కంచాస్య పరమాయుః, కాని చాస్య పరమాయుషో నిమిత్తానీతి ॥18॥

అ॥ పైవిధముగ చెప్పిన ఆత్రేయునిగూర్చి అగ్నివేశుడు ఈక్రిందివిధమున అడిగెను. శరీరవిషయమైన మీరు చెప్పినవాక్యముల వింటిని. కుక్షియందు గర్భమునకు ఏఅవయవము తొలుత ఏర్పడును? గర్భము ఏవైపునకుముఖముకలదై ఎట్లు లోపల నుండును? ఎట్టిఆహారముకలదిగనుండి ఎట్టిదై బయలువెడలును? జనించినపిదప ఎట్టి ఆహారోపచారములచే వెంటనే నశించును? జనించినపిదప దేనిచే వ్యాధిలేనిదై వృద్ధి బొందును? దేవతలు మొదలగువారివలనకలుగు వికారములు దీనికి సంభవించునా లేదా? కాలాకాలమృత్యువుయొక్క భావాభావములను మీరు దీనికి ఎట్లునిర్ణయించెదరు? దీనికి పరమాయువెద్ది? దీనియొక్క పరమాయువునకు కారణములెవ్వి? అని యడిగెను.

మూ॥ తమేవముక్తవన్తమగ్నివేశం భగవాన్ పునర్వసురాత్రేయ ఉవాచ—పూర్వముక్తమేతద్గర్భావక్రాన్తౌ యథాఽయమభినిర్వర్తతే కుక్షౌ, యచ్చాస్య యదా సంతిష్ఠతేఽఙ్గజాతం; విప్రతిపత్తివాదాస్త్వత్ర బహువిధాః సూత్రకారిణామృషీణాం సన్తి సర్వేషాం. తానపి నిబోధోచ్యమానాన్—శిరః పూర్వమభినివర్తతే కుక్షావితి కుమారశిరా భరద్వాజః పశ్యతి, సర్వేన్ద్రియాణాం తదధిష్ఠానమితి కృత్వా; హృదయమితి కాఙ్కాయనో బాహ్లీకభిషక్, చేతనాధిష్ఠానత్వాత్; నాభిరితి భద్రకాప్యః ఆహారాగమ ఇతి కృత్వా। పక్వాశయగుదమితి భద్రశౌనకః, మారుతాధిష్ఠానత్వాత్; హస్తపాదమితి బడిశః, తత్కరణత్వాత్పురుషస్య; ఇన్ద్రియాణీతి జనకో వైదేహః, తాన్యస్య బుద్ధ్యధిష్ఠానానీతి కృత్వా; పరోక్షత్వాదచిన్త్యమితి మారీచిః కశ్యపః; సర్వాఙ్గాభినివృత్తిర్యుగపదితి ధన్వన్తరిః, తదుపపన్నం సిద్ధత్వాత్, సర్వాఙ్గానాం తస్య హృదయం మూలమధిష్ఠానంచ, కేషాంచిద్భావానాం, న చ తస్మాత్తత్పూర్వాభినిర్వృత్తిరేషాం, తస్మాద్ధృదయప్రభృతీనాం సర్వాఙ్గానాం తుల్యకాలాభినిర్వృత్తిః; సర్వభావాహ్యన్యోన్యప్రతిబద్ధాః; తస్మాద్యథాభూతం దర్శనం సాధు ॥ ౨౧॥

అ॥ పైవిధముగ అడిగిన అగ్నివేశుని గూర్చి ఆత్రేయుడు ఈక్రిందివిధముగ చెప్పెను. కుక్షియందు గర్భముఏర్పడువిధమును అంగప్రత్యంగములుఎప్పుడుకలుగునది యుగర్భావక్రాంత్యధ్యాయమునందు ఇదివరలో చెప్పబడినది. అంగప్రత్యంగములు ఏర్పడువిషయమై, సూత్రకారులైనఋషీశ్వరులయొక్క అనేకవిధములైన విరుద్ధవాదములుకలవు. వానినన్నిటిని చెప్పెదను వినుము. సమస్తేంద్రియములకును శిరస్సు అధిష్ఠానము నుండును గావున కుక్షియందు గర్భమునకు తొలుత శిరస్సుఏర్పడునని కుమారశిరుడను భరద్వాజుడు చెప్పెను. చేతనాధాతువునకు అధిష్ఠానము గావున తొలుత హృద

యము ఏర్పడునని బాహ్లీకదేశస్థుడగు కాంకాయనుడు చెప్పెను. ఆహారము వచ్చుటకు స్థానము గావున తొలుత నాభి యేర్పడునని భద్రకాప్యుడు చెప్పెను. వాతమునకు స్థానములగుటవలన తొలుత పక్వాశయమును గుదస్థానమును ఏర్పడునని భద్రశౌనకుడు చెప్పెను. పురుషునకు హస్తపాదములు సాధనములుగ నుండును గావున తొలుత హస్తపాదములు ఏర్పడునని బడిశుడు చెప్పెను. బుద్ధికి అధిష్ఠానములు గావున తొలుత ఇంద్రియములు ఏర్పడునని విదేహదేశములకు ప్రభువగు జనకుడు చెప్పెను. పరోక్షముగ నుండును గావున ఊహింప శక్యము కాదని కశ్యపుడగు మారీచి మహర్షి చెప్పెను. సమస్తములైన అంగప్రత్యంగములును ఒకేసారి యేర్పడునని ధన్వంతరి చెప్పెను ఇది సిద్ధమైనదగుటవలన తగియున్నది. సమస్తములైన అంగప్రత్యంగములకును ఓజస్సు మొదలగు కొన్ని భావములకును హృదయము మూలమునగను అధిష్ఠానమునగను నుండును గావున తొలుత అంగప్రత్యంగములు ఏర్పడనేరవు. హృదయము మొదలగు సమస్తావయవములును ఏక కాలమునందే యేర్పడును. శరీరమునందలి సమస్తభావములును ఒకదానితో నింకొకటి సంబంధమును కలిగియుండును. కావున మేము చెప్పినది సమీచీనముగ నుండును.

మూ॥ గర్భస్తు ఖలు మాతుః పృష్ఠాభిముఖ ఊర్ధ్వశిరాః సంకుచ్యాఙ్గాన్యాస్తే జరాయువృతః కుక్షౌ॥ వ్యపగతపిపాసాబుభుక్షస్తు ఖలు గర్భః పరతన్త్రవృత్తిః, మాతరమాశ్రిత్య వర్తయత్యుపస్నేహోపస్వేదాభ్యాం గర్భస్తు సదసద్భూతాఙ్గావయవః, తదనన్తరం హ్యస్య లోమకూపాయనైరుపస్నేహః కశ్చిన్నాభినాడ్యయనైః; నాభ్యాం హ్యస్య నాడీ ప్రసక్తా, నాడ్యాం చాపరా, అపరా చాస్య మాతుః ప్రసక్తా హృదయే. మాతృహృదయం హ్యస్య తామపరామభిసంప్లవతే సిరాభిః స్యన్దమానాభిః. స తస్య రసో బలవర్ణకరః సంపద్యతే, స చ సర్వరసవానాహారః స్త్రియా హ్యాపన్నగర్భాయాస్త్రిధా రసః ప్రతిపద్యతే స్వశరీరపుష్టయే స్తన్యాయ గర్భవృద్ధయే చ, స తేనాహారేణోపస్తబ్ధః పరతన్త్రవృత్తిర్మాతరమాశ్రిత్య వర్తయత్యన్తర్గతః ॥21॥

అ॥ కుక్షియందు గర్భము తల్లియొక్క పృష్ఠమువైపునకు ముఖముకలదిగను ఊర్ధ్వభాగమునకుండు శిరస్సుకలదిగను ముడుచుకొనియున్న అంగములుకలదిగను మావిచే ఆవరింపబడినదిగను ఉండును. గర్భము దప్పికయు ఆకలియు లేనిదై పరతంత్రవృత్తికలదై యుండును. వ్యక్తావ్యక్తములైన అంగప్రత్యంగములుగల గర్భము తల్లివలన కలుగు ఉపస్నేహ ఉపస్వేదములవలన పోషింపబడును. అంగప్రత్యంగములు వ్యక్తములైనపిదప ఈగర్భమునకు ఉపస్నేహము రోమకూపమార్గములనుండి కొంతయు నాభియందలి నాడీమార్గముల నుండి కొంతయు సంక్రమించును. గర్భముయొక్క నాభియందు

నాడి కూర్పబడి యుండును. ఆనాడియందు మావి కూర్పబడియుండును. ఆమావి తల్లియొక్క హృదయముతో సంబంధమును కలిగియుండును. ఆహృదయము రసావహనాడులను ప్రవహించుచున్న నాడులద్వారా మావితో సంబంధమును కలిగించును. అట్లు ప్రవహించురసము గర్భమునకు సమస్తవిధములైన బలమును వర్ణమును కలిగించును. గర్భమును పొందియున్న స్త్రీయొక్క సమస్త రసములతోకూడిన ఆహారసంబంధమైన రసము మూడువిధములుగ నుపయోగించును. ఎట్లనగా—తల్లియొక్క శరీరపోషణకొరకును స్తన్యముకొరకును గర్భముయొక్క వృద్ధికొరకును ఉపయోగించును. లోనున్న గర్భము అట్టి ఆహారముచే పోషింపబడుచు పరతంత్రవృత్తి కలదై తల్లిని ఆశ్రయించియుండును.

మూ॥ స చోపస్థితకాలే జన్మని ప్రసూతిమారుతయోగాత్పరివృత్యాఽవాక్శిరా నిష్క్రామత్యపత్యపథేన; ఏషా ప్రకృతిః, వికృతిః పునరతోఽన్యథా; పరం త్వతః స్వతన్త్రవృత్తిర్భవతి॥ తస్యాహారోపచారౌ జాతిసూత్రీయోపదిష్టావవికారకరౌ చాభివృద్ధికరౌ భవతః। తాభ్యామేవ చ సేవితాభ్యాం విషమాభ్యాం జాతః సద్యోహన్యతే తరురివాచిరవ్యపరోపితో వాతాతపాభ్యామప్రతిష్ఠితమూలః॥ ఆప్తోపదేశాదద్భుతరూపదర్శనాత్సముత్థానలిఙ్గచికిత్సితవిశేషాచ్చాదోషప్రకోపానురూపా దేవాదిప్రకోపనిమిత్తా వికారాః సముపలభ్యన్తే ॥24॥

అ॥ ఆగర్భము ప్రసవకాలముసమీపించినప్పుడు ప్రసవకాలమునకగు వాతముయొక్క సంబంధమువలన త్రిప్పబడి క్రిందిదైపునకుండుశిరస్సు కలదై అపత్యమార్గముద్వారా బయలువెడలును. ఇట్లు బయలువెడలుట ప్రకృతిగ నుండును. దీనికిభిన్నముగ జరుగుట వికృతిగ నుండును. గర్భము బయలు వెడలినపిమ్మట స్వతంత్రవృత్తికలదిగ నుండును. జాతిసూత్రీయాధ్యాయమునందు చెప్పబడబోవు ఆహారములును ఉపచారములును గర్భమునకు వికారములను కలిగించనవిగను అభివృద్ధినికలిగించునవిగను నుండును. అచిరకాలమునందేపాతిపెట్టబడినట్టియు వ్యాపించని వేళ్ళుకలిగినట్టియు వృక్షము గాలిచేతను ఎండచేతను నశించువిధమున, విషమముగనుపయోగింపబడిన అట్టిఆహారముల చేతను ఉపచారములచేతను శిశువు వెంటనే నశించును. దోషప్రకోపమునకు సంబంధము లేనట్టియు దేవతలు మొదలగువారియొక్క ప్రకోపమువలనజనించునట్టి వ్యాధులు కలవని, ఆప్తోపదేశమువలనను అద్భుతమైనరూపములుకనబడుటవలనను కారణములును లక్షణములును చికిత్సలును ప్రత్యేకించియుండుటవలనను నిర్ధారణయగుచున్నది.

మూ॥ కాలాకాలమృత్యోస్తు ఖలు భావాభావయోరిదమధ్యవసితం నః—యః కశ్చిన్మ్రియతే స కాల ఏవ మ్రియతే, న హి కాలచ్ఛిద్రమస్తీత్యేకే; తచ్చాసమ్యక్, న హ్యచ్ఛిద్రతా సచ్ఛిద్రతా వా కాలస్యోపపద్యతే, కాలస్వలక్షణస్వభావాత్; తథాఽఽహురపరే—

యో యదా మ్రియతే న తస్య నియతో మృత్యుకాలః; స సర్వ భూతానాం సత్యః, సమక్రియత్వాదితి, ఏతదపి చాన్యథాఽర్థగ్రహ ణం. న హి కశ్చిన్న మ్రియత ఇతి సమక్రియః, కాలః పునరాయుషః ప్రమాణమధికృత్యోచ్యతే, యస్య చేష్టం యో యదా మ్రియతే తస్య స నియతో మృత్యుకాల ఇతి, తస్య సర్వేభావా యథాస్వం నియతకాలా భవిష్యన్తి, తచ్చ నోపపద్యతే, ప్రత్యక్షం హ్యకాలా హారవచనకర్మణాం ఫలమనిష్టం, విపర్యయే చేష్టం; ప్రత్యక్షతశ్చోప లభ్యతే ఖలు కాలాకాలయుక్తిస్తాసు తాస్వవస్థాసు తం తమర్థమభి సమీక్ష్య; తద్యథా—కాలోఽయమస్య తు వ్యాధేరాహారస్యౌష ధస్య ప్రతికర్మణో విసర్గస్య చాకాల ఇతి, లోకేఽప్యేతద్భవతి కాలే దేవో వర్షత్యకాలే దేవో వర్షతి, కాలే శీతమకాలే శీతం, కాలే తపత్యకాలే తపతి, కాలే పుష్పఫలమకాలే చ పుష్పఫలమితి; తస్మాదు భయమస్తి కాలే మృత్యురకాలే చ, నైకాన్తికం, యది హ్యకాలే మృత్యుర్న స్యాన్నియతకాలప్రమాణమాయుః సర్వం స్యాత్, ఏవం గతే హితాహితజ్ఞానమకారణం స్యాత్ప్రత్యక్షానుమానోపదేశాశ్చా ప్రమాణాని స్యుర్యే ప్రమాణభూతాః సర్వతన్త్రేషు, యైరాయుష్యా ణ్యనాయుష్యాణి చోపలభ్యన్తే, వాగ్వస్తుమాత్రమేతద్వాదమృష యో మన్యన్తే యదుచ్యతే—నాకాలమృత్యురస్తీతి ॥ 5॥

అ॥ కాలాకాలమృత్యుసంబంధమగు భావాభావములనుగూర్చి మా అభిప్రాయ మును చెప్పుచున్నాము. "ఎవడు మరణించునో వాడు ప్రకాలమునందే మరణించును. కాలమునకు ఛిద్రముండదు" అని కొందరు చెప్పెదరు. అట్లుచెప్పుట సరికాదు. కాల మునకు ఛిద్రములేకుండుటగాని ఛిద్రముండుటగాని కాలలక్షణస్వభావమునుబట్టి కలుగనేరదు. "ఎవడు ఏకాలమునందు మరణించునో వానికి అది నియతమైనమృత్యు కాలముగ నుండును. కాలము సమస్తభూతములయందును సమక్రియలు కలదగుటవలన సత్యమైనదిగ నుండును" అని కొందరు చెప్పెదరు. ఇట్లుచెప్పుటకూడ సరిగలేదు. ప్రతిజీవియు మరణించు విషయమై కాలము సమక్రియలుకలదిగనుండును. ఆయుఃప్ర మాణమునననుసరించి కాలము చెప్పబడును. "ఎవడు ఏకాలమునందు చనిపోవునో వానికి అది నియతమైన మృత్యుకాలముగనుండు"నని ఎవడు చెప్పునో వానిఅభిప్రా యమునందు ఆహారాదిసమస్తభావములుకూడ నియతమైనకాలము కలవిగనుండును. కావున అట్లుచెప్పుట సరియైనదికాదు. అకాలమునందుచేయబడిన ఆహారము సంభా షణము కృత్యము వీనియొక్క ఫలము అనిష్టముగ నుండుటయు సకాలమునందు చేయబడిన వీనియొక్క ఫలము హితకరముగనుండుటయు ప్రత్యక్షముగ చూచు చున్నాము. ఆయా అవస్థలయందు ఆయాప్రయోజనములనుబట్టి కాలాకాలసంబంధ

మగుటయుక్తి ప్రత్యక్షముగ కనబడుచున్నది. ఎటులననగా— వ్యాధి ఆహారము ఔషధము చికిత్స వ్యాధియొక్క మోక్షము వీనికి కాలాకాలములు కనబడుచున్నవి. లోకమునందుకూడ ఈవిషయము సంభవించుచున్నది. ఎటులననగా— మేఘము కాలమునందును అకాలమునందునుకూడ వర్షించుచున్నది. కాలమునందును అకాలమునందునుకూడ శీతము కలుగుచున్నది. కాలమునందును అకాలమునందునుకూడ ఎండవలన తాపము కలుగుచున్నది. కాలమునందును అకాలమునందునుకూడ పుష్పములును ఫలములును కలుగుచున్నవి. అందువలన కాలమునందును అకాలమునందునుకూడ మృత్యువు కలుగును. కావున కాలమృత్యువే కలుగునని కాని అకాలమృత్యువే కలుగునని కాని చెప్పుటకు వీలులేదు. అకాలమృత్యువు లేనిచో ఆయువు నియత కాలపరిమాణము కలదిగ నుండవలసియుండును. ఇట్లున్నచో హితాహితములనుగూర్చి తెలిసికొనుట అనవసరమే యగును. మరియు సర్వతంత్రములయందును ప్రమాణములుగ చెప్పబడినట్టియు ఆయుష్యమును అనాయుష్యమును అంగీకరించునట్టియు ప్రత్యక్షము అనుమానము ఉపదేశము అను ప్రమాణములు అప్రమాణములుగ కావలసియుండును. అకాలమృత్యువులేదని చెప్పువాదము పైకారణములవలన అర్థములేనిదిగ నుండునని ఋషులు తలంచుచున్నారు.

మూ॥ వర్షశతం ఖల్వాయుషః ప్రమాణమస్మిన్ కాలే। తస్య నిమిత్తం ప్రకృతిగుణాత్మసంపత్సాత్మ్యోపసేవనం చేతి ॥37॥

ఆ॥ ఆయువుయొక్క పరిమాణము ఈకలికాలమునందు నూరుసంవత్సరములుగ నుండును. ప్రకృతి గుణములు ఆత్మ వీనియొక్క సంపత్తువలనను సాత్మ్యములను సేవించుటవలనను ఆయువు పరిపూర్ణముగ నుండగలదు.

అధ్యాయసంగ్రహము.

మూ॥ శరీరం యద్యథా తచ్చ వర్తతే క్లిష్టమామయైః। యథా క్లేశం వినాశం చ యాతి యే చాస్య ధాతవః॥ వృద్ధిహ్రాసౌ యథా తేషాం క్షీణానామౌషధం చ యత్। దేహవృద్ధికరా భావా బలవృద్ధికరాశ్చ యే॥ పరిణామకరా భావా యా చ తేషాం పృథక్క్రియా। మలాఖ్యాః సంప్రసాదాఖ్యా ధాతవః ప్రశ్న ఏవ చ॥ నవకో నిర్ణయశ్చాస్య విధివత్సంప్రకాశితః। తస్యాః శరీరవిచయే శారీరే పరమర్షిణా ॥31॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే శారీరస్థానే శరీరవిచయశారీరం నామ షష్ఠోఽధ్యాయః॥

ఆ॥ ఈశరీరవిచయాధ్యాయమునందు శరీరముయొక్కస్వరూపము, వ్యాధులచే బాధనొంది క్లేశమును గాని వినాశమును గాని పొందువిధము, శరీరమునందలిధాతువులు

వీనియొక్క వృద్ధిక్షయములు, ఇవి క్షీణించినప్పుడు చేయవలసినవిధానము, శరీరమును వృద్ధిపొందించు భావములు, బలమునువృద్ధిపొందించు భావములు, ఆహారమునుపరిణామము నొందించుభావములు, వీనియొక్క కృత్యములు, మలస్వరూపములు, ప్రసాదస్వరూపములు, తొమ్మిదివిధములగుప్రశ్నలు, వీనికిసమాధానములు ఇవి చెప్పబడినవి.

ఇవ్విధంబున, శ్రీపాద్ఘోపనామక కృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపికయనెడి చరకసంహితావ్యాఖ్యానమునందు శరీరవిచయశారీరమనెడు షష్ఠాధ్యాయము సమాప్తము.

## సప్తమాధ్యాయము.

మూ॥ అథాతః శరీరసంఖ్యా శారీరం వ్యాఖ్యాస్యామః॥1॥

అ॥ పిమ్మట శరీరసంఖ్యాశారీరమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ శరీరసంఖ్యామవయవశః శరీరం ప్రవిభజ్య సర్వశరీరసంఖ్యాప్రమాణజ్ఞానహేతోర్భగవన్తమాత్రేయమగ్నివేశః పప్రచ్ఛ॥ తమువాచ భగవానాత్రేయః—శృణు మత్తోఽగ్నివేశ! సర్వశరీరమభిచక్షాణాద్యథాప్రశ్నమేకమనా యథావత్ ॥4॥

అ॥ సర్వశరీరముయొక్క సంఖ్యాప్రమాణమును తెలిసికొనునిమిత్తము శరీరమును అవయవరూపముగ విభజించి శరీరసంఖ్యను చెప్పవలయునని అగ్నివేశుడు ఆత్రేయుని అడుగగా ఆత్రేయుడు ఇట్లు చెప్పెను. సర్వశరీరమునుగూర్చి ప్రశ్నకనుకూలముగ తగురీతిని చెప్పుచున్నాను. ఏకాగ్రధ్యానముకలవాడవై సరిగవినుము

### త్వగ్వివరణము.

మూ॥ శరీరే షట్ త్వచః; తద్యథా—ఉదకధరా త్వగ్బాహ్యా, ద్వితీయా త్వసృగ్ధరా, తృతీయాసిధ్మకిలాససంభవాధిష్ఠానా, చతుర్థీ దద్రుకుష్ఠసంభవాధిష్ఠానా, పఞ్చమ్యలజీవిద్రధీసంభవాధిష్ఠానా, షష్ఠీ తు యస్యాం ఛిన్నాయాం తామ్యత్యన్ధ ఇవ చ తమః ప్రవిశతి యాం చాప్యధిష్ఠాయారూంషి జాయన్తేపర్వసు కృష్ణరక్తాని స్థూలమూలాని

దుశ్చికిత్స్యతమాని చేతి షట్ త్వచః; ఏతాః షడఙ్గం శరీర మవతత్య తిష్ఠన్తి ॥5॥

అ॥ శరీరమునందు ఆరుత్వక్కులు ఉండును. ఎట్లనగా — వెలుపలనుండు త్వక్కు ఉదకధరగ నుండును. రెండవత్వక్కు అసృగ్ధరగ నుండును. మూడవది సిధ్మకుష్ఠమును శ్విత్రమును సంభవించుటకు అధిష్ఠానముగ నుండును. నాల్గవది దద్రుకుష్ఠముసంభవించుటకు అధిష్ఠానముగ నుండును. అయిదవది అలజియు విద్రధియు సంభవించుటకు అధిష్ఠానముగ నుండును. ఆరవదియగుత్వక్కు నరకబడినచో మనుజుడు గ్రుడ్డివానివలెనై చీకటియందుప్రవేశించినవానివలె మోహము నొందును. ఈత్వక్కునుఆధారముగ చేసికొని, నలుపును ఎరుపునుకలిగినట్టియు స్థూలములైనమూలములుకలిగినట్టియు చికిత్సింపశక్యముకానట్టియు వ్రణములు అవయవసంధులయందు జనించును. ఈవిధముగ ఆరుత్వక్కులు చెప్పబడినవి. ఇవి షడంగములతోకూడినశరీరమును ఆవరించియుండును.

## అంగవిభాగము.

మూ॥ తత్రాయం శరీరస్యాఙ్గవిభాగః । తద్యథా — ద్వౌ బాహూ, ద్వే సక్థినీ, శిరోగ్రీవం, అన్తరాధిరితి షడఙ్గమఙ్గమ్ ॥6॥

అ॥ రెండుచేతులు, రెండుకాళ్లు, కంఠముతోకూడినశిరస్సు, అంతరాధి (శరీరముయొక్క మధ్యభాగము) ఈఆరును శరీరముయొక్క అంగములుగ నుండును. ఇట్లు శరీరముయొక్క అంగవిభాగము చెప్పబడినది.

## అస్థివివరణము.

మూ॥ త్రీణి షష్ట్యధికాని శతాన్యస్థ్నాం సహ దన్తోలూఖలనఖైః; తద్యథా — ద్వాత్రింశద్దన్తాః, ద్వాత్రింశద్దన్తోలూఖలాని, వింశతిర్నఖాః, వింశతిః పాణిపాదశలాకాః, చత్వార్యధిష్ఠానాన్యాసాం, చత్వారి పాణిపాదపృష్ఠాని, షష్టిరఙ్గుల్యస్థీని, ద్వే పార్ష్ణ్యోః, ద్వే కూర్చాధః, చత్వారః పాణ్యోర్మణికాః, చత్వారః పాదయోర్గుల్ఫాః, చత్వార్యరత్న్యోరస్థీని, చత్వారి జఙ్ఘయోః, ద్వే జానునోః, ద్వే కూర్పరయోః, ద్వే ఊర్వోః, బాహ్వోః సాంసయోర్ద్వే, ద్వావక్షకౌ, ద్వే తాలునీ, ద్వే శ్రోణిఫలకే, ఏకం భగాస్థి, పుంసాం మేఢ్రాస్థి ఏకం, త్రికసంశ్రిత మేకం గుదాస్థి, పృష్ఠగతాని పఞ్చత్రింశత్, పఞ్చదశాస్థీని గ్రీవాయాం, ద్వే జత్రుణి, ఏకం హన్వస్థి, ద్వే హనుమూలబన్ధనే, ద్వే లలాటే, ద్వే అక్ష్ణోః, గణ్డయోర్ద్వే, నాసికాయాం త్రీణి

ఘ్రాణాఖ్యాని, ద్వయోః పార్శ్వయోశ్చతుర్వింశతిశ్చతుర్వింశతిః పఞ్జరాస్థీని చ పార్శ్వకాని, తావన్తి చైషాం స్థాలికాన్యర్బుదాకారాణి తాని ద్విసప్తతిః, ద్వౌ శఙ్ఖకౌ, చత్వారి శిరఃకపాలాని, వక్షసి సప్తదశ, ఇతి త్రీణి షష్ట్యధికాని శతాన్యస్థ్నామితి ॥7॥

ఆ॥ ఎముకలు — దంతమూలములు గోళ్ళు వీనితోకూడ మూడువందలఅరువదిగ నుండును. ఎట్లనగా — దంతములు 32, దంతమూలములు 32, గోళ్ళు 20, అరచేతులు అరకాళ్ళు వీనియందలి శలాకాస్థులు 20, అంసఫలకములకు అధిష్ఠానములు 4, హస్తపాదములయొక్క పృష్ఠములయందు 4, వేళ్ళయందు 60, మడమలయందు 2, మణికట్లయందు 2, హస్తములయందు మణికాస్థులు, 4, పాదములయందు గుల్ఫాస్థులు 4, ముంజేతులయందు 4, పిక్కలయందు 4, మోకాళ్ళయందు 2, మోచేతులయందు 2, తొడలయందు 2, బాహువులయందు 2, అక్షఫలకములు 2, తాలుప్రదేశములయందు 2, శ్రోణిఫలకములు 2, భగాస్థి 1, పురుషులకు మేఢ్రాస్థి 1, త్రికప్రదేశమునందలిగుదాస్థి 1, వెన్నెముకయందు 35, మెడయందు 15, జత్రుప్రదేశములయందు 2, హన్వస్థి 1, హనుమూలములయందు 2, లలాటమునందు 2, నేత్రములయందు 2, గండప్రదేశములయందు 2, నాసికయందు ఘ్రాణములనుపేరు కలవి 3. రెండుపార్శ్వములయందును 24 వీనియందు పంజరాస్థులు 24 మరియు అర్బుదాకారముగనుండుస్థాలికాస్థులు 24. కణతలయందు 2, శిరస్సునందుండుకపాలాస్థులు 4, వక్షఃస్థలమునందు 17, ఇట్లు అస్థులు మూడువందలఅరువదిగ నుండును. (ఈఅస్థిసంఖ్యయందు, లలాటము నేత్రములు గండప్రదేశములు నాసిక వీనియందుండుతొమ్మిది అస్థులును ఒకేప్రదేశమునందు కలిసియుండుటచే ఒకేఅస్థిగనే పరిగణింపబడును)

## ఇంద్రియాధిష్ఠానాదివివరణము.

మూ॥ పఞ్చేన్ద్రియాధిష్ఠానాని; తద్యథా — త్వగ్, జిహ్వా, నాసికా, అక్షిణీ, కర్ణౌ చ ॥ పఞ్చ బుద్ధీన్ద్రియాణి; తద్యథా — స్పర్శనం, రసనం, ఘ్రాణం, దర్శనం, శ్రోత్రమితి ॥ పఞ్చ కర్మేన్ద్రియాణి; తద్యథా — హస్తౌ, పాదౌ, పాయుః, ఉపస్థో, జిహ్వా చేతి॥ హృదయం చేతనాధిష్ఠానమేకమ్ ॥ 1॥

ఆ॥ చర్మము, నాలుక, ముక్కు, నేత్రములు, చెవులు ఈఅయిదును ఇంద్రియాధిష్ఠానములుగ నుండును. స్పర్శనము, రసనము, ఘ్రాణము, దర్శనము, శ్రోత్రము ఈఅయిదును బుద్ధీంద్రియములుగ నుండును. హస్తములు, పాదములు, గుదస్థానము, గుహ్యస్థానము, వాక్కు ఈఅయిదును కర్మేంద్రియములుగ నుండును. హృదయమొక్కటియు చేతనాధాతువునకు అధిష్ఠానముగ నుండును.

## ప్రాణాయతనవివరణము.

మూ॥ దశ ప్రాణాయతనాని; తద్యథా—మూర్ధా, కణ్ఠో, హృదయం, నాభిః, గుదం, వస్తిః, ఓజః, శుక్రం, శోణితం, మాంసమితి। తేషు షట్ పూర్వాణి మర్మసంఖ్యాతాని ॥12॥

అ॥ శిరస్సు, కంఠము, హృదయము, నాభి, గుదప్రదేశము, వస్తి, ఓజస్సు, శుక్రము, రక్తము, మాంసము ఈపదియు ప్రాణాయతనములుగ నుండును. వీనిలో మొదటిఆరును మర్మములుగకూడ నుండును.

## కోష్ఠాంగవివరణము.

మూ॥ పఞ్చదశ కోష్ఠాఙ్గాని, తద్యథా—నాభిశ్చ, హృదయం చ, క్లోమ చ, యకృచ్చ, ప్లీహా చ, వృక్కౌ చ, వస్తిశ్చ, పురీషాధారశ్చ, ఆమాశయశ్చ, పక్వాశయశ్చ, ఉత్తరగుదం చ, అధరగుదం చ, క్షుద్రాన్త్రం చ, స్థూలాన్త్రం చ, వపావహనం చేతి॥13॥

అ॥ నాభి, హృదయము, క్లోమ, యకృత్తు, ప్లీహ, వృక్కలు, వస్తి, మలాశయము, ఆమాశయము, పక్వాశయము, ఉత్తరగుదము, అధరగుదము, క్షుద్రాంత్రము స్థూలాంత్రము, వపావహనము ఈపదునైదును కోష్ఠాంగములుగ నుండును.

## ప్రత్యంగాదివివరణము.

మూ॥ షట్పఞ్చాశత్ప్రత్యఙ్గాని షట్స్వఙ్గేషూపనిబద్ధాని యాని యాన్యపరిసంఖ్యాతాని పూర్వమఙ్గేషు పరిసంఖ్యాయమానేషు తాని తాన్యన్యైః పర్యాయైరిహ ప్రకాశ్య వ్యాఖ్యాతాని భవన్తి; తద్యథా—ద్వే జఙ్ఘాపిణ్డికే, ద్వే ఊరుపిణ్డికే, ద్వౌ స్ఫిచౌ, ద్వౌ వృషణౌ, ఏకం శేఫః, ద్వే ఉఖే, ద్వౌ వఙ్క్షణౌ, ద్వౌ కుకున్దరౌ, ఏకం వస్తిశీర్షం, ఏకముదరం, ద్వౌ స్తనౌ, ద్వౌ భుజౌ, ద్వే బాహుపిణ్డికే, చిబుకమేకం, ద్వావోష్ఠౌ, ద్వే సృక్కణ్యౌ, ద్వౌ దన్తవేష్టకౌ, ఏకం తాలు, ఏకా గలశుణ్డికా, ద్వే ఉపజిహ్వికే, ఏకా గోజిహ్వికా, ద్వౌ గణ్డౌ, ద్వే కర్ణశష్కులికే, ద్వౌ కర్ణపుత్రకౌ, ద్వే అక్షికూటే, చత్వారి అక్షివర్త్మాని, ద్వే అక్షికనీనికే, ద్వే భ్రువౌ, ఏకోఽవటుః, చత్వారి పాణిపాదహృదయాని॥ నవ మహాన్తి ఛిద్రాణి—సప్త శిరసి, ద్వే చాధః॥ ఏతావద్దృశ్యం శక్య మభినిర్దేష్టుమ్॥

అ॥ ప్రత్యంగములు ఏబదిఆరుగ నుండును. ఇవి హస్తములు మొదలగు ఆరు అంగములందుండును కూర్పబడియుండును. పూర్వమునందు అంగములు చెప్పబడి నప్పుడు చెప్పబడని ఈప్రత్యంగములు ఆయాపర్యాయపదములచే చెప్పబడుచున్నవి. ఎటులనగా — జంఘాపిండికలు 2, ఊరువులయందలి పిండికలు 2, పిరుదులయందలి ఉన్నతమైన ప్రదేశమునందు 2, వృషణములు 2, మేఢ్రము 1, చంకయందలిపల్లపు ప్రదేశములు 2, గజ్జలు 2, స్ఫిచములపైనయుండు ఉన్నతప్రదేశములు 2, వస్తి యొక్క పైభాగము 1, ఉదరము 1, స్తనములు 2, భుజములు 2. బాహువులందలి పిండికలు 2. గడ్డము 1, పెదవులు 2, నోటియొక్క సెలవులు 2, దంతవేష్టములు 2, తాలుప్రదేశము 1, గళనాళిక 1, ఉపజిహ్వికలు 2, నాలుక 1, గండప్రదేశములు 2, కర్ణశష్కులులు 2, చెవులు 2, అక్షికూటములు 2, కనురెప్పలు 4, కంటి కొలిమెలు 2, కనుబొమ్మలు 2, పెడతల 1, అరచేతులును అరకాళ్ళును 4, ఇట్లు ప్రత్యంగములు ఏబదిఆరుగ నుండును. శిరస్సునందు ఏడును, అధఃప్రదేశమునందు రెండును ఇట్లు తొమ్మిదిమహాఛిద్రము లుండును. ప్రత్యక్షముగ చూడదగిన విషయములు చెప్పబడినవి.

మూ॥ అనిర్దేశ్యమతః పరం తర్క్యమేవ। తద్యథా — నవ స్నాయుశతాని, సప్త సిరాశతాని, ద్వే ధమనీశతే, చత్వారి పేశీశతాని, సప్తోత్తరం మర్మశతం, ద్వే పునః సంధిశతే, త్రింశత్సహస్రాణి నవ చ శతాని షట్పఞ్చాశత్సాని సిరాధమనీనామణుశః ప్రవిభజ్యమానానాం ముఖాగ్రపరిమాణం, తావన్తి చైవ కేశశ్మశ్రులోమానీత్యేతద్యథావద్యత్సంఖ్యాతం, త్వక్ప్రభృతి దృశ్యాం అతః పరం తర్క్యమ్, ఏతదుభయమపి న వికల్ప్యతే ప్రకృతిభావాచ్ఛరీరస్య ॥16॥

అ॥ చెప్పబడని విషయములను ఊహించుకొనవలయును. ఎటులనగా — స్నాయువులు 900, సిరలు 700, ధమనులు 200, పేశులు 400, మర్మలు 107, సంధులు 200, అని తెలిసికొనవలయును. సిరాధమనులయొక్క సూక్ష్మముగ నుండు అగ్రభాగములను విభజించి లెక్కించినచో ముప్పదివేల తొమ్మిదివందల ఏబదియారుగ నుండును. కేశములు శ్మశ్రువులు (గడ్డము మీసము వీనియందలి వెంట్రుకలు) రోమములు ఇవికూడ లెక్కించినచో అన్నియే యుండును. త్వక్కులు మొదలగునవి దృశ్యములుగ నుండును. మిగిలినవి ఊహింపతగినవిగ నుండును. శరీరము ప్రకృతిగనున్నచో ఇవన్నియు వికల్పమును జెందక సరిగనుండును.

శరీరమునందలి ఉదకాదులయొక్క పరిమాణము.

మూ॥ యత్త్వఞ్జలిసంఖ్యేయం తదుపదేక్ష్యామః, తత్పరం ప్రమాణమభిజ్ఞేయం, తచ్చ వృద్ధిహ్రాసయోగి తర్క్యమేవ, తద్య

థా—దశోదకస్యాఞ్జలయః శరీరే స్వేనాఞ్జలిప్రమాణేన యత్తత్ ప్రచ్యవమానం పురీషమనుబధ్నాత్యతియోగేన తథా మూత్రం రుధిరమన్యాంశ్చ శరీరధాతూన్, యత్తత్ సర్వశరీరచరం బాహ్యా త్వగ్బిభర్తి, యత్తు త్వగన్తరే వ్రణగతం లసీకాశబ్దం లభతే, యచ్చోష్మణాఽనుబద్ధం లోమకూపేభ్యోనిష్పతత్స్వేదశబ్దమవాప్నోతి, తదుదకం దశాఞ్జలిప్రమాణం; నవాఞ్జలయః పూర్వస్యాహారపరిణామధాతోర్యం తం రస ఇత్యాచక్షతే, అష్టౌశోణితస్య, సప్త పురీషస్య, షట్ శ్లేష్మణః, పఞ్చ పిత్తస్య, చత్వారో మూత్రస్య, త్రయోవసాయాః, ద్వౌమేదసః, ఏకో మజ్జ్ఞః, మస్తిష్కస్యార్ధాఞ్జలిః, శుక్రస్య తావదేవ ప్రమాణం; తావదేవ శ్లైష్మికస్యౌజస ఇత్యేతచ్ఛరీరతత్త్వముక్తమ్ ॥17॥

అ॥ అంటలిచే కొలువతగినవానిని చెప్పుచున్నాము. ఈపరిమాణము శ్రేష్ఠమైన సహజపరిమాణముగ నుండును. ఈపరిమాణమునకు వృద్ధిగాని క్షయముగాని యున్నచో ఊహించి తెలిసికొనవలయును. తనశరీరమునందలి ఉదకము తనయొక్క దోసిలితో పది దోసిలులపరిమాణముగ నుండును. ఏది అతియోగముగ స్రవించు పురీషమును, మూత్రమును, రక్తమును, ఇట్టి ఇతరధాతువులను ఆశ్రయించియుండునో, ఏది సర్వశరీరమునందును వ్యాపించుచున్నదై బాహ్యత్వక్కును పోషించుచుండునో, ఏది త్వక్కులయొక్క మధ్యయందుండి వ్రణమును పొంది లసీకయని చెప్పబడునో ఏది ఊష్మతో కూడుకొని రోమకూపములనుండి బయలువెడలి స్వేదమని చెప్పబడునో అట్టి ఉదకము పదిదోసిళులపరిమాణముగ ఉండును. ఆహారముయొక్క మొదటిపరిమాణామ ధాతువు రసమని చెప్పబడును. ఇది తొమ్మిదిదోసిలుల పరిమాణముగ నుండును. రక్తము ఎనిమిదిదోసిలులపరిమాణముగను, పురీషము ఏడుదోసిలులపరిమాణముగను. శ్లేష్మముఆరు దోసిలులపరిమాణముగను, పిత్తము అయిదుదోసిలులపరిమాణముగను. మూత్రము నాలుగుదోసిలులపరిమాణముగను, వస మూడుదోసిలులపరిమాణముగను, మేదస్సు రెండుదోసిలులపరిమాణముగను, మజ్జ ఒకదోసిలిపరిమాణముగను, మెదడు అరదోసిలిపరిమాణముగను నుండును. శుక్రమును ఓజస్సును ప్రత్యేకముగ అరదోసిలిపరిమాణముగ నుండును. ఇట్లు శరీరతత్త్వము చెప్పబడినది.

## పార్థివాదివివరణము.

మూ॥ తత్ర యద్విశేషతః స్థూలం స్థిరం మూర్తిమద్గురుఖరకఠినమఙ్గం నఖాస్థిదన్తమాంసచర్మవర్చః కేశశ్మశ్రునఖలోమకణ్డరాల తత్పార్థివం గన్ధో ఘ్రాణం చ, యద్ద్రవసరమన్దస్నిగ్ధమృదుపిచ్ఛింది

రసరుధిగవసాకఫపిత్తమూత్రస్వేదాది తదాప్యం రసో రసనం చ, యత్పిత్తమూష్మా యా చ భాః శరీరే తత్సర్వమాగ్నేయం రూపం దర్శనం చ, యదుచ్ఛ్వాసప్రశ్వాసోన్మేషనిమేషాకుఞ్చనప్రసారణగమనప్రేరణధారణాది తద్వాయవీయం స్పర్శః స్పర్శనం చ, యద్వివిక్తముచ్యతే మహాన్తి చాణూని స్రోతాంసి తదాన్తరిక్షం శబ్దః శ్రోత్రం చ; యత్ప్రయోక్తృ తత్ప్రధానం, బుద్ధిర్మనశ్చేతి శరీరావయవసంఖ్యా యథాస్థూలభేదేనావయవానాం నిర్దిష్టా ॥18॥

అ॥ ఏవి విశేషించి స్థూలముగను స్థిరముగను మూర్తిమంతముగను గురుత్వము ఖరత్వము కాఠిన్యము ఇవి కలవిగను నుండునో అట్టిగోళ్ళు ఎముకలు దంతములు మాంసము చర్మము మలము కేశములు శ్మశ్రువులు రోమములు కండరములు మొదలగునవి పార్థివములుగ నుండును. మరియు గంధమును ఘ్రాణేంద్రియమునుకూడ పార్థివములుగ నుండును. ద్రవముగను ప్రసరించునదిగను మందముగను స్నిగ్ధముగను మృదువుగను పిచ్ఛిలముగను నుండు రసము రక్తము వస కఫము పిత్తము మూత్రము చెమట మొదలగునవి ఆప్యములుగ నుండును. మరియు రసమును రసనేంద్రియమును కూడ ఆప్యములుగ నుండును. పిత్తము ఊష్మ శరీరకాంతి ఇవన్నియు ఆగ్నేయములుగ నుండును. మరియు రూపమును దర్శనేంద్రియమునుకూడ ఆగ్నేయములుగ నుండును. ఉచ్ఛ్వాసము నిశ్వాసము ఉన్మేషము నిమేషము ముడుచుట చాచుట గమనము ప్రేరణము ధారణము మొదలగునవి వాయవ్యములుగ నుండును. మరియు స్పర్శమును స్పర్శనేంద్రియమునుకూడ వాయవ్యములుగ నుండును. శరీరమునందలి రంధ్రములును గొప్పవైనట్టియు స్రోతస్సులును అంతరిక్షములుగ నుండుచు. మరియు శబ్దమును శ్రోత్రేంద్రియమునుకూడ అంతరిక్షములుగ నుండును. ఏది నియమించునో అది ప్రధానముగ నుండును. అట్టి ఆత్మయు బుద్ధియు మనస్సును కలవు. ఇట్లు శరీరావయవములయొక్క సంఖ్యయు స్థూలభేదముచే అవయవములును చెప్పబడినవి.

మూ॥ శరీరావయవాస్తు పరమాణుభేదేనాపరిసంఖ్యేయా భవన్త్యతిబహుత్వాదతిసౌక్ష్మ్యాదతీన్ద్రియత్వాచ్చ, తేషాం సంయోగవిభాగే పరమాణూనాం కారణం వాయుః కర్మ స్వభావశ్చ ॥19॥

అ॥ శరీరావయవములు పరమాణుభేదమునను సరించి మిక్కిలి అధికముగ నుండుట వలనను మిక్కిలి సూక్ష్మములుగ నుండుటవలనను ఇంద్రియగోచరములుకానివగుట వలనను అపరిసంఖ్యేయములుగ నుండును. అట్టిపరమాణువులు కలియుటకు గాని విడిపోవుటకు గాని వాయువును కర్మయు స్వభావమును కారణములుగ నుండును.

మూ॥ తదేతచ్ఛరీరం సంఖ్యాతమనేకావయవం దృష్టమేకత్వేన సఙ్గః, పృథక్త్వేనాపవర్గః, తత్ర ప్రధానమసక్తం సర్వసన్న్యాసాన్నివృత్తౌ సివ్రత ఇతి ॥20॥

ఆ॥ అనేకావయవములు కలదిగ చెప్పబడిన ఈశరీరమును ఏకత్వముగ చూచి నచో రాగద్వేషాదులతో కూడికొనినవా డగును. భిన్నముగ చూచినచో మోక్షమును పొందును. రాగద్వేషాదులతో కూడికొనని ఆత్మ సమస్తభావములతోను సంబంధము లేనిదగుట వలన మోక్షము నొందును.

## అధ్యాయసంగ్రహము.

మూ॥ శరీరసంఖ్యాం యో వేద సర్వావయవశో భిషక్ ॥ తదజ్ఞాననిమిత్తేన స మోహేన న యుజ్యతే॥ అమూఢో మోహమూలై శ్చ న దోషై రభిభూయతే। నిర్దోషో నిస్పృహః శాన్తః ప్రశామ్యత్యపునర్భవః ॥32॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే శారీరస్థానే శరీరసంఖ్యాశారీరం నామ సప్తమోఽధ్యాయః॥

ఆ॥ ఎవడు శరీరసంఖ్యను సమస్తములైన అంగప్రత్యంగములతో కూడ తెలిసికొనునో అట్టివాడు వానిని తెలిసికొనకపోవుటవలన కలుగు మోహమును పొందడు. అట్టివాడు మోహమూలములైన దోషములు లేనివాడై నిస్పృహుడును శాంతుడును నై సంసారమునుండి విశ్రమించి పునర్జన్మ లేనివాడుగ నగును.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు శరీరసంఖ్యా శారీరమనెడు సప్తమాధ్యాయము సమాప్తము.

—:0:—

# అష్టమాధ్యాయము.

మూ॥ అథాతో జాతిసూత్రీయం శారీరం వ్యాఖ్యాస్యామః ॥1॥

ఆ॥ పిమ్మట మహతీగర్భావక్రాంతిశారీరమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

ఆ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ స్త్రీపురుషయోరవ్యాపన్నశుక్రశోణితగర్భాశయయోః శ్రేయసీం ప్రజామిచ్ఛతో స్తదర్థాభివృత్తికరం కర్మోపదేక్ష్యామః ॥3॥

ఆ॥ పరిశుద్ధములుగనున్న శుక్రమును ఆర్తవమును గర్భాశయమునుకలిగినట్టియు శ్రేష్ఠమైన సంతానమును కోరుచున్నట్టియు స్త్రీపురుషులకు శ్రేష్ఠమైనసంతానము కలుగుటకు ఉపయోగించు కర్మను చెప్పుచున్నాము.

మూ॥ అథాప్యేతౌ స్త్రీపురుషౌ స్నేహస్వేదాభ్యాముపపాద్య వమనవిరేచనాభ్యాం సంశోధ్య క్రమేణ ప్రకృతిమాపాదయేత్, సంశుద్ధౌ చాస్థాపనానువాసనాభ్యాముపాచరేత్. ఉపాచరేచ్చ మధురౌషధసంస్కృతాభ్యాం ఘృతక్షీరాభ్యాం పురుషం, స్త్రియంతు తైలమాంసాభ్యామ్ ॥4॥

ఆ॥ స్త్రీపురుషులకు స్నేహస్వేదములను చేయించి వమన విరేచనరూపమైన శోధనకర్మలను చేయించి పేయాదిక్రమముచే ప్రకృతిని పొందింపవలయును. శుద్ధినొందినపిదప ఆస్థాపనవస్తిని అనువాసనవస్తిని చేయింపవలయును. పిదప మధురరసము కలద్రవ్యములతో తయారుకాబడిన ఘృతము క్షీరము వీనిని పురుషునకును, తైలము మాంసము వీనిని స్త్రీకిని ఇయ్యవలయును

మూ॥ తతః పుష్పాత్ప్రభృతి త్రిరాత్రమాసీత బ్రహ్మచారిణ్యధఃశాయినీ పాణిభ్యామన్నమజర్జరపాత్రే భుఞ్జానా న చ కాంచిన్మృజామాపద్యేత, తతశ్చతుర్థేఽహన్యేనాముత్సాద్య సశిరస్కంస్నాపయిత్వా శుక్లాని వాసాంస్యాచ్ఛాదయేత్పురుషం చ, తతః శుక్లవాససౌ స్రగ్విణౌ సుమనసావన్యోన్యమభికామౌ సంపసేతామితి బ్రూయాత్ ॥ స్నానాత్ప్రభృతి యుగ్మేష్వహస్సు సంవసేతాం పుత్రకామౌ, అయుగ్మేషు దుహితృకామౌ ॥ ॥

ఆ॥ ఆర్తవదర్శనముకలిగినది మొదలు మూడురోజులవరకును బ్రహ్మచారిణిగను క్రిందపరుండునదిగను నుండవలయును. మరియు అన్నమును క్రొత్తదియగుపాత్రయందు చేతులతో తినవలయును. వేనినికూడ స్పృశింపకూడదు. పిమ్మట నాలుగవరోజువరకు స్త్రీకి తైలమునుపూసి శిరఃస్నానమును చేయింపవలయును. పిమ్మట స్త్రీయును పురుషుడును తెల్లనివస్త్రములను ధరింపవలయును. అట్లు తెల్లనివస్త్రముల ధరించినట్టియు పుష్పమాలికలతోకూడినట్టియు నిర్మలమైనమనస్సుకలిగినట్టియు పరస్పరము ప్రేమకలిగినట్టియు స్త్రీపురుషులు మైథునమును ఆచరింపవలయును. పుత్రసంతానమును కోరినచో ఋతుస్నానముచేసినది మొదలు యుగ్మదినములయందును, పుత్రికాసంతానమును కోరినచో అయుగ్మదినములయందును మైథునము ఆచరింపవలయును.

మూ॥ న చ న్యుబ్జాం పార్శ్వగతాం వా సంసేవేత; న్యుబ్జాయా వాతో బలవాన్ స యోనిం పీడయతి, పార్శ్వగతాయా దక్షిణే పార్శ్వే శ్లేష్మా స చ్యుతోఽపిదధాతి గర్భాశయం, వామే

పిత్తం పార్శ్వే తస్యాః పీడితం విదహతి రక్తశుక్రం, తస్మాదుత్తానా సతీ బీజం గృహ్ణీయాత్, తస్యా హి యథాస్థానమవతిష్ఠన్తే దోషాః। పర్యాప్తే చైనాం శీతోదకేన పరిషించేత్। తత్రాత్యశితా క్షుధితా పిపాసితా భీతా విమనాః శోకార్తా క్రుద్ధాఽన్యం చ పుమాంస మిచ్ఛన్తీ మైథునే చాతికామా వా నారీ గర్భం న ధత్తే విగుణాం వా ప్రజాం జనయతి। అతిబాలామతివృద్ధాం దీర్ఘరోగిణీమన్యేన వా వికారేణోపసృష్టాం వర్జయేత్, పురుషేఽప్యేత ఏవ దోషాః। అతః సర్వదోషవర్జితౌ స్త్రీపురుషౌ సంసృజ్యేయాతాం, సంజాతహర్షౌ మైథునే చానుకూలావిష్టగన్ధం స్వాస్తీర్ణం సుఖం శయనముపకల్ప్య మనోజ్ఞం హిత మశన మశిత్వా నాత్యశితౌ దక్షిణపాదేన పుమాన్ వామపాదేన స్త్రీ చారోహేత్; తత్ర మన్త్రం ప్రయుఞ్జీత— అహిరసి ఆయురసి సర్వతః ప్రతిష్ఠాఽసి ధాతా త్వా దధాతు విధాతా త్వా దధాతు బ్రహ్మవర్చసా భవేదితి "బ్రహ్మా బృహస్పతిర్విష్ణుః సోమః సూర్యస్తథాఽశ్వినౌ। భగోఽథ మిత్రావరుణౌ పుత్రం వీరం దధాతు మే"॥ ఇత్యుక్త్వా సంవసేతామ్ ॥7॥

ఆ॥ వక్రముగ పరుండినట్టియు పార్శ్వములచే పరుండినట్టియు స్త్రీతో సంభోగము చేయకూడదు. వక్రముగ పరుండిన స్త్రీకి వాతము బలవంతముగనుండి యోనిని పీడించును. పార్శ్వములచే పరుండిన స్త్రీ కుడిపార్శ్వముగ పరున్నచో శ్లేష్మము స్రవించి గర్భాశయమును ఆవరించును. ఎడమపార్శ్వముగ పరుండినచో పిత్తముప్రకోపించి ఆర్తవమును శుక్రమును దహింపచేయును. అందువలన స్త్రీ వెల్లకిలపరుండియే శుక్రమును గ్రహింపవలయును. వెల్లకిలపరుండియున్న స్త్రీకి దోషములు స్వస్థానములయందు సరిగనుండును. మైథునము నాచరించినపిదప చన్నీటితో స్నానమునుఆచరింపవలయును. అధికముగభుజించినట్టికాని ఆకలితోకూడినట్టికాని దప్పికకలిగినట్టికాని భయముకలిగినట్టికాని ఇతరధ్యానముకలిగినట్టికాని దుఃఖముకలిగినట్టికాని కోపముకలిగినట్టికాని ఇతరపురుషుని కోరుచున్నట్టికాని మైథునమునందు అధికమైనకోరిక కలిగినట్టికాని స్త్రీ గర్భమును ధరింపనేరదు. గర్భమును ధరించినను వికృతసంతానమును కనును. మిక్కిలి బాల్యమునందున్నట్టికాని మిక్కిలి వార్ధక్యమునందున్నట్టికాని దీర్ఘవ్యాధులతో కూడినట్టికాని ఇతరకారణములతో కూడినట్టికాని స్త్రీతో మైథునమును ఆచరింపకూడదు. ఇట్టిదోషములుకల పురుషుడుకూడ మైథునమును ఆచరింపకూడదు. ఏవిధమగు దోషములేనట్టి స్త్రీపురుషులు సంభోగమును ఆచరింపవలయును. మైథునమునందు కోరికకలిగినట్టియు చక్కగ పరువబడినట్టియు సుఖకరమైనట్టియు మనోహరమైనట్టియు శయ్యను కల్పించి, హితకరమైన ఆహారమును

శయ్యను కల్పించి, హితకరమైన ఆహారమును మితముగ భుజించి అట్టిశయ్యను పురుషుడు కుడిపాదముచేతను స్త్రీ ఎడమపాదముచేతను అధిష్ఠింపవలయును. పిదప "అహిరసి ఆయుఃరసి" అనువాక్యము మొదటియందు కలిగినట్టియు "పుత్రం వీరం దధాతు మే" అనువాక్యము అంతమందు కలిగినట్టియు మంత్రమును పఠించి మైథునమును ఆచరింపవలయును.

మూ॥ సా చే ద్దేవమాశాసీత బృహన్తమవదాతం హర్యక్షమోజస్వినంశుచిం సత్త్వసంపన్నం పుత్రమిచ్ఛేయమితి శుద్ధస్నానాత్ప్రభృత్యస్యై మన్థమవదాతయవానాం మధుసర్పిర్భ్యాం సంసృజ్య శ్వేతాయా గోః సరూపవత్సాయాః పయసాఽఽలోడ్య రాజతే కాంస్యే వా పాత్రే కాలే కాలే సప్తాహం సతతం ప్రయచ్ఛేత్పానాయ, ప్రాతశ్చ శాలియవాన్నవికారాన్ దధిమధుసర్పిర్భిః పయోభిర్వా సంసృజ్య భుఞ్జీత, తథా సాయమవదాతశరణశయనాసనయానవసనభూషణా చ స్యాత్, సాయంప్రాతశ్చ శశ్వచ్ఛ్వేతం మహాన్తమృషభమాజానేయం హరిచన్దనాఙ్గదం పశ్యేత్, సౌమ్యాభిశ్చైనాం కథాభిర్మనోఽనుకూలాభిరుపాసీత, సౌమ్యాకృతివచనోపచారచేష్టాంశ్చ స్త్రీపురుషానితరానపి చేన్ద్రియార్థానవదాతాన్ పశ్యేత్, సహచర్యశ్చైనాం ప్రియహితాభ్యాం సతతముపచరేయుః, తథా భర్తా। న చ మిశ్రీభావమాపద్యేయాతాం, ఇత్యనేన విధినా సప్తరాత్రం స్థిత్వాఽష్టమేహన్యాప్లుత్యాద్భిః సశిరస్కం భర్త్రా సహ చాహతాని వస్త్రాణ్యాచ్ఛాదయేదవదాతాన్యవదాతాశ్చ స్రజో భూషణాని బిభృయాత్ ॥

అ॥ గొప్పవాడగునట్టియు శుభ్రమైనవర్ణము కలిగినట్టియు సింహముతోసమానమైన పరాక్రమము కలిగినట్టియు అధికమైన ఓజస్సుకలిగినట్టియు శుచికలిగినట్టియు మనశ్శక్తికలిగినట్టియు పుత్రుని కోరిన స్త్రీ ఈక్రిందివిధము నాచరింపవలయును. ఋతుస్నానమును చేసినది మొదలు స్త్రీకి తెల్లనియవలయొక్క మంథమునందు తేనె నెయ్యి వీనినికలిపి దానియందు, తెల్లనివర్ణము కలిగినట్టియు తనతోసమానమైనవర్ణము కల దూడకలిగినట్టియు ఆవుయొక్క పాలను కలిపి అట్టిమంథమును వెండిపాత్రయందుగాని కంచుపాత్రయందుగాని ఉంచి ప్రతికాలమునందును పానమునుచేయింపవలయును. ఇట్లు ఏడుదినములు చేయింపవలయును. మరియు శాలిధాన్యము యవలు వీనితో తయారుచేయబడిన అన్నమును పదార్థములను పెరుగు తేనె నెయ్యి వీనితోగాని పాలతోగాని కలిపి ఇయ్యవలయును. సాయంకాలమునందు, పరిశుభ్రములైన ఇల్లు శయ్య ఆసనములు వాహనములు వస్త్రములు ఆభరణములు ఇవికలదిగనుండవల

యును. తెల్లగనున్నట్టియు గొప్పదైనట్టియు వృషభమును, హరిచందనముతో పూయబడిన గుఱ్ఱమును ప్రతిదినమున సాయంప్రాతఃకాలములయందు చూడవలయును. సౌమ్యములైనట్టియు మనస్సునకు ననుకూలములైనట్టియు కథలనువినవలయును. సౌమ్యములైన ఆకృతియు వాక్కులును ఉపచారములును చేష్టలును కల స్త్రీపురుషులను, ఇట్టి ఇతరములైనట్టియు స్వచ్ఛములైనట్టియు ఇంద్రియార్థములను చూడవలయును. ఆమెను చెలికత్తెలు ప్రియములైనట్టియు హితములైనట్టియు కృత్యములచే ఎల్లప్పుడును ఉపచరింపవలయును. భార్యవలె భర్తకూడ ఆచరింపవలయును. కాని ఇరువురును సంయోగమునొందకూడదు. ఇట్లు ఏడురోజులు ఆచరించి ఎనిమిదవరోజున భర్తయు తానును శిరస్నానమునుచేసి నూతనములైనట్టియు స్వచ్ఛములైనట్టియు వస్త్రములను, స్వచ్ఛములైన పుష్పమాలికలను, ఆభరణములను ధరింపవలయును.

మూ॥ తత ఋత్విక్ప్రాగుత్తరస్యాం దిశ్యగారస్య ప్రాక్ప్రవణముదక్ప్రవణం వా ప్రదేశమభిసమీక్ష్య, గోమయోదకాభ్యాం స్థణ్డిలముపసలిప్య, ప్రోక్ష్య చోదకేన, వేదిమస్మిన్ స్థాపయేత్, తాం పశ్చిమేనానాహతవస్త్రసంచయే శ్వేతార్షభే వాఽప్యజిన ఉపనిషేద్బ్రాహ్మణప్రయుక్తః, రాజన్యప్రయుక్తస్తువైయాఘ్రే చర్మణ్యానడుహే వా, వైశ్యప్రయుక్తస్తు రౌరవే బాస్తే వా, తత్రోపవిష్టః పాలాశీభిరైఙ్గుదీభిరౌదుమ్బరీర్మాధూకీభిర్వా సమిద్భిరగ్నిముపసమాధాయ, కుశైః పరిస్తీర్య పరిధిభిశ్చ పరిధాయ, లాజైః శుక్లాభిశ్చ గన్ధవతీభిఃసుమనోభిరుపాకిరేత్, తత్ర తత్ర ప్రణీయోదపాత్రం పవిత్రపూతముపసంస్కృత్య సర్పిరాజ్యార్థం యథోక్తవర్ణానాజానేయాదీన్ సమన్తతః స్థాపయేత్, తతః పుత్రకామా పశ్చిమతోఽగ్నిం దక్షిణతో బ్రాహ్మణముపవిశ్యాన్వాలభేత సహభర్త్రా యథేష్టం పుత్రమాశాసానా, తతస్తస్యా ఆశాసానాయా ఋత్విక్ ప్రజాపతిమభినిర్దిశ్య యోనౌ తస్యాః కామపరిపూరణార్థం కామ్యామిష్టిం నిర్వపేత్ 'విష్ణుర్యోనిం కల్పయతు' ఇత్యనయా ఋచా, తతశ్చైవాజ్యేన స్థాలీపాకమభిఘార్య త్రిర్జుహుయాత్, యథామ్నాయం చోపమన్త్రితముదకపాత్రం తస్యై దద్యాత్సర్వోదకార్థాన్ కురుష్వేతి తతః సమాప్తే కర్మణి పూర్వం దక్షిణపాదమభిహరన్తి ప్రదక్షిణమగ్నిమనుపరిక్రామేత్, తతో బ్రాహ్మణాన్ స్వస్తి వాచయిత్వా, సహభర్త్రాఽఽజ్యశేషం ప్రాశ్నీయాత్, పూర్వం పుమాన్ పశ్చాత్ స్త్రీ, న చోచ్ఛిష్టమవశేషయేత్, తతస్తౌ సహ సంవసేతామష్టరా

త్రం తథావిధపరిచ్ఛదావేవచ స్యాతాం, తథేష్టపుత్రంజనయేతామ్॥ 8॥

అ॥ ఋత్విక్కు ఇంటియొక్క ఈశాన్యభాగమున తూర్పువైపునకుగాని ఉత్తరమువైపునకుగాని ఉండు ప్రదేశమునందు గోమయముతోకూడిన ఉదకముతో పూజాస్థానమును అలికి ఉదకమునుచల్లి అక్కడ వేదికను నిర్మింపవలయును. ఋత్విక్కు ఆవేదికకు పశ్చిమదిక్కున కూర్చొనవలయును. చేయబోవువిధానమును - బ్రాహ్మణులకు చేయింపవలసినచో నూతనమైన వస్త్రములపైనగాని శ్వేతవృషభముయొక్క చర్మముపైనగాని కూర్చొనవలయును. క్షత్రియులకు చేయింపవలసినచో వ్యాఘ్రముయొక్క చర్మమునందుగాని వృషభముయొక్క చర్మమునందుగాని కూర్చొనవలయును. వైశ్యులకు చేయింపవలసినచో లేడియొక్క చర్మముపైనగాని మేకయొక్క చర్మముపైనగాని కూర్చొనవలయును. అట్లు కూర్చొన్నవాడై మోదుగ, గార, మేడి, ఇప్ప వీనిలో దేనియొక్క సమిధలచేతనైనను అగ్నిని పరికల్పించి దర్భలను పరచి మోదుగదండములను చుట్టును ఉంచి పేలాలను తెల్లనైనట్టియు పరిమళముతో కూడినట్టియు పుష్పములను చల్లవలయును. పరిశుభ్రమైనట్టియు పవిత్రమైనట్టియు మంత్రములచే సంస్కరింప బడినట్టియు ఉదకపాత్రను, హోమము నిమిత్తము ఘృతమును అచ్చటఉంచి యథోక్తవర్ణముకల గుఱ్ఱము మొదలగువానిని అంతటను ఉంచవలయును. పుత్రునికోరు స్త్రీ అగ్నికి పశ్చిమదిక్కునకును బ్రాహ్మణునకు దక్షిణదిక్కునకును ఉండునట్లు కూర్చొని ఋత్విక్కు చెప్పిన విధానమును భర్తతో కూడ ఆచరింపవలయును. ఋత్విక్కు బ్రహ్మను పూజించి కుమారుని కోరుచున్న ఈస్త్రీయొక్క యోనియందు కోరిక ఫలించు నిమిత్తము "విష్ణుర్యోనిం కల్పయతు" అనెడి ఋక్కుచే పుత్రేష్టిని చేయింపవలయును. పిదప ఆజ్యముతో స్థాలీపాకమును అభిఘరించి మూడుసార్లు హోమమును చేయవలయును. వేదవిధిననుసరించి మంత్రింపబడిన ఉదకపాత్రను ఆస్త్రీకిఇచ్చి "దీనితో సమస్తమైన ఉదకకార్యములను చేసికొనవలయును" అని చెప్పవలయును. ఈకర్మపూర్తియైనపిదప తొలుత కుడికాలును ఉంచి అగ్నికిచుట్టును ప్రదక్షిణమును చేయవలయును పిదప బ్రాహ్మణులయొక్క ఆశీర్వాదమును పొంది ఆజ్యశేషమును భర్తతోకూడ తినవలయును. తొలుత పురుషుడును పిమ్మట స్త్రీయును తినవలయును. ఆ ఆజ్యమును మిగల్చకూడదు. పిదప ఆస్త్రీ పురుషులిరువురును పూర్వమునందు చెప్పబడిన విధానములను ఆచరించుచు ఎనిమిదిరోజులు సంభోగింపవలయును. ఇట్లు చేసినచో కోరిన పుత్రుడు జనించును.

మూ॥ యా తు స్త్రీ శ్యామం లోహితాక్షం వ్యూఢోరస్కం మహాబాహుం చ పుత్రమాశాసీత, యా వా కృష్ణం కృష్ణమృదుదీర్ఘకేశం శుక్లాక్షం శుక్లదన్తం తేజస్వినమాత్మవన్తం, ఏష ఏ వాశయోరపి హోమవిధిః, కింతు పరిబర్హవర్జ్యం స్యాత్, పుత్రవర్ణానురూపస్తు యథాశీః పరిబర్హోఽన్యః కార్యః స్యాత్ ॥9॥

అ॥ నలుపువర్ణము కలిగినట్టియు ఎఱ్ఱని నేత్రములు కలిగినట్టియు విశాలమైన వక్షఃస్థలము కలిగినట్టియు దీర్ఘమైనబాహువులు కలిగినట్టియు పుత్రుని కోరిన స్త్రీ చేతను, తెలుపువర్ణము కలిగినట్టియు నలుపుగు మృదుత్వమును పొడవునుకల కేశములు కలిగినట్టియు తెల్లని నేత్రములు కలిగినట్టియు తెల్లనిదంతములు కలిగినట్టియు తేజోవంతుడైనట్టియు ఆత్మశక్తి కలిగినట్టియు పుత్రుని కోరిన స్త్రీ చేతను పూర్వమునందలి హోమవిధి నే చేయింపవలయును. కాని పూర్వమునందలి శయనము ఆసనము మొదలగు పరిబర్హమును విడిచిపెట్టి. ఎట్టి వర్ణములుకల పుత్రుని కోరునో అట్టివర్ణములుకల శయనము మొదలగు పరిబర్హమును సేవింపవలయును.

మూ॥ శూద్రా తు నమస్కారమేవ కుర్యాద్దేవాగ్నిద్విజగురుతపస్విసిద్ధేభ్యః ॥10॥

అ॥ శూద్ర స్త్రీయైనచో హోమాదులను చేయక దేవతలు అగ్నిహోత్రము బ్రాహ్మణులు గురువులు తపస్వులును సిద్ధులు వీరలకు నమస్కారములనుమాత్రమే చేయవలయును.

మూ॥ యా యా చ యథావిధం పుత్రమాశాసీత తస్యాస్తస్యాస్తాం తాం పుత్రాశిషమనునిశమ్య తాంస్తాన్ జనపదాన్ మనసాఽనుపరిక్రామయేత్, తాననుపరిక్రమ్య యా యా యేషాం జనపదానాం మనుష్యాణామనురూపం పుత్రమాశాసీత సా సా తేషాం తేషాం జనపదానామాహారవిహారోపచారపరిచ్ఛదాననువిధత్స్వేతి వాచ్యా స్యాత్; ఇత్యేతత్సర్వం పుత్రాశిషాం సమృద్ధికరం కర్మ వ్యాఖ్యాతం భవతి ॥11॥

అ॥ ఏ స్త్రీ ఎట్టిపుత్రుని కోరునో ఆ స్త్రీయొక్క అట్టికోరికను తెలిసికొని ఆమెచే ఆయాదేశములను మనస్సుతో తలచుకొనునట్లు చేయవలయును. పిమ్మట ఆమె ఏదేశమునందలి మనుష్యులతో సమానమైన పుత్రుని కోరునో అట్టిదేశమునందలి ఆహారము విహారము ఉపచారము శయనము మొదలగువానిని సేవించునట్లు చేయవలయును. కోరినపుత్రుడు కలుగుటకు అనుకూలమైన సమస్తకర్మయు ఇట్లు చెప్పబడినది.

మూ॥ న తు ఖలు కేవలమేతదేవ కర్మ వర్ణవైశేష్యకరం భవతి, అపి ఖలు తేజోధాతురప్యుదకాన్తరిక్షధాతుప్రాయోఽవదాతవర్ణకరో భవతి, పృథివీవాయుధాతుప్రాయః కృష్ణవర్ణకరః, సమసర్వధాతుప్రాయః శ్యామవర్ణకరః ॥12॥

అ॥ కేవలము పైనచెప్పబడిన విధిననుసరించియే వర్ణవిశేషము కలుగదు. తేజోభూతము జలము వాయువు అనుభూతములతో ప్రధానముగ కలిసినచో గౌరవర్ణమును,

పృథివి వాయువు అను భూతములతో ప్రధానముగ కలిసినచో నలుపువర్ణమును, సమస్తభూతములతోడను సమముగ కలిసినచో శ్యామవర్ణమును కలిగించును.

మూ॥ సత్త్వవైశేష్యకరాణి పునస్తేషాం తేషాం ప్రాణినాం మాతాపితృసత్త్వాన్యన్తర్వత్న్యాః శ్రుతయశ్చాభీక్ష్ణం స్వోచితం చ కర్మ సత్త్వ విశేషాభ్యాసశ్చేతి ॥ ౭॥

అ॥ తల్లిదండ్రులయొక్క సత్త్వములు, గర్భిణీస్త్రీచే అధికముగ వినబడు కథలు మొదలగునవి, తనచే పూర్వజన్మయందు చేయబడిన కర్మ, అభ్యసింపబడిన సత్త్వవిశేషము వీని ననుసరించి జీవులకు ఆయా సత్త్వవిశేషములు కలుగును.

మూ॥ యథోక్తేన విధినోపసంస్కృతశరీరయోః స్త్రీపురుషయోర్మిశ్రీభావమాపన్నయోః శుక్రం శోణితేన సహ సమేత్యావ్యాపన్నమవ్యాపన్నేన యోనావనుపతాయామప్రదుష్టే గర్భాశయే గర్భమభినిర్వర్తయత్యేకాన్తేన, యథా నిర్మలే వాససి సుపరికల్పితే రఞ్జనం సముదితగుణముపనిపాతాదేవ రాగమభినిర్వర్తయతి, తద్వత్, యథా వా క్షీరం దధ్నాఽభిషుతమభిషవణాద్విహాయ స్వభావమాపద్యతే దధిభావం, శుక్రం తద్వత్॥ ఏవమభినిర్వర్తమానస్య గర్భస్య స్త్రీపురుషత్వే హేతుః పూర్వముక్తః॥ యథా హి బీజమనుపతప్తముప్తం స్వాం స్వాం ప్రకృతిమనువిధీయతే వ్రీహిర్వా వ్రీహిత్వం యవో వా యవత్వం తథా స్త్రీపురుషావపి యథోక్తం హేతువిభాగమనువిధీయేతే ॥ ౮ ॥

అ॥ పూర్వమునందు చెప్పబడిన విధిచే సంస్కరింపబడిన శరీరముకల స్త్రీపురుషులు సంసర్గము నొందినప్పుడు—శుద్ధమైనశుక్రము శుద్ధమైన ఆర్తవముతో కలిసి యోని శుద్ధముగ నున్నప్పుడు శుద్ధమైన గర్భాశయమునందు గర్భమును తప్పక కలిగించును. ఎటులననగా—శుభ్రమైనరంగు నిర్మలమైనట్టియు బాగుగకల్పింపబడినట్టియు వస్త్రమునందు పడిన వెంటనే రంగును కలిగించు విధమునను, పాలు పెరుగుతో కలసి తమయొక్క స్వభావమును విడిచిపెట్టి పెరుగుగ మారువిధమునను శుక్రమువలన గర్భముకలుగును. ఇట్లు కలిగినగర్భము స్త్రీగగాని పురుషుడుగగాని ఏర్పడుటకు హేతువు పూర్వమునందు చెప్పబడినది. చెడనివిత్తనము పాతిపెట్టబడినదై తనయొక్క ప్రకృతిని పొందు విధము—అనగా—వ్రీహిధాన్యమువలన వ్రీహిధాన్యమును యవధాన్యమువలన యవధాన్యమును జనించు విధమున పూర్వమునందు చెప్పబడిన హేతువిభాగమున ననుసరించి స్త్రీపురుషులు జనించెదరు.

మూ॥ తయోః కర్మణా వేదోక్తేన వివర్తనముపదిశ్యతే ప్రాగ్వ్యక్తీభావాత్ ప్రయుక్తేన సమ్యక్, కర్మణాం హి దేశకాల

సంపదుపేతానాం నియతమిష్టఫలత్వం, తథేతరేషామితరత్వమ్। తస్మా
దాపన్నగర్భాం స్త్రియమభిసమీక్ష్య ప్రాగ్వ్యక్తీభావాద్గర్భస్య పుం
సవనమస్యై దద్యాత్—గోష్ఠే జాతస్య న్యగ్రోధస్య ప్రాగుత్తరా
భ్యాం శాఖాభ్యాం శుఙ్గేఽనుపహతే ఆదాయ ద్వాభ్యాం ధాన్యమా
షాభ్యాం సంపదుపేతాభ్యాం గౌరసర్షపాభ్యాం వా సహ దధ్ని
ప్రక్షిప్య పుష్యే పిబేత్, తథైవాపరాఞ్జీవకర్షభకాపామార్గసహచర
కల్కాంశ్చ యుగపదేకైకశో యథేష్టం వాఽప్యుపసంస్కృత్య పయ
సా, కుడ్యకీటకం మత్స్యకోద్రం చోదకాఞ్జలౌ ప్రక్షిప్య పుష్యే
పిబేత్, తథా కనకమయాన్ రాజతానాయసాంశ్చ పురుషకానగ్ని
వర్ణానణుప్రమాణాన్ దధ్ని పయస్యుదకాఞ్జలౌ వా ప్రక్షిప్య పిబే
దనవశేషతః పుష్యేణ, పుష్యేణైవ చ పిష్టస్య పచ్యమానస్యోష్మాణ
ముపాఘ్రాయ తస్యైవ చ పిష్టస్యోదకసంసృష్టస్య రసం దేహల్యా ము
పనిధాయ దక్షిణే నాసాపుటే స్వయమాసిఞ్చేత్పిచునా, ఇతి పుంస
వనాని,యచ్చాన్యదపి బ్రాహ్మణా బ్రూయు రాప్తా వా పుంసవనమిష్టం
తచ్చానుష్ఠేయమ్ ॥7॥

అ॥ గర్భము వ్యక్తముగుటకు పూర్వమునను బాగుగ ప్రయోగింపబడ తగినట్టియు ఆయుర్వేదమునందు చెప్పబడినట్టియు కర్మచే గర్భమును స్త్రీగా గాని పురుషుడుగ గాని మార్పు చెందించువిధానము చెప్పబడుచున్నది. దేశమునకును కాలమునకును అనుకూలమైన కర్మలను చేసినచో ఇష్టఫలము తప్పక కలుగును. వ్యతిరేకములైన కర్మలను చేసినచో ఇష్టఫలము కలుగదు. అందువలన, స్త్రీని గర్భవతియైనదానిగ తెలిసికొని గర్భము వ్యక్తముగుటకు పూర్వమునందే ఆ స్త్రీకి పుంసవనమును చేయింపవలయును. ఎటులననగా—గోసముదాయము నిలుమస్థలమునందున్నట్టి మఱ్ఱిచెట్టుయొక్క తూర్పు కొమ్మయందుగాని ఉత్తరపు కొమ్మయందుగాని ఉన్నట్టియు చెడిపోనట్టియు మొగ్గలవలెనుండునట్టియు రెండుచిగుళ్ళను గ్రహించి శ్రేష్ఠములైన రెండు మినపగింజలతోగాని రెండు తెల్లఆవగింజలతోగాని కలిపి పెరుగు నందుంచి పుష్యమి నక్షత్రముతో కూడిన దినమునందు గర్భిణీస్త్రీ పానము చేయవలయును. ఈవిధముగనే, ఇతరములైన జీవకము ఋషభకము ఉత్తరేణి ముల్లుగోరింట వీని అన్నిటియొక్కగాని ఒక్కొక్క దానియొక్కగాని ఇష్టానుసారముగ కొన్నిటియొక్కగాని కల్కములను గ్రహించి పాలతో కలిపి పానము చేయవలయును. కీటకముచే గోడయందు నిర్మింపబడిన గూడునుగాని మత్స్యకోద్రమునుగాని దోసిలి పరిమాణముకల ఉదకమునందు ఉంచి పుష్యమినక్షత్రముతో కూడిన దినమునందు పానము చేయవలయును. ఈవిధముగనే బంగారముతో గాని వెండితో గాని ఇనుముతో గాని చిన్నవిగను అగ్నివర్ణము కలిగినవిగను నుండు పురుషవిగ్రహములను చేయించి పెరుగునందుగాని దోసిలిప్రమాణముకల ఉదకమునందుగాని ఉంచి పుష్యమి నక్షత్ర

మునందు నిశ్శేషముగ పానము చేయవలయును. పూర్వమునందు చెప్పబడిన వస్తువులను పుష్యమినక్షత్రమునందు వృద్ధగనూరి దానిని ఉదకబెట్టుచు దానియొక్క ఆవిరిని ఆఘ్రాణింపవలయును. ఆవృద్ధనే నీటితోకలిపి రసమును తీయవలయును. గర్భిణీస్త్రీ తనయొక్క శిరస్సు గడపమీదనుండునట్లు పరుండి దూదితో ఆరసమును గ్రహించి తనముక్కుయొక్క కుడిరంధ్రమునందు విడువవలయును. ఇట్లు పుంసవనవిధులు చెప్పబడినవి. బ్రాహ్మణులుగాని ఆప్తులుగాని చెప్పినట్టియు అనుకూలములైనట్టియు ఇతరములైన పుంసవనములనుకూడ ఆచరించవచ్చును.

## గర్భస్థాపనములు.

మూ॥ అత ఊర్ధ్వం గర్భస్థాపనాని వ్యాఖ్యాస్యామః—ఐన్ద్రీ బ్రాహ్మీ శతవీర్యా సహస్రవీర్యాఽమోఘాఽవ్యథా శివా బలాఽరిష్టా వాట్యపుష్పీ విష్వక్సేనకాన్తా చ, ఆసామోషధీనాం శిరసా దక్షిణేన పాణినా ధారణం, ఏతాభిశ్చైవ సిద్ధస్య పయసః సర్పిషో వా పానం, ఏతాభిశ్చైవ పుష్యే పుష్యే స్నానం, సదా సమాలభేత చ తాః, తథా సర్వాసాం జీవనీయోక్తానామోషధీనాం సదోపయోగస్తైస్తైరుపయోగవిధిభిః; ఇతి గర్భస్థాపనాని వ్యాఖ్యాతాని భవన్తి ॥18॥

అ॥ పిమ్మట గర్భస్థాపనములను చెప్పుచున్నాము. చేమపుచ్చ, సరస్వతియాకు గరిక, గరికభేదము, కలిగొట్టు, తిప్పతీగ, కరక్కాయ, మూత్రపపులగము, కటుకరోహిణి, పచ్చముత్తవపులగము, ప్రేంఖణము ఈఓషధులను శిరస్సునందును కుడిచేతియందును ధరించుట, ఈఓషధులతోడనే తయారుచేయబడిన పాలనుగాని ఘృతమునుగాని పానముచేయుట, వీనితోడనే కాచబడిన జలముచే ప్రతి పుష్యమి నక్షత్రమునందును స్నానముచేయుట, ఈఓషధులను ఎల్లప్పుడు పొందియుండుట, జీవనీయగణమునందు చెప్పబడిన సమస్తద్రవ్యములను ఆయాప్రయోగవిధులను ఎల్లప్పుడు నుపయోగించుట ఇవి గర్భస్థాపనములగ నుండును.

## గర్భమునకు విఘాతమునుకలిగించు భావములు.

మూ॥ గర్భోపఘాతకరాస్త్విమే భావా భవన్తి; తద్యథా—ఉత్కటుకవిషమకఠినాసనసేవిన్యా వాతమూత్రపురీషవేగానుపరున్ధత్యా దారుణానుచితవ్యాయామసేవిన్యాస్తీక్ష్ణోష్ణాతిమాత్రసేవిన్యాశ్చ గర్భో మ్రియతేఽన్తఃకుక్షేరకాలే వా స్రంసతే శోషీ వా భవతి, తథాఽభిఘాతప్రపీడనైః శ్వభ్రకూపప్రపాతోద్దేశావలోకనైర్వాఽభీక్ష్ణం మాతుః ప్రపతత్యకాలే, తథాఽతిమాత్రసంక్షోభిభిర్యానైరప్రియాతిమాత్రశ్రవణైర్వాః ప్రతతోత్తానశాయిన్యాః పునర్గర్భస్య నాభ్యా

శ్రయా నాడీ కణ్ఠమనువేష్టయతి, వివృతశాయినీ నక్తంచారిణీ చోన్మత్తం జనయతి, అపస్మారిణం పునః కలికలహశీలా, వ్యవాయశీలా దుర్వపుషమహ్రీకం స్త్రైణం వా, శోకనిత్యా భీతమపచితమల్పాయుషం వా; అభిధ్యాత్రీ పరోపతాపినమీర్ష్యుం స్త్రైణం వా, స్తేనా త్వాయాసబహులమతిద్రోహిణమకర్మశీలం వా, అమర్షిణీ చణ్డమౌపధికమసూయకం వా, స్వప్ననిత్యా తన్ద్రాలుమబుధమల్పాగ్నిం వా, మద్యనిత్యా పిపాసాలుమల్పస్మృతిమనవస్థితచిత్తం వా, గోధామాంసప్రియా శార్కరిణమశ్మరిణం శనైర్మేహినం వా, వరాహమాంసప్రియా రక్తాక్షం క్రథనమతిపరుషరోమాణం వా, మత్స్యమాంసనిత్యా చిరనిమేషం స్తబ్ధాక్షం వా, మధురనిత్యా ప్రమేహినం మూకమతిస్థూలం వా, అమ్లనిత్యా రక్తపిత్తినం త్వగక్షిరోగిణం వా, లవణనిత్యా శీఘ్రవలీపలితం ఖాలిత్యరోగిణం వా, కటుకనిత్యా దుర్బలమల్పశుక్రమనపత్యం వా, తిక్తనిత్యా శోషిణమబలమనుపచితం వా, కషాయనిత్యా శ్యావమానాహినముదావర్తినం వా, యద్యచ్చ యస్య యస్య వ్యాధేర్నిదానముక్తం తత్తదాసేవమానాఽన్తర్వత్నీ తద్వికారబహులమపత్యం జనయతి, పితృజాస్తు శుక్రదోషా మాతృజైరపచారైర్వ్యాఖ్యాతాః, ఇతి గర్భోపఘాతకరా భావా వ్యాఖ్యాతాః ॥19॥

అ॥ క్రింద చెప్పబోవు భావములు గర్భమునకు విఘాతమును కలిగించునవిగ నుండును. ఎటులననగా—పృష్ఠభాగమానునట్లును హెచ్చుతగ్గులుగనున్న ప్రదేశములయందును కఠినప్రదేశములయందును కూర్చుండునట్టియు, వాతము మూత్రము పురీషము వీనియొక్క వేగములను అడ్డగించునట్టియు, దారుణమును అనుచితమునైన వ్యాయామమును ఆచరించునట్టియు, తీక్ష్ణోష్ణగుణములుకల పదార్థములను అధికముగ సేవించునట్టియు, అధికముగ భుజించునట్టియు స్త్రీయొక్క గర్భము కుక్షియందు మరణము నొందును. లేక అకాలమునందు ప్రసవించును. లేక కృశించును. దెబ్బతగులుట నొక్కబడుట వీనివలనగాని అకాలమునందు గర్భపాతము కలుగును. మిక్కిలిక్షోభను యానములచే ప్రయాణముచేయుట అహితములైన విషయములను అధికముగ వినుట వీనివలన కూడ అకాలమునందు గర్భపాతము కలుగును. గర్భిణీస్త్రీ ఎల్లప్పుడు వెల్లకిల పరుండినయెడల గర్భముయొక్క నాభి నాశ్రయించుకొనియుండు నాడి అట్టి గర్భముయొక్క కంఠమును చుట్టివేయును. గర్భిణీస్త్రీ ఆచ్ఛాదనములేని ప్రదేశమునందు శయనించినను రాత్రియందు సంచరించినను ఉన్మాదముకలవానిని కనును.

తరుచు వాక్కలహమును శరీరకలహమును చేసినచో అపస్మారముకలవానిని కనును. అధిక మైథునము నాచరించినచో దుష్టశరీరముకలవానిని గాని సిగ్గులేనివానిని గాని స్త్రీస్వభావముకలవానిని గాని కనును. ఎల్లప్పుడును దుఃఖించినచో భయస్వభావము కలవానిని గాని కృశించినవానిని గాని అల్పాయువుకలవానిని గాని కనును. ద్రోహచింతను కలిగియున్నచో పరులకు బాధకలిగించువానిని గాని అసూయకలవానిని గాని స్త్రీస్వభావముకలవానిని గాని కనును. చోరస్వభావముకలదైనచో అధికమైన ఆయాసముకలవానిని గాని ద్రోహస్వభావముకలవానిని గాని కృత్యములనాచరింపని వానిని గాని కనును. క్రోధముకలదైనచో కోపముకలవానిని గాని మోసగించువానిని గాని అసూయకలవానిని గాని కనును. అధికనిద్రకలదైనచో నిద్రాస్వభావముకలవానిని గాని మూర్ఖునిగాని అగ్నిమాంద్యముకలవానిని గాని కనును. ఎల్లప్పుడు మద్యపానము కలదైనచో దప్పికకలవానిని గాని స్వల్పమైనజ్ఞాపకశక్తికలవానిని గాని స్థిమితము లేనిమనస్సుకలవానిని గాని కనును. ఉడుముమాంసము ఎల్లప్పుడును తినునదైనచో శర్కరామేహముకలవానిని గాని అశ్మరీవ్యాధికలవానిని గాని శనైర్మేహముకలవానిని గాని కనును. ఎల్లప్పుడును పందిమాంసమును తినుదైనచో ఎఱ్ఱని నేత్రములుకలవానిని గాని హత్యచేయువానిని గాని మిక్కిలిపరుషములైన రోమములుకలవానిని గానికనును. చేపలమాంసమునుతినునదైనచో చిరని మేహముకలవానిని గాని స్తబ్ధములైన నేత్రములుకల వానిని గానికనును. మధురరసమును సేవించునదైనచో ప్రమేహముకలవానిని గానిమూగ వానిని గానిమిక్కిలిస్థూలముగనుండువానిని గానికనును. అమ్లరసమును సేవించునదైనచో రక్తపిత్తముకలవానిని గాని చర్మవ్యాధులుకలవానిని గాని నేత్రవ్యాధులుకలవానిని గాని కనును. లవణరసమును సేవించునదైనచో శీఘ్రముగ ముడుతలుపడుశరీరముకలవానిగాని శీఘ్రముగ నెరయు వెండ్రుకలుకలవానిని గాని బట్టతలకలవానిని గాని కనును. కటు రసమును సేవించునదైనచో దుర్బలునిగాని స్వల్పశుక్రముకలవానిని గాని వంధ్యునిగాని కనును. తిక్తరక్తమును సేవించునదైనచో క్షయకలవానిని గాని బలములేనివానిని గాని కృశించినవానని గాని కనును. కషాయరసమును సేవించుదైనచో శ్యావవర్ణముకలవానిని గాని ఆనాహముకలవానిని గాని ఉదావర్తముకలవానిని గాని కనును. ఆయావ్యాధులకు నిదానములుగ చెప్పబడినవానిని సేవించునదైనచో ఆయావ్యాధులుఅధికముగకలవానిని కనును. ఈఅపచారములచే గర్భమునకు తల్లివలన విఘాతముకలుగువిధముననే ఈఅప చారములుకల తండ్రియొక్క శుక్రదోషమువలనకూడ గర్భమునకు విఘాతము కలుగును. ఇట్లు, గర్భమునకువిఘాతమునుకలిగించు భావములు చెప్పబడినవి.

మూ॥ తస్మాదహితానాహారవిహారాన్ ప్రజాస పదమిచ్ఛన్ స్త్రీ విశేషేణ వర్జయేత్ ; సాధ్వాచారా చాత్మానముపచరేద్ధితాభ్యామాహారవిహారాభ్యామ్ ॥ 20॥

అ॥ అందువలన, శ్రేష్ఠమైనసంతానమునుకోరు స్త్రీ అహితములైన ఆహార విహారములను తప్పక విసర్జింపవలయును. యోగ్యములైన ఆచారములుకలదై హితకరములైన ఆహారవిహారములచే తనను ఉపచరించుకొనవలయును.

గర్భిణీస్త్రీకి చికిత్సావిధానము.

మూ॥ వ్యాధీంశ్చాస్యా మృదుమధురశిశిరసుఖసుకుమారప్రాయై రౌషధాహారోపచారై రుపచరేత్, న చాస్యా వమనవిరేచనశిరో విరేచనాని ప్రయోజయేత్, న రక్త మవసేచయేత్, సర్వకాలం చనాస్థాపనమనువాసనం వా కుర్యాదన్యత్రాత్యయికాద్వ్యాధేః, అష్టమం మాసముపాదాయ వమనాదిసాధ్యేషు పునర్వికారేష్వాత్యయికేషు మృదుభిర్వమనాదిభి స్తదర్థకారిభిర్వోపచారః స్యాత్, పూర్ణమివ తైలపాత్రమసంక్షోభయతాఽన్తర్వత్నీ భవత్యుపచార్యా ॥2॥

అ॥ గర్భిణీస్త్రీయొక్క వ్యాధులను, సౌమ్యములుగను మధురములుగను శీతలములుగను సుఖకరములుగను సుకుమారములుగను నుండు ఔషధములు ఆహారములు ఉపచారములు వీనిచే నుపచరింపవలయును. గర్భిణీస్త్రీకి వమనము విరేచనము నస్యము రక్తమోక్షము వీనిని చేయింపకూడదు. ఆస్థాపనవస్తినిగాని అనువాసనవస్తినిగాని ఎల్లప్పుడును చేయింపకూడదు. అనవసరమైన వ్యాధికలిగినచో చేయింపవచ్చును. ఎనిమిదవమాసము మొదలుకొని వమనము మొదలగువానిచేత నే సాధింపతగిన వ్యాధులు కలిగినయెడల మృదుద్రవ్యములతో చేయబడిన వమనాది కర్మలచేగాని అట్టిప్రయోజనమును చేయు ఇతరక్రియలచేగాని చికిత్సింపవలయును. గర్భిణీస్త్రీని తైలముతో నిండియున్న పాత్రినువలె క్షోభనుకలిగింపని క్రియలచే నుపచరింపవలయును.

మూ॥ సా చేదపచారాద్ద్వయోస్త్రిషు వా మాసేషు పుష్పం పశ్యేన్నాస్యా గర్భః స్థాస్యతీతి విద్యాత్, అజాతసారా హి తస్మిన్ కాలే భవన్తి గర్భాః ॥22॥

అ॥ గర్భిణీస్త్రీకి రెండవమాసమునందుగాని మూడవమాసమునందుగాని అపచారములవలన రజస్సు కనుపించినయెడల గర్భము నిలువదని తెలిసికొనవలయును. ఈ మాసములయందు గర్భము దృఢత్వమును పొందియుండదు.

గర్భస్థాపనవిధానములు.

మూ॥ సా చేచ్చతుర్ప్రభృతిషు మాసేషు క్రోధశోకాసూయేర్ష్యాభయత్రాసవ్యవాయవ్యాయామసంక్షోభ సంధారణవిషమాశన శయనస్థాన క్షుత్పిపాసాద్యతియోగాత్కదాహారాద్వా పుష్పం పశ్యేత్తస్యా గర్భస్థాపనవిధిముపదేక్ష్యామః, పుష్పదర్శనాదేవైనాం బ్రూయాత్ —శయనం తావన్మృదుసుఖశిశిరాస్తరణసంస్తీర్ణమీషదవనతిశిరస్కం ప్రతిపద్యస్వేతి; తతో యష్టిమధుకసర్పిర్భ్యాం పరమశిశిర

ధారిణి సంస్థితాభ్యాం పిచుమాప్లావ్యోపస్థసమీపే స్థాపయేత్తస్యాః, తథా శతధౌతసహస్రధౌతాభ్యాం సర్పిర్భ్యామధో నాభేః సర్వతః ప్రదిహ్యాత్, గవ్యేన చైనాం పయసా సుశీతేన మధుకామ్బునా వా న్యగ్రోధాదికషాయేణ వా పరిషేచయేదధో నాభేః, ఉదకం వా సుశీతమవగాహయేత్, క్షీరిణాం కషాయద్రుమాణాం చ స్వరసైః పీతాని చేలాని గ్రాహయేత్, న్యగ్రోధాదిసిద్ధయోర్వా క్షీరసర్పిషోః పిచుం గ్రాహయేత్, అతశ్చ పాణిమాత్రం ప్రాశయేత్ప్రాశయేద్వా కేవలం చ క్షీరసర్పిః, పద్మోత్పలకుముదకిఞ్జల్కాంశ్చాస్యై సమధుశర్కరాన్ లేహార్థం దద్యాత్, శృఙ్గాటకపుష్కరబీజకశేరుకాన్ భక్షణార్థం, గన్ధప్రియఙ్గ్వసితోత్పలశాలూకోదుమ్బరశలాటున్యగ్రోధశుఙ్గాని వా పాయయేదాజేన పయసా, పయసా చైనాం బలాతిబలాశాలిషష్టికేక్షుమూలకాకోలీశృతేన సమధుశర్కరం రక్తశాలీనామోదనం మృదుసురభిశీతం భోజయేత్, లావకపిఞ్జలకురఙ్గశమ్బరశశహరిణైణకాలపుచ్ఛకరసేన వా ఘృతసలిలసిద్ధేన సుఖశిశిరోపవాతదేశస్థాం భోజయేత్, తథా క్రోధశోకాయాసవ్యవాయవ్యాయామేభ్యశ్చాభిరక్షేత్, సౌమ్యాభిశ్చైనాం కథాభిర్మనోఽనుకూలాభిరుపాసీత, తథాఽస్యా గర్భస్తిష్ఠతి ॥23॥

అ॥ గర్భిణీస్త్రీ నాలుగవమాసము మొదలు కోపము శోకము అసూయ ఈర్ష్య భయము ఉద్వేగము మైథునము వ్యాయామము సంక్షోభము వేగధారణము విషమాహారము విషమశయనము విషమాసనము ఆకలి దప్పిక వీనిని అధికముగ పొందుటవలనగాని దుష్టమైనఆహారమును సేవించుటవలన గాని రజస్సు కనబడినయెడల అట్టిస్త్రీకి గర్భస్థాపనవిధానములను చెప్పుచున్నాము. రజస్సు కనపడగనే ఆమెకు, మెత్తగను సుఖకరముగను చల్లగనుండు వస్త్రాదులచే పరువబడినదిగను నున్న శయ్యయందు శిరస్సు పల్లముగ నుండునట్లు పరుండవలయునని చెప్పవలయును. పిమ్మట అతిమధురముతో కూడిన ఘృతమును మిక్కిలి చల్లగనున్న నీటియందుంచి ఆ నేతియందు దూదిని తడిపి యోనిపైన నుంచవలయును. శతధౌతఘృతమును గాని సహస్రధౌతఘృతమును గాని నాభియొక్క క్రిందిభాగమునందంతటను పూయవలయును. ఆవుపాలతో గాని యష్టిమధుకము చేర్చబడిన చల్లనిఉదకముచే గాని న్యగ్రోధాదిగణద్రవ్యములయొక్క కషాయముతో గాని నాభియొక్క క్రిందిభాగమును తడుపవలయును. లేక చల్లనిఉదకమునందు స్నానము చేయింపవలయును. కషాయరసము కలమఱ్ఱి మొదలగు క్షీరవృక్షముల యొక్క స్వరసమునందు తడుపబడిన గుడ్డలను యోనిపైన నుంచవలయును. న్యగ్రోధాదిగణద్రవ్యములతో తయారుచేయబడిన పాలయందు గాని నేతియందు గాని తడుపబడిన

దూడని యోని పైన నుంచవలయును. ఇట్టి పాలనుగాని, నేతినిగాని కర్ష పరిమాణముగ పానమునుకూడ చేయించవలయును లేక కేవలక్షీరము వలన జనించిన ఘృతమును పానము చేయింపవలయును. తామర నల్లకలువ తెల్లకలువ వీనియొక్క కింజల్కములను తేనె పంచదార వీనితో కలిపి ఈయవలయును పరికగడ్డ మెట్టతామర గింజలు నమ్మదుంపలు వీనిని తినిపింపవలయును. గంధకచోరములు ప్రేంఖణము నల్లకలువదుంప లేతవైన మేడికాయలు మఱ్ఱిచిగుళ్లు వీనిని మేకపాలయందు కలిపి పానము చేయింపవలయును. రక్తశాలి సంబంధమైనట్టియు తేనె నెయ్యి వీనితో కూడినట్టియు మృదువుగను సుగంధయుక్తముగను చల్లగను నున్నట్టియు అన్నమును, బల అతిబల వరివేళ్లు అరువది దినములకు ఫలించు వరియొక్క వేళ్ళు చెరకువేళ్ళు కాకోలి వీనితో కాచబడిన పాలతో భుజింపచేయవలయును. లావుకపిట్ట కపింజలపక్షి లేడి ఎఱ్ఱనిజింక కుందేలు ఇఱ్ఱి నల్లనియిఱ్ఱి కాలపుచ్ఛము వీనియొక్క మాంసరసమును నెయ్యి ఉదకము వీనితో తయారుచేసి దీనితోగాని సుఖముగను చల్లగను గాలికలదిగను నున్న ప్రదేశమునందు కూర్చునియున్న స్త్రీని భుజింపజేయవలయును. కోపము దుఃఖము ఆయాసము మైథునము వ్యాయామము వీనిని విడిచిపెట్టింప వలయును. సౌమ్యములైనట్టియు మనస్సునకు అనుకూలము లయినట్టియు కథలను చెప్పవలయును. ఇట్లు చేసినచో ఈ స్త్రీయొక్క గర్భము నిలుచును.

## ఉపవిష్టకోదర నాగోదరముల వివరణము.

మూ॥ యస్యాః పునరామాన్వయాత్పుష్పదర్శనం స్యాత్, ప్రాయస్తత్తస్యా గర్భబాధకం భవతి, విరుద్ధోపక్రమత్వాత్తయోః, యస్యాః పునరుష్ణతీక్ష్ణోపయోగాద్గర్భిణ్యా మహతి సంజాతసారే గర్భే పుష్పదర్శనం స్యాదన్యో వా యోనిప్రస్రావః, తస్యా గర్భో వృద్ధిం న ప్రాప్నోతి నిస్స్రుతత్వాత్. స కాలమవతిష్ఠతేఽతిమాత్రం, తముపవిష్టకమిత్యాచక్షతే కేచిత్, ఉపవాసవ్రతకర్మపరాయాః పునః కదాహారాయాః స్నేహద్వేషిణ్యా వాతప్రకోపణోక్తాన్యాసేవమానాయా గర్భో న వృద్ధిం ప్రాప్నోతి పరిశుష్కత్వాత్, స చాపి కాలమవతిష్ఠతేఽతిమాత్రం, అతిమాత్రస్పందనశ్చ భవతి, తం నాగోదరమిత్యాచక్షతే ॥ 4॥

అ॥ గర్భిణీ స్త్రీకి ఆమసంబంధము వలన రజోదర్శనమైనయెడల, గర్భస్రావమును ఆమమును పరస్పర విరుద్ధములగు చికిత్సలు కలవగుటవలన ఆట్టి రజోదర్శనము గర్భమునకు బాధను కలిగించునదిగ నుండును. గర్భము గొప్పదిగను దృఢత్వము కలదిగను నున్నను ఏగర్భిణీస్త్రీకి ఉష్ణవీర్యమును తీక్ష్ణగుణమును కల పదార్థములను సేవించుటవలన రజోదర్శనముగాని ఇతర విధములగుయోనిస్రావముగాని కలుగునో ఆట్టి స్త్రీయొక్క గర్భము స్రావము కలదగుటవలన వృద్ధినొందనేరదు. అట్టి గర్భము గర్భాశయమునందు చాలకాలము వరకు నుండును. దీనిని కొందరు ఉపవిష్టకోదరమని

చెప్పెదరు. ఉపవాసములను వ్రతములను కర్మలను ఆచరించునట్టియు దుష్టాహారమును సేవించునట్టియు స్నేహమును ద్వేషించునట్టియు వాతప్రకోపమును కలిగించునవిగ చెప్పబడిన వానిని సేవించునట్టియు గర్భిణీస్త్రీయొక్క గర్భము క్షీణించుట వలన వృద్ధినొందనేరదు. అట్టి గర్భముకూడ గర్భాశయమునందు చాలకాలమువరకు నుండును. మరియు నిది అధికముగ కదలచునుండును. దీనిని నాగోదరమని చెప్పెదరు.

ఉపవిష్టకోదర నాగోదములయొక్క చికిత్స.

మూ॥ నార్యోస్తయోరుభయోరపి చికిత్సితవిశేషముపదేక్ష్యామః—భౌతికజీవనీయబృంహణీయమధురవాతహరసిద్ధానాం సర్పిషాముపయోగః, నాగోదరే తు యోనివ్యాపన్నిర్దిష్టపయసామామగర్భాణాం గర్భవృద్ధికరాణాం చ, సంభోజనమేతైరేవ సిద్ధైశ్చ ఘృతాదిభిః సుభిక్షాయాః, అభీక్ష్ణం యానవాహనావమార్జనావజృమ్భణైరుపపాదనమితి ॥25॥

అ॥ ఉపవిష్టకోదరమును నాగోదరమును కల గర్భిణీస్త్రీలకు చికిత్సావిశేషమును చెప్పుచున్నాము. వీరికి— పిశాచాదిభూతములను నశింపచేయునట్టియు జీవనీయగణమునందు చెప్పబడినట్టియు బృంహణకరము లైనట్టియు మధురగణమునందు చెప్పబడినట్టియు వాతమును హరించునట్టియు ద్రవ్యములతో తయారుకాబడిన ఘృతములను ఈయవలయును. నాగోదరమునందు— యోనివ్యాపత్తులకు చెప్పబడిన పాలను ఆమగర్భములను (గుడ్లను) గర్భమునకు వృద్ధినికలిగించు ద్రవ్యములను ఉపయోగింపవలయును. మరియు ఈ ద్రవ్యములతో తయారుచేయబడిన ఘృతము మొదలగు వానితో భోజనమును ఆకలిగనున్నప్పుడు భుజింపచేయవలయును. యానములయందును వాహనములయందును ప్రయాణముచేయుట, స్నానముచేయుట, ఆవలింతలు కలుగుట వీనిని అధికముగ ఆచరించునట్లు చేయవలయును.

గర్భముకదలకుండునప్పుడు చేయవలసినవిధానము.

మూ॥ యస్యాః పునర్గర్భః ప్రసుప్తో న స్పన్దతే తాం శ్యేనమత్స్యగవయతిత్తిరితామ్రచూడశిఖినామన్యతమస్య సర్పిష్మతా రసేన మాషయూషేణ వా ప్రభూతసర్పిషా మూలకయూషేణ వా రక్తశాలీనామోదనం మృదుమధురశీతం భోజయేత్, తైలాభ్యఙ్గేన చాస్యా అభీక్ష్ణముదరవఙ్క్షణోరుకటీపార్శ్వపృష్ఠప్రదేశానీషదుష్ణేనోపాచరేత్ ॥26॥

అ॥ ఏస్త్రీయొక్క గర్భము అణగియుండి కదలకుండునో అట్టి స్త్రీకి— డేగ చేపలు గవయమృగము తిత్తిరిపక్షి కోడి నెమలి వీనిలో దేనియొక్క మాంసరసము

నైనను నేతితో సంస్కరించి దానితోగాని మినపకట్టుతోగాని అధికముగు నేతితో కూడిన మల్లంగికట్టుతోగాని రక్తశాలిసంబంధమైనట్టియు మృదువుగను మధురముగను శీతలముగను నున్నట్టియు అన్నమును భుజింపచేయవలయును. ఇట్టి స్త్రీయొక్క ఉదరము గజ్జలు తొడలు కటిప్రదేశము పార్శ్వములు పృష్ఠప్రదేశము వీనియందు కొంచె ముష్ణముగనున్న తైలమును అధికముగ పూయవలయును.

## గర్భిణీస్త్రీకికలుగు ఉదావర్తమునకు చికిత్స.

మూ॥ యస్యాః పునరుదావర్తవిబన్ధః స్యాదష్టమే మాసే న చానువాసనసాధ్యం మన్యేత, తతోఽస్యాస్తద్వికారప్రశమనముప కల్పయేన్నిరూహం, ఉదావర్తో హ్యుపేక్షితః సహసా సగర్భాం గ ర్భిణీం గర్భమథవాఽతిపాతయేత్, తత్ర వీరణశాలిషష్టికకుశకాశే క్షువాలికావేతసపరివ్యాధమూలానాంభూతీకానన్తాకాశ్మర్యపరూషక మధుకమృద్వీకానాం చ పయసాఽర్ధోదకేనోద్ధృతయ్యా రసం పియాల విభీతకమజ్జతిలకల్కసంప్రయుక్త మీషల్లవణమనత్యుష్ణం నిరూహం దద్యాత్, వ్యపగతబన్ధాం చైనాం సుఖసలిలపరిషిక్తాఙ్గీం స్థైర్యకర మవిదాహినమాహారం భుక్తవతీం సాయం మధుకసిద్ధేన తైలేనానువాస యేత్, న్యుబ్జాం త్వేనామాస్థాపనానువాసనాభ్యాముపచరేత్ ॥27॥

అ॥ గర్భిణీస్త్రీకి ఎనిమిదవ మాసమునందు ఉదావర్తమువలన విబంధము కలిగి, అనువాసనవస్తిని చేయుటకు వీలులేనిచో ఆ బాధతగ్గుటకై నిరూహవస్తిని చేయింపవలయును. ఉదావర్తమును చికిత్సింపక ఉపేక్షించినచో అది వెంటనే గర్భముతోకూడిన గర్భిణీస్త్రీనిగాని లేక కేవలగర్భమునుగాని నశింపచేయును. అట్టి ఉదావర్తమునందు అవురుకసవు వరి షష్టికధాన్యము దర్భ రెల్లు ఇక్షువాలిక యనెడి చెరకు ప్రబ్బలి నీటిపేము వీనియొక్క వేళ్ళను. కామంచిగడ్డి సుగంధిపాల పెద్ద మ్ముడు చిట్టీత అతిమధురము ద్రాక్ష వీనిని కలిపి సగము నీళ్ళుకలిసిన పాలతో కషా యము కాచి ఆకషాయమునందు చారపప్పు తానికాయపప్పు నువ్వులు వీని కల్క మును కొద్ది సైంధవలవణమును కలిపి కొంచెము వెచ్చగనున్న దానితో నిరూహవ స్తిని చేయవలయును. విబంధము పోయిన ఈ స్త్రీకి సుఖోష్ణముగనున్న ఉదక ముతో స్నానమునుచేయించి పిమ్మట స్థైర్యమును కలిగించునట్టియు విదాహమును కలిగింపనట్టియు ఆహారమును భుజింపచేసి అతిమధురముతో తయారుచేయబడిన తైల ముచే సాయంకాలమునందు అనువాసనవస్తిని చేయింపవలయును. ఇట్టి స్త్రీకి ఆస్థా పనవస్తినిగాని అనువాసనవస్తినిగాని అధోముఖము కలదిగనున్నప్పుడు చేయింప వలయును.

### గర్భము మృతినొందినప్పుడు కలుగులక్షణములు.

మూ॥ యస్యాః పునరతిమాత్రదోషోపచయాద్వా తీక్ష్ణోష్ణాతిమాత్రసేవనాద్వా వాతమూత్రపురీషవేగధారణైర్వా విషమాశనశయనస్థానసంపీడనాభిఘాతైర్వా, క్రోధశోకేర్ష్యాసూయాభయత్రాసాదిభిర్వా సాహసైర్వాఽపరైః కర్మభిరన్తఃకుక్షేర్గర్భో మ్రియతే, తస్యాః స్తిమితం స్తబ్ధ ముదర మాతతం శీతమశ్మాన్తర్గతమివ భవత్యస్పన్దనో గర్భః శూలమధికముపజాయతే న చాస్యాః ప్రాదుర్భవన్తి యోనిర్న పరిస్రవత్యక్షిణీ చాస్యాః స్రస్తే భవతస్తామ్యతి వ్యథతే భ్రమతే శ్వసిత్యరతిబహులా చ భవతి న చాస్యా వేగప్రాదుర్భావో యథావదుపలభ్యత ఇత్యేవంలక్షణాం స్త్రియం మృతగర్భేయమితి విద్యాత్ ॥28॥

ఆ॥ దోషములధికముగ కూడుకొనుటవలనగాని తీక్ష్ణగుణమును ఉష్ణవీర్యమును కల పదార్థములను అధికముగ సేవించుటవలనగాని వాతము మూత్రము పురీషము వీని యొక్క వేగములను అరికట్టుటవలనగాని విషమాహారము విషమశయనము విషముగ కూర్చొనుట పీడింపబడుట కొట్టబడుట వీనిలవలనగాని కోపము శోకము ఈర్ష్య అసూయ భయము ఉద్వేగము మొదలగువానివలనగాని ఇతరములైన సాహసకృత్యములవలనగాని కుక్షిలోపల గర్భము మృతినొందును. అట్టి స్త్రీయొక్క ఉదరము స్తిమితముగను స్తబ్ధముగను విస్తరింపబడినదిగను చల్లగను లోన రాయి కలదానివలెను నుండును. గర్భము కదలకుండ నుండును. అధికముగు శూల కలుగును. ప్రసవవేదనలు కలుగనేరవు. యోనియందు స్రావము కలుగదు. నేత్రములు జారినట్లుండును. మరియు నీ స్త్రీ మోహమునొందును. బాధనొందును. భ్రమనొందును. శ్వాసకలదియగును. సుఖము లేనిదిగనుండును. వేగములు సక్రమముగ ప్రవర్తింపనేరవు. ఇట్టి లక్షణములు కల స్త్రీని మృతినొందిన గర్భము కలదానినిగ తెలిసికొనవలయును.

### గర్భము మృతినొందినప్పుడు చేయవలసినచికిత్స.

మూ॥ తస్య గర్భశల్యస్య జరాయుప్రపాతనం కర్మ సంశమనమిత్యాహురేకే, మన్త్రాదికమథర్వవేదవిహితమిత్యేకే, పరిదృష్టకర్మణా శల్యహర్త్రాఽఽహరణమిత్యేకే॥ వ్యపగతగర్భశల్యాం తు స్త్రియమామగర్భాం సురాశీధ్వరిష్టమధుమదిమదిరాసవానామన్యతమమగ్రే సామర్థ్యతః పాయయేద్గర్భకోష్ఠవిశుద్ధ్యర్థమార్తివిస్మరణార్థం ప్రహర్షణార్థం చ, అతఃపరం బృంహణైర్బలానురక్షిభిః స్నేహసంప్ర

యుక్తైర్వ్వావాగ్వాదిభిర్వా తత్కాలయోగిభిరాహారై రుపాచరేద్దోష ధాతుక్లేదవిశోషణమాత్రం కాలం, అతఃపరం స్నేహపానైర్వస్తిభి రాహారవిధిభిశ్చ దీపనీయజీవనీయబృంహణీయమధురవాతహరసమా ఖ్యాతైరుపచరేత్, పరిపక్వగర్భశల్యాయాః పునర్వ్యముక్తగర్భశల్యా యాస్తదహరేవ స్నేహోపచారః స్యాత్ ॥30॥

ఆ॥ శల్యరూపముగనున్న మృతగర్భమునందు జరాయువు (మావి) పడునట్లు చేయుట అనుకూలముగనుండునని కొందరు చెప్పుచున్నారు. అథర్వణవేదమునందు చెప్పబడిన మంత్రాదికర్మలు ఉపయోగములుగనుండునని కొందరు చెప్పుచున్నారు. కర్మలయందు అనుభవముగల శస్త్రచికిత్సకునిచే తీసివేయబడవలయునని కొందరు చెప్పుచున్నారు. శల్యభూతమైన మృతగర్భమును తీసివేసిన పిదప పచ్చిగనున్న గర్భాశయముగల ఆ స్త్రీకి గర్భకోష్ఠము శుద్ధినొందుటకును బాధ మరచిపోవుటకును ఉత్సాహము కలుగుటకును సుర శీధువు అరిష్టము మధువు మదిర ఆసవము అను మద్యములలో దేనినైనను సామర్థ్యము ననుసరించి తగినంత నీయవలయును. అటుపిమ్మట బృంహణములైనట్టియు బలమును కలిగించునట్టియు స్నేహముతోకూడినట్టియు యవాగువు మొదలగు వానినిగాని అట్టికాలమునందుపయోగించు ఆహారములనుగాని దోషములయందలియు ధాతువులయందలియు క్లేదము ఆరిపోవువరకు ఈయవలయును. దీపనములును జీవనీయములును బృంహణములును మధురములును వాతహరములును నగు ద్రవ్యములతో తయారుచేయబడిన స్నేహపానములచేతను వస్తులచేతను ఉపచరింపవలయును. మృతగర్భము తీసివేయబడి గర్భాశయము ఆరినపిదప వెంటనే స్నేహద్రవ్యములతో ఉపచారమును చేయవలయును.

### మాసక్రమమున ననుసరించి చేయవలసినవిధానము.

మూ॥ పరమతో నిర్వికారమాప్యాయమానస్య గర్భస్య మాసే మాసే కర్మోపదేక్ష్యామః—ప్రథమే మాసే శఙ్కితా చేద్గర్భమాపన్నా క్షీరమనుపస్కృతం మాత్రావచ్ఛీతం కాలే కాలే పిబేవ స్వర్తత్నీ, సాత్మ్యమేవ చ భోజనం సాయం ప్రాతశ్చ భుఞ్జీత, ద్వితీయే మాసే క్షీరమేవ చ మధురౌషధసిద్ధం, తృతీయే మాసే క్షీరం మధుసర్పిర్భ్యాముపసంసృజ్య, చతుర్థే మాసే తు క్షీరనవనీతమక్ష మాత్రమశ్నీయాత్, పఞ్చమే మాసే క్షీరసర్పిః; షష్ఠే మాసే క్షీర సర్పిర్మధురౌషధసిద్ధం, తదేవ సప్తమే మాసే, తత్ర గర్భస్య కేశా జాయమానా మాతుర్విదాహం జనయన్తీతి స్త్రియో భాషన్తే, తన్నేతి భగవానాత్రేయః, కిన్తు గర్భోత్పీడనాద్ధి వాతపిత్తశ్లేష్మాణ

ఉరః పార్శ్వం విదహన్తి, తతః కణ్డూరుపజాయతే, కణ్డూమూలా చ కిక్కిశావాస్తిర్భవతి, తత్ర కోలోదకేన నవనీతస్య మధురౌషధ సిద్ధస్య పాణితలమాత్రం కాలే కాలేఽస్యై దద్యాత్, చన్దనమృణాల కల్కైశ్చాస్యాః స్తనోదరం విమృద్నీయాత్ శిరీషధాతకీసర్షపమధుక చూర్ణైః కుటజార్జకబీజముస్తహరిద్రాకల్కైర్వా నిమ్బకోలసురసమ జ్జిష్ఠాకల్కైర్వా పృషతహరిణశశరుధిరయుతయా త్రిఫలయా వా, కర వీరపత్రసిద్ధేన వా తైలేనాభ్యఙ్గః, పరిషేకః పునర్మాలతీమధుక సిద్ధేనామ్భసా, జాతకణ్డూశ్చ కణ్డూయనం వర్జయేత్త్వగ్భేదవైరూప్య పరిహారార్థం, అశక్యాయాం తు కణ్డ్వాముन्मర్దనోద్ఘర్షణాభ్యాం పరిహా రః స్యాత్, మధురమాహారజాతం వాతహరమల్పమల్పస్నేహలవణ మల్పోదకానుపానం చ భుఞ్జీత, అష్టమే తు మాసే క్షీరయవాగూం సర్పిష్మతీం కాలే కాలే పిబేత్, తన్నేతి భద్రకాప్యః, పైఙ్గల్యా బాధో హ్యస్యా గర్భమాగచ్ఛేదితి. అస్త్వత్ర పైఙ్గల్యాబాధ ఇత్యా హ భగవాన్ పునర్వసురాత్రేయః, న హ్యేతదకార్యం, ఏవం కుర్వతీ హ్యారోగ్యబలవర్ణస్వరసంహననసంపదుపేతం జ్ఞాతీనాం శ్రేష్ఠ మపత్యం జనయతి, నవమే తు ఖల్వేనాం మాసే మధురౌషధసిద్ధేన తైలేనానువాసయేత్, అతశ్చైవాస్యాస్తైలపిచుం యోనౌ ప్రణయే ద్గర్భస్థానమార్గస్నేహనార్థం; యదిదం కర్మ ప్రథమం మాసముపా దాయోపదిష్టమానవమాన్మాసాత్, తేన గర్భిణ్యా గర్భసమయే గర్భధారణే కుక్షికటీపార్శ్వపృష్ఠం మృదు భవతి, వాతశ్చానులోమః సంపద్యతే, మూత్రపురీషే చ ప్రకృతిభూతే సుఖేన మార్గావప ద్యేతే, చర్మనఖాని చ మార్దవముపయాన్తి, బలవర్ణౌ చోపచీ యేతే, పుత్రం చేష్టం సంపదుపేతం సుఖినం సుఖేనైషా కాలే ప్రజా యత ఇతి ॥31॥

అ॥ వికారములు లేకుండ వృద్ధిపొందుచున్న గర్భమునకు ప్రతిమాసమునందును చేయతగిన విధానమును చెప్పుచున్నాము. గర్భమును పొందినట్లు ఊహించినచో ఆట్టి స్త్రీ ప్రథమమాసమునందు, సంస్కరింపబడనట్టియు చల్లగనున్నట్టియు పాలను ఆయాకాలములయందు తగుపరిమాణముగ పానము చేయవలయును. మరియు సాత్మ్యమైన ఆహారమును ప్రాతఃసాయంకాలములయందు భుజింపవలయును. రెండవమాసమునందు, మధురద్రవ్యములతో కాచబడిన పాలనే త్రాగవలయును. మూడవమాసము

నందు, తేనె నెయ్యి వీనినికలిపిన పాలను త్రాగవలయును. నాలుగవమాసమునందు, క్షీరమునుండితీయబడిన వెన్నను కర్ష పరిమితిగ తినవలయును. అయిదవమాసమునందు, పాలనుండిజనించిన ఘృతమును పుచ్చుకొనవలయును. ఆరవమాసమునందు, క్షీరమునుండిజనించిన ఘృతమును మధురద్రవ్యములతో తయారుచేసి పుచ్చుకొనవలయును. ఏడవమాసమునందు, ఆరవమాసమునందువలెనే చేయవలయును. ఈ ఏడవమాసమునందు గర్భమునకు కేశములుజనించుటవలన తల్లికివిదాహముకలుగునని స్త్రీలుచెప్పెదరు. అట్లు కాదని ఆత్రేయుడు చెప్పెను. గర్భముచే పీడింపబడుటవలన వాతపిత్తశ్లేష్మములు తల్లియొక్క వక్షఃస్థలమును పొంది విదాహమును కలిగించును. అందువలన దురద కలుగును. దురదవలనకిక్కిసమనెడివ్యాధికలుగును అప్పుడు, మధురద్రవ్యములతో తయారుచేయబడిన వెన్నను రేగుపండ్లరసముతో కర్ష పరిమితిగ ఆయాకాలములయందు తినవలయును. చందనము తామరతూండ్లు వీనియొక్క కల్కముతోగాని దిరిసెన ఆరెపువ్వు ఆవాలు యష్టిమధుకము వీనియొక్క చూర్ణముతోగాని కోడిసెపాల భూతులసిగింజలు తుంగగడ్డలు పసుపు వీనియొక్క కల్కముతోగాని వేప రేగు తులసి మంజిష్ఠ వీనియొక్క కల్కముతోగాని జింక లేడి కుందేలు వీనిరక్తముతోకూడిన త్రిఫలాకల్కముతోగాని ఈస్త్రీయొక్క స్తనములయందును ఉదరమునందును పూయవలయును. లేక గన్నేరుఆకులతో తయారుచేయబడిన తైలమును పూయవలయును. మాలతి అతిమధురము వీనితో కాచబడిన జలముచే తడుపవలయును. దురదకలిగినను చర్మముచిట్లుటయు వికృతియు కలుగకుండుటకై గోకుటను మానివేయవలయును. దురదను సహింపలేనిచో వత్తుట రాచుట వీనిచే దురదను శమింపజేయవలయును మధురరసప్రధానమైనట్టియు, వాతహరమైనట్టియు. స్నేహమును లవణమును కొద్దిగకలిసినట్టియు ఆహారమును భుజింపవలయును. అట్లు భుజించినప్పుడు ఉదకమును స్వల్పముగ త్రాగవలయును. ఎనిమిదవ మాసమునందు, పాలతో తయారుచేయబడిన యవాగువునందు నేతిని కలిపి ఆయాకాలములయందు త్రాగవలయును. గర్భమునకు పింగళవర్ణముగల నేత్రములు జనించును గావున అట్లు త్రాగకూడదని భద్రకాప్యుడుచెప్పెను. పింగళవర్ణముగల నేత్రములుజనించుగాక. అయినను త్రాగవచ్చును. అని ఆత్రేయుడు చెప్పెను. అట్లుత్రాగినచో రోగములులేనిదై ఆరోగ్యము బలము వర్ణము స్వరము నిర్మాణము వీనియొక్క సంపత్తితోకూడినట్టియు వంశములో శ్రేష్ఠమైనట్టియు సంతానమునుకనును. తొమ్మిదవమాసమునందు, మధురద్రవ్యములతో తయారుచేయబడిన తైలముచే అనువాసనవస్తిని చేయింపవలయును. గర్భాశయమునకును మార్గమునకును స్నైగ్ధ్యము కలుగునిమిత్తము ఈతైలమునందు దూదినిముంచియోనియందుంచవలయును. మొదటిమాసము మొదలుకొని తొమ్మిదవమాసమువరకు చెప్పబడిన ఈ కర్మను ఆచరించినచో గర్భిణీ స్త్రీకి గర్భధారణసమయమునందు కుక్షిప్రదేశము కటిప్రదేశము పార్శ్వములు పృష్ఠభాగము ఇవి మృదువుగనుండును. వాతము అనులోమముగనుండును. మూత్రపురీషములు ప్రకృతిగనుండి వానిమార్గములనుండి సుఖముగ బయలువెడలును చర్మమును గోళ్ళును మృదువులుగ నుండును. బలమును వర్ణ

మును వృద్ధిఁ బొందును. సంపత్తితో కూడినట్టియు సుఖవంతుఁడైనట్టియు ఇష్టుఁడైనట్టియు పుత్రుని సకాలమునందు సుఖముగఁ గనును.

సూతికాగారనిర్మాణవిధి.

మూ॥ ప్రాక్చైవాస్యా నవమాన్మాసాత్సూతికాగారం కారయేదపహృతాస్థిశర్కరాకపాలే దేశే ప్రశస్తరూపరసగన్ధాయాం భూమౌ ప్రాగ్ద్వారముదగ్ద్వారం వా బైల్వానాం కాష్ఠానాం తైన్దుకైఙ్గుదకానాం భల్లాతకానాం వారుణానాం ఖాదిరాణాం వా, యాని చాన్యాన్యపి బ్రాహ్మణాః శంసేయురథర్వవేదవిదః, తద్వసనాలేపనాచ్ఛాదనాపిధానసంపదుపేతం వాస్తువిద్యాహృదయయోగాగ్నిసలిలోలూఖలవర్చఃస్థానస్నానభూమిమహానససమ్యృతుసుఖం చ ॥32॥

అ॥ గర్భిణీస్త్రీకి తొమ్మిదవ మాసము రాకుండగనే సూతికాగారమును ఈ క్రింద చెప్పబోవు విధమున నిర్మింపవలయును. ఎముకలును రాళ్ళును పెంకులును తీసి వేయఁబడిన ప్రదేశమునందు ప్రశస్తములైన రూపము రసము గంధము ఇవికల భూమి యందు, మారేడు లొద్దుగ గార నల్లజీడి ఉరుగుడు చండ్ర వీనిలో దేనియొక్క కర్రల చేనైనను గాని అథర్వవేదము తెలిసిన బ్రాహ్మణులచే ప్రశస్తములైనవని చెప్పఁబడిన ఇట్టి ఇతరములైన కర్రలచే గాని సూతికాగృహమును తూర్పుముఖముగ గాని ఉత్తర ముఖముగ గాని నిర్మింపవలయును. ఆగృహము — వస్త్రములు పూతలు కప్పుతలుపులు వీనియొక్క సంపత్తుతో కూడినదిగను వాస్తువిద్యాతత్త్వము తెలిసినవారిచే చెప్పఁబడిన విధముగ నున్న అగ్నిస్థానము ఉదకస్థానము రోలు మలవిసర్జన ప్రదేశము స్నాన ప్రదేశము వంటయిల్లు ఇవికలదిగను ఆయా ఋతువులకు అనుకూలమైనదిగను నుండవలయును.

సూతికాగారసంభారములు.

మూ॥ తత్ర సర్పిస్తైలమధుసైన్ధవసౌవర్చలకాలలవణవిడఙ్గకుష్ఠకిలిమనాగరపిప్పలీపిప్పలీమూలహస్తిపిప్పలీమణ్డూకపర్ణ్యేలాలాఙ్గలీవచాచవ్యచిత్రకచిరబిల్వహిఙ్గుసర్షపలశునకతకకణకణికానీపాతసీబల్వజభూర్జకులత్థమైరేయసురాసవాః సన్నిహితాః స్యుః; తథాఽశ్మానౌ ద్వౌ, ద్వే చణ్డముసలే, ద్వే ఉదూఖలే, ఖరో వృషభశ్చ, ద్వౌ చ తీక్ష్ణౌ సూచీపిప్పలకౌ సౌవర్ణరాజతౌ, శస్త్రాణి చ తీక్ష్ణాయసాని, ద్వౌ చ బిల్వమయౌ పర్యఙ్కౌ, తైన్దుకైఙ్గుదాని చ కాష్ఠాన్యగ్నిసన్ధుక్షణాని, స్త్రియశ్చ బహ్వ్యో బహుశః ప్రజాతాః సౌహార్దయుక్తాః సతతమనురక్తాః ప్రదక్షిణాచారాః ప్రతిపత్తికుశలాః ప్రకృతివత్సలా

స్త్ర్య.క్తవిషాదాః క్లేశసహిన్యోఽభిమతాః, బ్రాహ్మణాశ్చాథర్వవేదవిదో యచ్చాన్యదపి తత్ర సమర్థం మన్యేత, యచ్చాన్యచ్చ బ్రాహ్మణా బ్రూయుః యశ్చ స్త్రీవృద్ధాస్తత్కార్యమ్ ॥33॥

అ॥ ఆసూతికాగృహమునందు-ఘృతము తైలము తేనె సైంధవలవణము సౌవర్చలవణము కృష్ణలవణము వాయువిడంగములు చెంగల్వకోష్టు దేవదారు శుంఠి పిప్పళ్ళు మోడి గజపిప్పళ్ళు మండూకబ్రహ్మి ఏలకులు పాత్రింపు వస చవ్యము చిత్రమూలము నెమలడుగుచెట్టు ఇంగువ ఆవాలు వెల్లుల్లి చిల్లగింజ జీలకర్ర గోధుమగవ్వ కడమి అవిసె బల్బజమనెడిగడ్డి భూర్జపత్రి ఉలవలు మైరేయమనెడిమద్యము సురయనెడిమద్యము ఆసవములు వీనిని సిద్ధముగనుంచవలయును. మరియు రెండురాళ్ళు, రెండుబరువైనరోకళ్ళు, రెండురోళ్ళు, ఒకగాడిద, ఒకయెద్దు, బంగారముతో గాని వెండితో గాని చేయబడినట్టియు తీక్ష్ణములైనట్టియు పెద్దవైనట్టియు రెండుసూదులు, తీక్ష్ణలోహముతో చేయబడిన శస్త్రములు, మారేడుకర్రతో చేయబడిన రెండు మంచములు, అగ్నిని ప్రజ్వలింపచేయుటకు తుమికి గార వీని సంబంధమగు కట్టెలు వీనిని ఉంచవలయును. మరియు అనేకమందిని కనినట్టియు మంచిమనస్సుతో కూడినట్టియు అనురాగముతో కూడినట్టియు శ్రేష్ఠమైన ఆచారములు కలిగినట్టియు ప్రతిపత్తియందు నేర్పరులైనట్టియు ప్రేమగల ప్రకృతి కలిగినట్టియు విచారము లేనట్టియు కష్టములను సహించునట్టియు అనేకమది స్త్రీలు ఉండవలయును. అథర్వవేదమును తెలిసిన బ్రాహ్మణులు ఉండవలయును. అవసరమైన ఇట్టి ఇతరములనుకూడనుంచవలయును. మరియు బ్రాహ్మణులును వృద్ధస్త్రీలును చెప్పునట్టి ఇతరులనుకూడ నుంచవలయును.

### సూతికాగారప్రవేశవిధి.

మూ॥ తతః ప్రవృత్తే నవమే మాసే పుణ్యేఽహని ప్రశస్తనక్షత్రయోగముపగతే ప్రశస్తే భగవతి శశిని కల్యాణే కరణే మైత్రే ముహూర్తే శాన్తిం కృత్వా గోబ్రాహ్మణమగ్నిముదకం చాదౌ ప్రవేశ్య గోభ్యస్తృణోదకం మధులాజాంశ్చ ప్రదాయ బ్రాహ్మణేభ్యోఽక్షతాన్సుమనసో నాన్దీముఖాని చ ఫలానీష్టాని దత్త్వా, ఉదకపూర్వమాసనస్థేభ్యోఽభివాద్య పునరాచమ్య స్వస్తి వాచయేత్. తతః పుణ్యాహశబ్దేన గోబ్రాహ్మణమనువర్తమానా ప్రదక్షిణం ప్రవిశేత్సూతికాగారం, తత్రస్థా చ ప్రసవకాలం ప్రతీక్షేత ॥34॥

అ॥ తొమ్మిదవ మాసమువచ్చినపిదప, శుభదినమునందు ప్రశస్తమైన నక్షత్రములతో కూడినట్టియు అనుకూలమైనచంద్రుడు కలిగినట్టియు శుభకరములైనకరణములు కలిగినట్టియు మిత్రదేవతాకమైనట్టియు ముహూర్తమునందు శాంతిహోమమును చేసి గోవులను బ్రాహ్మణులను అగ్నిని ఉదకపాత్రను ముందుగ ప్రవేశపెట్టి గోవు

లకు గడ్డిని ఉదకమును తేనెను నేలాలను ఇచ్చి బ్రాహ్మణులకు అక్షతలను పుష్పములను సాంద్రీముఖమునకు ఉపయోగించు ఫలములను ఇచ్చి ఆసనములయందు కూర్చుండబెట్టి నీటితో కాళ్ళుకడిగి నమస్కరించి తిరిగి ఆచమనమును చేసి ఆశీర్వచనములను పొందవలయును పిమ్మట మంగళవాక్యములతో గోవులను బ్రాహ్మణులను ప్రదక్షిణ పూర్వకముగ అనుసరించుచు సూతికాగృహమును ప్రవేశింపవలయును. అచ్చట నున్నదై ప్రసవకాలమును నిరీక్షించుచుండవలయును.

## ఆసన్నప్రసవలక్షణములు.

మూ॥ తస్యాస్తు ఖల్విమాని లిఙ్గాని ప్రజనన కాలమభితో భవన్తి. తద్యథా—క్లమో గాత్రాణాం, గ్లానిరాననస్య; అక్ష్ణోః శైథిల్యం, విముక్తబన్ధనత్వమివ వక్షసః. కుక్షేరవస్రంసనం, అధో గురుత్వం, వఙ్క్షణవస్తికటీకుక్షిపార్శ్వపృష్ఠనిస్తోదః, యోనేః ప్రస్రవణం, అనన్నాభిలాషశ్చేతి, తతోఽనన్తరమావీనాం ప్రాదుర్భావః ప్రసేకశ్చ గర్భోదకస్య ॥35॥

అ॥ గర్భిణీ స్త్రీకి ప్రసవకాలము సమీపించినప్పుడు—శరీరము బడలికనొందుట ముఖము వాడుట, నేత్రములు జారినట్లుండుట, వక్షఃస్థలము పట్టువిడిపోయినట్లుండుట, కుక్షిప్రదేశము జారుట, క్రిందిభాగము బరువుగనుండుట, గజ్జలు వస్తిప్రదేశము కటిప్రదేశము కుక్షి పార్శ్వములు నడుము వీనియందు పొడిచినటుల బాధకలుగుట, యోనియందు స్రావము కలుగుట, ఆహారమునందిష్టము లేకపోవుట ఈ లక్షణములు కలుగును. పిమ్మట ప్రసవవేదనలు ప్రారంభమగుటయు గర్భోదకము స్రవించుటయు కలుగును.

## ప్రసవవేదనలు కలిగినపిదప చేయవలసినవిధానము.

మూ॥ ఆవీప్రాదుర్భావే తు భూమౌ శయనం విదధ్యాన్మృద్వాస్తరణోపపన్నం, తదధ్యాసీత సా, తాం తాః సమన్తతః పరివార్య యథోక్తగుణాః స్త్రియః పర్యుపాసీరన్నాశ్వాసయన్త్యో వాగ్భిర్గ్రాహణీయాభిః సాన్త్వనీయాభిః ॥36॥

అ॥ ప్రసవవేదనలు ప్రారంభింపగనే, మృదువైన ఆస్తరణముతో కూడినట్టియు భూమిమీద పరువబడినట్టియు శయనమును అధిష్ఠింపవలయును. పూర్వమునందు చెప్పబడిన గుణములతో కూడిన స్త్రీలు ఆగర్భిణీస్త్రీని పరివేష్టించియుండి అనుకూలములైనట్టియు ఓదార్చునట్టియు వాక్యములచే ఓదార్చుచు ఉపచరింపవలయును.

ప్రసవవేదనలుకలిగియు ప్రసవింపనప్పుడు చేయవలసినవిధి.

మూ॥ సా చేదాభిః సంక్లిశ్యమానా న ప్రజాయేతాథైనాం బ్రూయాత్ — ఉత్తిష్ఠ ముసలమన్యతరత్ గృహ్ణీష్వానేనైతదుదూఖలం ధాన్యపూర్ణం ముహుర్ముహురభిజహి ముహుర్ముహురవజృంభస్వ చఙ్క్రమస్వ చాన్తరాన్తరా, ఇత్యేవముపదిశన్త్యేకే॥ తన్నేత్యాహ భగవానాత్రేయః — దారుణవ్యాయామవర్జనం హి గర్భిణ్యాః సతతముపదిశ్యతే, విశేషతశ్చ ప్రజననకాలే ప్రచలితసర్వధాతుదోషాయాః సుకుమార్యా నార్యా ముసలవ్యాయామసమీరితో వాయురన్తరం లబ్ధ్వా ప్రాణాన్ హింస్యాత్, దుష్ప్రతీకారతమా హి తస్మిన్ కాలే విశేషేణ భవతి గర్భిణీ, తస్మాన్ముసలగ్రహణం పరిహార్యమృషయో మన్యన్తే, జృమ్భణం చఙ్క్రమణం చ పునరనుష్ఠేయమితి॥ అథాస్యై దద్యాత్కుష్ఠైలాలాఙ్గలికీవచాచిత్రకచిరబిల్వచూర్ణముపాఘ్రాతుం, సా తన్ముహుర్ముహురుపజిఘ్రేత్, తథా భూర్జపత్రధూమం శింశపాధూమం వా, తస్యాశ్చాన్తరాన్తరా కటీపార్శ్వపృష్ఠసక్థిదేశానీషదుష్ణేన తైలేనాభ్యజ్యానుసుఖమనుమృద్నీయాత్, ఇత్యనేన తు కర్మణా గర్భోఽవపద్యతే ॥39॥

అ॥ ప్రసవవేదనలచే బాధపడుచు ప్రసవింపకుండనున్న స్త్రీకి — "లెమ్ము. రోకలిని తీసికొనుము. ధాన్యముతో నింపబడిన రోలును మాటిమాటికి దంపుము. తరుచు ఆవలింపుము. అటునిటుతిరుగుము" అని చెప్పవలయునని కొందరు చెప్పెదరు. అది మంచిదికాదని ఆత్రేయుడు చెప్పెను. గర్భిణీస్త్రీ దారుణమైన వ్యాయామమును ఎల్లప్పుడును విసర్జింపవలయునని చెప్పబడినది. ప్రసవకాలమునందు విశేషించి చలించుచున్న సమస్తధాతువులును దోషములును కలిగినట్టియు సుకుమారముగనుండునట్టియు గర్భిణీస్త్రీ రోకలిచే పరిశ్రమచేసినచో వాతము ప్రకోపించి అవకాశమునుపొంది ప్రాణములను హింసించును. అందువలన రోకలిచే పరిశ్రమచేయకూడదని ఋషులు చెప్పిరి. ఆవలింతలను ఇటునటుతిరుగుటనుమాత్రము చేయవచ్చును. ఈ స్త్రీకి చెంగల్వకోష్టు ఏలకులు పొత్తిదుంప వస చిత్రమూలము నెమలడుగుచెట్టు చక్కమువీనియొక్క చూర్ణమును ఆఘ్రాణించు నిమిత్తము ఈయవలయును. ఆమె ఆచూర్ణమును తరుచు ఆఘ్రాణింపవలయును. మరియు భుజపత్రధూమమునుగాని ఇరుగుడుధూమమునుగాని ఆఘ్రాణింపవలయును. ఈ స్త్రీయొక్క కటిప్రదేశము పార్శ్వములు నడుము తొడలు వీనిని కొద్దిగ వెచ్చగనున్న తైలముతో అప్పుడప్పుడు పూసి సుఖముగనుండునట్లు పిసుకవలయును. ఈ విధానములచే గర్భము క్రిందకు దిగును.

మూ॥ స యదా జానీయాద్విముచ్య హృదయముదరమస్యా స్త్వావిశతి, వస్తిశిరోఽవగృహ్ణాతి, త్వరయన్త్యేనామావ్యాః, పరివర్తతే ఽధో గర్భ ఇతి, అస్యామవస్థాయాం పర్యఙ్కమేనామారోప్య ప్రవాహితుముపక్రమయేత్, కర్ణే చాస్యా మన్త్రమిమమనుకూలా స్త్రీ జపేత్॥ 'క్షితిర్జలం వియత్తేజో వాయుర్విష్ణుః ప్రజాపతిః। సగర్భాం త్వాం సదా పాన్తు వైశల్యం చ దిశన్తు తే ॥ ప్రసువ త్వమవిక్లిష్ట మవిక్లిష్టా శుభాననే। కార్తికేయద్యుతిం పుత్రం కార్తికేయాభిరక్షితమ్' ఇతి ॥ తాశ్చైనాం యథోక్తగుణాః స్త్రియోఽనుశిష్యుః—అనాగతావీర్మా ప్రవాహిష్ఠాః, యా హ్యనాగతావీః ప్రవాహయతే వ్యర్థమేవాస్యాస్తత్కర్మ భవతి, ప్రజా చాస్యా వికృతిమాపన్నా శ్వాసకాసశోషప్లీహాపప్రసక్తా వా భవతి, యథా హి క్షవథూద్గారవాతమూత్రపురీష వేగాన్ ప్రయతమానోఽప్యప్రాప్తకాలాన్న లభతే కృచ్ఛ్రేణ వాప్యవాప్నోతి తథాఽనాగతకాలం గర్భమపి ప్రవాహమాణా, తథా చైషామేవ క్షవథ్వాదీనాం సంధారణముపఘాతాయోపపద్యతే తథా ప్రాప్తకాలస్య గర్భస్యాప్రవాహణం. సా యథానిర్దేశం కురుష్వేతి వక్తవ్యా, తథా చ కుర్వతీ శనైః శనైః పూర్వం ప్రవాహేత తతోఽనన్తరం బలవత్తరం. తస్యాం చ ప్రవాహమాణాయాం స్త్రియః శబ్దం కుర్యుః 'ప్రజాతా ప్రజాతా ధన్యం ధన్యం పుత్రం' ఇతి, తథాఽస్యా హర్షేణాప్యాయన్తే ప్రాణాః ॥43॥

అ॥ గర్భము ఎప్పుడు ఈస్త్రీయొక్క హృదయమునువిడిచి ఉదరమునుపొంది వస్తిశిరస్సునుపొందునో అప్పుడు ప్రసవవేదనలు అధికమగును. అప్పుడుగర్భముక్రిందకు తిరిగినట్లుతలచి ఈమెనుశయ్యయందుఅధిష్టింపజేసిముక్కునట్లుచేయవలయును. మరియు అనుకూలమైనస్త్రీ ఈమెయొక్క చెవియందు 'క్షితిర్జలం ...... కార్తికేయాభిరక్షితమ్' అనెడిమంత్రమును పఠింపవలయును. పూర్వమునందు చెప్పబడినగుణములుగల ఆ స్త్రీలు ఈమెతో "ప్రసవవేదనలు లేనప్పుడుముక్కకుము. ప్రసవవేదనలు లేనప్పుడు ముక్కినయెడల ఈముక్కుటవలనప్రయోజనముండదు. అప్పుడుశిశువుజనించినను వికృతినొందిశ్వాసకాసశోషప్లీహవ్యాధులతోకూడుకొనినది యగునుపొందబడనికాలమునందు ప్రయత్నించినను తుమ్ము త్రేణుపుఅపానవాతము మూత్రము పురీషమువీనియొక్క వేగములను పొందనేరడు. లేదా కష్టముచేపొందును. అటులనే అకాలమునందు ముక్కినను గర్భము బయలువెడలనేరదు లేదాకష్టముచేబయలువెడలును. తుమ్ము మొదలగు వానిని ఆరికట్టినచో విఘాతము కలుగువిధముననే సకాలమునందుగర్భమును ముక్కక

పోయినచో విఘాతము కలుగును. అందువలన నేను చెప్పినవిధమున చేయుము'' అని చెప్పవలయును. గర్భిణీస్త్రీ అట్లుచేయవలచినదై తొలుత మెల్లగ ముక్కి పిమ్మట అధికముగ ముక్కవలయును. ఆస్త్రీ అట్లు ముక్కునప్పుడు స్త్రీలు మిక్కిలి శ్రేష్ఠుడైన పుత్రుని కనుచున్నది'' అని శబ్దమును చేయవలయును. అట్లు చేసినచో ఈ స్త్రీ యొక్క ప్రాణములు సంతోషముతో పూరింపబడును.

ప్రసవానంతరకర్మ.

మూ॥ యదా చ ప్రజాతా స్యాత్తదైనామవేక్షేత కాచిదస్యా అపరా ప్రపన్నా అప్రపన్నా వేతి। తస్యాశ్చేదపరా న ప్రపన్నా స్యాదథైనామన్యతమా స్త్రీ దక్షిణేన పాణినా నాభేరుపరిష్టాద్బలవన్నిపీడ్య సవ్యేన పృష్ఠత ఉపసంగృహ్య సునిర్ధూతం నిర్ధునుయాత్, అథాస్యాః పాదపార్ష్ణ్యా శ్రోణీమాకోటయేత్, తస్యాః స్ఫిచావుపసంగృహ్య సుపీడితం పీడయేత్, అథాస్యా బాలవేణ్యా కణ్ఠతాలు పరిమృశేత్, భూర్జపత్రకాచమణిసర్పనిర్మోకైశ్చాస్యా యోనిం ధూపయేత్, కుష్ఠతాలీసకల్కం బల్వజయూషే మైరేయసురామణ్డే తీక్ష్ణే కౌలత్థే వా మణ్డూకపిప్పలీసంపాకే వా సంప్లావ్య పాయయేదేనాం, తథా సూక్ష్మైలాకిలిమకుష్ఠనాగరవిడఙ్గకాలాగురుచవ్యపిప్పలీచిత్రకోపకుఞ్చికాకల్కం ఖరవృషభస్య వా జీవతో దక్షిణం కర్ణముత్కృత్య దృషది జర్జరీకృత్య బల్వజయూషాదీనామన్యతమేన ప్లావనానామన్యతమస్మిన్ ప్రక్షిప్యాప్లావ్య ముహూర్తస్థితముద్ధృత్య తదాప్లావనం పాయయేదేనాం, శతపుష్పాకుష్ఠమదనహిఙ్గుసిద్ధస్య చైనాం తైలస్య పిచుం గ్రాహయేత్, అతశ్చైవానువాసయేత్, ఏతైరేవ చాప్లావనైః ఫలజీమూతకేక్ష్వాకుధామార్గవకుటజకృతవేధనహస్తిపిప్పల్యుపహితైరాస్థాపయేత్, తదాస్థాపనమస్యా హి సహ వాతమూత్రపురీషైర్నిర్హరత్యపరామాసక్తాం వాయోరనులోమగమనాత్। అన్యాన్యపి హి వాతమూత్రపురీషాణి బహిర్గమనశీలాని సజ్జన్తి ॥44॥

అ॥ ప్రసవమైనపిదప మావి బయటకు వెడలినదియు లేనిదియు తెలిసికొనవలయును. బయటకు వెడలనియెడల వారిలో నొక స్త్రీ కుడిచేతితో ఈమెయొక్క నాభికి పైభాగమున గట్టిగనొక్కి ఎడమచేతితో నడుమునుపట్టుకొని బాగుగపిసుకవలయును. కాళ్ళయొక్క మడిమలతో శ్రోణిప్రదేశమును పీడింపవలయును. పిరుదులను పట్టుకొని బాగుగపిసుకవలయును. వెంట్రుకలతో అల్లబడిన జడచే ఈమెయొక్క కంఠ

ప్రదేశమును తాలుప్రదేశమును దుడువవలయును. భుజపత్రి గాజుమణి పాముయొక్క కుబుసము వీనితో యోనికి ధూపమును వేయవలయును. చెంగల్వకోష్టు తాలీసపత్రి వీనియొక్క కల్కమును, బల్వజమనుగడ్డియొక్క కషాయమునందుగాని తీక్ష్ణములైన మైరేయము సుర యనెడి మద్యములయొక్క తేటయందుగాని ఉలవల కషాయమునందుగాని మండూకబ్రహ్మి పిప్పళ్ళు వీనియొక్క కషాయమునందుగాని కలిపి త్రాగింపవలయును. లేక సన్నఏలకులు దేవదారు చెంగల్వకోష్టు శుంఠి వాయువిడంగములు కృష్ణాగరు చవ్యము పిప్పళ్ళు చిత్రమూలము జీలకఱ్ఱ వీనియొక్క కల్కమునుగాని జీవించియున్న గాడిదయొక్క లేక ఎద్దుయొక్క కుడిచెవినికోసి రాతియందు మెత్తగ నూరి దానినిగాని పైన చెప్పబడిన బల్వజమనుగడ్డియొక్క కషాయము మొదలగువానిలో దేనియందైనను కలిపి క్షణకాలముంచి వడకట్టి త్రాగింపవలయును. సదాప చెంగల్వకోష్టు మ్రంగకాయ ఇంగువ వీనితో తయారుచేయబడిన తైలమునందు తడుపబడిన దూదిని యోనియందుంచవలయును. ఈ తైలముతోడనే అనువాసనవస్తిని చేయింపవలయును పైన చెప్పబడిన బల్వజమనెడి గడ్డియొక్క కషాయము మొదలగు వానిలో మ్రంగకాయ దేవదాలి చేదుసార పెద్దచేదుబీర కొడిసెపాలవిత్తులు చిన్నచేదుబీర గజపిప్పళ్ళు వీనిని కలిపి ఆస్థాపనవస్తిని చేయింపవలయును. ఈ ఆస్థాపన వస్తి వాతమునకు అనులోమగతిని కలిగించి అంటిపట్టియున్న మావిని, వాతము మూత్రము పురీషము వీనితో కూడ బయలు వెడలించును. బహిర్గమనస్వభావముకలిగి అంటిపట్టియున్న ఇతరములను కూడ వాతమూత్రపురీషములుబయటకు తీసికొనివచ్చును.

## జనించినశిశువునకు వెంటనేచేయవలసిన కృత్యములు.

మూ॥ తస్యాస్తు ఖల్వపరాయాః ప్రపతనార్థే కర్మణి క్రియమాణే జాతమాత్రేఽస్యైవ కుమారస్య కార్యాణ్యేతాని కర్మాణి భవన్తి। తద్యథా–అశ్మనోః సంఘట్టనం కర్ణయోర్మూలే, శీతోదకేనోష్ణోదకేన వా సుఖేన పరిషేకః, తథా సంక్లేశవిహతాన్ ప్రాణాన్ పునర్లభేత, కృష్ణకపాలికాశూర్పేణ చైనమభినిష్పుణీయుర్యద్యచేష్టః స్యాద్యావత్ప్రాణానాం ప్రత్యాగమనం, తతః ప్రత్యాగతప్రాణం ప్రకృతిభూతమభిసమీక్ష్య స్నానోదకగ్రహణాభ్యాముపపాదయేత్, అథాస్య తాల్వోష్ఠకణ్ఠజిహ్వాప్రమార్జనమారభేతాఙ్గుల్యా సుపరిలిఖితనఖయా సుప్రక్షాలితోపధానకార్పాసపిచుమత్యా, ప్రథమం ప్రమార్జితస్య చాస్య శిరస్తాలు కార్పాసపిచునా స్నేహగర్భేణ ప్రతిచ్ఛాదయేత్, తతోఽస్యానన్తరం కార్యం సైన్ధవోపహితేన సర్పిషా ప్రచ్ఛర్దనమ్ ॥45॥

అ॥ మాని పసుటకు చేయవలసిన విధానమును చేయుచున్నను శిశువునకు జనించిన వెంటనే చేయవలసిన విధానములను చెప్పుచున్నాము. శిశువుయొక్క చెవుల దగ్గర రెండు రాళ్ళతో ధ్వనిని చేయవలయును. చన్నీటితోగాని సుఖకరమైన వేడినీటితోగాని స్నానమును చేయింపవలయును. అట్లు చేసినచో, క్లేశముచే బడలిక నొందిన ప్రాణములకు తిరిగి ఆప్యాయనము కలుగును. జనించిన శిశువు చేష్టలు లేనిదిగనున్నచో నల్లనిబద్దలతో అల్లబడిన చేటచే చేష్టలు కలుగువరకు విసరవలయును. చేష్టనుకలిగి ప్రకృతిభూతుడైన పిదప స్నానము, జలముచే మలమార్గమును శుభ్రపరచుట వీనిని చేయింపవలయును. పిమ్మట, గోరు తీసివేయబడినట్టియు బాగుగ తడుపబడిన దూదిచే చుట్టబడినట్టియు వ్రేలిచే ఈ శిశువుయొక్క తాలు ప్రదేశమును పెదవులను కంఠమును నాలుకను తుడువవలయును. అట్లు తుడిచిన పిమ్మట చమురునందు తడుపబడిన దూదిని శిరస్సునందును తాలు ప్రదేశమునందును ఉంచవలయును. అటుపిమ్మట సైంధవలవణముతో కూడిన నేతితో వాంతిని చేయింపవలయును.

## నాభినాడీఛేదనవిధి.

మూ॥ అథ నాడ్యాస్తస్య కల్పనవిధిముపదేక్ష్యామః—నాభిబన్ధనాత్ప్రభృత్యష్టాఙ్గులమభిజ్ఞానంకృత్వా ఛేదనావకాశస్య ద్వయోరన్తరయోః శనైర్గృహీత్వా తీక్ష్ణేన రౌక్మరాజతాయసానాం ఛేదనానామన్యతమేనార్ధధారేణ ఛేదయేత్తాం, అగ్రే సూత్రేణోపనిబధ్య కణ్ఠేఽస్య శిథిలమవసృజేత్, తస్య చేన్నాభిః పచ్యేత్, తాం లోధ్రమధుకప్రియఙ్గుదేవదారుహరిద్రాకల్కసిద్ధేన తైలేనాభ్యజ్యాత్ ఏషామేవ తైలౌషధానాం చూర్ణేనావచూర్ణయేత్. ఏషనాడీకల్పనవిధిరుక్తః సమ్యక్ ॥ అసమ్యక్కల్పనే హి నాడ్యా ఆయామవ్యాయామోత్తుణ్డికాపిణ్డాలికావినామికావిజృమ్భికాబాధేభ్యో భయం; తత్ర విదాహాభిర్వాతపిత్తప్రశమనైరభ్యఙ్గోత్సాదనపరిషేకైః సర్పిర్భిశ్చోపక్రమేత గురులాఘవమభిసమీక్ష్య ॥47॥

అ॥ పిమ్మట శిశువుయొక్క నాభినాడీఛేదన విధిని చెప్పుచున్నాము. బొడ్డు దగ్గరనుండి ఎనిమిదిఅంగుళములుగ కొలిచి గుర్తునుంచి ఛేదింపతగిన ఆ ప్రదేశమునకు ఇటు నటు మెల్లగపట్టుకొని పదునుకలిగినట్టియు బంగారముతోగాని వెండితోగాని ఇనుముతోగాని చేయబడినట్టియు చాకుతో ఛేదింపవలయును. నాడియొక్క చివరభాగమునందుదారమునుకట్టి ఆదారమును శిశువుయొక్క కంఠమునందు వదులుగ కట్టవలయును. శిశువుయొక్క నాభియందు పుండు ఏర్పడినచో లొద్దుగ అతిమధురము ప్రేంఖణము దేవదారు పసుపు వీనియొక్క కల్కముతో తయారుచేయబడిన తైలమును పూయవలయును. మరియు ఈ ద్రవ్యములయొక్క చూర్ణమును చల్లవలయును. ఇట్లు నాడీఛేదన

విధి బాగుగ చెప్పబడినది. నాభిదాడిని సరిగ ఛేదింపనియెడల పొడుగుగనుండుట విస్తరించుట మండలములతో కూడుకొనుట మధ్యను పల్లముగనుండుట తరుచు ఉబ్బుచుండుట అనెడి వికృతులు కలుగును. అట్లు కలిగినయెడల దోషములయొక్క గురులాఘవములను తెలిసికొని తాపము కలిగింపనట్టియు వాతపిత్తములశమింపచేయునట్టియు అభ్యంగములు నలుగుపెట్టుట స్నానములు వీనిచేతను ఘృతములచేతను చికిత్సింపవలయును.

జాతకర్మవిధి, రక్షావిధి.

మూ॥ తతోఽనన్తరం జాతకర్మ కుమారస్య కార్యం, తద్యథా—మధుసర్పిషీ మన్త్రోపమన్త్రితే యథామ్నాయం ప్రథమం ప్రాశితుమస్మై దద్యాత్, స్తనమత ఊర్ధ్వమేతేనైవ విధినా దక్షిణం పాతుం పురస్తాత్ప్రయచ్ఛేత్, అథాతః శీర్షతః స్థాపయేదుదకుమ్భం మన్త్రోపమన్త్రితం, అథాస్య రక్షాం విదధ్యాత్—ఆదనీఖదిరకర్కన్ధుపీలుపరూషకశాఖాభిరస్య గృహం భిషక్సమన్తాః పరివారయేత్, సర్వతశ్చ సూతికాగారస్య సర్షపాతసీతణ్డులకణకణికాః ప్రకిరేత్, తథా తణ్డులబలిహోమః సతతముభయతః కాలం క్రియేతానామకర్మణః, ద్వారే చ ముసలం దేహలీమనుతిరశ్చీనం న్యస్తం కుర్యాత్, వచాకుష్ఠక్షౌమకహిఙ్గుసర్షపాతసీలశునకణకణికానాం రక్షోఘ్నసమాఖ్యాతానాం చౌషధీనాం పోట్టలికాం బద్ధ్వా సూతికాగారస్యోత్తరదేహల్యామవసృజేత్తథా సూతికాయాః కణ్ఠే సపుత్రాయాః స్థాల్యుదకుమ్భపర్యఙ్కేష్వపి తథైవ చ, ద్వయోర్ద్వారపక్షయోః కణకాణ్టకేన్ధనేనాగ్నిః తిన్దుకకాష్ఠేన్ధనశ్చాగ్నిః సూతికాగారస్యాభ్యన్తరతో నిత్యం స్యాత్ స్త్రియశ్చైనాం యథోక్తగుణాః సుహృదశ్చాను జాగ్రియుః దశాహం ద్వాదశాహం వాఽనుపరతప్రదానమఙ్గలాశీః స్తుతిగీతవాదిత్రమన్నపానవిశదమనురక్తప్రహృష్టజనసంపూర్ణం చ తద్వేశ్మ కార్యం, బ్రాహ్మణశ్చాథర్వవేదవిత్సతతముభయతః కాలం శాన్తిం జుహుయాత్స్వస్త్యయనార్థం కుమారస్య తథా సూతికాయాః, ఇత్యేద్రక్షావిధానముక్తమ్ ॥48॥

అ॥ పిదప శిశువునకు వేదోక్తకర్మను చేయింపవలయును. ఎటులననగా — విధిప్రకారముగమంత్రములచేమంత్రింపబడిన తేనె నెయ్యి వీనిని శిశువుచే తొలుత నాకింపవలయును పిమ్మట, మంత్రములచేమంత్రింపబడిన దక్షిణస్తనమును తొలుత

పానము చేయింపవలయును, ఆటుపిమ్మట మంత్రములచే మంత్రింపబడిన ఉదకపాత్రను శిరస్సువైపున ఉంచవలయును. పిమ్మట రక్షావిధి నాచరింపవలయును. శిశువున్న గృహముచుట్టును బీర చంద్ర రేగు కొండగోగు చిట్రీత వీనియొక్క కొమ్మల నుంచవలయును. సూతికాగృహమునందంతటను ఆవాలు అవిసెగింజలు బియ్యపునూక గోధుమనూక వీనిని చల్లవలయును. నామకరణమును చేయువరకు ఉదయమునందు సాయంకాలమునందు బలిహోమమును చేయింపవలయును. ద్వారమునందు మండిగముచు (గడపను) అనుసరించి అడ్డముగ రోకలిని ఉంచవలయును. వస చెంగల్వకోష్టు కచోరము ఇంగువ, ఆవాలు, అవిసెగింజలు, వెల్లుల్లి, బియ్యపునూక, గోధుమనూక వీనిని రక్షసులను పోగొట్టు ఇట్టి ఇతర ఓషధులను మూటకట్టి సూతికాగృహముయొక్క ద్వారమునకు పైభాగమునందున్న కమ్మికి వ్రేలాడకట్టవలయును. మరియు సూతికాస్త్రీయొక్కయు శిశువుయొక్కయు కంఠమందును, భోజనపాత్రలు ఉదకపాత్రలు మంచములు వీనియందును కట్టవలయును. ద్వారమునకు రెండువైపులయందును నందివృక్షము చింత వీనికట్టెలసంబంధమగు అగ్నిని, సూతికాగృహముయొక్క లోపలిభాగమునందు తుమికి కట్టెలసంబంధమగుఅగ్నిని ఎల్లప్పుడును ఉంచవలయును. పూర్వమునందు చెప్పబడిన గుణములుకలిగినట్టియు స్నేహితురాండ్రైనట్టియు స్త్రీలు ఈసూతికాస్త్రీని జాగరూకతతో కాపాడవలయును. ఆసూతికాగృహము — పదిదినములవరకుగాని పండ్రెండుదినములవరకుగాని, మంగళప్రదములైన ఆశీర్వచనములు స్తోత్రములు గానములు వాద్యములు వీనితోకూడినదిగను స్వచ్ఛములైనఅన్నపానములతోకూడినదిగను ఆమరాగముతోడను ఉత్సాహముతోడను కూడిన జనముతో నిండినదిగను నుండవలయును. శిశువునకు సూతికా స్త్రీకిని శుభముకలుగునిమిత్తము అథర్వవేదమును తెలిసినబ్రాహ్మణులుఉదయమునందును సాయంకాలమునందును శాంతిమంత్రములను పఠించుచు హోమమును చేయవలయును. ఇట్లు రక్షావిధానము చెప్పబడినది.

## సూతికోపచారములు.

మూ॥ సూతికాం తు ఖలు బుభుక్షితాం విదిత్వా స్నేహం పాయయేత ప్రథమం పరమయా శక్త్యా సర్పిస్తైలం వసాం మజ్జానం వాసాత్మ్యభావమభిసమీక్ష్య పిప్పలీపిప్పలీమూలచవ్యచిత్రకశృఙ్గవేర చూర్ణసహితం; స్నేహం పీతవత్యాశ్చ సరిస్తైనాభ్యాముభ్యజ్య వేష్టయే దుదరం మహతా వాససా, తథాతస్యా న వాయురుపరేవిశ్కృతిముత్పాదయత్యనవకాశత్వాత్; జీర్ణే తు స్నే హే పిప్పల్యాభిరేవ సిద్ధాం యవాగూం సుస్నిగ్ధాం ద్రవాం మాత్రశః పాయయేత, ఉభయతః కాల మచ్ఛేన చోష్ణోదకేన పరిషేచయేత్ప్రాక్స్నేహయవాగూపానాభ్యాం; ఏవం పఞ్చ రాత్రం స ప్తరాత్రంవానుపాల్య తతః క్రమేణాప్యాయయేత్ ; స్వస్థవృత్తమేతావత్సూతికాయాః॥ తస్యాస్తుఖలు యో

వ్యాధిరుత్పద్యతే స కృచ్ఛ్రసాధ్యో భవత్యసాధ్యో వా గర్భవృద్ధిక్షయితశిథిలసర్వశరీరధాతుత్వాత్ప్రవాహణవేదనాక్లేదరక్తనిస్స్రుతివిశేషశూన్యశరీరత్వాచ్చ, తస్మాత్తాం యథోక్తేనైవ విధినోపచరేత్; భౌతికజీవనీయబృంహణీయమధుర వాతహరసిద్ధైరభ్యఙ్గోత్సాదనపరిషేకావగాహనాన్నపానవిధిభిర్విశేషతశ్చోపచరేత్; విశేషతో హి శూన్యశరీరాః స్త్రియః ప్రజాతా భవన్తి ॥50॥

అ॥ సూతికాస్త్రీకి ఆకలికలుగగనే, ఆమెకు ఘృతము తైలము వసమజ్జ వీనిలో ఏస్నేహము అభ్యాసముగనుండునో ఆస్నేహమునందు పిప్పళ్లు మోడి చవ్యము చిత్రమూలమున శుంఠి వీనియొక్క చూర్ణమును కలిపి శక్తిననుసరించి ఉత్తమపరిమితిగ ఈయవలయును. స్నేహపానమును చేయించినపిమ్మట ఉదరమునకు ఘృతమును తైలమును పూసి పెద్దవస్త్రముచే ఆఉదరమును చుట్టవలయును. అట్లుచేసినచో అవకాశములేకపోవుటవలన వాతము ఉదరమునందు వికృతినికలిగింప నేరదు. ఆస్నేహముజీర్ణమైన పిదప, పిప్పళ్ళు మోడి మొదలగువానితో తయారుచేయబడినట్టియు చమురుతోకూడినట్టియు పలుచగనున్నట్టియు యవాగువును పానము చేయింపవలయును. స్నేహపానమును యవాగూపానమును చేయించుటకుముందుగ రెండుకాలములయందును శుభ్రమైన ఉష్ణోదకముతో పరిషేకమును (కడుగుటను) చేయవలయును. ఇట్లు అయిదుదినములుగాని ఏడుదినములుగాని చేసి పిమ్మట క్రమముగ పుష్టిని కలిగింపవలయును. ఇట్లు సూతికాస్త్రీకి ఆరోగ్యవిధానము చెప్పబడినది. సూతికాస్త్రీ—గర్భవృద్ధివలనక్షీణించినట్టియు శిథిలమైనట్టియు సమస్త ధాతువులును కలదిగను మఱియు ప్రసవవేదనలు క్లేదము రక్తపోవుటచే పీడింపబడి శూన్యముగనున్న శరీరముకలదిగనుండును. కావున సూతికాస్త్రీకిజనించినవ్యాధికష్టసాధ్యమైనదిగ గానిఅసాధ్యమైనదిగ గానిఉండును. అందువలనసూతికాస్త్రీని పూర్వమునందు చెప్పబడిన విధానములచే ఉపచరింపవలయును. మరియు, ప్రసవించిన స్త్రీలు విశేషించిశూన్యమైన శరీరముకలవారుగనుందురు గావున వీరలకురక్షస్సులనునశింపఁజేయునట్టియు జీవనీయములైనట్టియు బృంహణములైనట్టియు మధురములైనట్టియు వాతహరములైనట్టియు ద్రవ్యములతో తయారుచేయబడిన అభ్యంగనములు ఉద్వర్తనము స్నానములు అవగాహస్నానములు అన్నపానములు వీనిచే విశేషించి ఉపచరింపవలయును.

నామకరణవిధి.

మూ॥ దశమ్యాం నిశ్కృతీతాయాం సపుత్రా స్త్రీ సర్వగన్ధౌషధైర్గౌరసర్షపైశ్చ స్నాతా లఘ్వహతశుచివస్త్రం పరిధాయ పవిత్రేష్టలఘువిచిత్రభూషణవతీ చ సంస్పృశ్య మఙ్గలాన్యుచితా మర్చయిత్వా చ దేవతాః శిఖినః శుక్లవాససోఽవ్యఙ్గాంశ్చ బ్రాహ్మణాన్ స్వస్తి

వాచయిత్వా, కుమారమహతేన శుచివాససాఽఽచ్ఛాదయేత్ ప్రాక్ శిరస ముదక్శిరసం వా సంవేశ్య, దేవతాపూర్వం ద్విజాతిభ్యః ప్రణమతీత్యుక్త్వా, కుమారస్య పితా ద్వే నామనీ కారయేన్నాక్షత్రికం నామాభిప్రాయికం చ; తత్రాభిప్రాయికం నామ ఘోషవదాద్యన్తస్థాన్తమూష్మాన్తం వా వృద్ధత్రిపురుషానూకమనవప్రతిష్ఠితం, నాక్షత్రికం తు నక్షత్రదేవతాసమానాఖ్యం ద్వ్యక్షరం చతురక్షరం వా ॥51॥

అ॥ పదియవదినముగడువగనే సూతికా స్త్రీ సమస్తములగు గంధద్రవ్యముల తోడను తెల్లావాలతోడనుకూడిన స్నానమును శిశువుతోకూడ చేసి తేలికగను క్రొత్తదిగను పరిభ్రముగను నున్న వస్త్రమును కట్టుకొని పవిత్రములైనట్టియు ఇష్టములైనట్టియు చులుకనైనట్టియు విచిత్రములైనట్టియు అలంకారములను ధరించి శుభప్రదములైన వానిని స్పృశించి అనుకూలమైనదేవతను పూజించి శిఖకలిగినట్టియు తెల్లనివస్త్రములను ధరించినట్టియు వికలాంగులుకానట్టియు బ్రాహ్మణులచే ఆశీర్వచనములనొందవలయును. మరియు శిశువును తూర్పువైపునకుగాని ఉత్తరమువైపునకుగాని శిరస్సుండునట్లు పరుండబెట్టి క్రొత్తదైనట్టియు పరిశుభ్రమైనట్టియు వస్త్రముతో కప్పవలయును. తండ్రి దేవతలకు బ్రాహ్మణులకును నమస్కరించి శిశువునకు నక్షత్రసంబంధమైన పేరును ఇష్టమైన పేరును ఉంచవలయును. ఇష్టమైన పేరునకు ఘఝఢధభలలో ఏదైనను ఆదియందును యరలవశషసహాలలో ఏదైనను అంతమునందును ఉండవలయును. మరియు ముగ్గురువృద్ధపురుషులలో ఎవరియొక్క పేరునైనను అనుసరించినదిగను క్రొత్తదికానిదిగను నుండవలయును. నక్షత్రసంబంధమైన పేరు నక్షత్రదేవతయొక్క పేరుతో సమానమైనదిగను రెండుగాని నాలుగుగాని అక్షరములుకలదిగను నుండ వలయును.

## ఆయుష్మంతుడైనశిశువుయొక్క లక్షణములు.

మూ॥ కృతే చ నామకర్మణి కుమారం పరీక్షితు ముపక్రమే దాయుషః ప్రమాణజ్ఞానహేతోః; తత్రేమాన్యాయుష్మతాం కుమారాణాం లక్షణాని భవన్తి; తద్యథా—ఏకైకజా మృదవోఽల్పాః స్నిగ్ధాః సుబద్ధమూలాః కృష్ణాః కేశాః ప్రశస్యన్తే, స్థిరా బహలా త్వక్ ప్రకృత్యా, ప్రకృతిసుసంపన్న మీషత్ప్రమాణాతివృత్తిమనురూపమాతపత్రోపమం శిరః, వ్యూఢం దృఢం సమం సుశ్లిష్టశఙ్ఖసన్ధ్యూర్ధ్వవ్యఞ్జనముపచితం బలినమర్ధచన్ద్రాకృతి లలాటం, బహలౌ విపులసమపీఠౌ నీచైర్వృద్ధౌ పృష్ఠతోఽవనతౌ సుశ్లిష్టకర్ణపుత్రకౌ మహా

ఛిద్రౌ కర్ణౌ, ఈషత్ప్రలమ్బిన్యావసఙ్గతే సమే సంహతే మహత్యౌ భ్రువౌ, సమే సమాహితదర్శనే వ్యక్తభాగవిభాగే బలవతీ తేజసోపపన్నే స్వఙ్గాపాఙ్గే చక్షుషీ, ఋజ్వీ మహోచ్ఛ్వాసా వంశసంపన్నే షదవనతాగ్రా నాసికా, మహదృజుసునివిష్టదన్తమాస్యం, ఆయామవిస్తారోపపన్నా శ్లక్ష్ణా తన్వీ ప్రకృతివర్ణయుక్తా జిహ్వా. శ్లక్ష్ణం యుక్తోపచయమూష్మోపపన్నం రక్తం తాలు, మహానదీనః స్నిగ్ధోఽనునాదీ గమ్భీరసముత్థో ధీరః స్వరః, నాతిస్థూలా నాతికృశా వాస్య ప్రచ్ఛాదనౌ రక్తావోష్ఠౌ, మహాత్యౌ హనూ, వృత్తా నాతిమహతీ గ్రీవా, వ్యూఢముపచితమురః, గూఢం జత్రు పృష్ఠవంశశ్చ, విప్రకృష్టాన్తరౌ స్తనౌ, అంసపాతినీ స్థిరే పార్శ్వే, వృత్తపరిపూర్ణాయతౌ బాహూ సక్థినీ అఙ్గులయశ్చ, మహదుపచితం పాణిపాదం, స్థిరా వృత్తాః స్నిగ్ధాస్తామ్రాస్తుఙ్గాః కూర్మాకారాః; కరజాః, ప్రదక్షిణావర్తా సోత్సఙ్గా చ నాభిః, ఉరస్త్రిభాగహీనా సమా సముపచితమాంసా కటీ, వృత్తౌ స్థిరోపచితమాంసౌ నాత్యున్నతౌ నాత్యవనతౌ స్ఫిచౌ, అనుపూర్వవృత్తావుపచయయుక్తావూరూ, నాత్యుపచితే నాత్యపచితే, ఏణీపదే ప్రగూఢసిరాస్థిసన్ధీ జఙ్ఘే, నాత్యుపచితౌ నాత్యపచితౌ గుల్ఫౌ, పూర్వోపదిష్టగుణౌ పాదౌ కూర్మాకారౌ, ప్రకృతియుక్తాని వాతమూత్రపురీషాణి తథా స్వప్నజాగరణాయాసస్మితరుదితస్తనగ్రహణాని; యచ్చ కించిదన్యదప్యనుక్తమస్తి తదపి సర్వం ప్రకృతియుక్తమిష్టం, విపరీతం పునరనిష్టం; ఇతి దీర్ఘాయుర్లక్షణాని ॥ 52 ॥

అ॥ నామకరణమును చేసినపిదప ఆయుఃప్రమాణమును తెలిసికొనుటకు శిశువును పరీక్షింపవలయును. ఈక్రిందచెప్పబడునవి ఆయుష్మంతులైన శిశువులయొక్క లక్షణములుగ నుండును. ఎటులనవగా — వెండ్రుకలు ప్రత్యేకప్రత్యేకముగ జనించినవిగను మృదువుగను సన్నముగనునున్నగను దృఢమైన మొదళ్లుకలవిగనునల్లగనునుండును. చర్మము స్వభావముగనే స్థైర్యము కలదిగను పుష్టికలదిగనునుండును. శిరస్సు ప్రకృతి సంపత్తుతోకూడినదిగను కొంచెమధికమైనపరిమాణముకలదిగను శరీరమునకు తగినదిగను గొడుగుతో సమానమైనదిగను నుండును. నుదురు విశాలముగను దృఢముగనుసమానగను బాగుగకలిసికొనినకణతలయొక్క సంధులుకలదిగనుఊర్ధ్వరేఖలు మొదలగువానితో కూడినదిగను పుష్టిగను బలముకలదిగను అర్థచంద్రాకారముకలదిగను నుండును. చెవులు పుష్టిగను విశాలములైనట్టియు సమానములైనట్టియుపీఠభాగములుకలవిగను క్రిందిభాగమునవృద్ధికలవిగను వెనుకకువంగినవిగను బాగుగకలిసినకర్ణపుటములుకలవిగనువిశాలమై

నరంధ్రములుకలవిగను నుండును. కనుబొమ్మలు కొంచెము జారినవిగను కలియనివిగను సమానముగను దట్టముగను పెద్దవిగను నుండును, నేత్రములు సమానముగను సమమైనమాపుకలవిగను వ్యక్తమైనవర్ణవిభాగముకలవిగను బలిష్ఠమైనవిగను తేజస్సుతో కూడినవిగను ప్రశస్తమైన అంగములును ఉపాంగములునుకలవిగను నుండును. ముక్కు వంకరలేనిదిగను గొప్పఉచ్ఛ్వాసముకలదిగను సరియైనవంశము(ముక్కుదూలము)కలదిగను కొంచెము వంగినచివరభాగము కలదిగను నుండును. నోరు పెద్దదిగను వంకరలేనిదిగను బాగుగకూర్పబడిన దంతములుకలదిగను నుండును. నాలుక పొడవును వెడల్పునుకలదిగను నునుపుగను పలుచగను స్వభావముగనుండవలసిన వర్ణముకలదిగను నుండును. తాలుప్రదేశము నునుపుగను పుష్టికలదిగను ఊష్మముకలదిగను ఎర్రగను నుండును. స్వరము గొప్పదిగను దైన్యము లేనిదిగను స్నిగ్ధముగను ప్రతిధ్వనికలదిగను గంభీరముగబయలు వెడలినదిగను ధీరత్వముకలదిగను నుండును. పెదవులు మిక్కిలి లావులేనివిగను మిక్కిలి సన్నములు కానివిగను నోరునుసరిగ కప్పునవిగను ఎర్రగను నుండును. అంకిళ్ళు పెద్దవిగ నుండును. మెడ గుండ్రముగను మిక్కిలి పెద్దదికానిదిగను నుండును. వక్షఃస్థలము విశాలముగను పుష్టిగను నుండును. జత్రుప్రదేశమును పృష్ఠవంశమును నిగూఢములుగ నుండును. స్తనములు విశాలమైన మధ్యప్రదేశముకలవిగ నుండును. పార్శ్వములు అంసఫలకమువరకు వ్యాపించినవిగను దృఢములుగను నుండును. బాహువులును తొడలును వ్రేళ్ళును గుండ్రములైనవిగను పుష్టికలవిగను పొడవుగను నుండును. చేతులును కాళ్ళును గొప్పవిగను పుష్టికలవిగను నుండును. గోళ్లు దృఢముగను గుండ్రముగను నునుపుగను తామ్రవర్ణముకలవిగను ఎత్తుగను తాబేలుయొక్క ఆకారముకలవిగను నుండును. నాభి గుండ్రమైన ఆవర్తముకలదిగను ఎత్తుగనున్నచుట్టుప్రదేశముకలదిగను నుండును. కటిప్రదేశము వక్షఃస్థలముయొక్క పరిమాణములో నాలుగవవంతుకలదిగను సమానముగను అధికముగ వృద్ధినొందియున్న మాంసముకలదిగను నుండును. పిరుదులు గుండ్రముగను బలిష్ఠమైనట్టియు వృద్ధిపొందినట్టియు మాంసముకలవిగను మిక్కిలిఎత్తులేనివిగను మిక్కిలిసన్నముకానివిగను నుండును. తొడలు క్రమముగగుండ్రమైనవిగను పుష్టికలవిగను నుండును. పిక్కలు మిక్కిలిలావులేనివిగను మిక్కిలిసన్నములుకానివిగను లేడియొక్క పిక్కలవలెనుండునవిగను సిరలు ఎముకలు సంధులు ఇవి నిగూఢములుగ నున్నవిగను నుండును. గుల్ఫప్రదేశములు మిక్కిలిలావులేనివిగను మిక్కిలిసన్నములు కానివిగను నుండును. పాదములు పూర్వమునందుచెప్పబడిన లక్షణములుకలవిగను తాబేలుయొక్క ఆకారముకలవిగను నుండును. అపానవాతమును మూత్రమును పురీషమును ప్రకృతియుక్తములుగ నుండును. మరియు నిద్రించుట మేల్కొనుట శ్వాస నవ్వు ఏడుపు స్తన్యపానము ఇవి ప్రకృతియుక్తములుగ నుండును. చెప్పబడని ఇట్టి ఇతరవిషయములన్నియుకూడ ప్రకృతియుక్తములుగ నుండును. ఈలక్షణములు దీర్ఘాయుష్మంతునకు ఉండును. ఈలక్షణములకు విపరీతములైన లక్షణములు అనిష్టలక్షణములుగ నుండును.

## దాదికి ఉండవలసిన లక్షణములు.

మూ॥ అతో ధాత్రీపరీక్షాం ముపదేక్ష్యామః — అథ బ్రూయాత్ — ధాత్రిమానయ తేతి, సమానవర్ణాం యౌవనస్థాం నిభృతామనాతురామవ్యఙ్గా మవ్యసనామవిరూపామజుగుప్సితాం దేశజాతీయామక్షుద్రామక్షుద్రకర్మిణీం కులేజాతాం వత్సలాం జీవద్వత్సాం పుంవత్సాం దోగ్ధ్రీమప్రమత్తామశాయినీమనుచ్చారశాయినీమనన్త్యావశాయినీం కుశలోపచారాం శుచిమశుచిద్వేషిణీం స్తనస్తన్యసంపదుపేతా మితి ॥53॥

అ॥ పిమ్మట దాదియొక్క పరీక్షను చెప్పుచున్నాము. సమానమైనజాతికలిగినట్టియు యౌవనముతో కూడినట్టియు నమత్రకలిగినట్టియు వ్యాధులు లేనట్టియు సమస్తమైనఅవయవములతో కూడినట్టియువ్యసనము లేనట్టియు అవయవవికృతి లేనట్టియు అసూయలేనట్టియు సమానమైనదేశమునందుజనించినట్టియు నీచురాలుకా ట్టియు నీచకర్మలను చేయనట్టియు శ్రేష్ఠమైన కులమునందు జనించినట్టియు ప్రేమకలిగినట్టియు జీవించియున్న శిశువుకలిగినట్టియు పురుషశిశువుకలిగినట్టియు పాలుకలిగినట్టియు ప్రమత్తురాలుకానట్టియు ఎల్లప్పుడును నిద్రించుస్వభావము లేనట్టియు నిద్రయందుగురక మొదలగు ధ్వనులు లేనట్టియు జాతిభ్రష్టురాలుకానట్టియు ఉపచారములయందు నేర్పరియైనట్టియు శుచికలిగినట్టియు అపరిశుభ్రతను ద్వేషించునట్టియు స్తనసంపత్తుతోడను స్తన్యసంపత్తుతోడను కూడినట్టియు దాది శ్రేష్ఠమైనదిగ నుండును. ఇట్టిదాదిని స్వీకరింపవలయును.

## యోగ్యస్తనలక్షణములు.

మూ॥ తత్రేయం స్తనసంపత్ — నాత్యూర్ధ్వౌ నాతిలమ్బావనతికృశావనతిపీనౌ యుక్తపిప్పలకౌ సుఖప్రపానౌ చేతి స్తనసంపత్ ॥

అ॥ స్తనసంపత్తును చెప్పుచున్నాము. దాదియొక్క స్తనములు మిక్కిలి ఊర్ధ్వముఖములుకానివిగను మిక్కిలి వ్రేలాడనవిగను మిక్కిలి కృశింపనవిగను మిక్కిలి లావులేనివిగను పెద్దవియగు చూచుకములతో కూడినవిగను సుఖముగ పానముచేయ తగినవిగను నుండవలయును.

## శుద్ధస్తన్యలక్షణములు.

మూ॥ స్తన్యసమ్పత్తు — ప్రకృతవర్ణగన్ధరసస్పర్శముదపాత్రే దుహ్యమానముదకం వ్యేతి ప్రకృతిభూతత్వాత్, తత్పుష్టికరమారోగ్యకరం చేతి స్తన్యసంపత్ ॥55॥

అ॥ శుద్ధమైన స్తన్యముయొక్క లక్షణములను చెప్పుచున్నాము. స్వభావముగ నుండవలసిన వర్ణము గంధము రసము స్పర్శ ఇవి కలిగినట్టియు ఉదకపాత్రయందు పిండినచో ప్రకృతిగనుండి ఉదకముతో కలియునట్టియు పుష్టినికలిగించునట్టియు ఆరోగ్యమునుకలిగించునట్టియు స్తన్యము శ్రేష్ఠమైనదిగ నుండును.

వాతాదులచే దుష్టమైన స్తన్యముయొక్క లక్షణములు.

మూ॥ అతోఽన్యథా వ్యాపన్నం జ్ఞేయం; తస్య విశేషాః— శ్యావారుణవర్ణం కషాయానురసం విశదమనతిలక్ష్యగన్ధం రూక్షం ద్రవం ఫేనిలం లఘ్వతృప్తికరం కర్శనం వాతవికారాణాం కర్తృ వాతోపసృష్టం క్షీర మభిజ్ఞేయం;కృష్ణనీలపీతతామ్రావభాసం తిక్తామ్ల కటుకానురసం కుణపరుధిరగన్ధి భృశోష్ణం పిత్తవికారాణాం కర్తృ పిత్తోపసృష్టం క్షీర మభిజ్ఞేయం; అత్యర్థశుక్లమతిమాధుర్యోపపన్నం లవణానురసం ఘృతతైలవసామజ్జగన్ధి పిచ్ఛిలం తన్తు మదుదపాత్రేఽవసీదతి శ్లేష్మవికారాణాం కర్తృ శ్లేష్మోపసృష్టంక్షీర మభిజ్ఞేయమ్ ॥56॥

అ॥ పూర్వమునందు చెప్పబడిన లక్షణములకు భిన్నములైన లక్షణములుకల స్తన్యమును దుష్టమైనదానినిగ తెలిసికొనవలయును. శ్యావవర్ణమును అరుణవర్ణమును కలిగినట్టియు కషాయరసము అనురసముకలిగినట్టియు విశదగుణముకలిగినట్టియు బాగుగవ్యక్తముకానిగంధముకలిగినట్టియు రూక్షముగను మిక్కిలిపలుచగను నురుగు కలదిగను మిక్కిలిచులకనగను నున్నట్టియు తృప్తినికలిగింపనట్టియు కృశింపచేయు నట్టియు వాతవ్యాధులనుకలిగించునట్టియు స్తన్యమును వాతముచేచెడినదానినిగ తెలిసి కొనవలయును. నలుపు నీలము పచ్చని తామ్రవర్ణము ఇవి కలిగినట్టియు చేదు పులుపు కారము ఇవి అనురసములుగకలిగినట్టియు శవముయొక్కయు రక్తముయొక్కయు వాసనకలిగినట్టియు మిక్కిలివెచ్చగనున్నట్టియు పిత్తవ్యాధులను కలిగించునట్టియు స్తన్యమును పిత్తముచేదూషింపబడినదానినిగ తెలిసికొనవలయును.మిక్కిలితెల్లగనున్నట్టియు మిక్కిలితియ్యగానున్నట్టియు లవణరసముఅనురసము కలిగినట్టియు నెయ్యి నూనె వస మజ్జ వీనియొక్క వాసనకలిగినట్టియు జిగురుగనున్నట్టియు తీగెలుకలిగినట్టియు ఉదకపాత్రయందు పిండినచో మునుగునట్టియు శ్లేష్మవ్యాధులను కలిగించునట్టియు స్తన్యమును శ్లేష్మముచే దుష్టమైనదానినిగ తెలిసికొనవలయును.

స్తన్యదోషచికిత్స.

మూ॥ తేషాం త్రయాణామపి క్షీరదోషాణాం ప్రతిప్రతి విశేషమభిసమీక్ష్య యథాస్వం యథాదోషం చ వమన విరేచనాస్థాపనానువాసనాని విభజ్య కృతాని ప్రశమనాయ; పానాశనవిధిస్తు

దుష్టక్షీరాయా యవగోధూమశాలిషష్టికముద్గహరేణుక కులత్థసురా
సౌవీరకతుషోదకమైరేయమేదకలశునకరఞ్జప్రాయః స్యాత్, క్షీరదోష
విశేషాంశ్చావేక్ష్యావేక్ష్య తత్తద్విధానం కార్యం స్యాత్, పాఠామ
హౌషధసురదారుముస్త మూర్వాగుడూచీ వత్సకఫలకిరాతతిక్తకటుక
రోహిణీసారివాకషాయాణాం చ పానం ప్రశస్యతే; తథాఽన్యేషాం
తిక్తకషాయకటుక మధురాణాం ద్రవ్యాణాం ప్రయోగః క్షీరవికార
విశేషానభిసమీక్ష్య మాత్రాం కాలం చేతి క్షీరవిశోధనాని ॥57॥

ఆ॥ అట్టిమూడువిధములగు స్తన్యదోషములయొక్క సూక్ష్మసూక్ష్మములైన విశేషములను తెలిసికొని తగువిధమున దోషములననుసరించి వమనము విరేచనము ఆస్థాపనము అనువాసనము వీనిని చేయింపవలయును. దుష్టమైన స్తన్యముకల స్త్రీకి అన్నపానములనిమిత్తము యవలు గోధుమలు శాలిధాన్యము షష్టికధాన్యము పెసలు పెద్దసెనగలు ఉలవలు సురామద్యము సౌవీరకము తుషోదకము మైరేయము మేదకము వెల్లుల్లి క్రానుగ వీనిని అధికముగనుపయోగింపవలయును. క్షీరదోషములయొక్క విశేషములను బాగుగ తెలిసికొని ఆయావిధానములను ఆచరింపవలయును. చిరుబొద్ది శుంఠి దేవదారు తుంగముస్తలు చాగ తిప్పతీగె కొడిసెపాలగింజలు నేలవేము కటుకరోహిణి సుగంధిపాల వీనియొక్క కషాయములను పానముచేయవలయును. మరియు క్షీరదోషవిశేషములననుసరించి, తిక్తరసము కషాయరసము కటురసము మధురరసము ఇవికల ద్రవ్యములను కాలమున కనుకూలముగనుండునట్లుగను తగుపరిమితిగను ఉపయోగింపవలయును. ఇట్లుచేసినచో స్తన్యము శుద్ధినొందును.

## స్తన్యవర్ధకములు.

మూ॥ క్షీరజననాని తు మద్యాని శీధువర్జ్యాని గ్రామ్యానూ
పౌదకాని చ శాకధాన్యమాంసాని ద్రవమధురామ్లభూయిష్ఠాశ్చా
హారాః క్షీరిణ్యశ్చౌషధయః క్షీరపానం చానాయాసశ్చేతి, వీరణ
శాలిషష్టికేక్షువాలికా దర్భకుశకాశ గున్ద్రేత్కటమూలకషాయాణాం
చ పానమితి క్షీరజననాన్యుక్తాని ॥58॥

ఆ॥ శీధువుకంటె ఇతరములైన మద్యములు, గ్రామమునందు అనూపదేశమునందును ఉదకమునందును జనించు కూరలు ధాన్యములు మాంసములు, ద్రవమును మధురరసమును ఆమ్లరసమును అధికముగకల ఆహారములు, పాలుకల ఓషధులు, క్షీరపానము, శ్రమపడకుండుట వీనివలన స్తన్యము జనించును. మరియు అవురుసవు వరి షష్టికధాన్యము ఇక్ష్వాలికయనెడి చెరకుదర్భ కుశదర్భ రెల్లు పెద్దరెల్లు ఇత్కటమనెడి ధాన్యము వీని వేళ్ళయొక్క కషాయములను పానము చేయుటవలనకూడ స్తన్యము జనించును.

## స్తన్యమును త్రాగించునప్పుడు చేయవలసినవిధి.

మూ॥ ధాత్రీ తు యదా స్వాదు బహుల శుద్ధ దుగ్ధా స్యాత్తదా స్నాతానులిప్తా శుక్ల వస్త్రం పరిధా యైన్ద్రీం బ్రాహ్మీం శతవీర్యాం సహస్రవీర్యామమోఘామవ్యథాం శివామరిష్టాం వాట్యపుష్పీం విష్వక్సేనకాన్తాం వా బిభ్రతోష్యధీం కుమారం ప్రాఙ్ముఖం ప్రథమం దక్షిణం స్తనం పాయయేదితి ధాత్రీకర్మ ॥౫౯॥

అ॥ తియ్యగను అధికముగను శుద్ధముగను నున్న స్తన్యముకల స్త్రీ స్నానమును చేసి చందనాదిద్రవ్యములను పూసికొని తెల్లనివస్త్రమును కట్టుకొని చేమపుచ్చ సరస్వతి యాకు గరిక భేదము కలిగొట్టు తిప్పతీగ కరక్కాయ కటుకరోహిణి ముత్తవపులగము పేరింఖణము వీనిలో దేనినైనను ధరించి శిశువును తూర్పువైపునకు ముఖముండునట్లు ఉంచుకొని తొలుత దక్షిణ స్తనమును పానము చేయింపవలయును.

### కుమారాగారవిధి

మూ॥ అతోఽనన్తరం కుమారాగారవిధిమనువ్యాఖ్యాస్యామః—వాస్తువిద్యాకుశలః ప్రశస్తం రమ్య మతమస్కం నివాతంప్రవాతైకదేశం దృఢమపగతశ్వాపదపశుదంష్ట్రిమూషికపతఙ్గం సువిభక్తసలిలోదూఖలమూత్రవర్చస్థానస్నానభూమిమహానసమృతుసుఖం యథర్తుశయనాసనాస్తరణసంపన్నం కుర్యాత్తథా సువిహితరక్షావిధాన బలిమఙ్గలహోమప్రాయశ్చిత్తం శుచివృద్ధవైద్యానురక్తజన సంపూర్ణమితి కుమారాగారవిధిః ॥౬౦॥

అ॥ పిమ్మట కుమారాగారవిధిని చెప్పుచున్నాము. వాస్తువిద్యయందు నేర్పరియైనవాడు, ప్రశస్తమైనట్టియు మనోహరమైనట్టియు చీకటిగనుండనట్టియు అధికమైనగాలి చొరనట్టియు అనుకూలమైనగాలి చొరునట్టియు దృఢముగ నుండునట్టియు కుక్కలు పశువులు పందులు ఎలుకలు మిడతలు ఇవి ప్రవేశించుటకు వీలులేనట్టియు ఉదకస్థానమును రోలుండుస్థానమును మూత్రవిసర్జనస్థానమును మలవిసర్జనస్థానమును స్నానప్రదేశమును వంటయిల్లును ప్రత్యేకముగనుండునట్టియుఆయాఋతువులకు అనుకూలముగనుండునట్టియు ఆయాఋతువులకుతగిన శయనములును ఆసనములునుఆస్తరణములును కలిగినట్టియు గృహమును నిర్మింపవలయును. ఈగృహము రక్షావిధి బలికర్మ శుభములు హోమములు ప్రాయశ్చిత్తములు వీనితో కూడినదిగను పవిత్రమైనవారు వృద్ధులు వైద్యులు ప్రేమకలవారు వీరితో నిండినదిగను నుండవలయును.

## కుమారసామాన్యవిధులు.

మూ॥ శయనాసనాస్తరణప్రావరణాని కుమారస్య మృదులఘుశుచిసుగన్ధీని స్యుః; స్వేదమలజన్తుమన్తి మూత్రపురీషోపసృష్టాని చ వర్జ్యాని స్యుః॥ అసతి సంభవేఽన్యేషాం తాన్యేవ చ సుప్రక్షాళితోపధూపితాని సుశుద్ధశుష్కాణ్యుపయోగం గచ్ఛేయుః॥ ధూపనాని పునర్వాససాం శయనాస్తరణప్రావరణానాం చ యవసర్షపాతసీహిఙ్గుగుగ్గులువచాచోరకవయస్థాగోలోమీజటిలాపలఙ్కషాశోకరోహిణీసర్పనిర్మోకాణి ఘృతసక్తాని స్యుః॥ మణయశ్చ ధారణీయాః కుమారస్య ఖడ్గరురుగవయవృషభాణాం జీవతామేవ దక్షిణేభ్యో విషాణేభ్యోఽగ్రాణి గృహీతాని స్యుః; మన్త్రాద్యాశ్చౌషధయో జీవకర్షభకౌ యాని చాన్యాన్యపి బ్రాహ్మణాః ప్రశంసేయురథర్వవేదవిదః॥ క్రీడనకాని ఖల్వస్య విచిత్రాణి ఘోషవన్త్యభిరామాణ్యగురూణ్యతీక్ష్ణాగ్రాణ్యనాస్యప్రవేశీన్యప్రాణహరాణ్యవిత్రాసనాని చ స్యుః॥ న హ్యస్య విత్రాసనం సాధు, తస్మాత్తస్మిన్ రుదత్యభుఞ్జానే వాఽన్యత్ర విధేయతామగచ్ఛతి రాక్షసపిశాచపూతనాద్యానాం నామాని చాహ్వయతా కుమారస్య విత్రాసనార్థం నామగ్రహణం న కార్యం స్యాత్ ॥౬౦॥

ఆ॥ శిశువునకు శయనములు ఆసనములు పక్కలు కప్పుగుడ్డలు ఇవి మెత్తగను తేలికగను పరిశుభ్రములుగను పరిమళయుక్తముగను నుండవలయును. చెమట మాలిన్యము క్రిములు మూత్రము పురీషము వీనితోకూడినవానిని తీసివేయవలయును. వీని కంటె వేరుగ లేనిచో వీనినే బాగుగాకడిగి ధూపమును వేసిశుద్ధినొందించి ఎండబెట్టిఉపయోగింపవచ్చును. యవలు ఆవాలు అవిసివిత్తులు ఇంగువ మహిషాక్షిగుగ్గులు వస గంధకచోరములు సరస్వతియాకు గరిక జటామాంసి గుగ్గిలము కటుకరోహిణి పాముకుబుసము వీనిని నేతితో కలిపి వానియొక్క పొగను వస్త్రములు శయనములు పక్కలు కప్పుగుడ్డలు వీనియందు వేయవలయును. మణులను ధరింపచేయవలయును. జీవించియున్న ఖడ్గమృగము నల్లచారలదుప్పి గవయమృగము ఎద్దు వీనియొక్క కుడికొమ్ముయొక్క అగ్రభాగములను ధరింపచేయవలయును. మంత్రాదులను ఓషధులనుజీవకమును ఋషభకమును అథర్వవేదవేత్తలగు బ్రాహ్మణులచేచెప్పబడు ఇట్టిఇతరములను ధరింపచేయవలయును. వీనియొక్క ఆటవస్తువులు విచిత్రములుగను ధ్వనికలిగించునవిగను మనోహరములుగను బరువులేనివిగను వాడికలకొనలులేనివిగను నోటియందు ప్రవేశింపనివిగను ప్రాణహారములుకానివిగను భయమునుకలిగింపనివిగను నుండవల

యను. వీనిని భయపెట్టుట మంచిదికాదు. బాలుఁడు ఏడ్చుచున్నను భుజింపకున్నను విధేయుఁడుగ నుండకపోయినను రాక్షసులు పిశాచములు పూతన మొదలగువానిని పేరులతో పిలుచుచు బాలునియొక్క పేరును గ్రహించి భయపెట్టరాదు.

## బాలరోగ చికిత్సా విధానము.

మూ॥ యది త్వాతుర్యం కించిత్కుమారమాగచ్ఛేత్తత్ప్రకృతినిమిత్త పూర్వరూప లిఙ్గోపశయ విశేషైస్తత్త్వతోఽనుబుధ్య సర్వవిశేషానాతురౌషధ దేశకాలాశ్రయానవేక్షమాణశ్చికిత్సేత్కుమారభేషజేనం మధుర మృదులఘు సురభిశీతశఙ్కరం కర్మ ప్రవర్తయన్, ఏవం సాత్మ్యా హి కుమారా భవన్తి, తథా తే శర్మ లభన్తేఽచిరాయ; అరోగేష్వరోగవృత్తమాతిష్ఠేద్దేశకాలాత్మగుణవిపర్యయేణ వర్తమానః ॥ క్రమేణాసాత్మ్యాని పరివర్జ్యోపయుఞ్జానః సర్వాణ్యహితాని వర్జయేత్తథా బలవర్ణశరీరాయుషాం సంపదమవాప్నోతీతి ॥67॥

అ॥ బాలునకు వ్యాధిజనించినచో వానియొక్క ప్రకృతిని హేతువులనుపూర్వరూపములను లక్షణములను ఉపశయములను పూర్తిగ తెలిసికొని రోగి ఔషధము దేశము కాలము వీనిసంబంధమైన సమస్తవిశేషములను గుర్తెరిగి మధురముగను మృదువుగను లఘువుగను పరిమాణయుక్తముగను శీతలముగను సుఖకరముగ నునుండు చికిత్సలచే చికిత్సింపవలయును. అట్లు చేసినచో బాలుఁడు సాత్మ్యస్థితిని పొందును. మరియు వెంటనే సుఖమును పొందును. వ్యాధులులేని బాలునకు దేశము కాలము శరీరము వీనియొక్క గుణములకు విపరీతములైన గుణములుకల ఉపచారములచే ఉపకరించుచు ఆరోగ్యమును కాపాడవలయును. అభ్యాసములేని పదార్థములను మార్పుచేసి క్రమముగ నుపయోగించుచు అహితములైనవాని నన్నిటిని విడిచిపెట్టవలయును. ఇట్లు చేసినచో బలము వర్ణము శరీరనిర్మాణము ఆయువు వీనియొక్క సంపత్తును పొందును.

మూ॥ ఏవమేనం కుమారమాయౌవనప్రాప్తేర్ధర్మార్థ కౌశలాగమనాచ్చానుపాలయేత్ ॥68॥

అ॥ ఇట్లు బాలుని యౌవనము వచ్చువరకును ధర్మార్థముల విషయమై నేర్పు కలుగువరకును ఉపచరింపవలయును.

మూ॥ ఇతి పుత్రాశిషాం సమృద్ధికరం కర్మ వ్యాఖ్యాతమ్ । తదాచరన్ యథోక్తైర్విధిభిః పూజాం యథేష్టం లభతేఽనసూయక ఇతి ॥69॥

అ॥ పుత్త్రుని కోరువారలకు అనుకూలమైనకర్మ ఈప్రకారముగ చెప్పబడినది. అనూయలేనివాడై దీనిని విధిప్రకారముగ ఆచరించినచో పరిపూర్ణమైన గౌరవమును పొందును.

## అధ్యాయ సంగ్రహము.

మూ॥ పుత్రాశిషాం కర్మ సమృద్ధికారకం యదుక్తమేతన్మహదర్థ సంహితమ్। తదాచరన్ జ్ఞో విధిభిర్యథాతథం పూజాం యథేష్టం లభతేఽనసూయకః ॥70॥

అ॥ ఈఅధ్యాయమునందు పుత్రుని కోరువారలకు అనుకూలమైన కర్మ చెప్పబడినది. అధికమగు ప్రయోజనముతోకూడిన దీనిని తెలిసిన మనుజుడు అనూయ లేనివాడై విధిప్రకారముగ తగురీతిని ఆచరించినచో పరిపూర్ణమైన గౌరవమును పొందును.

## శారీరస్థాన సంగ్రహము.

మూ॥ శరీరం చిన్త్యతే సర్వం దైవమానుష సంపదా । సర్వభావైర్యతస్తస్మాచ్ఛారీరం స్థానముచ్యతే ॥71॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతి సంస్కృతే శారీరస్థానే జాతిసూత్రీయ శారీరం నామాఽష్టమోఽధ్యాయః ॥

అ॥ ఈ స్థానమునందు దైవసంపత్తుచేతను మనుష్యసంపత్తుచేతను సమస్త భావములచేతను శరీరమునుగురించి చెప్పబడినది గావున శారీరస్థానమని చెప్పబడుచున్నది.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామక కృష్ణమూర్తి ప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు జాతిసూత్రీయ శారీర మనెడు అష్టమాధ్యాయము సమాప్తము.

—*—

## శారీరస్థానము సమాప్తము.



# ఇంద్రియస్థానము.

## ప్రథమాధ్యాయము.

మూ॥ అథాతో వర్ణస్వరీయమిన్ద్రియం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట వర్ణస్వరీయేంద్రియమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

### ఆయుఃప్రమాణమును తెలిసికొనుటకు పరీక్షింపదగిన భావములు.

మూ॥ ఇహ ఖలు వర్ణశ్చ స్వరశ్చ గన్ధశ్చ రసశ్చ స్పర్శశ్చ చక్షుశ్చ శ్రోత్రం చ ఘ్రాణం చ రసనం చ స్పర్శనం చ సత్త్వం చ భక్తిశ్చ శౌచం చ శీలం చాచారశ్చస్మృతిశ్చాకృతిశ్చబలం చ గ్లానిశ్చ తన్ద్రా చారమ్భశ్చ గౌరవం చ లాఘవం చాహారగుణాశ్చాహార పరిణామ శ్చోపాయశ్చాపాయశ్చ వ్యాధిశ్చవ్యాధి పూర్వరూపం చ వేదనాశ్చోపద్రవాశ్చ ఛాయా చ ప్రతిచ్ఛాయా చ స్వప్నదర్శనం చ దూతాధికారశ్చ పథి చౌత్పాతికం చాతురకులే భావావస్థాన్తరాణి చ భేషజ సంవృత్తిశ్చ భేషజ వికారయుక్తిశ్చేతి పరీక్ష్యాణి ప్రత్యక్షానుమానోపదేశై రాయుషః ప్రమాణవిశేషం జిజ్ఞాసమానేన భిషజా ॥3॥

అ॥ ఆయుఃప్రమాణ విశేషమును తెలిసికొనదలచిన వైద్యుడు—వర్ణము, స్వరము, గంధము, రసము, స్పర్శము, చక్షుస్సు, శ్రోత్రము, ఘ్రాణము, రసనము, స్పర్శనము, మనస్సు, కోరిక, శుచిత్వము, స్వభావము, ఆచారము, స్మరణశక్తి, ఆకృతి, బలము, బడలిక, నిద్ర, ప్రారంభము, గురుత్వము, లఘుత్వము, ఆహారగుణములు, ఆహారపరిణామము, ఉపాయము, అపాయము, వ్యాధి, వ్యాధి పూర్వరూపము, బాధలు, ఉపద్రవములు, ఛాయ, ప్రతిచ్ఛాయ, స్వప్నము కలుగుట, దూతాధి

కారము, మార్గమునందలి ఉత్పాతములు, రోగి గృహమునందలి అవస్థావిశేషములు, ఔషధమును సమకూర్చుట, ఔషధము వికృతినొందుట వీనిని ప్రత్యక్షప్రమాణము చేతను అనుమాన ప్రమాణముచేతను ఆప్తోపదేశముచేతను పరీక్షింపవలయును.

## పరీక్ష్యభావ ద్వైవిధ్యము.

మూ॥ తత్ర ఖల్వేషాం పరీక్ష్యాణాం కాని చిత్పురుషమనాశ్రితాని కానిచిచ్చ పురుష సంశ్రయాణి; తత్ర యాని పురుషమనాశ్రితాని తాన్యుపదేశతో యుక్తితశ్చ పరీక్షేత, పురుష సంశ్రయాణి పునః ప్రకృతితశ్చ వికృతితశ్చ ॥5॥

అ॥ పరీక్షింపదగిన ఈ భావములలో కొన్ని రోగిని ఆశ్రయింపనివిగను కొన్ని ఆశ్రయించినవిగను నుండును. రోగిని ఆశ్రయింపని భావములను ఆప్తోపదేశము వలనను అనుమాన ప్రమాణమువలనను పరీక్షింపవలయును. రోగిని ఆశ్రయించిన భావములను ప్రకృతివలనను వికృతివలనను పరీక్షింపవలయును.

## ప్రకృతి వికృతి వివరణము.

మూ॥ తత్ర ప్రకృతిర్జాతి ప్రసక్తా చ కులప్రసక్తా చ దేశానుపాతినీ చ కులానుపాతినీ చ వయోఽనుపాతినీ చ ప్రత్యాత్మనియతా చ; జాతికులదేశకాలవయః ప్రత్యాత్మనియతా హి తేషాం తేషాం పురుషాణాం తే తే భావవిశేషా భవన్తి॥ వికృతిః పునర్లక్షణనిమిత్తా చ లక్ష్యనిమిత్తా చ నిమిత్తానురూపా చ। తత్ర లక్షణనిమిత్తా నామ సా, యస్యాః శరీరే లక్షణాన్యేవ హేతుభూతాని భవన్తి దైవాత్, లక్షణాని హి కానిచిచ్ఛరీరోపనిబద్ధాని భవన్తి, యాని హి తస్మింస్తస్మిన్ కాలే తత్రాధిష్ఠానమాసాద్య తాం తాం వికృతిముత్పాదయన్తి; లక్ష్యనిమిత్తా తు సా, యస్యా ఉపలభ్యతే నిమిత్తం, యథోక్తం నిదానేషు; నిమిత్తానురూపా తు నిమిత్తార్థకారిణీ యా, తామనిమిత్తాం నిమిత్తమాయుషః ప్రమాణజ్ఞానస్యేచ్ఛన్తి భిషజో భూయశ్చాయుషః క్షయనిమిత్తాం ప్రేతలిఙ్గానురూపాం, యామాయుషోఽన్తర్గతస్య జ్ఞానార్థముపదిశన్తి ధీరాః, యామధికృత్య పురుష సంశ్రయాణి ముమూర్షతాం లక్షణాన్యుపదేక్ష్యామ ఇత్యుద్దేశః। తద్విస్తరేణాను వ్యాఖ్యాస్యామః ॥6॥

అ॥ ప్రకృతి—జాతివలనను కులమువలనను దేశమువలనను కాలమువలనను వయస్సువలనను ప్రత్యాత్మవలనను కలుగును. జాతి, కులము, దేశము, కాలము, వయస్సు, ప్రత్యాత్మ వీనివలన ఆయాపురుషులకు ఆయాభావవిశేషములు కలుగును. వికృతి—లక్షణనిమిత్తముగను లక్ష్యనిమిత్తముగను నిమిత్తానురూపముగను నుండును. ఏవికృతికి శరీరమందలి లక్షణములే దైవవశమువలన కారణములగునో అది లక్షణ నిమిత్తవికృతి యనబడును. కొన్నిలక్షణములు శరీరమునందు అధిష్ఠానమునుపొంది యుండి ఆయాకాలములయందు ఆయావికృతులను దైవవశమువలన కలిగించును. ఏవికృతి నిదానములయందు చెప్పబడిన కారణములచే కలుగునో అది లక్ష్యనిమిత్త వికృతి యనబడును. ఏవికృతి కారణముయొక్క ప్రయోజనమును జేయునో అది నిమిత్తానురూపవికృతి యనబడును. అవ్యక్తమైననిమిత్తములు కల ఈ వికృతి ఆయుః ప్రమాణమును తెలిసికొనుటకు కారణముగను ఆయువుయొక్క క్షీణతకు కారణము గను ప్రేతతుల్యలక్షణములుగలదిగను నుండును. గుప్తమైన ఆయువుయొక్క జ్ఞానము కొరకు పండితులు దీనిని చెప్పుచున్నారు. చచ్చుటకుసిద్ధముగనున్న వానియొక్క పురు షాశ్రితలక్షణములను దీనియొక్క ఆధారమువలన చెప్పెదము. ఇట్లు ఇంద్రియస్థాన మునందలి విషయము సంక్షేపముగ చెప్పబడగలదు.

## వర్ణవివరణము.

మూ॥ తత్రాదిత ఏవ వర్ణాధికారః । తద్యథా—కృష్ణః కృష్ణ శ్యామః శ్యామావదాతోఽవదాతశ్చేతి ప్రకృతివర్ణాః శరీరస్య భవన్తి, యాంశ్చాపరానుపేక్షమాణో విద్యాదనూకతోఽన్యథా చాపి నిర్దిశ్యమానాంస్తద్జ్ఞైః; నీలశ్యామతామ్రహరితశుక్లాశ్చ వర్ణాః శరీరస్య వైకారికా భవన్తి, యాంశ్చాపరానువేక్షమాణో విద్యాత్, ప్రాగ్వికృతానభూతోత్పన్నాన్; ఇతి ప్రకృతివికృతివర్ణా భవన్త్యు క్తాః శరీరస్య॥ తత్ర ప్రకృతివర్ణమర్ధశరీరే వికృతివర్ణ మర్ధశరీరే ద్వా వపి వర్ణౌ మర్యాదావిక్తౌ దృష్ట్వా యద్యేవ సవ్యదక్షిణవిభాగేన యద్యేవ పూర్వపశ్చిమవిభాగేన యద్యుత్తరాధరవిభాగేన యద్యన్తర్బ హిర్విభాగేనాతురస్య రిష్టమితి విద్యాత్॥ ఏవమేవ వర్ణభేదో ముఖేఽ ప్యన్యతో వర్తమానో మరణాయ భవతి॥ వర్ణభేదేన గ్లానిహర్షరౌక్ష్య స్నేహా వ్యాఖ్యాతాః॥ తథా పిప్లువ్యఙ్గతిలకాలకపిడకానామాననే జన్మాతురస్యైవమేవాప్రశస్తం విద్యాత్॥ నఖనయనవదనమూత్ర పురీషహస్తపాదౌష్ఠాదిష్వపి చ వైకారికోక్తానాం వర్ణానామన్యత మస్య ప్రాదుర్భావో హీనబలవర్ణేన్ద్రియేషు లక్షణమాయుషః క్షయ

స్య భవతి॥ యచ్చాన్యదపి కించిద్వర్ణవైకృతమభూతపూర్వం సహసోత్పద్యే తానిమిత్తమేవ హీయమానస్యాతురస్య శశ్వత్, తచ్చారిష్టం; ఇతి వర్ణాధికారః ॥13॥

ఆ॥ వానిలో వర్ణాధికారము మొదట చెప్పబడుచున్నది. ఎటులనగా— నలుపు, నలుపుతోకూడినశ్యామవర్ణము, శ్యామవర్ణముతోకూడినగౌరవర్ణము, గౌరవర్ణము ఇవి శరీరమునకు ప్రకృతివర్ణములుగ నుండును. ఇట్టిఇతరవర్ణములను సాదృశ్యమువలనగాని ఇతరవిధమునగాని చూచి తెలిసికొనవలయును. వర్ణమును తెలిసినవారు వానినిచెప్పెదరు. నీలవర్ణము, శ్యామవర్ణము, తామ్రవర్ణము, ఆకుపచ్చనివర్ణము, తెల్లనివర్ణము ఇవి శరీరముయొక్క వికృతివర్ణములుగ నుండును. పూర్వపువర్ణముకంటె భిన్నముగమారివట్టియు అదివరలోనుండక క్రొత్తగ పుట్టినట్టియుఇట్టిఇతరవికృతివర్ణములను ఆలోచించి తెలిసికొనవలయును. ఇట్లు శరీరముయొక్క ప్రకృతివర్ణములునువికృతివర్ణములును చెప్పబడినవి. కుడిఎడమలభేదముచేగాని ముందువెనుకలభేదముచేగాని క్రిందుమీదుల భేదముచేగాని లోపలవెలుపలభేదముచేగాని సగముశరీరమునందు ప్రకృతివర్ణమును సగముశరీరమునందు వికృతివర్ణమును సమానములుగనుండుట రోగియొక్క రిష్టలక్షణములుగ నుండును. ఈవిధముగనే వర్ణభేదము ముఖమునందుగాని ఇతరభాగములయందుగాని కలిగినచో రోగికి మరణము సంభవించును. వర్ణభేదముచేరిష్టముకలుగువిధముననే గ్లాని, వృద్ధి, రౌక్ష్యము, స్నేహము వీనియొక్క భేదములచేకూడ రిష్టము కలుగును. రోగికి ముఖమునందు పిప్లువు (పుట్టుమచ్చభేదము), మంగు, పుట్టుమచ్చ, బొక్క ఇవి వర్ణభేదమువలె జనించినచో రిష్టలక్షణముగ నుండును. క్షీణించినబలము వర్ణము ఇంద్రియపాటవము ఇవి కలవారలకు గోళ్ళు నేత్రములు ముఖము మూత్రము పురీషము చేతులు కాళ్ళు పెదవులు మొదలగువానియందు వికృతివర్ణములలో ఏదియో యొకటి జనించుట ఆయుఃక్షీణలక్షణముగ నుండును. క్షీణించుచున్న రోగికి, వికృతివర్ణములలో చెప్పబడకపోయినను రోగికి పూర్వమునందులే నట్టివర్ణవికృతి కారణము లేకుండగ దేహాత్తుగ తరుచు జనించుటకూడ రిష్టలక్షణముగ నుండును. ఇట్లువర్ణాధికారము చెప్పబడినది.

## స్వరవివరణము.

మూ॥ స్వరాధికారస్తు—హంసక్రౌఞ్చనేమిదున్దుభికలవిఙ్కకాకకపోతఝర్ఝరానుకారాః ప్రకృతిస్వరా భవన్తి; యాంశ్చాపరానుపేక్షమాణోఽపి విద్యాదనూకతోఽన్యథావాఽపినిర్దిశ్యమానాంస్తద్జ్ఞైః॥ ఏడకకలగ్రస్తావ్యక్తగద్గదక్షామదీనానుకీర్ణాస్త్వాతురాణాం స్వరావైకారికా భవన్తి, యాంశ్చాపరానుపేక్షమాణోఽపి విద్యాత్ప్రాగ్వికృతానభూతోత్పన్నాన్; ఇతి ప్రకృతి వికృతిస్వరా వ్యాఖ్యాతాః॥

తత్ర ప్రకృతివైకారికాణాం స్వరాణామాశ్వభినిర్వృత్తిః సర్వాస్వనేక త్వమేకస్య చానేకత్వమప్రశస్తం; ఇతి స్వరాభికారః ॥ 6॥

అ॥ హంస, క్రౌంచపక్షి, చక్రముయొక్క నేమి, దుందుభిఅనెడి వాద్యవిశే షము. పిచ్చుక, కాకి, పావురము, జర్ఘరము అనెడి వాద్యవిశేషము వీనియొక్క ధ్వనుల నుఅనుకరించిన స్వరములు ప్రకృతిస్వరములుగ నుండును. ఇట్టియితరస్వరములను కూడ సాదృశ్యమువలనగాని ఇతరవిధముగ గాని చూచి తెలిసికొనవలయును. స్వరమును తెలి సినవారు వానిని చెప్పెదరు. గొర్రెయొక్క స్వరమును అనుకరించిన స్వరమును, సూక్ష్మముగను పట్టుకొనబడినట్లును అవ్యక్తముగను గద్గదముగను రూక్షముగనుదీనము గను తేలిపోయినదిగను నుండు స్వరములును వికృతిస్వరములుగ నుంచును. పూర్వపు స్వరముకంటె భిన్నముగ మారినట్టియు అదివరలోనుండక క్రొత్తగ పుట్టినట్టియు ఇట్టి ఇతరస్వరములను ఆలోచించి తెలిసికొనవలయును, ఇట్లు పరికృతిస్వరములును వికృతి స్వరములును చెప్పబడినవి. వికృతిస్వరములు హఠాత్తుగ కలుగుట, ఒకేకాలమునందు అనేకస్వరములుకలుగుట, ఒకేస్వరముఅనేకవిధములుగమారుట ఇవి రిష్టలక్షణములుగ నుండును. ఇట్లు స్వరాధికారము చెప్పబడినది.

మూ॥ ఇతి వర్ణస్వరాధికారౌ యథావదుక్తౌ ముమూర్షతాం జ్ఞానార్థమితి ॥ 17 ॥

అ॥ ఇట్లు, ఆసన్నమరణమును తెలిసికొనుటకు వర్ణాధికారమును స్వరాధికార మును చెప్పబడినవి.

మూ॥ యస్య వైకారికో వర్ణః శరీర ఉపజాయతే। అర్ధే వా యది వా కృత్స్నే నిమిత్తం న చ నాఽస్తి సః ॥ నీలం వా యది వా శ్యావం తామ్రం వా యది వాఽరుణమ్। ముఖార్ధమన్యథా వర్ణో ముఖార్ధేఽరిష్టముచ్యతే ॥ స్నేహో ముఖార్ధే సువ్యక్తో రౌక్ష్యమర్ధ ముఖే భృశమ్ । గ్లానిరర్ధే తథా హర్షో ముఖార్ధే ప్రేతలక్షణమ్ ॥ తిలకాః పిప్లవో వ్యఙ్గా రాజయశ్చ పృథగ్విధాః। ఆతురస్యాశుజాయన్తే ముఖే ప్రాణాన్ముముక్షతః ॥ పుష్పాణి నఖదన్తే వా పఙ్కో వా దన్తసంశ్రితః। చూర్ణకో వాఽపి దన్తేషు లక్షణం మరణస్య తత్ ॥ ఓష్ఠయోః పాదయోః పాణ్యోరక్ష్ణోర్మూత్రపురీషయోః । నఖేష్వపి చ వైవర్ణ్యమేతత్క్షీణబలేఽన్తకృత్ ॥ యస్యనీలావుభావోష్ఠౌ పక్వజా మ్బవసన్నిభౌ । ముమూర్షురితి తం విద్యాన్నరోధీరో గతాయుషమ్ ॥ ఏకో వా యది వాఽనేకో యస్య వైకారికః స్వరః । సహసోత్పద్యతే

జన్తోర్మ్రియమాణస్య నాస్తి సః॥ యచ్చాన్యదపి కించిత్స్యా ద్వైకృతం
స్వరవర్ణయోః । బలమాంసవిహీనస్య తత్సర్వం మరణోదయమ్ ॥౨౬॥

అ॥ ఏవనియొక్క సర్వశరీరమునందుగాని అర్ధశరీరమునందుగాని వికృతివర్ణము జనించునోవాడు మరణమునొందును. ముఖముయొక్క అర్ధభాగమునందు నీలవర్ణముగాని శ్యావవర్ణముగాని తామ్రవర్ణముగాని అరుణవర్ణముగాని యుండి మిగిలినయర్ధభాగములో స్నేహమును మిగిలినఅర్ధభాగములో రౌక్ష్యమును ఉండుట అర్ధభాగములో గ్లానియు మిగిలినఅర్ధభాగములో వృద్ధియుఉండుటగాని మరణలక్షణముగ నుండును. రోగియొక్క ముఖమునందు పుట్టుమచ్చ, పుట్టుమచ్చభేదము, అనేకవిధములయిన రేఖలు ఇవి జనించినచో మరణము కలుగును. గోళ్ళయందును దంతములయందును తెల్లనిమచ్చలు గాని దంతములయందు పాచిలేక శర్కరగాని సంభవించుటమరణలక్షణముగనుండును. క్షీణించినబలముకలవానికి పెదవులు, పాదములు, హస్తములు, నేత్రములు, మూత్రము, పురీషము, గోళ్ళు వీనియందు వికృతివర్ణముకలిగినచో మరణము కలుగును. ఎవని యొక్క రెండుపెదవులును నీలవర్ణముగనుండి పండిననేరేడుపండువలెనుండునో అట్టి వాడు మరణమునొందును. క్షీణించుచున్న వానికివైకారికస్వరములలోఒకటిగాని అనేకములుగాని హఠాత్తుగ కలిగినచో మరణము కలుగును. బలమును మాంసమును క్షీణించినవానికి ఇట్టిఇతరములయిన స్వరవికృతిగాని వర్ణవికృతిగాని కలిగినచో అవికూడ మరణలక్షణములుగ నుండును.

అధ్యాయసంగ్రహము.

మూ॥ ఇతి వర్ణస్వరావుక్తౌ లక్షణార్థం ముమూర్షతామ్ ।
యస్తు సమ్యగ్విజానాతి నాయుర్జ్ఞానే స ముహ్యతి ॥౨౬॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతి సంస్కృతే ఇన్ద్రియస్థానే వర్ణస్వరీయమిన్ద్రియం నామ ప్రథమోఽధ్యాయః॥

అ॥ ఆసన్నమృత్యువుయొక్క లక్షణములు తెలియునిమిత్తమును వర్ణమును స్వరమును ఇట్లు చెప్పబడినవి. వీనిని సరిగ తెలిసికొనినచో ఆయుర్జ్ఞానవిషయమై మోహము నొందడు.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి
చరకసంహితావ్యాఖ్యానమునందు వర్ణస్వరీయేంద్రియమనెడు
ప్రథమాధ్యాయము సమాప్తము.

# ద్వితీయాధ్యాయము.

మూ॥ అథాతో పుష్పితక మిన్ద్రియం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట పుష్పితకేంద్రియమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ పుష్పం యథా పూర్వరూపం ఫలస్యేహ భవిష్యతః । తథా లిఙ్గమరిష్టాఖ్యం పూర్వరూపం మరిష్యతః ॥ అప్యేవం తు భవేత్పుష్పం ఫలేనాననుబన్ధి యత్ । ఫలం చాపి భవేత్కించిద్యస్య పుష్పం న పూర్వజమ్ ॥ న త్వరిష్టస్య జాతస్య నాశోఽస్తిమరణాదృతే। మరణంచాపి తన్నాస్తి యన్నారిష్టపురః సరమ్॥ మిథ్యాదృష్టమరిష్టాభమనరిష్టమజానతా । అరిష్టం వాఽప్యసంబుద్ధమేతత్ప్రజ్ఞాపరాధజమ్॥ జ్ఞానసంబోధనార్థం తు లిఙ్గైర్మరణపూర్వజైః। పుష్పితానుపదేక్ష్యామో నరాన్ బహువిధైర్బహూన్ ॥7॥

అ॥ ఏర్పడబోవు ఫలమునకు పుష్పము పూర్వరూపముగనుండునట్లు కలుగబోవు మరణమునకు అరిష్టమనులక్షణము పూర్వరూపముగనుండును. ఫలమేర్పడని పుష్పము ఉండవచ్చును. పుష్పములేకుండగనే ఫలము ఉండవచ్చును. కాని కలిగినఅరిష్టము మరణమునుకలిగింపకుండగనే నశింపదు. అరిష్టముకలుగనిదే మరణము కలుగదు. అజ్ఞానుడు అరిష్టముకానిదానినిఅరిష్టమునుగాని అరిష్టతుల్యమునుగానితలచుటకును, అరిష్టమును తెలిసికొనలేకపోవుటకును వానియొక్క ప్రజ్ఞాపరాధము కారణముగ నుండును. అరిష్టలక్షణములను తెలిసికొనుటకొరకు మరణమునకుపూర్వమునందుకలుగునట్టియు అనేకవిధములైనట్టియు లక్షణములచే పుష్పితులుగనుండు అనేకవిధములైన మనుజులను చెప్పబోవుచున్నాము.

## పుష్పితమనుజునియొక్క లక్షణములు.

మూ॥ నానాపుష్పోపమో గన్ధో యస్య వాతి దివానిశమ్ పుష్పితస్య వనస్యేవ నానాద్రుమలతావతః ॥ తమాహుః పుష్పితం ధీరా నరం మరణలక్షణైః । స నా సంవత్సరాద్దేహం జహాతీతి

వినిశ్చయః ॥ ఏవమేకైకశః పుష్పైర్యస్య గన్ధః సమో భవేత్। ఇష్టైర్వా యది వాఽనిష్టైః స చ పుష్పిత ఉచ్యతే॥ సమాసేనాశుభాన్ గన్ధానేకత్వేనాథ వా పుమాన్ । ఆజిఘ్రేద్యస్య గాత్రేషు తం విద్యాత్పుష్పితం భిషక్॥ అప్లుతానాప్లుతే కాయే యస్య గన్ధాః శుభాశుభాః । వ్యత్యాసేనానిమిత్తాః స్యుః స చ పుష్పిత ఉచ్యతే ॥12॥

అ॥ అనేకవిధములైన వృక్షములతోడను లతలతోడను కూడినట్టియు పుష్పించినట్టియు వనమునుండివలె ఎవనియొక్క శరీరమునుండి అనేకవిధములైన పుష్పముల యొక్క గంధముతో సమానమైనగంధము రాత్రింబగళ్ళు వచ్చుచుండునో ఆట్టివానిని మరణలక్షణములతో పుష్పితునిగ తెలిసికొనవలయును. అట్టిమనుజుడు ఒకసంవత్సరములో నిశ్చయముగ మరణించును. ఇట్లే ఎవనియొక్క శరీరమునుండి ఇష్టమైనట్టికాని అనిష్టమైనట్టికాని గంధముకల పుష్పములలో దేనియొక్క గంధమువంటిగంధమైనను వెడలుచుండునో అట్టిమనుజుడుగూడ పుష్పితుడని చెప్పబడును. ఎవనియొక్క శరీరమునుండి దుర్గంధములు అనేకములుగగాని ఒకటిగాని వెడలుచుడునో అట్టివాడు కూడ పుష్పితుడని చెప్పబడును. స్నానములుచేసినను చేయకపోయినను ఎవనియొక్క శరీరమునుండి శుభాశుభగంధములు కారణములేకుండగనే వ్యత్యాసముగ వెడలుచుండునో ఆట్టివాడుగూడ పుష్పితుడుగ చెప్పబడును.

## శుభాంగశుభగంధములు

మూ॥ తద్యథా చన్దనం కుష్ఠం తగరాగురుణీ మధు । మాల్యం మూత్రపురీషే చ మృతాని కుణపానిచ ॥ యే చాన్యే వివిధాత్మానో గన్ధా వివిధయోనయః । తేఽప్యనేనానుమానేవ విజ్ఞేయా వికృతిం గతాః ఇదం చాప్యతిదేశార్థం లక్షణం గన్ధసంశ్రయమ్ ॥ వక్ష్యామో యదభిజ్ఞాయ భిషఙ్మరణమాదిశేత్ ॥ వియోనిర్వోదురో యస్య గన్ధో గాత్రేషు దృశ్యతే। ఇష్టో వా యది వాఽనిష్టో న స జీవతి తాం సమామ్ ॥ ఏతావద్గన్ధవిజ్ఞానం, రసజ్ఞానమతః పరమ్। ఆతురాణాం శరీరేషు వక్ష్యామో విధిపూర్వకమ్ ॥17॥

అ॥ చందనము చెంగల్వకోష్టు గ్రంధితగరము కృష్ణాగరు తేనె పుష్పమాలికలు మూత్రము పురీషము గోవులుమెదలగువానిశవములు మనుష్యశవములు వీనియొక్కగంధములు, అనేకవిధములగుద్రవ్యములచేసిద్ధముచేయబడిన అనేకవిధములైన గంధములు వీనిని పూర్వమునందుచెప్పబడిన యుక్తిననుసరించి ఊహచే వికృతినిబొందినవానినిగ తెలిసికొనవలయును. ఇదివరలోచెప్పబడనట్టియు గంధమునాశ్రయించిన

ట్టియు మరణము తెలియజేయునట్టియు లక్షణమును చెప్పబోవుచున్నాము. ఇష్టగంధముగాని అనిష్టగంధముగాని కారణములేకుండగనే ఎవని శరీరమునందు స్థిరముగ నుండునో అట్టివాడు ఆ సంవత్సరముకూడ జీవింపడు. ఇట్లు గంధమునుబట్టి మరణమును తెలిసికొను విధము చెప్పబడినది. పిమ్మట రోగులయొక్క శరీరమునందలి రసమునుబట్టి మరణమును తెలిసికొను విధమును చెప్పబోవుచున్నాము.

## రసజ్ఞానము.

మూ॥ యో రసః ప్రకృతిస్థానాం నరాణాం దేహసంభవః। స ఏషాం చరమే కాలే వికారాన్ భజతే ద్వయమ్ ॥ కశ్చిదేవాస్య వైరస్య మత్యర్థ ముపపద్యతే। స్వాదుత్వమపరశ్చాపి విపులం భజతే రసః॥ తమనేనానుమానేన విద్యాద్వికృతితాం గతమ్। మనుష్యో హి మనుష్యస్య కథం రసమవాప్నుయాత్ ॥ మక్షికాశ్చైవ యూకాశ్చ దంశాశ్చ మశకైః సహ। విరసాదపసర్పన్తి జన్తోః కాయాన్ముమూర్షతః ॥ అత్యర్థరసికం కాయం కాలపక్వస్య మక్షికాః। అపి స్నాతానులిప్తస్య భృశమాయాన్తి సర్వశః ॥22॥

అ॥ ప్రకృతియందున్న మనుజులయొక్క శరీరమునందలి రసము అంత్యకాలమునందు రెండువిధములైన వికారములను పొందును. ఆరసము అధికమగు వైరస్యమునుగాని అధికమగు మాధుర్యమునుగాని పొందును. మనుష్యునియొక్క శరీరమునందలి రసమును మనుష్యుడు స్వయముగ తెలిసికొనుటకు వీలులేదు. కావున క్రింద చెప్పబోవుయుక్తిచే వికృతినొందిన రసమును తెలిసికొనవలయును. చచ్చుటకు సిద్ధముగనున్న మనుజునియొక్క శరీరము విరసముగ నున్నచో ఈగలు పేలు చీమలు దోమలు ఇవి అట్టిశరీరమునుండి వెంటనే తొలగిపోవును. అధికమైన మధురరసము కలదిగనున్నచో అట్టి మనుజుడు స్నానముచేసి లేపనములను చేసికొనినను వాని శరీరమునందు అంతటను ఈగలు అధికముగ ప్రాలుచుండును.

## అధ్యాయ సంగ్రహము.

మూ॥ యాన్యేతాని మయోక్తాని లిఙ్గాని రసగన్ధయోః।
పుష్పితస్య నరస్యైతత్ఫలం మరణమాదిశేత్ ॥23॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే ఇన్ద్రియస్థానే పుష్పితకేన్ద్రియం నామ ద్వితీయోఽధ్యాయః ॥

ఆ॥ రససంబంధమైనట్టియు గంధసంబంధమైనట్టియు నాచే చెప్పబడిన ఈలక్షణములచే పుష్పితమనుజునియొక్క మరణమును తెలిసికొనవలయును.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామకకృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపికయనెడి చరక సంహితావ్యాఖ్యానమునందు పుష్పితకేంద్రియమనెడు ద్వితీయాధ్యాయము సమాప్తము.

—0—

# తృతీయాధ్యాయము.

మూః అథాతః పరిమర్శనీయ మిన్ద్రియం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట పరిమర్శనీయేంద్రియమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

ఆ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ వర్ణే స్వరే చ గన్ధే చ రసే చోక్తం పృథక్ పృథక్ ।
లిఙ్గం ముమూర్షతాం సమ్యక్ స్పర్శేష్వపి నిబోధత ॥3॥

ఆ॥ చచ్చుటకు సిద్ధముగనున్న వానియొక్క వర్ణమునందును స్వరమునందును గన్ధమునందును రసమునందును కలుగు లక్షణములు వేరు వేరుగ చెప్పబడినవి. స్పర్శయందుకలుగు లక్షణములు చెప్పబడగలవు.

## స్పర్శలక్షణములు.

మూ॥ స్పర్శప్రాధాన్యేనైవాతురస్యాయుషః ప్రమాణ విశేషం జిజ్ఞాసుః ప్రకృతిస్థేన పాణినా కేవలమస్య శరీరం స్పృశేత్ విమర్శయేద్వాఽన్యేన ॥ పరిమృశతా తు ఖల్వాతుర శరీర మిమే భావాస్తత్ర తత్రావబోద్ధవ్యా భవన్తి; తద్యథా — సతతం స్పన్దనానాం శరీర దేశానాం స్తమ్భః, నిత్యోష్మణాం శీతీభావః, మృదూనాం దారుణత్వం, శ్లక్ష్ణానాం ఖరత్వం, స్థూలానాం వృషణాదీనాం సతామసద్భావః, సన్ధీనాం స్రంసభ్రంశచ్యవనాని, మాంసశోణితయోర్వ్యతీభావో దారుణత్వం, స్వేదానుబన్ధః స్తమ్భో వా, యచ్చాన్యదపి కించిదీదృశం స్పర్శానాం లక్షణమనిమిత్తం స్యాత్; ఇతి లక్షణానాం సంగ్రహః స్పర్శానామ్ ॥5॥

అ॥ రోగియొక్క ఆయుఃప్రమాణమును స్పర్శచే తెలిసికొనదలచినవాడు ప్రకృతిగనున్న తనయొక్క చేతితోగాని ఇతరునియొక్క చేతితోగాని రోగియొక్క సమస్తశరీరమును స్పృశింపవలయును. స్పృశించునపుడు రోగియొక్క శరీరమునందలి ఈక్రిందిభావములను తెలిసికొనవలయును. ఎటులనగా—ఎల్లప్పుడును కదలుచుండు శరీరావయవములు స్తంభించుట, ఎల్లప్పుడును వేడిగనుండు శరీరావయవములు చల్లపడుట, మృదువులుగనున్నవి కాఠిన్యమునొందుట, నునుపుగనున్నవి గరుకుబారుట, స్థూలరూపముగనుండు వృషణాదులు ఉన్నను లేనట్లుకనబడుట, సంధులు జారిపోయి కాని పట్టుతప్పి కాని ప్రక్కకుజారి కానియుండుట, మాంసమును రక్తమును క్షీణించి కాని కాఠిన్యమునొందికాని యుండుట, చెమట అధికముగజనించుట లేక జనింపకుండుట వీనిని తెలిసికొనవలయును. మరియు కారణములేకుండగనే స్పర్శయందు కలుగు ఇట్టి ఇతర లక్షణములనుకూడ తెలిసికొనవలయును. ఇట్లు స్పర్శలక్షణములు సంగ్రహముగ చెప్పబడినవి.

## స్పర్శలక్షణ వివరణము.

మూ॥ తద్వ్యాసతోఽనువ్యాఖ్యాస్యామః — తస్య చేత్పరిమృశ్యమానం పృథక్త్వేన పాదజఙ్ఘోరుస్ఫిగుదరపార్శ్వ పృష్ఠేషికాపాణి గ్రీవాతాల్వోష్ఠ లలాటం స్విన్నం శీతం స్తబ్ధం దారుణం వీతమాంస శోణితం వా స్యాత్, పరాసురయం పురుషో న చిరాత్కాలం కరిష్యతీతి విద్యాత్ ॥6॥

అ॥ స్పర్శలక్షణములను విస్తరించి చెప్పుచున్నాము. రోగియొక్క పాదములు పిక్కలు తొడలు పిరుదులు ఉదరము పార్శ్వములు పృష్ఠవంశము హస్తములు మెడ తాలుప్రదేశములు పెదవులు లలాటప్రదేశము వీనిని వేరువేరుగస్పృశించినపుడు చెమటబట్టినను చల్లబడినను స్తంభించినను కఠినముగనున్నను క్షీణించిన మాంసశోణితములు కలవిగనున్నను అట్టిపురుషుడు చాలకాలము జీవింపడనియు వెంటనే మరణించుననియు తెలిసికొనవలయును.

మూ॥ తస్య చేత్ పరిమృశ్యమానాని పృథక్త్వేన గుల్ఫజానువఙ్క్షణగుదవృషణమేఢ్రనాభ్యంసస్తనమణికహనుపర్శుకానాసికాకర్ణాక్షిభ్రూశఙ్ఖాదీని స్రస్తాని వ్యస్తాని చ్యుతాని వా స్థానేభ్యః స్యుః, పరాసురయం పురుషో న చిరత్కాలం కరిష్యతీతి విద్యాత్ ॥7॥

అ॥ రోగియొక్క చీలమండలు మోకాళ్ళు గజ్జలు గుదప్రదేశము వృషణములు మేఢ్రము నాభి భుజశిరస్సులు స్తనప్రదేశములు మణికట్టులు అంకిళ్ళు పర్శుకాస్థులు ముక్కు చెవులు నేత్రములు కనుబొమ్మలు కణతలు మొదలైనవానిని స్పృశించినప్పుడు అవి స్వస్థానమునుండి జారినవిగ గాని విడిపోయినవిగగాని ప్రక్కకుతొలగి

నవిగాని ఉన్నచో అట్టి మనుజుడు చాలకాలము జీవింపడనియు వెంటనే చనిపోవు ననియు తెలిసికొనవలయును.

మూ॥ తథాఽస్యోచ్ఛ్వాసమన్యాదన్త పక్ష్మచక్షుః కేశలోమోదరనఖాఙ్గులిగణం చ లక్షయేత్ । తస్య చే దుచ్ఛ్వాసోఽతిదీర్ఘోఽతిహ్రస్వో వా స్యాత్, పరాసురితి విద్యాత్; తస్య చేన్మన్యే పరిమృశ్యమానే న స్పన్దేయాతాం, పరాసురితి విద్యాత్; తస్యచేద్దన్తాః పరిశీర్ణాః శ్వేతా జాతశర్కరాః స్యుః, పరాసురితి విద్యాత్; తస్య చేత్పక్ష్మాణి జటాబద్ధాని స్యుః, పరాసురితి విద్యాత్; తస్య చేచ్చక్షుషీ ప్రకృతిహీనే వికృతియుక్తేఽత్యుత్పిణ్డితేఽతిప్రవిష్టేఽతిజిహ్మేఽతివిషమేఽతిప్రస్రుతేఽతివిముక్తబన్ధనే సతతోన్మిషితే సతతనిమేషితే నిమేషోన్మేషాతిప్రవృత్తే విభ్రాన్త దృష్టికే విపరీతదృష్టికే హీనదృష్టికే వ్యస్తదృష్టికే నకులాన్ధే కపోతాన్ధేఽలాతవర్ణే కృష్ణనీలపీతశ్యావతామ్రహరితహారిద్ర శుక్లవైకారికాణాం వర్ణానామన్యతమేనాతిసంప్లుతే వా స్యాతాం, పరాసురితి విద్యాత్; అథాస్య కేశలోమాన్యాయచ్ఛేత్—తస్య చేత్కేశలోమాన్యాయమ్యమానాని ప్రలుచ్యేరన్న చ వేదయేయుః, పరాసురితి విద్యాత్; తస్య చేదుదరేసిరాః ప్రదృశ్యేరన్ శ్యావతామ్రనీలహారిద్రశుక్లా వా స్యుః, పరాసురితి విద్యాత్; తస్య చేన్నఖా పీతమాంసశోణితాః పక్వజామ్బవవర్ణాః స్యుః, పరాసురితి విద్యాత్; అథాస్యాఙ్గులీరాయచ్ఛేత్తస్య చేదఙ్గులయ ఆయమ్యమానా న చేత్స్ఫుటేయుః, పరాసురితి విద్యాత్ ॥8॥

అ॥ రోగియొక్క ఉచ్ఛ్వాసము మెడకొంకులు దంతములు కనురెప్పలు నేత్రములు వెండ్రుకలు రోమములు ఉదరము గోళ్ళు వ్రేళ్ళు వీనినిగూడ పరీక్షింపవలయును. రోగియొక్క ఉచ్ఛ్వాసము అతిదీర్ఘముగగాని అతిహ్రస్వముగగాని ఉన్నను, మెడకొంకులను స్పృశించినచో అవి కదలకుండగనున్నను, దంతములు మలముతోకూడి కాని తెల్లగగాని శర్కరకలవిగగాని ఉన్నను, కనురెప్పలు జడలుకట్టియున్నను, అట్టిరోగిని వెంటనే మృతినొందువానినిగ తెలిసికొనవలయును. రోగియొక్క నేత్రములు ప్రకృతిహీనములుగ నుండుట, వికృతియుక్తములుగ నుండుట, మిక్కిలి పైకి ఉబ్బుట, మిక్కిలిలోనికిపోవుట, మిక్కిలి వంకరగనుండుట, మిక్కిలి విషమములుగ నుండుట, మిక్కిలినీరుకారుచుండుట, మిక్కిలిపట్టుతప్పినట్లుండుట, ఎల్లప్పుడును తెరచుకొనియుండుట, ఎల్లప్పుడును మూయబడియుండుట, నిమేషోన్మేషము అధికముగ జరు

గుట, దృష్టి భ్రాంతినొందుట, దృష్టివిపరీతముగనుండుట, దృష్టిహీనముగనుండుట, దృష్టి వ్యస్తముగనుండుట, సమస్తద్రవ్యములును పగటియందు తెల్లనివిగకనుపించుట, సమస్తద్రవ్యములును పగటియందు నల్లనివిగకనుపించుట, బొగ్గువలెనల్లనిరంగునుకలిగి యుండుట, వైకారికములగు నలుపు నీలము పచ్చదనము శ్యావవర్ణము తామ్రవర్ణము హారితవర్ణముపసుపువర్ణము తెలుపు ఈవర్ణములలోదేనినైనను అధికముగకలిగియుండుట ఈలక్షణములను కలిగియున్నచో అట్టిరోగి వెంటనేమృతినొందును. రోగియొక్క కేశములను రోమములను లాగినప్పుడు అవి బాధలేకుండగ ఊడిపోయినను, ఉదరమునందు సిరలు కనబడినను లేక శ్యావవర్ణము తామ్రవర్ణము నీలవర్ణము హారిద్రవర్ణము శుక్లవర్ణము వీనిలో ఏవర్ణమునైనను కలిగియున్నను, గోళ్ళు మాంసమును శోణితమును లేనివై పండిన నేరేడుపండువంటి వర్ణముకలవిగనున్నను, వ్రేళ్ళను లాగినప్పుడు వానియందు ధ్వని కలుగకున్నను అట్టిరోగి వెంటనే మృతినొందునని తెలిసికొనవలయును.

## అధ్యాయ సంగ్రహము.

మూ॥ ఏతాన్ స్పృశ్యాన్ బహూన్ భావాన్ యఃస్పృశన్నవబుధ్యతే । ఆతురే న స సంమోహం మాయుర్జ్ఞానస్య గచ్ఛతి ॥9॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతి సంస్కృతే ఇన్ద్రియస్థానే పరిమర్శనీయేన్ద్రియం నామ తృతీయోఽధ్యాయః ॥

అ॥ స్పృశింపతగిన అనేకవిధములగు ఈభావములను స్పృశించి తెలిసికొనినవాడు రోగియొక్క ఆయుర్జ్ఞానమువిషయమై మోహమునొందడు.

ఇవ్విధంబున శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరక దీపిక యనెడిచరకసంహితావ్యాఖ్యానమునందు పరిమర్శనీయేంద్రియమనెడు తృతీయాధ్యాయము సమాప్తము.

---

# చతుర్థాధ్యాయము.

---

మూ॥ అథాత ఇన్ద్రియానీకమిన్ద్రియం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట ఇంద్రియానీకేంద్రియమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ ఇన్ద్రియాణి యథా జన్తోః పరీక్షేత విశేషవిత్ । జ్ఞాతు మిచ్ఛన్ భిషజ్జ్ఞానమాయుష స్తన్నిబోధ మే ॥3॥

అ॥ రోగియొక్క ఆయుఃప్రమాణమును తెలిసికొనదలచిన వైద్యుడు ఇంద్రియములను ఎట్లుపరీక్షింపవలయునో అట్టివిధము చెప్పబడుచున్నది.

ఇంద్రియపరీక్షావిధానము.

మూ॥ అనుమానాత్పరీక్షేత దర్శనాదీని తత్త్వతః । అద్ధా హి విదితం జ్ఞానమిన్ద్రియాణామతీన్ద్రియమ్॥ స్వస్థేభ్యో వికృతం యస్య జ్ఞానమిన్ద్రియసంభవమ్। ఆలక్ష్యేతానిమిత్తేన లక్షణం మరణస్యతత్॥ ఇత్యుక్తం లక్షణం సమ్యగిన్ద్రియేష్వశుభోదయమ్ । తదేవ తు పునర్వ్యాఖ్యా విస్తరేణ నిబోధత ॥6॥

అ॥ చక్షురాదీంద్రియములయొక్క యాథార్థ్యమును అనుమానప్రమాణముచే పరీక్షింపవలయును. ఇంద్రియసంబంధమైనజ్ఞానము అతీంద్రియముమైనదగుటచేఅయ్యది అనుమానప్రమాణముచే గ్రహింపబడినదైనను యథార్థముగనే యుండును. ప్రకృతియందున్న ఇంద్రియములవలన ఎవనియొక్క ఇంద్రియజ్ఞానము కారణములేకుండగనే వికృతిగ గ్రహింపబడునో అట్టివానికి అది మరణలక్షణముగ నుండును ఇట్లు అశుభసూచకమగు ఇంద్రియలక్షణములన్నియు చెప్పబడినవి, వానినే విస్తరించి చెప్పుచున్నాము.

చక్షురింద్రియసంబంధమగుఅరిష్టము.

మూ॥ ఘనీభూతమివాకాశ మాకాశమివ మేదినీమ్। విగీతం హ్యుభయం హ్యేతత్పశ్యన్మరణమృచ్ఛతి। యస్య దర్శనమాయాతి మారుతోఽమ్బరగోచరః । అగ్నిర్నాయాతి చాదీప్తస్తస్యాయుఃక్షయమాదిశేత్ । జలే సువిమలే జాలమజాలావతతే తథా। స్థితే గచ్ఛతి వా దృష్ట్వా జీవితాత్పరిముచ్యతే॥ జాగ్రత్ పశ్యతి యః ప్రేతాన్ రక్షాంసి వివిధానిచ। అన్యద్వాఽప్యద్భుతం కించి న్న సజీవితుమర్హతి॥ యోఽగ్నిం ప్రకృతివర్ణస్థం నీలం పశ్యతి నిష్ప్రభమ్। కృష్ణం వాయదివా శుక్లం నిశాం వ్రజతి సప్తమీమ్॥ మరీచీనసతో మేఘాన్మేఘాన్వాప్యసతోఽమ్బరే। విద్యుతో వా వినా మేఘాత్ పశ్యన్మరణమృచ్ఛతి॥ మృణ్మయీమివ యః పాత్రీం కృష్ణామ్బరసమావృతామ్ । ఆదిత్యమీక్షతే శుద్ధం చన్ద్రం వా న స జీవతి॥ అపర్వణి యదాపశ్యేత్సూ

ర్వాచన్ద్రమసోర్గ్రహమ్। అవ్యాధితో వ్యాధితో వాతదన్తం తస్యజీవితమ్॥ నక్తం సూర్యమహశ్చన్ద్రమనగ్నౌ ధూమముత్థితమ్। అగ్నిం వా నిష్ప్రభం రాత్రౌ దష్ట్వా మరణమృచ్ఛతి॥ ప్రభావతః ప్రభాహీనాన్నిష్ప్రభాన్ వా ప్రభావతః నరా విలిఙ్గాన్ పశ్యన్తి భావాన్ ప్రాణాఞ్జిహాసవః। వ్యాకృతాని వివర్ణాని విసంఖ్యోపగతాని చ। వినిమిత్తాని పశ్యన్తి రూపాణ్యాయుఃక్షయే నరాః॥ యశ్చ పశ్యత్యదృశ్యాన్ వై దృశ్యాన్ యశ్చ న పశ్యతి। తావుభౌ పశ్యతః క్షిప్రం యమాలయమసంశయమ్ ॥18॥

అ॥ ఆకాశమును ఘనీభూతమైన దానివలెచూచుట భూమిని ఆకాశమువలె చూచుట ఈరెండువిధములైన విరుద్ధజ్ఞానములుకలవాడు మరణమును పొందును. ఎవనికి ఆకాశమునందుసంచరించుచున్న వాయువు రూపముకలదిగ కనపడునోమిక్కిలి ప్రజ్వలించుచున్న అగ్ని కనుపడకుండునో వానికి మరణముకలుగునని తెలిసికొనవలయును. స్థిరముగగాని ప్రవహించుచుగాని యున్నట్టియు నిర్మలమైనట్టియు వలలులేనట్టియు జలమునందు వలలున్నట్లు ఎవడు చూచునో అట్టివాడు మరణమును పొందును. ఎవడు జాగ్రదవస్థయందుండియు ప్రేతలను అనేకవిధములైన రక్షస్సులను లేక అద్భుతములైన ఇట్టి ఇతరములను చూచునో వాడు జీవింపనేరడు. ప్రకృతివర్ణముగనున్న అగ్నిని నీలవర్ణముగ గాని కాంతిహీనముగగాని నల్లగగాని తెల్లగగాని యున్నదానిగ ఎవడు చూచునో వాడు ఏడురోజులుమాత్రము జీవించును, లేనట్టిమేఘములయొక్క కాంతులనుగాని ఆకాశమందులేనట్టి మేఘములనుగాని మేఘములులేకుండ మెరపులనుగాని ఎవడు చూచునో వాడు మరణమును బొందును. నిర్మలమైన సూర్యబింబమునుగాని చంద్రబింబమునుగాని నల్లనివస్త్రముచేకప్పబడిన మట్టిపాత్రనువలె ఎవడు చూచునో అట్టివాడు జీవింపడు. వ్యాధిలేనట్టికాని వ్యాధికలిగినట్టికాని ఏమనుజుడు పర్వదినము గాకున్నను సూర్యగ్రహణమునుగాని చంద్రగ్రహణమునుగాని చూచునో అట్టివాడు జీవింపడు. రాత్రియందు సూర్యునిగాని పగటియందు చంద్రునిగాని అగ్నిలేకుండగనే ధూమమునుగాని రాత్రియందు అగ్నిని కాంతిలేనిదానినిగగాని ఎవడు చూచునో వాడు మరణమును బొందును. కాంతిగలవానిని కాంతిలేనివానినిగగాని కాంతిలేని వానిని కాంతిగలవానినిగగాని సమస్తభావములను తమలక్షణములులేనివానినిగగాని చూచువాడు ప్రాణములను విడుచును. ఆయువుక్షీణించిన మనుజుడు రూపములను కారణము లేకుండగనే అనేకవిధములైనఆకృతులుకలవానినిగను విపరీతవర్ణములుకల వానినిగనుసంఖ్యలేనివానినిగను చూచుచుండును. కనుపించుచున్నపదార్థములనుఎవడు చూడలేకుండునో లేనిద్రవ్యములను ఎవడు చూచునో అట్టివారిరువురును శీఘ్రముగ యమసాన్నిధ్యమును బొందెదరు.

## శ్రోత్రేంద్రియసంబంధమగు అరిష్టము.

మూ॥ అశబ్దస్య చ యః శ్రోతా శబ్దాన్ యశ్చ న బుధ్యతే। ద్వావప్యేతౌ యథా ప్రేతౌ తథా జ్ఞేయౌ విజానతా ॥ సంవృత్యాఙ్గులిభిః కర్ణౌ జ్వాలాశబ్దం య ఆతురః। న శృణోతి గతాసుం తం బుద్ధిమాన్ పరివర్జయేత్ ॥20॥

ఆ॥ లేనిశబ్దములను ఎవడు వినునో ఉన్నశబ్దములను ఎవడు గ్రహింపలేకుండునో అట్టివారి నిరువురిని ప్రేతతుల్యులనుగ తెలిసికొనవలయును. ఏరోగి తన వ్రేళ్ళచే రెండు చెవులను మూసుకొనినప్పుడు అందుకలుగు జ్వాలాశబ్దమును వినలేకుండునో అట్టివాడు జీవింపడని తెలిసికొనవలెను.

## ఘ్రాణేంద్రియ సంబంధమగు అరిష్టము.

మూ॥ విపర్యయేణ యో విద్యాద్గన్ధానాం సాధ్వసాధుతామ్। న వా తాన్ సర్వశో విద్యాత్తం విద్యాద్విగతాయుషమ్ ॥21॥

ఆ॥ ఏరోగి సుగంధమును దుర్గంధముగాని దుర్గంధమును సుగంధముగాని గ్రహించునో లేక ఎట్టి గంధమునుకూడ గ్రహింపలేకుండునో అట్టివాడు జీవింపజాలడు.

## రసనేంద్రియ సంబంధమగు అరిష్టము.

మూ॥ యో రసాన్న విజానాతి న వా జానాతి తత్త్వతః। ముఖపాకాదృతే పక్వం తమాహుఃకుశలా నరమ్ ॥22॥

ఆ॥ నోటిపూత మొదలగు వ్యాధులు లేకున్నను ఎవడు రసములను గ్రహింపలేకుండునో గ్రహించినను సరిగ గ్రహింపలేకుండునో అట్టివానియొక్క ఆయువు పక్వమైనదానినిగ తెలిసికొనవలయును.

మూ॥ ఉష్ణాన్ శీతాన్ ఖరాన్ శ్లక్ష్ణాన్మృదూనపి చ దారుణాన్। స్పృశ్యాన్ స్పృష్ట్వా తతోఽన్యత్వం ముమూర్షుస్తేషు మన్యతే ॥23॥

ఆ॥ ఉష్ణముగను శీతముగను గరుకుగను నునుపుగను మృదువుగను కఠినముగను నుండు ద్రవ్యములను వానికి విపరీతమైన స్పర్శగలవానినిగ గ్రహించువాడు మరణమును బొందును.

మూ॥ అన్తరేణ తపస్తీవ్రం యోగం వా విధి పూర్వకమ్ । ఇన్ద్రియై రధికం పశ్యన్ పఞ్చత్వమధిగచ్ఛతి ॥ ఇన్ద్రియాణామృతే దృష్టేరిన్ద్రియార్థాన్న పశ్యతి । విపర్యయేణ యో విద్యాత్తం విద్యాద్విగతాయుషమ్॥ స్వస్థాః ప్రజ్ఞావిపర్యాసై రిన్ద్రియార్థేషు వైకృతమ్ । పశ్యన్తి యే సుబహుశ స్తేషాం మరణ మాదిశేత్ ॥26॥

అ॥ తపస్సుగాని విధిపూర్వకమగు యోగముగాని లేకుండగనే ఎవడు కేవల ఇంద్రియములచే అధికములైన విషయములను గ్రహించునో అట్టివాడు మరణమును బొందును. ఇంద్రియోపలబ్ధి లేకుండగ ఇంద్రియార్థములను గ్రహింపజాలడు. కావున అట్లు గ్రహించువాడు మరణమును బొందును. స్వస్థులుగనుండు ఏమనుజులు ప్రజ్ఞా విపర్యాసముచే ఇంద్రియార్థములను చాలసారులు విపరీతముగ గ్రహించెదరో అట్టి వారు మరణమును బొందెదరు.

## అధ్యాయ సంగ్రహము.

మూ॥ ఏతదిన్ద్రియవిజ్ఞానం యః పశ్యతి యథాతథమ్। మరణం జీవితం చైవ స భిషక్ జ్ఞాతుమర్హతి ॥27॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతి సంస్కృతే ఇన్ద్రియస్థానే ఇన్ద్రియానీక మిన్ద్రియం నామ చతుర్థోఽధ్యాయః ॥

అ॥ ఇంద్రియసంబంధమగు ఈ విజ్ఞానమును ఏవైద్యుడు బాగుగ తెలిసికొనునో అట్టివాడు మరణమును జీవితమును తెలిసికొనుటకు సమర్థుడుగ నుండును.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు ఇంద్రియానీకేంద్రియ మనెడు చతుర్థాధ్యాయము సమాప్తము.

—:0:—

# పంచమాధ్యాయము.

మూ॥ అథాతఃపూర్వరూపీయ మిన్ద్రియం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట పూర్వరూపీయేంద్రియమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ పూర్వరూపాణ్య సాధ్యానాం వికారాణాం పృథక్ పృథక్ । భిన్నాభిన్నాని వక్ష్యామో భిషజాం జ్ఞానవృద్ధయే ॥3॥

అ॥ వైద్యులయొక్క జ్ఞానాభివృద్ధికొరకు అసాధ్యములైన వ్యాధులయొక్క సాధారణము లైనట్టియు అసాధారణము లైనట్టియు పూర్వరూపములను వేరువేరుగ చెప్పబోవుచున్నాము.

మూ॥ పూర్వరూపాణి సర్వాణి జ్వరోక్తాన్యతి మాత్రయా । యం విశన్తి విశత్యేనం మృత్యుర్జ్వరపురఃసరః ॥ అన్యస్యాపి చ రోగస్య పూర్వరూపాణి యం నరమ్ । విశన్త్యతేన కల్పేన తస్యాపి మరణం ధ్రువమ్ ॥5॥

అ॥ జ్వరమునకు చెప్పబడిన పూర్వరూపము లన్నియు అధికము కలిగిన యెడల అట్టివానికి జ్వరపూర్వకమగు మృత్యువు కలుగును. ఇటులనే ఇతర వ్యాధులయొక్క పూర్వరూపములుకూడ అన్నియు అధికముగ కలిగినయెడల అట్టివానికిగూడ మృత్యువు కలుగును.

మూ॥ పూర్వరూపైకదేశాంస్తు వక్ష్యామోఽన్యాన్ సుదారుణాన్ । యే రోగాననుబధ్నన్తి మృత్యుర్యైరనుబధ్యతే ॥6॥

అ॥ ఏ వ్యాధులవలన మృత్యువు కలుగునో ఆ వ్యాధులు ఏపూర్వరూపములతో కూడుకొనియుండునో అట్టి పూర్వరూపములయొక్క ఏకదేశములను, దారుణములైనట్టి ఇట్టి యితరవిషయములను చెప్పబోవుచున్నాము.

మూ॥ బలం చ హీయతే యస్య ప్రతిశ్యాయశ్చ వర్ధతే । తస్య నారీప్రసక్తస్య శోషోఽన్తాయోపజాయతే॥ శ్వభిరుష్ట్రైః ఖరైర్వాఽపి యాతి యో దక్షిణాం దిశమ్ । స్వప్నే యక్ష్మాణమాసాద్య జీవితం న విముఞ్చతి ॥ ప్రేతైః సహ పిబేన్మద్యం స్వప్నే యః కృష్యతే శునా । సుఘోరం జ్వరమాసాద్య స జీవ మవసృజ్యతే॥ లాక్షారక్తామ్బరాభం యః పశ్యత్యమ్బరమన్తికాత్ । స రక్తపిత్తమాసాద్య తేనైవాన్తాయ నీయతే॥ రక్తస్రగ్రక్తసర్వాఙ్గో రక్తవాసాముహుర్హసన్ । యః స్వప్నే హ్రియతే నార్యా స రక్తం ప్రాప్య సీదతి ॥11॥

అ॥ ఎవనికి బలము క్షీణించుచు పడిసెము వృద్ధినొందుచుండునో స్త్రీలోలుడైన అట్టి మనుజునకు శోషరోగము మృత్యువును కలిగించును. ఎవనికి కుక్కలమీదగాని ఒంటెలమీదగాని గాడిదలమీదగాని ఎక్కి దక్షిణదిక్కునకు వెళ్ళినట్లు స్వప్నము

కలుగునో వానికి క్షయరోగము కలిగి మరణమును కలిగించును. ఎవడు ప్రేతలతో మద్యపానమును చేసినట్లును కుక్కలచే లాగబడినట్లును స్వప్నము నొందునో వాడు దారుణమైన జ్వరమునుపొంది మరణము నొందును. ఎవడు సమీపమునందున్న ఆకాశమును లక్కరంగు వేయబడిన వస్త్రమునువలె చూచునో వాడు రక్తపిత్తవ్యాధిని పొంది మరణమును పొందును. ఎవడు ఎర్రని పుష్పమాలికలను ఎర్రని వస్త్రములను ధరించి ఎర్రగనున్న సమస్తావయవములను కలిగి తరుచునవ్వుచు స్త్రీచే ఆకర్షింపబడినట్లు స్వప్నమునొందునో వాడు రక్తపిత్తవ్యాధిని పొంది మరణమును పొందును.

మూ॥ శూలాటోపాన్త్రకూజాశ్చ దౌర్బల్యం చాతిమాత్రయా। నఖాదిషు చ వైవర్ణ్యం గుల్మేనాన్తకరో గ్రహః॥ లతా కణ్టకినీ యస్య దారుణా హృది జాయతే। స్వప్నే గుల్మస్తమన్తాయ క్రూరో విశతి మానవమ్॥ కాయేఽల్పమపి సంస్పృష్టం సుభృశం యస్య దీర్యతే। క్షతాని చ న రోహన్తి కుష్ఠైర్మృత్యుర్హినస్తి తమ్॥ నగ్నస్యాజ్యావసిక్తస్య జుహ్వతోఽగ్నిమనర్చిషమ్। పద్మాన్యురసి జాయన్తే స్వప్నే కుష్ఠైర్మరిష్యతః॥ స్నాతానులిప్తగాత్రేఽపి యస్మిన్ గృధ్నన్తి మక్షికాః। స ప్రమేహేణ సంస్పర్శ్య ప్రాప్య తేనైవ హన్యతే॥ స్నేహం బహువిధం స్వప్నే చణ్డాలైః సహ యః పిబేత్। బధ్యతే స ప్రమేహేణ స్పృశ్యతేఽన్తాయ మానవః॥ 7॥

అ॥ ఎవనికి శూల ఆటోపము ప్రేగులరచుట దౌర్బల్యము గోళ్లు మొదలగువానియందు వైవర్ణ్యము ఇవి అధికముగ కలుగునో వాడు గుల్మమునుపొంది మరణము నొందును. ఎవనికి హృదయమునందు ముళ్ళతో కూడినట్టి దారుణమైన లత జనించునట్లు స్వప్నము కలుగునో వానికి క్రూరమైన గుల్మము కలిగి మరణమును కలిగించును. ఎవని యొక్కశరీరము స్వల్పముగ చీల్చబడినను అధికమగుగాయము నొందునో ఎవనియొక్క శరీరము నందలి గాయములు శాంతి నొందవో వానికి కుష్ఠముకలిగి మరణమును కలిగించును. ఎవడు దిగంబరుడై నేతితో పూయబడి జ్వాలలు లేని అగ్నియందు హోమము చేయుచున్నట్లును తన వక్షఃస్థలమునందు పద్మములు మొలచినట్లును స్వప్నము నొందునో వాడు కుష్ఠమునొంది మరణమునొందును. స్నానమును చేసి లేపనములను పూసికొనినను ఎవనియొక్క శరీరమునందు ఈగలు వ్రాలుచుండునో వాడు ప్రమేహవ్యాధి నొంది మరణము నొందును. ఎవడు అనేకవిధములైన స్నేహములను చండాలురతో కూడ పానము చేసినట్లు స్వప్నమునొందునో వాడు ప్రమేహవ్యాధినొంది మరణమును పొందును.

మూ॥ ధ్యానాయాసౌ తథోద్వేగో మోహశ్చాస్థానసంభవః। అరతిర్బలహానిశ్చ మృత్యురున్మాదపూర్వకః॥ ఆహారద్వేషిణం పశ్యన్ లుప్తచిత్తముదర్దితమ్। విద్యాద్ధీరో ముమూర్షుం తమున్మాదేనాతిపాతినా॥ క్రోధనం త్రాసబహులం సకృత్ప్రహసితాననమ్। మూర్ఛాపిపాసాబహులం హన్త్యున్మాదః శరీరిణామ్॥ నృత్యన్ రక్షోగణైః సార్థం యః స్వప్నేఽమ్భసి సీదతి। స ప్రాప్య భృశమున్మాదం యాతి లోకమతః పరమ్॥ అసత్తమః పశ్యతి యః శృణోత్యప్యసతః స్వరాన్। బహూన్ బహువిధాఞ్జాగ్రత్సోఽపస్మారేణ బధ్యతే॥ మత్తం నృత్యన్తమావిధ్య ప్రేతో హరతి యం నరమ్। స్వప్నే హరతి తం మృత్యురపస్మారపురస్సరః॥ స్తభ్యేతే ప్రతిబుద్ధస్య హనూ మన్యే తథాఽక్షిణీ। యస్యతం బహిరాయామో గృహీత్వాహన్త్యసంశయమ్। శష్కులీరప్యపూపాన్ వా స్వప్నే ఖాదతి యో నరః। స చేత్తాదృక్ఛర్దయతి ప్రతిబుద్ధో న జీవతి ॥25।

అ॥ ధ్యానము ఆయాసము ఉద్వేగము అహేతుకమైన మోహము దేనియందును ఇష్టములేకుండుట బలహీనత ఈలక్షణములున్నను, అన్నద్వేషము చైతన్యము లేకుండుట ఉదర్దితవ్యాధి ఈలక్షణములున్నను, అధికమగుకోపము అధికమగుభయము అప్పుడప్పుడు నవ్వుచుండుట అధికమగుమూర్ఛ అధికమగుదప్పిక ఈలక్షణములున్నను, రక్షోగణములతోకూడ నాట్యముచేయుచు నీటియందుమునిగినట్లు స్వప్నమును పొందినను అట్టివానికి ఉన్మాదపూర్వకమగు మరణము కలుగును. ఎవడు జాగ్రదవస్థలోనుండి అమంగళకరమైనచీకటిని చూచునో అమంగళకరములైనట్టియు అనేకములైనట్టియు అనేకవిధములైనట్టియు ధ్వనులను వినునో మదించినట్టియు నాట్యము చేయుచున్నట్టియు తనను ప్రేత అడ్డముగతీసికొనిపోవుచున్నట్లు స్వప్నము నొందునో అట్టివానికి అపస్మారపూర్వకమగు మరణము కలుగును. నిద్రనుండి లేచిన ఎవని అంకిళ్లును మెడకొంకులును నేత్రములును స్తంభించునో వాడు బహిరాయామమనెడు వాతవ్యాధిని పొంది మరణమును పొందును. ఎవడు చక్కిలములనుగాని అపూపములనుగాని తినినట్లు స్వప్నమును పొంది నిద్రనుండి లేచినపిమ్మట, వానినితినినవానివలె వాంతిని చేయునో వాడు మరణము నొందును.

మూ॥ ఏతాని పూర్వరూపాణి యః సమ్యగవబుధ్యతే। స ఏషామనుబన్ధం చ ఫలం చ జ్ఞాతుమర్హతి॥ య ఇమాంశ్చాపరాన్ స్వప్నాన్ దారుణానుపలక్షయేత్। వ్యాధితానాంవినాశాయ క్లేశాయ మహతేఽపి వా ॥27॥

అ॥ పూర్వమునందు చెప్పబడిన పూర్వరూపములను బాగుగ తెలిసికొనినవాడు ఆపూర్వరూపములవలన కలుగు వ్యాధులను ఫలములను తెలిసికొనగలడు. ఇదివరలో చెప్పబడిన స్వప్నములును దారుణములైన ఇట్టి ఇతరస్వప్నములును రోగులకు మరణమును, ఆరోగ్యవంతులకు గొప్ప కష్టములను కలిగించును.

మూ॥ యస్యోత్తమాఙ్గే జాయన్తే వంశగుల్మలతాదయః । వయాంసి చ విలీయన్తే స్వప్నే మౌణ్డ్యమియాచ్చ యః॥ గృధ్రోలూకశ్వకాకాద్యైః స్వప్నే యః పరివార్యతే । రక్షఃప్రేతపిశాచస్త్రీచణ్డాలద్రవితాన్ధ్రకైః ॥ వంశవేత్రలతాపాశతృణకణ్టకసంకటే । ప్రముహ్యతి హి యః స్వప్నే యో గచ్ఛన్ ప్రపతత్యపి॥ భూమౌ పాంశూపధానాయాం వల్మీకే వాఽథ భస్మని। శ్మశానాయతనే శ్వభ్రే స్వప్నే యః ప్రవిశత్యపి ॥ కలుషేఽమ్భసి పఙ్కే చ కూపే వా తమసాఽఽవృతే । స్వప్నే మజ్జతి శీఘ్రేణ స్రోతసా హ్రియతే చ యః ॥ స్నేహపానం తథాఽభ్యఙ్గః స్వప్నే బన్ధపరాజయౌ । హిరణ్యలాభః కలహః ప్రచ్ఛర్దనవిరేచనే ॥ ఉపానద్యుగనాశశ్చ ప్రపాతః పాంశుచర్మణోః। హర్షః స్వప్నే ప్రకుపితైః పితృభిశ్చావభర్త్సనమ్ ॥ దన్తచన్ద్రార్కనక్షత్రదేవతాదీపచక్షుషామ్ । పతనం వా వినాశో వా స్వప్నే భేదో నగస్య వా ॥ రక్తపుష్పం వనం భూమిం పాపకర్మాలయాం చితామ్ । గుహాన్ధకారసంబాధం స్వప్నే యః ప్రవిశత్యపి॥ రక్తమాలీ హసన్నుచ్చైర్దిగ్వాసా దక్షిణాం దిశమ్। దారుణామటవీం స్వప్నే కపియుక్తః ప్రయాతి వా॥ కాషాయిణామసౌమ్యానాం నగ్నానాం దణ్డధారిణామ్ । కృష్ణానాం రక్తనేత్రాణాం స్వప్నే నేచ్ఛన్తి దర్శనమ్ ॥ కృష్ణా పాపా నిరాచారా దీర్ఘకేశనఖస్తనీ । విరాగమాల్యవసనా స్వప్నే కాలనిశా మతా ॥ ఇత్యేతే దారుణాః స్వప్నా రోగీ యైర్యాతి పఞ్చతామ్ । అరోగః సంశయం గత్వా కశ్చిదేవ విముచ్యతే ॥40॥

అ॥ ఎవడు తన శిరస్సునందు వెదుళ్ళు పొదలు లతలు మొదలగునవి పుట్టినట్లును పక్షులు వ్రాలినట్లును స్వప్నము నొందునో శిరస్సు ముండితమైనట్లు స్వప్నము నొందునో గ్రద్దలు గుడ్లగూబలు కుక్కలు కాకులు మొదలైనవానిచేతను రక్షస్సులు ప్రేతములు పిశాచస్త్రీలుచండాలురు ద్రవితాంధకుల నెడి మ్లేచ్ఛజాతివారు వీరిచేతను ఆవరింపబడినట్లు స్వప్నము నొందునో వెదుళ్ళు పేముతీగెలు త్రాళ్ళు గడ్డి ముళ్ళు వీనితో సంకటముగనున్న ప్రదేశమునందు వెళ్ళుచు మోహమునొందినట్లును పడినట్లును స్వప్నమునొందునో బూడిదతోకూడిన భూమియందుగాని పుట్టయందుగాని భస్మరాశి

యందుగాని శ్మశానమునందుగాని గోతియందుగాని పడినట్లు స్వప్నము నొందునో కలుషమైన నీటియందుగాని బురదయందుగాని చీకటితోకూడిన నూతియందుగాని మునిగినట్లును ప్రవాహముచే వెంటనే తీసికొనిపోబడినట్లును స్వప్నము నొందునో స్నేహపానము అభ్యంగము క్షైద పరాజయము బంగారము కలహము వమనములు విరేచనములు వీనినిపొందినట్లు స్వప్నమునొందునో చెప్పులజోడుపోయినట్లును ధూళియు చర్మములును ఆకాశమునుండి అధికముగ పడినట్లును అధికముగ సంతోషించినట్లును కోపగించిన పితృదేవతలచే భయపెట్టబడినట్లును స్వప్నము నొందునో దంతములు చంద్రుడు సూర్యుడు నక్షత్రములు దేవతలు దీపములు నేత్రములు ఇవి పడినట్లుగాని నశించినట్లుగాని లేక పర్వతము బ్రద్దలైనట్లుగాని స్వప్నము నొందునో ఎఱ్ఱని పుష్పములతోకూడిన వనమునందును పాపకర్ములకు స్థానభూతమైన భూమియందును చీకటి కూడిన గుహాయందును ప్రవేశించినట్లు స్వప్నమునొందునో ఎఱ్ఱనిపుష్పమాలిక గలవాడై బిగ్గరగనవ్వుచు దిగంబరుడై కోతిమీద నెక్కి దక్షిణదిక్కునకుగాని భయంకరమైన అడవిని గురించిగాని వెళ్ళినట్లు స్వప్నము నొందునో కావిరంగుగలవస్త్రములను ధరించినవారు క్రూరాకృతిగలవారు దిగంబరులు దండధారులు నల్లనిశరీరముకలవారు ఎఱ్ఱనినేత్రములు కలవారు వీరలను చూచినట్లు స్వప్నము నొందునో నల్లని శరీరము కలిగినట్టియు ఆచారము లేనట్టియు పొడవుగనున్న తలవెంట్రుకలును గోళ్ళును స్తనములును కలిగినట్టియు వికృతిగనున్న పుష్పమాలికలును వస్త్రములును కలిగినట్టియు స్త్రీని చూచినట్లు స్వప్నము నొందునో వారలు మృతినొందెదరు. దారుణమైన ఈ స్వప్నములు రోగులకు కలిగినయెడల మృత్యువు తప్పక కలుగును. ఆరోగ్యవంతులకు కలిగినయెడల మృత్యువును కలిగించు వ్యాధి కలుగును. వీరిలో ఒకానొకడు మాత్రమే జీవించును.

## స్వప్నముకలుగు విధము.

మూ॥ మనోవహానాం పూర్ణత్వాద్దోషైరతిబలైస్త్రిభిః । స్రోతసాం దారుణాన్ స్వప్నాన్ కాలే పశ్యతి దారుణే ॥ నాతిప్రసుప్తః పురుషః సఫలానఫలానపి । ఇన్ద్రియేశేన మనసా స్వప్నాన్ పశ్యత్యనేకధా ॥42॥

అ॥ అతిబలిష్ఠములైన మూడుదోషములచేతను మనోవహస్రోతస్సులు పూరింపబడుటచే దారుణమైన స్వప్నములు ఆయాకాలములయందు కలుగును. పురుషుడు గాఢమగు నిద్రలేనివాడై ఇంద్రియములకు ప్రేరకమైన మనస్సుచే ఫలముతోకూడినట్టియు ఫలములేనట్టియు అనేకములైన స్వప్నములను పొందుచున్నాడు.

## స్వప్నభేదములు.

మూ॥ దృష్టం శ్రుతానుభూతం చ ప్రార్థితం కల్పితం తథా । భావికం దోషజం చైవ స్వప్నం సప్తవిధం విదుః ॥43॥

అ॥ జాగ్రదవస్థలో చూడబడినది వినబడినది అనుభవింపబడినది కోరబడినది ఊహింపబడినది భావిఫలమును సూచించునది వాతాదిదోషములచే జనించినది అని స్వప్నము ఏడువిధములుగ నుండును.

## సఫల నిష్ఫలస్వప్న వివరణము.

మూ॥ తత్ర పఞ్చవిధం పూర్వమఫలం భిషగాదిశేత్ । దివా స్వప్నమతిహ్రస్వమతిదీర్ఘం తథైవ చ ॥ దృష్టః ప్రథమరాత్రే యః స్వప్నః సోఽల్పఫలో భవేత్ । న స్వపేద్యః పునర్దృష్ట్వా స సద్యః స్యాన్మహాఫలః ॥ అకల్యాణమపి స్వప్నం దృష్ట్వాతత్రైవ యః పునః । పశ్యేత్సౌమ్యం శుభాకారం తస్య విద్యాచ్ఛుభం ఫలమ్ ॥46॥

అ॥ ఏడువిధములగు ఆ స్వప్నములలో మొదటివియగు ఐదును ఫలములేనివిగ నుండును. పగలు పొందబడినట్టియు మిక్కిలి స్వల్పమైనట్టియు మిక్కిలి దీర్ఘములైనట్టియు స్వప్నములుకూడ ఫలములేనివిగ నుండును. రాత్రియొక్క ప్రథమయామమునందు పొందబడిన స్వప్నము అల్పఫలముకలదిగ నుండును. ఎవడు కలనుగని మరల నిద్రింపడో అట్టివానియొక్క ఆస్వప్నము వెంటనే అధికమగు ఫలమును కలిగించును. శుభప్రదముకాని స్వప్నమును పొందినను ఆరాత్రియందే మరల శుభప్రదమైన స్వప్నమును పొందినయెడల శుభమైన ఫలమే కలుగును.

## అధ్యాయ సంగ్రహము.

మూ॥ పూర్వరూపాణ్యథ స్వప్నాన్ య ఇమాన్వేత్తి దారుణాన్ । న స మోహాదసాధ్యేషు కర్మాణ్యారభతే భిషక్ ॥47॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే ఇన్ద్రియస్థానే పూర్వరూపీయ మిన్ద్రియం నామ పఞ్చమోఽధ్యాయః ॥

అ॥ ఈఅధ్యాయమునందు చెప్పబడిన పూర్వరూపములను దారుణమైన స్వప్నములను ఎవడు తెలిసికొనునో అట్టివాడు అసాధ్య వ్యాధులయందు మోహమువలన క్రియలను ఆరంభింపడు.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు పూర్వరూపీయేంద్రియ మనెడు పంచమాధ్యాయము సమాప్తము.

—0—

# షష్ఠాధ్యాయము.

మూ॥ అథాతః కతమానిశరీరీయమిన్ద్రియం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట కతమానిశరీరేంద్రియమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ కతమాని శరీరాణి వ్యాధిమన్తి మహామునే। యాని వైద్యః పరిహరేద్యేషు కర్మ న సిధ్యతి॥ ఇత్యాత్రేయోఽగ్నివేశేన ప్రశ్నం పృష్టః సుదుర్వచమ్। ఆచచక్షే యథా తస్మై భగవాంస్తన్నిబోధత ॥4॥

అ॥ వ్యాధిమంతములైన ఎట్టిశరీరములను వైద్యుడు విడచిపెట్టవలయును? ఎట్టి శరీరములయందు చికిత్స సిద్ధింపదు? అని అగ్నివేశుడడుగగా ఆత్రేయుడు క్రింది విధముగ చెప్పెను.

మూ॥ యస్య వై భాషమాణస్య రుజత్యూర్ధ్వమురో భృశమ్। అన్నం చ చ్యవతే భుక్తం స్థితం చాపి న జీర్యతి॥ బలం చ హీయతే యస్య తృష్ణా చాభిప్రవర్ధతే। జాయతే హృది శూలం చ తం భిషక్ పరివర్జయేత్ ॥ హిక్కా గమ్భీరజా యస్య శోణితం చాతిసార్యతే। న తస్మై భేషజం దద్యాత్స్మరన్నాత్రేయశాసనమ్॥ ఆనాహశ్చాతిసారశ్చ యమేతౌ దుర్బలం నరమ్। వ్యాధితం విశతో రోగౌ దుర్బలం తస్య జీవితమ్॥ ఆనాహశ్చైవ తృష్ణా చ యమేతౌ దుర్బలం నరమ్। విశతో విజహత్యేనం ప్రాణా నాతిచిరాన్నరమ్॥ జ్వరః పౌర్వాహ్ణికో యస్య శుష్కకాసశ్చ దారుణః। జ్వరో యస్యాపరాహ్ణే తు శ్లేష్మకాసశ్చ దారుణః। బలమాంసవిహీనస్య యథాప్రేతస్తథైవ సః ॥10॥

అ॥ మాట్లాడునప్పుడు వక్షస్థలముయొక్క పైభాగమునందు అధికమైనబాధ కలుగుట, భుజించినఆహారము వెంటనేవెడలిపోవుట, నిలచియున్నను జీర్ణముకాకుండుట, బలముక్షీణించుట, దప్పికఅధికముగకలుగుట, హృదయమునందు శూలకలుగుట ఈలక్షణములు కలవానిని చికిత్సింపక విడిచిపెట్టవలయును. ఎవనికి గంభీరజహిక్క కలిగి రక్తాతిసారముకూడ కలుగునో అట్టివానికి ఔషధమును ఆత్రేయశాస

నానుసారముగ నీయకూడదు. వ్యాధికలిగిన దుర్బలుడుగ నుండు ఏమనుజునికి ఆనాహము అతిసారము అనెడి వ్యాధులు కలుగునో అట్టివానియొక్క జీవితము దుర్లభముగ నుండును. దుర్బలుడుగనుండుమనుజునకు ఆనాహము తృష్ణ ఈరెండును కలిగినచో వానిని ప్రాణములు శీఘ్రముగా విడిచిపెట్టును. ఎవనికి పూర్వాహ్ణమునందు జ్వరము వచ్చుచు భయంకరమగుశుష్కకాసకలుగుచుండునో ఎవనికి అపరాహ్ణమునందుజ్వరము వచ్చుచు భయంకరమగుశ్లేష్మజకాస కలుగుచుండునో అట్టివారికి బలమాంసములు క్షీణించినచో వారు మరణించెదరు.

మూ॥ యస్య మూత్రం పురీషం చ గ్రథితం సంప్రవర్తతే। నిరూష్మణో జఠరిణః శ్వసనో న స జీవతి॥ శ్వయథుర్యస్య కుక్షిస్థో హస్తపాదం విసర్పతి। జ్ఞాతిసంఘుం స సంక్లేశ్య తేన రోగేణ హన్యతే॥ శ్వయథుర్యస్య పాదస్థస్తథా స్రస్తే చ పిణ్డికే। సీదతశ్చాప్యుభే జఙ్ఘే తం భిషక్పరివర్జయేత్ ॥ శూనహస్త శూనపాదం శూనగుహ్యోదరం నరమ్। హీనవర్ణ బలాహారమౌషధైర్నోపపాదయేత్। ఉరోయుక్తో బహుశ్లేష్మానీలః పీతః సలోహితః। సతతం చ్యవతే యస్య దూరాత్తం పరివర్జయేత్ ॥ హృష్టరోమా సాన్ద్రమూత్రః శూనః కాసజ్వరార్దితః। క్షీణమాంసో నరో దూరాద్వర్జ్యో వైద్యేన జానతా॥ త్రయః ప్రకుపితా యస్య దోషాః కోష్ఠేఽభిలక్షితాః। కృశస్య బలహీనస్య నాస్తి తస్య చికిత్సితమ్ ॥ జ్వరాతిసారౌ శోఫాన్తే శ్వయథుర్వా తయోః క్షయే। దుర్బలస్య విశేషేణ నరస్యాన్తాయ జాయతే॥ పాణ్డురశ్చ కృశోఽత్యర్థం తృష్ణయాఽభిపరిప్లుతః। డమ్బరీ కుపితోచ్ఛ్వాసః ప్రత్యాఖ్యేయో విజానతా ॥ 9॥

అ॥ మూత్రము చిక్కగ వెడలుట పురీషముగడ్డలుకట్టి వెడలుట వేడిమితగ్గుట శ్వాసకలుగుట ఈలక్షణములు ఉదరరోగికి కలిగినచో మరణము కలుగును. ఎవనికి శోఫ కుక్షియందుఏర్పడి హస్తములకును పాదములకును వ్యాపించునో వాడు జ్ఞాతులకుకష్టమునుకలిగించి మరణమునుబొందును. పాదములయందువాపుకలిగి పిక్కలయందలి మాంసకండరములుజారి పిక్కలుకృశించియున్నవానిని వైద్యుడు చికిత్సింపక విడిచిపెట్టవలయును. హస్తములు పాదములు గుహ్యప్రదేశము ఉదరము వీనియందు వాపు కలిగినట్టియు వర్ణము బలము ఆహారము ఇవి తగ్గినట్టియు మనుజునకు ఔషధముల నీయకూడదు. వక్షస్థలమునందు శ్లేష్మము అధికముగజేరి నీలవర్ణముగగాని పచ్చగగాని రక్తవర్ణముగగాని ఎప్పుడును బయటవెడలుచుండినచో అట్టివానిని విడిచిపెట్టవలయును. రోమములుగగుర్పొడుచుట, మూత్రముచిక్కగ వెడలుట, శోఫ, కాస,

జ్వరము, మాంసముక్షీణించుట ఈలక్షణములుకలమనుజునివిడిచిపెట్టవలయును. కృశించి బలహీనముగనున్న వానికి వాతాదిదోషములు మూడును ప్రకోపించి కోష్ఠమునందు బాధను కలిగించుచున్నచో అట్టివానికి చికిత్స లేదు. దుర్బలుడుగనుండుమనుజునికి శోఫకలిగి పిమ్మట జ్వరము అతిసారము కలిగినయెడలగాని జ్వరము అతిసారము కలిగిన పిమ్మట శోఫకలిగినయెడలగాని అట్టిమనుజుడు మరణించును. పాలిపోవుట, మిక్కిలి కృశించుట, అధికమగుదప్పికకలుగును, నేత్రములుబిగియుట, అధికమగుఉచ్ఛ్వాసము కలుగుట ఈలక్షణములుకలవాడు చికిత్సకు అసర్హుడుగ నుండును.

మూ॥ హనుమన్యాగ్రహ స్తృష్ణా బలహ్రాసోఽతిమాత్రయా। ప్రాణాశ్చోరసి వర్తన్తే యస్య తం పరివర్జయేత్ ॥ తామ్యత్యాయచ్ఛతే శర్మ న కించిదపి విన్దతి । క్షీణమాంసబలాహారో ము మూర్షుర చిరాన్నరః ॥ విరుద్ధ యోనయో యస్య విరుద్ధోపక్రమా భృశమ్ । వర్ధన్తే దారుణా రోగాః శీఘ్రం శీఘ్రం స హన్యతే ॥ బలం విజ్ఞానమారోగ్యం గ్రహణీ మాంసశోణితమ్ । ఏతాని యస్య క్షీయన్తే క్షిప్రం క్షిప్రం స హన్యతే ॥ వికారా యస్య వర్ధన్తే ప్రకృతిః పరిహీయతే । సహసా సహసా తస్య మృత్యుర్హరతి జీవితమ్ ॥24॥

అ॥ అంకిళ్ళుబిగియుట మెడనరములు బిగియుట దప్పిక బలము మిక్కిలి క్షీణించుట ప్రాణములువక్షస్థలమునుపొందుట ఈలక్షణములుకలవానిని విడిచిపెట్టవలయును. మోహమునొందుట అవయవములను విసరుట సుఖమునుస్వల్పముగగూడపొందకుండుట మాంసమును బలమును ఆహారమును క్షీణించుట ఈలక్షణములు కలవాడు శీఘ్రముగమరణమును జెందును. విరుద్ధములైన కారణములు కలిగినట్టియు విరుద్ధములైన చికిత్సలుకలిగినట్టియు దారుణములైనట్టియు వ్యాధులు ఎవనికి వెంటనేవృద్ధినొందునో వాడు శీఘ్రమునసే మరణించును. బలము, విజ్ఞానము, ఆరోగ్యము, గ్రహణీకల యొక్కశక్తి, మాంసము, రక్తము ఇవి ఎవనికి వెంటనే క్షీణించునో వాడు వెంటనే మరణించును. ఎవనికి వ్యాధులు హఠాత్తుగవృద్ధినొందుచు ఆరోగ్యము వెంటనే క్షీణించునో అట్టివానియొక్క జీవితమును మృత్యువు వెంటనే హరించును.

## అధ్యాయ సంగ్రహము.

మూ॥ ఇత్యేతాని శరీరాణి వ్యాధిమన్తి వివర్జయేత్। న హ్యేషు ధీరాః పశ్యన్తి సిద్ధిం కాంచి దుపక్రమాత్ ॥25॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతి సంస్కృతే ఇన్ద్రియస్థానే కతమానిశరీరీయ మిన్ద్రియం నామ షష్ఠోఽధ్యాయః ॥

అ॥ పైనచెప్పబడినలక్షణములుకల వ్యాధివంతముగు శరీరములను చికిత్సింపక విడిచిపెట్టవలయును. ఇట్టి శరీరములయందు చికిత్సనుచేసినను స్వల్పమైన సిద్ధినిగూడ పొందజాలరు,

ఇవ్విధంబున శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు కతమానిశరీరేంద్రియ మనెడు షష్ఠాధ్యాయము సమాప్తము.

---

# సప్తమాధ్యాయము.

---

మూ॥ అథాతః పన్నరూపీయ మిన్ద్రియం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట పన్నరూపీయేంద్రియమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ దృష్ట్వా యస్య విజానీయాత్పన్నరూపాం కుమారికామ్ । ప్రతిచ్ఛాయామయీమక్ష్ణోర్నైన మిచ్ఛేచ్చికిత్సితుమ్ ॥3॥

అ॥ ప్రతిచ్ఛాయారూపముగనుండు కనుపాప ఎవనియొక్క నేత్రములయందు కనుపింపకుండునో అట్టివానికి చికిత్సను చేయకూడదు.

మూ॥ జ్యోత్స్నాయామాతపే దీపే సలిలాదర్శయోరపి । అఙ్గేషు వికృతా యస్య ఛాయా ప్రేత స్తథైవ సః ॥ ఛిన్నా భిన్నాఽఽకులా ఛాయా హీనా వాఽప్యధికాఽపి వా। నష్టా తన్వీ ద్విధా ఛిన్నా విశిరా వికృతా చ యా॥ ఏతాశ్చాన్యాశ్చ యాః కాశ్చిత్ప్రతిచ్ఛాయా విగర్హితాః । సర్వా ముమూర్షతాం జ్ఞేయా నచేల్లక్ష్యనిమిత్తజాః॥ సంస్థానేన ప్రమాణేన వర్ణేన ప్రభయా తథా। ఛాయా వివర్తతే యస్య స్వస్థోఽపి ప్రేత ఏవ సః ॥7॥

అ॥ వెన్నెల ఎండ దీపపుకాంతి ఉదకము అద్దము వీనియందు ఎవనియొక్క అవయవసంబంధమైననీడ వికృతిగకనుపించునో వానిని ప్రేతతుల్యునిగ తెలిసికొనవలయును. ప్రత్యేక కారణములులేకుండగనే ఎవరియొక్క నీడ తెగినట్లుగగాని బ్రద్దలైనట్లుగగాని వ్యాకులముగగాని అల్పముగగాని అధికముగగాని నష్టమైనదిగగాని సన్న

ముగగాని రెండుగ తెగిపోయినదానివలెగాని శిరస్సులేనిదిగగాని వికృతముగగాని నింది తములైనట్టి ఇతరవిధములుగగాని కనబడునో అట్టివారు మరణమును పొందెదరు. ఎవని యొక్క నీడ ఆకృతిచేతను పరిమాణముచేతను వర్ణముచేతను కాంతిచేతనుమార్పునొంది నదిగనుండునో అట్టివాడు స్వస్థుడుగనున్నను వానిని ప్రేతతుల్యునిగ తెలిసికొన వలయును.

మూ॥ సంస్థానమాకృతిర్జ్ఞేయా సుషమా విషమా చయా। మధ్యమల్పం మహచ్చోక్తం ప్రమాణం త్రివిధం నృణామ్॥ ప్రతి ప్రమాణసంస్థానా జలాదర్శాతపాదిషు। ఛాయా యా సా ప్రతిచ్ఛాయా ఛాయా వర్ణప్రభాశ్రయా ॥౯॥

అ॥ సంస్థాన మనగా ఆకృతిఅని తెలిసికొనవలయును. అది సమమైదనియు విషమమైనదనియు రెండువిధములుగ నుండును. మనుజులయొక్క ప్రమాణము మధ్యమమనియు అల్పమనియు అధికమనియు మూడువిధములుగ నుండును. ఉదకము అద్దము ఎండ మొదలగువానియందు ప్రమాణముతోడను సంస్థానముతోడను తుల్యముగ కనుపించు ఛాయ ప్రతిచ్ఛాయ యనబడును. ఛాయ వర్ణమును కాంతిని ఆశ్రయించియుండును.

## పంచభూత సంబంధమైన ఛాయానిరూపణము.

మూ॥ ఖాదీనాం పఞ్చ పఞ్చానాం ఛాయా వివిధలక్షణాః। నాభసీ నిర్మలా నీలా సస్నేహా సప్రభేవ చ॥ రూక్షా శ్యావాఽరుణా యా తు వాయవీ సా హతప్రభా। విశుద్ధరక్తా త్వాగ్నేయీ దీప్తాభా దర్శనప్రియా॥ శుద్ధవైడూర్యవిమలాసుస్నిగ్ధా చామ్భసీ మతా। స్థిరా స్నిగ్ధా ఘనా శ్లక్ష్ణా శ్యామా శ్వేతా చ పార్థివీ॥ వాయవీ గర్హితా త్వాసాం చతస్రః స్యుః శుభోదయాః। వాయవీ తు వినాశాయ క్లేశాయ మహతేఽపివా ॥13॥

అ॥ ఆకాశము మొదలగు పంచభూతములయొక్క వివిధలక్షణములతోకూడిన ఐదువిధములగుఛాయలు చెప్పబడుచున్నవి. ఆకాశభూతసంబంధమగుఛాయ నిర్మలముగను నీలముగను స్నేహయుక్తముగను కాంతితోకూడినదానివలెను నుండును. వాయుభూతసంబంధమగుఛాయ రూక్షముగను శ్యావవర్ణముగను అరుణవర్ణముగను కాంతిలేనిదిగను ఉండును. అగ్నిభూతసంబంధమగుఛాయ శుద్ధమైనరక్తవర్ణముకలదిగను ప్రకాశించుచున్న కాంతికలదిగను చూచుటకుఇంపైనదిగను ఉండును. ఉదకభూతసంబధమైనఛాయనిర్మలమైనవైడూర్యమణితో సమానమైనదిగను స్నిగ్ధముగను ఉండును. పృథివీభూతసంబంధమైనఛాయ స్థైర్యము స్నైగ్ధ్యముచిక్కదనము నునుపుదనము

ఈలక్షణములు కలదిగను నల్లగను తెల్లగను ఉండును. భూతసంబంధమగు ఈఛాయ లలో వాయుభూతసంబంధమైన ఛాయగర్హితమైనదిగను మిగిలిన నాలుగుభూతముల యొక్క ఛాయలును శుభప్రదములుగను ఉండును. వాయుభూతసంబంధమగు ఛాయ నాశనమును గాని అధికమగు కష్టమును గాని కలిగించును.

## ప్రభా భేదములు.

మూ॥ స్యాత్తైజసీ ప్రభా సర్వా సా తు సప్తవిధా స్మృతా। రక్తా పీతా సితా శ్యావా హరితా పాణ్డురాఽసితా॥ తాసాం యాః స్యుర్వికాసిన్యః స్నిగ్ధాశ్చ విపులాశ్చ యాః। తాః శుభారూక్షమలినా సంక్షిప్తాశ్చా శుభోదయాః॥15॥

అ॥ సమస్తమైనకాంతియు అగ్నిభూతసంబంధమైనదిగ నుండును. అది- ఎరుపు పసుపు తెలుపు శ్యామవర్ణము ఆకుపచ్చరంగు పాండువర్ణము నలుపు అని ఏడువిధము లుగ ఉండును. ఆకాంతులలో వికాసము స్నైగ్ధ్యము విపులత్వము ఈలక్షణములతో కూడినవి శుభప్రదములుగ నుండును. రూక్షత్వము మాలిన్యము సంకోచము ఈలక్షణ ములతో కూడినవి అశుభప్రదములుగ నుండును.

మూ॥ వర్ణమాక్రామతి ఛాయా భాస్తు వర్ణప్రకాశినీ। ఆసన్నా లక్ష్యతే ఛాయా భాః ప్రకృష్టా ప్రకాశతే॥ నాచ్ఛాయో నాప్రభః కశ్చిద్విశేషాశ్చిహ్నయన్తితు। నృణాం శుభాశుభోత్పత్తిం కాలే ఛాయాః ప్రభాశ్రయాః॥17॥

అ॥ ఛాయ వర్ణమును ఆక్రమించును. ప్రభ వర్ణమును ప్రకాశింపచేయును. సమీపమునందున్న ఛాయ తెలియబడును. ప్రభ దూరమందున్నను ప్రకాశించును. ఛాయలేనివాడు గాని ప్రభలేనివాడు గాని ఒకానొకడునునుండడు. ప్రభనాశ్రయించు కొనియున్న ఛాయలు ఆయా కాలములయందు మనుజులయొక్క శుభాశుభములను తెలియజేయుచుండును.

మూ॥ కామలాఽక్ష్ణోర్ముఖం పూర్ణం గణ్డయోర్వ్యక్తమాంసతా। సంత్రాసశ్చోష్ణగాత్రం చ యస్య తం పరివర్జయేత్॥ ఉత్థాప్యమానః శయనాత్ప్రమోహం యాతి యో నరః। ముహుర్ముహుర్న సప్తాహం స జీవతి వికత్థనః॥ సంసృష్టా వ్యాధయో యస్య ప్రతిలోమానులోమగాః। వ్యాపన్నా గ్రహణీ ప్రాయః సోఽర్ధమాసం న జీవతి ॥20॥

అ॥ కామలావ్యాధియందువలె నేత్రములు పచ్చగనుండుట, ముఖమునిండియుండుట, గండప్రదేశములు మాంసముతో ఉబ్బియుండుట, భయమును కలిగియుండుట, శరీరము వేడిగనుండుట ఈలక్షణములతో కూడినవానిని విడిచిపెట్టవలయును. ఏ మనుజుడు శయనమునుండి లేవదీయబడునప్పుడు తరుచు మోహమునందుచు ప్రలాపయుక్తుడుగ నుండునో అట్టివాడు ఏడురోజులుకూడ జీవింపడు. ప్రతిలోమ స్వభావము కలిగినట్టియు అనులోమస్వభావము కలిగినట్టియు వ్యాధులు కలిసియుండి గ్రహణీకల చెడియున్నచో అట్టి మనుజుడు పదునైదుదినములలో మరణించును.

మూ॥ ఉపరుద్ధస్య రోగేణ కర్శితస్యాల్పమశ్నతః। బహుమూత్రపురీషం స్యాద్యస్య తం పరివర్జయేత్ ॥ దుర్బలో బహు భుఙ్క్తే యః ప్రాగ్భుక్తాదన్న మాతురః। అల్పమూత్ర పురీషశ్చ యథా ప్రేతస్తథైవ సః ॥ వర్ధిష్ణు గుణసంపన్న మన్నమశ్నాతి యో నరః। శశ్వచ్చ బలవర్ణాభ్యాం హీయతే న స జీవతి॥ ప్రకూజతి ప్రశ్వసితి శిథిలం చాతిసార్యతే। బలహీనః పిపాసార్తః శుష్కాస్యో న స జీవతి ॥ హ్రస్వం చ యః ప్రశ్వసితి వ్యావిద్ధం స్పన్దతే చ యః। మృతమేవ తమాత్రేయో వ్యాచచక్షే పునర్వసుః ॥25॥

అ॥ రోగగ్రస్తుడుగ నుండుట, కృశించియుండుట, ఆహారమును స్వల్పముగ భుజించుట, మూత్రపురీషము లధికముగ బయలువెడలుట ఈలక్షణములతో కూడినవానిని విడిచిపెట్టవలయును. దుర్బలుడుగ నుండుట, పూర్వమునందు భుజించు ఆహారముకంటె అధికముగ భుజించుట, మూత్రపురీషములు అల్పముగ బయలువెడలుట ఈలక్షణములుకల రోగి ప్రేతతుల్యుడుగ నుండును. బృంహణమును కలిగించుగుణములతో కూడిన ఆహారమును భుజించుచున్నను ఏమనుజునియొక్క బలమును వర్ణమును ఎల్లప్పుడు క్షీణించుచుండునో అట్టిమనుజుడు జీవింపడు. అధికముగ శబ్దమునుచేయుట, శిథిలమగు శ్వాసకలుగుట, అతిసారము కలుగుట, బలహీనత కలుగుట, దప్పిక కలుగుట, నోరుఎండుట ఈలక్షణములతో కూడినవాడు జీవింపడు. శ్వాసక్షీణించుట,కటిలముగ కదలుట ఈలక్షణములు కలవాడు మృతతుల్యుడని ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ ఊర్ధ్వం చ యః ప్రశ్వసితి శ్లేష్మణా చాభిభూయతే। హీనవర్ణబలాహారో యో నరో న స జీవతి॥ ఊర్ధ్వాగ్రే నయనే యస్య మన్యే చానతకమ్పనే। బలహీనః పిపాసార్తః శుష్కాస్యో న స జీవతి॥ యస్య గణ్డావుపచితౌ జ్వరకాసౌ చ దారుణౌ। శూలీ ప్రద్వేష్టి చాప్యన్నం తస్మిన్ కర్మ న సిధ్యతి ॥ వ్యావృత్త మూర్ధ జిహ్వోష్ఠే భ్రువౌ యస్య చ విచ్యుతే। కణ్టకైశ్చాచితా జిహ్వా యథా ప్రేతస్తథైవ సః ॥ శేఫశ్చాత్యర్థ ముత్సిక్తం నిఃసృతౌ వృషణౌ భృశమ్ ।

అతశ్చైవ విపర్యాసో వికృత్యా ప్రేతలక్షణమ్ ॥ నిచితం యస్య మాంసం స్యాత్త్వగస్థ్నపిచ దృశ్యతే । క్షీణస్యానశ్నతస్తస్య మాసమాయుః పరం భవేత్ ॥3.॥

అ॥ ఊర్ధ్వశ్వాసకలుగుట, శ్లేష్మము నిండియుండుట, వర్ణము బలము ఆహారము ఇవి క్షీణించుట ఈలక్షణములుకల మనుజుడు జీవింపడు. ఊర్ధ్వదృష్టి కలుగుట, మెడ నరములు వంగి కదులుచుండుట, బలము క్షీణించుట, దప్పిక కలుగుట, నోరు ఎండుట ఈలక్షణములుకలవాడు జీవింపడు. గండస్థలములు ఉబ్బుట, భయంకరమునైనజ్వరము కాస ఇవి కలుగుట, శూలకలుగుట, అన్నద్వేషము కలుగుట ఈలక్షణములు కలవానికి చికిత్స యుపయోగింపదు. శిరస్సు నాలుక ముఖము ఇవి వంకరతిరుగుట, కనుబొమలు జారిపోవుట, నాలుక ముల్లుబారుట ఈలక్షణములుకలిగిన మనుజుడు ప్రేతతుల్యుడుగ నుండును. మేఢ్రము లోనికిముడుచుకొనిపోవుట, వృషణము అధికముగజారుట, లేక మేఢ్రము జారియుండి వృషణములు లోనికి ముడుచుకొనిపోవుట ఈలక్షణములు కల మనుజుడు ప్రేతతుల్యుడుగ నుండును. ఆహారము లేనట్టియు క్షీణించి యున్నట్టియు మనుజునికి మాంసము క్షీణించి చర్మమును అస్థులును మాత్రము కనుపించుచున్నచో అట్టివాడు ఒక మాసముకంటె జీవింపడు.

## అధ్యాయ సంగ్రహము.

మూ॥ ఇదం లిఙ్గమరిష్టాఖ్య మనేక మభిజజ్ఞివాన్ । ఆయుర్వేద విదిత్యాఖ్యాం లభతే కుశలో జనః ॥32॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతి సంస్కృతే ఇన్ద్రియస్థానే పన్నరూపీయ మిన్ద్రియం నామ సప్తమోఽధ్యాయః ॥

అ॥ అరిష్టము లను పేరుకల అనేకవిధములగు ఈపైలక్షణములను ఎవడు తెలిసికొనునో నేర్పరియగు అట్టివైద్యుడు ఆయుర్వేదమును తెలిసినవాడుగ చెప్పబడును.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు పన్నరూపీయేంద్రియ మనెడు సప్తమాధ్యాయము సమాప్తము.

---

# అష్టమాధ్యాయము.

మూ॥ అథాతోఽవాక్శిరసీయ మిన్ద్రియం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట అవాక్శిరసీయేంద్రియమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ అవాక్శిరా వా జిహ్మో వా యస్య వా విశిరా భవేత్ । జన్తోరూపప్రతిచ్ఛాయా నైనమిచ్ఛేచ్చికిత్సితుమ్॥ జటీభూతానిపక్ష్మాణి దృష్టిశ్చాపి నిగృహ్యతే । యస్య జన్తోర్న తం ధీరోభేషజేనోప పాద యేత్ ॥ యస్య శూనాని వర్త్మాని న సమాయాన్తి శుష్యతః । చక్షుషీ చోపదహ్యేతే యథా ప్రేతస్తథైవ సః ॥ భ్రువోర్వా యది వా మూర్ధ్ని సీమన్తావర్తకాన్ బహూన్ । అపూర్వానకృతాన్ వ్యక్తాన్ దృష్ట్వా మరణమాదిశేత్ ॥ త్ర్యహమేతేన జీవన్తి లక్షణే నాతురా నరాః । అరోగాణాం పునస్త్వేతత్షడ్రాత్రం పరముచ్యతే ॥7॥

అ॥ ఎవనియొక్క ప్రతిబింబము తలక్రిందుగగాని వంకరగగాని శిరస్సులేనిదిగ గాని కనుపించునో అట్టివానికి చికిత్సచేయకూడదు. కనురెప్పలు జడలుకట్టుట, దృష్టి అడ్డగింపబడుట ఈలక్షణములుకల మనుజునికి ఔషధము నీయకూడదు. కనురెప్పలు రెండును ఉబ్బియుండి కలియకుండుట, శరీరముకృశించుట, నేత్రములు తాపయుక్తముగ నుండుట ఈలక్షణములు కలవాడు ప్రేతతుల్యుడుగ నుండును. ఆదివరకు లేనట్టియు చేయబడనట్టియు స్పష్టములైనట్టియు అనేకవిధములైనట్టియు పాపటలును సుళ్ళును ఎవనియొక్క కనుబొమ్మలయందును శిరస్సునందును ఏర్పడునో అట్టివాడు రోగిగ నున్నచో మూడుదినములకును ఆరోగ్యవంతుడుగ నున్నచో ఆరుదినములకును మరణమును పొందును.

మూ॥ అయస్మోత్పాటితాన్ కేశాన్ యో నరో నావబుధ్యతే । అనాతురో వా రోగీ వా షడ్రాత్రం నాతివర్తతే ॥ యస్య కేశా నిరభ్యఙ్గా దృశ్యన్తేఽభ్యక్తసంనిభాః ॥ ఉపరుద్ధాయుషం జ్ఞాత్వా తం ధీరః పరివర్జయేత్ ॥ గ్లాయతో నాసికావంశః పృథుత్వం యస్య గచ్ఛతి । అశూనః శూనసంకాశః ప్రత్యాఖ్యేయః స జానతా॥ అత్యర్థ వివృతా యస్య యస్య చాత్యర్థ సంవృతా । జిహ్మా వా పరిశుష్కా వా నాసికా న స జీవతి ॥ ముఖం శబ్దశవావోష్ఠౌ శుక్లశ్యావాతి లోహితౌ । వికృతౌ యస్య వా నీలౌ న స రోగాద్విముచ్యతే ॥12॥

అ॥ తలవెంట్రుకలను బలాత్కారముగ నూడబెరికినను ఎవడు తెలిసికొనలేడో అట్టివాడు ఆరోగ్యవంతుడైనను రోగియైనను ఆరుదినములకంటె అధికకాలము బ్రతుకడు. ఎవనియొక్క వెంట్రుకలు అభ్యంగము లేకుండగనే అభ్యంగము చేయబడినట్లుండునో అట్టివానిని ఆయువుక్షీణించినవానినిగ తెలిసికొని విడిచిపెట్టవలయును.

కృశించియుండు ఎవనియొక్క ముక్కుదూలము పెద్దదై, వాపునొందకున్నను వాపునొందినట్లుండునో వాడు చికిత్సింపబడుటకు అనర్హుఁడుగనుండును. ఎవనియొక్క ముక్కు మిక్కిలి తెరచుకొనికాని మిక్కిలిమూసికొనికాని వంకరగగాని ఎండిపోయికాని యుండునో వాడు జీవింపడు. ఎవనియొక్క ముఖమును చెవులును పెదవులును తెల్లగగాని శ్యావవర్ణముకలవిగగాని మిక్కిలి ఎఱ్ఱగగాని వికృతములుగగాని నీలవర్ణముకలవిగగాని ఉండునో వాడు రోగముచే విడిచిపెట్టబడడు.

మూ॥ అస్థిశ్వేతా ద్విజా యస్య పుష్పితాః పఙ్కసంవృతాః। వికృత్యా న స రోగం తం విహాయారోగ్యమశ్నుతే॥ స్తబ్ధా నిశ్చేతనా గుర్వీ కణ్టకోపచితా భృశమ్। శ్యావా శుష్కాఽథవా శూనా ప్రేతజిహ్వా విసర్పిణీ॥ దీర్ఘముచ్ఛ్వస్య యో హ్రస్వం నరో నిఃశ్వస్య తామ్యతి। ఉపరుద్ధాయుషం జ్ఞాత్వా తం ధీరః పరివర్జయేత్॥ హస్తౌ పాదౌ చ మన్యే చ తాలు చైవాతిశీతలమ్। భవత్యాయుః క్షయే క్రూరమథవాతిభవేన్మృదు॥ ఘట్టయఞ్జానునా జాను పాదావుద్యమ్య పాతయన్। యోఽపాస్యతి ముహుర్వక్త్రమాతురో న స జీవతి। దన్తైశ్ఛిన్దన్నఖాగ్రాణి నఖైశ్ఛిన్దఞ్ఛిరోరుహాన్। కాష్ఠేన భూమిం విలిఖన్న రోగాత్పరిముచ్యతే॥ దన్తాన్ ఖాదతి యో జాగ్రద సామ్నా విరుదన్ హసన్। విజానాతి న చేద్దుఃఖం న స రోగాద్విముచ్యతే॥ ముహుర్హాసన్ముహుః క్ష్వేడఞ్ఛయ్యాం పాదేన హస్తయః। ఉచ్చైశ్ఛిద్రాణి విమృశన్నాతురో న స జీవతి ॥20॥

అ॥ ఎవనియొక్క దంతములు వికృతిచే ఎముకలవలె తెల్లగను పుష్పితములుగను పాచితోకూడినవిగను నుండునో అట్టివాడు రోగమునువిడచి ఆరోగ్యమును పొందడు. మొద్దుబారుట చైతన్యములేకుండుట బరువుగనుండుట ముళ్ళుబారియుండుట శ్యావవర్ణముకలదిగనుండుట శుష్కించికాని లావుబారికాని యుండుట జారియుండుట యీలక్షణములుగల జిహ్వ ప్రేతజిహ్వయనబడును. ఎవడు దీర్ఘమగు ఉచ్ఛ్వాసమును పీల్చి హ్రస్వమగు నిశ్వాసమును వదలుచు మోహమునొందునో అట్టివానిని ఆయువుక్షీణించినవానినిగ తెలిసికొని విడిచిపెట్టవలయును. ఎవనియొక్క హస్తములును పాదములును మెడనరములును తాలువులును మిక్కిలిశీతలములుగనై మిక్కిలి కఠినములుగగాని మిక్కిలిమృదువులుగగాని అగునో అట్టివానియొక్క ఆయువు క్షీణించినదని తెలిసికొనవలయును. ఎవడు మోకాలితో తనయొక్క రెండవమోకాలిని కొట్టుకొనుచు పాదములను ఎత్తి క్రిందపడవేయుచు ముఖమునిటునటు మాటిమాటికి త్రిప్పుకొనుచుండునో అట్టిరోగి జీవింపడు. దంతములచే గోళ్ళను కొరుకుకొనుట, గోళ్ళచే వెంట్రుకలను త్రుంపుకొనుట, కఱ్ఱతో భూమిని గీయుచుండుట,

ఈలక్షణములుగలవాడు రోగములచే విడిచిపెట్టబడడు. ఎవడు జాగ్రదవస్థయందే దంతములను కొరుకుకొనుచు అకారణముగ ఏడ్చుచు నవ్వుచునుండునో దుఃఖమును తెలిసికొనజాలడో అట్టివాడు రోగముచే విడిచిపెట్టబడడు. మాటిమాటికినవ్వుట, మాటిమాటికిఅరచుట, శయ్యను పాదములతో తన్నుట, నాసిక మొదలగురంధ్రములను గట్టిగ నులుముకొనుట ఈలక్షణములుగలరోగి జీవింపడు.

మూ॥ యైర్విన్దతి పురా భావైః సమేతైః పరమాం రతిమ్ । తైరేవారమమాణస్య గ్లాస్నోర్మరణమాదిశేత్ ॥ న బిభర్తి శిరో గ్రీవం న పృష్ఠం భారమాత్మనః న హనూ పిణ్డమాస్యస్థమాతురస్య ముమూర్షతః॥ సహసా జ్వరసంతాప స్తృష్ణా మూర్ఛా బలక్షయః । విశ్లేషణం చ సన్ధీనాం ముమూర్షో రుపజాయతే॥ గోసర్గే వదనాద్యస్య స్వేదః ప్రచ్యవతే భృశమ్ । లేపజ్వరోపతప్తస్య దుర్లభం తస్య జీవితమ్॥ నోపైతి కణ్ఠమాహారో జిహ్వా కణ్ఠముపైతి చ । ఆయుష్యన్తం గతే జన్తోర్బలం చ పరిహీయతే ॥ శిరో విక్షిపతే కృచ్ఛ్రాన్నుఞ్చయిత్వా ప్రపాణికౌ । లలాటప్రస్రుతస్వేదో ముమూర్షుశ్చ్యుతబన్ధనః ॥26॥

అ॥ ఏభావములచే పూర్వమునందు పరమప్రీతిని పొందెనో ఆభావములచేతనే ప్రీతిని పొందనట్టియు క్షీణించుచున్నట్టియు మనుజునకు మరణమును చెప్పవలయును. చచ్చుటకు సిద్ధముగనున్న రోగి శిరస్సును మెడను నడుమును అంకిళ్ళ నోటియందలి ఆహారపుముద్దను నిలుపజాలడు. చావసిద్ధముగనున్నవానికి హఠాత్తుగ జ్వరసంతాపము దప్పిక మూర్ఛ బలక్షయము సంధులువీడినట్లుండుట ఈలక్షణములు కలుగును. ప్రలేపజ్వరముకలిగిన ఏరోగికి ప్రాతఃకాలమునందు ముఖమునుండి అధికమగు చెమట స్రవించునో వానియొక్క జీవితము దుర్లభముగనుండును. ఆహారము కంఠమును పొందకుండుట, నాలుక కంఠములోనికి ఈడ్చుకొనిపోవుట, బలము క్షీణించుట ఈలక్షణములుకలవానిని ఆయుష్యముయొక్క అంతమునుపొందినవానినిగ తెలిసికొనవలయును. శిరస్సును అతికష్టముగ కదల్చుట, ముంజేతులను కదల్పకుండుట, లలాటప్రదేశమునుండి చెమట స్రవించుచుండుట సంధిబంధనములు విడిపోయినట్లుండుట ఈలక్షణములుకలవాడు మరణమును పొందును.

## అధ్యాయసంగ్రహము.

మూ॥ ఇమాని లిఙ్గాని నరేషు బుద్ధిమాన్విభావయేతావహితో ముహుర్ముహుః । క్షణేన భూత్వా హ్యుపయాన్తి కాని చిన్న చాఫలం లిఙ్గమిహాస్తి కించన ॥27॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే ఇన్ద్రియస్థానే అవాక్శిరసీయ మిన్ద్రియం నామాష్టమోఽధ్యాయః ॥

అ॥ పైనచెప్పబడిన ఈలక్షణములలో కొన్ని క్షణకాలములోనే పుట్టి రోగిని పొందుచుండును. వీనిలో ఫలములేని లక్షణము ఒకటియును లేదు. కావున బుద్ధిమంతుడగు వైద్యుడు ఈలక్షణములను అప్రమత్తుడై మాటిమాటికి తెలిసికొనవలయును. ఇవ్విధంబున, శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరక సంహితావ్యాఖ్యానమునందు అవాక్శిరసీయేంద్రియ మనెడు అష్టమాధ్యాయము సమాప్తము.

# నవమాధ్యాయము.

మూ॥ అథాతో యస్యశ్యావనిమిత్తీయమిన్ద్రియం వ్యాఖ్యాస్యామః॥

అ॥ పిమ్మట యస్యశ్యావనిమిత్తీయేంద్రియమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ యస్య శ్యావే పరిధ్వస్తే హారితే చాపిదర్శనే। ఆపన్నో వ్యాధిరన్తాయ జ్ఞేయస్తస్య విజానతా ॥3॥

అ॥ ఎవనియొక్క నేత్రములు శ్యావవర్ణముకలవిగను బయటికిజారినవిగను ఆకుపచ్చనిరంగు కలవిగను నుండునో వాడు మరణము నొందును.

మూ॥ నిస్సంజ్ఞః పరిశుష్కాస్యః సంవిద్ధో వ్యాధిభిశ్చ యః। ఉపరుద్ధాయుషం జ్ఞాత్వా తం ధీరః పరివర్జయేత్ ॥ హారితాశ్చ సిరా యస్య రోమకూపాశ్చ సంవృతాః। సోఽమ్లాభిలాషీ పురుషః పిత్తాన్మరణమశ్నుతే॥ శరీరాన్తాశ్చ శోఫన్తేశరీరం చోపశుష్యతి। బలం చ హీయతే యస్య రాజయక్ష్మాహినస్తితమ్॥ అంసాభితాపోహిక్కా చ ఛర్దనం శోణితస్య చ। ఆనాహః పార్శ్వశూలం చ భవత్యన్తాయ శోషిణః॥ వాతవ్యాధిరపస్మారీ కుష్ఠీ శోఫీ తథోదరీ। గుల్మీచ మధుమేహీ చ రాజయక్ష్మీ చ యో నరః॥ అచికిత్స్యాభవన్త్యేతే బలమాంసక్షయే సతి। అన్యేష్వపి వికారేషు తాన్భిషక్పరివర్జయేత్॥ విరేచన

హృతానాహో యస్తృష్ణానుగతో నరః। విరిక్తః పునరాధ్మాతి యథా ప్రేతస్తథైవ సః॥ పేయం పాతుం న శక్నోతి కణ్ఠస్య చ ముఖస్య చ। ఉరసశ్చ విశుష్కత్వాద్యో నరో న స జీవతి॥ స్వరస్య దుర్బలీభావం హానిం చ బలవర్ణయోః। రోగావృద్ధిమయుక్త్యా చ దృష్ట్వా మరణమాదిశేత్॥ ఊర్ధ్వశ్వాసం గతోష్మాణం శూలోపహతవఙ్క్షణమ్। శర్మ చానధిగచ్ఛన్తం బుద్ధిమాన్ పరివర్జయేత్॥ అపస్వరం భాషమాణం ప్రాప్తం మరణమాత్మనః। శ్రోతారం చాస్య శబ్దస్య దూరతః పరివర్జయేత్ ॥14॥

అ॥ స్మృతితప్పుట నోరువెండుట వ్యాధులతోఁగూడియుండుట ఈలక్షణములతోఁగూడినవానిని విడిచిపెట్టవలయును. ఎవనికి సిరలు పచ్చగనుండునో రోమకూపములు కప్పబడియుండునో పుల్లనిపదార్థములయందు ఇచ్ఛయుండునో వాడుపిత్తము వలన మరణమునొందును. ఎవనియొక్క శరీరావయవములు శోభాయుక్తములుగ నుండునో శరీరము శుష్కించియుండునో బలము క్షీణించునో వానిని రాజయక్ష్మ చంపును. భుజశిరస్సులయందు తాపము ఎక్కిళ్ళు రక్తవమనము ఆనాహము పార్శ్వశూల ఈలక్షణములుకల పాండురోగికి మరణము కలుగును. వాతవ్యాధి అపస్మారము కుష్ఠవ్యాధి శోఫ ఉదరవ్యాధి గుల్మము మధుమేహము రాజయక్ష్మ ఈవ్యాధులు కలవారు క్షీణించినబలమాంసములుకలవారుగనున్నచో చికిత్సింపతగనివారుగ నుందురు. ఇట్టి ఇతరవ్యాధులుకలవారినికూడ బలమాంసములు క్షీణించియున్నచో విడిచిపెట్టవలయును. విరేచనములచేహరింపజేయబడిన ఆనాహముకల ఎవడు దప్పికనొంది మరల ఆనాహముకలవాడగునో వాడు ప్రేతతుల్యుడుగ నుండు. కంఠమును ముఖమును వక్షస్థలమును ఎండుటవలన ఎవడు త్రాగతగినవానిని త్రాగుటకు అసమర్థుడుగ నుండునో వాడు జీవింపడు. స్వరము దుర్బలముగనుండుట బలమును వర్ణమును క్షీణించుట అయుక్తమార్గముచే రోగము వృద్ధినొందుట ఈలక్షణములుకలవాడు మరణము నొందును. ఊర్ధ్వశ్వాస శరీరముచల్లబడుట గజ్జలయందు శూల ఎట్టిఉపచారముచేనైనను సుఖమునొందకుండుట ఈలక్షణములు కలవానిని విడిచిపెట్టవలయును. చనిపోవుచున్నాను అని అపస్వరముగమాట్లాడుట ధ్వనిలేకుండగనే వినబడుట ఈలక్షణములు కలవానిని దూరముగ విడిచిపెట్టవలయును.

మూ॥ యం నరం సహసా రోగో దుర్బలం పరిముఞ్చతి। సంశయప్రాప్తమాత్రేయో జీవితం తస్య మన్యతే॥ అథ చేత్ జ్ఞాతయస్తస్య యాచేరన్ ప్రణిపాతతః। రసేనాద్యాదితి బ్రూయాన్నాస్మై

దద్యాద్విశోధనమ్ ॥ మాంసేన చేన్న దృశ్యేత విశేషస్తస్య శోభనః ।
రసైశ్చాన్నైర్బహువిధైర్దుర్లభం తస్య జీవితమ్ ॥17॥

అ॥ దుర్బలుడగు ఏరోగిని రోగము [హఠాత్తుగ పిడిచిపెట్టునో వాడు జీవించునా జీవింపడా యని ఆత్రేయుడు తలచుచున్నాడు. అట్టిరోగియొక్క జ్ఞాతులు నమస్కరించి బతిమాలినచో వానికి] మాంసరసము నీయవలయునని చెప్పవలయును. శోధనౌషధముల నీయకూడదు. వానికి అనేకవిధములైన మాంసరసములచే నొకమాసములో శుభప్రదమైన విశేషము కనుబడనియెడల వానియొక్క జీవితము దుర్లభముగ నుండును.

మూ॥ నిష్ఠ్యూతం చ పురీషం చ రేతశ్చాప్సు మజ్జతి । యస్య తస్యాయుషః ప్రాప్తమన్తమాహుర్మనీషిణః ॥ నిష్ఠ్యూతే యస్య దృశ్యన్తే వర్ణా బహువిధాః పృథక్ । తచ్చ సీదత్యపః ప్రాప్య న స జీవితుమర్హతి ॥19॥

అ॥ ఎవనియొక్క ఉమ్మియు పురీషము రేతస్సును నీటియందు మునుగునో వానియొక్క ఆయువు సమాప్తమునొందినదని తెలిసికొనవలయును. ఎవనియొక్క ఉమ్మి అనేకవర్ణములుకలదిగనుండి నీటియందు మునుగునో వాడు జీవింపడు.

మూ॥ పిత్తమూష్మానుగం యస్య శఙ్ఖౌ ప్రాప్య విమూర్ఛతి। స రోగః శఙ్ఖకో నామ్నా త్రిరాత్రాద్ధన్తి జీవితమ్ ॥ సఫేనం రుధిరం యస్య ముహూ రాస్యాత్ప్రముచ్యతే । శూలైశ్చ తుద్యతే కుక్షిః ప్రత్యాఖ్యేయః స తాదృశః ॥ బలమాంసక్షయస్తీవ్రో రోగవృద్ధిరరోచకః । యస్యాతురస్య లక్ష్యన్తే త్రీన్ పక్షాన్న సజీవతి ॥22॥

అ॥ పిత్తము ఊష్మతోకూడినదై శంఖప్రదేశములనుపొంది బాధను కలిగించినచో శంఖకమనెడు ఆవ్యాధి మూడురోజులలో మరణమును కలిగించును. ఎవనియొక్క నోటినుండి నురుగుతోకూడిన రక్తము తరుచు బయలువెడలుచుండునో కుక్షిప్రదేశము శూలతోకూడుకొనియుండునో వానిని విడిచిపెట్టవలయును. బలమాంసములుక్షీణించుట తీవ్రమైనరోగవృద్ధి అరోచకము ఈలక్షణములు ఏరోగికి కలుగునో వాడు మూడుపక్షములలో మరణమునొందును.

## అధ్యాయసంగ్రహము.

మూ॥ విజ్ఞానాని మనుష్యాణాం మరణే ప్రత్యుపస్థితే। భవన్త్యేతాని సంపశ్యేదన్యాన్యేవంవిధాని చ॥ తాని సర్వాణి లక్ష్యన్తే న తు సర్వాణి మానవమ్ । విశన్తి వినశిష్యన్తం తస్మాద్బోధ్యాని సర్వశః ॥24॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే ఇన్ద్రియస్థానే యస్యశ్యావనిమిత్తీయమిన్ద్రియం నామ నవమోఽధ్యాయః ॥

అ॥ మనుష్యులకు మరణముకలుగబోవునపుడు ఇదివరలో చెప్పబడిన లక్షణములు కలుగును. మరియు ఇట్టిఇతరలక్షణములుకూడ తెలిసికొనవలయును. చావబోవు మనుజునకు ఇదివరలో చెప్పబడిన లక్షణములు అన్నియు కలుగకపోవచ్చును. అందువలన అన్నిటిని తెలిసికొనవలయును.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు యస్యశ్యావనిమిత్తీయేంద్రియమనెడు నవమాధ్యాయము సమాప్తము.

## దశమాధ్యాయము.

మూ॥ అథాతోసద్యోమరణీయ మిన్ద్రియం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట సద్యోమరణీయేంద్రియమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ సద్యస్త్విరిక్షతః ప్రాణాన్ లక్షణాని పృథక్పృథక్ ।
అగ్నివేశ ! ప్రవక్ష్యామి సంసృష్టో యైర్న జీవతి ॥3॥

అ॥ ఏలక్షణములతోకూడుకొని అప్పుడే ప్రాణములనువిడువలేక బాధనొందు చుండునో అట్టిలక్షణములను వేరువేరుగ చెప్పుచున్నాము.

మూ॥ వాతాష్ఠీలా సుసంవృత్తా తీవ్రస్త్రీ దారుణా హృది ।
తృష్ణయాఽభిపరీతస్య సద్యో ముష్ణాతి జీవితమ్ ॥ పిణ్డికే శిథిలీకృత్య జిహ్మీకృత్య చ నాసికామ్ । వాయుః శరీరే విచరన్ సద్యో ముష్ణాతి జీవితమ్॥ భ్రువౌ యస్య చ్యుతే స్థానాదన్తర్దాహశ్చ దారుణః । తస్య హిక్కాకరో రోగః సద్యో ముష్ణాతి జీవితమ్॥ క్షీణశోణితమాంసస్య వాయురూర్ధ్వగతిశ్చరన్ ॥ ఉభే మన్యే సమాయస్య సద్యో ముష్ణాతి జీవితమ్ ॥7॥

అ॥ ఎవనికి గుండ్రనియాకృతికలిగి భయంకరముగనున్న వాతాష్ఠీలయనెడి వ్యాధి హృదయమునందుజనించి దప్పికకలుగునో వాడు వెంటనే మరణమునొందును.

పిక్కలను శిథిలముగ చేయుచు ముక్కును వంకరగ చేయుచు శరీరమునందుసంచరించు వాతము ప్రాణమును వెంటనే హరించును. కనుబొమ్మలు స్వస్థానమునుండిజారుట, దారుణమైన అంతస్తాపము, ఎక్కిళ్లు ఈలక్షణములుగలవాడు వెంటనే మరణము నొందును. రక్తమును మాంసమును క్షీణించిన వారికి వాతము ఊర్ధ్వగతినొంది రెండు మెడకొంపలను ఆకర్షించినచో ప్రాణమును వెంటనే హరింపజేయును.

మూ॥ అన్తరేణ గుదం గచ్ఛన్నాభిం చ సహసాఽనిలః। కృశస్య వఙ్క్షణౌ గృహ్ణన్ సద్యో ముష్ణాతి జీవితమ్ ॥ వితత్య పర్శుకా గ్రాణి గృహీత్వోరశ్చ మారుతః ॥ స్తిమితస్యాయతాక్షస్య సద్యో ముష్ణాతి జీవితమ్ ॥ హృదయం చ గుదం చోభే గృహీత్వా మారుతో బలీ। దుర్బలస్య విశేషేణ సద్యో ముష్ణాతి జీవితమ్॥ వఙ్క్షణం చ గుదం చోభే గృహీత్వా మారుతో బలీ। శ్వాసంసంజనయఙ్జన్తోః సద్యో ముష్ణాతి జీవితమ్॥ నాభిం మూత్రం వస్తిశీర్షం పురీషం చాపి మారుతః। విబధ్య జనయఞ్చూలం సద్యో ముష్ణాతి జీవితమ్ ॥ భిద్యేతే వఙ్క్షణౌ యస్య వాతశూలైః సమన్తతః । భిన్నం పురీషం తృష్ణా చ సద్యః ప్రాణాఞ్జహాతి సః ॥1౩॥

అ॥ క్షీణించినవానికి వాతము గుదమునకు నాభికిని మధ్యభాగమునందు సంచరించుచు గజ్జలను పొందినచో మరణమును కలిగించును. స్తబ్ధుడుగను రెప్పపాటులేనివాడుగను నున్న మనుజునకు వాతము పర్శుకాస్థులయొక్క అగ్రభాగములయందు వ్యాపించి వక్షఃస్థలమును పీడించినచో వెంటనే మరణమును కలిగించును. మిక్కిలి దుర్బలుడుగనున్న వానికి పటిష్ఠమైన వాతము హృదయమును, గుదప్రదేశమును పొందినచో వెంటనే మరణమును కలిగించును. బలిష్ఠమైన వాతము హృదయమును, గుదప్రదేశమును పొందినచో వెంటనే మరణమును కలిగించును. బలిష్ఠమైనవాతముగజ్జలను గుదప్రదేశమును పొంది శ్వాసను కలిగించినయెడల వెంటనే మరణము కలుగును. వాతము నాభిని, మూత్రమును, వస్తిశిరస్సును, పురీషమును అరికట్టి శూలను కలిగించినచో వెంటనే మరణము కలుగును. వాతశూలచే గజ్జలు అధికముగ బ్రద్దలుకొట్టబడినట్లుండుట మలము కొద్దికొద్దిగ వెడలుచుండుట దప్పిక ఈలక్షణములుకలవాడు వెంటనే మృతినొందును.

మూ॥ ఆప్లుతం మారుతేనేహ శరీరం యస్య కేవలమ్ ॥ భిన్నం పురీషం తృష్ణా చ సద్యో జహ్యాత్స జీవితమ్ ॥ శరీరం శోఫితం యస్య వాతశోఫేన దేహినః । భిన్నం పురీషం తృష్ణా చ సద్యో జహ్యాత్స జీవితమ్॥ ఆమాశయసముత్థా నా యస్య స్యాత్పరికర్తికా। తృష్ణా గుద

గ్రహాశ్చైగ్రః సద్యో జహ్యాత్స జీవితమ్ ॥ పక్వాశయమధిష్ఠాయ హత్వా సంజ్ఞాం చ మారుతః। కణ్ఠే ఘుర్ఘురకం కృత్వా సద్యో హరతి జీవితమ్ ॥ దన్తాః కర్దమచూర్ణాభా ముఖం చూర్ణకసంనిభమ్। శిప్రా యన్తే చ గాత్రాణి లిఙ్గం సద్యో మరిష్యతః ॥ తృష్ణాశ్వాసశిరో రోగ మోహదౌర్బల్యకూజనైః స్పృష్టః ప్రాణాఞ్జహాత్యాశు శకృద్భేదేన చాతురః ॥19॥

ఆ॥ సమస్తశరీరమును వాతముచే ఆవరింపబడుట మలము కొద్దికొద్దిగ వెడలుచుండుట దప్పిక ఈలక్షణములుకలవాడు వెంటనే మరణమునొందును.శరీరమంతయు వాతశోఫచే ఆవరింపబడియుండుట మలముకొద్దికొద్దిగ వెడలుచుండుట దప్పిక ఈలక్షణములుకలవాడు వెంటనే మృతినొందును. ఆమాశయమునందు పరికర్తికయనెడిబాధ జనించుట దప్పిక గుదప్రదేశముఅధికముగనిరోధింపబడుట ఈలక్షణములుకలవాడు వెంటనే ప్రాణములను విడిచిపెట్టును. వాతము పక్వాయమునుపొంది సంజ్ఞాజ్ఞానమును హరించి కంఠమునందు ఘుర్ఘురకమనెడి ధ్వనిని కలిగించినయెడల వెంటనేమరణమును కలిగించును. దంతములు బురదయొక్కగాని సున్నముయొక్కగాని కాంతిని కలిగియుండుట, ముఖము సున్నమువలెనుండుట, అవయవములు చెమటనుగ్రక్కుచుండుట ఈలక్షణములు చావసిద్ధముగనున్నవానికి కలుగును. దప్పిక శ్వాస శిరోవ్యాధి మోహము దౌర్బల్యము మూలుగుట మలము కొద్దికొద్దిగ వెడలుచుండుట ఈలక్షణములు కలవాడు ప్రాణములను వెంటనే విడిచిపెట్టును.

## అధ్యాయ సంగ్రహము.

మూ॥ ఏతాని ఖలు లిఙ్గాని యః సమ్యగవబుధ్యతే। స జీవితం చ మర్త్యానాం మరణం చావబుధ్యతే ॥20॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతి సంస్కృతే ఇన్ద్రియస్థానే సద్యోమరణీయ మిన్ద్రియం నామ దశమోఽధ్యాయః ॥

ఆ॥ పూర్వమునందుచెప్పబడిన ఈలక్షణములను బాగుగా తెలిసికొనినవాడు మనుజులయొక్క ఆయువును మరణమును తెలిసికొనగలుగును.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు సద్యోమరణీయేంద్రియ మనెడు దశమాధ్యాయము సమాప్తము.

—0—

# ఏకాదశాధ్యాయము.

మూ॥ అథాతోఽణుజ్యోతీయ మిన్ద్రియం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట అణుజ్యోతీయేంద్రియమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ అణుజ్యోతి రనేకాగ్రో దుశ్ఛాయో దుర్మనాః సదా। రతిం న లభతే యాతి పరలోకం సమాన్తరమ్॥ బలిం బలిభుజో యస్య ప్రణీతం నోపభుఞ్జతే। లోకాన్తరగతః పిణ్డం భుఙ్క్తే సంవత్సరేణ సః॥ సప్తర్షీణాం సమీపస్థాం యో న పశ్యత్యరున్ధతీమ్। సంవత్సరాన్తే జన్తుః స సంపశ్యతి మహత్తమః॥ వికృత్యాం వినిమిత్తం యః శోభాముపచయం ధనమ్। ప్రాప్నోత్యతో వా విభ్రంశం సమాన్తం న స జీవతి ॥6॥

అ॥ అగ్నిమాంద్యము, మనోవ్యాకులత, శరీరకాంతి చెడుట, మనోదౌర్బల్యము ఈలక్షణములుకలవాడు సుఖమునుపొందక సంవత్సరమధ్యకాలములో పరలోకమును పొందును. ఎవరిచే విధిపూర్వకముగ నియ్యబడిన బలిని కాకులు తినకుండునో అట్టివాడు ఒక సంవత్సరములో పరలోకమునుపొంది పిండము తినును. సప్తర్షి మండలమునకు సమీపమునందున్న అరుంధతీనక్షత్రము ఎవనికి కనుపడదో వాడు ఒక సంవత్సరములో మృత్యురూపమగు తమస్సును పొందును. ఎవడు వికృతిచేగాని కారణము లేకుండగగాని శరీరశోభ శరీరపుష్టి ధనము వీనియొక్క వృద్ధిని లేక నాశనమును పొందునో అట్టివాడు సంవత్సరములోపల మృతినొందును.

మూ॥ భక్తిః శీలం స్మృతిస్త్యాగో బుద్ధిర్బల మహేతుకమ్। షడేతాని నివర్తన్తే షడ్భిర్మాసైర్మరిష్యతః॥ ధమనీనామపూర్వాణాం జాలమత్యర్థశోభనమ్। లలాటే దృశ్యతే యస్య షణ్మాసాన్న స జీవతి॥ లేఖాభిశ్చన్ద్రవక్రాభిర్లలాట ముపచీయతే। యస్య తస్యాయుషః షడ్భిర్మాసైరన్తం సమాదిశేత్॥ శరీరకమ్పః సంమోహో గతిర్వచనమేవ చ। మత్తస్యేవోపలక్ష్యన్తే యస్య మాసం న జీవతి॥ రేతోమూత్రపురీషాణి యస్య మజ్జన్తి చామ్భసి॥ స మాసాత్స్వజనద్వేష్టా మృత్యువారిణి మజ్జతి ॥11॥

అ॥ భక్తి, యోగ్యస్వభావము, జ్ఞాపకశక్తి, దాతృత్వము, సద్బుద్ధి, శరీరబలము ఈఆరును ఎవనికి నిర్నిమిత్తముగ నశించునో వాడు ఆరుమాసములలోమృతినొందును. ఎవనియొక్క లలాటప్రదేశమునందు అదివరలోలేనట్టి ధమనులయొక్క అతిసుందర

మగుచల వలెనుండు సముదాయము కనబడునో అట్టివాడు ఆరుమాసములలో మృతినొందును. ఎవనియొక్క లలాటము బాలచంద్రునివలె వంకరగనున్న రేఖలచే వ్యాప్తమగునో అట్టివానియొక్క ఆయువు ఆరుమాసములలో అంతమగునని తెలిసికొనవలయును. శరీరము వణకుట, మోహము, గమనము, వాక్కు ఇవి ఎవనికి మత్తుడగువానికి వలెనే సంభవించునో వాడు ఒకమాసములో మృతినొందును. ఎవనియొక్క శుక్రమును మూత్రమును పురీషమును నీటియందు మునుగునో స్వజనముచే ద్వేషింపబడినవాడు ఒకమాసములో మృత్యురూపమగు ఉదకమునందు మునుగును.

మూ॥ హస్తపాదం ముఖం చోభే విశేషాద్యస్య శుష్యతః। శూయేతే వా వినా దేహాత్స చ మాసం న జీవతి॥ లలాటే మూర్ధ్ని వస్తౌ చ నీలా యస్య ప్రకాశతే। రాజీ బాలేన్దుకుటిలా న స జీవితుమర్హతి॥ ప్రవాలగుటికాభాసా యస్య గాత్రే మసూరికాః। ఉత్పద్యాశు వినశ్యన్తి న చిరాత్స వినశ్యతి॥ గ్రీవావమర్దో బలవాఞ్జిహ్వాశ్వయథురేవ చ। బ్రధ్నాస్యగలపాకశ్చ యస్య పక్వం తమాదిశేత్। సంభ్రమోఽతి ప్రలాపోఽతి భేదోఽస్థ్నామతిదారుణః। కాలపాశపరీతస్య త్రయమేతత్ప్రవర్తతే॥ ప్రముహ్యా లుఞ్ఛయేత్కేశాన్ పరిగృహ్ణాత్యతీవ చ। నరః స్వస్థవదాహారమబలః కాలచోదితః ॥17॥

ఆ॥ ఎవనియొక్క హస్తపాదములును ముఖమును మిక్కిలి శుష్కించునో లేక శరీరము గాక ఇవి వాచునో అట్టివాడు ఒకమాసములో మృతినొందును. లలాటము శిరస్సు వస్తియందు ప్రదేశము వీనియందు ఎవనికి నీలవర్ణముగ నున్నట్టియు బాలచంద్రునివలె వంకరగనున్నట్టియు రేఖ జనించునో వాడు జీవింపడు. ఎవనియొక్క శరీరమునందు పగడపు గుటికలవలెనుండు మసూచికపుపొక్కులు జనించి వెంటనే నశించునో అట్టివాడు శీఘ్రకాలములోనే మృతినొందును. కంఠమునందు అధికమగుబాధ, నాలుకయందు వాపు, గజ్జలయందు బిళ్ళజనించుట, నోరును కంఠమును పాకము నొందుట ఈలక్షణములు కలవాడు మృతినొందును. అధికమగు మోహము, అధికమగు ప్రలాపము, ఎముకలయందు విరిగినట్లు మిక్కిలి దారుణమగుబాధ ఈమూడు లక్షణములును చావసిద్ధముగనున్నవానికి జనించును. మోహమునొందుట, తలవెంట్రుకలను త్రెంపుకొనుట, స్వస్థునివలెనే ఆహారమును భుజించుట, బలహీనుడుగ నుండుట ఈలక్షణములు కలవాడు మృతినొందును.

మూ॥ సమీపే చక్షుషోః కృత్వా మృగయేతాఙ్గులీకరమ్। స్మయతేఽపి చ కాలాన్ధ ఊర్ధ్వగానిమిషేక్షణః॥ శయనాదాసనాదఙ్గాత్కాష్ఠాత్కుడ్యాదథాపి వా। అసన్మృగయతే కించిత్సముహ్యాన్ కాలచోదితః॥ అహాస్యహాసీ సంముహ్యాన్ ప్రలేఢి దశనచ్ఛదౌ। శీతపాదకరోచ్ఛ్వాసో యో నరో న స జీవతి॥ ఆహ్వాయన్తం సమీపస్థ స్వజనం

జనమేవ వా। మహామోహావృతమనాః పశ్యన్నపి న పశ్యతి॥ అయోగ మతియోగం వా శరీరే మతిమాన్భిషక్ । ఖాదీనాం యుగపద్దృష్ట్వా భేషజం నావచారయేత్ ॥22॥

అ॥ ఎవడు తన చేతివ్రేళ్ళను కళ్ళసమీపమునం దుంచుకొని వెదకుకొనుచు ఆశ్చర్యము నొందుచు రెప్పపాటులేని ఊర్ధ్వదృష్టికలవాడగునో అట్టివాడు మరణము నొందును. ఎవడు మోహమునొంది శయనమునందుగాని ఆసనమునందుగాని శరీరము నందుగాని క్రియయందుగాని గోడయందుగాని లేనిపదార్థమును ఉన్నట్లుగ వెదకునో వాడు మరణమునొందును. నవ్వుటకు కారణము లేకుండగనే నవ్వుట, మోహము నొందుట, పెదవులను నాకుచుండుట, పాదములును హస్తములును నిశ్వాసవాయువులును చల్లగనుండుట ఈలక్షణములతో కూడినవాడు జీవింపనేరడు మరణమోహముచే ఆవరింపబడిన ఎవడు తనసమీపమునం దున్నట్టియు పిలుచుచున్నట్టియు స్వజనమునుగాని ఇతరజనమునుగాని చూచుచున్నను గుర్తింపలేకుండునో అట్టివాడుమరణమునొందును. ఎవనియొక్క శరీరమునందు ఒక్కమారుగనే ఇంద్రియాదులయొక్క అయోగముగాని అతియోగముగాని కలుగునో అట్టివానికి ఔషధము నీయకూడదు.

మూ॥ అతిప్రవృద్ధ్యా రోగాణాం మనసశ్చ బలక్షయాత్ । వాస ముత్సృజతి క్షిప్రం శరీరీ దేహసంజ్ఞకమ్ ॥ వర్ణస్వరావగ్నిబలం వాగింద్రియ మనోబలమ్ । హీయతేఽసుక్షయే నిద్రా నిత్యాభవతి వా న వా॥ భిషగ్భేషజపానాన్న గురుమిత్రద్విషశ్చ యే। వశగాః సర్వ ఏవైతే బోద్ధవ్యాః సమవర్తినః ॥ ఏతేషు రోగః క్రమతే భేషజం ప్రతిహన్యతే। నైషా మన్నాని భుఞ్జీత న చోదక మపి స్పృశేత్ ॥26॥

అ॥ రోగము అధికముగ వృద్ధినొందుటవలనను మనోబలము క్షీణించుటవలనను జీవాత్మ వాసస్థానమగు శరీరమును వెంటనే విడిచిపెట్టును. ప్రాణములు నశించు సమయమున వర్ణము స్వరము జాఠరాగ్ని వాక్కులు ఇంద్రియములు మనస్సు వీనియొక్క బలము నశించును. మరియు నిద్ర అధికముగ జనించును. లేక జనింపకుండును. వైద్యుడు ఔషధము పానద్రవ్యములు ఆహారపదార్థములు గురువులు స్నేహితులు వీరిని ద్వేషించువారు యమసాన్నిధ్యము నొందెదరు. ఇట్టి వీరలకు రోగము వృద్ధినొందును. ఔషధము నిష్ప్రయోజన మగును. వీరలయొక్క అన్నమును భుజింపకూడదు. మరియు ఉదకమునుకూడ స్పృశింపకూడదు.

మూ॥ పాదాః సమేతాశ్చత్వారః సంపన్నాః సాధకైర్గుణైః । వ్యర్థా గతాయుషో ద్రవ్యం వినా నాస్తి గుణోదయః ॥ పరీక్ష్యమా యుర్భిషజా నీరుజస్యాతురస్య చ । ఆయుర్వేదఫలం కృత్స్నమాయుర్వే ద్యానువర్తతే ॥28॥

అ॥ సాధకగుణములతో కూడిన యోగ్యమైన పాదచతుష్టయము ఆయువులేని వానికి నిష్ప్రయోజన మగును. ద్రవ్యము లేనిచో గుణోత్పత్తి కలుగ నేరదు గదా! ఆరోగ్యవంతునియొక్కయు రోగియొక్కయు ఆయువును వైద్యుడు పరీక్షింపవలయును. అట్లు పరీక్షించినచో మనుజుడు ఆయుర్వేదముయొక్క ఫలమగు ఆయువును సంపూర్ణముగ పొందును.

## అధ్యాయ సంగ్రహము.

మూ॥ క్రియాపథమతిక్రాన్తాః కేవలం దేహమాప్లుతాః। చిహ్నం కుర్వన్తి యద్దోషా స్తదరిష్టం నిరుచ్యతే ॥ 3 ॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే ఇన్ద్రియస్థానేఽణుజ్యోతీయ మిన్ద్రియం నామైకాదశోఽధ్యాయః ॥

అ॥ చికిత్సామార్గము నతిక్రమించినట్టియు సమస్తశరీరమును వ్యాపించినట్టియు దోషములు ఏలక్షణములను కలిగించునో అవి అరిష్టములని చెప్పబడును.

ఇవ్విధంబున శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు అణుజ్యోతిరేంద్రియ మనెడు ఏకదశాధ్యాయము సమాప్తము.

—0—

# ద్వాదశాధ్యాయము.

మూ॥ అథాతో గోమయచూర్ణీయమిన్ద్రియం వ్యాఖ్యాస్యామః॥

అ॥ పిమ్మట గోమయచూర్ణీయేంద్రియమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥ 2 ॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ యస్య గోమయచూర్ణాభం చూర్ణం మూర్ధని జాయతే। సస్నేహం భ్రశ్యతే చైవ మాసాన్తం తస్య జీవితమ్ ॥ నికషన్నివ యః పాదౌ చ్యుతాంసః పరిధావతి। వికృత్యా న సలోకేఽస్మిం శ్చిరం వసతి మానవః ॥ యస్య స్నాతానులిప్తస్య పూర్వం శుష్యత్యురో భృశమ్। ఆర్ద్రేషు సర్వగాత్రేషు సోఽర్ధమాసం న జీవతి ॥ యముద్దిశ్యాతురం వైద్యః సంవర్తయితుమౌషధమ్। యతమానో న శక్నోతి దుర్లభం తస్య జీవితమ్ ॥ విజ్ఞాతం బహుశః సిద్ధం విధివచ్చావ

చారితమ్ । న సిధ్యత్యౌషధం యస్యనాస్తి తస్య చికిత్సితమ్ ॥ ఆహార ముపయుఞ్జానో భిషజా సూపకల్పితమ్। యః ఫలం తస్య నాప్నోతి దుర్లభం తస్య జీవితమ్ ॥8॥

అ॥ ఎవనియొక్క శిరస్సునందు స్నేహయుక్తమైనట్టియు గోమయచూర్ణముతో సమానమైనట్టియు చూర్ణము ఏర్పడి రాలుచుండునో వాడు మాసములోపల చని పోవును. ఎవడు జారిన భుజశిరస్సులుకలవాడై పాదములను ఒరిపిడిచేసికొనుచు వికృతిగ పరుగిడునో వాడు ఈలోకమునందు చిరకాలము నివసింపడు. స్నానమును చేసి చంద నాదులను పూసికొనిన ఎవనియొక్క ఇతర శరీరమంతయు తడిగనుండగనే ముందుగ వక్షఃస్థలము ఎండిపోవుచుండునో వాడు పదునైదుదినములకూడ జీవింపడు. వైద్యుడు ఏరోగినుద్దేశించి ఔషధమును సంపాదించుటకు ప్రయత్నించియు విఫలప్రయత్ను డగునో అట్టిరోగియొక్క జీవితము దుర్లభముగ నుండును. శాస్త్రముచే తెలిసికొనబడి నట్టియు అనేక పర్యాయములు సిద్ధినొందినట్టియు విధిప్రకారముగ ప్రయోగింపబడి నట్టియు ఔషధము ఏరోగికి సిద్ధినికలిగింపదో వానికి చికిత్స లేదు. వైద్యునిచేచెప్ప బడినవిధమున పథ్యయుక్తమైనఆహారమును సేవించుచున్నను ఏరోగికి ఆరోగ్యము కలుగకుండునో వానియొక్క జీవితము దుర్లభముగ నుండును.

## దూతాధికారము.

మూ॥ దూతాధికారే వక్ష్యామ్యలక్షణాని ముమూర్షతామ్। యాని దృష్ట్వా భిషక్ ప్రాజ్ఞః ప్రత్యాఖ్యాయాద సంశయమ్॥ ముక్తకేశేఽథవా నగ్నే రుదత్యప్రయతేఽథవా । భిషగభ్యాగతం దృష్ట్వా దూతం మరణమాదిశేత్ ॥ సుప్తే భిషజి యే దూతాశ్ఛిన్దన్త్యపిచ భిన్దతి । ఆగచ్ఛన్తి భిషక్తేషాం న భర్తారమనువ్రజేత్ ॥ జుహ్వత్యగ్నిం తథా పిణ్డం పితృభ్యో నిర్వపత్యపి । వైద్యే దూతా య ఆయాన్తి తే ఘ్నన్తి ప్రజిఘాంసవః ॥ కథయత్యప్రశస్తాని చిన్తయత్యథవా పునః । వైద్యే దూతా మనుష్యాణామాగచ్ఛన్తి ముమూర్షతామ్ ॥ మృతదగ్ధవినష్టాని భజతి వ్యాహరత్యపి । అప్రశస్తాని చాన్యాని వైద్యే దూతా ముమూర్షతామ్ ॥ వికారసామాన్యగుణే దేశే కాలేఽథవా భిషక్ । దూతమభ్యాగతం దృష్ట్వా నాతురం తముపాచరేత్ ॥15॥

అ॥ ప్రాజ్ఞుడగువైద్యుడు చావసిద్ధముగనున్న మనుజునియొక్క ఏలక్షణములను బట్టి చికిత్సింపక నిస్సందేహముగ విడిచిపెట్టవచ్చునో అట్టిలక్షణములను ఈదూతాధికార మునందు చెప్పుచున్నాము. వెంట్రుకలనువిరియబోసుకొనియున్నప్పుడు గాని దిగంబరు డుగనున్నప్పుడు గానిదుఃఖించుచున్నప్పుడు గానిఅపవిత్రుడుగనున్నప్పుడు గానివచ్చిన

దూతను చూచి వైద్యుడు రోగికి మరణము కలుగునని తెలిసికొనవలయును. వైద్యుడు నిద్ర పోవుచున్నప్పుడు గాని దేనినైనను నరుకుచున్నప్పుడు గాని పగులగొట్టుచున్నప్పుడు గాని యేదూతలు వచ్చెదరో ఆదూతలయొక్క యజమానునికడకు వైద్యుడు పోనక్కరలేదు. వైద్యుడు హోమమును చేయుచున్నప్పుడు గాని పితృదేవతలకు పిండములనిచ్చునప్పుడు గాని యేదూతలు వచ్చెదరో ఆదూతలయొక్క యజమానుడు మరణము నొందును. వైద్యుడు అమంగళములైన వాక్యములను పలుకుచున్నప్పుడు గాని చింతించుచున్నప్పుడు గాని యేదూతలువచ్చెదరో అట్టిదూతలసంబంధమగు రోగి మరణమునొందును. చచ్చిపోయెను కాలిపోయెను నశించెను మొదలగు అమంగళవాక్యములను వైద్యుడు ఉచ్చరించుచున్నప్పుడు గాని అమంగళకృత్యములను చేయుచున్నప్పుడు గాని దూతలువచ్చినచో అట్టి వారిసంబంధమగు రోగి మరణించును. వైద్యుడు రోగియొక్క రోగముతో సమానమైన గుణములుకల ప్రదేశమునందున్నప్పుడు గాని రోగముతో తుల్యమైన కాలమునందుగాని యేదూతలు వచ్చెదరో అట్టివారిసంబంధమగు రోగికి చికిత్సను చేయకూడదు.

మూ॥ దీనభీతద్రుతత్రస్తమలినా మసతీం స్త్రియః॥ త్రీన్ వ్యాకృతాంశ్చ షణ్ఢాంశ్చ దూతాన్విద్యాన్ముమూర్షతామ్॥ అఙ్గవ్యసనినం దూతం లిఙ్గినం వ్యాధితం తథా। సంప్రేక్ష్య చోగ్రకర్మాణం న వైద్యో గన్తుమర్హతి॥ ఆతురార్థమనుప్రాప్తం ఖరోష్ట్రరథవాహనమ్। దూతం దృష్ట్వా భిషగ్విద్యాదాతురస్య పరాభవమ్.॥ పలాలబుష మాంసాస్థి కేశలోమనఖద్విజాన్ । మార్జనీం ముసలం శూర్పముపానచ్చర్మ విచ్యుతమ్॥ తృణకాష్ఠతుషాఙ్గారం స్పృశన్తో లోష్టమశ్మ చ। తత్పూర్వదర్శనే దూతా వ్యాహరన్తి ముమూర్షతామ్ ॥20॥

అ॥ దైన్యము భయము తొందర ఉద్వేగము మాలిన్యము వీనితో గూడినట్టియు యోగ్యురాలు గానట్టియు స్త్రీగాని, ముగ్గురుకలిసి కాని, వికృతరూపము కలిగినట్టివారు గాని నపుంసకులుగాని దూతలుగ వచ్చినచో రోగిమరణించునని తెలిసికొనవలయును. అంగవైకల్యము కలిగినట్టివాడుగాని, సంన్యాసము మొదలగులక్షణములుకలవాడుగాని, వ్యాధిగ్రస్తుడుగాని, చంపుట మొదలగు క్రూరకృత్యములను చేయువాడుగాని దూతగ వచ్చినచో వైద్యుడు వెడలనవసరము లేదు. గాడిద ఒంటె రథము వీని నెక్కి వచ్చిన దూతను చూచి రోగిచనిపోవునని వైద్యుడు తెలిసికొనవలయును. దూతలు వైద్యునితో మాటలాడుటకుపూర్వమునందు పూరికర ఊక మాంసము ఎముకలు వెంట్రుకలు రోమములు గోళ్ళు దంతములు చీపురుకట్ట రోకలి చేట చెప్పులజోడు చర్మము జారి పడినద్రవ్యము గడ్డి కఱ్ఱలు పొట్టు బొగ్గులు చిల్లపెంకులు రాళ్ళు వీనిని స్పృశించుచు మాట్లాడినచో అట్టిదూతయొక్క యజమానుడు మరణించును.

మూ॥ యస్మింశ్చ దూతే బ్రువతి వాక్యమాతురసంశ్రయమ్। పశ్యేన్నిమిత్తమశుభం తం చ నానువ్రజేద్భిషక్ ॥ తథా వ్యసనినం ప్రేతం ప్రేతాలఙ్కారమేవ వా। భిన్నం దగ్ధం వినష్టం వా తద్వా

దీని వచాంసి వా॥ రసో వా కటుకస్తీవ్రో గన్ధో వా కౌణపో మహాన్।
స్పర్శో వా విపులః క్రూరో యద్వాఽన్యదశుభం భవేత్ ॥ తత్పూర్వ్వమభితో వాక్యం వాక్యకాలేఽథవా పునః। దూతానాం వ్యాహృతం కృత్వా ధీరో మరణమాదిశేత్ ॥ ఇతి దూతాధికారోఽయముక్తః కృత్స్నో ముమూర్షతామ్। పథ్యాతురకులానాం చ వక్ష్యామ్యౌత్పాతికం పునః ॥25॥

అ॥ రోగియొక్క విషయమును దూత చెప్పుచుండగా దుశ్శకునము కనుబడిన యెడల ఆరోగియొద్దకు వైద్యుడు వెళ్ళకూడదు. దుఃఖముకలవానినిగాని ప్రేతనుగాని ప్రేతాలంకారముగాని చూచుట, బద్దలైనట్టికాని కాలినట్టికాని చెడిపోయినట్టికాని పదార్థమునుచూచుట, ఇట్టిపదార్థములనుబోధించునట్టి వాక్యములను వినుట, కారముగనున్నట్టియు ఉద్వేజకమైనట్టియురసమునుఆస్వాదించుట, సహింపరానిశవగంధమునుఆఘ్రాణించుట, అధికమైనట్టియు కఠినమైనట్టియు స్పర్శను అనుభవించుట ఇవి దుశ్శకునములుగ నుండును. ఇట్టిఇతరములుకూడ దుశ్శకునములుగ నుండును. రోగివిషయమైదూత చెప్పునప్పుడు పూర్వమువందుగాని మధ్యయందుగాని తుదనుగాని ఎల్లప్పుడునుగాని ఈదుశ్శకునములు కలిగియెడల రోగికి మరణము కలుగునని తెలిసికొనవలయును. చావ సిద్ధముగనున్నవానియొక్క దూతలవిషయమై చెప్పతగినదంతయు ఇట్లు సంపూర్ణముగ చెప్పబడినది. మార్గమునందును రోగియొక్క గృహమునందును కలుగుఉత్పాతములను చెప్పబోవుచున్నాము.

మూ॥ అవక్షుతమథోత్క్రుష్టం స్ఖలనం పతనం తథా। ఆక్రోశః సంప్రహారో వా ప్రతిషేధో విగర్హణమ్॥ వస్త్రోష్ణీషోత్తరాసఙ్గచ్ఛత్రోపానద్యుగాశ్రయమ్। వ్యసనం దర్శనం చాపి మృతవ్యసనినాం తథా ॥ చైత్యధ్వజపతాకానాం పూర్ణానాం పతనాని చ। హతానిష్టప్రవాదాశ్చ దర్శనం భస్మపాంసుభిః ॥ పథచ్ఛేదో బిడాలేన శునా సర్పేణ వాపునః। మృగద్విజానాం క్రూరాణాం గిరో దీప్తాం దిశం ప్రతి॥ శయనాసనయానానాముత్తానానాం ప్రదర్శనమ్। ఇత్యేతాన్యప్రశస్తాని సర్వాణ్యాహుర్మనీషిణః॥ ఏతాని పథి వైద్యేన పశ్యతాఽఽతురవేశ్మని। శృణ్వతా చ న గన్తవ్యం తదాగారంవిపశ్చితా ॥ ఇత్యౌత్పాతికమాఖ్యాతం పథి వైద్యవిగర్హితమ్। ఇమామపి చ బుధ్యేత గృహావస్థాం ముమూర్షతామ్ ॥32॥

అ॥ తుమ్ము, భయమును జెందిఏడ్చుట, తొట్రుపాటు, పడుట, తిట్టుట, కొట్టుకొనుట వెళ్ళవద్దు మొదలగు ప్రతిషేధవాక్యములు, నిందించుట, వస్త్రములు తలపాగ

ఉ త్తరీయము గొడుగు చెప్పులజోడు వీని నాశ్రయించిన వ్యసనము, శవమును వికలాంగులను చూచుట, చైత్యవృక్షములు ధ్వజస్తంభములు జెండాలు పూర్ణకుంభములు ఇవి పడుట, మరణవార్తను అనిష్టవార్తను వినుట, దుమ్ము ను ధూళియు పడుట, పల్లిగాని కుక్కగాని సర్పముగాని త్రోవకడ్డముగనుండుట, క్రూరములైన మృగముల యొక్కయు పక్షులయొక్కయు ధ్వనులను వినుట, సూర్యుడున్న దిక్కువైపునకు పోవుట, శయనములు ఆసనములు యానములు ఇవి వెల్లకిలగ కనబడుట ఇవి ఉత్పాతములుగ నుండును. ఈ ఉత్పాతములను వైద్యుడు మార్గమందుచూచినను రోగి యొక్క యింటియందుజరిగినట్లు విన్నను రోగియొద్దకు పోకూడదు. మార్గమునందు సంభవించునట్టియు వైద్యులచేనిందింపబడినట్టియు ఉత్పాతములు ఇట్లుచెప్పబడినవి. చావ సిద్ధముగనున్న రోగియొక్క ఇంటియందు సంభవించుఅవస్థను చెప్పుచున్నాను వినుము.

మూ॥ ప్రవేశే పూర్ణకుమ్భాగ్నిమృద్బీజఫలసర్పిషామ్। వృష బ్రాహ్మణరత్నాన్న దేవతానాం వినిర్గతిమ్॥ అగ్నిపూర్ణాని పాత్రాణి భిన్నాని విశిఖాని చ। భిషఙ్ముమూర్షతాం వేశ్మ ప్రవిశన్నేవ పశ్యతి॥ ఛిన్నభిన్నవిదగ్ధాని భగ్నాని మృదితాని చ। దుర్బలాని చ సేవన్తే ముమూర్షోర్వైశ్మికా జనాః॥ శయనం వసనం యాన మన్య ద్వాపి పరిచ్ఛదమ్। ప్రేతవద్యస్య కుర్వన్తి సుహృదః ప్రేత ఏవ సః॥ అన్నం వ్యాపద్య తేఽత్యర్థ జ్యోతిశ్చైవోపశామ్యతి। నివాతే సేన్ధనం యస్య తస్య నాస్తి చికిత్సితమ్॥ ఆతురస్య గృహే యస్య భిద్యన్తే వా పతన్తి వా। అతిమాత్ర మమత్రాణి దుర్లభం తస్య జీవితమ్ ॥౩9॥

అ॥ రోగియొక్క యింటియందు వైద్యుడు ప్రవేశించునప్పుడు పూర్ణకుంభములు అగ్ని మన్ను విత్తులు ఫలములు ఘృతము ఎద్దు బ్రాహ్మణులు రత్నములు అన్నము దేవతలు ఇవిరోగియొక్క ఇంటినుండి బయటికిపోవుచున్నను, ఇంటియందు ప్రవేశించినతోడనే అగ్నినింపబడిన పాత్రలును బ్రద్దలైనట్టికాని కంఠములేనట్టి కాని పాత్రలును కనబడినను, రోగియొక్క ఇంటియందున్న జనులు భిన్నములైనట్టియు బ్రద్దలైనట్టియు చెడిపోయినట్టియు విరిగిపోయినట్టియు నలిగినట్టియుసారములేనట్టియు పదార్థములను సేవించుచున్నను, శయనము వస్త్రము యానము మొదలగుఉపకరణములను స్నేహితులు ప్రేతకుచేసినట్లు చేయుచున్నను, రోగియొక్క ఇంటియందలి అన్నము చెడిపోయినను, గాలిలేనిప్రదేశమునందున్నట్టియు కట్టెలతోకూడినట్టియు అగ్ని చల్లారినను, రోగియొక్క ఇంటియందలి పాత్రలు మిక్కుటముగ బ్రద్దలైనను లేక పడిపోయినను అట్టిరోగియొక్క జీవితము దుర్లభముగ నుండును.

మూ॥ యద్భావదబభిరధ్యాయైర్వ్యాసతః పరికీర్తితమ్ ॥ ముమూర్షతాం మనుష్యాణాం లక్షణం జీవితాన్తకృత్ ॥ తత్సమాసేనవక్ష్యే

మః పర్యాయా_న్తరమాశ్రితః। పర్యాయవచనం హ్యర్థవిజ్ఞానాయోప పద్యతే॥ ఇత్యర్థం పునరేవేయం వివక్షా నో విధీయతే। తస్మిన్నేవాధి కరణే యత్పూర్వ మభిదర్శితమ్ ॥42॥

అ॥ చావసిద్ధముగనున్న మనుజులయొక్క ప్రాణములను నశింపచేయు ఏలక్షణములు పండ్రెండు అధ్యాయములచేతను వివరించి చెప్పబడినవో వానిని మార్గాంతరముచే సంక్షేపముగ చెప్పుచున్నాము. మార్గాంతరముచే చెప్పినయెడల విశేషార్థజ్ఞానము కలుగును. అందువలన పూర్వమునందు చెప్పబడిన విషయమునే మరల చెప్పుటకై మాకు ఇచ్ఛ కలిగినది.

మూ॥ వసతాం చరమే కాలే శరీరేషు శరీరిణామ్। అభ్యాగ్రాణాం వినాశాయ దేహేభ్యః ప్రవివత్సతామ్ ॥ ఇష్టాం స్తితిక్షతాం ప్రాణాన్ కా_న్తం వాసం జిహాసతామ్। త_న్త్రియ_న్త్రేషు భిన్నేషు తమోఽ న్యం ప్రవివక్షతామ్। వినాశాయేహ రూపాణి యా న్యవస్థా_న్తరాణి చ। భవ_న్తి తాని వక్ష్యామి యథోద్దేశం యథా గమమ్ ॥ ప్రాణాః సముపతప్య_న్తే విజ్ఞాన ముపరుధ్యతే। వమ_న్తి బల మఙ్గాని చేష్టా వ్యుపరమ_న్తి చ ॥ ఇన్ద్రియాణి వినశ్య_న్తి ఖిలీభవతి చేతనా। ఔత్సుక్యం భజతే స_త్త్వం చేతో భీరావిశత్యపి ॥ స్మృతి_స్త్యజతి మేధా చ హ్రీశ్రియౌ చాపసర్పతః। ఉపప్లవ_న్తే పాప్మాన ఓజ_స్తేజశ్చ నశ్యతి ॥ శీలం వ్యావ_ర్తతేఽత్యర్థం భ_క్తిశ్చ పరివ_ర్తతే। వికియ_న్తే ప్రతిచ్ఛాయాశ్ఛాయాశ్చ వికృతిం ప్రతి ॥ శుక్రం ప్రచ్యవతే స్థానాదున్మార్గం భజతేఽనిలః। క్షయం మాంసాని గచ్ఛ_న్తి గచ్ఛత్యసృగుపక్షయమ్ ॥ ఊష్మాణః ప్రలయం యా_న్తి విశ్లేషం యా_న్తి సంధయః। గన్ధా వికృతతాం యా_న్తి భేదం వర్ణస్వరౌ తథా ॥ వైవర్ణ్యం భజతే కాయః కాయచ్ఛిద్రం విశుష్యతి। ధూమ స్సంజాయతే మూర్ధ్ని దారుణాఖ్యశ్చ చూర్ణకః॥ సతతస్పన్దనా దేశాః శరీరే యేఽభిలక్షితాః। తే_స్తమ్భానుగతాః స_ర్వే న చల_న్తి కథంచన॥ గుణాః శరీరదేశానాం శీతోష్ణమృదుదారుణాః। విపర్యాసేన వ_ర్త_న్తే స్థానేష్వన్యేషు తద్విధాః ॥ నఖేషు జాయతే పుష్పం పఙ్కో దన్తేషు జాయతే। జటాః పక్ష్మసు జాయ_న్తే సీమన్తాశ్చాపి మూర్ధని ॥ భేషజాని న సంవృ_త్తిం ప్రాప్నువ_న్తి యథారుచిమ్। యాని చాప్యుప పద్య_న్తే తేషాం వీర్యం న సిధ్యతి ॥ నానాప్రకృతయః క్రూరా

వికారా వివిధౌషధాః । క్షిప్రం సమభివర్తన్తే ప్రతిహత్య బలౌజసీ ॥ శబ్దః స్పర్శో రసో రూపం గన్ధశ్చేష్టా విచిన్తితమ్। ఉద్పద్యన్తేఽశుభాన్యేవ ప్రతికర్మ ప్రవృత్తిషు ॥ దృశ్యన్తే దారుణాః స్వప్నా దౌరాత్మ్యముపజాయతే । ప్రేష్యాః ప్రతీపతాం యాన్తి ప్రేతాకృతిరుపేక్ష్యతే॥ ప్రకృతిర్హీయతేఽత్యర్థం వికృతిశ్చాభివర్ధతే । కృత్స్నమౌత్పాతికం ఘోరమరిష్టముపలక్ష్యతే ॥ ఇత్యేతాని మనుష్యాణాం భవన్తి వినశిష్యతామ్ । లక్షణాని యథోద్దేశం యాన్యుక్తాని యథాగమమ్ ॥

అ॥ చరమావస్థయందున్న శరీరము కలిగినట్టియు శరీర నాశనముకొరకు లేచి పోవుటకు సిద్ధముగ నున్నట్టియు శరీరమునుండి ప్రయాణప్రయత్నమును చేయుచున్నట్టియు ప్రియమైన ప్రాణములు పోవుచుండగా అట్టి బాధను సహించుచున్నట్టియు ప్రియమైన శరీరమును విడిచిపెట్టుటకు సిద్ధముగ నున్నట్టియు శరీరమునందలి సిరస్నాయ్వాదులు వైకల్యమును పొందినప్పుడు అంత్యతమస్సును పొందుటకు సిద్ధముగ నున్నట్టియు జీవులయొక్క మరణలక్షణములను, అవస్థాంతరములను ఉద్దేశానుసారముగను శాస్త్రానుసారముగను చెప్పుచున్నారము. ప్రాణములు అధికముగ తపించుట, విజ్ఞానము నశించుట, అవయవములయందలి బలముతగ్గుట. శరీరచేష్టలు నశించుట, ఇంద్రియపాటవము నశించుట బుద్ధి కలుషయుక్తమగుట, మనస్సు ఔత్కంఠ్యము నొందుట, మనస్సునందు భయము ప్రవేశించుట, జ్ఞాపకశక్తి ధారణాశక్తి సిగ్గు కాంతి ఇవి పోవుట, పాపమువలనకలుగు కష్టము మొదలగునవి సంభవించుట, ఓజస్సును తేజస్సును నశించుట, స్వభావమును భక్తియు మిక్కిలి మార్పుచెందుట, ప్రతిబింబములును ఛాయలును వికృతినొందుట, శుక్రము స్వస్థానమునుండి జారిపోవుట, వాతము ప్రకోపించుట, మాంసమును రక్తమును క్షీణించుట శరీరమునందలి అగ్నులు లయమునొందుట, సంధులు విడిపోవుట, శరీరమునందు వికృతిగంధములు జనించుట, వర్ణమును కంఠధ్వనియు భేదమునొందుట, శరీరము వైవర్ణ్యమునొందుట, శరీరమునందలి రంధ్రములు ఎండుట, శిరస్సునందు అధికమగుపొగయు దారుణమైన చుండు అనువ్యాధియు ఏర్పడుట, ఎల్లప్పుడును కదలుచుండు శరీరభాగములు ఏవిధముగను కదలక స్తంభించుట, శరీరస్థానములయందలి శీతము ఉష్ణము మృదుత్వము కాఠిన్యము మొదలగు గుణములు వ్యత్యాసమునొందుట, గోళ్ళయందు పుష్పిపుట్టుట, దంతములయందు పాచిపుట్టుట, కనురెప్పలు జటలల్లుకొనియుండుట, శిరస్సునందు పాపటలుఏర్పడుట, రోగినిమిత్తము తయారుచేయు ఔషధము సరియైన రుచి నొందకుండుట, సరియైన రుచి నొందినను గుణమును కలిగింపకుండుట, అనేక ప్రకృతులు కలిగినట్టియు క్రూరములైనట్టియు అనేకౌషధములు కలిగినట్టియు వ్యాధులు బలమును ఓజస్సును నశింపజేసి శీఘ్రముగ వృద్ధినొందుట, చికిత్సను చేయునప్పుడు శబ్దము స్పర్శము రసము రూపము గంధము చేష్టలు ఆలోచన ఇవి అశుభములుగ పుట్టుట, దారుణమైన స్వప్నములు కలుగుట, చెడుమనస్సు కలుగుట, పరిచారకులు వ్యతిరేకముగ ప్రవర్తించుట, ప్రేతకళ జనించుట, మంచి లక్షణములు మిక్కిలి క్షీణించుట, చెడులక్షణములు కలుగుట, భయంకరములైన అరిష్టము లన్నియు హఠాత్తుగ పుట్టుట ఈ లక్షణములు

చావ సిద్ధముగనున్న మనుజులకు కలుగును. ఈ లక్షణములు ఉద్దేశము ననుసరించియు శాస్త్రము ననుసరించియు చెప్పబడినవి.

మూ॥ మరణాయేహ రూపాణి పశ్యతాఽపి భిషగ్విదా । అపృష్టేన న వక్తవ్యం మరణం ప్రత్యుపస్థితమ్ ॥ పృష్టేనాపి న వక్తవ్యం తత్ర యత్రోపఘాతకమ్। ఆతురస్య భవేద్దుఃఖ మథవాఽన్యస్య కస్యచిత్ ॥ అబ్రువన్ మరణం తస్య నైనమిచ్ఛేచ్చికిత్సితుమ్ । యస్య పశ్యేద్వినాశాయ లిఙ్గాని కుశలో భిషక్ ॥ లిఙ్గేభ్యో మరణాఖ్యేభ్యో విపరీతాని పశ్యతా । లిఙ్గాన్యారోగ్యమాగన్తుం వక్తవ్యం భిషజా ధ్రువమ్ । దూతైరౌత్పాతికైర్భావైః పథ్యాతురకులాశ్రయైః । ఆతురాచార శీలేష్ట ద్రవ్యసంపత్తిలక్షణైః ॥66॥

అ॥ వైద్యుడు పైనచెప్పబడిన మరణలక్షణములను చూచుచున్నను తనను అడగనివానికి మరణవిషయమును చెప్పకూడదు. రోగికి గాని ఇతరులకు గాని కష్టము కలుగునెడల మరణవిషయమును తన నడిగినను చెప్పకూడదు. కుశలుడగు వైద్యుడు ఏరోగియందు మరణలక్షణములను చూచునో అట్టివానికి మరణవిషయమును చెప్పకుండుటయే కాక వానికి చికిత్సనుకూడ చేయకూడదు. దూతలు, మార్గమునందును రోగియొక్క ఇంటియందును కలుగు ఉత్పాతములు, రోగియొక్క ఆచారము, నడవడి ఇష్టద్రవ్యసంపత్తి వీనినిబట్టి మరణసూచకములగు లక్షణములకంటె వ్యతిరేక లక్షణములను చూచినచో వైద్యుడు అట్టిరోగికి ఆరోగ్యము నిశ్చయముగ కలుగునని చెప్పవచ్చును.

## శుభదూత లక్షణములు.

మూ॥ స్వాచారం హృష్టమవ్యఙ్గం యశస్యం శుక్లవాససమ్ । అముణ్డ మజటం దూతం జాతివేషక్రియాసమమ్॥ అనుష్ట్రఖరయానస్థమసన్ధ్యాస్వగ్రహేషు చ । అదారుణేషు నక్షత్రేష్వనుగ్రేషు ధ్రువేషు చ ॥ వినా చతుర్థీం నవమీం వినా రిక్తాం చతుర్దశీమ్। మధ్యాహ్నం చార్ధరాత్రం చ భూకమ్పం రాహుదర్శనమ్ ॥ వినా దేశమశస్తం చ శస్త్రోత్పాతిక లక్షణమ్ । దూతం ప్రశస్తమవ్యగ్రం నిర్దిశేదాగతం భిషక్ ॥70॥

అ॥ మంచిఆచారము కలిగియుండుట, ప్రసన్నుడుగ నుండుట, సమస్తాంగములతో కూడియుండుట, కీర్తి నికలిగియుండుట, తెల్లనివస్త్రములను ధరించియుండుట, బోడితలగాని జడలుకట్టినతలగాని లేనివాడుగనుండుట, జాతికనుకూలమైన వేషమును క్రియలను కలిగియుండుట, ఒంటెలను గాడిదలను గాక ఇతరయానములను కలిగియుండుట, సంధ్యాకాలము గ్రహములు చెడునక్షత్రములు వీనియందుగాక సౌమ్యములగు నక్షత్రములయందు వచ్చుట, చవితి నవమి చతుర్దశి ఈ తిథులయందు గాక ఇతర

తిథులయందువచ్చుట, మధ్యాహ్నమునందును అర్ధరాత్రమునందును గాక ఇతర సమయములయందు వచ్చుట, భూకంపమును గ్రహణమును లేనప్పుడు వచ్చుట, శుభమైన దేశమును శుభములైన ఉత్పాతలక్షణములను శుద్ధమైన మనస్సును కలిగియుండుట ఈలక్షణములతో కూడిన దూతను శుభలక్షణములు గలవానినిగ తెలిసికొనవలయును.

శుభశకునములు.

మూ॥ దధ్యక్షత ద్విజాతీనాం వృషభాణాం నృపస్య చ। రత్నానాం పూర్ణకుమ్భానాం సితస్య తురగస్య చ॥ సురధ్వజ పతాకానాం ఫలానాం యావకస్య చ। కన్యాపుం వర్ధమానానాం బద్ధస్యైక పశో స్తథా॥ పృథివ్యా ఉద్ధృతాయాశ్చ వహ్నేః ప్రజ్వలితస్య చ। మోదకానాం సుమనసాం శుక్లానాం చన్దనస్య చ॥ మనోజ్ఞస్యాన్నపానస్య పూర్ణస్య శకటస్య చ। నృభిర్ధేన్వాః సవత్సాయా బడబాయాః స్త్రియా స్తథా॥ జీవఞ్జీవక సిద్ధార్థ సారస ప్రియవాదినామ్। హంసానాంశతపత్రాణాం చాషాణాం శిఖినాం తథా॥ మత్స్యాజద్విజశఙ్ఖానాం ప్రియఙ్గూనాం ఘృతస్య చ। రోచిష్మాదర్శ సిద్ధానాం రోచనాయాశ్చ దర్శనమ్॥ గన్ధః సుగన్ధో వర్ణశ్చ సుశుక్లో మధురో రసః। మృగపక్షిమనుష్యాణాం ప్రశస్తాశ్చ గిరః శుభాః। ఛత్రధ్వజ పతాకానాముత్క్షేపణ మభిష్టుతిః। భేరీమృదఙ్గ శఙ్ఖానాం శబ్దాః పుణ్యాహనిస్వనాః॥ వేదాధ్యయన శబ్దాశ్చ శుభో వాయుః ప్రదక్షిణః॥ పథి వేశ్మప్రవేశే తు విద్యా దారోగ్య లక్షణమ్ ॥౯॥

అ॥ పెరుగు అక్షతలు బ్రాహ్మణులు ఎద్దులు రాజు రత్నములు నీటితో నిండిన కుండ తెల్లనిగుఱ్ఱము ఇంద్రధనుస్సు పతాకము ఫలములు లత్తుక కన్యకలు పురుషులు అలంకరింపబడిన మూఁకళ్ళు బంధింపబడిన శ్రేష్ఠమగుపశువు త్రవ్వబడినభూమి ప్రజ్వలించుచున్న అగ్ని మోదకములు తెల్లనిపుష్పములు చందనము మనోహరములైన అన్నపానములు మనుష్యులతో నిండియున్న శకటములు వత్సతో కూడియున్న ఆవు ఆడగుఱ్ఱము స్త్రీ జీవంజీవకమనెడి పక్షి తెల్లావాలు సారసపక్షి చాతకపక్షి హంసలు పద్మములు పాలపిట్టలు నెమళ్ళు మత్స్యములు మేకలు శుభకరములగుపక్షులు శంఖములు కొఱ్ఱలు నెయ్యి తేజోవంతములగు ద్రవ్యములు అద్దము సిద్ధులు గోరోచనము వీనిని చూచుట, పరిమళముతో కూడిన గంధము మిక్కిలి తెల్లగనున్న వర్ణము మధురరసము మృగముల యొక్కయు పక్షులయొక్కయు మనుజులయొక్కయు ప్రశస్తములైనట్టియు మంగళప్రదములైనట్టియు వాక్యములు ఇవి సంభవించుట, గొడుగు ధ్వజము పతాకము వీని నెత్తుట స్తోత్రవాక్యములను భేరి మృదంగము శంఖములు వీనియొక్క శబ్దములను పుణ్యాహవాచకములగు శబ్దములను వేదాధ్యయనముయొక్క శబ్దములను వినుట, సుఖకరమైన దక్షిణవాయువు వీచుట ఈలక్షణములు మార్గమునందుగాని రోగియొక్క

గృహమునందు ప్రవేశించునప్పుడుగాని కలిగినచో అట్టి రోగికి ఆరోగ్యము కలుగు నని తెలిసికొనవలయును.

మూ॥ మఙ్గలాచారసంపన్నః సాతురో వైశ్మికో జనః । శ్రద్ధధానోఽనుకూలశ్చ ప్రభూతద్రవ్యసంగ్రహః ॥ ధనైశ్వర్య సుఖావాప్తిరిష్టలాభః సుఖేన చ । ద్రవ్యాణాం తత్ర యోగ్యానాం యోజనాసిద్ధిరేవ చ ॥8॥

అ॥ రోగియు రోగియొక్క ఇంటియందుండు జనులును మంగళకరమగు ఆచారములను కలిగియుండుట, వైద్యునియందు శ్రద్ధను అనుకూలతను కలిగియుండుట, ద్రవ్యములన్నియు సమృద్ధిగనుండుట, రోగి ధనమును ఐశ్వర్యమును సుఖమును కలిగి యుండుట, కోరినపదార్థములు సమృద్ధిగనుండుట, రోగి ధనమును ఐశ్వర్యమును సుఖమును కలిగియుండుట, కోరినపదార్థములు సులభముగ లభించుట, యోగ్యములైన ద్రవ్యము లుపయోగింపబడి కార్యసిద్ధి బొందుట ఈలక్షణములు రోగియొక్క ఆరోగ్యమును సూచించును.

## సుస్వప్నములు.

మూ॥ గృహప్రాసాద శైలానాం నాగానాం వృషభస్య చ । హయానాం పురుషాణాం చ స్వప్నే సమధిరోహణమ్ ॥ అర్ణవానాం ప్రతరణం వృద్ధిః సంబాధనిఃసృతిః। స్వప్నే దేవైః సపితృభిః ప్రసన్నైశ్చాభిభాషణమ్ ॥ సోమార్కాగ్ని ద్విజాతీనాం గవాం నృణాం యశస్వినామ్ । దర్శనం శుక్లవస్త్రాణాం హ్రదస్య విమలస్య చ ॥ మాంస మత్స్య విషామేధ్యచ్ఛత్రాదర్శ పరిగ్రహః । స్వప్నే సుమనసాం చైవ శుక్లానాం దర్శనం శుభమ్ ॥ అశ్వగోరథయానం చ యానం పూర్వోత్తరేణ చ । రోదనం పతితోత్థానం ద్విషతాం చావమర్దనమ్ ॥8॥

అ॥ గృహములు మేడలు పర్వతములు ఏనుగులు ఎద్దులు గుఱ్ఱములు పురుషులు వీనిని ఎక్కినట్లును సముద్రమును దాటినట్లును తాను వృద్ధిపొందినట్లును తనయొక్క బాధలు నశించినట్లును దేవతలు పితృదేవతలు యోగ్యులు వీరితో మాట్లాడినట్లును చంద్రుడు సూర్యుడు అగ్ని ద్విజులు గోవులు కీర్తిమంతులగుజనులు తెల్లనివస్త్రములు నిర్మలమైన మడుగు వీనిని చూచినట్లును మాంసము మత్స్యములు విషము అమేధ్యము గొడుగు అద్దము వీనిని గ్రహించినట్లును తెల్లనిపుష్పములను చూచినట్లును గుఱ్ఱములు గోవులు రథములు వీనిని ఎక్కినట్లును తూర్పుగను ఉత్తరముగను ప్రయాణము చేసినట్లును ఏడ్చినట్లును పడిలేచినట్లును శత్రువులను సంహరించినట్లును జనించిన స్వప్నములు ఆరోగ్యసూచకములుగ నుండును.

## ఆరోగ్య లక్షణములు.

మూ॥ సత్త్వలక్షణసంయోగో భక్తిర్వైద్య ద్విజాతిషు। సాధ్యత్వం న చ నిర్వేదస్తదారోగ్యస్య లక్షణమ్ ॥87॥

అ॥ రోగి సత్త్వగుణముయొక్క లక్షణములతో కూడియుండుట, వైద్యులయందును బ్రాహ్మణులయందును భక్తిని కలిగియుండుట, రోగము సాధ్యదశ నొందుట, విచారములేకుండుట ఇవి ఆరోగ్యలక్షణములుగ నుండును.

ఆరోగ్య ఫలము.

మూ॥ ఆరోగ్యాద్బల మాయుశ్చ సుఖం చ లభతే మహత్ ।
ఇష్టాంశ్చాప్యపరాన్ భావాన్ పురుషః శుభలక్షణః ॥88॥

అ॥ ఆరోగ్యమువలన బలమును ఆయువును అధికమగు సుఖమును ఇష్టములైన ఇట్టి ఇతరభావములను శుభలక్షణములతో కూడినవాడై మనుజుడు పొందును.

అధ్యాయ సంగ్రహము.

మూ॥ ఉక్తం గోమయచూర్ణీయే మరణారోగ్య లక్షణమ్ ।
దూతస్వప్నాన్తరోత్పాత యుక్తసిద్ధివ్యపాశ్రయమ్ ॥89॥

అ॥ ఈ గోమయచూర్ణీయాధ్యాయమునందు దూత, స్వప్నములు, మార్గమునందును రోగియొక్క ఇంటియందును కలుగు ఉత్పాతములు, యుక్తి, సిద్ధి వీని నాశ్రయించిన మరణలక్షణములును ఆరోగ్యలక్షణములును చెప్పబడినవి.

ఇంద్రియస్థాన సంగ్రహము.

మూ॥ ఇతీద ముక్తం ప్రకృతం యథా తథా తదన్వవేక్ష్యం సతతం భిషగ్విదా । తథా హి సిద్ధిం చ యశశ్చ శాశ్వతం స సిద్ధకర్మా లభతే ధనాని చ ॥90॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతి సంస్కృతే ఇన్ద్రియస్థానే గోమయచూర్ణీయ మిన్ద్రియం నామ ద్వాదశోఽధ్యాయః॥

అ॥ ఈ ఇంద్రియస్థానము అనుకూలముగ నుండునట్లు చెప్పబడినది. వైద్యుడు ఇందలి విషయమునంతను గమనింపవలయును. అట్లు చేసినచో సిద్ధకర్ముడై ఇష్టసిద్ధిని శాశ్వతమైన కీర్తిని ధనమును పొందును.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామకకృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు గోమయచూర్ణీయేంద్రియ మనెడు ద్వాదశాధ్యాయము సమాప్తము.

ఇంద్రియస్థానము సమాప్తము.

# కల్పస్థానము.

## ప్రథమాధ్యాయము.

మూ॥ అథాతో మదనకల్పం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట మదనకల్పమును చెప్పుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ అథ ఖలు వమనవిరేచనార్థం మదనఫలాది త్రివృతాదీనాం వమనవిరేచన ద్రవ్యాణాం సుఖోపభోగ్యతమైః సహాన్యైర్ద్రవ్యైః వివిధై స్తద్యోగానాం క్రియావిధౌ సుఖోపాయస్య సమ్యగుపకల్పనార్థం కల్పస్థాన ముపదేక్ష్యామోఽగ్నివేశ ॥3॥

అ॥ పిదప వమనమునిమిత్తమును విరేచనములనిమిత్తమును వమనద్రవ్యములగు మంగకాయ మొదలగువానియొక్కయు విరేచనద్రవ్యములగు తెగడ మొదలగువానియొక్కయు యోగములను సుఖముగ నుపయోగింపతగినట్టియు అనేకవిధములైనట్టియు ఇతరద్రవ్యములతోకూడ సుఖముగ తయారుచేసుకొను నిమిత్తము కల్పస్థానమును చెప్పబోవుచున్నాము.

### వమనవిరేచన నిరుక్తి.

మూ॥ తత్ర దోషహరణ మూర్ధ్వభాగం వమనసంజ్ఞకం, అధోభాగం విరేచన సంజ్ఞకం, ఉభయం వా శరీర మలవిరేచన సంజ్ఞాం లభతే ॥4॥

అ॥ ఊర్ధ్వమార్గమువలన దోషమును హరింపజేయుట వమనమనియు అధోమార్గమువలన దోషమును హరింపచేయుట విరేచనమనియు చెప్పబడును. విరేచనశబ్దము శరీరమలమును పోగొట్టుట అను సామాన్యార్థము కలదగుటచే ఆరెండింటినికూడ విరేచన శబ్దముచే వ్యవహరింపవచ్చును.

### వమనవిరేచన ద్రవ్యములయొక్క కర్మ.

మూ॥ తత్రోష్ణతీక్ష్ణసూక్ష్మవ్యవాయివికాశీన్యౌషధాని స్వవీర్యేణ హృదయ ముపేత్య ధమనీ రనుసృత్య సమ్యక్ యుక్త్యా స్థూ

లాణుస్రోతోభ్యః కేవలం శరీరగతం దోషసంఘాత మాగ్నేయత్వాత్ విష్యన్దయన్తి తైక్ష్ణ్యా ద్విచ్ఛిన్దన్తి, స విచ్ఛిన్నః పరిప్లవః స్నేహభావితే కాయే స్నేహాక్తభాజనస్థమివ క్షౌద్రమసజ్జన్నణుప్రవణ భావాదామాశయ మాగతో ఉదాన ప్రణున్నో ఽగ్ని వాయ్వాత్మకత్వా దూర్ధ్వభాగ ప్రభావాదౌషధ స్యోర్ధ్వముత్క్షిప్యతే, సలిల పృథివ్యాత్మకత్వా దధోభాగ ప్రభావాచ్చ ఔషధస్యాధః ప్రవర్తతే. ఉభయతశ్చోభయ గుణత్వాత్, ఇతి లక్షణోద్దేశః ॥5॥

అ॥ ఉష్ణవీర్యము తీక్ష్ణగుణము శ్లక్ష్ణగుణము సూక్ష్మగుణము వ్యవాయిశక్తి వికాశిశక్తి ఇవికల ద్రవ్యములు తమశక్తిచే హృదయమును పొంది ధమనులయందు వ్యాపించి స్థూలసూక్ష్మస్రోతస్సులద్వారా సమస్తశరీరమును పొందిన దోషసముదాయమును ఆగ్నేయగుణము కలవగుటవలన కరిగించి తీక్ష్ణగుణము కలవగుటవలన ఛేదించును. ఛేదింపబడిన ఆదోషము చలించినదై చమురుతో పూయబడిన పాత్రయందున్న తేనెవలె స్నేహకర్మ చేయబడిన శరీరమునందు అంటుకొనక అణుస్వభావమును బహిర్గమన స్వభావమును కలదగుటవలన ఆమాశయమునుపొంది ఉదానవాతముచే ప్రేరేపింపబడినదై ఉపయోగింపబడిన ద్రవ్యములయొక్క అగ్నివాయ్వాత్మకత్వమువలనను ఊర్ధ్వమును పొందించు స్వభావమువలనను ఊర్ధ్వమార్గమున బయలువెడలును. ద్రవ్యములయొక్క సలిలపృథివ్యాత్మకతమువలనను అధోమార్గమును పొందించు స్వభావము వలనను అధోమార్గమున బయలువెడలును. ద్రవ్యములయొక్క పైనచెప్పబడిన అన్నివిధములగు స్వభావములవలన రెండుమార్గములనుండి బయలువెడలును.

## వమనవిరేచన ద్రవ్యములు – తద్యోగ సంఖ్యావివరము.

మూ॥ తత్ర ఫలజీమూతక కేక్ష్వాకుధామార్గవ కుటజకృతవేధనానాం శ్యామాత్రివృ చ్చతు రఙ్గులతిల్వక మహావృక్ష సప్తలా శఙ్ఖినీ దన్తీ ద్రవన్తీనాం చ నానావిధ దేశకాలం సంభవాస్వాద రసవీర్య విపాకప్రభావ గ్రహణాద్దేహ దోషప్రకృతివయో బలాగ్ని భక్తిసాత్మ్య రోగావస్థాది నానాప్రభావవత్వాచ్చ, విచిత్రగన్ధ వర్ణరస స్పర్శానా ముపభోగసుఖార్థ మపరిసఙ్ఖ్యేయ సంయోగానామపి చ సతాం ద్రవ్యాణాం వికల్పమార్గోప దర్శనార్థం షడ్విరేచన యోగశతాని వ్యాఖ్యాస్యామః ॥ తాని తు ద్రవ్యాణి దేశకాలగుణభాజన సంపద్వీర్య బలాధానాత్ క్రియాసమర్థతమాని భవన్తి ॥7॥

అ॥ మ్రంగకాయ దేవదాళి చేదుసార పెద్దచేదుబీర కొండిసెపాల విత్తులు -చిన్నచేదుబీర వమనద్రవ్యములగు వీనియొక్కయు నల్లతెగడ తెల్లతెగడ తేలలొద్దుగ

జెముడు సంబరేణు ఈశ్వరి దంతి పెద్దదంతి విరేచనద్రవ్యములగు వీనియొక్కయు కల్పనలు (యోగములు) అనేకవిధములుగ నుండును. ఎందుచేతననగా ద్రవ్యములు నానావిధములగు దేశములయందును కాలములయందును పుట్టుట, రుచులు రసములు వీర్యము విపాకము ప్రభావము అనేకవిధములగు వీనిని కలిగియుండుట, దేహము దోషము ప్రకృతి వయస్సు బలము జాఠరాగ్ని ఇచ్ఛ సాత్మ్యము రోగము రోగావస్థ మొదలగునవి యనేకవిధములుగ నుండుట, సుఖముగ నుపయోగించుకొనుటకు అనుకూలముగ గంధము వర్ణము రసము స్పర్శ ఇవి కలుగునట్లు తయారుచేసికొనుట వీని ననుసరించి అపరిసంఖ్యేయములగు సంయోగములను పరికల్పించుకొనవచ్చును. అయినను కల్పనావిధానము తెలియునిమిత్తము ఆరువందల యోగములను చెప్పబోవుచున్నాము. దేశము కాలము గుణము స్థానము వీనియొక్క ఉత్తమతనుబట్టి ద్రవ్యములు అధికశక్తికలవై అధికమగు పనిని చేయును.

## దేశత్రైవిధ్యము.

మూ॥ తత్ర త్రివిధః ఖలు దేశో జాఙ్గలోఽనూపః సాధారణ శ్చేతి ॥

అ॥ దేశము జాంగలమనియు అనూపమనియు సాధారణమనియు మూడువిధములుగ నుండును.

## జాంగలదేశ వివరణము.

మూ॥ తత్ర జాఙ్గలః పర్యాకాశభూయిష్ఠస్తరుభిరపి కదరఖదిరాసనాశ్వకర్ణ ధవతినిశశల్లకీశాల సోమవల్కబదరీతిన్దుకాశ్వత్థ వటామలక వనగహనోఽనేక శమీకకుభశింశపాప్రాయః స్థిరశుష్కపవనబల విధూయమాన ప్రనృత్యత్తరుణవిటపః ప్రతతమృగతృష్ణాకూపోపగూఢ స్తనుఖర పరుషసికతాశర్కరాబహులో లావతిత్తిరి చకోరానుప్రచిత భూమిభాగో వాతపిత్తబహులస్థిరకఠినమనుష్యప్రాయో జ్ఞేయః ॥౪॥

అ॥ జాంగలప్రదేశము విశాలమైన ఆకాశముతో కూడుకొనియుండును. నల్లచండ్ర చండ్ర వేగిస తెల్లమద్ది ధవవృక్షము నెమ్మిచెట్టు అందుగు ఇరుగుడు కానుగ రేగు లొద్దుగ రావి మర్రి ఉసిరిక ఈ వృక్షములయొక్క వనములతో దట్టముగా నుండును. జమ్మి మద్ది బూరుగ ఈవృక్షములతో వ్యాప్తమై యుండును. స్థిరమైనట్టియు రూక్షమైనట్టియు గాలియొక్క బలమువలన కదల్చబడి ఆడుచున్న లేతకొమ్మలుకల చెట్లతో కూడియుండును. ఎండమావులును బావులును కలిగియుండును. సన్నముగను గరుకుగను కఠినముగను నుండు ఇసుకతోడను గులకరాళ్ళతోడనుకూడియుండును. లావుకపక్షి తిత్తిరిపక్షి చకోరపక్షి వీనిని అధికముగ కలిగియుండును. వాతపిత్తము అధకముగ నుండునట్టియు స్థైర్యమును దార్ఢ్యమును కలిగినట్టియు మనుష్యులతో కూడికొనియుండును. ఇట్టిది జాంగలప్రదేశ మనబడును.

## అనూపదేశ వివరణము.

మూ॥ అథానూపో హిన్తాలతమాలనారికేల కదలీవనగహనః, సరిత్సముద్రపర్యన్తప్రాయః, శిశిరపవన బహులో, వఞ్జులవనవానీరోప శోభితతీరాభిః సరిద్భిరుపగతభూమిభాగః, క్షితిధరనికుఞ్జోప శోభితో, మన్దపవనానువీజిత క్షితిరుహగహనోఽనేకవన రాజీపుష్పిత వనగహన భూమిభాగః, స్నిగ్ధతరుప్రతానోపగూఢో, హంసచక్ర వాకబలాకానన్దీ ముఖపుణ్డరీక కాదమ్బ మద్గుకోయష్టి భృఙ్గరాజశతపత్ర మత్తకోకిలా నునాదితతరుణవిటపః, సుకుమారపురుషః, పవనకఫ ప్రాయో జ్ఞేయః॥9॥

అ॥ గిరుకతాడి చీకటిచెట్లు కొబ్బరిచెట్లు అరటిచెట్లు వీని తోటలతో కూడి యుండును. నదులతోడను సముద్రముతోడను వ్యాప్తమై యుండును. చల్లనిగాలి అధికముగ వీచుచుండును. పొగడవృక్షములు నీటిప్రబ్బలి వీనిచే ప్రకాశించుచున్న తీరములుకల నదులతో కూడియుండును. పర్వతములతోడను పొదరిళ్ళతోడను ప్రకాశించుచుండును. మందవాయువుచే కదల్చబడుచున్న వృక్షములను కలిగియుండును. వనపంక్తులతోడను పుష్పవనములతోడను దట్టమైన వృక్షములతోడను కూడియుండును. హంసలు చక్రవాకపక్షులు బెగ్గురుపక్షులు నందీముఖము పుండరీకము కలహంస నీటికాకి కోయష్టి భృంగరాజము శతపత్రము మదించినకోకిల కూయుచున్న వీనితో కూడిన చిగురుకొమ్మలు కల వృక్షములతో కూడియుండును. సౌకుమార్యముకల మనుజులు కలదిగ నుండును. వాతకఫప్రాబల్యము కలదిగ నుండును. అట్టిది అనూపప్రదేశ మనబడును.

## సాధారణదేశ వివరణము.

మూ॥ అనయోరేవ ద్వయోర్దేశయోర్వీరుద్వనస్పతి వానస్పత్య శకుని మృగగణయుతః స్థిరసుకుమార వర్ణసంహననోపపన్న సాధారణ గుణపురుషః సాధారణో జ్ఞేయః ॥10॥

అ॥ పైనచెప్పబడిన రెండుదేశములయందునుకల పొదలు మర్రి మొదలగు వృక్షములు కానుగ మొదలగు వృక్షములు పక్షులు మృగములు వీనితో కూడినట్టియు స్థైర్యము సౌకుమార్యము శరీరకాంతి సాధారణగుణములు ఇవికల మనుజులతో కూడినట్టియు దేశము సాధారణదేశ మనబడును.

## ఓషధిగ్రహణ యోగ్యప్రదేశము.

మూ॥ తత్ర దేశే జాఙ్గలే సాధారణే వా యథాకాలం శిశిరాత పపవన సలిలసేవితే సమే శుచౌ ప్రదక్షిణోదకే శ్మశానచైత్యదేవయజ నాగారసభాశ్వభ్రారామవల్మీకోషరవిరహితే కుశరోహిషాస్తీర్ణే స్నిగ్ధ

కృష్ణమధురమృత్తికే సువర్ణవర్ణమధురమృత్తికే వా మృదావఘాలకృష్టేఽనుపహతేఽన్యైర్బలవత్తరైర్ద్రుమైరౌషధానిజాతాని ప్రశస్యన్తే॥

అ॥ ఆయాకాలములకు తగునట్లు మంచు ఎండగాలి ఉదకము వీనితో కూడినట్టియు సమానముగ నున్నట్టియు పరిశుద్ధమైనట్టియు యోగ్యమైన ఉదకము కలిగినట్టియు శ్మశానము చైత్యవృక్షము దేవాలయము యజ్ఞశాల సభాస్థలము రంధ్రములు ఉద్యానవనములు పుట్టలు చవిటిమన్ను ఇవి లేనట్టియు దర్భలు రోహిషకతృణము వీనితో వ్యాప్తమైనట్టియు స్నిగ్ధగుణము నలుపు తీపి ఇవిగాని బంగారమువంటిరంగు తీపి ఇవిగాని కలిగిన మన్నుతో కూడినట్టియు మృదుత్వముకలిగినట్టియు త్రవ్వబడనట్టియు పెద్దవియగు ఇతరవృక్షములతో ఆవరింపబడనట్టియు జాంగలప్రదేశమునందుగాని సాధారణప్రదేశమునందుగాని జనించిన ఓషధులు ప్రశస్తములుగ నుండును.

## ఓషధిగ్రహణప్రకారము.

మూ॥ తత్ర యాని కాలజాతాన్యాగతసంపూర్ణప్రమాణరసవీర్యగన్ధాని కాలాతపాగ్నిసలిలపవనజన్తుభిరనుపహతగన్ధవర్ణరసస్పర్శప్రభావాణి ప్రత్యగ్రాణ్యుదీచ్యాందిశిస్థితాని తేషాం శాఖాపలాశమచిరప్రరూఢం వర్షావసన్తయోర్గ్రాహ్యం, గ్రీష్మే మూలాని శిశిరే చ శీర్ణప్రరూఢపర్ణానాం, శరది త్వక్కన్దక్షీరాణి, హేమన్తే సారాణి పర్ణపుష్పఫలమితి, మఙ్గలాచారః కల్యాణవృత్తః శుచి శుక్లవాసాః సంపూజ్య దేవతా మగ్నిమశ్వినౌ గోబ్రాహ్మణాంశ్చ కృతోపవాసః ప్రాఙ్ముఖ ఉదఙ్ముఖో వా గృహ్ణీయాత్ ॥12॥

అ॥ సకాలమునందు జనించినట్టియు ప్రమాణమును రసమును వీర్యమును గంధమును సంపూర్ణముగ కలిగినట్టియు కాలము ఎండ అగ్ని ఉదకము గాలి క్రిములు వీనిచే చెడగొట్టబడని గంధమును వర్ణమును రసమును స్పర్శయు ప్రభావమును కలిగినట్టియు సంపూర్ణగుణములు కలిగినట్టియు ఉత్తరదిక్కునందు పుట్టినట్టియు ఓషధులను గ్రహింపవలయును. ఇట్టి ఓషధులయొక్క లేతకొమ్మలను లేతఆకులను వర్షఋతువునందును వసంతఋతువునందును, రాలిపోయి మరల మొలిచిన ఆకులుగల వీనియొక్క వేళ్ళను గ్రీష్మఋతువునందును శిశిరఋతువునందును, పట్టలను దుంపలను పాలను శరదృతువునందును, చాపలను ఆకులను పుష్పములను ఫలములను హేమంతఋతువునందును గ్రహింపవలయును. పరిశుద్ధుడై మంగళాచరణమును చేసి పవిత్రుడై తెల్లని వస్త్రమును ధరించి దేవతలను అగ్నిహోత్రుని అశ్వినీదేవతలను గోవులను బ్రాహ్మణులను పూజించి ఉపవాసమును చేసి తూర్పుముఖముకలవాడైగాని ఉత్తరముఖముకలవాడైగాని గ్రహింపవలయును.

### ఓషధి రక్షణవిధి.

మూ॥ గృహీత్వాచానురూపగుణవద్భాజనే సంస్థాప్యాగారేషు ప్రాగుదద్వారేషు నివాతప్రవాతైకదేశేషు నిత్యపుష్పోపహార బలికర్మవత్సు అగ్నిసలిలోపస్వేద ధూమరజోమూషిక చతుష్పదామనభిగమనీయాని స్వవచ్ఛన్నాని శిక్యేష్వాసజ్య స్థాపయేత్ ॥ తాని చ యథా దోషం ప్రయుఞ్జీత ॥ 3॥

అ॥ ఓషధులను గ్రహించి అనుకూలగుణములుకల పాత్రలయందుంచి తూర్పు దిక్కునకుగాని ఉత్తరదిక్కునకుగాని ద్వారము కలిగినట్టియు గాలియొక్క రాకపోకలకు అనుకూలముగ నున్నట్టియు పుష్పపూజలును బలికర్మయు ఎల్లప్పుడును జరుగుచుండునట్టియు గృహమునందు అగ్ని ఉదకము ఆవిరి పొగ ధూళి ఎలుకలు జంతువులు ఇవి పొందకుండునట్లు బాగుగ మూతపెట్టి ఉట్లలో పెట్టి జాగ్రతగ నుంచవలయును. వానిని దోషానుసారముగ ప్రయోగింపవలయును.

మూ॥ సురాసౌవీరక తుషోదక మైరేయ మేదక ధాన్యామ్లఫలామ్ల దధ్యమ్లాదిభిర్వాతే, మృద్వీకామలక మధుమధూకపరూషక ఫలఫాణిత క్షీరాదిభిశ్చ పిత్తే, శ్లేష్మణి తు మధుమూత్ర కషాయాది భిర్భావితాన్యాలోడితాని చ ఇత్యుద్దేశః, తం విస్తరేణ ద్రవ్యదేహ దోషసాత్మ్యాదీన్ వసన్తాదీంశ్చ ప్రవిభజ్య వ్యాఖ్యాస్యామః ॥ 4॥

అ॥ వాతమునందు సురసౌవీరకము తుషోదకము మైరేయము మేదకము ధాన్యామ్లము అనెడి మద్యములతోడను దానిమ్మ మొదలగు పుల్లని రసములతోడను పుల్లని పెరుగుతోడను, పిత్తమునందు ద్రాక్షపండ్లు ఉసిరికపండ్లు యష్టిమధుకము ఇప్పపువ్వు చిట్టీతపండ్లు వీనియొక్క రసములతోడను చెరుకుపాకము ఆవుపాలు మొదలగువానితోడను, కఫమునందు తేనె గోమూత్రము ఆయాకషాయములు మొదలగువానితోడను భావనచేసి వానియందు కలిపి ఇయ్యవలయును. ఇట్లు సంగ్రహముగ చెప్పబడినది. ద్రవ్యములు దేహము దోషములు సాత్మ్యము మొదలగువానిని, వసంతఋతువు మొదలగువానిని అనుసరించి విస్తరించి చెప్పబోవుచున్నాము.

### మదనఫల గ్రహణప్రకారము.

మూ॥ వమనద్రవ్యాణాం మదనఫలాని శ్రేష్ఠతమాన్యాచక్షతే, అనపాయిత్వాత్ ; తాని వసన్తగ్రీష్మయోరన్తరే పుష్యాశ్వయుగ్భ్యాం మృగశిరసా వా గృహ్ణీయాత్ మైత్రే ముహూర్తే కరణే చ । యాని పక్వాన్యహరితాని పాణ్డూన్యవ్యక్రిమీణ్యకృశాన్యహ్రస్వాని పూతాన్యజన్తుజగ్ధాని, తాని ప్రగృహ్య కుశపుటే బద్ధ్వా గోమయే నానులిప్య

యవతుషమాష శాలి వ్రీహికులుత్థముద్గ పలానామన్యతమే నిదధ్యాద ష్టరాత్రం, అత ఊర్ధ్వం మృదుభూతాని తాని మధ్విష్టగన్ధా నుద్ధృత్య శోషయేత్, సుశుష్కాణాం ఫలపిప్పలీరుద్ధరేత్, తాసాం ఘృతదధి మధుపలల విమృదితానాం పునః శుష్కాణాం చూర్ణం తాసాం నవ కలశం సుప్రమృష్టవాలుకమరజస్కమాకణ్ఠం పూరయిత్వా స్వవచ్ఛన్నం స్వనుగుప్తం శిక్యే ఆసజ్య సమ్యక్ స్థాపయేత్ ॥15॥

అ॥ వమనద్రవ్యములలో మ్రంగకాయలు అపాయమును చేయని వగుటవలన మిక్కిలి శ్రేష్ఠములుగ నుండును. పండినట్టియు పచ్చతనముపోయి తెల్లగనున్నట్టియు క్రిములు లేనట్టియు లావుగను పెద్దవిగను నున్నట్టియు పరిశుభ్రముగ నున్నట్టియు పక్షులు మొదలగువానిచే కొరకబడినట్టియు మ్రంగపండ్లను వసంత గ్రీష్మ ఋతువుల యొక్క మధ్యకాలమునందు పుష్యనక్షత్రమునందుగాని మృగశిరనక్షత్రమునందు గాని మిత్రదేవతాకమగు ముహూర్తమునందు శుభకరణమునందు గ్రహించి దర్భలతో చుట్టి ఆవుపేడతో పూసి యవలకొక మినుములు శాలిధాన్యము వ్రీహిధాన్యము ఉలవలు పెసలు వీనిలో దేనియొక్క రాశియందైనను ఎనిమిదిరోజు లుంచవలయును. పిమ్మట మెత్తగనైనట్టియు తేనెయొక్క వాసనతో కూడినట్టియు వానినితీసి బాగుగ ఎండించి అందలి గింజలను గ్రహింపవలయును. ఆగింజలను నెయ్యి పెరుగు తేనె నువ్వులపిండి వీనితో కలిపి మరల ఎండబెట్టి క్రొత్తకుండలో నిండుగపోసి బాగుగ జల్లింపబడినట్టియు దుమ్ములేనట్టియు ఇసుకను కంఠముపర్యంతము నిండుగపోసి మూత పెట్టి ఉట్టియందుంచి రహస్యప్రదేశమునందు జాగ్రత్త చేయవలయును.

## వ మ న వి ధి.

మూ॥ అథ ఛర్దనీయమాతురం ద్వ్యహం త్ర్యహం వా స్నేహ స్వేదోపపన్నం శ్వశ్ఛర్దయితవ్య ఇతి గ్రామ్యానూపౌదక మాంసరస క్షీరదధిమాష తిలశాకాదిభిః సముత్క్లేశిత శ్లేష్మాణాం వ్యుషితం జీర్ణా హారం పూర్వాహ్ణే కృతబలిహోమమఙ్గల ప్రాయశ్చిత్తం నిరన్నమన తిస్నిగ్ధం యవాగ్వా ఘృతమాత్రాం చ పీతవన్తం, తాసాం ఫల పిప్పలీనామన్తర్నఖముష్టిం యావద్వా సాధు మన్యేత జర్జరీకృత్య యష్టిమధుకషాయేణ కోవిదారకర్బుదారనీపవిదుల బిమ్బీశణ పుష్పీసదాపుష్పీప్రత్యక్పుష్పీకషాయాణా మన్యతమేన వా రాత్రిముషితం విమృదితం ఘృతమధు సైన్ధవయుక్తం సుఖోష్ణం కృత్వా పూర్ణం శరావం మన్త్రేణానేనాభిమన్త్రియేత్ ॥ "ఓం బ్రహ్మదక్షాశ్విరుద్రేన్ద్రభూచన్ద్రార్కానిలానలాః। ఋషయః సౌషధిగ్రామా భూతసఙ్ఘాశ్చ పాన్తు తే॥ రసా

యనమివర్షిణాం దేవానామమృతం యథా। సుధేవోత్తమ నాగానాం భైషజ్య మిదమస్తు తే'' ॥ ఇత్యేవ మభిమన్త్ర్యోదఙ్ముఖం ప్రాఙ్ముఖం వాఽఽతురం పాయయేత శ్లేష్మజ్వరగుల్మశూలప్రతిశ్యాయవన్తం విశేషేణ పునః పునరాపిత్తా గమనాత్, తేన సాధు వమతి ॥ హీనవేగం తు పిప్పల్యామలకసర్షపవచాకల్కలవణోష్ణోదకైః పునఃపునః ప్రవర్తయేదాపిత్త దర్శనాదిత్యయం సర్వచ్ఛర్దనయోగవిధిః ॥17॥

ఆ॥ వాంతిచేయింపదగిన రోగికి రెండు లేక మూడురోజులు స్నేహస్వేదములను చేయించి మరుసటిరోజున వాంతిని చేయింపవలయును. గ్రామమునందును అనూపదేశమునందును ఉదకములందును సంచరించు జంతువులయొక్క మాంసరసము పాలు పెరుగు మినుములతో తయారుచేయబడిన పదార్థములు నువ్వులతో తయారుచేయబడిన పదార్థములు కూరలు మొదలగువానిచే కఫము నుత్క్లేశము నొందించి రాత్రి ఉపవాసమును చేయించి ఆహారము జీర్ణమైనపిదప ఉదయమున బలికర్మ హోమము మంగళకార్యములు ప్రాయశ్చిత్తము ఇవి చేసినట్టియు భుజింపనట్టియు మనుజునకు వమనౌషధము నియ్యవలయును. సరిగ స్నిగ్ధుడు కానియెడల నేతితోకూడిన యవాగువును, సరిగ స్నిగ్ధుడైనయెడల కేవల యవాగువును ఉత్తమపరిమాణముగ నిచ్చి వమనౌషధము నియ్యవలయును. పూర్వమందు చెప్పబడిన మంగగింజలను పిడికిలికి వచ్చినన్నిగాని కావలసినన్నిగాని గ్రహించి నలియగొట్టి అతిమధుర కషాయమునందుగాని ఎర్రదేవకాంచనము తెల్లదేవకాంచనము కడిమి ప్రబ్బలి దొండ తేలుమణిచెట్టు ప్రత్తి ఉత్తరేణు వీనిలో దేనియొక్క కషాయమునందైననుగాని కలపి యొకరాత్రి యుంచి పిసికి వడియగట్టి నెయ్యి తేనె సైంధవలవణము వీనినికలిపి కొద్దిగవెచ్చచేసి మూకుడునందు పోసి "ఓం బ్రహ్మ దక్షాశ్వి" ఇత్యాది మంత్రముచే అభిమంత్రించి దానిని ఉత్తరముఖముగాని తూర్పుముఖముగాని యున్న రోగిచే త్రాగింపవలయును. శ్లేష్మజ్వరము గుల్మము పడిసెము ఇవికలవానిచే పిత్తము బయటపడునట్లు విశేషించి త్రాగింపవలయును. అట్లుచేసినచో వమనములు సరిగ నగును. సరిగ కానియెడల పిప్పళ్ళు ఉసిరికకాయలు ఆవాలు వీనియొక్క కల్కము, ఉప్పు, వేడినీళ్ళు వీనిని తరచు ఇచ్చి పిత్తము బయటపడువరకు వమనములను చేయింపవలయును. ఇట్లు వమనవిధి సామాన్యముగ చెప్పబడినది.

మూ॥ సర్వేషు తు మధుసైన్ధవం కఫవిలయనచ్ఛేదార్థం వమనేషు విదధ్యాత్; న చోష్ణవిరోధో మధునశ్ఛర్దనయోగయుక్తస్య, అవిపక్వ ప్రత్యాగమనాద్దోష నిర్హరణాచ్చేతి ॥18॥

ఆ॥ కఫమును ఛేదించుటకును నశింపచేయుటకును తేనె సైంధవలవణము వీనిని సమస్తవమనౌషధములయందును కలుపవలయును. వమనౌషధములయందు కలుపబడిన తేనె పక్వము కాకుండగనే బయటికి వచ్చునదగుటవలనను దోషములను హరింప

చేయునదగుటవలనను ఉష్ణవిరుద్ధముగా నేరదు.

మూ॥ ఫలపిప్పలీనాం ద్వౌ భాగౌ కోవిదారాదికషాయేణ త్రిఃసప్తకృత్వః స్రావయేత్, తేన రసేన తృతీయభాగం పిష్ట్వా మాత్రాం హరీతకీభిర్విభీతకై రామలకైర్వా తుల్యాంవర్తయేత్ తాసామేకాం ద్వే వా పూర్వోక్తానాం కషాయాణామన్యతమస్యాఞ్జలిమాత్రేణ విమృద్య బలవచ్ఛ్లేష్మప్రసేకగ్రన్థిజ్వరోదరారుచిషు పాయయేదితి సమానం పూర్వేణ ॥19॥

ఆ॥ మంగగింజలను రెండుభాగములుగ గ్రహించి ఎఱ్ఱదేవకాంచనము మొదలగువానిలో దేనియొక్క కషాయమునందైనను కలిపి ఇరువదియొక్క సారులు వడియకట్టవలయును. మరియొక భాగమును గ్రహించి వడియకట్టినఆరసముతో నూరి కరక్కాయలతోగాని తానికాయలతోగాని ఉసిరికకాయలతోగాని సమానముగ నుండునట్లు ఉండలను చేయవలయును. వానిలో ఒకటినిగాని రెండింటినిగాని, ఎఱ్ఱదేవకాంచనము మొదలగువానిలో దేనియొక్క కషాయమునైనను నాలుగుపలములపరిమితిగ గ్రహించి యందుకలిపి బలవత్తరమగు కఫప్రసేకము గ్రంథులు జ్వరము ఉదరవ్యాధి అరుచి వీనియందు త్రాగింపవలయును. స్నేహస్వేదములనుచేయించుట అభిమంత్రించుట మొదలగువానిని పూర్వమునందు చెప్పినవిధముననే చేయవలయును.

మూ॥ ఫలపిప్పలీక్షీరం, తేన వా క్షీరయవాగూమధోభాగేరక్తపిత్తే హృద్దాహే తజ్జస్య వాదధ్న ఉత్తరకం కఫచ్ఛర్దితమకముఖప్రసేకేషు పూర్ణశరావం, తస్యైవ పయసః శీతస్య సన్తానికాఞ్జలిం పిత్తేప్రకుపితే ఉరఃకణ్ఠహృదయేచ తనుకఫోపదిగ్ధ ఇతి సమానం పూర్వేణ॥

ఆ॥ మంగగింజలలో తయారుచేయబడినపాలనుగాని అట్టిపాలతో తయారుచేయబడిన యవాగునుగాని అధోగరక్తపిత్తమునందును హృదయతాపమునందును ఇయ్యవలయును. అట్టి పాలవలనజనించిన పెరుగుమీదితేటను ఎనిమిదిపలములు పరిమితిగ, కఫమును వాంతిచేయుట తమకశ్వాస నోటనీరూరుట వీనియందియ్యవలయును. చల్లారిన అట్టిపాలయొక్క మీగడను నాలుగుపలములపరిమితిగ, ప్రకోపించినపిత్తమందును రొమ్ము కంఠము హృదయము ఇవి స్వల్పకఫముతో కూడియున్నప్పుడును ఇయ్యవలయును. ఇయ్యవలసినవిధానము పూర్వమునందువలెనే యని గ్రహింపవలయును.

మూ॥ ఫలపిప్పలీశృతక్షీరాన్నవనీత ముత్పన్నం ఫలాదికల్కకషాయసిద్ధం కఫాభిభూతాగ్నిం విశుష్యద్దేహం చ మాత్రయా పాయయేదితి సమానం పూర్వేణ ॥21॥

అ॥ మంగగింజలలో కాచబడిన పాలనుండి జనించిన వెన్నను మంగకాయ

మొదలగువానియొక్క కల్కముతోడను కషాయముతోడను తయారుచేసి కఫముచే ఆవరింపబడిన జాఠరాగ్నికలవానికిని శుష్కించుచున్న శరీరముకలవానికిని తగుపరిమితిగ పూర్వమునందువలెనే ఇయ్యవలయును.

మూ॥ ఫలపిప్పలీనాం ఫలాదికషాయేణ త్రిఃసప్తకృత్వః పరిభావితేన పుష్కరజఃప్రకాశేన చూర్ణేన, బృహత్సరసి సంజాతం బృహత్సరోరుహం సాయాహ్నే ఽవచూర్ణయేత్, తద్రాత్రిపర్యుషితం ప్రభాతే పునరవచూర్ణిత ముద్ధృత్య హరిద్రాకృశరక్షీరయవాగూనామన్యతమం సైన్ధవగుడఫాణితయుక్తమాకణ్ఠం పీతవన్తమాఘ్రాపయేత్ సుకుమారమక్లిష్టపిత్తకఫమౌషధద్వేషిణమితి సమానం పూర్వేణ॥

అ॥ ప్రేంగగింజల చూర్ణమును ప్రేంగకాయలకషాయముతో ఇరువదియొక్కసారులు భావనచేసి పిమ్మట పుష్పరాగముతో సమానముగ నుండునట్లు చూర్ణించి దానిని పెద్దసరస్సునందున్న పెద్దపద్మముమీద సాయంకాలమునందు చల్లి ఆరాత్రి అటులనే యుంచి మరునాడుదయమున చూర్ణమును మరల చల్లి ఆపద్మమును తీయవలయును. సుకుమారులకును క్లేశమునొందిన పిత్తకఫములుకలవారలకును ఔషధమును ద్వేషించువారలకును పసుపుకలిసిన పులగము పాలు జావ వీనిలోదేనియందైనను సైంధవలవణము బెల్లము చెరుకుపాకము వీనిని కలిపి కంఠపర్యంతము త్రాగించి ఆపద్మమును వాసనచూపించవలయును. సమస్తవిధానమును పూర్వమందువలెనే చేయింపవలయును.

మూ॥ ఫలపిప్పలీనాం భల్లాతకవిధిపరిస్రుతం స్వరసం పక్త్వా ఫాణితీభూతమాతన్తులీభావాల్లేహయేత్; తదాతప శుష్కం చ చూర్ణీకృతం జీమూతాదికషాయేణ పిత్తే కఫస్థానగతే పాయయేదితి సమానం పూర్వేణ ॥23॥

అ॥ రసాయనప్రకరణమునందు జీడిగింజలకు చెప్పబడినవిధమున ప్రేంగగింజలనుండి రసమును తీసి జిగురువచ్చునట్లు కాచి చెఱకుపాకమువలె తయారుచేసి దానినిగాని ప్రేంగగింజలను ఎండయందెండించిచూర్ణమును చేసి దేవదాళిమొదలగు వానియొక్క కషాయమునందు కలిపి దానినిగాని పిత్తము కఫస్థానమును పొందినప్పుడు పూర్వవిధి ననుసరించి యియ్యవలయును.

మూ॥ ఫలపిప్పలీచూర్ణాని పూర్వవత్కోవిదారాదీనాంషణ్ణామన్యతమకషాయస్రుతాని వర్తిక్రియాః కోవిదారాదికషాయోపసర్జనాః పేయా ఇతి సమానం పూర్వేణ ॥24॥

అ॥ ప్రేంగగింజలచూర్ణమును ఎఱ్ఱకాంచనారము మొదలగునారింటిలో దేనియొక్కకషాయమునందైనను తడిపి పూర్వమునందువలెనే వర్తులను చేసి ఎఱ్ఱకాంచనారము మొదలగువానియొక్కకషాయముతో పూర్వవిధిననుసరించిఇయ్యవలయును.

మూ॥ ఫలపిప్పలీనామారగ్వధకుటజస్వాదుకణ్టకపాఠాపాటలిశార్ఙ్గష్టా మూర్వాసప్తపర్ణనక్తమాలపిచుమర్దపటోల సుషవీగుడూచీసోమవల్కద్వీపికానాంపిప్పలీపిప్పలీమూలహస్తిపిప్పలీ చిత్రకశృఙ్గవేరాణాం చాన్యతమకషాయేణ సిద్ధో లేహ ఇతి సమానం పూర్వేణ ॥25॥

ఆ॥ రేల కొడిసెపాల పల్లేరు చిరుబొద్ది కలిగొట్టు గురివింద చాగ ఏడాకుల అరటి కానుగ వేప చేదుపొట్ల కాకర తిప్పతీగ తెల్లచంద్ర వస పిప్పళ్ళు మోడి గజపిప్పళ్ళు చిత్రమూలము శొంఠి వీనిలో దేనియొక్క కషాయముతో నైనను బ్రమంగగింజల చూర్ణమును లేహముగ తయారుచేసి పూర్వవిధిననుసరించి ఇయ్యవలయును.

మూ॥ ఫలపిప్పలీష్వేలాహరేణుకాశతపుష్పాకుస్తుమ్బురుతగరకుష్ఠత్వక్చోరకమరుబకాగరుగుగ్గుల్వేలవాలుకశ్రీవేష్టకపరిపేలవమాంసీశైలేయకస్థౌణేయకసరలపారావతపద్యశోకరోహిణీనాం వింశతేరన్యతమస్య కషాయేణ సాధయిత్వోత్కారికా ఉత్కారికాకల్పేన తథా మోదకాన్ వా మోదకకల్పేన యథాదోష రోగ భక్తి ప్రయోజ్యా ఇతి సమానం పూర్వేణ ॥26॥

ఆ॥ ఏలకులు రేణుకలు సదాప ధనియాలు గ్రంథితగరము చెంగల్వకోష్టు దాసెనచెక్క గంధకచోరము మరువము అగురు గుగ్గులు కూతురుబుడము శ్రీవేష్టకము నాగరముస్తలు జటామాంసి శైలేయకము స్థౌణేయకము సరళ దేవదారు జ్యోతిష్మతి కటుకరోహిణి ఈఇరువదిద్రవ్యములలో దేనియొక్క కషాయముతో నైనను బ్రమంగగింజలచూర్ణమును కలిపి భక్ష్యవిశేషములగు ఉత్కారికలనుగ గాని మోదకములనుగ గాని తయారుచేసి దోషములను రోగములను అనుసరించి పూర్వమునందువలెనే ఇయ్యవలయును.

మూ॥ ఫలపిప్పలీస్వరసకషాయపరిభావితాని తిలాశాలితణ్డులపిష్టాని తత్కషాయోపసర్జనాని శష్కులీకల్పేన వా పూపా ఇతి సమానం పూర్వేణ॥ ఏతేనైవ చ కల్పేన సుముఖసురసకుఠేరకగణ్డీర కాలమాలకపర్ణాసకక్షవకఫణిజ్జకగృఞ్జనానాంకాసమర్దభృఙ్గరాజానామిక్షుబాలికేక్షుకాణ్డేక్షూణాం చాన్యతమస్య కషాయేణ కారయేత్ సమానం పూర్వేణ ॥28॥

ఆ॥ బ్రమంగగింజలయొక్క స్వరసమునందుగాని కషాయమునందుగాని భావన చేయబడిన నువ్వులు వరిబియ్యము వీనిపిండిని బ్రమంగగింజలకషాయముతో గాని ఎర్రావాలు తులసి తెల్లగగ్గర కాకర నల్లగగ్గర గగ్గర నల్లావాలు మరువము బోదకసువు కసివింద గుంటగలగర రెల్లు తెల్లచెరుకు చెరుకు వీనిలో దేనియొక్క కషాయముతో గాని కలిపి చక్కిలములనుగ గాని అపూపములనుగ గాని తయారుచేసి పూర్వ

విధిననుసరించి ఇయ్యవలయును.

మూ॥ తథా బదరషాడవరాగలేహమోదకోత్కారికాతర్పణపానక మాంసరస యూషమద్యానాం మదన ఫలాన్యన్యత మేనోపసంసృజ్య యథాదోషరోగభక్తి దద్యాత్తైః సాధు వమతీతి ॥29॥

అ॥ రేగుపండ్లతో తయారుచేయబడిన ఖాండవము రాగము లేహము మోదకము ఉత్కారికము తర్పణము పానకము మాంసరసము యూషము మద్యము వీనిలో దేనితోనైనను మ్రంగగింజలచూర్ణమును కలిసి దోషములను రోగములను అనుసరించి ఇచ్చినచో బాగుగ వమనములగును.

మ్రంగకాయయొక్క పర్యాయపదములు.

మూ॥ మదనః కరహాటశ్చ రాఠః పిణ్డీతకః ఫలమ్। శ్వసనశ్చేతి పర్యాయై రుచ్యతే తస్య కల్పనా ॥30॥

అ॥ మదన, కరహాట, రాఠ, పిండీతక, ఫల, శ్వసన ఇవి మ్రంగకాయయొక్క పర్యాయపదములుగ నుండును.

అధ్యాయసంగ్రహము.

మూ॥ నవ యోగాః కషాయేషు వర్త్యష్టౌ పయోముఖాః। పఞ్చైకః ఫాణితే చూర్ణే ఘ్రేయే వర్తిక్రియాసు షట్ ॥ వింశతిర్వింశతిర్లేహమోదకోత్కారికాసుచ। శష్కులీపూపయోశ్చోక్తా యోగాః షోడశ షోడశ॥ దశాన్యే ఖాణ్డవాద్యేషు త్రయస్త్రింశదిదంశతమ్। యోగానాం విధివద్దృష్టం ఫలకల్పే మహర్షిణా ॥31॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే కల్పస్థానేఽ మదనఫలకల్పో నామ ప్రథమోఽధ్యాయః ॥

అ॥ ఈమదనకల్పాధ్యాయమునందు కషాయములతో తొమ్మిదియు, ఉండలరూపముగ ఎనిమిదియు, పాలతో ఐదును, పానకరూపముగ ఒకటియు, చూర్ణరూపముగ ఒకటియు, ఆఘ్రేయరూపముగ ఒకటియు, వర్తులరూపముగ ఆరును, లేహరూపముగ ఇరువదియు, మోదకరూపముగ ఇరువదియు, ఉత్కారికారూపముగ ఇరువదియు, శష్కులీ (చక్కిలము) రూపముగ పదునారును, అపూపరూపముగ పదునారును, ఖాండవాదులతో పదియు ఇట్లు నూటముప్పదిమూడు యోగములు చెప్పబడినవి.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు మదనఫలకల్పమనెడు ప్రథమాధ్యాయము సమాప్తము.

—*—

# ద్వితీయాధ్యాయము.



మూ॥ అథాతో జీమూతకకల్పం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట జీమూతకకల్పమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

## జీమూతక కల్పములు.

మూ॥ కల్పం జీమూతకస్యేమం ఫలపుష్పాశ్రయం శృణు। గరాగరీ చ వేణీ చ తథా స్యాద్దేవతాడకః ॥ జీమూతకం త్రిదోషఘ్నం యథాస్వౌషధ కల్పితమ్। ప్రయోక్తవ్యం జ్వరశ్వాసహిక్కా కోష్ఠామయేషు చ । యథోక్తగుణ యుక్తానాం దేశజానాం యథావిధి ॥4॥

అ॥ దేవదాలి సంబంధమగు ఫలములయొక్కయు పుష్పములయొక్కయు కల్పములను చెప్పెదనువినుము. గరాగరి వేణి దేవతాడకము అనునివి దేవదాలికి పర్యాయపదములుగ నుండును. ఆయా ఔషధములుగ తయారుచేయబడిన దేవదాలి మూడు దోషములను నశింపజేయును. జ్వరము, శ్వాస, ఎక్కిళ్ళు, కోష్ఠవ్యాధులు వీనియందు ఇయ్యవలయును. పూర్వమునందు చెప్పబడిన గుణములతో కూడినట్టియు సరియైన ప్రదేశమునందు పుట్టినట్టియు దేవదాలిని విధిపూర్వకము గ్రహింపవలయును.

## క్షీరసంబంధ జీమూతకల్పములు.

మూ॥ పయఃపుష్పేఽస్య నిర్వృత్తేఫలే పేయా పయస్కృతా॥ లోమశే క్షీరసన్తానం దధ్యుత్తర మలోమశే। శృతే పయసి దధ్యమ్లం జాతం హరితపాణ్డుకే ॥ జీర్ణానాం చ సుశుష్కాణాం న్యస్తానాం భాజనే శుచౌ । చూర్ణస్య పయసా శుక్తిం వాతపిత్తార్దితః పిబేత్ ॥5॥

అ॥ దేవదాలియొక్క పుష్పములతో తయారుకాబడిన పాలను, లేతకాయలతో తయారుకాబడిన పాలతోకూడిన జావను, ముళ్ళుకల కాయలతో తయారుకాబడిన పాలయొక్క మీగడను, ముళ్ళుజనింపని కాయలతో తయారుకాబడిన పాలవలన జనించిన పెరుగుమీది మీగడను, పచ్చగను తెల్లగనునున్న కాయలతో తయారుకాబడిన పాలవలన జనించిన పుల్లని పెరుగును బాగుగపండి రాలినట్టియు బాగుగ ఎండినట్టియు పరిశుభ్రమైన పాత్రయందుంచబడినట్టియు పండ్లయొక్క చూర్ణమును ప్రయోగింపవలయును. అట్టి చూర్ణమును పాలతో అర్ధపలపరిమితిగ వాతపిత్తము లధికముగ కలవాడు పుచ్చుకొనవలయును.

## సురామండ జీమూతకల్పము.

మూ॥ ఆసుత్య చ సురామణ్డే మృదిత్వా ప్రస్రుతం పిబేత్। కఫజేఽరోచకే కాసే పాణ్డురోగే సయక్ష్మణి ॥8॥

అ॥ దేవదాలిపండ్లను సుర యనెడి మద్యముయొక్క తేటయందు కలిపి ఒక రాత్రి యుంచి వడకట్టి దానిని కఫమువలన జనించిన అరోచకము కాస పాండురోగము యక్ష్మ వీనియందు ఇయ్యవలయును.

మూ॥ ద్వే చాపోథ్యాథవా త్రీణి గుడూచ్యామలకస్య వా। కోవిదారాదికానాం వా నిమ్బస్య కుటజస్య వా। కషాయేష్వాసుతం పూత్వా తేనైవ విధినా పిబేత్ ॥9॥

అ॥ దేవదాలిపండ్లను రెండిటిని గాని మూడిటిని గాని నలియకొట్టి తిప్పతీగ ఉసిరికపండ్లు ఎఱ్ఱదేవకాంచనము తెల్లదేవకాంచనము కడిమి ప్రబ్బలి దొండ తేలుమణిచెట్టు ప్రత్తి ఉత్తరేణు వేప కొడిసెపాల వీనిలో దేనియొక్క కషాయమునందైనను ఒకరాత్రి యుంచి వడియకట్టి క్రిందపండ్లకు చెప్పినవిధముననే ఇయ్యవలయును.

మూ॥ అథవాఽఽరగ్వధాదీనాం సప్తానాం పూర్వవత్పిబేత్। ఏకైకస్య కషాయేణ పిత్తశ్లేష్మజ్వరార్దితః ॥10॥

అ॥ రేల కొడిసెపాల పల్లేరు చిరుబొద్ది కలిగొట్టు గురివింద చాగ వీనిలో దేనియొక్క కషాయమునందైనను దేవదాలిపండ్లను పూర్వమునందువలెనే చేసి పిత్తజ్వరము కలవానికిని శ్లేష్మజ్వరము కలవానికిని ఇయ్యవలయును.

మూ॥ వర్తయః ఫలవచ్చాష్టౌ కోలమాత్రాస్తు తా మతాః ॥ జీమూతకస్య వా కల్కం చూర్ణం వా శిశిరామ్బునా। జ్వరే పిత్తే పిబేద్వాతే కఫే చోష్ణోదకేన తు ॥12॥

అ॥ దేవదాలిపండ్లను క్రిందపండ్లకు చెప్పినవిధముననే ఎనిమిదివర్తులను చేసి ప్రయోగింపవలయును. ఈవర్తులను రేగుపండ్లంత చేయవలయును. దేవదాలిపండ్లయొక్క కల్కమునుగాని చూర్ణమునుగాని చన్నీటితో పిత్తజ్వరమునందును వేడినీటితో వాతకఫజ్వరములయందును ఇయ్యవలయును.

మూ॥ జీవకర్షభకేక్షూణాం శతావర్యా రసేన వా। పిత్తశ్లేష్మజ్వరే దద్యాద్వాతపిత్తజ్వరేఽథవా ॥13॥

అ॥ మరియు జీవకము బుషభకము చెరకు పిల్లిపీచర వీనిలో దేనియొక్క రసముతోనైనను పిత్తశ్లేష్మజ్వరమునందుగాని వాతపిత్తమునందుగాని ఇయ్యవలయును.

మూ॥ తథా జీమూతక క్షీరాత్సముత్పన్నం పచేద్ఘృతమ్। ఫలాదీనాం కషాయేణ శ్రేష్ఠం తద్వమనం మతమ్ ॥14॥

అ॥ దేవదాలిపండ్లతో కాచబడిన పాలవలనజనించిన ఘృతమును క్రిందకాయ

మొదలగువాని కషాయముతో తయారుచేయవలయును. ఇది శ్రేష్ఠమైన వమనౌషధముగ నుండును.

అధ్యాయ సంగ్రహము.

మూ॥ షట్ క్షీరే మదిరామణ్డే ఏకో ద్వాదశ చాపరే। సప్త చారగ్వధాదీనాం కషాయేఽష్టౌ చ వర్తిషు ॥ జీవకాదిషు చత్వారో ఘృతం చైకం ప్రకీర్తితమ్। కల్పే జీమూతకానాం చ యోగాస్త్రింశన్నవాధికాః ॥ ౹౬॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతి సంస్కృతే కల్పస్థానే జీమూతకకల్పో నామ ద్వితీయోఽధ్యాయః ॥

అ॥ ఈ జీమూతకకల్పాధ్యాయమునందు పాలతో ఆరును, సురామండముతో ఒకటియు, తిప్పతీగ మొదలగువాని కషాయములతో పండ్రెండును, రేల మొదలగు వాని కషాయములతో ఏడును, వర్తులరూపముగ ఎనిమిదియు, జీవకము మొదలగు వాని రసముతో నాలుగును, ఘృతరూపముగ ఒకటియు ఇట్లు ముప్పదితొమ్మిదియోగములు చెప్పబడినవి.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామకకృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు జీమూతకకల్ప మనెడు ద్వితీయాధ్యాయము సమాప్తము.

—0—

# తృతీయాధ్యాయము.

మూ॥ అథాత ఇక్ష్వాకుకల్పం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట ఇక్ష్వాకుకల్పమును చెప్పుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

ఇక్ష్వాకు కల్పములు.

మూ॥ సిద్ధం వక్ష్యామ్యథేక్ష్వాకుకల్పం తేషాం ప్రశస్యతే। పఞ్చచత్వారింశదుక్తా యోగా అస్మిన్మహర్షిణా॥ లమ్బాఽథ కటుకాలాబూ తుమ్బీ పిణ్డఫలం తథా। ఇక్ష్వాకుః ఫలినీ చైవ ప్రోచ్యతే తస్య కల్పనా ॥ కాసశ్వాసవిషచ్ఛర్ది జ్వరార్తే కఫకర్శితే। ప్రతామ్యతి నరే చైవ వమనార్థం తదిష్యతే ॥5॥

అ॥ చేదుసొర సంబంధమైన నలుబదియైదు విధములగు కల్పనములను చెప్పుచున్నాము. లంబ, కటుకాలాబు, తుంబి, పిండఫల, ఇక్ష్వాకు, ఫలిని అనునవి చేదుసొరకు పర్యాయపదములుగ నుండును. దగ్గు ఆయాసము విషవ్యాధులు వాంతి జ్వరము కఫముచే కృశించుట ప్రతమకశ్వాస వీనియందు వమనము చేయించుటకు చేదుసొర యొక్క కల్పములు శ్రేష్ఠములుగ నుండును.

మూ॥ అపుష్పస్య ప్రవాలానాం ముష్టిం ప్రాదేశసంమితామ్।
క్షీరప్రస్థే శృతం దద్యాత్పిత్తోద్రిక్తే కఫజ్వరే ॥6॥

అ॥ పుష్పములు జనింపని చేదుసొరయొక్క చిగురుటాకులను తర్జనీవ్రేలుతో కూడిన పిడికిలికి వచ్చినన్ని గ్రహించి ఒక ప్రస్థము పాలయందు కాచి ఆపాలను పిత్తోద్రేకముతో కూడిన కఫజ్వరమునం దియ్యవలయును.

మూ॥ పుష్పాదిషు చ చత్వారః క్షీరే జీమూతకే యథా।
యోగా హరితపాణ్డూనాం సురామణ్డేన పఞ్చమః ॥7॥

అ॥ చేదుసొరయొక్క పుష్పములను లేతకాయలను పచ్చగను తెల్లగను నున్న కాయలను బాగుగ పండి ఎండిన పండ్లయొక్క చూర్ణమును దేవదాళికి చెప్పబడిన విధముననే పాలయొక్క సంబంధముతో ఇయ్యవలయును. మరియు చేదుసొర కాయలను దేవదాళిపండ్లనువలె సురయనెడి మద్యముయొక్క తేటతో ఇయ్యవలయును.

మూ॥ ఫలస్వరసభాగం చ త్రిగుణక్షీరసాధితమ్। ఉరఃస్థితే కఫే దద్యాత్స్వరభేదే సపీనసే॥ హృతమధ్యే ఫలే జీర్ణే స్థితం క్షీరం యదా దధి। జాతం స్యాత్కఫజే కాసే శ్వాసే వమ్యాం చ తత్ పిబేత్ ॥ మస్తునా వా ఫలాన్మధ్యం పాణ్డుకుష్ఠవిషార్దితః। తేన తక్రం విపక్వం వా సక్షౌద్రలవణం పిబేత్॥ అజాక్షీరేణ బీజాని భావయేత్పాయయేత చ। విషగుల్మోదరగ్రన్థి గణ్డేషు శ్లీపదేషు చ ॥8॥

అ॥ చేదుసొరకాయలయొక్క రసమును మూడురెట్లు పాలతో కాచి రొమ్మునందు కఫము అధికముగ నున్నప్పుడును స్వరభేదమునందును పీనసమునందును ఇయ్యవలయును. ఎండినట్టియు లోపలనుండు గుజ్జు తీసివేయబడినట్టియు చేదుసొరకాయయందు పాలుపోసి ఆపాలవలన జనించిన పెరుగును కఫమువలన జనించిన కాసమునందును శ్వాసయందును వాంతియందును ఇయ్యవలయును. చేదుసొరకాయగుజ్జును మీగడతో కలిపి పాండురోగమునందును కుష్ఠమునందును విషవ్యాధియందును ఇయ్యవలయును. లేక చేదుసొరకాయగుజ్జుతో కాచబడిన మజ్జిగయందు తేనెను సైంధవలవణమును కలిపి ఇయ్యవలయును. చేదుసొరకాయ గింజల చూర్ణమును మేకపాలతో భావనచేసి విషవ్యాధులు గుల్మము ఉదరవ్యాధి గ్రంథులు గండమాల శ్లీపదము వీనియందు మేకపాలతో ఇయ్యవలయును.

మూ॥ తుమ్బ్యాః ఫలరసైః శుష్కైః సపుష్పైరవచూర్ణితమ్।

ఛర్దయేన్మాల్యమాఘ్రాయ గన్ధసంపత్సుఖోచితః॥ భక్షయేత్ఫలమధ్యం వా గుడేన పలలేన చ। ఇక్ష్వాకుఫలతైలం వా సిద్ధం వా పూర్వవద్ఘృతమ్ ॥ 13॥

అ॥ చేదుసారయొక్క ఎండినపువ్వులను చూర్ణముచేసి చేదుసొరకాయ రసముతో భావనచేసి చూర్ణించవలయును. సుగంధము అభ్యాసముకలవాడు ఈ చూర్ణమును పుష్పమాలికమీదచల్లి వాసనచూడవలయును. లేక చేదుసొరకాయ గుజ్జును బెల్లముతోడను మాంసముతోడను పుచ్చుకొనవలయును. చేదుసొరకాయ కల్కముతో తయారైన తైలమునుగాని జీమూతకకల్పమునందువలెనే తయారుకాండిన చేదుసొరకాయలయొక్క ఘృతమునుగాని పుచ్చుకొనవలయును.

మూ॥ పఞ్చాశద్దశవృద్ధాని ఫలినీనాం యథోత్తరమ్। పిబేద్విమృద్య బీజాని కషాయేష్వాసుతం పృథక్ ॥14॥

అ॥ చేదుసొరకాయగింజలను చూర్ణించి ప్రియంగకాయ మొదలగుదేనియొక్క కషాయమునందైనను కలిపి ఒకరాత్రి యుంచి ఒడియకట్టి ఆరసమును త్రాగవలయును. మొదటిరోజున పదిగింజలను ప్రారంభించి రోజునకు పదిచొప్పున వృద్ధిచేయుచు ఏబదియగువరకు (అయిదురోజులు) పుచ్చుకొనవలయును.

మూ॥ యష్ట్యాహ్వకోవిదారాద్యైర్మష్టిమన్తర్నఖం పిబేత్। కషాయైఃకోవిదారాద్యైర్వా త్రాశ్చ ఫలవత్స్మృతాః॥ బిల్వమూలకషాయే చ తుంబీబీజాఞ్జలిం పచేత్। పూతస్యాస్య త్రయో భాగాశ్చతుర్థః ఫాణితస్యతు॥ సఘృతా బీజభాగాశ్చ పిష్ట్వాఽర్ధాంశికాం స్తథా। మహాజాలినీజీమూతకృతవేధనవత్సకాన్॥ తం లేహం సాధయేద్దర్వ్యాఘట్టయన్మృదునాఽగ్నినా। యావత్స్యాత్తన్తుమత్తోయే పతితం చ న శీర్యతే॥ తం లిహ్యాన్మాత్రయా లేహం ప్రమథ్యాం చ పిబేదను। కల్ప ఏషోఽగ్నిమన్థాదౌ చతుష్కే పృథగుచ్యతే ॥15॥

అ॥ చేదుసొరకాయగింజల చూర్ణమును పిడికిలికివచ్చినంత గ్రహించి అతిమధురము మొదలగు తొమ్మిదివస్తువులలో దేనియొక్క కషాయముతోనైనను పుచ్చుకొనవలయును. వీనియొక్క చూర్ణమును ఎఱ్ఱదేవకాంచనము మొదలగువానిలో దేనియొక్క కషాయముతోనైనను ప్రియంగపండ్లకు చెప్పినవిధముననే ఉండలనుచేసి సేవింపవలయును. చేదుసొరకాయగింజలను నాలుగుపలములుగ గ్రహించి మారేడువేళ్ళ కషాయమునందు కాచి వడకట్టవలయును. ఆరసమును మూడుభాగములుగను, చెరకుపాకమును ఒకభాగముగను, నేతిని ఒకభాగముగను, చేదుసొరకాయ దేవదాలి చేదుబీర కొడిసెపాలవిత్తులు వీనియొక్క చూర్ణములను ఒక్కొక్క అర్ధభాగముగను

గ్రహించి గరిటెతో కలియత్రిప్పుచు జిగురువచ్చువరకును, నీటియందు వేసినచో విడి పోకుండ నుండువరకును సన్ననిమంటయందు వండిఆలేహమును తగుపరిమితముగ పుచ్చుకొని కరక్కాయను సేవింపవలయును. మహాపంచ మూలములయందు చెప్పబడిన కూరనెల్లి మొదలగు మిగిలిన నాలిగింటియొక్క వేళ్ళకషాయములలో దేనితోనైనను ఈవిధముగనే లేహమును తయారుచేసి పుచ్చుకొనవచ్చును.

మూ॥ శక్తుభిర్వా పిబేన్మన్థం తుమ్బ్యాస్స్వరసభావితైః కఫజేఽథ జ్వరే కాసే కణ్ఠరోగేష్వరోచకే ॥ గుల్మే మేహే ప్రసేకే చ కల్కం మాంసరసైః పిబేత్ । సరః సాధు వమత్యేవం న చ దౌర్బల్యమశ్నుతే ॥2॥

అ॥ చేదుసొరకాయరసముతో భావనచేయబడినట్టి సక్తుపిండితో తయారుకాబడిన మంథమును కఫమువలనజనించిన జ్వరము దగ్గు కంఠవ్యాధులు అరోచకము వీనియందియ్యవలయును. చేదుసొరకాయకల్కముతో కాచబడిన మాంసరసమును గుల్మము ప్రమేహము కఫమునుమియుట వీనియందిచ్చినచో వమనములు సరిగ నగును. దౌర్బల్యము కలుగనేరదు.

అధ్యాయసంగ్రహము.

మూ॥ పయస్యష్టౌ సురామణ్డమస్తుతక్రేషు చ త్రయః। ఘేయం చ పలలం తైల౦వర్ధమానాః ఫలేషు షట్॥ ఘృతమేకం కషాయేషు నవాన్యే మధుకాదిషు। అష్టౌ వర్తిక్రియా లేహాః పఞ్చ మన్థో రసస్తథా॥ యోగా ఇక్ష్వాకుకల్పేఽస్మింశ్చత్వారింశచ్చ పఞ్చ చ। ఉక్తా మహర్షిణా సమ్యక్ ప్రజానాం హితకామ్యయా ॥3॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే కల్పస్థానే ఇక్ష్వాకుకల్పో నామ తృతీయోఽధ్యాయః ॥

అ॥ ఈఇక్ష్వాకుకల్పాధ్యాయమునందు పాలతో ఎనిమిదియు, సురామండము మీగడ మజ్జిగ వీనితో ఒక్కొక్కటిచొప్పున మూడును, ఆఘ్రేయరూపముగ ఒకటియు, మాంసముతో ఒకటియు, తైలరూపమున ఒకటియు, ఫలముగకాయ మొదలగు ఆరింటికషాయములతో వర్ధమానయోగములు ఆరును, ఘృతరూపమున ఒకటియు, అతిమధురము మొదలగువాని కషాయములతో తొమ్మిదియు, ఉండలుగ ఎనిమిదియు, లేహములుగ అయిదును, మంథముగ ఒకటియు, మాంసరసముతో ఒకటియు ఇట్లు నలుబదియైదుయోగములు చెప్పబడినవి.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు ఇక్ష్వాకుకల్ప మనెడు తృతీయాధ్యాయము సమాప్తము.

—*—

# చతుర్థశాధ్యాయము.

మూ॥ అథాతో ధామార్గవకల్పం వ్యాఖ్యాస్యామః ॥

అ॥ పిమ్మట ధామార్గవకల్పమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

## ధామార్గవ కల్పములు.

మూ॥ కర్కోటకీ కటుఫలా మహాజాలిని రేవ చ। ధామార్గవస్య పర్యాయా రాజకోశాతకీ తథా ॥ గరే గుల్మోదరే కాసే వాతశ్లేష్మామయే స్థితే। కఫే చ కణ్ఠవక్త్రస్థే కఫసంచయజేషు చ॥ రోగేష్వేషు ప్రయోజ్యం స్యాత్ స్థిరాశ్చ గురవశ్చ యే। ఫలం పుష్పం ప్రవాలం చ విధినా తస్య సంహరేత్ ॥ ప్రవాలస్వరసం శుష్కం కృతాశ్చ గులికాః పృథక్। కోవిదారాదిభిః పేయాః కషాయైర్మధుకస్య చ ॥ పుష్పాదిషు పయో యోగా శ్చత్వారః పఞ్చమీ సురా। పూర్వవజ్జీర్ణ శుష్కాణా మతః కల్పః ప్రశస్యతే ॥7॥

అ॥ కర్కోటకి, కటుఫల, మహాజాలిని, రాజకోశాతకి అనునివి ధామార్గవము నకు (పెద్దచేదుబీరకు) పర్యాయపదములుగ నుండును. గరదోషములు, గుల్మము, ఉదరవ్యాధి, కాస, స్థిరముగనున్న వాతశ్లేష్మవ్యాధులు, కఫము కంఠమునందును ముఖమునందును కూడియుండుట, కఫసంచయమువలన కలుగు వ్యాధులు, స్థిరమైనట్టియు గొప్పవైనట్టియు ఇతరవ్యాధులు వీనియందు పెద్దచేదుబీరను వాంతులనిమిత్తమిచ్చుట శ్రేష్ఠముగనుండును. దీనియొక్క కాయలను, పువ్వులను, చిగుళ్ళను గ్రహింపవలయును. పెద్దచేదుబీర చిగుళ్ళయొక్క రసమును ఎండించి గుటికలనుచేసి అతిమధురము ఎఱ్ఱదేవకాంచనము మొదలగు తొమ్మిదింటిలో దేనియొక్క కషాయముతో నైనను పుచ్చుకొనవలయును. దీనియొక్క పుష్పాదులను దేవదాళికి చెప్పబడినవిధముననే పాలయొక్క సంబంధముతో ఇయ్యవలయును. దీని కాయలను దేవదాళిపండ్లనువలె సుర యనెడి మద్యముయొక్క తేటతో ఇయ్యవలయును. పండి ఎండిన పెదచేదుబీరకాయలయొక్క కల్పములను చెప్పబోవుచున్నాము.

మూ॥ మధుకస్య కషాయేణ బీజకర్కోద్ధృతం ఫలమ్। సగుడం వ్యుషితం రాత్రౌ కోవిదారాదిభిస్తథా ॥ దద్యాద్గుల్మోదరార్తేభ్యో యే చాప్యన్యే కఫామయాః। దద్యాదన్నేన వా యుక్తం ఛర్దిహృద్రోగశాన్తయే ॥ చూర్ణైర్వాఽప్యుత్పలాని భావితాని ప్రభూతశః।

రసక్షీరయవాగ్వాదితృప్తో ఘ్రాత్వా వమేత్సుఖమ్॥ చూర్ణీకృతస్యవర్తిం వా కృత్వా బదరసమ్మితామ్। వినీయాఞ్జలిమాత్రే తు పిబేద్గోశ్వాశకృద్రసే॥ పృషతర్క్ష్యశ్వతరగ్రాహ్యాశ్వతర గోకర్ణ రాసభే। హరిణాజశ్వదంష్ట్రావిషమ్యవే చ శకృద్రసే ॥12॥

ఆ॥ పండిఎండిన కాయలనుండి తీయబడినగింజలను నలియకొట్టి అతిమధురము ఎఱ్ఱదేవకాంచనము మొదలగువానిలో దేనియొక్క కషాయమునందైనను ఒకరాత్రి యుంచిమరునాడు ఒడియకట్టియందు బెల్లముతుకలిపి గుల్మము ఉదరవ్యాధి ఇతరములైన కఫవ్యాధులు వీనియందియ్యవలయును. లేక వీని చూర్ణమును అన్నముతోకూడ వాంతి హృద్రోగము వీనియందియ్యవలయును. నల్లకలువ మొదలగువానిమీద వీనిచూర్ణమును తరుచుచల్లి, మాంసరసము పాలు యవాగువు మొదలగువానిని తృప్తిగ త్రాగి చూర్ణముచల్లబడిన వానిని వాసన చూచినచో సుఖముగ వాంతియగును. వీని యొక్క చూర్ణమును రేగుపండ్లంత ఉండలను చేసి, ఆవు గుఱ్ఱము దుప్పి మనుబోతు జింక కంచరగాడిద కణుజు గాడిద లేడి మేక శ్వదంష్ట్రి యనెడిమృగము గొఱ్ఱె వీనిలో దేనియొక్క పురీషరసమునైనను నాలుగుపలముల పరిమితిగ గ్రహించి అందు ఈ ఉండలను కలిపి పుచ్చుకొనవలయును.

మూ॥ జీవకర్షభకౌ వీరామాత్మగుప్తాం శతావరీమ్। కాకోలీం శ్రావణీం మేదాం మహామేదాం మధూలికామ్॥ ఏకైకశో౽భిసంచూర్ణ్య సహ ధామార్గవేన తు। శర్కరామధుసంయుక్తా లేహాహృద్దాహకాసినామ్॥ సుఖోదకానుపానాఃస్యుః పిత్తోష్మసహితే కఫే। ధాన్యతుమ్బురుయూషేణ కల్కస్య విషాపహాః ॥15॥

ఆ॥ జీవకము ఋషభకము క్షీరకాకోళి దూలగొండి పిల్లిపీచర కాకోళి బోడతరము మేద మహామేద యష్టిమధుకము వీనిలో దేనితోనైనను పెద్దచేదుబీరగింజలను కలిపి చూర్ణించి పంచదార తేనె వీనితో లేహముగ వండి హృదయతాపము దగ్గు వీనియందియ్యవలయును. పిత్తోష్మతోకూడిన కఫమునందు గోరువెచ్చని నీటియొక్క అనుపానముతో ఇయ్యవలయును. ధనియాలు తుంబుర్లువీనితో కూడిన కట్టుతో ఈ గింజలయొక్క కల్కమును ఇచ్చినయెడల విషవ్యాధులు శమించును.

మూ॥ జాత్యాః సౌమనసాయిన్యా రజన్యాశ్చోరకస్య వా। వృశ్చికస్య మహాక్షుద్రసహాహైమవతస్య చ॥ బిమ్బ్యాః పునర్నవాయా వా కాసమర్దస్య వా పృథక్। ఏకం ధామార్గవం ద్వే వా కషాయే పరిమృద్య తు॥ తచ్ఛృతక్షీరజం సర్పిః సాధితం వా ఫలాదిభిః। పూతం మనోవికారేషు పిబేద్వమనముత్తమమ్ ॥18॥

ఆ॥ జాజికాయ జాపత్రి పసుపు గంధక చూరములు తెల్లగలిజేరు ముద్దగణివ

మాషపర్ణి వస దొండ గలిజేరు కసివింద వీనిలో దేనియొక్క కషాయమునందైనను పెద్దచేదుబీరకాయలను ఒకటినిగాని రెండింటినిగాని కలిపి ఇయ్యవలయును. వీని గింజలతో కాచబడినట్టి పాలనుండి జనించిన ఘృతమును మంగకాయ మొదలగువానితో తయారుచేసి యీఘృతమును మానసికవ్యాధులయందు ఇయ్యవలయును. వమనమును సుఖముగ చేయును.

అధ్యాయ సంగ్రహము.

మూ॥ పల్లవే నవ చత్వారః క్షీర ఏకః సురాసవే। కషాయే వింశతిః కల్కే దశ ద్వా చ శకృద్రసే॥ అన్న ఏక స్తథా క్షేయే దశ లేహా స్తథా ఘృతమ్। కల్పే ధామార్గవ స్యోక్తాః షష్టిర్యోగా మహర్షిణా ॥20॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతి సంస్కృతే కల్పస్థానే ధామార్గవకల్పో నామ చతుర్థోఽధ్యాయః ॥

అ॥ ఈ ధామార్గవకల్పాధ్యాయమునందు చిగుళ్ళతో తొమ్మిదియు, పాలతో నాలుగును, సురామండముతో ఒకటియు, కషాయములతో ఇరువదియు, కల్కముతో నొకటియు, పురీషరసములతో పండ్రెండును, అన్నముతో నొకటియు, క్షేయరూపమున నొకటియు, లేహరూపమున పదియు, ఘృతరూపమున నొకటియు ఇట్లు అరువదియోగములు చెప్పబడినవి.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు ధామార్గవకల్ప మనెడు చతుర్థాధ్యాయము సమాప్తము.

—0—

# పంచమాధ్యాయము.

---

మూ॥ అథాతో వత్సకకల్పం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట వత్సకకల్పమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

వత్సక కల్పములు.

మూ॥ అథ వత్సకనామాని భేదం స్త్రీపుంసయో స్తథా। కల్పం చాస్య ప్రవక్ష్యామి వి స్తరేణ యథాతథమ్॥ వత్సకః కుటజః శక్రో వృక్షకో గిరిమల్లికా। బీజానీన్ద్రయవా స్తస్య తథోచ్య న్తే కలిఙ్గకాః॥ బృహత్ఫలః శ్వేతపుష్పః స్నిగ్ధపత్రః పుమాన్ భవేత్। శ్యామా

చారుణపుష్పా స్త్రీ ఫలవృన్తైస్తథాఽణుభిః॥ రక్తపిత్తకఫఘ్నస్తు సుకుమారేష్వనత్యయః । హృద్రోగజ్వరవాతాసృగ్విసర్పాదిషు శస్యతే॥ కాలే ఫలాని సంగృహ్య తయోః శుష్కాణి సంక్షిపేత్ । తేషామన్తర్నఖం ముష్టిం జర్జరీకృత్య భావయేత్॥ మధుకస్య కషాయేణ కోవిదారాదిభిస్తథా। నిశి స్థితం విమృద్యైతల్లవణక్షౌద్ర సంయుతమ్ । పిబేత్తద్వమనం శ్రేష్ఠం పిత్తశ్లేష్మ నిబర్హణమ్ ॥8॥

ఆ॥ కొడిసెపాలయొక్క పర్యాయపదములను స్త్రీపురుష భేదమును కల్పములను చెప్పుచున్నాము. వత్సక, కుటజ, శక్ర, వృక్షక, గిరిమల్లిక అనునివి కొడిసెపాలకును ఇంద్రయవ, కళింగక అనునివి కొడిసెపాలవిత్తులకును పర్యాయపదములుగ నుండును. పెద్దకాయలును తెల్లని పుష్పములును నిగనిగలాడుచున్న ఆకులును కల దానిని పురుషవృక్షముగను, నల్లగను ఎర్రనిపుష్పములు కలదిగను చిన్నవియగు కాయలును తొడిమలును కలదిగను నున్నదానిని స్త్రీవృక్షముగను తెలిసికొనవలయును. కొడిసెపాల సుకుమారులకుకూడ బాధను కలిగింపదు. రక్తపిత్తము కఫము హృద్రోగము జ్వరము వాతరక్తము విసర్పము మొదలగువానియందు ప్రశస్తముగ నుండును. స్త్రీపురుష వృక్షములయొక్క పండి ఎండినకాయలను సకాలమునందు గ్రహింపవలయును. వానిని పిడికిలికి వచ్చినంతగ గ్రహించి నలియకొట్టి అతిమధురము ఎర్రదేవకాంచనము మొదలగువానిలో దేనియొక్క కషాయముతోనైనను భావనచేసి కలిపి ఒకరాత్రియుంచి మరునాడు ఒడియకట్టి అందు సైంధవలవణమును తేనెను కలిపి త్రాగినచో వమనములు సరిగ నగుటచే పిత్తమును శ్లేష్మమును హరించును.

మూ॥ అష్టాహం పయసాఽఽర్కేణ తేషాం చూర్ణాని భావయేత్ ॥ జీవకస్య కషాయేణ తతః పాణితలం పిబేత్ । ఫలజీమూతకేక్ష్వాకుజీవన్తీనాం పృథక్ తథా॥ సర్షపాణాం మధూకానాం లవణస్యాథవాఽమ్బునా। కృశరేణాథవా యుక్తం విదధ్యాద్వమనం భిషక్ ॥ 1॥

ఆ॥ కొడిసెగింజలయొక్క, చూర్ణమును జిల్లేడుపాలతో ఎనిమిదిరోజులు భావనచేసి జీవకము మ్రంగకాయలు దేవదాలి చేదుసొర జీవంత వీనిలో దేనియొక్క కషాయముతోనైనను కర్షపరిమితిగ సేవింపవలయును. లేక ఆవాలు అతిమధురము ఉప్పు వీనిలో దేనితోనైననుకూడిన జలముతో సేవింపవలయును. లేక పులగముతో కలిపి సేవింపవలయును. వమనములు శ్రేష్ఠముగ నగును.

## అధ్యాయసంగ్రహము.

మూ॥ కషాయైర్నవ చూర్ణైశ్చ షడుక్తాః సలిలైస్త్రయః । ఏకశ్చ కృశరాయాం స్యాద్యోగాస్తేఽష్టాదశ స్మృతాః ॥12॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతి సంస్కృతే కల్పస్థానే వత్స

కకల్పో నామ పఞ్చమోఽధ్యాయః ॥

అ॥ ఈవత్సక కల్పాధ్యాయమునందు కషాయములతో తొమ్మిదియు, చూర్ణములతో ఆయిదును, ఉదకముతో మూడును, ఫలకముతో ఒకటియు, ఇట్లు పదునెనిమిది యోగములు చెప్పబడినవి.

ఇవ్విధంబున శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు వత్సకకల్ప మనెడు పంచమాధ్యాయము సమాప్తము.

---

# షష్ఠాధ్యాయము.

---

మూ॥ అథాతః కృతవేధకల్పం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట కృతవేధనకల్పమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

## కృతవేధన కల్పములు.

మూ॥ కృతవేధన నామాని కల్పం చాస్య నిబోధత । క్ష్వేడః కోశాతకీ చోక్తం మృదఙ్గఫలమేవ చ ॥ అత్యన్త కటుతీక్ష్ణోష్ణం గాఢే ష్విష్టం గదేషు చ। కుష్ఠపాణ్డ్వామయప్లీహశోఫగుల్మగరాదిషు॥ క్షీరాదికుసుమాదీనాం సురా చైతేషు పూర్వవత్। సుశుష్కాణాం తు బీజానామేకం ద్వే వా యథాబలమ్ ॥ కషాయైర్మధుకాదీనాం నవభిః ఫలవత్పిబేత్। క్వాథయిత్వా ఫలం తస్య పూత్వా లేహంనిధాపయేత్ ॥ కృతవేధన కల్కాంశం ఫలార్ధార్ధాంశ సంయుతమ్। పృథక్ చారగ్వధాదీనాం త్రయోదశభిరాసుతమ్ ॥ శాల్మలీ మూలవృన్తానాం పిచ్ఛాభిర్దశభిస్తథా। వర్తిక్రియాః షట్ ఫలవత్ ఫలాదీనాం ఘృతం తథా ॥8॥

అ॥ చినచేదుబీరయొక్క పర్యాయపదములను కల్పములను చెప్పుచున్నాము. క్ష్వేడ, కోశాతకి, మృదంగఫల అనునివి చినచేదుబీరకు పర్యాయపదములుగ నుండును. ఇది అధికములైన కటురసమును తీక్ష్ణగుణమును ఉష్ణవీర్యమును కలదిగ నుండును. గంభీరములైన వ్యాధులయం దియ్యవలయును. మరియు కుష్ఠము పాండువ్యాధి ప్లీహవ్యాధి శోఫ గుల్మము గరవ్యాధులు మొదలగువానియం దియ్యవలయును. దీనియొక్క పుష్పాదులను దేవదాళికి చెప్పబడిన విధముననే పాలయొక్క సంబంధముతోడను సురయనెడి మద్యముయొక్క తేటతోడను ఇయ్యవలయును. బాగుగ నెండిన దీనిగింజలను ఒకటిగాని రెండింటినిగాని బలానుసారముగ గాని గ్రహించి క్రమంగ

కాయలకు చెప్పబడిన విధమున అతిమధురము మొదలగు తొమ్మిదింటిలో దేనియొక్క కషాయముతోనైనను ఇయ్యవలయును. చినచేదుబీర కాయలను కషాయము కాచి ఒడకట్టి యందు చినచేదుబీరకల్కమును ఒక భాగముగను మంగ కాయకల్కమును నాల్గవంతు భాగముగను కలిపి లేహమును తయారుచేయవలయును. రేల మొదలగు పదమూడు ద్రవ్యములలో వేనియొక్క కషాయముతోనైనను దీనిని కలిపి ఇయ్యవలయును. విమానస్థానమునందు చెప్పబడిన బూరుగ మొదలగు పదిద్రవ్యములలో దేనియొక్క తొడిమలనుండియైనను పుటపాకవిధి ననుసరించి రసముతీసి యందు చినచేదుబీర చూర్ణమును కలిపి ఇయ్యవలయును. మంగ కాయలకు చెప్పబడిన విధమున దీనిని కూడ ఆరువిధములగు వర్తులను చేసి ఉపయోగింపవలయును. చిన్నచేదుబీరతో కాచబడినట్టి పాలనుండి జనించిన ఘృతమును మంగ కాయ మొదలగువానితో తయారుచేసి ఇయ్యవలయును.

మూ॥ కోశాతకాని పఞ్చాశత్కోవిదారరసే పచేత్ । తం కషాయం ఫలాదీనాం కల్కైర్లేహం పునః పచేత్ ॥ క్ష్వేడస్య తత్ర భాగః స్యాచ్ఛేషాణామర్ధభాగికాని చ । కషాయైః కోవిదారాద్యైరేవం పక్త్వా పిబేత్పృథక్ ॥ కషాయేషు ఫలాదీనా మనూపం పిశితం పృథక్ । కోశాతక్యాః సమం పక్త్వా రసం సలవణం పిబేత్ ॥ ఫలాదిపిప్పలీతుల్యం తద్వదానూపసరసం పిబేత్ । క్ష్వేడక్వాథం పిబేత్సిద్ధం మిశ్రమిక్షురసేన చ ॥13॥

అ॥ ఏబది చిన్నచేదుబీరకాయలను ఎఱ్ఱదేవకాంచనరసమునందు కాచి ఆ కషాయమునందు చినచేదుబీరకల్కమును ఒక భాగముగను మంగ కాయ మొదలగువానియొక్క కల్కమును ఒక్కొక్క భాగముగను కలిపి లేహమును తయారుచేయవలయును. ఇట్లే ఎఱ్ఱదేవకాంచనము మొదలగు ఎనిమిదింటిలో దేనితోనైనను లేహమును తయారుచేసి ఉపయోగింపవలయును. మంగ కాయ మొదలగు ఆరింటిలో దేనియొక్క కషాయమునందైనను చినచేదుబీరను దానితో సమానముగు ఆనూపమాంసమును చేర్చి కాచి ఒడకట్టి యందు సైంధవలవణమును కలిపి ఇయ్యవలయును. మరియు మంగ కాయ మొదలగువానియొక్క గింజలను ఆనూపమాంసమును సమభాగములుగ గ్రహించి చినచేదుబీర రసమునందు కాచి పైవిధముననే ఇయ్యవలయును. చినచేదుబీరను కషాయము కాచి యందు చెరుకురసమును కలిపి ఇయ్యవలయును.

## అధ్యాయ సంగ్రహము.

మూ॥ క్షీరే ద్వౌ ద్వౌ సురా చైకా క్వాథా ద్వావింశతిస్తథా । దశ పిచ్ఛా ఘృతం చైకం షట్ చ వర్తిక్రియాః శుభాః ॥ లేహాఽష్టౌ సప్త మాంసే చ యోగా ఇక్షురసేఽపరః । కృతవేధనకల్పేఽస్మిన్ షష్టిర్యోగాః ప్రకీర్తితాః ॥14॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే కల్పస్థానే కృతవేధనకల్పో నామ షష్ఠోఽధ్యాయః ॥

అ॥ ఈ కృతవేధన కల్పాధ్యాయమునందు పాలతో నాలుగును, సురామండముతో ఒకటియు, కషాయములతో ఇరువదిరెండును, పిచ్ఛా (పుటపాకరస) రూపమున పదియు, ఘృతరూపమున ఒకటియు, వర్తులుగ ఆరును, లేహరూపమున ఎనిమిదియు, మాంసములతో ఏడును, చెరుకురసముతో ఒకటియు ఇట్లు అరువది యోగములు చెప్పబడినవి.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన చరకదీపిక యనెడి
చరకసంహితా వ్యాఖ్యానమునందు కృతవేధనకల్ప మనెడు
షష్ఠాధ్యాయము సమాప్తము.

—0—

# సప్తమాధ్యాయము.

మూ॥ అథాతః శ్యామాత్రివృత్కల్పం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట శ్యామాత్రివృత్కల్పమును చెప్పుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

### తెగడయొక్క పర్యాయపదములు - గుణములు.

మూ॥ విరేచనే త్రివృన్మూలం శ్రేష్ఠమాహుర్మనీషిణః। తస్యాః సంజ్ఞా గుణాః కర్మ భేదః కల్పశ్చ వక్ష్యతే ॥ త్రిభణ్డీ త్రివృతా చైవ సురణ్డీ కోటరా తథా। సర్వానుభూతిః సువహా శబ్దైః పర్యాయ వాచకైః ॥ కషాయా మధురా రూక్షా విపాకే కటుకా చ సా। కఫపిత్తప్రశమనీ రౌక్ష్యాచ్చానిల కోపనీ॥ సేదానీ మాషధైర్యుక్తా వాతపిత్తకఫాపహైః। కల్పే వై శ్రేష్ఠ్యమాసాద్య సర్వరోగహరా భవేత్ ॥ మూలం తు ద్వివిధం తస్యాః శ్యామం చారుణమేవ చ। తయోర్ముఖ్యతరం విద్ధి మూలం యదరుణప్రభమ్ ॥ సుకుమారే శిశౌ వృద్ధే మృదుకోష్ఠే చ తచ్ఛుభమ్। మోహాయే దాశుకారిత్వాచ్ఛ్యామా కణ్ఠం క్షిణోత్యపి ॥ తైక్ష్ణ్యాత్కర్షతి హృత్కణ్ఠమాశు దోషం హరత్యపి। శస్యతే బహుదోషాణాం క్రూరకోష్ఠాశ్చ యే నరాః ॥9॥

అ॥ విరేచనములను చేయుటలో తెగడవేళ్ళు శ్రేష్ఠమైనవిగ నుండును. వాని యొక్క పర్యాయపదములను గుణములను కృత్యములను భేదములను కల్పములను

చెప్పుచున్నాము. త్రిభండి, త్రివృత, సురండి, కోటర, సర్వానుభూతి, సువహ అను నివి తెగడకు పర్యాయపదములుగ నుండును. కషాయరసము మధురరసము రూక్షగుణము కటువిపాకము ఇవి కలదిగ నుండును. కఫపిత్తములను నశింపచేయును. రూక్షగుణముకలదగుచే వాతమును ప్రకోపింపచేయును. వాతపిత్తకఫనాశకములగు ఆయా ద్రవ్యములతో కూడి విశేషగుణములనొందినదై సమస్తవ్యాధులను హరింపచేయును. నల్లనివి ఎఱ్ఱనివి అని దీనివేళ్లు రెండువిధములుగ నుండును. వానిలో ఎఱ్ఱనివి శ్రేష్ఠమైనవిగ నుండును. కావున వానిని సుకుమారులు బాలురు వృద్ధులు మృదుకోష్ఠముకల వారు వీరికిచ్చుటకు యోగ్యమైనవిగనుండును. నల్లనివేళ్ళు తీవ్రగుణముకలవగుటవలన మోహమును కలిగించును. కంఠమును క్షీణింపచేయును. తీక్ష్ణగుణము కలవగుటవలన హృదయమును కంఠమును చెరచును. మరియు వెంటనే దోషమును హరింపచేయును. అధికదోషముకలవారలకును క్రూరకోష్ఠముకలవారలకును శ్రేష్ఠమైనవిగ నుండును.

## తెగడవేళ్లను గ్రహించువిధము.

మూ॥ గుణవత్యాం తయోర్భూమౌ జాతం మూలం సముద్ధరేత్ । ఉపోష్య ప్రయతః శుక్లే శుక్లవాసాః సమాహితః ॥ గమ్భీరానుగతం శ్లక్ష్ణమతిర్యగ్విస్సృతం చ యత్ । తద్విపాట్యోద్ధరేద్గర్భం త్వచం శుష్కాం నిధాపయేత్ ॥౹॥

అ॥ శుక్లపక్షమునందు ఉపవాసముచు చేసి నియమముకలవాడై తెల్లనిబట్టలను ధరించి సావధానచిత్తుడై, గుణవత్తరమైన భూమియందు జనించినట్టియు లోతుగ వ్యాపించినట్టియు కోమలములైనట్టియు అడ్డముగ ప్రసరింపక క్రిందకు ప్రసరించినట్టియు తెగడవేళ్ళను గ్రహించి చీల్చి లోపలనున్న కాష్ఠము(పుడక)లను తీసి వేసిచర్మమును (పట్టను) ఎండించి జాగ్రతచేయవలయును.

## త్రివృత్కల్పములు.

మూ॥ స్నిగ్ధస్విన్నో విరేచ్యస్తు పేయామాత్రోషితః సుఖమ్ । అక్షమాత్రం తయోః పిష్టం వినీయామ్లేన నా పిబేత్ ॥ గోఽవ్యజామహిషీమూత్రసౌవీరకతుషోదకైః । ప్రసన్నయా త్రిఫలయా శృతయా చ పృథక్ పిబేత్ ॥ ఏకైకం సైన్ధవాదీనాం ద్వాదశానాం సనాగరమ్। త్రివృద్ద్విగుణసంయుక్తం చూర్ణముష్ణామ్బునా పిబేత్ ॥14॥

అ॥ స్నేహస్వేదములనాచరించి పూర్వదినమున జావనుమాత్రమే పుచ్చుకొని ఈ తెగడకల్పములను పుచ్చుకొనవలయును. తెగడవేళ్ళపట్టను కర్షపరిమితిగ గ్రహించి ముద్దగనూరి కాంజికము గోమూత్రము గొఱ్ఱెమూత్రము మేకమూత్రము గేదెమూత్రము సౌవీరకము తుషోదకము సురామద్యముయొక్క తేట త్రిఫలాకషాయము వీనిలో దేనితోనైనను కలిపి పుచ్చుకొనవలయును. రోగభిషగ్జితీయాధ్యాయమునందు లవణస్కంధములో చెప్పబడిన సైంధవలవణము మొదలగు పండ్రెండింటిలో దేనియొక్క

చూర్ణమునైనను ఒకభాగముగను శుంఠిచూర్ణమును ఒకభాగముగను తెగడచూర్ణమును రెండు భాగములుగను గ్రహించి వేడినీటితో పుచ్చుకొనవలయును.

మూ॥ పిప్పలీ పిప్పలీమూలం మరిచం గజపిప్పలీ। సరలః కిలిమం హిఙ్గు భార్గీ తేజోవతీ తథా॥ ముస్తం హైమవతీ పథ్యా చిత్రకో రజనీ వచా। స్వర్ణక్షీర్యజమోదా చ శృఙ్గవేరం చ తైః పృథక్॥ ఏకై కార్ధాంశసంయుక్తం పిబేద్గోమూత్రసంయుతమ్। మధూకార్ధాంశసంయుక్తం శర్కరామ్బుయుతంపిబేత్॥ జీవకర్షభకౌ మేదాం శ్రావణీం కర్కటాహ్వయమ్। ముద్గమాషాఖ్య పర్ణ్యౌ చ మహతీం శ్రావణీం తథా॥ కాకోలీం క్షీరకాకోలీ మిన్ద్రాఖ్యం ఛిన్నరుహాం తథా। క్షీరశుక్లాం పయస్యాం చ యష్ట్యాహ్వాం విధినా పిబేత్, వాతపిత్తహితా న్యేతాన్యన్యాని తు కఫానిలే॥19॥

అ॥ పిప్పళ్ళు మోడి మిరియాలు గజపిప్పళ్ళు సరళదేవదారు దేవదారు ఇంగువ గంటుభారంగి చవ్యము నాగరముస్తలు తెల్లవస కరక్కాయ చిత్రమూలము పసుపు వస స్వర్ణక్షీరి ఓమము శుంఠి వీనిలో దేనియొక్క చూర్ణమునైనను అర్ధభాగముగను తెగడచూర్ణమును ఒకభాగముగను గ్రహించి గోమూత్రముతో పుచ్చుకొనవలయును. అతిమధుర చూర్ణమును అర్ధభాగముగను తెగడచూర్ణమును ఒకభాగముగను గ్రహించి పంచదార నీళ్ళు వీనితో కలిపి పుచ్చుకొనవలయును. జీవకము ఋషభకము మేద బోడతరము కర్కాటకశృంగి ముద్గపర్ణి మాషపర్ణి పెద్దబోడతరము కాకోలి క్షీరకాకోలి ఏటిపుచ్చ తిప్పతీగ నేలగుమ్మడి పాలనేలగుమ్మడి అతిమధురము వీనిలో దేనితోనైనను తెగడను విధిప్రకారముగ పుచ్చుకొనవలయును. ఈయోగములు వాతపిత్తములయందును, ఇతరయోగములు కఫవాతములయందును హితకరములుగ నుండును.

మూ॥ క్షీరమాంసేక్షు కాశ్మర్య ద్రాక్షాపీలురసైః పృథక్। సర్పిషా వా తయోశ్చూర్ణ మభయార్ధాంశికం పిబేత్॥20॥

అ॥ సగము పరిమితికల కరక్కాయ చూర్ణముతో కూడిన తెగడ చూర్ణమును, పాలు మాంసరసము చెరుకురసము పెగ్గుమ్ముడు రసము ద్రాక్షపండ్లరసము గోలుగు పండ్లరసము నెయ్యి వీనిలో దేనియందైనను కలిపి పుచ్చుకొనవలయును.

మూ॥ లిహ్యాద్వా మధుసర్పిర్భ్యాం సంయుక్తం ససితోపలమ్॥ అజగన్ధా తుగాక్షీరీ విదారీ శర్కరా త్రివృత్। చూర్ణితం క్షౌద్రసర్పిర్భ్యాం లీఢ్వా సాధువిరిచ్యతే॥ సన్నిపాతజ్వరస్తమ్భదాహతృష్ణార్దితో నరః। శ్యామాత్రివృత్కషాయేణ కల్కేన చ సశర్కరమ్॥ సాధయే ద్విధివల్లేహం లిహ్యాత్పాణితలం తతః। నక్షౌద్రాం శర్కరాం పక్త్వా కుర్యాన్మ్రద్భాజనేన వే॥ క్షిపేచ్ఛీతే త్రివృచ్చూర్ణం త్వక్పత్ర మరిచైః

సహా। మాత్రయా లేహయేదేతదీశ్వరాణాం విరేచనమ్॥కుడవాంశ్చాన్ రసా నత్ఖుద్రాక్షాపీలుపరూషకాన్ । సితోపలాపలం క్షౌద్రాత్కుడ వార్ధం చ సాధయేత్ ॥ తం లేహం యోజయేచ్ఛీతం త్రివృచ్చూర్ణేన శాస్త్రవిత్ । ఏతదుత్పన్నపిత్తానామీశ్వరాణాం విరేచనమ్॥27॥

అ॥ పటిక బెల్లపు చూర్ణముతో కూడిన తెగడచూర్ణమును తేనె నెయ్యి వీనితో కలిపి పుచ్చుకొనవలయును. అజామోదము వెదురుప్పు నేలగుమ్మడి పంచదార తెగడ వీనిని చూర్ణించి తేనె నెయ్యి వీనిలో కలిపి పుచ్చుకొనినచో విరేచనములు బాగుగ నగును. సన్నిపాతజ్వరము శరీర స్తంభము తాపము దప్పిక ఇవి నశించును. తెగడ కషాయము తెగడ చూర్ణము పంచదార వీనితో విధ్రప్రకారముగ లేహమును తయారుచేసి కర్ష పరిమితిగ పుచ్చుకొనవలయును. తేనెను పంచదారను గ్రహించి కాచి క్రొత్తకుండలో పోసి చల్లారినపిదప అందు తెగడ చూర్ణమును, దాసెనచెక్క ఆకపత్రి మిరియాలు వీనియొక్క చూర్ణమును కలిపి సుకుమారులకు తగుపరిమితిగ నియ్యవలయును. చెరుకు ద్రాక్షపండ్లు గొలుగుపండ్లు చిట్రీత వీనియొక్క రసములను నాలుగేసి పలములుగను, పటికబెల్లమును, ఒక పలముగను, తేనెను రెండు పలములుగను గ్రహించి పాకమునొందించి చల్లారినపిదప తెగడచూర్ణమును కలిపి అధికమైన పిత్తముకల సుకుమారులకు ఇయ్యవలయును.

మూ॥ శర్కరారామోదకాన్ వర్తిర్గులికామాంసపూపకాన్।
అనేన విధినా కుర్యాత్పైత్తికానాం విరేచనమ్ ॥28॥

అ॥ పంచదారను, పూర్వమునందు చెప్పబడిన చెరుకు మొదలగువానియొక్క రసములను, తెగడ చూర్ణమును గ్రహించి మోదకములను, వర్తులను, గులికలను,మాంసపూపములను తయారుచేసి పిత్తాధిక్యముకలవారలకు విరేచనములనిమిత్త మియ్యవలయును.

మూ॥ పిప్పలీం నాగరం క్షారం శ్యామాత్రివృతయా సహ । లేహయేన్మధునా సార్ధం శ్లేష్మలానాం విరేచనమ్ ॥ మాతులుఙ్గాభయాధాత్రీశ్రీపర్ణీకోలదాడిమాత్ । సుమృష్టాన్ సర్వసాంస్త్రైలే సాధయేత్తత్ర చావపేత్ ॥ సహకారాత్కపిత్థాచ్చ మధ్యమమ్లం చ యత్ఫలమ్ । పూర్వవద్బహలీభూతే త్రివృచ్చూర్ణం సమావపేత్ ॥ త్వక్పత్రకేశరైలానాం చూర్ణం మధు చ మాత్రయా । లేహోఽయం కఫపూర్ణానామీశ్వరాణాం విరేచనమ్ ॥29॥

అ॥ పిప్పళ్ళు శుంఠి యవక్షారము నల్లతెగడ వీనియొక్క చూర్ణమును తేనెతో కఫాధిక్యము కలవారలకు ఇయ్యవలయును. మాదీఫలము కరక్కాయలు ఉసిరికపండ్లు చల్లగుమ్మడుపండ్లు రేగుపండ్లు దానిమ్మపండ్లు వీనియొక్క రసములను

పంచదారను కలిపి పాకమునొందించి యందు తైలమును తెగడ చూర్ణమును కలుపవలయును. మామిడి పండ్లరసము వెలగపండుగుజ్జు పుల్లని ఇట్టి ఇతరపండ్లరసములు పంచదార వీనిని గ్రహించి పాకమునొందించి యందు తెగడ చూర్ణమును, దాసెన చెక్క ఆకుపత్రి నాగకేసరములు ఏలక్కాయలు వీనియొక్క చూర్ణమును, తేనెను కలుపవలయును. ఈలేహమును కఫాధిక్యముకల సుకుమారులకు ఇయ్యవలయును.

మూ॥ పానకాని రసాన్ యూషాన్ మోదకాన్ రాగషాడ వాన్ । అనేన విధినా కుర్యాద్విరేకార్థం కఫాధికే ॥33॥

అ॥ పూర్వవిధానమునుసరించి తెగడ చూర్ణముతో పానకములను మాంసరసముల ను యూషములను మోదకములను రాగషాడవములను తయారుచేసి కఫాధిక్యముకల వారలకు ఇయ్యవలయును.

మూ॥ భృఙ్గైలాభ్యాం సమా నీలీ తైస్త్రివృత్తైశ్చ శర్కరా । చూర్ణం ఫలరసక్షౌద్రశక్తుభిస్తర్పణం పిబేత్ ॥ వాతపిత్తకఫోత్థేషు రోగేష్వల్పానలేషు చ ॥ నరేషు సుకుమారేషు నిరపాయం విరేచనమ్ ॥3 ॥

అ॥ దాసెనచెక్క ఏలకులు వీనిని ఒక్కొక్క భాగమును, నీలిని రెండుభాగములుగను, తెగడను నాలుగు భాగములుగను, పంచదారను ఎనిమిదిభాగములుగను గ్రహించి చూర్ణముచేసి దానిమ్మపండ్లరసము తేనె సక్తుపిండి వీనితో తర్పణముగ వాతపిత్తకఫవ్యాధులుకలవారలకు మందాగ్ని కలవారలకును సుకుమారులకును ఇచ్చినచో బాగుగ విరేచనములగును.

మూ॥ శర్కరా త్రిఫలా శ్యామా త్రివృన్మాగధికా మధు । మోదకః సన్నిపాతోర్ధ్వరక్తపిత్తజ్వరాపహః ॥36॥

అ॥ పంచదార త్రిఫలములు నల్లతెగడ తెల్లతెగడ పిప్పళ్ళు తేనె వీనితో మోదకములను తయారుచేసి సన్నిపాతములు ఊర్ధ్వగరక్తపిత్తము జ్వరము వీని యందు సేవింపవలయును.

మూ॥ త్రివృచ్ఛ్యామా తాస్త్రిస్త్రిస్త్రిశ్చ త్రిఫలాత్వచః। విడఙ్గ క్షారపిప్పల్యః శాణాస్త్రిశ్చ చూర్ణితాః ॥ లిహ్యాత్సర్పిర్మధుభ్యాం చ మోదకం వా గుడేన చ। భక్షయేన్నిష్పరీహార మేతచ్ఛోధనముత్తమమ్॥ గుల్మం ప్లీహోదరం శ్వాసం హలీమకమరోచకమ్। కఫవాతకృతాంశ్చాన్యాన్ వ్యాధీనేతద్వ్యపోహతి ॥39॥

అ॥ తెగడను మూడుశాణములుగను, త్రిఫలములను మూడుశాణములుగను, వాయువిడంగములు యవక్షారము పిప్పళ్ళు వీనిని మూడుశాణములుగను గ్రహించి చూర్ణించి తేనె నెయ్యి వీనితో కలిపి పుచ్చుకొనవలయును. లేక బెల్లముతో కలిపి

మోదకములను చేసి పుచ్చుకొనవలయును. వికృతినికలిగింపనట్టియు శ్రేష్ఠమైనట్టియు విరేచనౌషధముగ నుండును. గుల్మము ప్లీహోదరము శ్వాస హలీమకము అరోచకము కఫముచేగాని వాతముచేగాని కలిగిన ఇట్టి ఇతరవ్యాధులు వీనిని నశింపజేయును.

మూ॥ విడఙ్గపిప్పలీమూలత్రిఫలాధాన్య చిత్రకాన్। మరిచేన్ద్రయవాజాజీపిప్పలీహస్తిపిప్పలీః ॥ లవణాన్యజమోదా చ చూర్ణితం కార్షికం పృథక్। తిలత్రైలత్రివృచ్చూర్ణభాగా చాష్టపలోన్మితా॥ ధాత్రీఫలరసప్రస్థాంస్త్రీన్ గుడార్ధతులాం తథా। పక్త్వా మృదగ్నినా ఖాదేద్బదరోదుమ్బరోపమాన్॥ గుడాన్ కృత్వా, న చాస్య స్యాద్విహారాహారయన్త్రణా। మన్దాగ్నిత్వం జ్వరం మూర్ఛాం మూత్రకృచ్ఛ్రమరోచకమ్॥ అస్వప్నం గాత్రశూలం చ కాసం శ్వాసం భ్రమం క్షయమ్। కుష్ఠార్శః కామలామోహగుల్మోదరభగన్దరమ్॥ గ్రహణీం పాణ్డురోగాంశ్చ హన్యుః పుంసవనాశ్చ తే। కల్యాణకా ఇతి ఖ్యాతాః సర్వేష్వృతుషు యౌగికాః॥ 45॥

అ॥ వాయువిడంగములు త్రిఫలములు ధనియాలు చిత్రమూలము మిరియాలు కొడిసెపాలవిత్తులు జీలకర్ర పిప్పళ్ళు గజపిప్పళ్లు పంచలవణములు అజామోదము వీనిని ఒక్కొక్కకర్షముగను, నువ్వులనూనె తెగడ చూర్ణము వీనిని ఎనిమిదేసిపలములుగను, ఉశిరికపండ్లరసమును మూడుప్రస్థములుగను, బెల్లమును ఏబదిపలములుగను గ్రహించి చిన్నమంటతో వండి రేగుకాయలంతగాని మేడికాయలంతగాని మోదకములను చేసి ఆహారవిహారములయందు నియమము అక్కరలేకుండగనే పుచ్చుకొనవలయును. అగ్నిమాంద్యము జ్వరము మూర్ఛ మూత్రకృచ్ఛ్రము అరోచకము నిద్రపట్టకుండుట అవయవశూల కాసన శ్వాస భ్రమ క్షయ కుష్ఠము అర్శస్సు కామిర్లు మేహవ్యాధులు గుల్మము ఉదరవ్యాధులు భగందరము గ్రహణీవ్యాధి పాండురోగము వీనిని నశింపజేయును. పురుషసంతానమును కలిగించును. ఈకల్యాణక మోదకములను అన్ని ఋతువులయందును ఉపయోగింపవచ్చును.

మూ॥ వ్యోషత్వక్పత్రముస్తైలావిడఙ్గామలకాభయాః । సమభాగాభిమర్దద్వ్యాద్విగుణం చ మసూరకమ్ ॥ త్రివృతోఽష్టగుణం భాగం శర్కరాయాశ్చ షడ్గుణమ్ । చూర్ణితం గుడికాః కృత్వా క్షౌద్రేణ పలసంమితాః ॥ భక్షయేత్కల్యముత్థాయ శీతం చాను పిబేజ్జలమ్। మూత్రకృచ్ఛ్రే జ్వరే వమ్యాం కాసే శ్వాసే భ్రమే క్షమే । తాపే పాణ్డ్వామయేఽల్పేఽగ్నౌ శస్తా నిర్వ్యన్త్రణాశినః । యోగః సర్వవిషాణాం చ మతః శ్రేష్ఠో విరేచనే॥ మూత్రజానాం చ రోగాణాం విధిజ్ఞై

నావచారితః। నాశయేన్మూత్రజాన్ రోగాన్ కృష్ణాత్రేయేణ భాషితః॥

అ॥ త్రికటుకములు దాసెనచెక్క ఆకుపత్రి తుంగగడ్డలు ఏలకులు వాయువిడంగములు ఉశిరికకాయలు కరక్కాయలు వీనిని సమభాగములుగను, దంతిని రెండురెట్లుగను, తెగడను ఎనిమిదిరెట్లుగను, పంచదారను ఆరురెట్లుగను గ్రహించి చూర్ణించి తేనెతో పలపరిమితిగల మోదకములను చేయవలయును. ప్రాతఃకాలమునందు సేవించి చన్నీటిని త్రాగవలయును. మూత్రకృచ్ఛ్రము జ్వరము వాంతి కాస శ్వాస భ్రమ క్షయ తాపము పాండురోగము అగ్నిమాంద్యము వీనియందు ఆహారనియమము లేకుండగనే సేవింపవచ్చును. సమస్తమగు విషకారములయందును విరేచనము నిమిత్తము శ్రేష్ఠములుగ నుండును. విధిప్రకారముగ నుపయోగించినచో సమస్తమగు మూత్రజవ్యాధులను నశింపజేయును. కృష్ణాత్రేయునిచే చెప్పబడినది.

మూ॥ త్రివృత్పలం ద్విప్రసృతిం పథ్యా ధాన్యోరుబూకయోః। ద్రాక్షాధాత్ర్యురుబూకానాం ప్రసృతౌ వా త్రివృత్పలమ్। దశ తాన్మోదకాన్ కుర్యాదీశ్వరాణాం విరేచనమ్ ॥5॥

అ॥ ఒక పలము తెగడ నాలుగుపలముల కరక్కాయలు రెండుపలముల ధనియాలు రెండుపలముల ఆముదపువేళ్ళు వీనినిగాని ద్రాక్షపండ్లు ఉశిరికకాయలు ఆముదపు వేళ్ళు ఇవి నాలుగుపలములు తెగడ ఒకపలము వీనినిగాని గ్రహించి పది మోదకములను చేసి సుకుమారులకు విరేచనము నిమిత్తము ఇయ్యవలయును.

మూ॥ త్రివృద్దైమవతీ శ్యామా నీలినీ హస్తిపిప్పలీ ॥ సమూలా పిప్పలీ ముస్తమజమోదా దురాలభా । కార్షికం నాగరపలం గుడస్య పలపంశతిమ్॥ చూర్ణితం మోదకాన్కుర్యాదుదుమ్బరఫలోపమాన్। హిఙ్గుసౌవర్చలవ్యోషయమానీబిడజీరకైః ॥ వచాజగన్ధాత్రిఫలాచవ్యచిత్రకధాన్యకైః॥ మోదకాన్ వేష్టయేచ్చూర్ణైస్తాన్ సతుమ్బురుదాడిమైః। త్రికవంక్షణహృద్వస్తికోష్ఠార్శః ప్లీహశూలినామ్। హిక్కాకాసారుచిశ్వాస కఫోదావర్తినాం శుభాః ॥56॥

అ॥ తెల్లతెగడ కరక్కాయ నల్లతెగడ నీలి గజపిప్పళ్ళు మోడి పిప్పళ్ళు తుంగగడ్డలు అజామోదము దూలగొండి వీనిని ఒక్కొక్క కర్షముగను శుంఠిని నాలుగు పలములుగను గ్రహించి చూర్ణించి ఇరువది పలముల బెల్లమును కలిపి మేడికాయల పరిమాణముగ మోదకములను చేయవలయును. ఇంగువ సౌవర్చలలవణము త్రికటుకములు కురాసానివాము బిడాలలవణము జీలకర్ర వస అజామోదము త్రిఫలములు చవ్యము చిత్రమూలము ధనియాలు తుంబురులు దానిమ్మ బెరళ్ళు వీని చూర్ణమును ఆ మోదకములమీద చల్లి సేవించినయెడల త్రికప్రదేశము గజ్జలు హృదయము వస్తిప్రదేశము కోష్ఠము అర్శస్సు ప్లీహ వీనియందలిశూలలను హరించును మరియు ఎక్కిళ్ళు

వస్తు అరుచి ఆయాసము కఫవ్యాధులు ఉదావర్తము వీనిని నశింపజేయును.

మూ॥ త్రివృతాం కౌటజం బీజం పిప్పలీం విశ్వభేషజమ్। క్షౌద్ర ద్రాక్షారసోపేతం వర్షాస్వేతద్విరేచనమ్ ॥ త్రివృద్దురాలభా ముస్తా శర్కరోదీచ్య చన్దనమ్॥ ద్రాక్షామ్బునా సయష్ట్యాహ్వం సాతలం జలదాత్యయే ॥ త్రివృతాం చిత్రకం పాఠా మజాజీం సరలం వచాం। స్వర్ణదుగ్ధీం చ హేమన్తే పిష్ట్వా తూష్ణామ్బునా పిబేత్ ॥ శర్కరా త్రివృతా తుల్యా గ్రీష్మకాలే విరేచనమ్ ॥ త్రివృతాం త్రాయతీం రాధాం సాతలాం కటురోహిణీమ్ ॥ స్వర్ణక్షీరీం చ సంచూర్ణ్య గోమూత్రే భావయేత్త్ర్యహమ్ । ఏష సర్వర్తుకో యోగః స్నిగ్ధానాం మలదోషహృత్॥ దురాలభా త్రివృచ్ఛ్యామా వత్సకం హస్తిపిప్పలీ। నిలినీ త్రిఫలాముస్తం కటుకా చ సుచూర్ణితమ్॥ సర్పిర్మాంసరసోష్ణామ్బుయుక్తం పాణితలం తతః। పిబేత్సుఖతమం హ్యేతద్రూక్షాణామపి శస్యతే ॥63॥

అ॥ తెగడ కొడిసెపాలవిత్తులు పిప్పళ్లు శుంఠి వీనిని తేనె ద్రాక్షపండ్లరసము వీనితో వర్షాకాలమునందు విరేచనము నిమిత్తమియ్యవలయును. తెగడ దూలగొండి తుంగగడ్డలు పంచదార వట్టివేళ్ళు చందనము అతిమధురము సంబరేణు వీనిని ద్రాక్షపండ్లరసముతో శరదృతువునం దియ్యవలయును. తెగడ చిత్రమూలము చిరుబొద్ది జీలకర్ర సరళదేవదారు వస స్వర్ణక్షీరి వీనిని నూరి వేడినీటితో హేమంతఋతువునందు పుచ్చుకొనవలయును. పంచదార తెగడ వీనిని సమభాగములుగ గ్రహించి గ్రీష్మఋతువునందు పుచ్చుకొనవలయును. తెగడ కలుద్రాసుగ ఉశిరిక సంబరేణు కటుకరోహిణి స్వర్ణక్షీరి వీనిని చూర్ణించి గోమూత్రమునందు మూడురోజులు భావనచేయవలయును. స్నిగ్ధుడుగ నున్నవానికి దీనిని సమస్తఋతువులయందును మలదోషము హరించు నిమిత్తమియ్యవలయును. దూలగొండి తెల్లతెగడ నల్లతెగడ కొడిశపాల విత్తులు గజపిప్పళ్ళు నీలి త్రిఫలములు తుంగగడ్డలు కటుకరోహిణి వీనిని చూర్ణించి ఘృతము మాంసరసము వేడినీళ్ళు వీనితో కర్షపరిమితిగ నిచ్చినయెడల సుఖముగ విరేచనము అగును. ఇది రూక్షశరీరము కలవారలకుగూడ హితకరముగ నుండును.

మూ॥ త్ర్యూషణం త్రిఫలా హిఙ్గు కార్షికం త్రివృతాపలమ్। సౌవర్చలార్ధకర్షం చ పలార్ధం చామ్లవేతసాత్ ॥ తచ్చూర్ణం శర్కరాతుల్యం మద్యేనామ్లేన వా పిబేత్ । గుల్మపార్శ్వార్తినుత్సిద్ధం జీర్ణే చాద్యాత్ప్రసాదనమ్ ॥64॥

అ॥ త్రికటుకములు త్రిఫలములు ఇంగువ వీనిని ఒక్కొక్క కర్షముగను, తెగడను ఒకపలముగను, సౌవర్చలవణము అర్ధకర్షముగను, పుల్లప్రబ్బలిని అర్ధపలముగను గ్రహించి చూర్ణించి ఆచూర్ణముతో సమానముగ పంచదారను కలిపి మద్యముతో

గాని పుల్లనిపండ్లరసముతోగాని పుచ్చుకొనినయెడల గుల్మమును, పార్శ్వశూలయును నశించును. ఈఔషధము జీర్ణమైనపిదప మాంసరసముతోగూడినఆహారము భుజింప వలయును.

మూ॥ సప్తలాం త్రిఫలాం దన్తీం త్రివృతాం వ్యోషసైన్ధవమ్। కృత్వా చూర్ణం తు సప్తాహం భావ్యమామలకీరసే। తద్యోజ్యం తర్పణే యూషే పిశితే రాగయుక్తిషు ॥66॥

అ॥ సంబరేణు త్రిఫలములు దంతి తెగడ త్రికటుకములు సైంధవలవణము వీనిని చూర్ణించి ఉశిరికపండ్లరసముతో ఏడురోజులు భావనచేసిదీనినితర్పణమునందు యూషమునందును మాంసరసమునందును రాగషాడవమునందును ఉపయోగింప వలయును.

మూ॥ తుల్యామ్లం త్రివృతాకల్కసిద్ధం గుల్మహరం ఘృతమ్॥ మూలం శ్యామాత్రివృతయోః పచేదామలకైః సహ। జలే తేన కషాయేణ పక్త్వా సర్పిః పిబేన్నరః॥ శ్యామాత్రివృత్కషాయేణ సిద్ధం సర్పిః పిబేత్తథా। సాధితం వా పయస్తాభ్యాం సుఖం తేన విరిచ్యతే॥[illegible]॥

అ॥ సమానపరిమితిగల పుల్లనిపండ్లరసముతోడను తెగడయొక్క కల్కముతోడను తయారుకాబడిన ఘృతము గుల్మమును హరింపజేయును. నల్లతెగడ తెల్లతెగడ వీనియొక్క వేళ్ళను ఉసిరికపండ్లతోగూడ జలమునందు కాచి ఆకషాయముతో ఘృతమును తయారుచేసి సేవింపవలయును. నల్లతెగడ తెల్లతెగడవీనియొక్క కషాయముతో ఘృతమును తయారుచేసి పుచ్చుకొనవలయును. నల్లతెగడ తెల్లతెగడ వీనితో కాచబడిన పాలు సుఖముగ విరేచనములను చేయును.

మూ॥ త్రివృన్ముష్టీంస్తు సనఖానష్టౌ ద్రోణే జలే పచేత్। పాదశేషం కషాయం తం శీతం గుడతులాయుతమ్॥ స్నిగ్ధే స్థాప్యం ఘటే క్షౌద్రపిప్పలీఫలచిత్రకైః। ప్రలిప్తే విధినామాసం జాతం తన్మాత్రయా పిబేత్॥ గ్రహణీపాణ్డురోగఘ్నం గుల్మశ్వయథునాశనమ్। సురాం వా త్రివృతాయోగకిణ్వాం తత్క్వాథసంయుతామ్॥7[illegible]॥

అ॥ ఎనిమిది పిడికెళ్ళ తెగడను ఒకద్రోణముజలమునందు నాలుగవవంతు మిగులునట్లుకాచి చల్లారినపిదప ఆకషాయమునందు నూరుపలముల బెల్లమును కలిపి చమురుతో మాగినట్టియు తేనె పిప్పళ్ళు మంగకాయలు చిత్రమూలము వీనితో పూయబడినట్టియు కుండయందుంచి విధిప్రకారము ఒకమాసముంచి తయారైనపిదప తగుపరిమితిగ త్రాగినయెడల గ్రహణీవ్యాధి పాండురోగము గుల్మము శోఫ ఇవి నశించును. తెగడ కషాయముతోడను తెగడకల్కముతోడను కూడిన మద్యమును త్రాగవలయును.

మూ॥ యవైః శ్యామాత్రివృత్క్వాథస్విన్నైః కుల్మాషమమ్భసా। ఆసుతం షడహం పల్లే జాతం సౌవీరకం పిబేత్॥ భృష్టాన్ వా

సతుషాన్ క్షుణ్ణాన్యవాం స్త చ్చూర్ణసంయుతాన్ । ఆసుతానమ్భసాత ద్వత్పిబేజ్జాతం తుషోదకమ్ ॥74॥

అ॥ నల్లతెగడ తెల్లతెగడ వీనియొక్క కషాయముతో స్వేదనము చేయబడిన (ఉడికింపబడిన) యవలను మెత్తగనూరి నీటియందు కలిపి కుండలోబోసి సంధిబంధన ముచేసి ధాన్యపురాశియందుంచి ఆరురోజులైనపిదప తయారైన ఆసౌవీరకమును త్రాగవలయును. చేయింపబడినట్టియు పొట్టుతోకూడినట్టియు నలియగొట్టబడినట్టియు యవలను తెగడచూర్ణముతోగూడ నీటియందుకలిపి పూర్వమునందువలెనే చేసి తయారైన పిదప ఆ తుషోదకమును త్రాగవలయును.

మూ॥ తథా మదనకల్పోక్తాన్ ఖాణ్డవాదీన్ పృథగ్దశ । త్రివృచ్చూర్ణేన సంయోజ్య విరేకార్థం ప్రయోజయేత్ ॥75॥

అ॥ మదనకల్పమునందు జెప్పబడిన ఖాండవము మొదలగు పదింటిని తెగడ చూర్ణముతో తయారుచేసి విరేచనముల నిమిత్తము నుపయోగింపవలయును.

మూ॥ త్వక్కేశరామ్రాతక దాడిమైలాసితోపలామాక్షికమాతులుఙ్గైః। మద్యైస్తథాఽన్యైశ్చ మనోనుకూలై ర్యుక్తాని దేయాని విరేచనాని ॥ శీతామ్బునా పీతవతశ్చ తస్య సిఞ్చేన్ముఖం ఛర్దివిఘాతహేతోః। హృద్యాంశ్చ మృత్పుష్ప ఫలప్రవాలా నన్యాంశ్చ దద్యాదుపజిఘ్రణార్థమ్ ॥

అ॥ విరేచనౌషధముల పుచ్చుకొనునపుడు వాంతియైనయెడల దాసెనచెక్క నాగకేసరములు రాచమామిడి దానిమ్మ ఏలకులు పటికబెల్లము తేనె మాదీఫలము మద్యములు మనస్సున కిష్టమైన ఇట్టి ఇతరములు వీనితో నియ్యవలయును. చన్నీటితో ముఖముమీద చల్లవలయును. మనస్సున కిష్టములైన మన్ను పుష్పములు ఫలములు చిగుళ్ళు వీనిని ఇట్టి ఇతరములను ఆఘ్రాణింప జేయవలయును.

## అధ్యాయ సంగ్రహము.

మూ॥ ఏకోఽమ్లాదిభిరష్టౌ చ దశద్వౌ సైన్ధవాదిభిః । మూత్రేఽష్టాదశ యష్ట్యా ద్వౌ జీవకాద్యా చతుర్దశ ॥ క్షీరాద్యాః సప్త లేహేఽష్టౌ చత్వారః సితయాఽపిచ । పానకాదిషు పఞ్చైవ షడ్ఋతౌ పఞ్చ మోదకాః ॥ చత్వారశ్చ ఘృతక్షీరే ద్వౌ చూర్ణే తర్పణే తథా। ద్వౌ మద్యే కాఞ్జికే ద్వౌ చ దశాన్యే ఖాడవాదిషు॥ శ్యామాయాస్త్రివృతాయాశ్చ కల్పేఽస్మి న్సముదాహృతమ్ । శతం దశోత్తరం సిద్ధం యోగానాం పరమర్షిణా ॥81॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే కల్పస్థానే శ్యామాత్రివృత్కల్పో నామ సప్తమోఽధ్యాయః ॥

అ॥ ఈశ్యామాత్రివృత్కల్పాధ్యాయమునందు కాంజికము మొదలగువానితో తొమ్మిదియు, సైంధవలవణము మొదలగువానితో పండ్రెండును, గోమూత్రముతో పదునెనిమిదియు, అతిమధురముతో రెండును, జీవకము మొదలగువానితో పదునాలుగును, పాలు మొదలగువానితో ఏడును, లేహరూపమున ఎనిమిదియు, పంచదారతో నాలుగును, పానకము మొదలగువానిరూపమున అయిదును, ఋతువులననుసరించి ఆరును, మోదకరూపమున అయిదును, ఘృతరూపమున మూడును. పాలతో నొకటియు, తర్పణచూర్ణరూపమున రెండును, మద్యరూపమున రెండును, కాంజికరూపమున రెండును, ఖాండవాదులతో పదియు ఇట్లు నూటపదియోగములు చెప్పబడినవి.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు శ్యామాత్రివృత్కల్ప మనెడు సప్తమాధ్యాయము సమాప్తము.

—0—

# అష్టమాధ్యాయము.

మూ॥ అథాత శ్చతురఙ్గులకల్పం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట చతురంగులకల్పమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

## రేలయొక్క పర్యాయపదములు - గుణములు.

మూ॥ ఆరగ్వధో రాజవృక్షః శమ్పాక శ్చతురఙ్గులః । ప్రగ్రహః కృతమాలశ్చ కర్ణికారోఽవఘాతకః॥ జ్వరహృద్రోగవాతాసృగుదావర్తాదిరోగిషు। రాజవృక్షోఽధికం పథ్యో మృదుర్మధురశీతలః॥ బాలే వృద్ధే క్షతే క్షీణే సుకుమారే చ మానవే। యోజ్యో మృద్వనపాయిత్వా ద్విశేషా చ్చతురఙ్గులః ॥5॥

అ॥ ఆరగ్వధ, రాజవృక్ష, శంపాక, చతురంగుల, ప్రగ్రహ, కృతమాల, కర్ణికార, అవఘాతక అనునివి రేలకు పర్యాయపదములుగ నుండును. జ్వరము హృద్రోగము వాతరక్తము ఉదావర్తము మొదలగువ్యాధులయందు రేల మిక్కిలి హితకరమైనదిగ నుండును. మృదుగుణమును మధురరసము శీతవీర్యమును కలదిగనుండును. రేల మృదుగుణముకలదియు అపాయమునుచేయనిదియు అగుటవలన బాలురు వృద్ధు

లు ఉరఃక్షతముగలవారలు క్షీణించినవారలు సుకుమారులు వీరలకు విశేషించి ఇయ్యవలయును.

మూ॥ ఫలకాలే పరిణతం ఫలం తస్య హరేద్బుధః। తేషాం గుణవతాం జాతం సికతాసు నిధాపయేత్ ॥ సప్తరాత్రాత్సముద్ధృత్య శోషయేదాతపే భిషక్। తతో మజ్జాన ముద్ధృత్య శుచౌ భాణ్డే నిధాపయేత్ ॥7॥

అ॥ సకాలమునందుఫలించినట్టియు బాగుగపండినట్టియు శ్రేష్ఠములైనట్టియు రేలపండ్లను గ్రహించి ఇసుకయందుఏడు రోజు లుంచి ఎండయందెండించి వాని నుండి గుజ్జునుతీసి ఆగుజ్జును పరిశుభ్రమగు పాత్రయందు జాగ్రత్తచేయవలయును.

మూ॥ ద్రాక్షారసయుతో దేయో దాహోదావర్తపీడితే। చతుర్వర్షముఖే బాలే యావద్ద్వాదశవార్షికే ॥3॥

అ॥ రేలగుజ్జును ద్రాక్షపండ్లరసములోకలిపి నాలుగుసంవత్సరములు మొదలు పండ్రెండుసంవత్సరములవరకు వయస్సుగల బాలురకు తాపమును ఉదావర్తమును కరిగినపుడు ఈయవలయును.

మూ॥ చతురఙ్గులమజ్జస్తు ప్రసృతం వాఽక్షవాఽఞ్జలిమ్। సురామణ్డేన సంయుక్తమథవా కోలశీధునా॥ దధిమణ్డేన వా సమ్యగ్రసేనామలకస్య వా। కృత్వా శీతకషాయం తం పిబేత్సౌవీరకేణ వా॥ త్రివృతో వా కషాయేణ మజ్జకల్కంతథా పిబేత్। తథా బిల్వకషాయేణ లవణక్షౌద్రసంయుతమ్ ॥1.॥

అ॥ రేలగుజ్జును రెండుపలములుగ గాని నాలుగుపలములుగ గాని గ్రహించి సురామద్యముయొక్క తేటతోగాని రేగుపండ్లతో తయారుచేయబడినశీధువనెడిమద్యముతోగాని పెరుగుమీదితేటతోగాని ఉశిరికపండ్లరసముతోగాని ఈయవలయును. ఈగుజ్జుయొక్క శీతకషాయమును సౌవీరకమనెడి మద్యముతో నియ్యవలయును. తెగడకషాయమునందుగాని లొద్దుగ కషాయమునందుగాని రేలగుజ్జును కలిపి యందు సైంధలవణమును తేనెను చేర్చి ఈయవలయును.

మూ॥ కషాయేణాథవా తస్య త్రివృచ్చూర్ణం గుడాన్వితమ్। సాధయిత్వా శనైర్లేహం లేహయేన్మాత్రయా నరమ్ ॥2॥

అ॥ రేలగుజ్జుకషాయమును తెగడచూర్ణమును బెల్లమును గ్రహించి లేహమును మెల్లగవండి తగుపరిమితిగ నీయవలయును.

మూ॥ చతురఙ్గులసిద్ధాద్వా క్షీరాద్యదుదియాద్ఘృతమ్। మజ్జఃకల్కేన ధాత్రీణాం రసే తత్సాధితం పిబేత్ ॥ తదేవ దశమూలస్య

కులత్థానాం యవస్య చ । కషాయే సాధితం సర్పిః కల్కైః శ్యామాదభిః పిబేత్ ॥14॥

అ॥ లేలగుజ్జుతో కాచబడిన పాలనుండిజనించిన ఘృతమును, లేలగుజ్జుకల్కము ఉశిరికపండ్లరసము వీనితోగాని దశమూలముల యొక్కయు ఉలవల యొక్కయు యవలయొక్కయు కషాయము నల్లతెగడ మొదలగు తొమ్మిదింటియొక్క కల్కము వీనితోగాని తయారుచేసి యీయవలయును.

మూ॥ దన్తీక్వాథేఽక్షాలిం మజ్జః శమ్యాకస్య గుడస్య చ । దత్వా మాసార్ధ మాసస్థ మరిష్టం పాయయేత చ ॥15॥

అ॥ దంతీకషాయమునందు నాలుగుపలముల పరిమితిగల లేలగుజ్జును బెల్లమును కలిపి ఒకటిన్నరమాసముంచి అరిష్టముగ తయారైనపిదప నీయవలయును.

మూ॥ యస్య యత్పాన మన్నం చ హృద్యం స్వాద్వపి వా కటు । లవణం వా భవే త్తేన యుక్తం దద్యాద్విరేచనమ్ ॥16॥

అ॥ తీపి కారము ఉప్పు వీనిలో ఏది ఎవరికి ఇష్టముగనుండునో అట్టి రుచిగల అన్నపానములతో విరేచనౌషధముల నియ్యవలయును.

అధ్యాయ సంగ్రహము.

మూ॥ ద్రాక్షారసే సురాశీధ్వో ర్దధ్ని చామలకీరసే । సౌవీరకే కషాయే చ త్రివృతో బిల్వకస్య చ ॥ లేహేఽరిష్టే ఘృతే ద్వే చ యోగా ద్వాదశవర్తితాః । చతురఙ్గుల కల్పేఽస్మి న్నుకుమారాః ప్రకీర్తితాః ॥.8॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతి సంస్కృతే కల్పస్థానే చతురఙ్గులకల్పో నామాష్టమోఽధ్యాయః ॥

అ॥ ఈ చతురంగుల కల్పాధ్యాయమునందు ద్రాక్షారసము సురామండము శీధు వనెడిమద్యము పెరుగుమీదితేట ఉశిరికపండ్లరసము సౌవీరక మద్యము తెగడకషాయము లొద్దుగకషాయము వీనితో నొక్కొక్కటియు, లేహరూపమున ఒకటియు, అరిష్టరూపమున ఒకటియు, ఘృతరూపమున రెండును ఇట్లు పన్రెండు యోగములు చెప్పబడినవి.

ఇవ్విధంబున శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు చతురంగులకల్ప మనెడు అష్టమాధ్యాయము సమాప్తము.



# నవమాధ్యాయము.

మూ॥ అథాత స్తిల్వకకల్పం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట తిల్వకకల్పమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

లొద్దుగయొక్క పర్యాయపదములు.

మూ॥ తిల్వక స్తు మతో లోధ్రో బృహత్పత్రి స్తిరీటకః॥

అ॥ తిల్వక, లోధ్ర, బృహత్పత్ర, తిరీటక అనునివి లొద్దుగకు పర్యాయపదములుగ నుండును.

మూ॥ తస్య మూలత్వచం శుష్కామ న్తర్వల్కలవర్జితామ్। చూర్ణయేత్తు త్రిధా కృత్వా ద్వౌ భాగౌ శ్చోతయే త్తతః॥ లోధ్రస్యైవ కషాయేణ తృతీయం తేన భావయేత్ । భాగం తం దశమూలస్య పునః క్వాథేన భావయేత్ । శుష్కం చూర్ణం పునః కృత్వా తత ఊర్ధ్వం ప్రయోజయేత్ ॥5॥

అ॥ లొద్దుగవేళ్ళయొక్క పట్టను గ్రహించి ఎండించి లోపలనున్న పీచును తీసివేసి చూర్ణమునుచేసి మూడుభాగములుగ చేయువలయును. రెండుభాగముల చూర్ణమును గ్రహించి లొద్దుగకషాయమునందు కలిపి ఒడియగట్టవలయును. మూడవభాగమును గ్రహించి ఆఒడియగట్టిన రసముతో భావనచేసి దశమూలకషాయముతో మరల భావనచేయవలయును. పిదప ఎండించి మెత్తగచూర్ణించి జాగ్రతచేసి ఉపయోగింపవలయును.

మూ॥ దధిమణ్డసురామణ్డమూత్రై ర్బదరశీధునా। రసేనామలకానాం వా తతః పాణితలం పిబేత్ ॥6॥

అ॥ పెరుగుమీదితేట సురామద్యముయొక్క తేట గోమూత్రము రేగుపండ్లతో తయారుకాబడిన శీధుమద్యము ఉశిరికపండ్లరసము వీనిలో దేనితోనైనను ఆ చూర్ణమును కర్షపరిమితిగ పుచ్చుకొనవలయును.

మూ॥ సురాం లోధ్రకషాయేణ జాతాం పక్షస్థితాం పిబేత్ । మేషశృఙ్గ్యాభయాకృష్ణాచిత్రకైః సలిలేశ్రృతే ॥ మరుజాన్ సునుయా త్తచ్చ జాతం సౌవీరకం యదా। భవేదఞ్జలినా తస్య లోధ్రకల్కం పిబే త్తదా॥ దన్తీచిత్రకయోర్ద్రోణే సలిలస్యాఢకం పృథక్ । సము

త్వా క్వాథ్య గుడస్యైకాం తులాం లోధ్రస్య చాఞ్జలిమ్ ॥ ఆవపేత్తత్పరం పక్షాన్మద్యపానాం విరేచనమ్ । తిల్వకస్య కషాయేణ దశకృత్వః సుభావితామ్ । మాత్రాం కమ్పిల్లకస్యైవ కషాయేణ పునః పిబేత్ ॥10॥

అ॥ సురయసెడిమద్యమును లొద్దుగకషాయమును కలిపి పదునైదుదినములుంచి తయారైనపిదప త్రాగవలయును. దుష్టపు కరక్కాయలు పిప్పళ్ళు చిత్రమూలము వీనియొక్క కషాయమునందు వేయించిన యవలయొక్క చూర్ణమును కలిపి సౌవీరక మద్యమునుగ తయారుచేసి నాలుగుపలముల పరిమితిగల యాసౌవీరకముతో లొద్దుగ కల్కమును పుచ్చుకొనవలయును. దంతిని చిత్రమూలమును ఒక్కొక్క ఆఢకముగ గ్రహించి ఒక్కొక్కద్రోణముజలమునందు ప్రత్యేకముగ కషాయములను కాచి ఆ రెండింటినికలిపి అందు నూరుపలముల బెల్లమును నాలుగుపలముల లొద్దుగచూర్ణమును కలిపి పదునైదురోజులుంచి తయారైనపిదప మద్యపానములవాటుకలవారలకు విరేచనము నిమిత్తము ఇయ్యవలయును. లొద్దుగకషాయముతో పదిసారులు భావనచేయబడిన లొద్దుగ చూర్ణమును కంపిల్లక కషాయముతో పుచ్చుకొనవలయును.

మూ॥ చతురఙ్గులకల్పేన లేహోఽన్యః కార్య ఏవ చ ॥ త్రిఫలాయాః కషాయేణ ససర్పిర్మధుఫాణితైః । లోధ్రచూర్ణయుతః సిద్ధో లేహః శ్రేష్ఠో విరేచనే॥ తిల్వకస్య కషాయేణ కల్కేన చ సశర్కరః। సఘృతః సాధితో లేహః స చ శ్రేష్ఠో విరేచనే ॥3॥

అ॥ లొద్దుగకషాయమును తెగడచూర్ణమును బెల్లమును గ్రహించి లేహమునుగ తయారుచేయవలయును. త్రిఫలాకషాయము ఘృతము తేనె చెరుకుపాకము లొద్దుగ చూర్ణము వీనిని గ్రహించి లేహమునుగ తయారుచేయవలయును. లొద్దుగకషాయము లొద్దుగకల్కము పంచదార నెయ్యి వీనినిగ్రహించి లేహమునుతయారుచేయవలయును.

మూ॥ అష్టాష్టౌ త్రివృతాదీనాం ముష్టీంశ్చ సనఖాన్ పృథక్ । ద్రోణేఽపాం సాధయేత్పాదశేషే ప్రస్థం ఘృతాత్పచేత్ ॥ పిష్టైస్తైరేవ బిల్వాంశైః సమూత్రలవణైర్భిషక్ । తతో మాత్రాంపిబేత్కాలే శ్రేష్ఠమేతద్విరేచనమ్॥ లోధ్రకల్కేన మూత్రామ్లలవణైశ్చ పచేద్ఘృతమ్ । చతురఙ్గులకల్పేన సర్పిషీ ద్వే చ సాధయేత్ ॥ 6॥

అ॥ తెగడ మొదలగుతొమ్మిదివస్తువులను ఎనిమిదేసిపిడికిళ్ళచొప్పున గ్రహించి ఒకద్రోణముజలమునందు నాలుగవవంతు మిగులునట్లు కాచి అందు ఘృతమును ఒక ప్రస్థముగను, పూర్వద్రవ్యములయొక్క కల్కము గోమూత్రము సైంధవలవణము వీనిని ఒక్కొక్కపలముగను కలిపి తయారుచేసి యాఘృతమును తగుపరిమితిగ సకాలమునందు సేవించినచొ విరేచనములు బాగుగనగును. లొద్దుగకల్కము గోమూ

త్రము పుల్లనిరసము సైంధవలవణము వీనితోకూడ ఘృతమునుతయారు చేయవలయును. చేలతో చెప్పబడినవిధముననే లొద్దుగతో రెండువిధములగు ఘృతములను తయారు చేయవలయును.

## అధ్యాయ సంగ్రహము.

మూ॥ పఞ్చ దధ్యాదిభిస్త్వేకా సురా సౌవీరకేణ చ । ఏకోఽరిష్టస్తథా యోగ ఏకః కమ్పిల్లకేన చ ॥ లేహాస్త్రయో ఘృతేనాపి చత్వారః సంప్రదర్శితాః । యోగాస్తే లోధ్రమూలానాం కల్పే షోడశ దర్శితాః ॥18॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే కల్పస్థానే తిల్వకకల్పో నామ నవమోఽధ్యాయః ॥

అ॥ ఈతిల్వక కల్పాధ్యాయమునందు పెరుగుమీది తేట మొదలగువానితో నైదును, సురతోనొకటియు, వీరకరూపమున నొకటియు, అరిష్టరూపముననొకటియు, కంపిల్లకముతో నొకటియు, లేహరూపమున మూడును, ఘృతరూపమున నాలుగును ఇట్లు పదునారుయోగములు చెప్పబడినవి.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు తిల్వకకల్పమనెడు నవమాధ్యాయము సమాప్తము.

—*—

# నవమాధ్యాయము.

మూ॥ అథాత స్సుధాకల్పం వ్యాఖ్యాస్యామః ॥ ॥

అ॥ పిమ్మట సుధాకల్పమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ విరేచనానాం సర్వేషాం సుధా తీక్ష్ణతమా మతా । సఙ్ఘాతం తు భినత్త్యాశు దోషాణాం కష్టవిభ్రమా ॥ తస్మాన్నైషా మృదౌ కోష్ఠే ప్రయోక్తవ్యా కదాచన । న దోషనిచయే చాల్పే సతిమార్గ పరిక్రమే ॥ ॥

అ॥ సమస్త విరేచనద్రవ్యములలోను జెముడు మిక్కిలి తీక్ష్ణగుణముకలదిగ నుండును. దోషసముదాయమును వెంటనే భేదించును. కష్టసాధ్యములైన వికారములను

కలిగించును. అందువలన మృగశోషముకలవారలకు ఒకానొకప్పుడును ఈయకూడదు. మరియు స్వల్పదోషము కలవారలకు ఈయకూడదు. ఇతర విరేచనద్రవ్యములున్నచో దీని నియ్యకూడదు.

మూ॥ పాణ్డురోగోదరే గుల్మే కుష్ఠే దూషీవిషార్దితే। శ్వయ
థౌ మధుమేహే చ దోషవిభ్రాన్తచేతసి॥ రోగైరేవంవిధైర్గ్రస్తం జ్ఞా
త్వా సప్రాణమాతురమ్। ప్రయోజయేన్మహావృక్షం సమ్యక్ స హ్యు
పచారితః। సద్యో హరతి దోషాణాం మహాన్తమపి సంచయమ్ ॥6॥

అ॥ పాండురోగము ఉదరవ్యాధి గుల్మము కుష్ఠము దూషీవిషము శోఫ మధుమేహము ఉన్మాదము వీనియందును ఇట్టి ఇతరవ్యాధులయందును రోగి బలవంతుడుగ నున్నచో బాగుగ నాలోచించి జెముడును ప్రయోగింపవలయును. అధికముగు దోష సమూదాయమునుగూడ వెంటనే హరింపజేయును.

మూ॥ ద్వివిధస్స మతో యశ్చ బహుభిశ్చైవ కణ్టకైః॥ సుతీ
క్ష్ణైః కణ్టకైరల్పైః ప్రవరో బహుకణ్టకః॥ స నామ్నా స్నుగ్గుడానన్దా
సుధా నిస్త్రింశపత్రకః॥ తం విపాట్యాహరేత్ క్షీరం శస్త్రేణ మతి
మాన్ భిషక్। ద్వివర్షం వా త్రివర్షం వా శిశిరాన్తే విశేషతః॥ ॥

అ॥ జెముడు అధికముగను తీక్ష్ణముగను నున్న ముళ్ళుగలదనియు తక్కువముళ్లు గలదనియు రెండువిధములుగ నుండును. వానిలో అధికముగ ముళ్ళుగలది శ్రేష్ఠమైనదిగ నుండును. స్నుక్, గుడ, ఆనంద, సుధ, నిస్త్రింశపత్రక అనునివి జెముడుయొక్క పర్యాయపదములుగ నుండును. రెండుగాని మూడుగాని సంవత్సరముల వయస్సుగల జెముడును తరుచు శిశిరఋతువుయొక్క అంతమునందు కత్తితో చీల్చి పాలను గ్రహింపవలయును.

మూ॥ బిల్వాదీనాం బృహత్యాశ్చ కణ్టకార్యాస్త ద్వైకశః।
కషాయం తం సమాంశేన కృత్వాఙ్గారేషు శోషయేత్॥ తతః కో
లసమాం మాత్రాం పిబేత్సౌవీరకేణ వా। తుషోదకేన కోలానాం
రసేనామలకస్య చ। సురయా దధిమణ్డేన మాతులుఙ్గరసేన వా ॥11॥

అ॥ బిల్వాదిపంచమూలములు పెదవాకుడు చినవాకుడు వీనిని ప్రత్యేకము కషాయము కాచవలయును. ఈ కషాయములను ప్రత్యేకముగ జెముడుపాలతో సమానముగ గ్రహించి కలుపుచు బొగ్గు నిప్పులతో ఇగిర్చి (గట్టిపరచి) రేగుకాయలంత మాత్రలను చేయవలయును. వీనిని సౌవీరకము తుషోదకము రేగుపండ్లరసము ఉశిరిక పండ్లరసము సుర పెరుగుమీదితేట మాదీఫలరసము వీనిలో దేనితోనైనను ఈయవలయును.

మూ॥ సాతలాం కాఞ్చనక్షీరీం శ్యామాదీని కటుత్రికమ్। య
థోపపత్తి సప్తాహం సుధాక్షీరేణ భావయేత్॥ కోలమాత్రం ఘృతే

నాతః పిబేన్మాంసరసేన వా । త్ర్యూషణం త్రిఫలాం దన్తీం చిత్రకం త్రివృతాం తథా। స్నుక్క్షీరభావితం సమ్యగ్వివధ్యాద్గుడపానకమ్ ॥

అ॥ శంబరేణు స్వర్ణక్షీరి నల్లతెగడ మొదలగుతోమ్మిదివస్తువులు త్రికటుకములు వీనిలో దొరికినవానిని గ్రహించి జెముడుపాలతో ఏడురోజులు భావనచేసి అర్ధకర్ష పరిమితిగ నేతితోగాని మాంసరసముతోగాని ఈయవలయును. త్రికటుకములు త్రిఫలములు దంతి చిత్రమూలము తెగడ వీనిని జెముడుపాలతో భావనచేసి బెల్లపు పానకముతో నియ్యవలయును.

మూ॥ త్రివృతారగ్వధం దన్తీం శఙ్ఖినీం సప్తలాం సమామ్ । నిశి స్థితం గవాం మూత్రే శోషయేదాతపే తతః ॥ సప్తాహం భావయిత్వైవం స్నుక్క్షీరేణాపరం పునః । సప్తాహం భావయేచ్చూర్ణం తత స్తేనాపి భావితమ్॥ గన్ధమాల్యం తదాఘ్రాయ ప్రావృత్య పటమేవ చ । సుఖమాశు విరిచ్యన్తే మృదుకోష్ఠా నరాధిపాః ॥

అ॥ తెగడ రేల దంతి ఈశ్వరి సంబరేణు వీనిని సమభాగములుగ గ్రహించి గోమూత్రమునందు వేసి ఒకరాత్రియుంచి ఎండయందు ఎండింపవలయును. ఇట్లు ఏడురోజులు భావనచేయవలయును. మరల జిల్లేడుపాలతో ఇట్లు ఏడురోజులు భావన చేయవలయును. పిదప ఎండించి మెత్తగ ఆచూర్ణమును పుష్పమాలికమీద చల్లి బట్టను కప్పుకొని అపుష్పమాలికను ఆఘ్రాణించినచో సుఖముగ విరేచనము లగును. ఈవిధానము మృదుకోష్ఠము కలవారలకును రాజులకును హితకరముగ నుండును.

మూ॥ శ్యామాత్రివృత్కషాయేణ స్నుక్క్షీర ఘృతఫాణితైః । లేహం పక్త్వా విరేకార్థం లేహయేన్మాత్రయా నరమ్ ॥17॥

అ॥ నల్లతెగడ తెల్లతెగడ వీనియొక్క కషాయమును జెముడుపాలను ఘృతమును చెరుకుపాకమును గ్రహించి లేహముగవండి తగుపరిమితిగ పుచ్చుకొనినచో విరేచనము లగును.

మూ॥ పాయయేత సుధాక్షీరం యూషైర్మాంసరసైర్ఘృతైః । భావితాన్ శుష్కమత్స్యాన్వా మాంసం వా భక్షయేన్నరః ॥ క్షీరేణామలకైః సర్పిశ్చతురఙ్గులవత్పచేత్ । సురాం వా కారయేత్ క్షీరే ఘృతం వా పూర్వవత్పచేత్ ॥18॥

అ॥ జెముడుపాలను యూషముతోగాని మాంసరసముతోగాని ఘృతముతో గాని పుచ్చుకొనవలయును. జెముడుపాలతో భావనచేయబడిన ఎండుచేపలనుగాని మాంసమునుగాని తినవలయును. రేలతో జెప్పబడిన విధముననే జెముడుపాలతో రెండువిధములైన ఘృతములను తయారుచేసి ఈయవలయును. సురయనెడు మద్యమును జెముడుపాలను కలిపి పదునైదుదినములుంచి తయారైనపిదప ఈయవలయును.

అధ్యాయ సంగ్రహము.

మూ॥ సౌవీరకాదిభిః సప్త సర్పిషా చ రసేన చ। పానకం త్రేఘయ లేహౌ చ యోగా యూషాదిభిస్త్రియః॥ ద్వౌ శుష్కమత్స్యమాంసానాం సురైకా ద్వే చ సర్పిషీ। మహావృక్షస్య యోగాస్తే వింశతిః సముదాహృతాః ॥21॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతి సంస్కృతే కల్పస్థానే మహావృక్షకల్పో నామ దశమోఽధ్యాయః ॥

ఆ॥ ఈ సుధాకల్పాధ్యాయమునందు సౌవీరము మొదలైనవానితో ఏడును, ఘృతము మాంసరసము పానకము వీనితో ఒక్కొక్కటియు, త్రేఘరూపమున నొకటియు, లేహరూపమున నొకటియు, యూషము మొదలగువానితో మూడును, ఎండు చేపలు మాంసము వీనితో నొక్కొక్కటియు, సురతో నొకటియు, ఘృతరూపమున రెండును ఇట్లు ఇరువదియోగములు చెప్పబడినవి.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు మహావృక్షకల్పమనెడు దశమాధ్యాయము సమాప్తము.

—0—

# ఏకాదశాధ్యాయము.

మూ॥ అథాత స్సప్తలాశఙ్ఖినీకల్పం వ్యాఖ్యాస్యామః ॥1॥

ఆ॥ పిమ్మట సప్తలాశంఖినీ కల్పమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

ఆ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

ఈశ్వరి సంబరేణులయొక్క పర్యాయపదములు - గుణములు.

మూ॥ సప్తలా చర్మసాహ్వా చ బహుఫేనరసా చ సా। శఙ్ఖినీ తిక్తలా చైవ యవతిక్తాఽక్షిపీడకః॥ తే గుల్మగరహృద్రోగకుష్ఠశోఫోదరాదిషు। వికాశితీక్ష్ణరూక్షత్వాద్యోజ్యే శ్లేష్మాధికేషు తు ॥4॥

ఆ॥ సప్తలచర్మసాహ్వా బహుఫేనరస అనునివి సంబరేణునకును, శంఖిని తిక్తల యవతిక్త అక్షిపీడక అనునివి ఈశ్వరికిని పర్యాయపదములుగ నుండును. వీనిని గుల్మము గరవ్యాధులు హృద్రోగము కుష్ఠము శోఫ ఉదరవ్యాధి మొదలగువాని యందు ప్రయోగింపవలయును. వికాశిశక్తియు తీక్ష్ణ రూక్షగుణములును కలవగుట

వలన కఫాధిక్యము కలవారలకు ఉపయోగింపవలయును.

మూ॥ నాతిశుష్కం ఫలం గ్రాహ్యం శఙ్ఖిన్యా నిస్తుషీకృతమ్।
సప్తలాయాశ్చ మూలాని గృహీత్వా భాజనే క్షిపేత్ ॥5॥

అ॥ ఈశ్వరియొక్క అధికముగ ఎండనట్టియు పొట్టుతీయబడినట్టియు పండ్లను, సంబరేణుయొక్క వేళ్ళను గ్రహించి పాత్రయందుంచి జాగ్రతచేయువలయును.

సప్తలాశంఖినీ కల్పములు.

మూ॥ అక్షమాత్రం తయోః పిణ్డం ప్రసన్నా లవణాయుతమ్।
హృద్రోగే వాతకఫజే గుల్మే చైవ ప్రయోజయేత్ ॥ పియాల పీలుక
కర్కన్ధూ కోలామ్రాతక దాడిమైః। ద్రాక్షా పనస ఖర్జూర బదరామ్ల
పరూషకైః॥ మైరేయే దధిమణ్డేఽమ్లే సౌవీరక తుషోదకే। శీధౌ
చాప్యేషకల్పః స్యాత్సుఖం శీఘ్రవిరేచనః ॥8॥

అ॥ సురయొక్క తేట సైంధవలవణము వీనితోకూడిన సంబరేణు ఈశ్వరి వీనియొక్క కర్షపరిమితికల కల్కమును, సార వరగోగు చిన్నరేగు పెద్దరేగు రాచమామిడి దానిమ్మ ద్రాక్ష పనస ఖర్జూరము పుల్లరేగు చిట్లీత వీనిలో దేనియొక్క కషాయముతోనైననుగాని మైరేయము పుల్లని పెరుగుమీది తేట సౌవీరకము తుషోదకము శీధువు వీనిలో దేనితోనైననుగాని వాతకఫములవలన జనించిన హృద్రోగము గుల్మము వీనియందు ఉపయోగింపవలయును. సుఖముగను శీఘ్రముగను విరేచనము లగును.

మూ॥ తైలం విదారిగన్ధాద్యైః పయసి క్వథితేపచేత్। సప్తలా
శఙ్ఖినీకల్కే త్రివృచ్ఛ్యామార్ధభాగికే॥ దధిమణ్డేన సన్ధాయసిద్ధం తత్పా
యయేత చ। శఙ్ఖినీచూర్ణభాగౌ ద్వౌ తిలచూర్ణస్య చాపరః॥ హరీ
తకీకషాయేణ తైలం తత్పీడితం పిబేత్। అతసీసర్షపై రణ్డకరఞ్జేష్వేష
సంవిధిః ॥11॥

అ॥ విదారిగంధాది గణద్రవ్యములతో కాచబడిన కషాయమునందు తైలమును, తెగడ నల్లతెగడ ఇవి సగము పరిమితిగగల సంబరేణు ఈశ్వరి వీనియొక్క కల్కమును, పెరుగుమీదితేటను కలిపి తైలమును తయారుచేసి ఈయవలయును. ఈశ్వరి చూర్ణమును రెండుభాగములుగను, నువ్వులచూర్ణమును ఒకభాగముగను గ్రహించి కరక్కాయ కషాయమునుకలిపి పిండితైలమునుతీసి యాతైలమును ఈయవలయును. ఇట్లు నువ్వులనుండివలెనే అవిసెగింజలు ఆవాలు ఆముదపుగింజలు కానుగగింజలు వీని నుండిగూడ తైలములను తీసి ఈయవలయును.

మూ॥ శఙ్ఖినీసప్తలాసిద్ధాత్ క్షీరాద్యదుదియాద్ఘృతమ్।కల్కభాగం
తయోరేవ త్రివృచ్ఛ్యామార్ధసంయుతమ్। క్షీరేణాలోడ్యసంపక్వం పిబే

త్తచ్చ విరేచనమ్ । తథా దన్తీ ద్రవన్త్యోః స్యాదజశృఙ్గ్యా జగన్ధయోః ॥ శ్వేతిణ్యా నీలికాయాశ్చ తథైవ చ కరఞ్జయోః । మసూరవిదలాయశ్చ ప్రత్యేక్ శ్రేణా స్తథైవ చ ॥ ద్వావగ్రాగాంశ కల్కేన తద్వత్సావ్యం ఘృతం పునః । శఙ్ఖినీస్తులా ధాత్రీకషాయే చాపరం ఘృతమ్ ॥ త్రివృత్కల్పేన సర్పిశ్చ త్రయో లేహాశ్చ పూర్వవత్ । సురాకమ్పిల్లయోర్యోగః కార్యో లోధ్రవదేవ చ ॥ దన్తీద్రవన్త్యోః కల్పేన సౌవీరక తుషోదకే । అజగన్ధాజశృఙ్గ్యోశ్చ తద్వాత్స్యాతాం విరేచనే ॥

అ॥ ఈశ్వరి సంబరేణు వీనితో కాచబడిన పాలనుండి జనించిన ఘృతమును, తెగడ నల్లతెగడ ఇవి సగము పరిమితిగల ఈశ్వరి సంబరేణు వీనియొక్క కల్కమును పాలను కలిపి ఘృతమును తయారుచేసి విరేచనములనిమిత్తమీయవలయును. దంతి పెద్దదంతి వీనినిగాని దుష్టుపు వావింట వీనినిగాని పాలగుమ్మడి నీలి వీనినిగాని క్రానుగ ములుక్రానుగ వీనినిగాని నల్లసుగంధిపాల ఎలుకచెవికూర వీనినిగాని తెగడ నల్లతెగడ వీనికిమారుగ గ్రహించి పైవిధమున నే ఘృతములను తయారుచేసి ఈయవలయును. ఈశ్వరి సంబరేణు ఉశిరికపండ్లు వీనియొక్క కషాయమునందు ఘృతమును తయారుచేసి ఈయవలయును. త్రివృత్కకల్పాధ్యాయమునందు లొద్దుగతో చెప్పబడిన విధమున ఈశ్వరి సంబరేణు వీనితో మూడువిధములగు లేహములను, సురను తయారుచేసి ఈయవలయును. లొద్దుగ చూర్ణమునువలె వీనియొక్క చూర్ణమును కంపిల్లక కషాయముతో నీయవలయును. దంతీద్రవంతీకల్పమునందు చెప్పబోవు విధమున ఈశ్వరి సంబరేణు వీనితో సౌవీరకమును తుషోదకమును తయారుచేసి ఈయవలయును. మరియు వీనితో అచ్చట చెప్పబోవు విధముననే వావింటతోగాని దుష్టుపుతోగాని అరిష్టములను తయారుచేసి ఈయవలయును.

## అధ్యాయ సంగ్రహము.

మూ॥ కషాయా దశ షట్ చైవ షట్ తైలేఽష్టౌ చ సర్పిషి । పఞ్చ మద్యాస్త్రయో లేహా యోగః కమ్పిల్లకే తథా॥ సప్తలాశఙ్ఖినీభ్యాం తే త్రింశదుక్తా నవాధికాః । యోగాః సిద్ధాః సమస్తాభ్యామేకశోఽపి చ తే హితాః ॥ 14॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే కల్పస్థానే సప్తలాశఙ్ఖినీకల్పో నామైకాదశోఽధ్యాయః ॥

అ॥ ఈ సప్తలాశంఖినీ కల్పాధ్యాయమునందు కషాయములు మొదలగువానితో పదునారును, తైలరూపమున ఆరును, ఘృతరూపమున ఎనిమిదియు, మద్యరూపమున ఐదును, లేహరూపమున మూడును, కంపిల్లకకషాయముతో నొకటియు ఇట్లు ముప్పది

తొమ్మిదియోగములు చెప్పబడినవి.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామకకృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితావ్యాఖ్యానమునందు సప్తలాశంఖినీకల్పమనెడు ఏకాదశాధ్యాయము సమాప్తము.

—*—

# ద్వాదశాధ్యాయము.

మూ॥ అథాతో దన్తీద్రవన్తీకల్పం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట దంతీద్రవంతీకల్పమును చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

దంతీద్రవంతులయొక్క పర్యాయపదములు.

మూ॥ దన్త్యుదుమ్బరపర్ణీ స్యాన్నికుమ్భోఽథ మకూలకః। ద్రవన్తీ నామతశ్చిత్రా న్యగ్రోధీ మూషికాహ్వయా ॥ తథామూషికపర్ణీ చాప్యుపచిత్రా చ శమ్బరీ। ప్రత్యక్ శ్రేణీ సుతశ్రేణీ దన్తీ రండా చ కీర్తితా ॥4॥

అ॥ దంతి ఉదుంబరపర్ణి నికుంభ మకూలక ద్రవంతి చిత్ర న్యగ్రోధి మూషికాహ్వయ మూషికపర్ణి ఉపచిత్ర శంబరి ప్రత్యక్శ్రేణి సుతశ్రేణి రండ అనునివి దంతికిని పెద్దదంతికిని పర్యాయపదములుగ నుండును.

మూ॥ తయోర్మూలాని సంగృహ్య స్థిరాణి బహలాని చ। హస్తిదన్తప్రకారాణి శ్యావతామ్రాణి బుద్ధిమాన్॥ పిప్పలీమధులిప్తాని స్వేదయేన్మృత్కుశాన్తరే। శోషయేదాతపేఽగ్న్యర్కౌ హతో హ్యేషాం వికాశితామ్॥ తీక్ష్ణోష్ణాన్యాశుకారీణి వికాశీని గురూణి చ। విలాపయన్తి దోషా ద్వౌ మారుతం కోపయన్తి చ ॥7॥

అ॥ దంతీద్రవంతులయొక్క సారవంతములైనట్టియు దళసరిచర్మముగలిగినట్టియు ఏనుగుదంతముతో సమానముగనున్నట్టియు వేళ్ళను గ్రహింపవలయును. దంతియొక్క వేళ్లు శ్యావవర్ణముకలవిగను, పెద్దదంతియొక్క వేళ్లు తామ్రవర్ణముకలవిగను నుండును. వానియొక్క వేళ్ళను గ్రహించి పిప్పళ్ళు అతిమధురము వీనియొక్క కల్కముతో పూసి దర్భలతోచుట్టి పైన మన్నుపూసి పుటపాకముచే నుడికించి ఎండయం దెండింపవలయును. ఇట్లు అగ్నియొక్కయు సూర్యునియొక్కయు సంబంధము కలుగుటవలన వీనియందలి వికాశిశక్తి నశించును. వీనియొక్క వేళ్లు తీక్ష్ణగుణ

మును ఉష్ణవీర్యమును ఆశుకారిత్వముకు వికాశిశక్తియు గురుగుణమును కలవిగ నుండును. పిత్తకఫములను నశింపజేయును. వాతమును ప్రకోపింపజేయును.

మూ॥ దధితక్రసురామస్తైః పిష్టమక్షసమం తయోః। ప్రియాల కోలబదరపీలుశీధుభిరేవ చ॥ పిబేద్గుల్మోదరీ దోషైరతిష్ఠన్నశ్చ యో నరః। గోమృగాజరసైః పాణ్డుః కృమికుష్ఠీ భగన్దరీ ॥5॥

అ॥ వీనియొక్క కర్ష పరిమితిగల కల్కమును పెరుగుమీది తేట మజ్జిగమీది తేట సురామద్యముయొక్క తేట సారకషాయము రేగుకషాయము పులరేగుకషాయము వరగోగుకషాయము శీధుమద్యము వీనిలో దేనితోనైనను ఇచ్చినయెడల గుల్మము ఉదరవ్యాధి దోషాధిక్యము ఇవియు, గోవు లేడి మేక వీనిలో దేనియొక్క మాంస రసముతోనైనను ఇచ్చినయెడల పాండురోగము క్రిమివ్యాధులు కుష్ఠము భగందరము ఇవియు నశించును.

మూ॥ తయోః కల్కే కషాయే చ దశమూలరసాయుతే। కష్ఠాలజీవిసర్పేషు దాహే చ విపచేద్ఘృతమ్॥ తైలం మేహే చ గుల్మే చ సోదావర్తే కఫానిలే। చతుఃస్నేహం శకృచ్ఛుక్రవాతసఙ్గానిలార్తిషు ॥ 1॥

అ॥ దంతీద్రవంతులయొక్క కల్కము వీనియొక్క కషాయము దశమూల రసము వీనితో ఘృతమును తయారుచేసి కక్షము అలజి విసర్పము అనెడి వ్యాధుల యందును, తైలమును తయారుచేసి మేహవ్యాధి గుల్మము ఉదావర్తము కఫవాతములు వీనియందును, స్నేహచతుష్టయవర్గమును తయారుచేసె మలసంగము శుక్రసంగము వాతసంగము వాతవ్యాధులు వీనియందును ఈయవలయును.

మూ॥ రసే దన్త్యజశృఙ్గ్యోశ్చ గుడక్షౌద్రఘృతాన్వితః। లేహః సిద్ధో విరేకార్థే దాహసంతాపమేహనుత్ ॥ వాతితస్రే జ్వరే పైత్తే స్యాత్స ఏవాజగన్ధయా। మూలం దన్తీద్రవన్త్యోశ్చ పచేదామలకీరసే॥ త్రీంస్తు తస్య కషాయస్య భాగా ద్వౌ ఫాణితస్య చ।తప్తే సర్పిషి తైలే వా భర్జయేత్తత్ర చావపేత్॥కల్కం దన్తీద్రవన్త్యోశ్చ శ్యామాదీనాం చ భాగశః। తత్సిద్ధం ప్రాశయేల్లేహం సుఖం తేన విరిచ్యతే॥ రసే చ దశమూలస్య తథా వైభీతకరసే। హారీతకీరసే చైవ లేహానేవం పచే త్పృథక్ ॥ 6॥

అ॥ దంతియొక్కయు దుష్టపుయొక్కయు రసము బెల్లము తేనె నెయ్యి వీనిని గ్రహించి లేహముగ తయారుచేసి తాపము సంతాపము మేహము వీనియందును, దుష్టపునకు మారుగ అజామోదమును గ్రహించి లేహముగ తయారుజేసి ఆలేహమును వాతసంబంధమగు దప్పిక పిత్తజ్వరము వీనియందును విరేచనములనిమిత్తము ఈయు

వలయును. దంతీ ద్రవంతులయొక్క వేళ్ళను ఉసిరికపండ్లరసమునందు వేసి కాచ వలయును. ఆకషాయమును మూడుభాగములుగను చెరుకుపాకమును రెండుభాగములుగను గ్రహించి కాగుచున్న నేతియందుగాని నూనెయందుగాని పోసి ఉడికించి యందు దంతి, పెద్దదంతి, నల్లతెగడ మొదలగుత్రోమ్మిదివస్తువులు వీనియొక్క కల్కమును ప్రత్యేకముగ ఒక్కొక్క భాగముగను గ్రహించి లేహముగ తయారుచేసి ఇచ్చినచో సుఖముగ విరేచనమగును. దశమూలరసము తానికాయరసము కరక్కాయరసము వీనిలో దేనితోనైనను, పైన చెప్పిన విధముననే ప్రత్యేకముగ లేహములను తయారుచేసి ఈయవలయును.

మూ॥ తయోర్బిల్వసమం చూర్ణం తద్రసేనైవ భావితమ్। అస్యృష్టవిషి వాతోత్థే గుల్మే చామ్లయుతం శుభమ్॥ పాటయిత్వేక్షుకాణ్డం వా కల్కేనాలిప్య చాన్తరా। స్వేదయిత్వా తతః ఖాదేత్సుఖం తేన విరిచ్యతే॥ మూలం దన్తీద్రవన్త్యోశ్చ సహ ముద్గైర్విపాచయేత్। లావతిత్తిరికాణాం చ తే రసాః స్యుర్విరేచనాః ॥ తయోర్వాపి కషాయేణ యవాగూం జాఙ్గలం రసమ్। మాషయూషాంశ్చ సంస్కృత్య దద్యాత్తైశ్చ విరిచ్యతే ॥2౦॥

అ॥ దంతీద్రవంతులయొక్క చూర్ణమును వానియొక్క రసముతోడనే భావన చేసి పుల్లనిపండ్లరసముతో పలపరిమితిగ, వాతమువలనజనించిన మలబంధము గుల్మము వీనియందు ఈయవలయును. చెరుకుముక్కను చీల్చి దంతీద్రవంతులయొక్క కల్కముతో పూసి ఉడికించి తినినచో సుఖముగ విరేచనమగును. దంతీద్రవంతులయొక్క వేళ్ళను పెసలతోగాని లావుకపక్షి మాంసముతోగాని తిత్తిరిపక్షి మాంసముతోగాని కాచి యా రసము నీయవలయును. దంతీద్రవంతులయొక్క కషాయముతో యవాగును గాని జాంగలమాంస రసమునుగాని మినపకట్టునుగాని తయారుచేసి సంస్కరించి ఈయవలయును. విరేచనము లగును.

మూ॥ తత్కషాయాస్త్రయో భాగా ద్వౌ సితాయాస్తథైవ చ। ఏకో గోధుమచూర్ణానాం కార్యా చోత్కారికా శుభా॥ మోదకో వాఽస్య కల్పేన కార్యస్తచ్చ విరేచనమ్। తయోశ్చాపి కషాయేణ మద్యమస్యోప కల్పయేత్॥ దన్తీక్వాథేన చాలోడ్య దన్తీతైలేన సాధితాన్। గుడలావణికాన్భక్ష్యాన్వివిధాన్భక్షయేన్నరః ॥ 3॥

అ॥ దంతీద్రవంతులయొక్క కషాయమును మూడుభాగములుగను, పంచదారను రెండు భాగములుగను, గోధుమపిండిని ఒక భాగముగను గ్రహించి ఉత్కారికలనెడి భక్ష్యవిశేషములుగాని మోదకములుగాని తయారుచేసి ఈయవలయును. వీనియొక్క కషాయముతో మద్యమును తయారుచేసి ఈయవలయును బెల్లము

సైంధవ లవణము మొదలగువానిని గ్రహించి దంతీకషాయముతో కలిపి దంతీతైలము నందు అనేకవిధములగు భక్ష్యములను తయారుచేసి ఈయవలయును.

మూ॥ దన్తీం ద్రవన్తీం మరిచం యవానీ ముపకుఞ్చికామ్। నాగరం హేమదుగ్ధాం చ చిత్రకం చేతి చూర్ణితమ్ ॥ సప్తాహం భావయే న్మూత్రే గవాం పాణితలం తతః। పిబేద్ఘృతేన చూర్ణం తు విరిక్తశ్చా పి తర్పణమ్ ॥ సర్వరోగహరం ముఖ్యం సర్వేష్వృతుషు యౌగికమ్ । చూర్ణం తదనపాయిత్వాద్బాల వృద్ధేషు పూజితమ్ ॥ దుర్భక్తాజీర్ణపా ర్శ్వార్తి గుల్మప్లీహోదరేషు చ । గణ్డమాలాస్రవాతే చ పాణ్డురోగే చ శస్యతే ॥27॥

అ॥ దంతి పెద్దదంతి మిరియాలు ఖరాసానివాము జీలకఱ్ఱ శుంఠి స్వర్ణక్షీరి చిత్రమూలము వీనినిచూర్ణించి ఏడురోజులు గోమూత్రమునందు భావనచేసి యీచూర్ణ మును నేతితో కర్షపరిమితిగ నిచ్చి విరేచనమైనపిదప తర్పణముచేయింపవలయును. సమస్త వ్యాధులను నశింపజేయును. సమస్త ఋతువులయందును ఉపయోగింప వచ్చును. అపాయమును కలిగింపని దగుటవలన బాలురకును వృద్ధులకునుకూడ నీయ వచ్చును. దుష్టభోజనమువలన కలిగిన అజీర్ణము పార్శ్వశూల గుల్మము ప్లీహావ్యాధి ఉదరవ్యాధి గండమాల వాతరక్తము పాండురోగము వీనియందు ఈయవలయును.

మూ॥ పలం చిత్రకదన్త్యోశ్చ హరీతక్యాశ్చ వింశతిః । త్రివృ త్పిప్పలీకర్షౌ ద్వౌ గుడస్యాష్టపలేన తత్ ॥ వినీయ మోదకాన్కు ర్యాద్దశైకం భక్షయేత్తతః। ఉష్ణామ్బు చ పిబేచ్చాను దశమే దశమేఽ హ్ని చ ॥ ఏతే నిష్పరిహారాః స్యుః సర్వరోగనిబర్హణాః । గ్రహణీ పాణ్డురోగార్శః కణ్డూకుష్ఠానిలాపహాః ॥ ౨౮॥

అ॥ చిత్రమూలము దంతి వీనిని పలపరిమితిగను కరక్కాయలను ఇరువదిగను తెగడ పిప్పళ్ళు వీనిని రెండుకర్షములుగను బెల్లమును ఎనిమిదిపలములుగను గ్రహించి పదిమోదకములను చేయవలయును. ఒకమోదకమును పుచ్చుకొని వేడినీళ్ళను త్రాగ వలయును. ఇట్లు పదిరోజులకొకసారి పుచ్చుకొనవలయును. పథ్య మవసరములేదు. ఇవి సమస్తవ్యాధులను నశింపజేయును. గ్రహణీవ్యాధి పాండురోగము అర్శస్సు దురద కుష్ఠము వాతము వీనిని నశింపజేయును.

మూ॥ దన్తీద్విపల నిర్యూహో ద్రాక్షార్ధప్రస్థసంయుతః । శోధ సం పిత్తకాసే చ పాణ్డురోగే చ శస్యతే॥ దన్తీకల్కం సమగుడం శీత వారియుతం పిబేత్। విరేచనం ముఖ్యతమం కామలాహరముత్తమమ్॥ శుణ్ఠీమరిచ పిప్పల్యః కార్షికాః స్యుః పృథక్పృథక్। ద్విగుణేశర్కరైతే

చ శఙ్ఖినీ స్యాచ్చతుర్గుణా॥ నీలినీమష్టగుణితాం ద్విరష్టగుణితాం తథా। దన్తీం ద్రవన్తీం త్వక్ శాణమేకం నాత్రి ప్రదాపయేత్ ॥ తస్మాదర్ధ పలం చూర్ణాల్లిహ్యాన్మాక్షిక సంయుతమ్।శీతోదకానుపానం తు నిరపా యం విరేచనమ్ ॥35॥

అ॥ అర్ధప్రస్థము ద్రాక్షపండ్లతోకూడిన దంతియొక్క రెండుపలముల కషాయమును పైత్తకాస పాండురోగము వీనియందు శోధనమునిమిత్తము ఈయవలయును. దంతీకల్కమును బెల్లమును సమభాగములుగ కలిపి చన్నీటితో కామిర్లయందు విరేచనమునిమిత్తమీయవలయును. శ్లేష్మముగ నుండును. శుంఠి మిరియాలు పిప్పళ్ళు వీని నొక్కొక్కకర్షముగను, పంచదారఏలకులు వీనిని రెండేసికర్షములుగను, ఈశ్వరిని నాలుగుకర్షములుగను, నీలిని ఎనిమిదికర్షములుగను, దంతి పెద్దదంతి వీనిని పదునారేసి కర్షములుగను, దాసెనచెక్కను శాణముగను గ్రహించి చూర్ణింపవలయును. ఈచూర్ణమును తేనెతో అర్ధపలపరిమితిగ పుచ్చుకొని చన్నీటిని అనుపానముగ త్రాగినయెడల సుఖముగ విరేచనములగును.

మూ॥ శ్యామాదన్తీరసే గౌడః పిప్పలీఫలచిత్రకైః । లిప్తేఽరిష్టేఽనిలశ్లేష్మప్లీహపాణ్డూదరాపహః ॥ తథా దన్తీద్రవన్త్యోశ్చ కషాయే సాజగన్ధయోః । గౌడః కార్యోఽజశృఙ్గ్యా వా స వై సుఖవిరేచనః॥ తచ్చూర్ణ క్వాథమాషామ్బుకిణ్వోత్థోయ సముద్భవా। మదిరా కఫగుల్మాల్పవహ్నిపార్శ్వఽ కటిగ్రహే॥ అజగన్ధాకషాయేణ సౌవీరకతుషోదకే। సురాకమ్బిల్లకే యోగో లోధ్రవచ్చ తయోః స్మృతః ॥39॥

అ॥ నల్లతెగడ దంతి వీనియొక్కరసమును పిప్పళ్ళు ప్రేంగకాయలు చిత్రమూలము వీనియొక్కకల్కముతో పూయబడిన కుండయందుపోసి బెల్లమునుకలిపి అరిష్టమును తయారుచేసి వాతవ్యాధులు కఫవ్యాధులు ప్లీహవ్యాధి పాండురోగము ఉదరవ్యాధి వీనియందీయవలయును. అజామోదముతోగాని దుష్టపుతోగాని కూడిన దంతి పెద్దదంతి వీనియొక్కకషాయమునందు బెల్లమును కలిపి అరిష్టముగ తయారుచేసి ఇచ్చినయెడల సుఖముగ విరేచనము లగును. దంతీద్రవంతుల యొక్క చూర్ణమును వీనియొక్క కషాయమును మినపకషాయమును కిణ్వమును జలమును కలిపి తయారుచేయబడిన మద్యము కఫమును గుల్మమును అగ్నిమాంద్యమును పార్శ్వములయందలి బాధను కటిప్రదేశమునందలి బాధను నశింపజేయును. దంతిని పెద్దదంతిని గ్రహించి అజామోదకషాయముతో సౌవీరకమునుగాని తుషోదకమునుగాని తయారుచేసి ఇయ్యవలయును. తిల్వకకల్పాధ్యాయమునందు లొద్దుగతో చెప్పబడిన విధమున దంతి పెద్దదంతి వీనితో సురనుతయారుచేసి ఈయవలయును. లొద్దుగచూర్ణమునువలె వీనియొక్క చూర్ణమును కంపిల్లకకషాయముతో నీయవలయును.

## అధ్యాయ సంగ్రహము.

మూ॥ దధ్యాదిషు త్రయః పఞ్చ ప్రియాలాద్యైస్త్రయోరసే । స్నేహేషు వైత్రయో లేహాః షట్ చూర్ణే త్వేక ఏవ చ॥ ఇక్ష్వావేక స్తథా ముద్గ మాంసానాం చ రసాస్త్రయః । యవాగ్వాదా త్రయ శ్చైకఉక్త ఉత్కారికావిధౌ॥ ఏకశ్చ మోదకే మద్యే చైక స్తత్క్వ థతైలకే । చూర్ణమేకం పునశ్చైకో మోదకః పఞ్చ చాసవే॥ ఏకః సౌవీరకేఽథైకో యోగః స్యాత్తు తుషోదకే । ఏకా సురా కమ్పిల్లకే స్త్వేకః పఞ్చ ఘృతే స్మృతాః॥ దన్తీద్రవన్తీకల్పేఽస్మిన్ప్రోక్తాః షోడ శకాస్త్రయః। నానావిధానాం యోగానాం భక్తిదోషామయాన్ప్రతి॥

అ॥ ఈదంతీద్రవంతీ కల్పాధ్యాయమునందు పెరుగుమీది తేట మొదలగువానితో మూడును, సారకషాయము మొదలగువానితో నైదును, మాంసరసములతో మూడును, స్నేహరూపమున మూడును, లేహరూపమున ఆరును, చూర్ణరూపమున నొకటియు, చెరుకుతో నొకటియు, పెసలు మాంసములు వీనియొక్క రసములరూపమున మూడును, యవాగువు మొదలగువానిరూపమున మూడును, ఉత్కారికలు మోదకములు మద్యము వీనిరూపమున ఒక్కొక్కటియు, క్వాథతైలములతో నొకటియు, చూర్ణము మోదకము వీనిరూపమున మరల నొక్కొక్కటియు, ఆసవరూపమున నైదును, సౌవీరకము తుషోదకము సుర వీనిరూపమున ఒక్కొక్కటియు, కంపిల్లక కషాయముతో నొకటియు, ఘృతములతో నైదును ఇట్లు నలుబది యెనిమిదియోగములు చెప్పబడినవి. ఇష్టానుసారముగ నుపయోగించుటకును, దోషములు వ్యాధులు ఇవి నశించుటకును అనేకవిధములైన యోగములు ఇట్లు చెప్పబడినవి.

మూ॥ త్రిశతం పఞ్చపఞ్చాశద్యోగానాం వమనేస్మృతమ్। ద్వే శతే నవకాశః పఞ్చ యోగానాంతు విరేచనే॥ ఊర్ధ్వానులోమభావానా మిత్యుక్తాని శతాని షట్ । ప్రాధాన్యతః సమాశ్రిత్య ద్రవ్యాణి దశ పఞ్చ చ॥ యద్ధి యేన ప్రధానేన ద్రవ్యం సముపసృజ్యతే । తత్సం జ్ఞకః స సంయోగో భవతీతి వినిశ్చితమ్॥ ఫలాదీనాం ప్రధానానాం గుణభూతాః సురాదయః । తే హి తాన్యనువర్తన్తే మనుజేన్ద్రమి వేతరే ॥48॥

అ॥ ఈకల్పస్థానందు ఊర్ధ్వాధోభాగములయందలి దోషములను తీసివేయుం నిమిత్తము మ్రంగకాయ మొదలగు పదునైదుద్రవ్యములను ప్రధానముగ ననుసరించి మూడువందలఏబదియైదు వమనయోగములును, రెండువందల నలుబదియైదు విరేచన యోగములును, ఇట్లు ఆరువందల యోగములు వివరింపబడినవి. ఏయోగమునందు

ఏద్రవ్యము ప్రధానముగనుండునో ఆయోగము ఆద్రవ్యముయొక్క పేరునుగలిగియుండును. ఇతరులు రాజునువలె అప్రధానములగు సురామద్యము మొదలగునవి ప్రధానములగు ద్రాక్షాయు మొదలగువానిని అనుసరించియుండును.

మూ॥ విరుద్ధవీర్యమప్యేషాం ప్రధానానామబాధకమ్ । అధికం తుల్యవీర్యేఽపి క్రియాసామర్థ్యమిష్యతే॥ ఇష్టవర్ణ రసస్పర్శగన్ధార్థం ప్రతి చామయమ్ । అతో విరుద్ధవీర్యాణాం ప్రయోగ ఇతి నిశ్చితమ్॥

అ॥ యోగములయందు చేర్చబడిన ఇతరద్రవ్యములు ప్రధానద్రవ్యములకువిరుద్ధమైన వీర్యముకలవైనను ప్రధానద్రవ్యముల యొక్కగుణములను చెడగొట్టవు. ఇతరద్రవ్యములు సమానమైన వీర్యముకలవైనచో గుణాధిక్యమును కలిగించును. ఆయారోగికి ఇష్టములైన వర్ణము రసము స్పర్శము గంధము ఇవికలుగుటకై విరుద్ధవీర్యముగల ఇతరద్రవ్యములు చేర్చబడుచున్నవి.

మూ॥ భూయశ్చైషాం బలాధానం కార్యం స్వరసభావనైః। సుభావితం హ్యల్పమపి ద్రవ్యం స్యాద్బహుకర్మకృత్ ॥ సర్వాస్తైస్తుల్యవీర్యైర్వా తస్మాద్ద్రవాణి భావయేత్। అల్పస్యాపి మహార్థత్వం ప్రభూతస్యాల్పకర్మతామ్॥ కుర్యాత్సం యోగవిశ్లేషకాలసంస్కారయుక్తిభిః॥ ప్రదేశమాత్రమేతావద్ద్రష్టవ్యమిహ షట్ శతమ్॥ స్వబుద్ధ్యైవం సహస్రాణి కోటీర్వాపి ప్రకల్పయేత్ । బహుద్రవ్య వికల్పత్వాద్యోగ సంఖ్యా న విద్యతే ॥54॥

అ॥ సమానమైన వీర్యముగల ద్రవ్యములయొక్క స్వరములతో భావనచేసినయెడల అల్పగుణములుకల ద్రవ్యములుకూడ అధికగుణములు కలవగును. అందువలన ద్రాక్షాయ మొదలగు ద్రవ్యములను ఆయాస్వరసములతో భావనచేసి వానికి మంచిగుణములను కలిగింపవలయును. స్వల్పగుణములు కలవానికి అధికగుణములను అధికగుణములుకలవానికి స్వల్పగుణములను, సంయోగము వియోగము కాలము సంస్కారము యుక్తి వీనిచే కలుగజేయవచ్చును. ఈస్థానమునందు సంగ్రహముగ ఆరువందలయోగములు చెప్పబడినవి. బుద్ధిమంతుడగువాడు తన బుద్ధితో వేలకొలదిగాని కోట్లకొలదిగాని యోగములను కల్పించుకొనవచ్చును. ద్రవ్యవికల్పములనేకవిధములుగ నుండుటవలన యోగములయొక్కసంఖ్యను నిర్ధారణగ చెప్పుటకు వీలులేదు.

మూ॥ తీక్ష్ణమధ్యమృదూనాం తు తేషాం శృణుత లక్షణమ్ । సుఖం క్షిప్రం మహావేగ మసక్తం యత్ప్రవర్తతే॥ నాతిగ్లానికరం పాయౌ హృదయే న చ రుక్కరమ్ । అగ్నేరాశయమక్షిణ్వాన్కృత్స్నం దోషం నిరస్యతి॥ విరేచనం నిరూహం వా తత్తీక్ష్ణమితి నిర్ది

శేత్ । జలాగ్నికీటైరస్పృష్టం దేశకాలగుణాన్వితమ్ । ఈషన్మాత్రాధికైరుక్తం తుల్యవీర్యైః సుభావితమ్ । స్నేహస్వేదోపపన్నస్య తీక్ష్ణత్వం యాతి భేషజమ్ ॥ కిఞ్చిదేభిర్గుణైర్హీనం పూర్వోక్తైర్మాత్రయా తథా । స్నిగ్ధస్విన్నస్య వా సమ్యఙ్మధ్యం భవతి భేషజమ్ ॥ మన్దవీర్యం తు రూక్షస్య హీనమాత్రం తు భేషజమ్ । అతుల్యవీర్యైః సంయుక్తం మృదు స్యాన్మన్దవేగవత్ ॥ అకృత్స్నదోషహరణాదనుద్ధృతే బలీయసామ్ । మధ్యావరబలానాం తు ప్రయోజ్యే సిద్ధమిచ్ఛతా॥

అ॥ వానియొక్క తీక్ష్ణమధ్యమమృదుస్వభావములు చెప్పబడుచున్నవి. సుఖముగను తొందరగను వేగయుక్తముగను అడ్డులేకుండగను గుదప్రదేశమునందు బాధను కలిగింపకుండగను హృదయమునందు పీడను కలిగింపకుండగను జఠరాగ్నిని చెరచకుండగను సమస్తదోషమును బయలువెడలించునట్టి విరేచకర్మగాని వమనకర్మగాని వస్తికర్మగాని తీక్ష్ణమైనదని చెప్పబడును. ఉదకము అగ్ని క్రిములు వీనిచే చెడగొట్టబడినట్టియు దేశకాలములయొక్క గుణములతో కూడినట్టియు పరిమాణముకంటె కొంచెమధికముగా నుపయోగింపబడినట్టియు సమానమగు వీర్యముగల వానితో భావనచేయబడినట్టియు స్నేహస్వేదములనాచరించినవానికి ప్రయోగింపబడినట్టియు ఔషధము తీక్ష్ణత్వము నొందును. స్నేహస్వేదములనాచరించినవానికి ప్రయోగింపబడినట్టియు పూర్వమునందు చెప్పబడిన లక్షణములు కొద్దిగతక్కువగనున్నట్టియు పరిమాణముకంటె కొంచెముతక్కువగ నుపయోగింపబడినట్టియు ఔషధము మధ్యత్వమునొందును. స్వల్పశక్తికలిగినట్టియు తక్కువపరిమితి కలిగినట్టియు విరుద్ధవీర్యముకలవానితో కూడినట్టియు రూక్షశరీరముగలవానికి ప్రయోగింపబడినట్టియు ఔషధము మృదుత్వమునొందును. ఇది మందవేగముకలదిగ నుండును. మధ్యస్వభావముకల ఔషధమును మృదుస్వభావముకల ఔషధమును సమస్తదోషమును హరింపచేయజాలవు. కావున వీనిని బలవంతులకు ప్రయోగింపరాదు. మధ్యమ బలముకలవారలకును అల్పబలము కలవారలకును ప్రయోగింపవలయును.

మూ॥ తీక్ష్ణో మధ్యో మృదుర్వ్యాధిః సర్వమధ్యాల్ప లక్షణః ।
తీక్ష్ణాదీని బలాపేక్షీ భేషజాన్యేషు యోజయేత్ ॥62॥

అ॥ వ్యాధి తీక్ష్ణమైనదనియు మధ్యమమైనదనియు మృదువైన(అల్పమైన)దనియు మూడువిధములుగ నుండును. సమస్తలక్షణములుకలది తీక్ష్ణమైనదనియు కొన్నిలక్షణములుకలది మధ్యమమైనదనియు స్వల్పలక్షణములుకలది మృదువైనదనియు చెప్పబడును. తీక్ష్ణమధ్య మృదుస్వభావములుగల ఔషధములను తీక్ష్ణమధ్య మృదువాధ్యులయందు బలము ననుసరించి క్రమముగ నీయవలయును.

మూ॥ దేయం త్వనిర్హృతే పూర్వం పీతే పశ్చాత్పునః పునః।
భేషజం వమనార్థాయ ప్రాయ ఆపిత్తదర్శనాత్ ॥ బలస్తైర్విధ్యమాల

ష్య దోషాణామాతురస్య చ । పునః ప్రదద్యాద్భైషజ్యం సర్వశో వా వివర్జయేత్ ॥ నిర్హృతే వాపి జీర్ణే వా దోషనిర్హరణే బుధః । భేషజేఽన్యత్ప్రయుఞ్జీత ప్రార్థయన్సిద్ధిముత్తమామ్ ॥ అపక్వం వమనం దోషం పచ్యమానం విరేచనమ్ । నిర్హరేద్వ మనస్యాతః పాకం న ప్రతిపాలయేత్ ॥66॥

అ॥ మొదటఇచ్చిన ఔషధమువలన దోషము బయలువెడలకున్నచో వమనము నిమిత్తము తరుచు ఔషధము నీయవలయును. పిత్తముకనబడువరకు ఇట్లు ఈయవలయును. దోషములయొక్కయు రోగియొక్కయు అధికమధ్యస్వల్పబలములను తెలిసికొని మరల ఇచ్చుటనుగాని ఇయ్యకుండుటనుగాని చేయవలయును. దోషమును హరింపజేయు నిమిత్తమియ్యబడిన ఔషధము బయటికి వెడలివచ్చినను లోనజీర్ణించినను మరియొక ఔషధము నీయవలయును. వమనౌషధము జీర్ణము కాకుండగను (వెంటనే) విరేచనౌషధము జీర్ణమైనపిదపను దోషమును హరించును. కావున వమనౌషధము జీర్ణమగువరకు నిరీక్షింపకుండ మరల నీయవచ్చును.

మూ॥ ప్రీతే ప్రస్రంసనే దోషాన్న నిర్హృత్య జరాంగతే । వమితే చౌషధే ధీరః పాయయేదౌషధం పునః ॥67॥

అ॥ విరేచనముల నిమిత్త మీయబడిన యౌషధము దోషమును హరింపజేయకుండగనే లోనజీర్ణమైనను వాంతిగ బయలువెడలినను మరల నీయవలయును.

మూ॥ దీప్తాగ్నిం బహుదోషం చ దృఢస్నేహగుణాం నరమ్ । దుస్నిద్ధం తదహర్భుక్తం శ్వోభూతే పాయయేత్పునః॥ దుర్బలో బహుదోషశ్చదోషపాకేణ యోనరః । విరిచ్యతే రసైర్గోభజ్యైర్భూయస్తమను సారయేత్ ॥ వమనైశ్చ విరేకైశ్చ విశుద్ధస్యాప్రమాణతః । భోజనాన్తర పానాభ్యాం దోషశేషం శమం నయేత్ ॥70॥

అ॥ అగ్నిదీప్తి కలిగినట్టియు అధికదోషములు కలిగినట్టియు స్నిగ్ధలక్షణము అధికముగ కలిగినట్టియు సరిగ శుద్ధినొందనట్టియు మనుజునకు ఆరోజున ఆహారము నిచ్చి మరునాడు మరల విరేచనౌషధము నీయవలయును. దుర్బలుడైనట్టియు మనుజునకుతగు విధములైన మాంసరసములను ఆహారములను ఇచ్చుచు మలమును ఇంకను వెడలనీయవలయును. వమనములచేగాని విరేచనములచేగాని సరిగ శుద్ధినొందని మనుజునకు మిగిలిన దోషము శమించుటకై తగిన ఆహారములను కషాయములను ఇయ్యవలయును.

మూ॥ దుర్బలం శోధితం పూర్వమల్పదోషం చ మానవమ్ । అపరిజ్ఞాతకోష్ఠం చ పాయయేదౌషధం మృదు॥ శ్రేయో మృద్వసకృత్పీతమల్పబాధం నిరత్యయమ్ । న చాతితీక్ష్ణం యత్ క్షిప్రం జనయే

త్ప్రాణసంశయమ్॥ దుర్బలోఽపి మహాదోషో విరేచ్యో బహుశోఽల్పశః। మృదుభిర్భేషజైర్దోషా హన్యుర్హ్యేనమనిర్హృతాః ॥73॥

అ॥ దుర్బలుడైనట్టియు పూర్వమునందు శుద్ధినొందినట్టియు స్వల్పదోషములు కలిగినట్టియు తెలియబడనికోష్ఠస్వభావము కలిగినట్టియు మనుజునకు మృదుస్వభావము కల ఔషధము నీయవలయును. మృదుస్వభావముకల ఔషధమును తరుచుయిచ్చినను అధికమగుబాధను అపాయమును కలిగింపదు. కావున దానినిచ్చుట శ్రేష్ఠముగ నుండును. అతితీక్ష్ణమైన ఔషధము ప్రాణసంశయమును కలిగించును. కావున దీని నీయకూడదు. రోగి దుర్బలుడుగనున్నను దోషమధికముగనున్నచో మృదుస్వభావము గల ఔషధములను కొద్దికొద్దిగ తరుచుయిచ్చి దోషములను వెడలింపజేయవలయును. అట్లు వెడలింపచేయనిచో రోగిని చంపును.

మూ॥ యస్యోర్ధ్వం కఫసంసృష్టం పీతం యాత్యానులోమికమ్। వమితం కవలైః శుద్ధం లఙ్ఘితం పాయయేత్తు తమ్॥ విబద్ధేఽల్పం చిరాద్దోషే స్రవత్యుష్ణం పిబేజ్జ్వరమ్। తేనాధ్మానం సతృట్ ఛర్దిర్విబన్ధశ్చ వశామ్యతి॥ భేషజం దోషరుద్ధం చేన్నోర్ధ్వం నాధః ప్రవర్తతే। సోద్గారం చ సశూలం చ స్వేదంతత్రావచారయేత్॥ సువిరిక్తస్తు సోద్గారమాశ్వేవౌషధముల్లిఖేత్ । అతిప్రవృత్తం జీర్ణే తు సుశీతైః స్తమ్భయేద్భిషక్ ॥ కదాచిచ్ఛ్లేష్మణా రుద్ధం తిష్ఠత్యాగసి భేషజమ్ । క్షీణే శ్లేష్మణి సాయాహ్నే రాత్రౌ వాతత్ప్రవర్తతే ॥78॥

అ॥ ఇయ్యబడిన విరేచనౌషధము కఫముతోకలిసి ఊర్ధ్వముఖమున బయలు వెడలినచో పిదప కవలములచే (పుక్కిలింతలచే) ముఖమును కంఠమును శుద్ధినొందించి లంఘనమును చేయించి మరల విరేచనౌషధము నీయవలయును. దోషము అడ్డుతోకూడి చిరకాలమునకు కొద్దిగబయలువెడలుచున్నచో వేడినీటిని ఇయ్యవలయును. అట్లిచ్చినచో కడుపుబ్బరము దప్పిక వాంతి విబంధము ఇవి నశించును. ఔషధము దోషములచే అరికట్టబడినదై ఊర్ధ్వముఖమునగాని అధోముఖమునగాని బయలు వెడలక త్రేణుపులును బాధయు కలిగినచో స్వేదకర్మను చేయింపవలయును. విరేచనములు బాగుగఅయినపిదప మందుయొక్క త్రేణుపులు వచ్చుచున్నచో ఆమందును వాంతిగ వెడలింపజేయవలయును. మందుజీర్ణమై విరేచనము లధికముగనగుచున్నచో శీతల క్రియలచే స్తంభింపజేయవలయును. ఒకానొకప్పుడు ఔషధము కఫముచే అరికట్టబడినదై రొమ్మునందుండును. కఫము క్షీణించినపిదప సాయంకాలమునందుగాని రాత్రియందుగాని ఆఔషధము దోషముతోకూడ బయలువెడలును.

మూ॥ రూక్షానాహారయోర్జీర్ణే విష్టభ్యోర్ధ్వం గతేఽపి వా। వాయునా భేషజేత్వన్యత్సస్నేహలవణం పిబేత్ ॥ తృణ్మోహభ్రమమూర్ఛాద్యాః స్యుశ్చేజ్జీర్యతి భేషజే। పిత్తఘ్నం స్వాదు శీతం చ భేష

జం తత్ర శస్యతే॥ లాలాహృల్లాసవిష్టమ్భలో మహార్గాః కఫావృతే। భేషజం తత్ర తీక్ష్ణోష్ణం కట్వాది కఫనుద్ధితమ్॥ సుస్నిగ్ధం క్రూరకోష్ఠం చ లఙ్ఘయేదవిరేచితమ్। తేనాస్య స్నేహజః శ్లేష్మా సిఙ్గశ్చైవోపశామ్యతి ॥౮౩॥

అ॥ రూక్షశరీరముకలవానికిని ఆహారమును భుజింపనివానికిని ఔషధము జీర్ణమగుటవలనగాని వాతముచే స్తంభింపబడి ఊర్ధ్వభాగము నందుండుటవలనగాని విరేచనములుకానియెడల స్నేహలవణములతో కూడిన మరియొక ఔషధము నీయవలయును. పిత్తప్రకోపమువలన ఔషధముజీర్ణమై విరేచనములుసరిగ కాకుండి దప్పిక మోహము భ్రమ మూర్ఛ మొదలగునవి కలిగినయెడల పిత్తమును నశింపజేయునదియు స్వాదురసమును శీతవీర్యమును కలదియు నగు ఔషధము నీయవలయును. ఔషధముకఫముతో కూడుటవలన విరేచనములు సరిగ కాకుండి చొల్లుకారుట వాంతి వచ్చునట్లుండుట విష్టంభము గగుర్పాటు ఇవికలిగినచో తీక్ష్ణగుణమును ఉష్ణవీర్యమును కలదియు కటురసము మొదలగునవికలదియు కఫమునునశింపజేయునదియు నగు ఔషధము నీయవలయును. బాగుగ చేయింపబడిన స్నేహకర్మ కలిగినట్టియు క్రూరకోష్ఠము కలిగినట్టియు మనుజునకు విరేచనములు సరిగ కాకున్నచో లంఘనమును చేయింపవలయును. అట్లు చేయించినయెడల స్నేహకర్మలవలనజనించిన కఫమును దోషముల యొక్క కూడికయు నశించును.

మూ॥ రూక్షబహ్వనిలక్రూరకోష్ఠవ్యాయామశీలినామ్। దీప్తాగ్నీనాం చ భైషజ్యమవిరిచ్యైవ జీర్యతి॥ తేభ్యో వస్తిం పురాదత్త్వా పశ్చాద్దద్యాద్విరేచనమ్। వస్తిప్రవర్తితం దోషం హరేచ్ఛీఘ్రం విరేచనమ్ ॥౮౪॥

అ॥ రౌక్ష్యము అధికవాతము క్రూరకోష్ఠము వ్యాయామము అగ్నిదీప్తి ఇవికల వారలకు ఇయ్యబడిన ఔషధము విరేచనములను చేయకుండగనే జీర్ణమునొందును. అట్టివారలకు తొలుత వస్తిని చేయించి పిదప విరేచనౌషధము నియ్యవలయును వస్తికర్మచే బయలువెడలుటకు సిద్ధముగనున్న దోషమును, పిదప ఇయ్యబడిన విరేచనౌషధము వెంటనే హరింపచేయును.

మూ॥ రూక్షాశనాః కర్మనిత్యా యే నరా దీప్తపావకాః। తేషాం దోషాః క్షయం యాన్తి కర్మవాతాతపాగ్నిభిః॥ విరుద్ధాధ్యశనాజీర్ణాన్ దోషానపి జయన్తి తే। స్నేహ్యాస్తే మారుతాద్రక్ష్యా నావ్యాధౌ తాన్విశోధయేత్॥ నాతిస్నిగ్ధశరీరాయా దద్యాత్స్నేహవిరేచనమ్। స్నేహోత్క్లిష్టశరీరాయ రూక్షం దద్యాద్విరేచనమ్॥౮౫॥

అ॥ రూక్షాహారమును భుజించునట్టియు వ్యాయామమును చేయునట్టియు జాఠర

దీప్తికలిగినట్టియు మనుజులకు వ్యాయామము వాతము ఆతపము జాఠరాగ్ని వీనిచే దోషములు క్షయమునొందును. విరుద్ధాహారము అధ్యశనము అజీర్ణకరభోజనము వీని వలన కలుగు దోషములుకూడ సంభవింపవు. వారలకు తరుచు స్నేహమును చేయించుచు వాతమునుండి రక్షింపవలయును. వీరలకు వ్యాధిలేనప్పుడు విరేచనమును చేయింపకూడదు. అతిస్నిగ్ధమైన శరీరముకలవానికి స్నేహయుక్తమైన విరేచనౌషధము నీయకూడదు. రూక్షగుణముకల విరేచనౌషధము నీయవలయును.

మూ॥ ఏవం జ్ఞాత్వా విధిం ధీరో దేశకాలప్రమాణవిత్ । విరేచనం విరేచ్యేభ్యః ప్రయచ్ఛన్నాపరాధ్యతి॥ విభ్రంశో విషవద్యస్య సమ్యగ్యోగో యథామృతమ్। కాలేష్వవశ్యం పేయం చ తస్మాద్యత్నాత్ప్రయోజయేత్ ॥89॥

అ॥ దేశము కాలము పరిమాణము వీనిని గుర్తెరిగిన వైద్యుడు పైనచెప్పబడిన విధానములను తెలిసికొని విరేచనములను చేయింపతగినవానికి విరేచనౌషధమును ఇచ్చినచో ప్రమాదమునొందడు. శోధనౌషధమును సరిగ ప్రయోగింపనిచో విషతుల్యముగను, సరిగ ప్రయోగించినచో అమృతతుల్యముగను నగును. అందువలన విరేచనౌషధమును సకాలమునందు సరిగ నీయవలయును.

మూ॥ ద్రవ్యప్రమాణం తు యదుక్తమస్మిన్మధ్యేషు తత్కోష్ఠవయోబలేషు। తన్మూలమాలమ్బ్య భవేద్వికల్పస్తేషాం వికల్పోఽభ్యధికోనభావః ॥90॥

అ॥ ఇదివరలో చెప్పబడిన ఔషధపరిమాణములు కోష్ఠమును వయస్సును బలమును మధ్యమముగ నున్నవారలకు హితకరముగ నుండునట్లు చెప్పబడినవి. ఆపరిమాణములను ఆధారముగ చేసికొని అధికపరిమాణముగ గాని స్వల్పపరిమాణముగ గాని తగు విధమున నీయవలయును.

మూ॥జాలాన్తరగతైర్భానుకరైర్వంశీ విలోక్యతే। షడ్వంశ్యస్తు మరీచిః స్యాత్ షణ్మరీచ్యస్తు సర్షపః॥ అష్టౌ తే సర్షపా రక్తాస్తణ్డులశ్చాపి తద్ద్వయమ్ । ధాన్యమాషో భవేదేకో ధాన్యమాషద్వయం యవః॥ అణ్డికా స్తే తు చత్వారస్తాశ్చతస్రస్తు మాషకః। హేమశ్చ ధాన్యకశ్చోక్తో భవేచ్ఛాణస్తు తే త్రయః॥ శాణౌ ద్వౌ ద్రఙ్క్షణో విద్యాత్కోలం బదరమేవ చ । విద్యాద్ద్వౌ ద్రఙ్క్షణౌ కర్షం సువర్ణం చాక్షమేవ చ ॥ బిడాలపదకం తచ్చ పిచుం పాణితలం తథా। తిన్దుకం చ విజానీయాత్కవలగ్రహమేవ చ॥ ద్వే సువర్ణే పలార్ధం స్యాచ్ఛుక్తిరష్టమికా తథా। ద్వే పలార్ధే పలం ముష్టిః ప్రకుఞ్చోఽథ చతుర్థికా॥

బిల్వం షోడశికం చామ్రం ద్వే పలే ప్రసృతం విదుః। పలం చతుర్గు
ణం విద్యాదఞ్జలిం కుడవం తథా॥ అష్టమానం తు విజ్ఞేయం కుడవౌ
ద్వౌ తు మానికా। చత్వారః కుడవాః ప్రస్థ శ్చతుఃప్రస్థమథాఢ
కమ్॥ పాత్రం తదేవ విజ్ఞేయం కంసః ప్రసాష్టకం తథా। కంస
శ్చతుర్గుణో ద్రోణశ్చార్మణం నల్వనం చ తత్॥ స ఏవ కలశః
ఖ్యాతో ఘట ఉన్మానమేవ చ। ఘటస్తు ద్విగుణః శూర్పో విజ్ఞేయః
కుమ్భ ఏవ చ॥ గోణీం శూర్పద్వయం విద్యాత్ఖారీం భారీం తథైవ
చ। ద్వాత్రింశతం విజానీయాద్వాహం శూర్పాణి బుద్ధిమాన్।
తులాం శతపలం విద్యాత్పరిమాణవిశారదః ॥101॥

అ॥ గవాక్షరంధ్రమునుండి ప్రసరించు సూర్యకిరణములయందు కనబడు రేణువు వంశియనబడును. ఆరువంశిలు మరీచియనబడును. ఆరుమరీచులు సర్షపమనబడును. ఎనిమిది సర్షపములు రక్తియనబడును. ఈరక్తికకు తండులఅనునది పర్యాయపదముగ నుండును. రెండురక్తికలు ధాన్యమాషమనబడును. రెండుధాన్యమాషములు యవమన బడును. నాలుగుయవలు అండకమనబడును. నాలుగుఅండకములు మాషమనబడును. హేమ, ధాన్యక అనునివి మాషమునకు పర్యాయపదములుగ నుండును. మూడు మాషములు శాణమనబడును. రెండుశాణములు ద్రంక్షణమనబడును. కోల, బదర అనునివి ద్రంక్షణమునకు పర్యాయపదములుగ నుండును. రెండు ద్రంక్షణములు కర్షమనబడును. సువర్ణ, అక్ష, బిడాలపదక, పిచు, పాణితల, తిందుక, కవలగ్రహ అనునివి కర్షమునకు పర్యాయపదములుగ నుండును. రెండుకర్షములు అర్ధపలమన బడును. శుక్తి, అష్టమిక అనునివి అర్ధపలమునకు పర్యాయపదములుగ నుండును. రెండు అర్ధపలములు పలమనబడును. ముష్టి, ప్రకుంచ, చతుర్థిక, బిల్వ, షోడశిక, ఆమ్ర అనునివి పలమునకు పర్యాయపదములుగ నుండును. రెండుపలములు ప్రసృతమనబడును. నాలుగుపలములు కుడవమనబడును. అంజలి, అష్టమాన అనునివి కుడవమునకు పర్యాయపదములుగ నుండును. రెండుకుడవములు మానికయనబడును. నాలుగు కుడవములు ప్రస్థమనబడును. నాలుగు ప్రస్థములు ఆఢకమనబడును. పాత్రఅనునది ఆఢకమునకు పర్యాయపదముగ నుండును. ఎనిమిదిప్రస్థములు కంసమనబడును. నాలుగుకంసములు ద్రోణమనబడును. ఆర్మణ, నల్వన, కలశ, ఘట, ఉన్మాన అనునివి ద్రోణమునకు పర్యాయపదములుగ నుండును. రెండుద్రోణములు శూర్పమనబడును. కుంభ అనునది శూర్పమునకు పర్యాయపదముగ నుండును. రెండుశూర్పములు గోణియనబడును, ఖారి, భారి అనునవి గోణికి పర్యాయపదములుగ నుండును. ముప్పదిరెండుశూర్పములు వాహామనబడును. నూరుపలములు తులమనబడును.

మూ॥ శుష్కద్రవ్యేష్విదం మానమేవమాదిప్రకీర్తితమ్। ద్విగు
ణం తద్ద్రవేష్విష్టం తథా సద్యోద్ధృతేషు చ॥ యద్ధి మానం తులా

ప్రోక్తా పలం వా తత్ప్రయోజయేత్ । అనుక్తే పరిమాణే తు తుల్యం మానం ప్రకీర్తితమ్॥ ద్రవకార్యేఽపి చానుక్తే సర్వత్ర సలిలం స్మృతమ్। యతశ్చ పాదనిర్దేశశ్చతుర్భాగస్తతశ్చ సః॥ జలస్నేహౌషధానాం తు ప్రమాణం యత్ర నేరితమ్। తత్ర స్యాదౌషధాత్స్నేహః స్నేహాత్తోయం చతుర్గుణమ్ ॥ 05॥

అ॥ పైనజెప్పబడినమానము శుష్కద్రవ్యములవిషయమని గ్రహింపవలయును. ద్రవద్రవ్యములనుగాని తత్కాలమునందు తీసికొనిరాబడిన (పచ్చిగనున్న) వస్తువులనుగాని రెట్టింపుగ గ్రహింపవలయును. తులాశబ్దమునుగాని పలశబ్దమునుగాని ప్రయోగించినపుడు రెట్టింపుగ గ్రహింపవలయును. ద్రవపదార్థము చెప్పబడనపుడు జలమును గ్రహింపవలయును. పాదమని చెప్పినప్పుడు నాలుగవవంతుగ గ్రహింపవలయును. ద్రవద్రవ్యము స్నేహము కల్కము వీనియొక్క పరిమాణము చెప్పబడనియెడల కల్కమునకు నాలుగురెట్లు స్నేహమును స్నేహమునకు నాలుగురెట్లు ద్రవద్రవ్యమును గ్రహింపవలయును.

మూ॥ స్నేహపాకస్త్రిధా జ్ఞేయో మృదుర్మధ్యః ఖరస్తథా । తుల్యే కల్కేన నిర్యాసే భేషజానాం మృదుః స్మృతః॥ సయావ ఇవ నిర్యాసే మధ్యో దర్వీం విముఞ్చతి। శీర్యమాణే తు నిర్యాసే వర్త్యమానో ఖరస్తథా। ఖరోఽభ్యఙ్గే మృదుర్నస్యే పానే వస్తౌ చ మధ్యమః॥

అ॥ మృదుపాకమనియు మధ్యపాకమనియు ఖరపాకమనియు స్నేహపాకము మూడువిధములుగ నుండును. స్నేహము తయారైనపిదప అడుగుననున్న కల్కము మొదటవేసిన కల్కముతో సమానముగనున్నచో మృదుపాకమనియు, ముద్దవలెనుండి గరిటెకు అంటకున్నచో మధ్యపాకమనియు, వేళ్ళతో నలిపినయెడల విడిపోవుచున్నచో ఖరపాకమనియు తెలిసికొనవలయును. అభ్యంగనము నిమిత్తము ఖరపాకమును, నస్యకర్మనిమిత్తము మృదుపాకమును, పానము వస్తికర్మ వీనినిమిత్తము మధ్యపాకమును ఉపయోగింపవలయును.

కల్పస్థాన సంగ్రహము.

మూ॥ కల్పార్థః శోధనం సంజ్ఞా పృథగ్ఘేతుః ప్రవర్తనే। దేశాదీనాం ఫలాదీనాం గుణా యోగాః శతాని షట్॥ వికల్ప హేతుర్మానాని తీక్ష్ణమధ్యాల్పలక్షణమ్ । విధిశ్చావస్థికో మానం స్నేహపాకశ్చ దర్శితమ్ ॥110॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే కల్పస్థానే దన్తీద్రవన్తీకల్పో నామ ద్వాదశోఽధ్యాయః॥

అ॥ కల్పస్థానముయొక్క ప్రయోజనము, వమనవిరేచన సంజ్ఞ, దోషములు ఊర్ధ్వమార్గముగగాని, అధోమార్గముగగాని వెడలుటకు కారణమును, దేశాదుల యొక్క గుణములు, మ్రంగకాయ మొదలగువానియొక్క గుణములు, ఆరువందల యోగములు, అనేకవిధములగు కల్పనలను చెప్పుటకు కారణము, మ్రంగకాయ మొదలగువానియొక్క పర్యాయపదములు, తీక్ష్ణమధ్య మృదుస్వభావములు, ఆయా అవస్థల యందు చేయతగిన విధి, మానపరిభాష, స్నేహపాకము ఇవి ఈ కల్పస్థానమునందు చెప్పబడినవి.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు దంతీద్రవంతీకల్ప మనెడు ద్వాదశాధ్యాయము సమాప్తము.

---

కల్పస్థానము సమాప్తము



# సిద్ధిస్థానము.

## ప్రథమాధ్యాయము.

మూ॥ అథాతః కల్పనాసిద్ధిం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట కల్పనాసిద్ధిని చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ కా కల్పనా పఞ్చసు కర్మసూక్తా క్రమశ్చ కః కిం చ కృతాకృతేషు। లిఙ్గం తథైవాతికృతేషు సఙ్ఖ్యా కా కిం గుణాః కేషు చ కశ్చ వస్తిః కిం వర్జనీయం ప్రతికర్మకాలే కృతే క్రియాన్వా పరిహారకాలః। ప్రణీయమానశ్చ న యాతి వస్తిః కేనైతి శీఘ్రం సుచిరాచ్చ కేన ॥ సాధ్యా గదాః స్వైః శమనైశ్చ కేచిత్కస్మాత్ప్రయుక్తైర్న శమం వ్రజన్తి। ప్రచోదితః శిష్యవరేణ సమ్యగిత్యగ్నివేశేన భిషగ్వరిష్ఠః। పునర్వసుస్తన్త్రవిదాహ తస్మై సర్వప్రజానాం హితకామ్యయేదమ్ ॥౫॥

అ॥ పంచకర్మలయందు ఎట్టికల్పన చెప్పబడినది ? శోధనానంతరమునందు ఎట్టి క్రమము నాచరింపవలయును? సరిగ చేయబడినప్పుడుగాని సరిగ చేయబడనప్పుడుగాని అధికముగ చేయబడినప్పుడుగాని ఎట్టిలక్షణములు కలుగును? ఎంతసంఖ్యగ చేయింపవలయును? ఎట్టిగుణములు కలుగును? ఎవరలకు ఎట్టివస్తిని చేయింపవలయును? చేయించినపిదప వేనిని విడిచిపెట్టవలయును? ఎంతకాలము విడిచిపెట్టవలయును? ప్రయోగింపబడినవస్తి ఏకారణముచే లోనికి ప్రవేశింపనేరదు? ఏకారణముచే బయటికి శీఘ్రముగ వచ్చివేయును? ఏకారణముచే బయటికి ఆలస్యముగ వచ్చును? సాధ్యములైన కొన్నివ్యాధులు తమయొక్క శమనచికిత్సలచే ఎందువలన శాంతినొందవు? అని శిష్యుడైన అగ్నివేశునిచే ఇట్లు అడుగబడినట్టియు వైద్యులలో శ్రేష్ఠుడైనట్టియు శాస్త్రమును తెలిసినట్టియు ఆత్రేయుడు సమస్తప్రజలయొక్క మేలుకొరకు అగ్నివేశుని గూర్చి ఇట్లు చెప్పెను.

### పంచకర్మలయందు చేయింపతగినకల్పన.

మూ॥ త్ర్యహావరం సప్తదినం పరం తు స్నిగ్ధో నరః స్వేదయి

తవ్య ఇష్టః। నాతః పరం స్నేహనమాదిశన్తి సాత్మ్యీభవేత్సప్తదినాత్పరం తు॥ స్నేహోఽనిలం హన్తి మృదుం కరోతి దేహం మలానాం వినిహన్తి సఙ్గమ్। స్నిగ్ధస్య సూక్ష్మేష్వయనేషు లీనం స్వేదస్తు దోషం నయతి ద్రవత్వమ్ ॥7॥

అ॥ మూడురోజులకుతక్కువకాకుండగను ఏడురోజులకు ఎక్కువకాకుండగను స్నేహకర్మను చేయింపవలయును. పిమ్మట స్వేదకర్మను చేయింపవలయును. ఏడు రోజులకంటె అధికముగ స్నేహకర్మను చేయింపనవసరములేదు. అధికముగ చేయించినచో అభ్యాసమేయగును. స్నేహకర్మ వాతమును నశింపచేయును. శరీరమునకు మృదుత్వమును కలిగించును. మలసంబంధమగుకూడికను నశింపచేయును. స్నేహకర్మను చేయించినవానికి స్వేదకర్మను చేయించినచో సూక్ష్మమార్గములయందు అణగియున్న దోషమును కరిగించును.

మూ॥ గ్రామ్యాదకానూపరసైః సమాంసైరుత్క్లేశనీయః పయసా చ వమ్యః। రసైస్తథా జాఙ్గలజైః సయూషైః స్నిగ్ధః కఫావృద్ధికరైర్విరేచ్యః॥ శ్లేష్మోత్తరశ్ఛర్దయతి హ్యాదుఃఖం విరిచ్యతే మన్దకఫస్తు సమ్యక్। అధః కఫేఽల్పే వమనం హి గచ్ఛేద్విరేచనం వృద్ధకఫే తథోర్ధ్వమ్॥ స్నిగ్ధాయ దేయం వమనం యథోక్తం వాన్తస్య పేయాదిరనుక్రమశ్చ। స్నిగ్ధస్య సుస్విన్నతనోర్యథావద్విరేచనం యోగ్యతమం ప్రయోజ్యమ్ ॥10॥

అ॥ వమనమునుచేయింపతగినవానికి స్నేహకర్మనుచేయించినపిదప గ్రామమునందును ఉదకమునందును అనూపదేశమునందును సంచరించు జంతువులయొక్క మాంసరసములు మాంసములు వీనిని, పాలను ఇచ్చి కఫమును ఉత్క్లేశమునొందింపవలయును. విరేచనమును చేయింపతగినవానికి స్నేహకర్మనుచేయించినపిదప కఫమును వృద్ధినొందింపని జాంగలమాంసరసములు యూషములు వీనిని ఇయ్యవలయును. ఉత్క్లేశమునొందినకఫముకలవానికి వాంతులు సుఖముగవెడలును. స్వల్పకఫముకలవానికి విరేచనములు బాగుగనగును. కఫమల్పముగనున్నచో వమనౌషధము అధోమార్గమున వెడలును. కఫమధికముగ నున్నచో విరేచనౌషధము ఊర్ధ్వముఖమున వెడలును. స్నేహకర్మనుచేయించినపిదప వమనౌషధమును తగురీతి నియ్యవలయును. వాంతులైన పిదప పేయాదిక్రమమును సరిగ నాచరింపవలయును. స్నేహకర్మను స్వేదకర్మను చేయించినపిదప యోగ్యమైన విరేచనౌషధమును తగువిధమున ఇయ్యవలయును.

శోధనానంతరక్రమము.

మూ॥ పేయాం విలేపీ మకృతం కృతం చ యూషం రసం త్రిర్ద్విరథైకశశ్చ। క్రమేణ సేవేత విశుద్ధకాయః ప్రధానమధ్యావరశుద్ధి

శ్లో॥ యథాఽణురగ్నిస్తృణగోమయాద్యైః సంధుక్ష్యమాణో భవతి క్రమేణ। మహాన్ స్థిరః సర్వసహస్తథైవ శుద్ధస్య పేయాదిభిరన్తరగ్నిః॥

అ॥ శోధనమైనపిదప పేయను, విలేపిని, సంస్కరింపబడినట్టియు సంస్కరింపబడనట్టియు యూషమును, అట్టి మాంసరసమును ప్రధానశుద్ధికలవానికి మూడేసి అన్నకాలములయందును మధ్యమశుద్ధికలవానికి రెండేసి అన్నకాలములయందును స్వల్పశుద్ధికలవానికి ఒక్కొక్క అన్నకాలమునందును యథాక్రమముగ నీయవలయును. స్వల్పముగనున్నయగ్ని, గడ్డి పిడకలు మొదలగువానిచే ప్రజ్వలింపచేయబడినదై క్రమముగ గొప్పదిగను స్థిరమైనదిగను సమస్తమును దహించునదిగను నగును. అటులనే, శోధనానంతరమునందు మందముగ నున్న జాఠరాగ్ని పేయాదులచే వృద్ధి నొందును.

## ప్రధానశుద్ధ్యాదిలక్షణము.

మూ॥ జఘన్యమధ్యప్రవరేషు వేగాశ్చత్వార ఇష్టా వమనే షడష్టౌ। దశైవ తే ద్విత్రిగుణా విరేకే ప్రస్థస్తథా ద్విత్రిచతుర్గుణశ్చ॥ పిత్తాన్తమిష్టం వమనం తథోర్ధ్వమధః కఫాన్తం చ విరేకమాహుః। ద్వి త్రీన్ సవిట్కానపనీయ వేగాన్మేయం విరేకే వమనే తు పీతమ్ ॥14॥

అ॥ వమనములు, నాలుగుసారులగుట స్వల్పశుద్ధిగను ఆరుసారులగుట మధ్యమశుద్ధిగను ఎనిమిదిసారులగుట ఉత్తమశుద్ధిగను నుండును. విరేచనములు, పదిసారులగుట స్వల్పశుద్ధిగను ఇరువదిసారులగుట మధ్యమశుద్ధిగను ముప్పదిసారులగుట ఉత్తమశుద్ధిగను నుండును. విరేచనములు, రెండుప్రస్థములుగనగుట స్వల్పశుద్ధిగను మూడుప్రస్థములుగనగుట మధ్యమశుద్ధిగను నాలుగుప్రస్థములుగనగుట ఉత్తమశుద్ధిగను నుండును, పిత్తము ఊర్ధ్వమున బయలువెడలువరకు వమనమును చేయింపవలయును. కఫము అధోమార్గమున బయలువెడలువరకు విరేచనమును చేయింపవలయును. విరేచనములయందు మలముతోకూడిన మొదటి రెండుమూడు వేగములను, వమనములయందు ఔషధముతోకూడిన వేగమును విడిచిపెట్టి మిగిలిన వేగములను లెక్కపెట్టవలయును.

## సమ్యఙ్మిథ్యాతియోగములు.

మూ॥ క్రమాత్కఫః పిత్తమథానిలశ్చ యస్యైతి సమ్యగ్వమితః స ఇష్టః। హృత్పార్శ్వమూర్ధేన్ద్రియమార్గశుద్ధౌ తథా లఘుత్వేఽపి చ లక్ష్యమాణే॥ దుశ్ఛర్దితే స్ఫోటకకోఠకణ్డూహృత్ఖావిశుద్ధిర్గురుగాత్రతా చ। తృణ్మోహమూర్ఛానిలకోపనిద్రాబలాతిహానిర్వమనేఽతి చ స్యాత్॥ స్రోతోవిశుద్ధీన్ద్రియసంప్రసాదో లఘుత్వమూర్జోఽగ్నిరనామయత్వమ్। ప్రాప్తిశ్చ విట్పిత్తకఫానిలానాం సమ్యగ్విరిక్తస్య భవే

త్క్రమేణ ॥ స్యాచ్ఛ్లేష్మపిత్తానిలసంప్రకోపః స్వేదోఽల్పవహ్నిర్గురు గాత్రతా చ। తన్ద్రా తథా ఛర్దిరరోచకశ్చ వాతానులోమ్యం న చ దుర్విరిక్తే॥కఫాస్రపిత్తక్షయజానిలోత్థాఃసుప్త్యఙ్గమర్దక్లమవేపనాద్యాః॥ నిద్రాబలాభావతమఃప్రవేశా సోన్మాదహిక్కాశ్చ విరేచితేఽతి ॥19॥

అ॥ వమనములు సరిగనైనచో కఫమును పిత్తమును వాతమును క్రమముగ బయలువెడలును. మరియు హృదయము పార్శ్వము శిరస్సు ఇంద్రియములు శరీరము నందలి మార్గములు ఇవి శుద్ధినొందును. శరీరము లఘుత్వమునొందును. సరిగకాక న్నచో బొబ్బలు దద్దుర్లు దురద ఇవి కలుగును. మరియు హృదయమును ఇంద్రియము లును శుద్ధినొందవు. శరీరము బరువుగనుండును. అధికముగనైనచో దప్పిక, మోహము, మూర్ఛ, వాతప్రకోపము, నిద్రయు బలమును అధికముగనశించుట ఈలక్షణములు కలుగును. విరేచనములు సరిగనైనచో స్రోతస్సులు శుద్ధినొందుట, ఇంద్రియములు నిర్మలముగనుండుట, శరీరము చులకనగనుండుట, జాఠరాగ్ని వృద్ధినొందుట, బాధలు లేకుండుట, మలమును పిత్తమును కఫమును వాతమును క్రమముగ వెడలుట ఈలక్షణ ణములు కలుగును. సరిగకాకున్నచో శ్లేష్మమును పిత్తమును వాతమును ప్రకోపించుట, చెమట జనించుట, జాఠరాగ్ని మందగించుట, శరీరము బరువుగనుండుట, పాలుమా లిక, వాంతి, అరోచకము, వాతము అనులోమ్యమునొందకపోవుట ఈలక్షణములు కలుగును. అధికముగనైనచో కఫము రక్తము పిత్తము ఇవి క్షీణించుటవలనకలుగు వ్యాధులును వాతప్రకోపమువలనకలుగు వ్యాధులును జనించును. మరియు శరీరము మొద్దుబారుట ఒడలునొప్పులు బడలిక వణుకు మొదలగునవి కలుగును. నిద్రయు బలమును క్షీణించుట మోహము ఉన్మాదము ఎక్కిళ్ళు ఇవి కలుగును.

## వస్తికల్పనా విషయము.

మూ॥ సంసృష్టభక్తం నవమేఽహ్ని సర్పిస్తం వాయయేతాప్య నువాసయేద్వా । దద్యాత్త్ర్యహోన్నాతి బుభుక్షితాయ తైలాక్త గాత్రాయ నతో నిరూహమ్ ॥ ప్రత్యాగతే మాంసరసేన భోజ్యః సమీక్ష్య వా దోషబలం యథార్హమ్ । నరస్తతో నిశ్యనువాసనార్హో నాత్యాశితః స్యాదనువాసనీయః॥ శీతే వసన్తే చ దివానువాస్యో రాత్రౌ శరద్గ్రీష్మఘనాగమేషు । తానేవ దోషాన్పరిరక్షతా యే స్నేహస్య పానం ప్రతి కీర్తితాః ప్రాక్ ॥22॥

అ॥ సంసర్జనక్రమమును ఆచరించినపిదప ఎనిమిదవరోజున అన్నమును భుజింప జేసి తొమ్మిదవరోజున ఘృతపానమునుగాని అనువాసనవస్తినిగానిచేయింపవలయును. పిమ్మట మూడవరోజున, మిక్కిలి ఆకలినికలిగియుండనట్టియు తైలముచేపూయబడిన శరీరముకలిగినట్టియు వానికి నిరూహవస్తిని చేయింపవలయును. దోషముబయలువెడ లినపిదప మాంసరసముతోగాని దోషబలమును తెలిసికొని అనుకూలమైనవానితోగాని

భుజింపచేయవలయును. పిమ్మట, అనువాసనమునకు అర్హుడైనయెడల స్వల్పమైన ఆహారమును ఇచ్చి రాత్రియందు అనువాసనమును చేయింపవలయును. అనువాసన వస్తిని హేమంత శిశిర వసంత ఋతువులలో పగటియందును శరత్ గ్రీష్మ వర్ష ఋతువులలో రాత్రియందును చేయింపవలయును. అట్లు చేయింపనియెడల స్నేహపానమునందు చెప్పబడిన దోషములు కలుగును.

మూ॥ ప్రత్యాగతే చాప్యనువాసనీయే దివా ప్రదేయం వ్యుషితాయ భోజ్యమ్। సాయం చ భోజ్యాం పరతస్త్ర్యహే వా త్ర్యహే౽నువాస్యో౽హనిపఞ్చమే వా॥ ద్వ్యహేత్ర్యహే వాప్యథ పఞ్చమే వా దద్యాన్నిరూహాదనువాసనం చ ॥24॥

అ॥ అనువాసన స్నేహము బయలువెడలినపిదప ఆ రాత్రియందు ఆహారము నీయక మరునాడు పగటియందును సాయంకాలమునందును ఆహారము నీయవలయును. పిమ్మట మూడవరోజునగాని అయిదవరోజునగాని అనువాసనవస్తిని చేయింపవల యును. నిరూహవస్తిని చేయింపవలసియున్నయెడల రెండవరోజునగాని మూడవ రోజునగాని అయిదవరోజునగాని చేయింపవలయును.

మూ॥ ఏకం తథా త్రీన్కఫజే వికారే పిత్తాత్మకే పఞ్చ తు సప్త వాపి। వాతే నవైకాదశ వా పునర్వా వస్తీనయుగ్మాన్కుశలోవిదధ్యాత్ ॥25॥

అ॥ అనువాసనవస్తులను కఫవ్యాధులయందు ఒకటినిగాని మూడింటినిగాని చేయింపవలయును. పిత్తవ్యాధులయందు అయిదింటినిగాని ఏడింటినిగాని చేయింప వలయును. వాతవ్యాధులయందు తొమ్మిదింటినిగాని పదకొండింటినిగాని చేయింప వలయును. ఇంకను అధికముగ చేయించునెడల బేసిసంఖ్యగనే చేయింపవలయును.

మూ॥ నరో విరిక్తస్తు నిరూహదానం వివర్జయేత్సప్తదినాన్యవశ్యమ్। శుద్ధో విరేకేణ నిరూహదానం తద్ధస్య శూన్యం వికృషేచ్ఛరీరమ్ ॥26॥

అ॥ విరేచనములను చేయించినపిదప నిరూహవస్తిని ఏడుదినములవరకు చేయింపకూడదు. విరేచనములచే శూన్యమైన శరీరము కలవానికి నిరూహవస్తిని చేయించినచో అట్టి శరీరమును కృశింపజేయును.

వస్తికర్మయొక్క ప్రాశస్త్యము.

మూ॥ వస్తిర్వయఃస్థాపయితా సుఖాయుర్బలాగ్నిమేధాస్వరవర్ణకృచ్చ। సర్వార్థకారీ శిశువృద్ధయూనాం నిరత్యయః సర్వగదాపహశ్చ॥ విట్శ్లేష్మమూత్రానిలపిత్తకర్షీ స్థిరత్వకృచ్ఛుక్రబలప్రదశ్చ। విష్వక్స్థితం దోషచయంనిరస్య సర్వాన్వికారాన్ శమయేన్నిరూహః॥

దేహే నిరూహేణ విశుద్ధమార్గే సంస్నేహనం వర్ణబలప్రదం చ । న తైలదానాత్పరమస్తి కిఞ్చిద్ద్రవ్యం విశేషేణ సమీరణార్తే॥ స్నేహాద్ధి రౌక్ష్యం లఘుతాం గురుత్వాదౌష్ణ్యాచ్చ శైత్యం పవనస్య హత్వా। తైలం దదాత్యాశు మనఃప్రసాదం వీర్యం బలం వర్ణమథాగ్నిపుష్టిమ్॥ మూలే నిషిక్తే హి యథా ద్రుమః స్యాన్నిలచ్ఛదః కోమలపల్లవాగ్రః। కాలే మహాన్ పుష్పఫలప్రదశ్చ తథా నరః స్యాదనువాసనేన॥ అపత్యసన్తానవివృద్ధకారీ కాలే యశస్వీ బహుకీర్తిమాంశ్చ। స్తబ్ధాశ్చ యే సంకుచితాశ్చ యేఽపి యే పఙ్గవో యేఽపి చ రుగ్ణభగ్నాః॥ యేషాం చ శాఖాసు చరన్తి వాతాః శస్తో విశేషేణ హి తేషు వస్తిః। ఆధ్మాపనే విగ్రథితే పురీషే శూలే చ భక్తానభినన్దనే చ॥ ఏవంప్రకారాశ్చ భవన్తి కుక్షౌ యే చామయాస్తేషు చ వస్తిరిష్టః। యాశ్చ స్త్రియో వాతకృతోపసర్గాద్గర్భం న గృహ్ణన్తి నృభిః సమేతాః। క్షీణేన్ద్రియా యే చ నరాః కృశాశ్చ తేషాం చ వస్తిః పరమః ప్రదిష్టః॥

అ॥ నిరూహవస్తి—వయస్సును నిలుపును. సుఖము ఆయువు బలము జఠరాగ్ని మేధాశక్తి స్వరము వర్ణము వీనిని కలిగించును. బాలురు వృద్ధులు యౌవనవంతులు వీరలకు అనేక ప్రయోజనములను కలిగించును. అపాయమును కలిగింపనిదిగ నుండును. సమస్తమైనవ్యాధులను పోగొట్టును. పురీషము శ్లేష్మము మూత్రము వాతము పిత్తము వీనిని ఆకర్షించి బయలువెడలించును. శరీరమునకు స్థైర్యమును కలిగించును. శుక్రమును బలమును వృద్ధినొందించును. శరీరమునందంతటను నున్న దోష సముదాయమును తీసివేసి సమస్తవ్యాధులను నశింపజేయును నిరూహవస్తిచేశుద్ధినొందిన మార్గములుకల దేహముకలవానికి అనువాసనవస్తినిచేయించినచో వర్ణమును బలమును కలుగును. వాతమును నశింపజేయుటకు తైలముకంటె శ్రేష్ఠమైన ద్రవ్యము ఇంకొకటి లేదు. తైలము తనయందలి స్నేహగుణమువలన వాతముయొక్క రూక్షగుణమును, గురుగుణమువలన లఘుగుణమును, ఉష్ణగుణమువలన శీతగుణమును నశింపజేసి వెంటనే మనోనైర్మల్యము శుక్రము బలము వర్ణము జఠరాగ్ని వీనికి వృద్ధిని కలిగించును. మూలమునందు తడుప బడిన వృక్షము నల్లనిఆకులు కలదిగను కోమలములైన చిగురుటాకులు కలదిగను సకాలమునందు అధికములైన పుష్పములును ఫలములును కలదిగను నగువిధమున, అనువాసనవస్తిచే మనుజుడు అధికమైనట్టియు శ్రేష్ఠమైనట్టియు సంతానముకలవాడు గను సకాలమునందు యశస్సుకలవాడుగను అధికమగు కీర్తికలవాడుగను నగును. బిగిసిన అవయవములు కలిగినట్టియు సంకోచము నొందిన అవయవములు కలిగినట్టియు పంగువాతము కలిగినట్టియు శైథిల్యమునొందిన సంధులు కలిగినట్టియు విరిగిన యెముకలు కలిగినట్టియు శాఖలయందు సంచరించుచున్న వాతము కలిగినట్టియు మనుజులకు

వస్తికర్మ విశేషించి ప్రశస్తముగ నుండును. కడుపుబ్బరము, మలముగడ్డలుకట్టుట, శూల, అరోచకము, ఉదరమునందలి ఇట్టి ఇతరవ్యాధులు వీనియందు వస్తికర్మ శ్రేష్ఠముగ నుండును. ఏస్త్రీలు వాతముచే వికృతినొందింపబడినవారై పురుషులతో కలసినను గర్భమును పొందరో అట్టిస్త్రీలకును, క్షీణించినశుక్రము కలిగినట్టియు కృశించినట్టియు పురుషులకును వస్తికర్మ శ్రేష్ఠమైనదిగ నుండును.

మూ॥ ఉష్ణాభిభూతేషు వదన్తి శీతాన్ శీతాభిభూతేషు తథా సుఖోష్ణాన్ । తత్ప్రత్యనీకౌషధసంప్రయుక్తాన్సర్వత్ర వస్తీన్ ప్రవిభజ్య యుజ్ఞ్యాత్ ॥35॥

అ॥ ఉష్ణవ్యాధులు కలవారలకు తద్విపరీతములైన ద్రవ్యములతో కూడినట్టియు చల్లగనున్నట్టియు వస్తులను చేయింపవలయును. శీతవ్యాధులు కలవారలకు తద్విపరీతములైన ద్రవ్యములతో కూడినట్టియు గోరువెచ్చగ నున్నట్టియు వస్తులను చేయింపవలయును. సర్వవ్యాధులయందును ఇటులనే విభాగమును చేసికొని వస్తులను ఈయవలయును.

మూ॥ న బృంహణీయాన్విదధీత వస్తీన్విశోధనీయేషు గదేషు వైద్యః । కుష్ఠప్రమేహాదిషు మేదురేషు నరేషు యే చాపి విశోధనీయాః॥ క్షీణక్షతానాం న విశోధనీయాన్న శోషిణాం నో భృశదుర్బలానామ్ । న మూర్ఛితానాం చ న శోధితానాం యేషాం చ దోషేషు నిబద్ధమాయుః ॥37॥

అ॥ సంశోధనమును చేయింపతగిన వ్యాధులయందు బృంహణములైన వస్తుల నీయకూడదు. మరియు మేదః ప్రధానములగు కుష్ఠము ప్రమేహము మొదలైనవ్యాధులయందు ఈయకూడదు. శోధింపతగిన మనుజులకుకూడ చేయింపకూడదు. క్షతక్షీణులకును శోషకలవారలకును మిక్కిలి దుర్బలులుగనున్న వారలకును మూర్ఛవ్యాధి కలవారలకును శోధనకర్మ చేయబడిన వారలకును మలాదుల నాశ్రయించియున్న బలము కలవారలకును విశోధనములైన వస్తుల నీయకూడదు.

## వస్తియొక్క గుణములు—ప్రాధాన్యము.

మూ॥ శాఖాగతాః కోష్ఠగతాశ్చ రోగా మర్మోర్ధ్వసర్వావయవంగతాశ్చ । యే సన్తి తేషాం న తు కశ్చిదన్యో వాయోః పరం జన్మని హేతురస్తి॥ తస్యాతివృద్ధస్య శమాయ నాన్యద్వస్తేర్వినా భేషజమస్తి కించిత్ ॥ తస్మాచ్చికిత్సార్థమితి బ్రువన్తి సర్వాం చికిత్సామపి వస్తిమేకే । నాభిప్రదేశం చ కటీం చ గత్వా కుక్షిం సమాలోడ్య పునశ్చ పార్శ్వమ్॥ సంస్నేహ్య కాయం శిథిలాంశ్చ కృత్వా దోషాన్

పురీషం గ్రథితం విమథ్య । సంపక్తవేగః సపురీషదోషః ప్రత్యాగతో
వస్తిరితి ప్రశస్తః ॥41॥

అ॥ శాఖలను కోష్ఠమును మర్మలను ఊర్ధ్వావయవములను సర్వావయవములను ఆశ్రయించియున్న వ్యాధులకు వాతముకంటె ఇతరమైన కారణము ఉండనేరదు. వాతము—పురీషము మూత్రము, పిత్తము మొదలగునవి ధాత్వాదులయందలి మలములు, ఆహారాదులయొక్క సారములు వీనికి సంయోగవియోగములను కలిగించును. అధికముగ వృద్ధినొందిన అట్టివాతమును శమింపజేయుటకు వస్తికర్మకంటె శ్రేష్ఠమైన చికిత్స మరియొకటి లేదు. అందువలన వస్తికర్మను చికిత్సలో అర్ధభాగముగ కొందరు చెప్పుచున్నారు. సంపూర్ణచికిత్సనుగకూడ కొందరు చెప్పుచున్నారు. వస్తి నాభిప్రదేశమును కటిప్రదేశమునుపొంది కుక్షిప్రదేశమునుకలతపరచి పార్శ్వములనుపొంది సమస్త శరీరమునందును వ్యాపించి దోషములకు శైథిల్యమును కలిగించి కూడుకొనియున్న మలమును విడగొట్టి వేగముకలదై పురీషముతోడను దోషములతోడను కూడినదై తిరిగి బయటకు వచ్చును. అందువలన ప్రశస్తమైనదిగ నుండును.

వస్తియొక్క సమ్యగ్యోగా సమ్యగ్యోగ లక్షణములు.

మూ॥ ప్రసృష్టవిణ్మూత్రసమీరణత్వం రుచ్యగ్నివృద్ధ్యాశయలాఘవాది । రోగోపశాంతిః ప్రకృతిస్థతా చ బలం చ తత్స్యాత్సునిరూఢలిఙ్గమ్॥ స్యాద్రుక్ఛిరోహృద్గుదకుక్షిలిఙ్గేష్వర్తిః ప్రతిశ్యాయవికర్తికే చ । హృల్లాసకాసారుచిమూత్రసఙ్గః శ్వాసో న సమ్యక్ చ నిరూహితే స్యాత్ ॥ లిఙ్గం యదేవాతివిరేచితస్య భవేత్తదేవాతినిరూహితస్య । ప్రత్యేత్యసక్తం సశకృచ్చ తైలం రక్తాదిబుద్ధీన్ద్రియసంప్రసాదః ॥ స్వప్నానువృత్తిర్లఘుతా బలం చ సృష్టాశ్చ వేగాః స్వనువాసితే స్యుః । అధశ్శరీరోదరబాహుపృష్ఠపార్శ్వేషు రుగ్ రూక్షఖరం చ గాత్రమ్॥ గ్రహశ్చ విణ్మూత్రసమీరణానామసమ్యగేతాన్యనువాసితేస్యుః। హృల్లాసమోహక్లమసాదమూర్ఛా వికర్తికాచాత్యనువాసితే స్యుః ॥46॥

అ॥ నిరూహవస్తి బాగుగ చేయబడినచో పురీషమును మూత్రమును అపానవాతమును సరిగ బయలువెడలుట, రుచి, జాఠరాగ్ని వృద్ధినొందుట, ఆశయములు చులకనగనుండుట, రోగములు శాంతించుట, శరీరము ప్రకృతిభావమునొందుట, బలము ఈ లక్షణములు కలుగును. నిరూహవస్తి బాగుగచేయబడనిచో హృదయము శిరస్సు గుదప్రదేశము కుక్షిప్రదేశము మేఢ్రము వీనియందు బాధజనించుట, ప్రతిశ్యాయము, పరికర్తికము, ఓకరింపు, దగ్గు, అరుచి, మూత్రబంధము, ఆయాసము ఈలక్షణములు కలుగును. నిరూహవస్తి అధికముగ చేయబడినచో విరేచనాతియోగమువలన కలుగు లక్షణములే కలుగును. అనువాసనవస్తి బాగుగ చేయబడినచో ఆ తైలము

లోన తగులుకొనక మలముతోకూడ బయటికివచ్చును. రక్తాదులకును బుద్ధికిని ఇంద్రియములకును నైర్మల్యము కలుగును. సుఖమైన నిద్ర కలుగును. శరీరమునకు లఘుత్వము కలుగును. బలము కలుగును. మలమూత్రాది వేగములు సరిగ ప్రవర్తించును. అనువాసనవస్తి బాగుగ చేయింపబడనిచో అధశ్శరీరము ఉదరము బాహువులు వృష్ఠప్రదేశము పార్శ్వములు వీనియందు బాధకలుగుట, శరీరము రూక్షముగను పరుషముగను నుండుట, పురీషమును మూత్రమును అనుపానవాతమును సరిగ ప్రవర్తింపకుండుట ఈలక్షణములు కలుగును. అనువాసనవస్తి అధికముగ చేయబడినచో ఓకరింత మోహము బడలిక కృశించుట మూర్ఛ పరికర్తికము ఈలక్షణములు కలుగును.

మూ॥ యస్యేహ యామానను వర్తతే త్రీన్ స్నేహో నరః స్యాత్స విశుద్ధదేహః । ఆశ్వాగతేఽన్యస్తు పునర్విధేయః స్నేహో న సంస్నేహయతి హ్యతిష్ఠన్ ॥47॥

అ॥ స్నేహము లోన మూడుజాము లున్నచో శరీరము సరిగ శుద్ధినొందును. వెంటనే బయటికి వచ్చినయెడల స్నేహమును మరల నీయవలయును. లోన మూడు జాము లుండనిచో సరిగ స్నైగ్ధ్యమును కలిగింపదు.

వస్తిసంఖ్య.

మూ॥ త్రింశన్మతాః కర్మసు వస్తయో హి కాలస్తతోఽర్ధేన తతశ్చ యోగః । సాన్వాసనా ద్వాదశ వై నిరూహాః ప్రాక్స్నేహ ఏకః పరతశ్చ పఞ్చ ॥ కాలే త్రయోఽన్తే పురతస్తథైకః స్నేహా నిరూహాన్తరితాశ్చ షట్ స్యుః । యోగే నిరూహాస్త్రయ ఏవ దేయాః స్నేహాశ్చ పఞ్చైవ పరాదిమధ్యాః ॥49॥

అ॥ ముప్పదివస్తులను చేయించుట కర్మవస్తి యనియు పదునైదువస్తులను చేయించుట కాలవస్తి యనియు ఎనిమిది వస్తులను చేయించుట యోగవస్తి యనియు చెప్పబడును. తొలుత ఒక అనువాసనవస్తిని పిదప పండ్రెండు అనువాసనవస్తులతో అంతరితములైన పండ్రెండు నిరూహవస్తులను తుదకు అయిదు అనువాసనవస్తులను ఇట్లు ముప్పది వస్తులను చేయించుట కర్మవస్తిగ నుండును. తొలుత ఒక అనువాసనవస్తిని పిదప అయిదు నిరూహవస్తులతో అంతరితములైన ఆరు అనువాసనవస్తులను తుదకు మూడు అనువాసనవస్తులను ఇట్లు పదునైదువస్తులను చేయించుట కాలవస్తిగనుండును. తొలుత ఒక అనువాసనవస్తిని పిదప మూడుస్నేహవస్తులతో అంతరితములైన మూడు నిరూహవస్తులను తుదకు ఒక అనువాసనవస్తిని ఇట్లు ఎనిమిది వస్తులను చేయించుట యోగవస్తిగ నుండును.

మూ॥ త్రీన్పఞ్చ వాఽఽహుశ్చతురోఽథ షడ్వా వాతాధికేభ్యస్త్వనువాసనీయాన్ । స్నేహాన్ప్రదాయాశు భిషగ్విదధ్యాత్స్రోతోవిశుద్ధ్యర్థమతో నిరూహాన్ ॥50॥

అ॥ వాతము అధికముగ కలవారలకు మూడు లేక అయిదుగాని నాలుగు లేక ఆరుగాని అనువాసనవస్తులను చేయించి స్రోతస్సులు శుద్ధినొందుటకు వెంటనే నిరూహవస్తులను చేయింపవలయును.

## నస్యకర్మ వివరణము.

మూ॥ విశుద్ధకాయస్య తతః క్రమేణ స్నిగ్ధం తు తైః స్వేదిత ముత్తమాఙ్గమ్। విరేచయేత్త్రిర్ద్విర థైకశో వా బలం సమీక్ష్య త్రివిధం మలానామ్॥ ఉరశ్శిరోలాఘవమిన్ద్రియాణాం స్రోతోవిశుద్ధిశ్చ భవేద్విశుద్ధే। గలోపలేపః శిరసో గురుత్వంనిష్ఠీవనం చాప్యథ దుర్విరిక్తే॥ శిరోక్షిశఙ్ఖశ్రవణార్తితోదశ్చాత్యర్థశుద్ధే తిమిరం చ పశ్యేత్। స్యాత్తర్పణం తత్ర మృదు ద్రవం చ స్నిగ్ధస్య తీక్ష్ణం తు పునర్నయోగే ॥53॥

అ॥ విరేచనకర్మ మొదలగువానిచే క్రమముగ శుద్ధినొందినవానికి పిమ్మటశిరస్సునకు స్నేహస్వేదములను చేయించి దోషములయొక్క ఉత్కృష్టమధ్యమాల్ప రూపమగు మూడువిధములైన బలమును చూచుకొని మూడుసార్లుగాని ఒకసారిగాని (ఒక దినమునందు) నస్యకర్మను చేయింపవలయును. నస్యకర్మ సరిగ చేయబడినచో వక్షఃస్థలమునందును శిరస్సునందును లాఘవము, ఇంద్రియములకు పటుత్వము, స్రోతస్సులకు శుద్ధి ఈలక్షణములు కలుగును. నస్యకర్మ సరిగ చేయబడనియెడల కంఠమునందు పూయబడినట్లుండుట, శిరస్సు బరువుగనుండుట, తరుచు ఉమియుట ఈలక్షణములు కలుగును. నస్యకర్మ అధికముగ చేయబడినచో శిరస్సు నేత్రములు కణతలు చెవులు వీనియందు బాధయు పోట్లును కలుగును. మరియు నేత్రములకు చీకట్లు ఇట్టి అతి యోగమునందు మృదుగుణము కలిగి ద్రవరూపముగనున్న వానిచే తర్పణమును చేయింపవలయును. నస్యకర్మ సరిగ చేయబడనప్పుడు స్నిగ్ధుడుగనున్న వానికి తీక్ష్ణమైన నస్యమును చేయింప వలయును.

## పంచకర్మలయొక్క గుణము.

మూ॥ ఇత్యాతురస్వస్థవిధిః ప్రయోగే బలాయుషో వృద్ధికృదామయఘ్నః॥

అ॥ ఇట్లు, వ్యాధిగ్రస్తులకు స్వస్థులకును ఉపయోగించు పంచకర్మవిధానము చెప్పబడినది. దీనిని సరిగ ప్రయోగించినయెడల బలమును ఆయువును వృద్ధినొందును. వ్యాధులు నశించును.

## పంచకర్మానంతరవర్జనీయములు—వానిని వర్జింపతగిన కాలము

మూ॥ కాలస్తు వస్త్యాదిషు యాతి యావాంస్తావాన్ భవేద్విః

పరిహారకాలః॥ అత్యాశనస్థానవచాంసి యానం స్వప్నం దివా మైథున వేగరోధాన్ । శీతోపచారాతపశోకరోషాం స్త్యజేదకాలాహితభోజనం చ ॥55॥

అ॥ వస్త్యాదికర్మలను ఎంతకాలము చేయించితిమో పిదప ఆకాలమునకు రెట్టింపు కాలమువరకును - అధికముగ భుజించుట, అధికముగ నిలబడియుండుట, అధికముగ మాట్లాడుట, వాహనాదులయందు ప్రయాణము చేయుట, పగలు నిద్రించుట, మైథునము, వేగధారణము, శీతోపచారములు, ఎండ, దుఃఖము, కోపము, అకాలభోజనము అహితభోజనము వీనిని విసర్జింపవలయును.

### వస్తి సరిగ ప్రవేశింపకుండుట మొదలగువానికి కారణము.

మూ॥ బద్ధే ప్రణీతే విషమే చ నేత్రే మార్గే తథాఽర్శఃకఫవిడ్విబద్ధే । న యాతి వస్తిర్న సుఖం నిరేతి దోషావృతోఽల్పో యది వాఽల్పవీర్యః॥ ప్రాప్తే తు వర్చోఽనిలమూత్రవేగే వాతే వివృద్ధేఽల్పబలే గుదే వా । అత్యుష్ణతీక్ష్ణశ్చ మృదౌ చ కోష్ఠే ప్రణీతమాత్రః పునరేతి వస్తిః ॥57॥

అ॥ వస్తియొక్క నేత్రమునందు (గొట్టమునందు) అడ్డుకలిగినను వస్తినేత్రమును విషమముగ ప్రవేశపెట్టినను అర్శస్సు కఫము పురీషము వీనిచే గుదమార్గము అడ్డగింపబడియున్నను లోపలకు వస్తి సరిగ ప్రవేశింపనేరదు. వస్తి అల్పముగనున్నను అల్పశక్తినికలిగియున్నను లోన దోషములచే ఆవరింపబడియున్నను ఆలస్యముగ బయలు వెడలును పురీషము అపానవాతము మూత్రము వీనికి వేగములు కలిగినను వాతము అధికముగనున్నను గుదప్రదేశము అల్పబలమును కలిగియున్నను కోష్ఠము మృదువుగనున్నను ప్రయోగింపబడినవస్తి అధికమగు ఉష్ణవీర్యమును తీక్ష్ణగుణమును కలిగియుండి ప్రయోగించిన వెంటనే తిరిగి బయటికి వచ్చును.

### సాధ్యములైనకొన్ని వ్యాధులు శమింపకుండుటకు కారణము.

మూ॥ మేదఃకఫాభ్యామనిలో నిరుద్ధః శూలాఙ్గసుప్తిశ్వయథూన్ కరోతి । స్నేహం తు యుఞ్జన్నబుధస్తు తస్మై సంవర్ధయత్యేవ హి తాన్వికారాన్ ॥ రోగా స్తథాఽన్యేఽప్యవితర్క్యమాణాః పరస్పరేణావగృహీతమార్గాః । సన్దూషితా ధాతుభిరేవ చాన్యైః స్వైర్భేషజైర్నోపశమం వ్రజన్తి॥ సర్వాం చ రోగప్రశమాయ కర్మ హీనాతిమాత్రం విపరీతకాలమ్ । మిథ్యోపచారాచ్చ న తం వికారం శాన్తిం నయేత్పథ్యమపి ప్రయుక్తమ్ ॥60॥

అ॥ మేదస్సుతోడను కఫముతోడను అరికట్టబడిన వాతము శూలను, అవయ

వములయందు మొద్దుబారుటను, వాయువునుకలిగించును. అట్టివానికి తెలియని వైద్యుడు స్నేహకర్మను చేయించినచో ఆ బాధలు ఇంకను వృద్ధినొందును. ఇటులనే, పరస్పరము అరికట్టబడిన మార్గములుకలిగినట్టియు ఇతర ధాతువులచే దూషింపజేయబడినట్టియు సరిగ తెలిసికొనబడనట్టియు ఇట్టి ఇతరదోషములుకూడ తమయొక్క చికిత్సలచే శాంతింపనేరవు. రోగశాంతికొరకు చెప్పబడిన సమస్తచికిత్స హితకరమైనదైనను హీనముగ గాని అధికముగ గాని అసమయమునందు గాని ప్రయోగింపబడినచో సరిగ ప్రయోగింపబడనిదగుటవలన ఆయావ్యాధులను శాంతింపజేయజాలదు.

## అధ్యాయ సంగ్రహము.

మూ॥ ప్రశ్నానిమాన్ద్వాదశ పఞ్చకర్మాణ్యుద్దిశ్య సిద్ధావిహ కల్పనాయామ్ । ప్రజాహితార్థం భగవాన్మహార్థాన్సమ్యగ్ జగాదర్షివరోఽత్రిపుత్రః ॥61॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే సిద్ధిస్థానే కల్పనాసిద్ధిర్నామ ప్రథమోఽధ్యాయః ॥

అ॥ పంచకర్మల నుద్దేశించినట్టియు అధికప్రయోజనముకలిగినట్టియు పండ్రెండు ప్రశ్నలను ఆత్రేయుడు ప్రజలయొక్క మేలుకొరకు కల్పనాసిద్ధి యనెడు ఈ అధ్యాయమునందు చెప్పెను.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామకకృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు కల్పనాసిద్ధి యనెడు ప్రథమాధ్యాయము సమాప్తము.

—0—

# ద్వితీయాధ్యాయము.

మూ॥ అథాతః పఞ్చకర్మీయాం సిద్ధిం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట పంచకర్మీయసిద్ధిని చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

## పంచకర్మలకు అనర్హులు—అర్హులు.

మూ॥ యేషాం యస్మాత్పఞ్చకర్మాణ్యగ్నివేశ! న కారయేత్। యేషాం చ కారయేత్తాని తత్సర్వం సంప్రవక్ష్యతే ॥ చణ్డః సాహసికో భీమః కృతఘ్నో వ్యగ్ర ఏవ చ । సద్వైద్యనృపతిద్వేష్టా తద్ద్విష్టః శోకపీడితః ॥ యాదృచ్ఛికో ముమూర్షుశ్చ విహీనః కరణైశ్చ యః। వైరీ

వైద్యాభిమానీ చ శ్రద్ధాహీనః సశఙ్కితః॥ భిషజామవిధేయశ్చ నోప క్రమ్యో భిషగ్విదా। ఏతానుపచరన్ వైద్యో బహూన్ దోషానవాప్నుయాత్॥ ఏభ్యోఽన్యే సముపక్రమ్యా నరాః సర్వైరుపక్రమైః। అవస్థాం ప్రవిభజ్యైషాం కార్యాకార్యం చ వక్ష్యతే ॥7॥

అ॥ పంచకర్మలను ఎవరలకు ఎందువలన చేయింపకూడదో ఎవరలకు చేయింపవచ్చునో ఆవిషయమును చెప్పుచున్నాము. కోపముగలవాడు, సాహసముగలవాడు, భయస్వభావముగలవాడు, కృతఘ్నుడు, ఉద్రేకముగలవాడు, సత్పురుషులను వైద్యులను రాజులను ద్వేషించువాడు, వీరలచే ద్వేషింపబడినవాడు, దుఃఖించువాడు, నాస్తికుడు, చావసిద్ధముగ నున్నవాడు, ఇంద్రియవిహీనుడు, శత్రువు, వైద్యుడనని తలచుకొనువాడు, శ్రద్ధలేనివాడు, అనుమానముతో కూడినవాడు, వైద్యులకు అవిధేయుడుగనుండువాడు వీరలకు పంచకర్మలను చేయింపకూడదు. చేయించినచో అనేకములైన నష్టములను పొందును. వీరలకంటె ఇతరములైనవారలకు సమస్తక్రియలను చేయింపవచ్చును. చేయింపతగిన వీరలకు ఆవస్థానభేదము ననుసరించి వేనిని చేయింపవచ్చునో వేనిని చేయింపకూడదో వానిని చెప్పుచున్నాము.

## వమనకర్మను చేయింపతగనివారు.

మూ॥ అచ్ఛర్దనీయాస్తావత్—క్షతక్షీణాతిస్థూలకృశబాలవృద్ధదుర్బలశ్రాన్తపిపాసితక్షుధితకర్మభారాధ్వహతోపవాసమైథునాధ్యయనవ్యాయామచిన్తాప్రసక్తక్షామగర్భిణీసుకుమారసంవృతకోష్ఠదుశ్ఛర్దనోర్ధ్వరక్తపిత్తప్రసక్తచ్ఛర్ద్యూర్ధ్వవాతాస్థాపితానువాసితహృద్రోగోదావర్తమూత్రాఘాతప్లీహగుల్మోదరాష్ఠీలాస్వరోపఘాతతిమిరశిరఃశఙ్ఖకర్ణాక్షిపార్శ్వశూలార్తాః ॥8॥

అ॥ ఉరఃక్షతముగలవాడు, క్షీణించినవాడు, మిక్కిలిలావుగ నున్నవాడు, మిక్కిలి సన్నముగనున్నవాడు, బాలుడు, వృద్ధుడు, దుర్బలుడు, అలసినవాడు, దప్పిక కలవాడు, ఆకలి కలవాడు, పనులనుచేయుట బరువునుమోయుట మార్గమున నడుచుట అభిఘాతము ఉపవాసము మైథునము అధ్యయనము వ్యాయామము ఆలోచన వీనిచే కృశించినవాడు, గర్భిణీస్త్రీ, సుకుమారుడు, మూయబడినకోష్ఠముకలవాడు, కష్టముగ వాంతి చేసికొనువాడు, ఊర్ధ్వగరక్తపిత్తముకలవాడు, వాంతియగుచున్నవాడు, ఊర్ధ్వవాతముకలవాడు, నిరూహవస్తి చేయింపబడినవాడు, అనువాసనవస్తి చేయింపబడినవాడు, హృద్రోగము ఉదావర్తము మూత్రాఘాతము ప్లీహవ్యాధి గుల్మము ఉదరవ్యాధి అష్ఠీలయనెడివ్యాధి స్వరభంగము ఇవికలవారు, తిమిరవ్యాధి కలవాడు, శిరశ్శూల శంఖశూల కర్ణశూల అక్షిశూల పార్శ్వశూల ఇవికలవారు వీరలకు వమనకర్మను చేయింపకూడదు.

## ఉరఃక్షతాదులయందు వమననిషేధమునకు కారణము.

మూ॥ తత్ర, క్షతస్య చ భూయః క్షణనాద్రక్తాతిప్రవృత్తిః స్యాత్, క్షీణాతిస్థూలకృశబాలవృద్ధదుర్బలానామౌషధబలాసహత్వాత్ప్రాణోపరోధః, శ్రాన్తపిపాసితక్షుధితానాం చ తద్వత్, కర్మభారాధ్వహతోపవాసమైథునాధ్యయనవ్యాయామచిన్తాప్రసక్తక్షామాణాం రౌక్ష్యాద్వాతరక్తచ్ఛేదక్షతభయం స్యాత్, గర్భిణ్యా గర్భవ్యాపదామగర్భభ్రంశాచ్చ దారుణా రోగప్రాప్తిః, సుకుమారస్య హృదయస్య వికర్షణాదూర్ధ్వమధో వా రుధిరాతిప్రవృత్తిః, సంవృతకోష్ఠదుశ్ఛర్దనయోరతిమాత్రప్రవాహణాద్దోషాః సముత్క్లిష్టా హ్యన్తఃకోష్ఠే విసర్పన్తో జనయన్తి స్తమ్భం జాడ్యం వైచిత్యం మరణం వా, ఊర్ధ్వరక్తపిత్తస్యోదాన ఊర్ధ్వముత్క్షిప్య ప్రాణాన్ హరేద్రక్తం చాతిప్రవర్తయేత్, ప్రసక్తచ్ఛర్దేస్తు తద్వత్, ఊర్ధ్వవాతాస్థాపితానువాసితానామూర్ధ్వం వాతాతిప్రవృత్తిః, హృద్రోగిణో హృదయోపరోధః, ఉదావర్తినో ఘోరతర ఉదావర్తః స్యాచ్ఛీఘ్రతరహన్తా, మూత్రాఘాతాదిభిరార్తానాం తీవ్రతరః శూలప్రాదుర్భావః, తిమిరాణాం తిమిరాతివృద్ధిః, శిరఃశూలాదిషు శూలాతివృద్ధిః, తస్మాదేతే న వామ్యాః ॥౭॥

అ॥ వమనకర్మను చేయించుటవలన-వారిలో ఉరఃక్షతముకలవానికి క్షతమింకను అధికమగుటవలన రక్తమధికముగ ప్రవర్తించును. క్షీణించినవాడు, మిక్కిలి లావుగనున్నవాడు, మిక్కిలిసన్నముగనున్నవాడు, బాలుడు, వృద్ధుడు, దుర్బలుడు వీరలకు బలము మిక్కిలి క్షీణించును. అలసినవాడు, దప్పికకలవాడు, ఆకలికలవాడు వీరలకును బలక్షయము కలుగును. పనులనుచేయుట బరువునుమోయుట మార్గము నడచుట అభిఘాతము ఉపవాసము మైథునము అధ్యయనము వ్యాయామము ఆలోచన వీనిచే కృశించినవారలకు రౌక్ష్యముకలిగి వాతవృద్ధియు రక్తస్రావమును క్షతిమును కలుగును. గర్భిణీస్త్రీకి గర్భవ్యాపత్తును ఆమగర్భస్రావమును కలిగి దారుణమైనవ్యాధులు జనించును. సుకుమారునకు హృదయము పీడింపబడి ఊర్ధ్వమార్గమునగాని అధోమార్గమునగాని రక్తమధికముగ ప్రవర్తించును. మూయబడిన కోష్ఠముకలవానికిని కష్టముగ వాంతి చేసికొనువానికిని అధికముగు శ్రమవలన దోషములు ఉద్రేకము నొంది కోష్ఠమునందు వ్యాపించి స్తబ్ధత్వమునుగాని జడత్వమునుగాని మనోవైకల్యమునుగాని మరణమునుగాని కలిగించును. ఊర్ధ్వగరక్తపిత్తముకల వానికిని వాంతియగుచున్నవానికిని ఉదానవాతము ఊర్ధ్వముఖమునొంది రక్తమును అధికముగ ప్రవ

ర్తింపచేసి ప్రాణములను హరింపచేయును. ఊర్ధ్వవాతము కలవాడు, నిరూహవస్తి చేయింపబడినవాడు, అనువాసనవస్తి చేయింపబడినవాడు వీరలకు వాతము అధికమై ఊర్ధ్వముగ ప్రవర్తించును. హృద్రోగము కలవానికి హృదయము అడ్డగింపబడును. ఉదావర్తముకలవానికి ఘోరమైన ఉదావర్తము కలిగి వెంటనే ప్రాణమును హరించును. మూత్రాఘాతము ప్లీహవ్యాధి మొదలగునవికలవారలకు మిక్కిలి తీవ్రమైన శూల కలుగును. తిమిరవ్యాధి కలవానికి తిమిరము వృద్ధిపొందును. శిరశ్శూల మొదలగునవి కలవారలకు శూల అధికమగును కావున వీరలకు వమనకర్మను చేయింపకూడదు.

మూ॥ సర్వేష్వపి ఖల్వేతేషు విషగరవిరుద్ధాభ్యవహారామకృతేష్వప్రతిషిద్ధం, శీఘ్రకారిత్వాద్దోషాణామితి ॥10॥

అ॥ విషము కృత్రిమవిషము విరుద్ధాహారము, ఆమము వీనివలన జనించిన వ్యాధులయందు దోషములు శీఘ్రముగ ప్రాణములను హరించును గావున వమనకర్మము చేయింపతగనివారికికూడ ఇట్టివ్యాధులయందు వమనకర్మను చేయింపవచ్చును.

## వమనకర్మను జేయింపతగినవారు.

మూ॥ శేషాస్తువామ్యాః. పీనసకుష్ఠనవజ్వరరాజయక్ష్మకాసశ్వాసగలగ్రహగలగణ్డశ్లీపదమేహమన్దాగ్ని విరుద్ధాజీర్ణాన్నవిసూచికాలసకవిషగరపీతదష్టదిగ్ధవిద్ధాధఃశోణితపిత్తకఫప్రసేకదుర్నామహృల్లాసారోచకావిపాకాపచ్యపస్మారోన్మాదాతిసారశోషపాణ్డురోగముఖపాకదుష్టస్తన్యాదయః శ్లేష్మవ్యాధయో విశేషేణ మహారోగాధ్యాయోక్తాశ్చ; తేషు హి వమనం ప్రధానతమమిత్యుక్తం, కేదారసేతుభేదే శాల్యాద్యశోషదోషవినాశవత్ ॥11॥

అ॥ పైనచెప్పబడినవారలకుగాక ఇతరులకు వమనకర్మను చేయింపవచ్చును. పీనసము, కుష్ఠము, నవజ్వరము, రాజయక్ష్మ, కాస, శ్వాస, గలగ్రహము, గలగండము శ్లీపదము, ప్రమేహము, అగ్నిమాంద్యము, విరుద్ధాహారమును సేవించుట, జీర్ణముకానప్పుడు భుజించుట, విషూచి, అలసకము, విషమును పానముచేయుట, కృత్రిమవిషమును తినుట, విషజంతువులచే 'కరువబడుట, విషముచే పూయబడిన శస్త్రాదులచే గాయముకలుగుట, అధోగరక్తపిత్తము, కఫమునుమియుట, అర్శస్సు, ఓకరింత, అరోచకము, జీర్ణముకాకుండుట, అపచి, అపస్మారము, ఉన్మాదము, అతిసారము, శోష, పాండురోగము, నోటిపూత, స్తన్యదోషము మొదలగునవికలవారలకును మహారోగాధ్యాయమునందు చెప్పబడిన శ్లేష్మవ్యాధులు కలవారలకును వమనకర్మను విశేషించి చేయింపవలయును. శ్లేష్మవ్యాధులయందు వమనము ప్రధానమైనదని చెప్పబడినది, వరిమడియొక్క కట్టను నరికినయెడల వరిపైరు మొదలగువానియందలి కుళ్ళుట మొదలగు దోషములు నశించు విధమున వమనమువలన శ్లేష్మదోషము నశించును.

## విరేచనకర్మను చేయింపతగనివారు.

మూ॥ అవిరేచ్యాస్తు-సుభగక్షతగుదముక్తనాలాధోభాగరక్తపిత్తవిలఙ్ఘితదుర్బలేన్ద్రియాల్పాగ్నినిరూఢకామాదివ్యగ్రాజీర్ణనవజ్వరమదాత్యయితాధ్మాతశల్యార్దితాభిహతాతిస్నిగ్ధరూక్షదారుణకోష్ఠాః క్షతాదయశ్చ గర్భిణ్యన్తాః ॥12॥

అ॥ సుకుమారమైన గుదప్రదేశముకలవాడు, గుదప్రదేశమునందు క్షతము కలవాడు, శిథిలమైన మలద్వారముకలవాడు, అధోగరక్తపిత్తముకలవాడు, అధికముగ లంఘనము చేయింపబడినవాడు, దుర్బలమైన ఇంద్రియములుకలవాడు, అగ్నిమాంద్యము కలవాడు, నిరూహవస్తి చేయింపబడినవాడు, కామము మొదలగువానిచే వ్యాకులమైన మనస్సుకలవాడు, అజీర్ణము నవజ్వరము మదాత్యయము కడుపుబ్బరము ఇవి కలవారు, శల్యముచే పీడింపబడినవాడు, అభిఘాతముకలవాడు, అతిస్నిగ్ధముగనున్నవాడు, రూక్షముగనున్నవాడు, దారుణకోష్ఠముకలవాడు వీరలకు విరేచనకర్మను చేయింపకూడదు. ఉరఃక్షతముకలవాడు మొదలుకొని గర్భిణీస్త్రీ ఆఖరువరకునుగల వమనానర్హులకుగూడ విరేచనకర్మను చేయింపగూడదు.

## అనర్హులకు విరేచకర్మవలనకలుగు దోషములు.

మూ॥ తత్ర, సుభగస్య సుకుమారోక్తో దోషః స్యాత్, క్షతగుదస్య క్షతే గుదే వాయుః ప్రాణోపరోధకరీం రుజాం జనయేత్, ముక్తనాలమతిప్రవృత్త్యా హన్యాత్, అధోభాగరక్తపిత్తినం చ తద్వదేవ, విలఙ్ఘితదుర్బలేన్ద్రియాల్పాగ్నినిరూఢా ఔషధవేగం న సహేరన్, కామాదివ్యగ్రమనసో న ప్రవర్తతే కృచ్ఛ్రేణ వా ప్రవర్తమానమయోగదోషాన్ కుర్యాత్, అజీర్ణిన ఆమదోషః స్యాత్, నవజ్వరస్య అవిపక్వాన్ దోషాన్ న నిర్హరేత్ వాతమేవ చ కోపయేత్, మదాత్యయితస్య మద్యక్షీణే దేహే వాయుః ప్రాణోపరోధం కుర్యాత్, ఆధ్మాతస్య ఆధ్మాయమానస్య వా పురీషకోష్ఠనిచితో వాయుర్విసర్పన్ సహసా ఆనాహం తీవ్రతరం మరణం వా జనయేత్, శల్యార్దితాభిహతయోః క్షతే వాయురాశ్రితో జీవితం హింస్యాత్, అతిస్నిగ్ధస్య అతియోగభయం భవేత్, రూక్షస్య వాయురఙ్గగ్రహం కుర్యాత్, దారుణకోష్ఠస్య విరేచనోద్ధతా దోషా హృచ్ఛూలపర్వభేదానాహాఙ్గమర్దచ్ఛర్దిమూర్ఛాక్లమాన్ జనయిత్వా ప్రాణాన్ హన్యుః, క్షతాదీనాం గర్భిణ్యన్తానాం ఛర్దనోక్తో దోషః స్యాత్, తస్మాదేతే న విరేచ్యాః ॥13॥

అ॥ విరేచనకర్మను చేయించుటవలన - వారిలో సుకుమారమైన గుదప్రదేశము కలవానికి, వమనము చేయించుటవలన సుకుమారునకు కలుగు దోషమే కలుగును. గుదప్రదేశమునందు క్షతముకలవానికి వాతము ప్రకోపించి క్షతముతోకూడినగుదమునందు ప్రాణాంతకమగు బాధను కలిగించును. శిథిలమైనమలద్వారముగలవానికిని అధోగ రక్తపిత్తముగలవానికిని అధికముగ ప్రవర్తించి మరణమును కలిగించును. అధికముగ లంఘనము చేయింపబడినవాడు, దుర్బలమైన ఇంద్రియములుగలవాడు, అగ్నిమాంద్యము గలవాడు, నిరూహవస్తిచేయింపబడినవాడు వీరు ఔషధవేగమును సహింపజాలరు. కామము మొదలగువానిచే వ్యాకులమైనమనస్సుగలవానికి దోషములు ప్రవర్తింప నేరవు. లేక కష్టముచే ప్రవర్తించి హీనయోగమువలనకలుగుదోషములను కలిగించును. అజీర్ణముగలవానికి ఆమదోషము కలుగును. నవజ్వరముగలవానికి పక్వముకాని దోషములు బయలువెడలనేరవు. మరియు వాతము ప్రకోపించును. మదాత్యయము గలవానికి మద్యపానముచే క్షీణించినదేహమునందు వాతము ప్రాణనాశనమును కలిగించును. కడుపుబ్బరముగలవానికిగాని కడుపుబ్బుచున్నవానికిగాని పురీషాశయమునందు వృద్ధినొందినవాతము వెంటనే వ్యాపించి తీవ్రమైన ఆనాహమునుగాని మరణమునుగాని కలిగించును. శల్యముచే పీడింపబడినవానికిని అభిఘాతముగలవానికిని వాతముక్షతమునుపొంది జీవితమును నశింపచేయును. అతిస్నిగ్ధముగనున్నవానికి అతియోగము కలుగును. రూక్షముగనున్నవానికి వాతము శరీరమును స్తంభింపజేయును. దారుణకోష్ఠముగలవానికి దోషములు ప్రకోపించినవై హృదయశూల పర్వభేదము ఆనాహము ఒడలునొప్పులు వాంతి మూర్ఛ బడలిక వీనిని కలిగించి ప్రాణములను హరించును. వమనానర్హులుగ చెప్పబడిన ఉరఃక్షతముగలవాడు మొదలుకొని గర్భిణీస్త్రీ ఆఖరువరకుగలవారలకు వమనకర్మవలనకలుగుదోషములే కలుగును. కావున వీరలకు విరేచనకర్మను చేయింపకూడదు.

## విరేచనకర్మను చేయింపతగినవారు.

మూ॥ శేషాస్తువిరేచ్యాః, కుష్ఠజ్వరమేహోర్ధ్వరక్తపిత్తభగన్దరోదరార్శోబ్రధ్నప్లీహగుల్మార్బుదగలగణ్డగ్రన్థివిసూచికాలసకమూత్రాఘాతక్రిమికోష్ఠవిసర్పపాణ్డురోగశిరఃపార్శ్వశూలోదావర్తనేత్రాస్యదాహహృద్రోగవ్యఙ్గనీలికానేత్రనాసికాస్యశ్రవణరోగగుదమేఢ్రపాకహలీమకశ్వాసకాసకామలాపచ్యపస్మారోన్మాదవాతరక్తయోనిరేతోదోషతైమిర్యారోచకావిపాకచ్ఛర్దిశ్వయథూదరవిస్ఫోటకాదయః పిత్తవ్యాధయో విశేషేణ మహారోగాధ్యాయోక్తాశ్చ, ఏతేషుహి విరేచనం ప్రధానతమ మిత్యుక్తమగ్న్యుపశమేఽగ్నిగృహవత్ ॥14॥

అ॥ పైనచెప్పబడినవారలకుగాక ఇతరులకు విరేచనకర్మను చేయింపవచ్చును. కుష్ఠము, జ్వరము, మేహము, ఊర్ధ్వగరక్తపిత్తము, భగందరము, ఉదరము, అర్శస్సు,

బ్రధ్నవ్యాధి, ప్లీహవ్యాధి, గుల్మము, అర్బుదము, గలగండము, గ్రంథి, విషూచి, అల
సకము, మూత్రాఘాతము, క్రోష్ఠగతక్రిములు, విసర్పము, పాండురోగము, శిరశ్శూల,
పార్శ్వశూల, ఉదావర్తము, కండ్లుమంటలు, నోటిమంట, హృద్రోగము, వ్యంగము,
నీలిక, నేత్రవ్యాధులు, నాసికావ్యాధులు, ముఖవ్యాధులు, కర్ణవ్యాధులు, గుదప్రదేశము
పాకమునొందుట, మేఢ్రముపాకమునొందుట, హాలీమకము, శ్వాస, కాస, కామిర్లు
అపచి, అపస్మారము, ఉన్మాదము, వాతరక్తము, యోనిదోషములు, శుక్రదోషములు,
తిమిరవ్యాధి, అరోచకము, అజీర్ణము, వాంతి, శోఫ, ఉదరమునందలి వ్యాధి. స్ఫోట
కము మొదలగునవికలవారలకును మహారోగాధ్యాయమునందు చెప్పబడిన పిత్తవ్యాధు
లుకలవారలకును విరేచనకర్మను విశేషించి చేయింపవలయును. పిత్తవ్యాధులయందు
దు విరేచనము ప్రధానమైనదని చెప్పబడినది. అగ్నితో గృహము వ్యాప్తమైనప్పుడు
ఆయగ్నిని చల్లార్చినయెడల గృహము శాంతి నొందువిధమున పిత్తమును వెడలించిన
యెడల శరీరము రోగశాంతికలదిగ నగును.

## ఆస్థాపనవస్తినిచేయింపతగనివారు.

మూ॥ అనాస్థాప్యాస్తు అజీర్ణాతిస్నిగ్ధపీత స్నేహోత్క్లిష్టదోషా
ల్పాగ్నియానక్లాన్తాతిదుర్బలక్షుత్తృష్ణాశ్రమార్తాతికృశభుక్తభక్తపీతో
దకవమితవిరిక్తకృతనస్తఃకర్మక్రుద్ధభీతమత్తమూర్ఛితప్రసక్తచ్ఛర్దినిష్ఠీవి
కాశ్వాసకాసహిక్కాబద్ధచ్ఛిద్రదకోదరాధ్మానాలసక విషూచికామప్ర
జాతాతిసారమధుమేహకుష్ఠార్తాః ॥1॥

అ॥ అజీర్ణముకలవాడు, అతిస్నిగ్ధుడు, స్నేహమునుపానముచేసినవాడు, ఉత్క్లేశ
మునొందిన దోషముకలవాడు. అగ్నిమాంద్యముగలవాడు, యానములమీద ప్రయాణ
మునుచేసి అలసినవాడు, మిక్కిలిదుర్బలుడు, ఆకలి దప్పిక శ్రమ వీనితో పీడింపబడిన
వాడు, మిక్కిలికృశించినవాడు, ఆహారమును భుజించినవాడు, ఉదకమును త్రాగిన
వాడు, వమనకర్మచేయింపబడినవాడు, విరేచనకర్మ చేయింపబడినవాడు, నస్యకర్మ
చేయింపబడినవాడు, కోపముకలవాడు, భయముకలవాడు, ఉన్మత్తుడు, మూర్ఛ
వాంతి ఉమియుట ఆయాసము దగ్గు ఎక్కిళ్ళు బద్ధోదరము ఛిద్రోదరము జలోదర
ము కడుపుబ్బరము అలసకము విషూచి ఆమజాతీసారము మధుమేహము కుష్ఠము ఇవి
కలవారు వీరలకు ఆస్థాపనవస్తిని చేయింపకూడదు.

## అనర్హులకు ఆస్థాపనవస్తివలనకలుగు దోషములు.

మూ॥ తత్ర, అజీర్ణాతిస్నిగ్ధపీతస్నేహానాం దూష్యోదరం మూ
ర్ఛా శ్వయథుర్వా స్యాత్, ఉత్క్లిష్టదోషమన్దాగ్న్యోరరోచక స్తీవ్రః,
యానక్లాన్తస్య క్షోభవ్యాపన్నో వస్తిరాశు దేహం శోషయేత్,
అతిదుర్బలక్షుత్తృష్ణాశ్రమార్తానాం పూర్వోక్తోదోషః స్యాత్, అతి
కృశస్య కార్శ్యం పునర్జనయేత్, పీతోదకభుక్తభక్తయోరుత్క్లి-

శోర్ధ్వమధో వా వాయుర్వస్తిముత్క్షిప్య క్షిప్రం వస్తౌ ఘోరాన్ వికారాన్ జనయేత్, వమితవిరిక్తయోస్తు రూక్షశరీరం నిరూహః క్షతం క్షార ఇవ నిర్దహేత్, కృతనస్తః కర్మణో విభ్రంశం భృశసం రుద్ధస్రోతసం కుర్యాత్, క్రుద్ధభీతయోర్వస్తిరూర్ధ్వముపప్లవేత్, మత్తమూర్ఛితయోర్భృశం విచలితాయాం సంజ్ఞాయాం చిత్తోపఘాతవ్యాపత్స్యాత్, ప్రసక్తచ్ఛర్దినిష్ఠీవికాశ్వాసకాసహిక్కార్తానామూర్ధ్వభూతో వాయురూర్ధ్వం వస్తిం నయేత్, బద్ధచ్ఛిద్రదకోదరాధ్మాతానాం భృశతరమాధ్మాప్య వస్తిః ప్రాణాన్ హింస్యాత్, అలసకవిసూచికామప్రజాతాతిసారిణామామకృతదోషః స్యాత్ మధుమేహకుష్ఠినోర్వ్యాధేః పునర్వృద్ధిః, తస్మాదేతే నాస్థాప్యాః ॥ 6॥

అ॥ ఆస్థాపనవస్తిని చేయించుటవలన-వారిలో అజీర్ణముకలవాడు, అతిస్నిగ్ధుడు, స్నేహమును పానముచేసినవాడు వీరలకు దూష్యోదరముగాని మూర్ఛగాని శోఫగాని కలుగును. ఉత్క్లేశమునొందినదోషముకలవాడు, అగ్నిమాంద్యముకలవాడు వీరలకు తీవ్రమైన అరోచకము కలుగును. యానములమీద ప్రయాణముచేసిఅలసినవానికి వస్తి సంక్షోభముచే వ్యాపత్తునొందినదై వెంటనే శరీరమును శోషింపచేయును. మిక్కిలి దుర్బలునకు ఆకలి దప్పిక శ్రమ వీనిచే పీడింపబడినవారికిని పూర్వమునందు చెప్పబడిన దోషమే కలుగును. మిక్కిలికృశించినవానికి కార్శ్యము ఇంకనుకలుగును. ఉదకమును త్రాగినవానికిని ఆహారమును భుజించినవానికిని వాతము ఉత్క్లేశమునొందివస్తి ప్రదేశమును క్రిందకుగాని మీదకుగానిగెంటి వస్తిప్రదేశమునందును దారుణమైనవ్యాధులనుకలిగించును. వమనకర్మచేయింపబడినవానికిని విరేచనకర్మచేయింబడినవానికిని రూక్షమైన శరీరమునందు క్షారమువలన క్షతమునందువలె తాపము కలుగును. నస్యకర్మచేయింపబడినవానికి స్రోతస్సులుఅరికట్టబడి విభ్రంశము కలుగును. కోపముకలవానికిని భయముకలవానికినివస్తి ఊర్ధ్వముగ ప్రసరించును. ఉన్మత్తునకును మూర్ఛకలవానికిని సంజ్ఞాజ్ఞానము మిక్కిలినశించి మనోవైకల్యము కలుగును. వాంతి ఉమిసంటు ఆయాసము దగ్గు ఎక్కిళ్ళు ఇవికలవారలకు వాతము ఊర్ధ్వగతికలదై వస్తిని ఊర్ధ్వభాగము నొందించును. బద్ధోదరము ఛిద్రోదరము జలోదరము కడుపుబ్బరము ఇవికలవారలకు అధికముగఉబ్బరముకలిగి ప్రాణములు పోవును. అలసకము విషూచి ఆమజాతీసారము ఇవి కలవారలకు ఆమదోషము కలుగును. మధుమేహము కుష్ఠము ఇవి కలవారలకు వ్యాధి ఇంకను వృద్ధినొందును. కావున వీరలకు ఆస్థాపనవస్తిని చేయింపకూడదు.

## అస్థాపనవస్తినిచేయింపతగినవారు.

మూ॥ శేషాస్త్వాస్థాప్యాః, సర్వాఙ్గైకాఙ్గకుక్షిరోగ వాతవర్చో

మూత్రశుక్రసఙ్గబలవర్ణమాంసరేతః క్షయదోషాధ్మానాఙ్గసుప్తిక్రిమికోష్ఠోదావర్తస్తభ్ధాఙ్గాతిసార సర్వాఙ్గాభితాపప్లీహాగుల్మ హృద్రోగభగన్దరోన్మాదజ్వర బ్రధ్నశిరః కర్ణశూలహృదయపార్శ్వపృష్ఠకటీ గ్రహవేపనాక్షేపక గౌరవాతిలాఘువరజఃక్షయానార్తవవిషమాగ్నిస్ఫిగ్జానుజఙ్ఘోరుగుల్ఫపార్ష్ణిప్రపదయోనిబాహ్వఙ్గులిస్తనాఙ్గదన్తనఖపర్వాస్థి శూలశోషస్తమ్భాన్త్రకూజనపరికర్తికాల్పాల్పశబ్దోగ్రగన్ధోత్థానాదయో వాతవ్యాధయో విశేషేణ మహారోగాధ్యాయోక్తాశ్చ, ఏతేష్వాస్థాపనం ప్రధానతమ మిత్యుక్తం వనస్పతేర్మూలచ్ఛేదవత్ ॥ 17॥

అ॥ పైనచెప్పబడినవారలకుగాక ఇతరులకు ఆస్థాపనవస్తిని చేయింపవచ్చును. సర్వాంగవాతము, ఏకాంగవాతము, కుక్షివ్యాధి, అపానవాతబంధము, మలబంధము, మూత్రబంధము, శుక్రబంధము, బలక్షయము, వర్ణక్షయము, మాంసక్షయము, శుక్రక్షయము, ఆధ్మానము, అవయవములుముడుచుకొనుట, కోష్ఠగతక్రిములు, ఉదావర్తము, శరీరము మొద్దుబారుట, అతిసారము, సర్వాంగతాపము, ప్లీహవ్యాధి, గుల్మము హృద్రోగము, భగందరము, ఉన్మాదము, జ్వరము, బ్రధ్నవ్యాధి, శిరశ్శూల, కర్ణశూల, హృదయముబిగపట్టుట, పార్శ్వములుబిగపట్టుట, పృష్ఠభాగముబిగపట్టుట, కటిప్రదేశముబిగపట్టుట, కంపవాతము, ఆక్షేపకవాతము, శరీరముబరువుగనుండుట, శరీరము మిక్కిలిచులకనగనుండుట, ఆర్తవముక్షీణించుట, ఆర్తవములేకుండుట, విషమాగ్ని, పిరుదులు మోకాళ్లు పిక్కలు తొడలు చీలమండలు మడమలు మీగాళ్ళు యోని బాహువులు వ్రేళ్ళు స్తనములు అవయవములు దంతములు గోళ్ళు కణుపులు ఎముకలు వీనియందలి శూలలు, ఇవిఎండుట, ఇవిస్తంభించుట, ప్రేగులరచుట, పరికర్తకము, మిక్కిలిఅల్పమైనశబ్దము, అధికమైనగంధముజనించుట మొదలగునవి కలవారలకును మహారోగాధ్యాయమునందు చెప్పబడిన వాతవ్యాధులు కలవారలకును ఆస్థాపనవస్తిని విశేషించిచేయింపవలయును. వాతవ్యాధులయందు ఆస్థాపనవస్తి ప్రధానమయినదని చెప్పబడినది. మూలమును ఛేదించుటవలన వృక్షము నశించువిధమున ఆస్థాపనవస్తివలన వాతవ్యాధులు నశించును.

## అనువాసనవస్తిని చేయింపతగనివారు.

మూ॥ య ఏవానాస్థాప్యాః త ఏవాననువాస్యాః స్యుః, విశేషత స్త్వభుక్త నవజ్వరపాణ్డురోగ కామలాప్రమేహార్శః ప్రతిశ్యాయారోచక మన్దాగ్ని దుర్బలప్లీహ కఫోదరోరుస్తమ్భ వర్చోభేద పీతవిషగర పిత్తకఫాభిష్యన్ద గురుకోష్ఠశ్లీపద గలగణ్డాప చిక్రిమికోష్ఠినః ॥18॥

అ॥ ఎవరికి ఆస్థాపనవస్తిని చేయింపగూడదో వారికి అనువాసనవస్తినిగూడ చేయింపగూడదు. మఱియు ఆహారమునుభుజింపనివాడు, నవజ్వరము పాండురోగము కామె

ర్శ్ల ప్రమేహము అర్శస్సు ప్రతిశ్యాయము అరోచకము అగ్నిమాంద్యము దుర్బలత్వము ప్లీహవ్యాధి కఫోదరము ఊరుస్తంభము మలమధికముగ వెడలుట ఇవికలవారు, విషమును పానముచేసినవాడు, కృత్రిమవిషమును సేవించినవాడు, పిత్తము కఫము అభిష్యందము గురుకోష్ఠము శ్లీపదము గలగండ అపచి ఇవికలవారు, కోష్ఠమునందు క్రిములు కలవాడు వీరికిగూడ అనువాసనవస్తిని చేయింపగూడదు.

అనర్హులకు అనువాసనవస్తినలనగలుగు దోషములు.

మూ॥ తత్రాభుక్తభక్తస్యానావృతమార్గత్వాదూర్ధ్వమతిన క్తః స్నేహః, నవజ్వరపాణ్డురోగకామలాప్రమేహిణాం దోషానుత్క్లేశ్యోదరం జనయేత్, అర్శసస్య అర్శాంస్యభిష్యన్ద్యాధ్మానం కుర్యాత్, అరోచకార్తస్య అన్నగృద్ధిం పునర్హన్యాత్, మన్దాగ్నిదుర్బలయోర్మన్దతరమగ్నిం కుర్యాత్, ప్రతిశ్యాయప్లీహాదిమతాం చ భృశతరముత్క్లిష్టదోషాణాం భూయ ఏవ దోషం వర్ధయేత్, తస్మాదేతే నానువాస్యాః ॥19॥

అ॥ అనువాసనవస్తిని చేయించుటవలన - వారిలో ఆహారమును భుజింపనివానికి మార్గముఆవరింపబడియుండకపోవుటవలన స్నేహము ఊర్ధ్వముగ వ్యాపించును. నవజ్వరము పాండురోగము కామెర్లు ప్రమేహము ఇవిగలవారికి దోషములు ఉత్క్లేశము నొంది ఉదరవ్యాధిని కలిగించును. అర్శస్సుకలవానికి అర్శస్సులుక్లేదమునొందుట వలన ఆధ్మానము కలుగును. అరోచకముకలవానికి అన్నాభిలాష యింకను నశించును. అగ్నిమాంద్యము దుర్బలత్వము ఇవికలవారికి అధికమగు అగ్నిమాంద్యము కలుగును. ప్రతిశ్యాయము ప్లీహవ్యాధి మొదలగునవికలవారికి దోషములు మిక్కిలిఉత్క్లేశమునొంది ఇంకను వృద్ధియగును. అందువలన వీరికి అనువాసనవస్తిని చేయింపగూడదు.

అనువాసనవస్తిని చేయింపతగినవారు.

మూ॥ య ఏవాస్థాప్యాస్త ఏవానువాస్యాః, విశేషతస్తు రూక్షతీక్ష్ణాగ్నయః కేవలవాతరోగార్తాశ్చ; ఏతేషు హ్యనువాసనం ప్రధానతమమిత్యుక్తం వనస్పతి మూలచ్ఛేదనవత్, మూలే ద్రుమాణాం ప్రసేకవచ్చేతి ॥20॥

అ॥ ఎవరికి ఆస్థాపనవస్తిని చేయింపవచ్చునో వారికి అనువాసనవస్తినిగూడ చేయింపవచ్చును. మఱియు రూక్షముగనున్నట్టియు తీక్ష్ణముగనున్నట్టియు జాఠరాగ్ని కలవారికిని కేవలవాతరోగముకలవారికిని అనువాసనవస్తిని విశేషించి చేయింపవలయును. వీనియందు అనువాసనవస్తి ప్రధానమైనదని చెప్పబడినది. అనువాసనవస్తిని చేయించిన యెడల-మూలమును ఛేదించుటవలన వృక్షమునశించువిధమున వ్యాధులు నశించును. మరియు మూలమునందు ఉదకమును పోయుటవలన వృక్షములు వృద్ధినొందువిధమున ధాత్వాదులు వృద్ధినొందును.

### నస్యకర్మను చేయింపతగనివారు.

మూ॥ అశిరోవిరేచనార్హాస్తు పునః—అజీర్ణిభుక్తభక్తపీతస్నేహమద్యతోయపాతుకామస్నాతశిరఃస్నాతుకామక్షుత్తృష్ణాశ్రమార్తమత్తమూర్ఛితశస్త్రదణ్డాహతవ్యవాయవ్యాయామపానక్లాన్తనవజ్వరశోకాభితప్తవిరిక్తానువాసితగర్భిణీనవప్రతిశ్యాయార్తా అనృతుదుర్దినే చేతి ॥21॥

అ॥ అజీర్ణముకలవాడు, ఆహారమును భుజించినవాడు, స్నేహము మద్యము ఉదకము వీనిని పానముచేసినవారు, వీనిని పానముచేయదలచినవారు, శిరఃస్నానమును చేసినవాడు, శిరఃస్నానమును చేయదలచివాడు, ఆకలి దప్పిక ఆయాసము వీనిచే బాధనొందుచున్నవారు, ఉన్మత్తుడు, మూర్ఛనొందినవాడు, కత్తులు కర్రలు వీనిచే కొట్టబడినవారు, మైథునము వ్యాయామము మద్యపానము వీనిచే అలసినవారు, నవజ్వరముకలవాడు, దుఃఖముతో వ్యాప్తమైనవాడు, విరేచనకర్మ చేయింపబడినవాడు, అనువాసనవస్తి చేయింపబడినవాడు, గర్భిణీస్త్రీ, నూతనముగకలిగిన ప్రతిశ్యాయముకలవాడు వీరలకు నస్యకర్మను చేయింపకూడదు. ఋతువు అనుకూలముగాని ఋతువులయందును దుర్దినమునందును నస్యకర్మను చేయింపకూడదు.

### అనర్హులకు నస్యకర్మవలన కలుగు దోషములు.

మూ॥ తత్రాజీర్ణిభుక్తభక్తయోర్దోష ఊర్ధ్వవహాని స్రోతాంస్యావృత్య కాసశ్వాసచ్ఛర్దిప్రతిశ్యాయాన్ జనయేత్, పీతస్నేహమద్యతోయపాతుకామానాం కృతే చ పిబతాం ముఖనాస్రావాక్ష్యుపదేహతిమిర శిరోరోగాన్ జనయేత్, స్నాతశిరసః కృతే చ స్నాతస్య ప్రతిశ్యాయః, క్షుధార్తస్య వాతప్రకోపం, తృష్ణార్తస్య పునస్తృష్ణాభివృద్ధిం ముఖశోషం చ, శ్రమార్తమత్తమూర్ఛితానామాస్థాపనోక్తో దోషః స్యాత్, శస్త్రదణ్డహతయోస్తీవ్రతరాం రుజం జనయేత్, వ్యవాయవ్యాయామపానక్లాన్తానాం శిరఃస్కన్ధనేత్రోరః పీడనం, నవజ్వరశోకాభితప్తయోరూష్మా నేత్రనాడీరనుసృత్య తిమిరం జ్వరవృద్ధిం చ కుర్యాత్, విరిక్తస్య వాయురిన్ద్రియోపఘాతం కుర్యాత్, అనువాసితస్య కఫః శిరోగురుత్వం కణ్డూక్రిమిదోషాంశ్చ జనయేత్, గర్భిణ్యా గర్భం స్తమ్భయేత్ స కాణః కుణిః పక్షహతః పీఠసర్పీ వా స్యాత్, నవప్రతిశ్యాయార్తస్య స్రోతాంసి వ్యాపాదయేత్, అనృతుదుర్దినే శీతదోషాత్ పూతినస్యం శిరోరోగశ్చ స్యాత్, తస్మాదేతే న శిరోవిరేచనార్హాః ॥22॥

అ॥ నస్యకర్మను చేయించుటవలన — వారిలో అజీర్ణముకలవానికిని ఆహారమును భుజించినవానికిని దోషము ఊర్ధ్వవహస్రోతస్సులను ఆవరించి కాస శ్వాస వాంతి ప్రతిశ్యాయము వీనిని కలిగించును. స్నేహము మద్యము ఉదకము వీనిని పానముచేసిన వారికిని పానముచేయదలచిన వారికిని ముఖస్రావము, నాసాస్రావము, నేత్రములు పూయబడినట్లుండుట, తిమిరమనెడి నేత్రవ్యాధి, శిరోవ్యాధులు ఇవి కలుగును. నస్యకర్మను చేయించినపిదప వీనినిపానము చేసినవారికికూడ ఈదోషములే కలుగును. శిరఃస్నానముచేసినవానికిని శిరఃస్నానమును చేయదలచివానికిని ప్రతిశ్యాయము కలుగును. ఆకలి కలవానికి వాతప్రకోపము కలుగును. దప్పికలవానికి ఇంకను అధికమైన దప్పికయు నోరు ఎండుటయు కలుగును. ఆయాసముచే బాధనొందువానికిని ఉన్మత్తునకును మూర్ఛనొందినవానికిని ఆస్థాపనవస్తివలన కలుగుదోషములే కలుగును. కత్తులు కర్రలు వీనిచే కొట్టబడినవారికి తీవ్రమైనబాధ కలుగును. మైథునము వ్యాయామము మద్యపానము వీనిచే అలసినవానికిని భుజశిరస్సులు నేత్రములు వక్షఃస్థలము వీనియందు బాధకలుగును. నవజ్వరముకలవానికిని దుఃఖముతో వ్యాప్తమైనవానికిని వేడిమి నేత్రనాడులద్వారా ప్రసరించి తిమిరవ్యాధిని జ్వరవృద్ధినికలిగించును. విరేచనకర్మ చేయింపబడినవానికి వాతము వృద్ధినొందినదై ఇంద్రియవిఘాతమును కలిగించును. అనువాసనవస్తి చేయింపబడినవానికిని కఫము వృద్ధినొంది శిరస్సుబరువుగనుండుటను దురదను క్రిమిదోషమును కలిగించును. గర్భిణీస్త్రీకి గర్భము స్తంభించినదై గ్రుడ్డిదిగగాని పిప్పిగోళ్ళుకలదిగగాని పక్షములు లేనిదిగగాని కుంటిదిగగాని యగును. నూతనముగకలిగినప్రతిశ్యాయముకలవానికిని స్రోతస్సులువ్యాపత్తినొందును. అనుకూలముకాని ఋతువునందును దుర్దినమునందును శీతదోషమువలన పూతినస్యమనెడినాసారోగమును శిరోవ్యాధులునుకలుగును. అందువలన వీరలకునస్యకర్మను చేయింపకూడదు.

నస్యకర్మముచేయింపతగినవారు.

మూ॥ శేషాస్త్వర్హాః, విశేషతస్తు శిరోదన్తమన్యాస్తమ్భహనుగ్రహపీనసగలశుణ్డికాశాలూకశుక్రతిమిరవర్త్మరోగవ్యఙ్గోపజిహ్వికార్ధావభేదకగ్రీవాస్కన్ధాస్యనాసికాకర్ణాక్షిమూర్ధకపాలశిరోరోగార్దితాపతన్త్రకాపతానకగలగణ్డదన్తశూలహర్షచాలాక్షిరాగనాడ్యర్బుదస్వరభేదవాగ్గ్రహగద్గదకథనాదయ ఊర్ధ్వజత్రుగతా వాతవికారాః పరిపక్వాశ్చ; ఏతేషు శిరోవిరేచనం ప్రధానతమమిత్యుక్తం, తద్ధ్యుత్తమాఙ్గమనుప్రవిశ్యమజ్జపేశీకాసక్తం దోషం వికారకర మపకర్షతి ॥౩౮॥

అ॥ పైచెప్పబడినవారలకుగాక ఇతరులకు నస్యకర్మ చేయింపవచ్చును. శిరఃస్తంభము, దంతస్తంభము, మన్యాస్తంభము, హనుగ్రహము, పీనసము, గలశుండిక శాలూకములనెడి కంఠవ్యాధులు, శుక్రతిమిరములనెడి నేత్రవ్యాధులు, కనురెప్పలయందలివ్యాధులు, మంగు, కొండనాలుక, అర్ధావభేదము, మెడ భుజశిరస్సులు నోరు ముక్కు చెవులు కండ్లు తల కపాలము శిరస్సు వీనియందలి వ్యాధులు, అర్దితము,

అపతంత్రకము, అపతానకము, గలగండము, దంతశూల, దంతహర్షము, దంతములు కదలుట, కండ్లు ఎఱ్ఱబారుట, నాడివ్యాధి, అర్బుదము, స్వరభేదము, మాటబిగపట్టుట, గద్గదస్వరముతో మాట్లాడుట మొదలగునవి కలవారలకును ఊర్ధ్వజత్రుగతవ్యాధులు కలవారలకును పరిపక్వమైనవాతవ్యాధులు కలవారలకును నస్యకర్మను విశేషించి చేయింపవలయును. వీనియందు నస్యకర్మ ప్రధానమైనదని చెప్పబడినది. ఆ నస్యము శిరస్సునందు ప్రవేశించి మజ్జయందును పేశులయందును అంటియున్నట్టియు బాధలను కలిగించుచున్నట్టియు దోషమును నశింపచేయును.

మూ॥ ప్రావృట్ఛరద్వసన్తేష్వితరేష్వాత్యయికేషు రోగేషు నావనం కుర్యాద్గ్రీష్మే పూర్వాహ్ణే, శీతే మధ్యాహ్నే, వర్షాస్వదుర్దినే చేతి ॥24॥

అ॥ ప్రావృడృతువునందును శరదృతువునందును వసంతఋతువునందును నస్యకర్మను చేయింపవచ్చును. వ్యాధులు మిక్కిలి బాధించునవిగనున్నచో ఇతరఋతువులయందుకూడ చేయింపవచ్చును. అట్లు చేయించునపుడు గ్రీష్మఋతువునందైనచో పూర్వాహ్ణమునందును హేమంతఋతువునందైనచో మధ్యాహ్నమునందును వర్షఋతువునందైనచో దుర్దినముకానిదినమునందును చేయింపవలయును.

## అధ్యాయ సంగ్రహము.

మూ॥ ఇతి పఞ్చవిధం కర్మ విస్తరేణ నిదర్శితమ్ । యేభ్యో యత్త్వహితం యస్మాత్కర్మ యేభ్యశ్చ యద్ధితమ్ ॥ న చైకాన్తేన నిర్దిష్టమేకాన్తేన సమాశ్రయేత్ । స్వయమప్యత్ర వైద్యేన తర్క్యం బుద్ధిమతా భవేత్ ॥ ఉత్పద్యేతే హి సావస్థా దేశకాలబలం ప్రతి । యస్యాం కార్య మకార్యం స్యాత్కర్మ కార్యం చ గర్హితమ్ ॥ ఛర్దిహృద్రోగగుల్మానాం వమనం స్వే చికిత్సితే । అవస్థాం ప్రాప్య నిర్దిష్టం కుష్ఠినాం వస్తికర్మ చ॥ తస్మాత్సత్యపి నిర్దేశే కుర్యాదూహ్య స్వయం ధియా । వినా తర్కేణ యా సిద్ధిర్యదృచ్ఛాసిద్ధిరేవ సా ॥25॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే సిద్ధిస్థానే పఞ్చకర్మీయ సిద్ధిర్నామ ద్వితీయోఽధ్యాయః ॥

అ॥ పంచకర్మీయసిద్ధియనెడు ఈ అధ్యాయమునందు పంచకర్మలలో ఏది ఎవరలకు ఎందువలన అహితమైనదో ఏది ఎవరలకు హితమైనదో ఆవిషయమంతయు విస్తరించి చెప్పబడినది. నిశ్చయించిచెప్పబడిన దీనిని నిశ్చయించి అనుసరింపనవసరములేదు. బుద్ధిమంతుడగు వైద్యుడు స్వయముగకూడ ఊహింపవలయును. దేశము కాలము బలము వీనినను సరించి ఆయాఅవస్థలు కలుగును. చేయింపతగినది కొన్నిఅవస్థలయందు చేయింపకూడనిదిగ నగును. చేయింపతగనిది కొన్నిఅవస్థలయందు చేయింప

తగినదిగ నగును. ఛర్ది హృద్రోగము గుల్మము వీనికి వమనమును, కష్ఠమునకు వస్తికర్మయు అవస్థాభేదమునుద్దేశించి తమతమచికిత్సలయందు చెప్పబడినవి. కావున సామాన్యముగా చెప్పినను బుద్ధిచే స్వయముగా ఊహించి చేయింపవలయును. ఊహింపకుండ చేయించినచో సరియైనసిద్ధి కలుగ నేరదు.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు పంచకర్మీయసిద్ధి యనెడు ద్వితీయాధ్యాయము సమాప్తము.

—0—

# తృతీయాధ్యాయము.

మూ॥ అథాతో వస్తిసూత్రీయాం సిద్ధిం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట వస్తిసూత్రీయసిద్ధిని చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ కృతక్షణం శైలవరస్య రమ్యే స్థితం ధనేశాయతనస్య పార్శ్వే! మహర్షిసంఘైర్వృతమగ్నివేశః పునర్వసుం ప్రాఞ్జలిరన్వపృచ్ఛత్ ॥ వస్తిర్నరేభ్యః కిమవేక్ష్య దత్తః స్యాత్సిద్ధిమాన్కిమ్మయమస్య నేత్రమ్। కీదృక్ప్రమాణాకృతి కింగుణశ్చ కేషాం చ కిం యోని గుణశ్చ వస్తిః ॥ నిరూహకల్పః ప్రణిధానమాత్రాః స్నేహస్య వా కాః శమనే విధిః కః। కే వస్తయః కేషు మతా ఇతీదం శ్రుత్వోత్తరం ప్రాహ వచో మహర్షిః ॥5॥

అ॥ సావధానచిత్తుడైనట్టియు పర్వతశ్రేష్ఠమైనహిమవత్పర్వతముయొక్క మనోహరమైన పార్శ్వభాగమునందు కూర్చునియున్నట్టియు మహర్షిసంఘములతో కూడియున్నట్టియు ఆత్రేయుని అగ్నివేశుడు దోసిలొగ్గి ఈక్రిందివిధమున అడిగెను. వేనినిఆలోచించి ప్రయోగింపబడినవస్తి అధికమైనసిద్ధినొందును? వస్తియొక్క నేత్రమును దేనితో చేయవలయును? ఇది ఎంతప్రమాణమును కలిగియుండవలయును? ఎట్టిఆకారమును కలిగియుండవలయును? ఎట్టిగుణమును కలిగియుండవలయును? ఎవరలకు వేనితోనిర్మింపపడి ఎట్టిగుణముగల వస్తిని ప్రయోగింపవలయును? నిరూహవస్తిని ఎట్లు కల్పింపవలయును? స్నేహములను ఎంతపరిమితిగ నుపయోగింపవలయును? బాధలుకలిగినప్పుడు ఎట్లు శమింపచేయవలయును? ఎవరలకు ఎట్టివస్తులను చేయింపవలయును? అని అడుగగా ఆత్రేయుడు ఈక్రిందివిధముగ సమాధానమును చెప్పెను.

వస్తిని చేయునపుడు తెలిసికొనదగినవి.

మూ॥ సమీక్ష్యదోషౌషధదేశకాలసాత్మ్యాగ్నిసత్త్వాదివయో బలాని । వస్తిః ప్రయుక్తో నియతం గుణాయ స్యుః సర్వకర్మాణి చ సిద్ధిమన్తి ॥6॥

అ॥ దోషము, ఔషధము, దేశము, కాలము, సాత్మ్యము, జాఠరాగ్ని, సత్త్వము మొదలగునవి, వయస్సు, బలము వీనిని తెలిసికొని వస్తిని ప్రయోగించినచో గుణములను తప్పక కలిగించును. ఇట్లు తెలిసికొని ప్రయోగించినచో సమస్తకర్మలును కూడ గుణములను తప్పక కలిగించును.

వస్తినేత్రమును చేయుట కుపయోగించునవి.

మూ॥ సువర్ణరూప్యత్రపుతామ్రరీతి కాంస్యాస్థిలోహద్రుమ వేణుదన్తైః। నాళైర్విషాణైర్మణిభిశ్చ తైస్తైః కార్యాణి నేత్రాణి త్రికర్ణికాని ॥ 7 ॥

అ॥ బంగారము వెండి వంగము రాగి ఇత్తడి కంచు ఎముకలు లోహము కర్రలు వెదురు దంతములు నాళములు కొమ్ములు మణులు మొదలగువానిలో దేనితోనైనను వస్తినేత్రమును తయారుచేయవలయును. దీనికి మూడుకర్ణికలు ఉండవలయును.

వస్తినేత్రముయొక్క పరిమాణము-ఆకారము-గుణము.

మూ॥ షడ్ద్వాదశాష్టాఙ్గులసంమితాని షడ్వింశతిద్వాదశ వర్ష జానామ్॥ స్యుర్ముద్గకర్కన్ధుసతీనవాహిచ్ఛిద్రాణి వర్త్యా పిహితాని చాపి॥ యథావయోఽఙ్గుష్ఠకనిష్ఠికాభ్యాం మూలాగ్రయోః స్యుః పరిణాహవన్తి । ఋజూని గోపుచ్ఛసమాకృతీని శ్లక్ష్ణాని చ స్యుర్గులికా ముఖాని ॥ స్యాత్కర్ణికైకాఽగ్రచతుర్థభాగే మూలాశ్రితే వస్తినిబన్ధనే ద్వే ॥9॥

అ॥ వస్తినేత్రము—ఆరుసంవత్సరముల వయస్సుకలవానికి ఆరంగుళముల పరిమితిగను, ఇరువదిసంవత్సరముల వయస్సుకలవానికి పండ్రెండంగుళముల పరిమితిగను, పండ్రెండుసంవత్సరముల వయస్సుకలవానికి ఎనిమిదిఅంగుళముల పరిమితిగను నుండవలయును. మరియు యథాక్రమముగ పెసరగింజ రేగుగింజ బటాణీగింజ ఇవిపట్టునంత రంధ్రముకలవిగ నుండవలయును. ఈ రంధ్రమును వర్తిచే కప్పియుంచవలయును. మరియు వస్తినేత్రముయొక్క మూలమునందలి చుట్టుకొలత ఆయారోగియొక్క అంగుష్ఠపరిమితిగను అంతమునందలి చుట్టుకొలత చిటికెనవ్రేలు పరిమితిగను నుండవలయును. ఈ నేత్రము ఋజువుగను (వంకరలేనిదిగను) ఆవుతోకయొక్క ఆకారము కలదిగను నున్నగను గులికవంటి ముఖముకలదిగను నుండవలయును. దీనియొక్క చివర నాలుగవభాగమునందు ఒకకర్ణికయు, మొదటియందు వస్తినిబిగించుటకు రెండు కర్ణికలును నుండవలయును.

వ_స్తియొక్క నిర్మాణమునకు అనుకూలమైనవి - గుణము.

మూ॥ జారద్గవో మాహిషహారిణో వా స్యాచ్ఛాగకో వ_స్తి రజస్య వాపి। దృఢ_స్తనుర్నష్టశిరో విగన్ధఃకషాయర_క్తః సుమృదుః సుశుద్ధః॥ నృణాం వయో వీక్ష్య యథానురూపం నేత్రేషు యోజ్య_స్తు సుబద్ధసూత్రః। వ_స్తేరభావే ప్లవజో గలో వా స్యాదఙ్కపాదః సుఘనః పటో వా॥ నేత్రస్య చాలాభత ఏవ నాలీ హితాఽస్థిజా వంశభవా నలో వా ॥1॥

అ॥ ముసలిఎద్దుయొక్క గాని దున్నపోతుయొక్క గాని లేడియొక్క గాని అడవి పందియొక్క గాని మేకయొక్క గాని మూత్రాశయమును గ్రహించి వ_స్తిని నిర్మింపవలయును. ఈమూత్రాశయము దృఢముగను పలచగను తీసి వేయబడిన సిరలు కలదిగను దుర్గంధము లేనిదిగను కషాయములతో భావనచేయుబడి ఎఱ్ఱగను మృదువుగను పరిశుద్ధముగను నుండవలయును. మనుజులయొక్క వయస్సు ననుసరించి అనుకూలమైనదానిని గ్రహింపవలయును. దీనిని నేత్రమునందు కూర్చి దారములతో గట్టిగ కట్టవలయును. మూత్రాశయము దొరకనియెడల నీరుకోడియొక్క కంఠమునుగాని అంకపాదమనెడి పక్షియొక్క చర్మమునుగాని దళసరిగనుండు వస్త్రమునుగాని గ్రహించి వ_స్తిని నిర్మింపవలయును. బంగారము మొదలగువాని సంబంధమగు నేత్రము లభింపనియెడల ఎముకల సంబంధమగు గొట్టమునుగాని వెదురుసంబంధమగు గొట్టమునుగాని ఇతరమైన గొట్టమునుగాని గ్రహింపవలయును.

నిరూహవ_స్తి కల్పనావిధానము.

మూ॥ ఆస్థాపనార్హం పురుషం విధిజ్ఞః సమీక్ష్య పుణ్యేఽహని శుక్లపక్షే। ప్రశ_స్తనక్షత్రముహూర్తయోగే జీర్ణాన్నమేకాగ్రముపక్రమేత ॥ బలాం గుడూచీం త్రిఫలాం సరాస్నాం ద్వే పఞ్చమూలే చ పలోన్మితాని। అష్టౌ పలాన్యర్ధతులాం చ మాంసాచ్ఛాగాత్పచేదప్సు చతుర్థశేషమ్ ॥ పూతం యవానీఫలబిల్వకుష్ఠవచాశతాహ్వాఘనపిప్పలీనామ్। కల్కైర్గుడక్షౌద్రఘృతైః సతైలైర్యుతం సుఖోష్ణైస్తు పిచుప్రమాణైః॥ గుడాత్పలం ద్విప్రసృతాం తు మాత్రాం స్నేహాచ్చ యుక్త్వా మధుసైన్ధవం చ। స్నేహం సునిర్మథ్య తతోఽనుకల్పం ప్రక్షిప్య వస్తౌ మథితం ఖజేన॥ వ_స్తిం తతః సవ్యకరే నిధాయ సుబద్ధముచ్ఛ్వాస్య చ నిర్వ్యలీకమ్।అఙ్గుష్ఠమధ్యేన ముఖంపిధాయ నేత్రాగ్రసంస్థాముపనీయ వర్తిమ్॥ తైలాక్తగాత్రం కృతమూత్రవిట్కం నాతిక్షుధార్తం

శయనే మనుష్యమ్ । సమేఽథ కిఞ్చిన్నతశీర్షకే వా నాత్యుచ్ఛ్రితే స్వా స్తరణోపపన్నే॥ సవ్యేన పార్శ్వేన సుఖం శయానం కృత్వర్జుదేహం స్వభుజోపధానమ్। నికుఞ్చ్య సవ్యేతరదస్య సక్థి సవ్యం ప్రసార్య ప్రణయేచ్ఛనైస్తమ్॥ స్నిగ్ధే గుదే నేత్రచతుర్థభాగం స్నిగ్ధం శనైరృజ్వథ పృష్ఠవంశమ్। అకమ్పనావేపనలాఘవాదీన్పాణ్యోర్గుణాంశ్చాపి విధాయ హస్తమ్॥ ప్రపీడ్య చైకగ్రహణేన దత్తం నేత్రం శనైరేవ తతోఽపకర్షేత్ ॥౬౦॥

అ॥నిరూహవస్తిని చేయింపతగినట్టియు జీర్ణమునొందిన ఆహారము కలిగినట్టియు సావధానముగనున్నట్టియు మనుజునకు శుక్లపక్షమునందు ప్రశస్తములైన నక్షత్రము ముహూర్తము యోగము వీనితోకూడినట్టి శుభదినమున నిరూహవస్తిని ఇయ్యవలయును. ముత్తవపులగము తిప్పతీగె త్రిఫలములు సన్నరాష్ణము హ్రస్వపంచమూలములు మహాపంచమూలములు వీనినొక్కొక్కపలముగను, మేకమాంసమును ఏబదిఎనిమిదిపలములుగను గ్రహించి నీటియందు నాల్గవవంతుమిగులునట్లు కాచి ఒడియకట్టి అందుపరానాని వాము మంగకాయలు మారేడు చెంగల్వకోష్టు వస సదాప తుంగగడ్డలు పిప్పళ్ళు ఒక్కొక్కకర్షపరిమితిగలవీనియొక్క కల్కమును, ఒకపలము బెల్లమును, రెండుపలములఘృతమును, రెండుపలములతైలమును, తగుపరిమితిగల తేనె సైంధలవణము వీనిని కలిపి గోరువెచ్చగనున్నదానిని చమురుకలియునట్లు మథించి గరిటెతోకలియ త్రిప్పి ఆకల్పనను వస్తియందు పోయవలయును. ఆవస్తిని ఎడమచేతితో గట్టిగపట్టుకొని అడ్డులేకుండునట్లు ఊదినేత్రములయొక్క అగ్రభాగమునందున్న వర్తిని తీసివేసి దానిముఖమును బొటనవ్రేలియొక్కమధ్యభాగముతో కప్పియుంచవలయును. తైలము చేపూయబడిన శరీరముకలిగినట్టియు మలమూత్రములను వెడలించినట్టియు అధికముగఆకలితోకూడుకొననట్టియు సమానముగ గాని శిరస్సునుంచు భాగమునందుకొద్దిపల్లము కలదిగగాని యున్నదియు మిక్కిలిఎత్తుగలేనిదియు మంచిఆస్తరణములతో కూడినదియునగు శయ్యయందు శరీరము వంకరలేకుండగనుంచుకొని ఎడమవైపునకు పరుండినట్టియు తనయొక్కభుజమును తలగడగనుంచుకొన్నట్టియు కుడికాలుముడిచికొని ఎడమకాలుచాచుకొనియున్నట్టియు మనుజునకు ఆవస్తిని ప్రయోగింపవలయును. స్నిగ్ధముగనున్న గుదమునందు స్నిగ్ధముగనున్న నేత్రమును నాల్గవవంతుప్రవేశించునట్లు మెల్లిగ బాధలేకుండునట్లుగ పృష్ఠవంశమునకు తిన్నగ ప్రవేశపెట్టవలయును. కదలుట ఒణుకు తొందర మొదలగు హస్తదోషములులేనివాడై ఒకేసారినొక్కి ఆవస్తియందలి కల్పమునంతను లోనప్రవేశపెట్టి పిమ్మట నేత్రమును మెల్లిగతీసివేయవలయును.

సరిగప్రయోగింపబడనివస్తివలనకలుగుదోషములు.

మూ॥ తిర్యక్ప్రణీతే తు న యాతి ధారా గుదే వ్రణః స్యాచ్చలితే చ నేత్రే। దత్తః శనైర్నాశయమేతి వస్తిః కణ్ఠం ప్రధావత్య

తిపీడితశ్చ॥ శీత స్తమ్భకరో విదాహం మూర్ఛాంచకుర్యా దతిమాత్ర ముష్ణః । స్నిగ్ధోఽతిజాడ్యం పవనం తు రూక్ష స్తన్వల్పమాత్రాలవణ స్త్వయోగమ్ ॥ కరోతి మాత్రాభ్యధికోఽతియోగం క్షామం తు సాన్ద్రః సుచిరేణ చైతి । దాహాతిసారౌ లవణోఽతికుర్యాత్తస్మాత్సు యుక్తం సమమేవ దద్యాత్ ॥23॥

అ॥ వస్తినేత్రమును అడ్డముగ ప్రవేశపెట్టినచో వస్తిధార ప్రవేశింప నేరదు. కదల్చినచో గుదమునందు వ్రణముకలుగును. వస్తిని మెల్లిగనొక్కినచో అది మలాశయమును పొంద నేరదు. అధికముగనొక్కినచో కంఠమువైపునకు వెడలును. వస్తియందలి కల్పనము చల్లగనున్నచో శరీరమును స్తంభింపచేయును. మిక్కిలివెచ్చగనున్నచో తాపమును మూర్ఛను కలిగించును. స్నిగ్ధముగనున్నచో అధికమగు జడత్వమును కలిగించును. రూక్షముగనున్నచో వాతమునువృద్ధినొందించును పలుచగనున్నను తక్కువ పరిమితిగనున్నను సైంధవలవణముతో కూడినదైనను దోషమును సరిగ వెడలింపచేయు జాలదు. అధికపరిమితిగనున్నచో దోషమునధికముగ వెడలించును. చిక్కగనున్నచో మనుజుని కృశింపచేయును. మరియు ఆలస్యముగ బయలువెడలును. అధికమగు సైంధవలణముతోకూడినచో తాపమును అతిసారమును కలిగించును. అందువలన వస్తిని సరిగ ప్రయోగింపవలయును.

మూ॥ పూర్వం హి యోజ్యం మధుసైన్ధవాభ్యాం స్నేహం వినిర్మథ్య తతోఽనుకల్కమ్ । విమథ్య సంయోజ్య పునర్ద్రవైస్తద్వస్తౌ నిదధ్యాన్మథితం ఖజేన ॥ వామాశ్రయోఽగ్నిర్గ్రహణీ గుదం చ తత్పార్శ్వసంస్థస్య సుఖోపలబ్ధిః । లీయన్త ఏవం బలయశ్చ తస్మాత్సవ్యం శయానోఽర్హతి వస్తిదానమ్ ॥ విడ్వాతవేగో యది చార్ధదత్తే నిష్కృష్యముక్తే ప్రణయేదశేషమ్ । ఉత్తాన దేహశ్చ కృతోపధానః స్యాద్వీర్యమాప్నోతి తథాఽస్య దేహమ్। ఏకోఽపకర్షత్యనిలం స్వమార్గాత్పిత్తం ద్వితీయస్తు కఫం తృతీయః ॥27॥

అ॥ మొదట తేనెను సైంధలవణమును చేర్చి స్నేహమును మథించి పిమ్మటకల్కమును చేర్చి మథించి పిమ్మట కషాయమునుపోసి గరిటెతో కలియత్రిప్పి వస్తియందు పోయవలయును. జాఠరాగ్నియు గ్రహణియు గుదప్రదేశమును ఎడమపార్శ్వమునందు ఉండును. కావున ఎడమువైపునకు పరుండినచో వస్తిద్రవము సుఖముగ ప్రవేశించును. మరియు గుదవళులు అణిగియుండును. అందువలన ఎడమువైపునకు పరున్నవాడు వస్తికర్మకు అర్హుడుగ నుండును. వస్తిద్రవము కొంత ప్రవేశింపగనే మలమునకు వాతమునకును వేగముకలిగినయెడల వస్తినేత్రమును తీసిమలవాతములు వెడలినపిదప, మిగిలిన ద్రవమునంతను ఎక్కింపవలయును. వెలకిలగను దిండుకలవాడుగను

పరుస్నచో వీనియొక్క శరీరమును బలమును పొందును. ఒకవస్తివాతమును, రెండవ వస్తి పిత్తమును, మూడవవస్తి కఫమును స్వస్థానమునుండి వెడలింపచేయును.

నిరూహానంతరవిధి.

మూ॥ ప్రత్యాగతే కోష్ణజలావసిక్తః శాల్యన్నమద్యాత్తనునా రసేన । జీర్ణే తు సాయం లఘు చాల్పమాత్రం భుక్తేఽనువాస్యః పరి బృంహణార్థమ్ ॥28॥

అ॥ వస్తిద్రవము మలముతోకూడ బయటలు వెడలినపిదప గోరువెచ్చని నీటితో స్నానమును చేయించి పలుచనిమాంసరసముతో శాల్యన్నమును ఇచ్చి అది జీర్ణమైన పిదప సాయంకాలమునందు లఘుగుణముకల ఆహారమును స్వల్పముగ నిచ్చి బృంహణము నిమిత్తము అనువాసనవస్తిని చేయింపవలయును.

స్నేహము శీఘ్రముగ రాకుండుటకై చేయవలసిన విధి.

మూ॥ నిరూహపాదాంశసమేన తైలేనామ్లానిలఘ్నౌషధసాధితేన । దత్వా స్ఫిచౌ పాణితలేన హన్యాత్స్నేహస్య శీఘ్రాగమరక్షణార్థమ్ ॥ ఈషత్పదాఙ్గుష్ఠయుగం చ కర్షేదుత్తానదేహస్య తలౌ ప్రమృజ్యాత్ । స్నేహేన పార్ష్ణ్యఙ్గులిపిణ్డికాశ్చ యే చాస్య గాత్రావయవా రుగార్తాః ॥ తాంశ్చావమృజ్యాత్స సుఖం తతశ్చ నిద్రాముపాసీత కృతోపధానః ॥30॥

అ॥ నిరూహవస్తికిచెప్పబడిన తైలమునకు నాలుగవవంతు పరిమితికల తైలమును గ్రహించి అమ్లరసముకలవియు వాతహారములును నగు ద్రవ్యములతో తయారు చేసి ఆతైలమును పిరుదులయందుపూసి అరచేతులతో తాడనమును చేయవలయును. అట్లు చేసినచో లోపలనున్నతైలము బయటికి శీఘ్రముగ రాకుండును. వెల్లకితలగ పరుండబెట్టి కాళ్ళయందలి బొటనవ్రేళ్ళను కొద్దికొద్దిగ లాగవలయును. మరియు అరకాళ్ళు మడమలు వ్రేళ్ళు పిక్కలు బాధకల ఇట్టి ఇతరఅవయవములు వీనియందు తైలమును సుఖముగనుండునట్లు పూయవలయును. పిమ్మట తలగడకలవాడై నిద్రింపవలయును.

నిరూహవస్తియందు కషాయస్నేహములయొక్క పరిమాణము.

మూ॥ భాగాఃకషాయస్య తు పఞ్చ పిత్తే స్నేహస్య షష్ఠః ప్రకృతౌ స్థితే చ । వాతే వివృద్ధే తు చతుర్థభాగో మాత్రా నిరూహేషు కఫేఽష్టభాగః ॥31॥

అ॥ నిరూహవస్తికి మొత్తముద్రవములలో కషాయమును అయిదుభాగములుగ గ్రహింపవలయును. స్నేహమును పిత్తాభివృద్ధికలవానికిని స్వస్థునకును ఆరవవంతు

గను వాతాభివృద్ధికలవానికి నాలుగవవంతుగను, కఫాభివృద్ధికలవానికి ఎనిమిదవ వంతుగను గ్రహింపవలయును.

వయోభేదము ననుసరించి నిరూహపరిమాణభేదము.

మూ॥ నిరూహమాత్రా ప్రసృతార్ధమాద్యే వర్షే తతోఽర్ధప్రసృతాభివృద్ధిః । ఆద్వాదశాత్స్యాత్ప్రసృతాభివృద్ధిరష్టాదశాద్ద్వాదశతః పరం స్యుః॥ ఆసప్తతేరుక్తమిదం ప్రమాణ మతఃపరం షోడశవద్విధేయమ్ । నిరూహమాత్రా ప్రసృతిప్రమాణా బాలే చ వృద్ధే చ మృదుర్విశేషః ॥33॥

అ॥ నిరూహవస్తియందలి ద్రవము ఒకసంవత్సరము వయస్సుగడచువరకు అర్ధప్రసృతిపరిమితిగ నుండవలయును. అప్పటినుండి పండ్రెండు సంవత్సరములవరకు అర్ధప్రసృతముచొప్పున హెచ్చింపవలయును. పిమ్మట పదునెనిమిది సంవత్సరముల వరకు ఒక్కొక్క ప్రసృతముచొప్పున హెచ్చింపవలయును. డెబ్బదిసంవత్సరముల వరకు ఈపన్నెండు ప్రసృతములనే ఉపయోగింపవలయును. డెబ్బదిసంవత్సరములకు పిమ్మట పదునారుసంవత్సరములు వయస్సుకలవానియొక్క పరిమాణమును ఉపయోగింపవలయును. బాలురకును వృద్ధులకును ఆయాప్రమాణములచొప్పున ఉపయోగించుచున్నను విశేషించి మృదువుగ నుండవలయును.

శయనాదిక్రమము.

మూ॥ నాత్యుచ్ఛ్రితం నాప్యతినీచపాదం సపాదపీఠం శయనం ప్రశస్తమ్ । ప్రధానమృద్వాస్తరణోపపన్నం ప్రాక్శీర్షకం శుక్లపటోత్తరీయమ్॥ భోజ్యం పునర్వ్యాధి మవేక్ష్య సమ్యక్ ప్రకల్పయేద్యూషపయోరసాద్యైః । సర్వేషు విద్యాద్విధిమేతదాద్యం వక్ష్యామి వస్తీనత ఉత్తరీయాన్ ॥ సమ్యక్ ప్రణీతాః ఖలు వస్తయో యే వాతామయఘ్నాశ్చ బలప్రదాశ్చ ॥36॥

అ॥ మిక్కిలి ఎత్తుగలేనట్టియు మిక్కిలిపొట్టిగలేనికాళ్ళు కలిగినట్టియు పాదపీఠముతో కూడినట్టియు శ్రేష్ఠముగను మృదువుగనునున్న ఆస్తరణములతో కూడినట్టియు తలనుంచువైపు తూర్పుగనున్నట్టియు తెల్లనివస్త్రముతో కప్పబడినట్టియు శయనమును ఉపయోగింపవలయును. వ్యాధిననుసరించి యూషములు పాలు మాంసరసము మొదలగువానితో అనుకూలమైన ఆహారమును సేవింపవలయును. ఇట్లు శ్రేష్ఠమైనవిధి చెప్పబడినది. వాతనాశకములును బలప్రదములును నగు వస్తులును చెప్పుచున్నాము.

మూ॥ ద్విపఞ్చమూలస్య రసోఽమ్లయుక్తః సచ్ఛాగమాంసస్య సపూర్వపేష్యః॥ త్రిస్నేహయుక్తః ప్రవరో నిరూహః సర్వానిలవ్యాధిహరః ప్రదిష్టః ॥37॥

అ॥ మేకమాంసముతో కూడినదశమూలములయొక్క కషాయమునందు కాంజికము మొదలగు ఆమ్లద్రవములను, నిరూహవస్తికల్పయందు చెప్పబడిన కల్కమును, ఘృతము తైలము వస వీనిని చేర్చి నిరూహవస్తిని చేయించినచో సమస్తవాతవాధ్యులు నశించును.

మూ॥ స్థిరాదివర్గస్య బలాపటోలత్రాయన్తికైరణ్డయవైర్యుతస్య। ప్రస్థోరసాచ్ఛాగరసార్థయుక్తః సాధ్యః పునః ప్రస్థరసశ్చ యావత్॥ ప్రియఙ్గుకృష్ణాఘనకల్కయుక్తః సతైలసర్పిర్మధుసైన్ధవశ్చ। స్యాద్దీపనో మాంసబలప్రదశ్చ చక్షుర్బలం చాపి దదాతి సద్యః ॥39॥

అ॥ హ్రస్వపంచమూలములు ముత్తవపులగము చేదుపొట్ల త్రానుగ ఆముదపువేళ్లు యవలు వీనియొక్క కషాయమును ఒకప్రస్థముగను, మేకమాంసరసమును అర్ధప్రస్థముగను కలిపి ఒకప్రస్థముమిగులునట్లుకాచి యందు ప్రేంఖణము పిప్పళ్లు తుంగముస్తలు వీరియొక్క కల్కమును, తైలమును, ఘృతమును, తేనెను, సైంధవలవణమును కలిపి వస్తినిచేయించినచో జాఠరాగ్నిని మాంసమును బలమును దృష్టిబలమును వెంటనే కలిగించును.

## ఏరండవస్తి.

మూ॥ ఏరణ్డమూలం త్రిపలం పలాని హ్రస్వాని మూలాని చ యానిపఞ్చ। రాస్నాశ్వగన్ధాతిబలాగుడూచీపునర్నవారగ్వధదేవదారు॥ భాగాః పలాంశా మదనాష్టయుక్తా జలద్వ్యాఢకేసే క్వథితేఽష్టశేషే। పేష్యాః శతాహ్వా హపుషా ప్రియఙ్గు సపిప్పలీకం మధుకం వచా చ॥ రసాఞ్జనం వత్సకబీజముస్తమక్షప్రమాణాం లవణాంశయుక్తమ్। సమాక్షికస్తైలయుతః సమూత్రో వస్తిర్నృణాం దీపనలేఖనీయః॥జఙ్ఘోరుపాదత్రికపృష్ఠశూలం కఫావృతం మారుతనిగ్రహం చ। విణ్మూత్రవాతగ్రహణం సశూలమాధ్మానితామశ్మరిశర్కరే చ॥ ఆనాహమర్శో గ్రహణీప్రదోషానేరణ్డవస్తిః శమయేత్ప్రయుక్తః ॥43॥

అ॥ ఆముదపువేళ్ళను మూడుపలములుగను, హ్రస్వపంచమూలములను ఐదుపలములుగను, సన్నరాస్నము పెన్నేరు అతిబల తిప్పతీగ గలిజేరు రేల దేవదారువీనిని ఒక్కొక్కపలముగను, మంగకాయలను ఎనిమిదిపలములుగను గ్రహించి రెండు ఆఢకములనీటియందు ఎనిమిదవవంతుమిగులునట్లుకాచి యాకషాయమునందు సదాపబోడతరము ప్రేంఖణము పిప్పళ్లు అతిమధురము వస్సరసాంజనము కొడిసెపాలవిత్తులు తుంగగడ్డలు వీనియొక్క కల్కమున ఒక్కొక్కకర్షముగను, సైంధవలవణము తేనె తైలము గోమూత్రము వీనిని తగువిధముగను కలిపి వస్తిని చేయించినచో అగ్నిదీప్తిని కలిగించును. దోషాదులను వెడలింపచేయును. మరియు పిక్కలు తొడలు

పాదములు ముడ్డిపూస పృష్ఠప్రదేశము వీనియందలి శూలలను, కఫముతో ఆవరింప బడిన వాతముయొక్క బంధములు, మలము మూత్రము అపానవాతము వీనియొక్క బంధమును నశింపచేయును. మరియు నీ ఏరండవస్తివలన శూల కడుపుబ్బరము అశ్మరీ వ్యాధి శర్కరయనెడి వ్యాధి ఆనాహము అర్శస్సు గ్రహణీదోషము ఇవి నశించును.

మూ॥ చతుష్పలే తైలఘృతస్య భృష్టశ్ఛాగాచ్ఛతార్ధాద్దధిదాడిమామ్లః । రసః సపేష్యో బలవర్ణమాంసరేతోగ్నిదశ్ఛాత్యశిరోరుజాఘ్నః ॥44॥

అ॥ ఏబదిపలముల మేకమాంసముయొక్క రసమును నాలుగుపలముల తైలము ఘృతము వీనియందు ఉడికించి పెరుగు దానిమ్మరసము వీనితో పుల్లగనుండునట్లుచేసి నిరూహవస్తికల్పనయందు చెప్పబడిన కల్కమును చేర్చి దానితో వస్తిని చేయించిన రోగుల బలము వర్ణము మాంసము శుక్రము జాఠరాగ్ని ఇవి వృద్ధినొందును, కండ్లు కనబడకుండుటయు శిరోబాధయును నశించును.

మూ॥ జలద్విఁకంసేఽష్టపలం పలాశాత్పక్త్వా రసోఽర్ధాఢక మాత్రశేషః। కల్కైర్వచామాగధికాపలాభ్యాం యుక్తః శతాహ్వాద్విపలేన చాపి॥ ససైన్ధవః క్షౌద్రయుతః సతైలో దేయో నిరూహోదలవర్ణకారీ । ఆనాహపార్శ్వామయయోనిదోషాన్ గుల్మానుదావర్తరుజంచ హన్యాత్ ॥46॥

అ॥ ఎనిమిదిపలముల మోదుగపట్టను రెండు ఆఢకముల నీటియందు అర్ధాఢకము మిగులునట్లుకాచి ఆకషాయమునందు ఒకపలము ముత్తవపులగము, ఒక పలము పిప్పళ్ళు, రెండుపలముల సదాప వీనియొక్క కల్కమును సైంధవలవణమును తేనెను తైలమును చేర్చి వస్తిని చేయింపవలయును. ఈనిరూహవస్తిబలమును వర్ణమునుకలిగించును. ఆనాహము, పార్శ్వవ్యాధులు, యోనిదోషములు, గుల్మము, ఉదావర్తము వీనిని నశింపచేయును.

మూ॥ యష్ట్యాహ్వమూలాష్టపలేన సిద్ధం పయః శతాహ్వాఫలపిప్పలీభిః। యుక్తం ససర్పిర్మధు వాతరక్తవైస్వర్యవీసర్పహితో నిరూహః ॥47॥

అ॥ ఎనిమిదిపలముల అతిమధురపు వేళ్ళతో తయారుచేయబడిన పాలయందు సదాప మంగకాయలు పిప్పళ్ళు వీనిని, ఘృతమును, తేనెను చేర్చి వస్తినిచ్చినచో వాతరక్తము, స్వరభంగము, విసర్పము ఇవి నశించును.

మూ॥ యష్ట్యాహ్వలోధ్రాభయచన్దనైశ్చశృతంపయోఽగ్ర్యోత్పలమలోత్పలైశ్చ। సశర్కరం క్షౌద్రయుతం సుశీతం పిత్తామయాన్ హన్తిసజీవనీయమ్ ॥48॥

అ॥ అతిమధురము లొద్దుగ కరక్కాయ చందనము కమలములు నల్లకలువ వీనితో కాచబడిన పాలయందు పంచదారను తేనెను జీవనీయగణద్రవ్యములను కలిపి దానితో వస్తిని ఇచ్చినయెడల పిత్తవ్యాధులు నశించును.

మూ॥ ద్వికార్షికాశ్చన్దనపద్మకర్ధియష్ట్యాహ్వరాస్నా వృషసారివాశ్చ।సలోధ్రమఞ్జిష్ఠమథాప్యనన్తాబలాస్థిరాద్యం తృణపఞ్చమూలమ్॥ నిఃక్వాథ్య తోయేన రసేన తేన శృతంపయోఽర్ధాఢకమమ్బుహీనమ్। జీవన్తిమేదర్ధిశతావరీభిర్వీరాద్వికాకోలికశేరుకాభిః॥ సితోపలాజీవకపద్మరేణుప్రపౌణ్డరీకైః కమలోత్పలైశ్చ। లోధ్రాత్మగుప్తామధుకైర్విదారీమఞ్జాతకైః కేశరచన్దనైశ్చ॥ పిష్టైర్ఘృతక్షౌద్రయుతైర్నిరూహం ససైన్ధవం శీతలమేవ దద్యాత్। ప్రత్యాగతే ధన్వరసేన శాలీన్ క్షీరేణ వాఽద్యాత్పరిషిక్తగాత్రః॥ దాహాతిసారాప్రదరాస్రపిత్తహృత్పాణ్డురోగాన్విషమజ్వరం చ। సగుల్మమూత్రగ్రహకామలాదీన్సర్వామయాన్పిత్తకృతాన్నిహన్తి॥53॥

అ॥ చందనము పద్మకము బుద్ధి అతిమధురము సన్నరాస్నము అడ్డసరము సుగంధిపాలలొద్దుగ మంజిష్టి నల్లసుగంధిపాల ముత్తవపులగము హ్రస్వపంచమూలము తృణపంచమూలము వీనిని రెండేసికర్షముల చొప్పున గ్రహించి జలమునందు కాచి యారసముతో రెండుప్రస్థములపాలను నీరుఇగురువరకు కాచి యందు పాలకూర మేద బుద్ధి పిల్లిపీచర కోలపొన్న కాకోళి క్షీరకాకోళి తుంగగడ్డలు పటికిబెల్లము జీవకము పద్మకేసరములు ముయ్యాకుపొన్న కమలము నల్లకలువ లొద్దుగ దూలగొండి అతిమధురము నేలగుమ్మడి ముంజగడ్డి నాగకేసరములు చందనము వీనియొక్క కల్కమును, ఘృతమును, తేనెను సైంధవలవణమును కలిపి చల్లగనున్న దానితో నిరూహవస్తిని చేయింపవలయును. బయులు వెడలినపిదప స్నానముచేయించి జాంగల మాంసరసముతో గాని పాలతో గాని శాల్యన్నము నీయవలయును. ఇట్లుచేసినచో తాపము అతిసారము ప్రదరము రక్తపిత్తము హృద్రోగము పాండురోగము విషమ జ్వరము వీనిని, గుల్మము మూత్రబంధము కామెర్లు మొదలగు సమస్తములైన పిత్త వ్యాధులను నశింపజేయును.

మూ॥ ద్రాక్షాదికాశ్మర్యమధూకసేవ్యైః ససారివాచన్దనశీతపాక్యైః। పయః శృతం శ్రావణిముద్గపర్ణీతుగాత్మగుప్తామధుయష్టికల్కైః॥ గోధూమచూర్ణైశ్చ తథాఽక్షమాత్రైః నక్షౌద్రసర్పిర్మధుయష్టితైలైః। పథ్యావిదారీక్షురసైర్గుడేన వస్తిం యుతం పిత్తహరం విదధ్యాత్॥ హృన్నాభిపార్శ్వోదరదేహదాహే రాహేఽన్తరస్థే చ స

మూత్రకృచ్ఛ్రే । క్షీణక్షతే రేతసి చాపి నష్టే పైత్తేఽతిసారే చ నృణాం ప్రశస్తః ॥56॥

అ॥ ద్రాక్షాదిగణద్రవ్యములు పెద్దమ్మ్రాడు ఇప్ప వట్టివేళ్ళు సుగంధిపాల చందనము కాకోళి వీనితో పాలను కాచి యందు బోడతరము అడవిపెసర తవాక్షీరి దూలగొండివిత్తులు అతిమధురము వీనియొక్క కల్కములను, గోధుమచూర్ణమును ఒక్కొక్క కర్షముచొప్పున కలిపి యందు తేనెను, ఘృతమును, అతిమధురముతో తయారుకాబడిన తైలమును, కరకాయ నేలగుమ్మ్రాడు చెరకు వీనియొక్క రసములను, బెల్లమును కలిపి వస్తినిచ్చినచో పైత్యవ్యాధులు నశించును. మరియు హృదయము నాభి పార్శ్వములు ఉదరము శరీరము వీనియందలి తాపమును, అంతస్తాపమును, మూత్రకృచ్ఛ్రమును, క్షతక్షీణమును, నష్టశుక్రమును, పిత్తాతిసారమును నశించును.

మూ॥ కోశాతకారగ్వధదేవదారుమూర్వాశ్వదంష్ట్రాకుటజార్కపాఠాః । పక్త్వా కులుత్థాన్బృహతీం చ తోయే రసస్య తస్య ప్రసృతా దశ స్యుః ॥ తాన్ సర్షపైలామదనైః సకుష్ఠైరక్షప్రమాణైః ప్రవృతైశ్చ యుక్తాన్ । ఫలాహ్వతైలస్య సమాక్షికస్య క్షారస్య తైలస్య చ సార్షపస్య ॥ దద్యాన్నిరూహం కఫరోగిణే జ్ఞో మన్దాగ్నయే చాప్యశనద్విషే చ। పటోలపథ్యామరదారుభిర్వా సపిప్పలీకైః క్వథితైర్జలాఖ్యైః ॥59॥

అ॥ చేదుబీర రేల దేవదారు చాగ పల్లేరు కొడిసెపాల జిల్లేడు చిరుబొద్ది ఉలవలు వాకుడు వీనిని గ్రహించి నీటియందు కాచి ఇరువదిపలముల పరిమితికల యారసమునందు ఆవాలు ఏలకులు మంగకాయ చెంగల్వకోష్టు వీనియొక్క కల్కములను ఒక్కొక్క కర్షమునను, మంగగింజలతైలము తేనె యవక్షారము ఆవనూనె వీనిని రెండేసిపలములుగను కలిపి కఫరోగముకలవానికిని అగ్నిమాంద్యముకలవానికిని అన్నద్వేషము కలవానికిని నిరూహవస్తిని చేయింపవలయును. లేక చేదుపొట్ల కరకాయ దేవదారు పిప్పళ్ళు వీనియొక్క కషాయమునందు పైనచెప్పబడిన కల్కాదులను చేర్చి నిరూహవస్తిని చేయింపవలయును.

మూ॥ ద్విపఞ్చమూలే త్రిఫలాం సబిల్వాం ఫలాని గోమూత్రయుతః కషాయః । కలిఙ్గపాఠాఫలముస్తకల్కః ససైన్ధవః క్షారయుతః సతైలః॥ నిరూహముఖ్యః కఫజాన్వికారాన్సపాణ్డురోగాలసకామదోషాన్ । హన్యాత్తథా మారుతమూత్రసఙ్గం వస్తేస్తథాఽఽటోపమథాతిఘోరమ్ ॥61॥

అ॥ మహాపంచమూలములు హ్రస్వపంచమూలములు త్రిఫలములు మారేడు మంగకాయను వీనిని గోమూత్రమునందు కషాయము కాచి అందు కొడిసెపాలవి

త్తులు చిరుబొద్ది మ్రంగకాయలు తుంగముస్తలు వీనియొక్క కల్కమును, సైంధవ లవణమును, యవక్షారమును, తైలమును కలిపి నిరూహవస్తిని చేయింపవలయును. కఫవ్యాధులు పాండురోగము అలసకము ఆమదోషము అపానవాత బంధము మూత్ర బంధము వస్తిప్రదేశమునందలి ఘోరమైన ఆటోపము వీనిని నశింపచేయును.

మూ॥ రాస్నామృతైరణ్డవిడఙ్గదారుసప్తచ్ఛదోశీరసురాహ్వనిబైః । శ్యామాకభూనిమ్బపటోరపాఠాతిక్తాఖుపర్ణీదశమూలముస్తైః॥ త్రాయన్తికాశిగ్రుఫలత్రికైశ్చ క్వాథః సపిణ్డీతకతోయమూత్రః । యష్ట్యాహ్వతృష్ణాఫలినీశతాహ్వారసాఞ్జనశ్వేతవచావిడఙ్గైః । కలిఙ్గపాఠామ్బుదసైన్ధవైశ్చ కల్కైః ససర్పిర్మధుతైలమిశ్రైః । అయంనిరూహః క్రిమికుష్ఠమేహబ్రధ్నోదరాజీర్ణకఫాతురేభ్యః ॥ రూక్షౌషధైరత్యపతర్పితేభ్యః ఏతేషు రోగేష్వపి సత్సు దత్తః । నిహత్య వాతం జ్వలనం ప్రదీప్య విజిత్య రోగాంశ్చ బలం కరోతి ॥65॥

అ॥ సన్నరాస్నము తిప్పతీగె ఆముదపువేళ్లు వాయువిడంగములు మ్రానిపసుపు ఏడాకులఅరటి వట్టివేళ్ళు దేవదారు వేప . రేల నేలవేము చేదుపొట్ల చిరుబొద్దిఃటుక రోహిణి ఎలుకచెవికూర దశమూలములు తుంగముస్తలు కలుగ్రానుగ మునగ త్రిఫలములు వీనియొక్క కషాయమునందు మ్రంగకాయల కషాయమును గోమూత్రమును కలిపి అతిమధురము పిప్పళ్ళు ప్రేంఖణము సదాప రసాంజనము తెల్లవస వాయువిడంగములు కొడిసెపాలవిత్తులు చిరుబొద్ది తుంగముస్తలు సైంధవలవణము వీనియొక్క కల్కములను, ఘృతమును, తైలమును చేర్చి వస్తినిచేయింపవలయును. ఈనిరూహవస్తి వలన కృమివ్యాధులు కుష్ఠము మేహవ్యాధులు బ్రధ్నవ్యాధి ఉదరవ్యాధి అజీర్ణము కఫవ్యాధులు ఇవి నశించును. రూక్షౌషధసేవనచే కృశించినవారలకుకూడ ఈవ్యాధులయందు ఇచ్చినచో వాతమును హరింపచేసి జాఠరదీప్తిని కలిగించి రోగములను నశింపచేసి బలమును కలించును.

మూ॥ పునర్నవైరణ్డవృషాశ్మభేదవృశ్చీరభూతీకబలాపలాశాః । ద్విపఞ్చమూలాని పలాంశితాని క్షుణ్ణాని ధౌతానిపలానిచాష్టౌ॥ బిల్వంయవాన్కోలకులుత్థధాన్యఫలాని చైకప్రసృతోన్మితాని । పయోజలాఢాఢంయోః శృతం తత్క్షీరావశేషం కృతవస్త్రపూతమ్॥ వచాశతాహ్వామరదారుకుష్ఠయష్ట్యాహ్వసిద్ధార్థకపిప్పలీనామ్ । కల్కైర్యవాన్యామదనైశ్చ యుక్తం నాత్యుష్ణశీతం గుడసైన్ధవాక్తమ్ ॥ క్షౌద్రస్య తైలస్య చ సర్పిషశ్చ తథైవ యుక్తం ప్రసృతత్రయేణ । దద్యాన్నిరూహం విధినా విధిజ్ఞః స సర్వసంసర్గకృతామయఘ్నః ॥66॥

అ॥ గలిజేరు ఆముదపువేళ్ళు అడ్డసరము కొండపిండి తెల్లగలిజేరు ఓమము ముత్తవపులగము మోదుగ మహాపంచమూలములు హ్రస్వపంచమూలములు వీనిని ఒక్కొక్క పలముగను, మాోరేడును ఎనిమిదిపలములుగను, యవలు రేగు ఉలవలు ధనియాలు మ్రంగకాయలు వీనిని రెండేసి పలములుగను గ్రహించి రెండు ప్రస్థముల నీటితోకూడిన రెండుప్రస్థముల పాలయందు వేసి పాలు మిగులునట్లు కాచి వస్త్రముతో ఒడియగట్టి యందు వస సదాప దేవదారు చెంగల్వకోష్టు అతిమధురము తెల్లావాలు పిప్పళ్లు కరాసానివాము మ్రంగకాయలు వీనియొక్క కల్కమును, బెల్లమును, సైంధవలవణమును. రెండుపలముల తేనెను, రెండుపలముల తైలమును, రెండు పలముల ఘృతమునుచేర్చి మిక్కిలి చల్లగగాని మిక్కిలి వెచ్చగగాని లేని దీనిచే సంసర్గ జనితములైన సమస్త వ్యాధులయందును విధిప్రకారముగ నిరూహవస్తిని చేయింపవలయును.

మూ॥ స్నిగ్ధోష్ణ ఏకః పవనే నిరూహో ద్వౌ స్వాదుశీతౌ పయసా చ పిత్తే। త్రయః సమూత్రాః కటుకోష్ణతీక్ష్ణాః కఫే నిరూహా న పరం విధేయాః ॥70॥

అ॥ వాతమునందు స్నిగ్ధగుణమును ఉష్ణవీర్యమును కల ద్రవ్యములతో కూడిన ఒక నిరూహవస్తిని చేయింపవలయును. పిత్తమునందు మధురరసమును శీతవీర్యమును కల ద్రవ్యములతోడను పాలతోడను కూడిన రెండు నిరూహవస్తులను చేయింపవలయును. కఫమునందు కటురసమును ఉష్ణవీర్యమును తీక్ష్ణగుణమును కల ద్రవ్యములతోడను గోమూత్రముతోడను కూడిన మూడు నిరూహవస్తులను చేయింపవలయును. ఇంతకంటె అధికముగ చేయింపకూడదు.

మూ॥ రసేన వాతే ప్రతిభోజనం స్యాత్క్షీరేణ పిత్తే తు కఫే చ యూషైః। తథాఽనువాస్యేషు చ బిల్వతైలం స్యాజ్జీవనీయం ఫలసాధితం చ ॥71॥

అ॥ నిరూహవస్తిని చేయించినపిదప వాతమునందు మాంసరసముతోడను, పిత్తమునందు పాలతోడను, కఫమునందు యూషములతోడను ఆహారము నీయవలయును. నిరూహవస్తిని చేయించినపిదప అనువాసనవస్తిని చేయింపవలసియున్నయెడల వాతమునందు బిల్వతైలమును, పిత్తమునందు జీవనీయతైలమును, కఫమునందు మదనఫల తైలమును అనువాసనవస్తినిమిత్త ముపయోగింపవలయును. (ఈ తైలములు రాబోవు అధ్యాయమునందు చెప్పబడగలవు.)

అధ్యాయ సంగ్రహము.

మూ॥ ఇతీదముక్తం నిఖిలం యథావద్వస్తిప్రదానస్య విధానమగ్ర్యమ్। యోఽధీత్య విద్వా నిహ వస్తికర్మ కరోతి లోకే లభతే ససిద్ధిమ్ ॥72॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే సిద్ధిస్థానే పఞ్చకర్మీయసిద్ధిర్నామ తృతీయోఽధ్యాయః ॥

అ॥ ఈ అధ్యాయమునందు వస్తిప్రయోగముయొక్క శ్రేష్ఠమైన విధానము తగురీతిని సంపూర్ణముగ చెప్పబడినది. దీనిని బాగుగ తెలిసికొని వస్తికర్మను చేయించినచో ఉత్తమమైన కార్యసిద్ధిని పొందును.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు పంచకర్మీయసిద్ధి యనెడు తృతీయాధ్యాయము సమాప్తము.

—0—

# చతుర్థాధ్యాయము.

మూ॥ అథాతః స్నేహవ్యాపదికీం సిద్ధిం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట స్నేహవ్యాపదికీసిద్ధిని చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ స్నేహవస్తీన్ ప్రవక్ష్యామి వాతపిత్తకఫాపహాన్ । మిథ్యాప్రణిహితానాం చ వ్యాపదః సచికిత్సితాః ॥3॥

అ॥ వాతము పిత్తము కఫము వీనిని నశింపచేయు అనువాసనవస్తులను, సరిగ ప్రయోగింపబడని ఆవస్తులవలన కలుగు ఆపత్తులను, ఆ ఆపత్తులయొక్క చికిత్సలను చెప్పుచున్నాము.

## బిల్వాతైలము.

మూ॥ దశమూలం బలాం రాస్నామశ్వగన్ధాం పునర్నవామ్ । గుడూచ్యేరణ్డ భూతీక భార్గీవృషక రోహిషాన్ ॥ శతావరీం సహాచరం కాకనాసాం పలాంశికాన్ । యవమాషాతసీకోల కులుత్థాన్ ప్రసృతోన్మితాన్ ॥ చతుర్ద్రోణేఽమ్భసః పక్త్వా ద్రోణశేషేణ తేన చ । తైలాఢకం సమక్షీరం జీవనీయైః పలోన్మితైః ॥ అనువాసనమేతద్ధి సర్వవాత వికారనుత్ ॥6॥

అ॥ దశమూలములు ముత్తవపులగము పెన్నేరు గలిజేరు తిప్పతీగ ఆముదపు వేళ్ళు కామంచిపూరి గంటుభారంగి అడ్డసరము గోడుగుగడ్డి పిల్లిపీచర గోరింట కాకిదొండ వీనిని ఒక్కొక్క పలముగను, యవలు మినుములు అవిసెవిత్తులు రేగుపండ్లు ఉలవలు వీనిని రెండేసి పలములుగను గ్రహించి నాలుగు ద్రోణముల నీటియందు ఒక

ద్రోణము మిగులునటుల కాచి యందు ఒక ఆఢకము తైలమును, ఒకఆఢకము పాలను, ఒక్కొక్క పలము పరిమితిగల జీవనీయగణ ద్రవ్యములయొక్క కల్కమును చేర్చి తైలమును తయారుచేయవలయును. ఈ తైలముతో అనువాసనవస్తిని చేయించిన యెడల సమస్త వాతవ్యాధులు నశించును.

మూ॥ అనూపానాం వసా తద్వజ్జీవనీయోపసాధితా। శతాహ్వా యవబిల్వామ్లైః సిద్ధం తైలం సమీరణే॥ సైన్ధవేనాగ్నివర్ణేన తప్తం చానిల ముద్ధృతమ్ ॥8॥

అ॥ అనూపదేశమునందలి జంతువులయొక్క వసను జీవనీయగణద్రవ్యములతో తయారుచేసి దానినిగాని సదాప యవలు మారేడు కాంజికము మొదలగు అమ్లద్రవ్యములు వీనితో తయారుచేయుబడిన తైలమునుగాని అగ్నివలె ఎర్రగనున్న సైంధవ లవణముతో కాచబడిన ఘృతమునుగాని అనువాసనవస్తి నిమిత్త ముపయోగించినచో వాతవ్యాధులు నశించును.

## జీవనీయ తైలము.

మూ॥ జీవన్తీం మదనం మేదాం శ్రావణీం మధుకం బలామ్। శతాహ్వర్షభకౌ కృష్ణాం కాకనాసాం శతావరీమ్॥ స్వగుప్తాం క్షీరకాకోలీం కర్కటాఖ్యాం శటీం వచామ్। పిష్ట్వా తైలం ఘృతం క్షీరే సాధయేత్తచ్చతుర్గుణే॥ బృంహణం వాతపిత్తఘ్నం బలశుక్రాగ్నివర్ధనమ్। మూత్రరేతో రజోదోషాన్ హరేత్తదనువాసనాత్ ॥11॥

అ॥ పాలకూర ్రమంగకాయలు మేద బోడతరము అతిమధురము మాత్తవపులగము సదాప ఋషభకము పిప్పళ్ళు కాకిదొండ పిల్లిపీచర దూలగొండి క్షీరకాకోళి కర్కాటశృంగి కచ్చూరాలు వీనియొక్క కల్కమును గ్రహింపవలయును. తైలము ఘృతము వీనిని నాలుగురెట్ల పాలయందు ఆ కల్కముతో తయారుచేయవలయును. దీనితో చేయుబడిన అనువాసనవస్తివలన శరీరపుష్టియు బలమును శుక్రమును జాఠరాగ్నియు వృద్ధినొందును. వాతము పిత్తము మూత్రదోషములు శుక్రదోషములు ఆర్తవదోషములు ఇవి నశించును.

మూ॥ లాభతశ్చన్దనాద్యైశ్చ పిష్టైః క్షీరచతుర్గుణమ్। తైలపాదం ఘృతం సిద్ధం పిత్తఘ్నమనువాసనమ్ ॥12॥

అ॥ జ్వరచికిత్సయందు చందనాదితైలమునకు చెప్పబడిన ద్రవ్యములను లభించునట్లుగ గ్రహించి కల్కముగ చేయవలయును. ఘృతమునకు నాలుగురెట్ల పాలను, నాల్గవవంతు తైలమును, ఆకల్కమును కలిపి తయారుచేసి యాఘృతముతో అనువాసనవస్తిని చేయించినచో పిత్తము నశించును.

మూ॥ సైన్ధవం మదనం కుష్ఠం శతాహ్వాం నిచులం బలామ్।

హ్రీబేరం మధుకం భార్గీం దేవదారు సకట్ఫలమ్॥ నాగరం పుష్కరం మేదాం చవికాం చిత్రకం శటీమ్। విడఙ్గాతివిషే శ్యామా హరేణుం నీలినీం స్థిరామ్॥ బిల్వాజమోదే కృష్ణాం చ దన్తీం రాస్నాం చ పేషయేత్। సాధ్యమేరణ్డజం తైలం తైలం వా కఫరోగనుత్॥ బ్రధ్నోదావర్త గుల్మార్శః ప్లీహమేహాఢ్య మారుతాన్। ఆనాహమశ్మరీం చైవ హన్యాత్తదనువాసనాత్ ॥16॥

అ॥ సైంధవలవణము మ్రంగకాయలు చెంగల్వకోష్టు సదాప ప్రబ్బలి ముత్తవపులగము కురువేరు అతిమధురము గంటుభారంగి దేవగారు పెద్దమ్ముడు శుంఠి మెట్టతామర మేద చవ్యము చిత్రమూలము కచ్చూరాలు వాయువిడంగములు అతివస నల్లతెగడ రేణుకలు నీలి ముయ్యాకుపొన్న మారేడు అజామోదము పిప్పళ్ళు దంతి సన్నరాస్నము వీనియొక్క కల్కముతో ఆముదమునుగాని తైలమునుగాని తయారు చేసి అనువాసనవస్తిని చేయించినయెడల కఫవ్యాధులు బ్రధ్నము ఉదావర్తము గుల్మము అర్శస్సు ప్లీహవ్యాధి ప్రమేహములు వాతరక్తము ఆనాహము అశ్మరి ఇవి నశించును.

## మదనఫల తైలము.

మూ॥ మదనైర్వాఽమ్లసంయుక్తైర్బిల్వాద్యేన గణేన వా। తైలం కఫహరైర్వాపి కఫఘ్నం కల్పయేద్భిషక్ ॥17॥

అ॥ మ్రంగకాయలయొక్క కల్కము తోడను కాంజికము మొదలగు ఆమ్లద్రవ్యములతోడను తైలమును తయారుచేయవలయును. లేక దశమూలముల యొక్క కషాయము కల్కము వీనితోగాని కఫనాశకములగు ద్రవ్యములయొక్క కషాయము కల్కము వీనితోగాని తయారుచేయవలయును. ఈ తైలములతో అనువాసనవస్తులను చేయించినయెడల కఫవ్యాధులు నశించును.

మూ॥ విడఙ్గైరణ్డరజనీపటోల త్రిఫలామృతాః। జాతిప్రవాల నిర్గుణ్డీదశమూలాఖుపర్ణికాః॥ నిమ్బపాఠా సహచరశమ్పాక కరవీరకమ్। ఏషాంక్వాథేన విపచేత్తైలమేభిశ్చ కల్కితైః॥ ఫలబిల్వత్రివృత్కృష్ణా రాస్నాభూనిమ్బదారుభిః। సప్తపర్ణవచోశీరదార్వీ కుష్ఠకలిఙ్గకైః॥ లతాయష్టిశతాహ్వాగ్నిశటీచోరకపౌష్కరైః। తత్పానాని క్రిమీన్ మేహానర్శాంసి గ్రహణీగదమ్॥ క్లీబత్వం విషమాగ్నిత్వం మలం దోషత్రయం తథా। ప్రయుక్తం ప్రణుదత్యాశు పానాభ్యఙ్గానువాసనైః ॥22॥

అ॥ వాయువిడంగములు ఆముదపువేళ్ళు పసుపు చేదుపొట్ల త్రిఫలములు తిప్పతీగ జాజిచిగుళ్ళు వావిలి దశమూలములు ఎలుకచెవికూర వేప చిరుబొద్ది గోరింట

శేలగన్నేరు వీనియొక్క కషాయమునందు తైలమును కలిపి యందు మ్రంగకాయలుమారేడు తెగడ పిప్పళ్లు సన్నరాస్నము నేలవేము దేవదారు ఏడాకుల అంటి వస వట్టివేళ్ళు మ్రానుపసుపు చెంగల్వకోష్టు కొడిసెపాలవిత్తులు మంజిష్ఠి అతిమధురము సదాప చిత్రమూలము కచూరాలు గంధకచోరము మెట్టతామర వీనియొక్క కల్కమును చేర్చి తయారుచేయవలయును. ఆతైలముతో పానమును అభ్యంగనమును అనువాసనవస్తిని చేయించినయెడల కుష్ఠములు క్రిమివ్యాధులు ప్రమేహములు అర్శస్సు గ్రహణీవ్యాధి నపుంసకత్వము అగ్నివైషమ్యము మలము మూడుదోషములు వీనిని నశింపచేయును.

## అనువాసనవస్తిగుణము.

మూ॥ వ్యాధివ్యాయామకర్మాధ్వక్షీణాబలనిరౌజసామ్। క్షీణశుక్రస్య చాతీవ స్నేహవస్తిర్బలప్రదః॥ పాదజఙ్ఘోరుపృష్ఠాంసకటీనాం స్థిరతాం పరామ్। జనయేదప్రజానాం చ ప్రజాం స్త్రీణాం తథా నృణామ్ ॥24॥

అ॥ వ్యాధులు వ్యాయామము పనులనుచేయుట మార్గముననడచుట వీనివలన క్షీణించినవారలకును బలములేనివారలకు ఓజస్సు లేనివారలకు శుక్రముక్షీణించిన వారలకు అనువాసవస్తి అధికమైనబలమును కలిగించును. మరియు పాదములు పిక్కలు తొడలు నడుము భుజములు కటిప్రదేశము వీనికి దృఢత్వమును కలిగించును. సంతానములేని స్త్రీలకు పురుషులకును సంతానము కలిగించును.

## సరిగ ప్రయోగింపబడని అనువాసనవస్తియొక్క ఆపత్తులు.

మూ॥ వాతపిత్తకఫాత్యన్నపురీషైరావృతస్య చ। అభుక్తే చ ప్రణీతస్య స్నేహవస్తేః షడాపదః ॥25॥

అ॥ వాతము పిత్తము కఫము అధికభోజనము పురీషము వీనిచే స్నేహవస్తి ఆవరింపబడుట ఆహారమునీయకుండగనే ప్రయోగించుటచే ఊర్ధ్వముఖమునకు వెడలుట ఈ ఆరు ఆపత్తులును కలుగును.

## అనువాసవస్తివ్యాపత్తులకు కారణములు.

మూ॥ శీతోఽల్పో వాఽధికే వాతే పిత్తేఽత్యుష్ణః కఫే మృదుః। అతిభుక్తే గురుర్వర్చః సంచయేఽల్పబలస్తథా॥ దత్తస్తైరావృతః స్నేహో న యాత్యభిభవాదధః। అభుక్తేనావృతత్వాచ్చ యాత్యూర్ధ్వంతస్య లక్షణమ్ ॥27॥

అ॥ వాతమధికముగనున్నప్పుడు శీతవీర్యమునుకలిగినట్టికాని అల్పమైనట్టికాని స్నేహమును, పిత్తమధికముగ నున్నప్పుడు మిక్కిలిఉష్ణవీర్యముకల స్నేహమును, కఫమధికముగనున్నప్పుడు మృదుగుణముకల స్నేహమును, అధికముగ ఆహారమును

భుజించినప్పుడు గురుగుణముకల స్నేహమును, మలమధికముగనున్నప్పుడు అల్పబలముకల స్నేహమును ప్రయోగించినచో వానిచే ఆవరింపబడినదై బయటికి రాజాలదు. ఆహారమును భుజింపనప్పుడు ప్రయోగించినచో అడ్డులేనిదగుటవలన ఊర్ధ్వముఖమున పోవును. వానియొక్క లక్షణములను చెప్పెదను.

స్నేహమువాతముచే ఆవరింపబడినప్పుడుకలుగులక్షణములు—చికిత్స.

మూ॥ స్తమ్భోరుసదనాధ్మానజ్వరశూలాఙ్గమర్దనైః। పార్శ్వరుగ్వేష్టనైర్విద్యాత్స్నేహం వాతావృతం భిషక్ ॥ స్నిగ్ధామ్లలవణోష్ణైస్తం రాస్నాపీతద్రుతిల్వకైః। సౌవీరకసురాకోలకులత్థయవసాధితైః॥ నిరూహైర్నిర్హరేత్సమ్యక్ సమూత్రైః పాఞ్చమూలికైః। తాభ్యామేవ చ తైలాభ్యాం సాయం భుక్తేఽనువాసయేత్ ॥౩-॥

అ॥ అనువాసనవస్తిచే ప్రయోగింపబడిన స్నేహమువాతముచే ఆవరింపబడినప్పుడు శరీరము బిగియుట తొడలుకృశించుట కడుపుబ్బరము జ్వరము శూల ఒడలునొప్పులు పార్శ్వములయందుబాధ మెలివేసినట్లుబాధ ఈలక్షణములు కలుగును. అట్టి ఆపత్తు కలిగినప్పుడు పన్నరాస్నము సరళదేవదారు లొద్దుగ వీనియొక్క కల్కముతోడను సౌవీరకమద్యము సురామద్యము రేగుపండ్లరసము ఉలవలకషాయము యవలకషాయము వీనితోడను తయారుచేయబడినట్టియు స్నిగ్ధముగను అమ్లలవణరసముతో కూడినవిగను ఉష్ణముగను నుండినట్టియు నిరూహవస్తులను, పంచమూలములు గోమూత్రము వీనితో తయారుచేయబడిన నిరూహవస్తులను చేయించి స్నేహమును బాగుగ బయలు వెడలింపవలయును. మరియు సాయంకాలమునందు భుజించినపిమ్మట పన్నరాస్నము మొదలగుద్రవ్యములతోలసిద్ధము చేయబడిన తైలముచేతను పంచమూలములతో సిద్ధముచేయబడిన తైలముచేతను అనువాసనవస్తిని చేయింపవలయును.

పిత్తముచేఆవరింపబడినప్పుడుకలుగులక్షణములు—చికిత్స.

మూ॥ దాహరాగతృషామోహతమకజ్వరదూషణైః। విద్యాత్పిత్తావృతం స్వాదుతిక్తైస్తం వస్తిభిర్హరేత్ ॥౩।॥

అ॥ స్నేహము పిత్తముచే ఆవరింపబడినప్పుడు తాపము ఎరుపువర్ణము దప్పిక మోహము చీకట్లుక్రమ్ముట జ్వరము ఈలక్షణములుకలుగును. అప్పుడు, మధురద్రవ్యములతోడను తిక్తద్రవ్యములతోడను సిద్ధముచేయబడిన నిరూహవస్తులచే స్నేహమును బయలువెడలింపచేయవలయును.

కఫముచేఆవరింపబడినప్పుడుకలుగులక్షణములు—చికిత్స.

మూ॥ తన్ద్రాశీతజ్వరాలస్యప్రసేకారుచిగౌరవైః। సంమూర్ఛాగ్లానిభిర్విద్యాచ్ఛ్లేష్మణా స్నేహమావృతమ్ ॥ కషాయకటుతీక్ష్ణోష్ణైః సురామూత్రోపసాధితైః। ఫలతైలయుతైః సామ్లైర్వస్తిభిస్తంవినిర్హరేత్ ॥

అ॥ స్నేహము కఫముచే ఆవరింపబడినప్పుడు బడలిక శీతజ్వరము మందముగ నుండుట నోటనీరూరుట అరుచి శరీరము బరువుగ నుండుట మూర్ఛనొందుట వాకుట ఈలక్షణములు కలుగును. అప్పుడు, కషాయరసము కటురసము తీక్ష్ణగుణము ఉష్ణవీర్యము కల పదార్థములతోడను సురామద్యము గోమూత్రము వీనితోడను మదనఫల తైలముతోడను కాంజికము మొదలగు అమ్లద్రవములతోడను కూడిన నిరూహవస్తులను చేయించి స్నేహమును బయలు వెడలింపవలయును.

అధికాహారముచేఅవరింపబడినప్పుడుకలుగులక్షణములు- చికిత్స.

మూ॥ ఛర్దిమూర్ఛారుచిగ్లానిజ్వరశూలాఙ్గమర్దనైః । ఆమలిఙ్గైః సదాహైస్తం విద్యాదత్యశనావృతమ్ ॥ కటూనాం లవణానాం చ క్వాథైశ్చూర్ణైశ్చ పాచనమ్ । విరేకో మృదురత్రామవిహితా చ క్రియా హితా ॥35॥

అ॥ స్నేహము భుజింపబడిన అధికాహారముచే ఆవరింపబడినపుడు వాంతి మూర్ఛనొందుట అరుచి వాడుట జ్వరము శూల ఒడలునొప్పులు ఆమమువలనకలుగు లక్షణములు తాపము ఈలక్షణములు కలుగును. అప్పుడు, కటురసమును లవణరసమును కల ద్రవ్యములయొక్క కషాయములను చూర్ణములను ఇచ్చి పాచనమును కలిగింపవలయును మృదువిరేచనమును జేయింపవలయును. మరియు ఆమదోషమునకు చెప్పబడిన చికిత్స చేయింపవలయును.

మలముచేఆవరింపబడినప్పుడుకలుగులక్షణములు—చికిత్స.

మూ॥ విణ్మూత్రానిలసఙ్గార్తిగురుత్వాధ్మానహృద్గ్రహైః । స్నేహం విడావృతం జ్ఞాత్వా స్నేహస్వేదైః సవర్తిభిః ॥ శ్యామాబిల్వాదిసిద్ధైశ్చ నిరూహైః సానువాసనైః । నిర్హరేద్విధినా సమ్యగుదావర్తహరేణ చ ॥37॥

అ॥ స్నేహము మలముచే ఆవరింపబడినప్పుడు మలమును మూత్రమును అపానవాతమును బంధించుట బాధ శరీరముబరువుగనుండుట కడుపుబ్బరము హృదయము బిగపట్టినట్లుండుట ఈలక్షణములు కలుగును. అప్పుడు, స్నేహస్వేదములను వర్తిప్రయోగములను నల్లతెగడ దశమూలములు వీనితో తయారుకాబడిన నిరూహవస్తులను అనువాసనవస్తులను ఉదావర్తమునకు చెప్పబడిన చికిత్సను చేయించి స్నేహమును బయలువెడలింపవలయును.

ఊర్ధ్వభాగమునుపొందినప్పుడుకలుగు లక్షణములు—చికిత్స.

మూ॥ అభుక్తే శూన్యపాయూ వా వేగాత్స్నేహోఽతిపీడితః ।

ధావత్యూర్ధ్వం తతః కణ్ఠాదూర్ధ్వేభ్యః ఖేభ్య ఏత్యపి॥ మూత్రశ్యామాత్రివృత్సిద్ధో యవకోలకులత్థవాన్ । తత్సిద్ధతైల ఇష్టోఽత్ర నిరూహః సానువాసనః॥ కణ్ఠాదాగచ్ఛతః స్తమ్భకణ్ఠగ్రహవిరేచనైః । ఛర్దిఘ్నీభిః క్రియాభిశ్చ తస్యకార్యం నివర్తనమ్ ॥40॥

అ॥ ఆహారమును భుజించినపుడుగాని గుదప్రదేశము శూన్యముగ నున్నప్పుడు గాని స్నేహమును ప్రయోగించినచో వేగమువలన పీడింపబడినదై ఊర్ధ్వమార్గమును పొంది కంఠమునుండియు ముక్కు మొదలగు ఊర్ధ్వరంధ్రములనుండియు బయటికివచ్చును. అప్పుడు, గోమూత్రము నల్లతెగడ తెగడ యవలు రేగుపండ్లు ఉలవలు వీనితో సిద్ధముచేయబడిన నిరూహవస్తిని ఈద్రవ్యములతో తయారు చేయబడిన తైలముచే అనువాసనవస్తిని చేయింపవలయును. స్నేహము కంఠము నుండి వెడలుచున్నప్పుడు శీతజలము మొదలగువానిని చల్లి స్తంభింపచేయుట కంఠమునుబిగపట్టుట విరేచనమును చేయించుట ఛర్దినాశకములగు చికిత్సలు వీనిని చేయింపవలయును.

మూ॥ యస్యనోపద్రవం కుర్యాత్స్నేహవస్తిరనిస్సృతః। సర్వోఽల్పో వాఽఽవృతో రౌక్ష్యాదుపేక్ష్యః స విజానతా ॥[illegible]॥

అ॥ ప్రయోగింపబడిన స్నేహవస్తి శరీరమునందలి రౌక్ష్యమువలన సంపూర్ణముగ గాని కొంతభాగముగాని బయలువెడలకున్నను ఆపత్తులను కలిగింపనియెడల చికిత్సింపక ఉపేక్షింపవలయును.

స్నేహము వెడలినపిదప ఆచరింపవలసిన విధానము.

మూ॥ ముక్తస్నేహం ద్రవోష్ణం చ లఘుపథ్యోపసేవనమ్। భుక్తవాన్ మాత్రయా భోజ్యమనువాస్యస్త్ర్యహాత్త్ర్యహాత్ ॥ ధాన్యనాగరసిద్ధం హి తోయం దద్యాద్విచక్షణః ॥ వ్యుషితాయ నిశాః కల్యముష్ణం వా కేవలం జలమ్ ॥43॥

అ॥ ప్రయోగింపబడిన స్నేహము బయలువెడలినపిదప, ద్రవముగను ఉష్ణద్రవ్యములతో కూడినదిగను లఘుగుణముగలదిగను హితకరముగను వ్యంజనములతో కూడినదిగను నున్న ఆహారమును తగుపరిమితిగ నీయవలయును. పిమ్మట మూడేసి రోజులకు అనువాసనవస్తిని చేయింపవలయును. రాత్రియందు ఏమియు నియ్యక ఉదయమునందు, ధనియాలు శుంఠి వీనితో కాచబడిన ఉదకమునుగాని కేవలము ఉష్ణోదకమునుగాని ఇయ్యవలయును.

ఉష్ణోదకమువలనకలుగు గుణములు.

మూ॥ స్నేహాజీర్ణం జరయతి శ్లేష్మాణం తద్భినత్తి చ । మారుతస్యానులోమ్యం చ కుర్యాదుష్ణోదకం నృణామ్ ॥ వమనే వా విరేకే

చ నిరూహే సానువాసనే । తస్మాదుష్ణోదకం సేవ్యం వాతశ్లేష్మప్రశాన్తయే ॥ 5॥

అ॥ ఉష్ణోదకము స్నేహప్రయోగమువలనకలిగిన అజీర్ణమును నశింపచేయును. శ్లేష్మమును ఛేదించును. వాతమునకు అనులోమ్యమును కలిగించును. కావున వమనకర్మను గాని విరేచనకర్మను గాని నిరూహవస్తిని గాని అనువాసనవస్తిని గాని చేయించినప్పుడు వాతమును శ్లేష్మమును నశించుటకై ఉష్ణోదకమును త్రాగవలయును.

మూ॥ రూక్షనిత్యస్తు దీప్తాగ్నిర్భృశం వ్యాయామకర్శితః । వర్జ్యణ్యోన్యుదావర్తవాతార్తాశ్చ దినే దినే ॥ ఏషాం చాను జరాం స్నేహో యాత్యమ్బు సికతాస్వివ । అతోఽన్యేషాం త్ర్యహాత్ప్రాయః స్నేహం పచతి పావకః ॥ 47॥

అ॥ రూక్షపదార్థములు నెల్లప్పుడు సేవించువాడు, అగ్నిదీప్తికలవాడు, అధికముగ వ్యాయామమును చేయువాడు, గజ్జలు పిరుదులు వీనియందలి వాతముచేతను ఉదావర్తమునొందిన వాతముచేతను పీడింపబడుచున్నవారు వీరలకు ప్రయోగింపబడిన స్నేహము ఇసుకయందు పోయబడిన ఉదకమువలె ఆ దినమునందే యింకిపోవును. ఇతరులకు ప్రయోగింపబడిన స్నేహమును జాఠరాగ్ని సామాన్యముగ మూడురోజులకు పచింపచేయును.

మూ॥ న త్వామం ప్రణయేత్స్నేహం స హ్యాభిష్యన్దయేద్గుదమ్ । సావశేషం చ కుర్వీత వాయుః శేషే హి తిష్ఠతి॥ న చైవ గుదకర్ణాభ్యాం దద్యాత్స్నేహమనన్తరమ్ । సజ్జతః స హ్యుభయతో వాతమగ్నిం చ దూషయేత్ ॥ 49॥

అ॥ పక్వముచేయబడని స్నేహముతో అనువాసనవస్తిని చేయింపకూడదు. అట్లు చేయించినయెడల గుదప్రదేశమునందు క్లేదమును కలిగించును. స్నేహమును నిశ్శేషముగ నీయక కొంత మిగుల్పవలయును. మిగిలినదానియందు వాతము ఉండును. స్నేహమును అనువాసనవస్తిరూపముగను పానరూపముగను ఒకేసారి ప్రయోగింపకూడదు. అట్లుచేసినయెడల రెండువిధములగు స్నేహములును కలియుటవలన వాతమును జాఠరాగ్నియు దూషింపబడును.

మూ॥ స్నేహవస్తిం నిరూహం వా నైకమేవాతిశీలయేత్ । ఉత్క్లేశాగ్నివధౌ స్నేహాన్నిరూహాత్పవనాద్భయమ్ ॥ తస్మాన్నిరూఢః స్నేహ్యః స్యాన్నిరూహ్యశ్చానువాసితః । స్నేహశోధనయుక్త్యైవం వస్తికర్మ త్రిదోషనుత్ ॥ 51॥

అ॥ అనువాసనవస్తిని గాని నిరూహవస్తిని గాని ఒకదానినే అధికముగ సేవింపకూడదు. అనువాసనవస్తిని అధికముగ సేవించినచో ఉత్క్లేశమును అగ్నిమాంద్య

మును కలుగును. నిరూహవస్తిని అధికముగ సేవించినచో వాతవ్యాధులు కలుగును. అందువలన నిరూహవస్తిని చేయించుకొనుచున్నవానికి అనువాసనవస్తిని, అనువాసనవస్తిని చేయించుకొనుచున్నవానికి నిరూహవస్తిని చేయించుచుండవలయును. ఇట్లు అనువాసనవస్తిని నిరూహవస్తిని యుక్తిగ చేయించినచో మూడుదోషములును నశించును.

## మాత్రావస్తి ప్రయోగము.

మూ॥ కర్మవ్యాయామభారాధ్వయానస్త్రీకర్శితేషు చ। దుర్బలే వాతభగ్నే చ మాత్రావస్తిః సదా మతః॥ హ్రస్వాయాః స్నేహమాత్రాయా మాత్రావస్తిః సమో భవేత్। యథేష్టాహారచేష్టస్య సర్వకాలం నిరత్యయః॥ బల్యం సుఖోపచర్యం చ సుఖం సృష్టపురీషకృత్। స్నేహమాత్రావిధానం హి బృంహణం వాతరోగనుత్॥55॥

అ॥ శ్రమనుకలిగించుపనులు, వ్యాయామము, బరువును మోయుట, మార్గమున నడచుట, మద్యపానము, స్త్రీసంగమము వీనిని అధికముగ సేవించుటచే కృశించినవారలకును, దుర్బలులకును, వాతముచే పీడింపబడుచున్నవారలకును ఎల్లప్పుడును మాత్రావస్తిని చేయింపవలయును. స్నేహమును తక్కువపరిమితిగ నుపయోగించుట మాత్రావస్తి యనబడును. ఇష్టములైన ఆహారవిహారములను సేవించుచు ఈమాత్రావస్తిని ఎల్లప్పుడును ఉపయోగించినను ఉపద్రవములు కలుగ నేరవు. ఈమాత్రావస్తి సుఖముగ ఉపచరింపతగినదిగ నుండును. బలము సుఖము సుఖవిరేచనము శరీరపుష్టి వీనిని కలిగించును. వాతరోగములను నశింపచేయును.

## అధ్యాయసంగ్రహము.

మూ॥ వాతాదీనాం శమాయోక్తాః ప్రవరాః స్నేహవస్తయః। తేషాం చాజ్ఞప్రయుక్తానాం వ్యాపదః సచికిత్సితాః॥ ప్రాగ్భోజ్యం స్నేహవస్తేర్యద్ధ్రువం యేఽహ్న్యాస్త్ర్యహాచ్చ యే। స్నేహవస్తివిధిశ్చోక్తో మాత్రావస్తివిధిస్తథా॥56॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే సిద్ధిస్థానే స్నేహవ్యాపదికీసిద్ధిర్నామ చతుర్థోఽధ్యాయః॥

అ॥ ఇందు-వాతము మొదలగునవి శమించుటకు శ్రేష్ఠములైన అనువాసనవస్తులును, అట్టిఅనువాసనవస్తులను సరిగ ప్రయోగింపకున్నచో కలుగువ్యాపత్తులును, అట్టివ్యాపత్తులకు చేయతగిన చికిత్సలును, స్నేహవస్తికిపూర్వమునందు భుజింపవలసియుండుటకు కారణమును, ప్రతిదినమున అనువాసనవస్తిని చేయింపతగినవారును, మూడేసి దినములకు చేయింపతగినవారును, అనువాసనవస్తివిధానమును, మాత్రావస్తివిధానమును చెప్పబడినవి.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితావ్యాఖ్యానమునందు స్నేహవ్యాపదికీసిద్ధి యనెడు చతుర్థాధ్యాయము సమాప్తము.

—0—

# పంచమాధ్యాయము.

మూ॥ అథాతో నేత్రవస్తివ్యాపదికీం సిద్ధిం వ్యాఖ్యాస్యామః ॥1॥
ఆ॥ పిమ్మట నేత్రవస్తివ్యాపదికీసిద్ధిని చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥
ఆ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ అథ నేత్రాణి వస్తీంశ్చ శృణు వర్జ్యాని కర్మసు। నేత్రప్రణిధానస్య వ్యాపదః సచికిత్సితాః ॥3॥

ఆ॥ వస్తికర్మలయందు గ్రహింపకూడని నేత్రములను వస్తులను చెప్పుచున్నాము. మరియు నేత్రమును సరిగ ప్రయోగింపనియెడల కలుగు వ్యాపత్తులను అట్టివ్యాపత్తులకు చేయతగిన చికిత్సలను చెప్పుచున్నాము.

## వర్జనీయనేత్రలక్షణములు — వానివలనకలుగు దోషములు.

మూ॥ హ్రస్వం దీర్ఘం తను స్థూలం జీర్ణం శిథిలబన్ధనమ్। పార్శ్వచ్ఛిద్రం తథా వక్రమష్టౌ నేత్రాణి వర్జయేత్ ॥ అప్రాప్త్యతిగతిక్షోభకర్షణక్షణనస్రవాః। గుదపీడా గతిర్జిహ్మా తేషాం దోషా యథాక్రమమ్ ॥5॥

ఆ॥ పొట్టిగనుండుట పొడుగుగనుండుట సన్నముగనుండుట లావుగనుండుట పాతదిగనుండుట కట్లువిడిపోయినదిగనుండుట పార్శ్వములయందు ఎత్తుగనుండుట వంకరగనుండుట ఈయెనిమిదిలక్షణములలో ఏలక్షణమైనను కల నేత్రమును ఉపయోగింపకూడదు. ఆలక్షణములవలన యథాక్రమముగ స్వల్పముగ ప్రవేశించుట అధికముగ ప్రవేశించుట క్షోభకలుగుట ఒరపిడికలుగుట స్రవించుట బాధకలుగుట వంకరగ ప్రవేశించుట ఈయెనిమిదిదోషములు కలుగును.

## వర్జనీయవస్తిలక్షణములు — వానివలనకలుగు దోషములు.

మూ॥ మాంసలచ్ఛిద్రవిషమస్థూలజాలకవాతలాః। ఛిన్నః క్లిన్నశ్చ తానష్టౌ వస్తీన్ కర్మసు వర్జయేత్ ॥ గతివైషమ్యవిస్రత్వ్రావదౌర్గ్రాహ్యా నిస్రవాః। ఫేనిలచ్యుతధార్యత్వం వస్తేః స్యాద్వస్తిదోషతః ॥7॥

ఆ॥ మాంసమునుకలిగియుండుట రంధ్రమునుకలిగియుండుట హెచ్చుతగ్గులుగనుండుట లావుగనుండుట సన్ననిరంధ్రములనుకలిగియుండుట వాయువుతోకూడియుండుట పగిలియుండుట తేమనుకలిగియుండుట ఈయెనిమిదిలక్షణములలో ఏలక్షణ

మును కలవస్తిని ఉపయోగింపకూడదు. ఆ లక్షణములకలన విషముగా ప్రవేశించుట, దుర్గంధము, స్రవించుట, పట్టుకొనుటకు వీలులేకుండుట, అధికముగ స్రవించుట, సురుగు కలుగుట, జారిపోవుట, మిగిలియుండుట ఈదోషములు కలుగును.

వస్తిని ప్రయోగించువానియందలి దోషములు.

మూ॥ సవాతాతిద్రుతోత్క్షిప్తతిర్యగుత్క్షిప్తకమ్పితాః । అతి బాహ్యా గమన్దాతివేగదోషాః ప్రణేతృతః ॥౩॥

అ॥ వాతముతోకూడ ప్రవేశపెట్టుట తొందరగ ప్రవేశపెట్టుట ఊర్ధ్వముగ ప్రవేశపెట్టుట అడ్డముగ ప్రవేశపెట్టుట చేతులను వణకించుట నేత్రమును అధికముగ ప్రవేశపెట్టుట వస్తిని స్వల్పవేగముగ ప్రవేశపెట్టుట అధికవేగముగ ప్రవేశపెట్టుట ఇవి వస్తిని ప్రయోగించువానియొక్క దోషములుగ నుండును.

దోషయుక్తప్రయోగమువలనకలుగు లక్షణములు - వానికి చికిత్సలు.

మూ॥ అనుచ్ఛ్వాస్యానుబద్ధే వా దత్తే నిశ్శేష ఏవ వా । ప్రవిశ్య కుపితో వాయుః శూలతోదకరో భవేత్ ॥ తత్రాభ్యఙ్గో గుదే స్వేదో వాతఘ్నాన్యశనాని చ । ద్రుతం ప్రణీతే నిష్కృష్టే సహసోత్క్షిప్త ఏవ వా॥ స్యాత్కటీగుదజఙ్ఘోరువస్తిస్తమ్భోరువేదనాః। భోజనం తత్ర వాతఘ్నం స్నేహాః స్వేదాః సవస్తయః ॥ తిర్యగ్వాల్యావృతద్వారే బద్ధేనాపి న గచ్ఛతి । నేత్రం తదూర్ధ్వం నిష్కృష్య సంశోధ్య చ పునర్నయేత్॥ పీడ్యమానే౽న్తరాముక్తే గుదే ప్రతిహతో౽నిలః। ఉరఃశిరోర్తిమూర్వోశ్చ సదనం జనయేన్బలీ॥ వస్తిఃస్యాత్తత్ర బిల్వాదిఫలశ్యామాదిమూత్రవాన్ । స్యాద్దాహో దవథుః శోథః కమ్పనాభిహతే గుదే॥ కషాయమధురాః శీతాః సేకాస్తత్ర సవస్తయః । అతిమాత్రప్రణీతేన నేత్రేణ క్షణనాద్వలేః ॥ స్యాచ్ఛర్దిదాహ నిస్తోదగురువర్చః ప్రవర్తనమ్। తత్ర సర్పిః పిచుః క్షీరం పిచ్ఛావస్తిశ్చ శస్యతే॥ న వానహతి మన్దస్తు బాహ్యస్త్వాశు నివర్తతే । స్నేహాస్తత్ర పునః సమ్యక్ ప్రణేయః సిద్ధిమిచ్ఛతా ॥ అతిప్రపీడితః కోష్ఠే తిష్ఠత్యాయాతి వా గలమ్ । తత్ర వస్తిర్విరేకశ్చ గలపీడాదికర్మ చ ॥18॥

అ॥ వస్తిగొట్టమును ఊదకుండగ ప్రవేశపెట్టినను వస్తిద్రవమును మిగల్చకుండగ ప్రయోగించినను వాయువు లోనప్రవేశించి ప్రకోపించి శూలను బాధను కలిగించును. అప్పుడు అభ్యంగమును గుదప్రదేశమునందు స్వేదమును చేయింపవలయును. వాతనాశకములగు ఆహారముల నీయవలయును. తొందరగ ప్రవేశపెట్టినను వస్తినేత్రమును తొందరగలాగినను వస్తిద్రవమును ఊర్ధ్వముగ ప్రవేశపెట్టినను కటిప్రదేశము

గుదప్రదేశము పిక్కలు వీనియందు బాధయు, మూత్రాశయము స్తంభించుటయు, తొడలయందు బాధయు కలుగును. అప్పుడు, వాతనాశకములగు ఆహారములను స్నేహములను స్వేదములను వాతనాశకములగు వస్తులను ప్రయోగింపవలయును. అడ్డముగ ప్రవేశపెట్టినను గుదప్రదేశము వళులచే ఆవరింపబడియున్నను వస్తినేత్రమునందు అడ్డుకలిగినను వస్తిద్రవము ప్రవేశింపనేరదు. అప్పుడు నేత్రమును బయటికితీసి అడ్డును తీసివేసి మరల సరిగ ప్రవేశపెట్టవలయును. వస్తిని నొక్కునప్పుడు మధ్యయందు విడచినయెడల వాతము గుదప్రదేశమునందు ప్రతిహతముకలదై వృద్ధినొంది వక్షఃస్థలమునందును శిరస్సునందును బాధను కలిగించును. తొడలను కృశింపచేయును. అప్పుడు దశమూలములు, ప్రంగకాయలు, నల్లతెగడ మొదలగునవి. గోమూత్రము వీనితోకూడిన వస్తిని ప్రయోగింపవలయును. చేతులను వణకించుట వలన గుదప్రదేశమునందు అభిఘాతము కలుగును. మరియు తాపము సంతాపము వాపు ఇవి కలుగును. అప్పుడు, కషాయరసమును మధురరసమును శీతవీర్యమును కల ద్రవములతో తడుపవలయును. మరియు అట్టివస్తులను చేయింపవలయును. నేత్రమును అధికముగ ప్రవేశపెట్టినచో వళులయందు రాపిడికలిగి వాంతి, తాపము, బాధ, మలము కష్టముగ బయలువెడలుట ఈలక్షణములు కలుగును. అప్పుడు ఘృతములు మూది పాలు పిచ్ఛావస్తి వీనిని ప్రయోగింపవలయును. వస్తిని స్వల్పవేగముగ ప్రవేశపెట్టినచో లోనికి ప్రవేశింపనేరదు. వెలుపలనే ఉండి శీఘ్రముగ బయలువెడలును. అప్పుడు మరల స్నేహవస్తిని సరిగ చేయింపవలయును. అతివేగముగ ప్రవేశపెట్టినచో కోష్ఠమునుగాని కంఠమునుగాని పొందును. అప్పుడు, వస్తిని విరేచనౌషధమును ప్రయోగింపవలయును. మరియు కంఠమును నొక్కిపట్టుట మొదలగువానిని చేయింపవలయును.

## అధ్యాయ సంగ్రహము.

మూ॥ నేత్రవస్తిప్రణేతౄణాం దోషానేతాన్ సభేషజాన్ ।
వేత్తి తత్త్వేన మతిమాన్వస్తికర్మాణి కారయేత్ ॥19॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే సిద్ధిస్థానే నేత్రవస్తివ్యాపదికీసిద్ధిర్నామ పఞ్చమోఽధ్యాయః ॥

తా॥ ఈఅధ్యాయమునందు నేత్రమువలనను వస్తివలనను ప్రయోగించువానివలనను కలుగు దోషములును, వానియొక్క చికిత్సలును చెప్పబడినవి. వీనిని పూర్తిగ తెలిసికొని వస్తికర్మను చేయింపవలయును.

ఇవ్విధంబున, శ్రీగోదోపనామకకృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి
చరకసంహితా వ్యాఖ్యానమునందు నేత్రవస్తివ్యాపదికీసిద్ధియనెడు
పంచమాధ్యాయము సమాప్తము.

# షష్ఠాధ్యాయము.

మూ॥ అథాతో వమనవిరేచనవ్యాపత్సిద్ధిం వ్యాఖ్యాస్యామః॥1॥

అ॥ పిమ్మట వమనవిరేచన వ్యాపత్సిద్ధిని చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ అథ శోధనయోః సమ్యగ్విధి మూర్ధ్వానులోమయోః। అసమ్యక్కృతయోశ్చైవ దోషాన్వక్ష్యామి సౌషధాన్ ॥3॥

అ॥ వమన విరేచన కర్మలయొక్క సమ్యగ్యోగవిధిని, మిథ్యాయోగములుగ చేయబడినవానియొక్క దోషములను, ఆ దోషములయొక్క చికిత్సలను చెప్పుచున్నాము.

మూ॥ అత్యుష్ణ వర్షశీతా హి గ్రీష్మవర్షాహిమాగమాః। తదన్తరే ప్రావృమద్యాస్తేషాం సాధారణాస్త్రయః॥ ప్రావృట్ శుచినభౌజ్ఞేయా శరదూర్జసహౌ పునః। తపస్యశ్చ మధుశ్చైవ వసన్తః శోధనం ప్రతి ॥ ఏతానృతూన్విచిన్త్యైవ దద్యాత్సం శోధనం నృణామ్। స్వస్థవృత్తమభిప్రేత్య వ్యాధౌ వ్యాధివశేన తు ॥6॥

అ॥ గ్రీష్మఋతువునందు వేడిమియు, వర్షఋతువునందు వర్షమును, శిశిరఋతువునందు చలియు అధికముగ నుండును. వానికి మధ్యయందుండు ప్రావృడృతువు మొదలగు మూడుఋతువులయందును ఈధర్మములు సాధారణముగ నుండును. ఆషాఢశ్రావణమాసములు ప్రావృడృతువనియు, కార్తిక మార్గశిర మాసములు శరదృతువనియు, ఫాల్గునచైత్రమాసములు వసంతఋతువనియు చెప్పబడును ఈవిభాగము శోధనమునుగురించి చెప్పబడినది. ఈఋతువుల నాలోచించి శోధనమును చేయింపవలయును. ఈశోధనవిషయము స్వస్థవృత్తునిగురించి చెప్పబడినది. ఆత్యయికమైనవ్యాధి కలిగినప్పుడు ఇతరఋతువులయందుకూడ శోధనమును తగువిధమున చేయింపవచ్చును.

మూ॥ కర్మణాం వమనాదీనామన్తరేష్వన్తరేషు చ। స్నేహస్వేదౌ ప్రయుఞ్జీత, స్నేహోద్యన్తే ప్రయోజయేత్ ॥ విసర్పపిడకాశోఫకామలాపాణ్డురోగిణః। అభిఘాతవిషార్తాంశ్చ నాతిస్నిగ్ధాన్విరేచయేత్॥ నాతిస్నిగ్ధ శరీరాయ దద్యాత్స్నేహ విరేచనమ్। స్నేహోత్క్లిష్ట శరీరాయ రూక్షం దద్యాద్విరేచనమ్ ॥9॥

అ॥ వమనాదికర్మలయొక్క మధ్యమధ్యయందు స్నేహస్వేదములను చేయింపవలయును. ఆకర్మలయొక్క అంతమునందు స్నేహమును ప్రయోగింపవలయును.

విసర్పము పిడకలు శోఫ కామెర్లు పాండురోగము అభిఘాతము విషదోషము ఇవికల వారలకు స్నేహకర్మను అధికముగ చేయింపకుండగనే విరేచనములను చేయింపవలయును. మిక్కిలి స్నైగ్ధ్యమునొందని శరీరముకలవానికి స్నేహద్రవ్యములతో విరేచనములను చేయింపవలయును. మిక్కిలి స్నిగ్ధముగనున్న శరీరముకలవానికి రూక్షద్రవ్యములతో విరేచనములను చేయింపవలయును.

శోధనకర్మయందు స్నేహస్వేదముల ప్రయోజనము.

మూ॥ స్నేహస్వేదోపపన్నేన జీర్ణే మాత్రావదౌషధమ్। ఏకాగ్రమనసా పీతం సమ్యగ్యోగాయ కల్పతే॥ స్నిగ్ధాత్పాత్రా ద్యథాతోయమయత్నేన ప్రణుద్యతే। కఫాదయః ప్రణుద్యన్తే స్నిగ్ధాద్దేహాత్తథౌషధైః॥ ఆర్ద్రం కాష్ఠం యథా వహ్నిర్విష్యన్దయతి సర్వతః। తథా స్నిగ్ధస్య వై దోషాన్ స్వేదో విష్యన్దయేత్స్థిరాన్ ॥ క్షారోత్క్లిష్టో యథా వస్త్రే మలః సంశోధ్యతేఽమ్భసా। స్నేహస్వేదైస్తథోత్క్లిశ్య శోధ్యతే శోధ్యతే శోధనైర్మలః ॥13॥

అ॥ స్నేహస్వేదముల నాచరించి ఆహారము జీర్ణమైనపిదప ఏకాగ్ర మనస్సుకలవాడై మాత్రావత్తైన ఔషధమును సేవించినచో సమ్యగ్యోగము కలుగును, చమురుతో పూయబడిన పాత్రనుండి ఉదకము కష్టములేకుండగ వెడలువిధమున స్నేహముచే స్నిగ్ధమైన శరీరమునుండి కఫాదులు ఔషధములచే కష్టములేకుండగ వెడలును. అగ్నిపచ్చికర్రయందలిద్రవమును పూర్తిగ స్రవింపచేయువిధమున స్వేదకర్మ స్నిగ్ధముగనున్నశరీరమునందుఅణగియున్న దోషములను స్రవింపచేయును. వస్త్రమునందలి మలము క్షారముచే ఉత్క్లేశమునొందింపబడి ఉదకముచే శోధింపబడువిధమునశరీరమునందలి దోషములు స్నేహస్వేదములచే ఉత్క్లేశము నొందింపబడి వమన విరేచనకర్మలచే శోధింపబడును.

మూ॥ అజీర్ణే వర్ధతే గ్లానిర్విబన్ధశ్చాపి జాయతే। పీతం సంశోధనం చైవ విపరీతం ప్రవర్తతే ॥14॥

అ॥ ఆహారము జీర్ణముకానప్పుడు వమనౌషధముగాని విరేచనౌషధము గాని ఇచ్చినచో బడలికయు విబంధమును కలుగును. మరియు వమనౌషధమును అధోముఖమున వెడలును. విరేచనౌషధము ఊర్ధ్వముఖమున వెడలును.

మాత్రావత్త్వ లక్షణము.

మూ॥ అల్పమాత్రం మహావేగం బహుదోషహరం సుఖమ్। లఘుపాకం సుఖాస్వాదం ప్రీణనం వ్యాధినాశనమ్ ॥ అవికారావిపన్నం చ నాతిగ్లానికరం చ యత్। గన్ధవర్ణ రసోపేతం విద్యాన్మాత్రావదౌషధమ్ ॥ .6॥

అ॥ అల్పపరిమితిగలిగినట్టియు అధికమైన వేగముకలిగినట్టియు సుఖముగ అధిక దోషములను హరించునట్టియు సులభముగ జీర్ణమగునట్టియు మంచిరుచికలిగినట్టియు తృప్తినికలిగింపచేయునట్టియు వ్యాధులనునశించునట్టియు వికారములను వ్యాపత్తులను కలిగింపనట్టియు అధికముగు బడలికను కలిగింపనట్టియు మంచివియగు గంధము వర్ణము రుచి వీనితో కూడినట్టియు ఔషధము మాత్రావత్తు అని అనబడును

మూ॥ విధూయ మానసాన్దోషాన్కామక్రోధభయాదికాన్ ।
ఏకాగ్రమనసా పీతం సమ్యగ్యోగాయ కల్పతే ॥17॥

అ॥ కామము క్రోధము భయము మొదలగు మానసికదోషములు లేనివాడై ఏకాగ్రమనస్సుతో శోధనౌషధమును సేవించినచో సమ్యగ్యోగము కలుగును.

మూ॥ నరః శ్వో వమనం పాతా భుఞ్జీత కఫవర్ధనమ్। సుజరం ద్రవభూయిష్ఠం లఘు శీతం విరేచనమ్ । ఉత్క్లిష్టాల్పకఫత్వేన క్షిప్రం దోషాః స్రవన్తి హి ॥18॥

అ॥ వమనౌషధమును సేవింపదలచినవాడు పూర్వదినమున, కఫవర్ధకముగు ఆహారమునుభుజింపవలయును. విరేచనౌషధమును సేవింపదలచినవాడు పూర్వదినమున,త్వరగ జీర్ణమగునట్టియు ద్రవప్రధానమైనట్టియు లఘుగుణముకలిగినట్టియు శీతవీర్యముకలిగినట్టియు ఆహారమును తీసికొనవలయును. అట్లుచేసినచో కఫముత్క్లేశము నొందుట వలన వమనములుబాగుగనై దోషములు వెంటనే బయలువెడలును. కఫముస్వల్పముగ నుండుటవలన విరేచనములు బాగుగనై దోషములు వెంటనే బయలువెడలును.

మూ॥ పీతౌషధస్య తు భిషక్ శుద్ధిలిఙ్గాని లక్షయేత్॥ ఊర్ధ్వం కఫానుగే పిత్తే విట్పిత్తానుగతే త్వధః । హృతదోషం వదేత్కార్శ్య దౌర్బల్యే చేత్సలాఘవమ్ ॥ వామయేత్తు తతః శేషమౌషధం న త్వలాఘవే । స్తైమిత్యేఽనిలసఙ్గే చ నిరుద్గారేఽపి వామయేత్ ॥ అలాఘవాదజీర్ణత్వాచ్చ కఫస్యాపత్ పరం భవేత్ । వమితే వర్ధతే వహ్నిః శమం దోషా వ్రజన్తి హి ॥వమితం లఙ్ఘయేత్సమ్యగ్జీర్ణలిఙ్గాని లక్షయేత్ । తాని దృష్ట్వా తు పేయాదిక్రమం కుర్యాన్న లఙ్ఘనమ్। సంశోధనాభ్యాం శుద్ధస్య హృతదోషస్య దేహినః । యాత్యగ్నిర్మన్దతాం తస్మాత్క్రమం పేయాదిమాచరేత్ ॥ కఫపిత్తే విశుద్ధేఽల్పం మద్యపే వాతపైత్తికే। తర్పణాదిక్రమం కుర్యాత్పేయాఽభిష్యన్దయేద్ధి తాన్ ॥25॥

అ॥ వమనౌషధమును సేవించినప్పుడు తొలుత కఫమును తరువాత పిత్తమును ఊర్ధ్వమార్గమున వెడలుటయు, విరేచనౌషధమును సేవించినప్పుడు తొలుత మలమును పిమ్మట

పిత్తమును తుదకు కఫమును అధోమార్గమున వెడలుటయు శుద్ధలక్షణములుగ నుండును. విరేచనములైనపిదప కృశత్వము దౌర్బల్యము లఘుత్వము ఈలక్షణములు కలిగినచో మిగిలినఔషధమును వాంతిచే బయలు వెడలింపవలయును. లఘుత్వము కలుగనిచో వాంతిని చేయింపనవసరములేదు. స్తైమిత్యము వాతబంధము త్రేనుపులు లేకుండుట ఈలక్షణములున్నను వాంతిని చేయింపవలయును. లఘుత్వముకలుగకుండినను కఫము క్రొద్దిగమిగిలియున్నను ఆపత్తు కలుగును. వమనములు బాగుగనైనచో జాఠరాగ్ని వృద్ధినొందును. దోషములు శాంతించును. వమనములైనపిదప జీర్ణలక్షణములుకలుగుటకై లంఘనమును చేయింపవలయును. పిమ్మట లంఘనమును చేయింపక పేయాదిక్రమము నాచరింపవలయును. వమనములచే గాని విరేచనములచేగాని దోషములుహరింపబడి శుద్ధినొందినవానికి జాఠరాగ్ని మందముగ నుండును. కావున పేయాదిక్రమము నాచరింపవలయును. మద్యపానము చేయువానికిని వాతపిత్తప్రకృతికలవానికిని కఫపిత్తము అల్పముగ శుద్ధినొందినపుడు తర్పణాదిక్రమము నాచరింపవలయును. అట్టివానికి పేయాదిక్రమము నాచరించినచో అభిష్యందము కలుగును.

మూ॥ అనులోమోఽనిలః స్వాస్థ్యం క్షుత్తృష్ణోర్జోమనస్వితా । లఘుత్వ మిన్ద్రియోద్గారశుద్ధి జీర్ణౌషధాకృతిః ॥ క్లమోదాహోఽఙ్గమర్దశ్చ భ్రమో మూర్ఛా శిరోరుజా । అరతిర్బలహానిశ్చ సావశేషౌషధాకృతిః ॥27॥

అ॥ శోధనౌషధముజీర్ణమైనయెడల వాతానులోమ్యము, స్వాస్థ్యము, ఆకలి, దప్పిక, బలము, మనోదార్ఢ్యము, శరీరము చులకనగనుండుట, ఇంద్రియపాటవము, త్రేనుపులులేకుండుట ఈలక్షణములు కలుగును. శోధనౌషధము జీర్ణముకాక మిగిలియున్నయెడల బడలిక, తాపము, ఒడలునొప్పులు, భ్రమ, మూర్ఛ, శిరోబాధ, దేనియందును ఇష్టములేకుండుట, బలముక్షీణించుట ఈలక్షణములు కలుగును.

మూ॥ అకాలేఽల్పాతిమాత్రం చ పురాణం న చ భావితమ్ । అసమ్యక్ సంస్కృతం చైవ వ్యాపద్యేతౌషధం ధ్రువమ్ ॥28॥

అ॥ అకాలమునందుగాని అల్పముగగాని అధికముగగాని ప్రయోగింపబడినట్టియు ప్రాతదైనట్టియు భావనచేయబడనట్టియు బాగుగాసంస్కరింపబడనట్టియు శోధనౌషధము వ్యాపత్తును తప్పక కలిగించును.

మూ॥ ఆధ్మానం పరికర్తిశ్చ స్రావో హృద్గాత్రయోర్గ్రహః । జీవాదానం సవిభ్రంశః స్తమ్భః సోపద్రవః క్లమః ॥ అయోగాదతియోగాచ్చ దశైతా వ్యాపదో మతాః। ప్రేష్యభైషజ్య వైద్యానాం వైగుణ్యాదాతురస్య చ। శుద్ధోల్లిఖేదునర్గన్ధమహృద్యమతిబాధ్య తే॥

అ॥ శోధనౌషధముయొక్క అయోగమువలనను అతియోగమువలనను కడుపుబ్బరము, పరివర్తిక యనెడి బాధ, నోటినుండి నీరుకారుట, హృదయము పట్టికొనబడినట్లుండుట, శరీరము పట్టుకొనబడినట్లుండుట, జీవశక్తి క్షీణించుట, గుదప్రదేశము జారుట, స్తంభించుట, ఊర్ధ్వగమనము మొదలగు నుపద్రవములు, బడలిక ఈ పది లక్షణములు కలుగును. ఉపచారకుడు ఔషధము వైద్యుడు రోగి వీనియొక్క వైగుణ్యమువలన శుద్ధమైన దోషముకూడ ఉత్క్లేశమునొంది దౌర్గంధ్యమును హృదయమునకు అప్రియత్వమును కలిగించి అధికమగుబాధను కలిగించును.

మూ॥ యోగస్సమ్యక్ప్రవృత్తిః స్యాదతి యోగోఽతివర్తనమ్।
అయోగః ప్రాతిలోమ్యేన న చాల్పో వా ప్రవర్తనమ్ ॥౩.॥

అ॥ దోషాదులు సరిగ ప్రవర్తించుట సమ్యగ్యోగమనియు అధికముగ ప్రవర్తించుట అతియోగమనియు ప్రతిలోమముగ ప్రవర్తించుటగాని ప్రవర్తింపక యుండుటగాని స్వల్పముగ ప్రవర్తించుటగాని అయోగమనియు చెప్పబడును.

మూ॥ ఉత్క్లిష్ట శ్లేష్మ దుర్గన్ధ మహృద్యం నాతి వా బహు।
విరేచన మజీర్ణే చ పీతమూర్ధ్వం ప్రవర్తతే ॥౩౪॥

అ॥ పూర్వదినమునందుభుజింపబడిన ఆహారము జీర్ణముకాకుండగనే విరేచనౌషధమును పుచ్చుకొనినచో అది ఊర్ధ్వముఖమున వెడలును. శ్లేష్మము ఉత్క్లేశము నొంది స్వల్పమైనట్టికాని అధికమైనట్టికాని దుర్గంధమును హృదయగ్లానియుకలుగును.

మూ॥ క్షుధార్తమృదుకోష్ఠాభ్యాం స్వల్పోత్క్లిష్ట కఫేన వా।
తీక్ష్ణం పీతం స్థితి క్షుబ్ధం వమనం స్యాద్విరేచనమ్ ॥ ప్రాతిలోమ్యేన దోషాణాం హరణాత్తే హ్యకృత్స్నశః। అయోగసంజ్ఞే కృచ్ఛ్రాద్వా యదా గచ్ఛతి చాల్పశః ॥౩౫॥

అ॥ ఆకలిచేపీడింపబడువాడును మృదుకోష్ఠము కలవాడును స్వల్పముగనుత్క్లేశము నొందిన కఫముకలవాడును తీక్ష్ణగుణముకల వమనౌషధమును సేవించినచో అది ఉదీర్ణతనొందక క్షోభనొందినదై విరేచనముద్వారా బయలువెడలును. ఔషధము ప్రతిలోమగతి నొందుటవలన దోషములు పూర్తిగ హరింపచేయబడక పోవుటగాని కష్టముచే కొద్దిగ వెడలుటగాని అయోగమనబడును.

మూ॥ పీతౌషధో న శుద్ధశ్చేజ్జీర్ణే తస్మిన్పునః పిబేత్ । ఔషధం న త్వజీర్ణేఽన్యద్భయం స్యాదతియోగతః ॥౩౬॥

అ॥ సేవింపబడిన ఔషధమువలన రోగి శుద్ధినొందినయెడల ఆ ఔషధము జీర్ణమైనపిదప మరల ఔషధమును సేవింపవలయును. ఔషధము జీర్ణముకాకుండ నున్నపుడు మరల ఔషధమును సేవింపకూడదు. అట్లు సేవించినచో అతియోగముకలుగును,

మూ॥ కోష్ఠస్య గురుతాం జ్ఞాత్వా లఘుత్వం బలమేవ చ। అయోగే మృదు వా దద్యాదౌషధం తీక్ష్ణమేవ వా ॥ వమనం న తు దుశ్ఛర్ద్యాం మృదుకోష్ఠే విరేచనమ్। పాయయేతౌషధం భూయో హన్యాత్ప్రీతం పునర్హ్రితౌ ॥38॥

అ॥ శోధనమునకు అయోగము కలిగినప్పుడు కోష్ఠముయొక్క గురుత్వమును లఘుత్వమును బలమును తెలిసికొని మృదువైనట్టికాని తీక్ష్ణమైనట్టికాని ఔషధము నీయవలయును. కష్టముగ వాంతిని చేయువానికి వమనౌషధమును, మృదుకోష్ఠముకల వానికి విరేచనౌషధమును మరల ఈయకూడదు. అట్లు ఇచ్చినచో మరణమును కలిగించును.

మూ॥ అస్నిగ్ధాస్విన్న దేహస్య రూక్షస్యాఽవమౌషధమ్। దోషానుత్క్లిశ్య నిర్హర్తుమశక్తం జనయేద్గదాన్ ॥ విభ్రంశం శ్వయథుం హిక్కాం తమసో దర్శనం తృషమ్। పిణ్డికోద్వేష్టనం కణ్డూమూర్వోః సాదం వివర్ణతామ్ ॥40॥

అ॥ స్నేహస్వేదములను చేయించుకొనక రూక్షముగనున్న శరీరము కలవాడు ప్రాతఔషధమును సేవించినచో ఆ ఔషధము దోషముల నుత్క్లేశము నొందించి వానిని బయలు వెడలింప చేయజాలక విభ్రంశము, నంజు, ఎక్కిళ్ళు, చీకటి క్రమ్ముట, దప్పిక పిక్కలు మెలివేయబడినట్లుండుట, దురద, తొడలు కృశించుట, వివర్ణత్వము వీనిని కలిగించును.

మూ॥ స్నిగ్ధస్విన్నస్య చాత్యల్పం దీప్తాగ్నేర్జీర్ణ మౌషధమ్। శీతైర్వా స్తబ్ధమామైర్వా దోషానుత్క్లిశ్య నాహరేత్ ॥ తానేవ జనయేద్రోగాన్ న్యయోగః సర్వఏవసః, విజ్ఞాయ మతిమాంస్తత్ర యథోక్తాం కారయేత్క్రియామ్ ॥42॥

అ॥ స్నేహస్వేదములను చేయించుకొనినను దీప్తాగ్నికలవానికి స్వల్ప పరిమాణముగ నుపయోగించుటచే జీర్ణమైనట్టికాని శీతలోపచారములచే స్తంభింపబడినట్టికాని ఆమముచే స్తంభింపబడినట్టికాని ఔషధము దోషములకు ఉత్క్లేశమును మాత్రము కలిగించును. కాని వానిని బయలు వెడలింపజాలదు. మరియు పూర్వమున చెప్పబడిన విభ్రంశము మొదలగు వ్యాధులను కలిగించును. ఇట్లు అయోగము చెప్పబడినది. దీనిని బాగుగ తెలిసికొని తగుచికిత్సను చేయింపవలయును.

మూ॥ తం తైలలవణాభ్యక్తం స్విన్నం ప్రస్తరసంకరైః। పాయయేత పునర్జీర్ణే సమూత్రైర్వా నిరూహయేత్ ॥ నిరూఢం చ రసైర్ధన్వైర్భోజయిత్వాఽనువాసయేత్। ఫలమాగధికాదారు సిద్ధతైలేన మాత్రయా॥ స్నిగ్ధం వాతహరైః స్నేహైః పునస్తీక్ష్ణేన శోధయేత్। న చాతితీక్ష్ణేన తతో హ్యతియోగస్తు జాయతే ॥45॥

ఆ॥ శోధనకర్మయొక్క ఈఅయోగము కలిగినప్పుడు—పూర్వమునందు సేవింపబడిన ఔషధము జీర్ణమైనపిదప రోగికి సైంధవలవణముతో కూడిన తైలమును శరీరమునందు పూసి ప్రస్తరసంకరములనెడి స్వేదములను చేయించి మరల శోధనౌషధమునీయవలయును. లేక గోమూత్రముతో కూడిన నిరూహవస్తిని చేయించి జాంగలమాంసరసములతో భుజింపచేయవలయును. పిమ్మట మంగకాయలు పిప్పళ్ళు దేవదారు వీనితో తయారుచేయబడిన తైలముచే తగుపరిమితిగ అనువాసనవస్తిని చేయింపవలయును. వాతహరములైన స్నేహములతో సిద్ధమైన వీనికి తీక్ష్ణఔషధములనిచ్చి శోధింపవలయును. మిక్కిలి తీక్ష్ణములైన ఔషధముల నీయకూడదు. అట్లు ఇచ్చినచో అతియోగము కలుగును.

మూ॥ అతితీక్ష్ణం క్షుధార్తస్య మృదుకోష్ఠస్య భేషజమ్।
హృత్వాఽఽశు విట్పిత్తకఫాన్ ధాతూన్విస్రావయేద్ద్రవాన్॥ బలస్వరక్షయం దాహం కణ్ఠశోషం క్లమం తృషామ్॥ కుర్యాచ్చ మధురైస్తత్ర శేషమౌషధ ముల్లిఖేత్ ॥47॥

అ॥ ఆకలితో కూడినవానికిని మృదుకోష్ఠముకలవానికి మిక్కిలితీక్ష్ణమైన ఔషధమునిచ్చినచో పురీషమును పిత్తమును కఫమును వెంటనే హరింపచేసి ద్రవరూపములగు ధాతువులను స్రవింపజేయును. మరియు బలక్షయము స్వరక్షయము తాపము కంఠము ఎండుట బడలిక దప్పిక వీనిని కలిగించును. అప్పుడు మిగిలియున్న ఔషధమును మధురద్రవ్యములచే వమనరూపమున బయలువెడలింపవలయును.

విరేచనాతి యోగమునందు చేయదగిన విధానము.

మూ॥ వమనే తు విరేకః స్యాద్విరేకే వమనం మృదు। పరిషేకావగాహాద్యైః సుశీతైః స్తమ్భయేచ్చ తమ్॥ కషాయమధురైః శీతైరన్నపానౌషధైస్తథా। రక్తపిత్తాతి సారఘ్నైర్దాహ జ్వరహరైరపి॥ అఞ్జనం చన్దనోశీర మజాసృక్ శర్కరోదకమ్। లాజచూర్ణైః పిబేన్మన్థమతియోగహరం పరమ్॥ శుఙ్గాభిర్వా వటాదీనాం సిద్ధాం పేయాం సమాక్షికామ్। వర్చస్సాంగ్రాహికైః సిద్ధం క్షీరం భోజ్యం చ దాపయేత్॥ జాఙ్గలైర్వా రసైర్భోజ్యం పిచ్ఛావస్తిం చ దాపయేత్। మధురైరనువాస్యశ్చ సిద్ధేన క్షీరసర్పిషా ॥52॥

ఆ॥ వమనములధికముగ నగుచున్నచో విరేచనౌషధము నీయవలయును. విరేచనములధికముగ నగుచున్నచో మృదువైనవమనౌషధముల నీయవలయును. మరియు శీతలములైన పరిషేకము అవగాహస్నానము వీనిచేతను, కషాయరసమును మధురరసమును శీతవీర్యమునుకల అహారములు పానములు ఔషధములు వీనిచేతను, రక్తపిత్తమునుఅతిసారమును తాపమునుజ్వరమును హరింపజేయుక్రియలచేతను స్తంభింపచేయవలయును.

రసాంజనము చందనము వట్టివేళ్ళు మేకరక్తము పంచదార ఉదకము పేలాలపిండి వీనితో తయారుచేయబడిన మంథము నిచ్చినచో అతియోగము నశించును. మఱ్ఱి మొదలగువానియొక్క చిగుళ్ళతో సిద్ధముచేయబడి తేనెతోకూడిన పేయ నీయవలయును. మలమును స్తంభింపజేయుద్రవ్యములతో సిద్ధముచేయబడిన పాలను ఆహారమును ఈయవలయును. లేక జాంగలమాంసరసముతో భుజింపచేయవలయును. పిచ్ఛావస్తి నీయవలయును. మధురద్రవ్యములతో తయారుచేయబడిన పాలు ఘృతము వీనితో అనువాసనవస్తిని చేయింపవలయును.

## వమనాతియోగమునందు చేయదగిన విధానము.

మూ॥ వమనస్యాతియోగే తు శీతామ్బుపరిషేచితః । పిబేత్ఫలరసైర్మన్థం సఘృతక్షౌద్రశర్కరమ్ ॥ సోద్గారాయాం భృశం వమ్యాం మూర్ఛాయాం ధాన్యముస్తయోః । సమధూకాఞ్జనం చూర్ణం లేహయేన్మధుసంయుతమ్॥ వమతోఽన్తఃప్రవిష్టాయాం జిహ్వాయాం కవలగ్రహాః । స్నిగ్ధామ్లలవణైర్హృద్యైర్యూషక్షీరరసైర్హితాః॥ ఫలాన్యమ్లాని ఖాదేయుస్తస్య చాన్యేఽగ్రతో నరాః । నిస్సృతాం తు తిలద్రాక్షాకల్కలిప్తాం ప్రవేశయేత్ ॥ వాగ్గ్రహానిలరోగేషు ఘృతమాంసోపసాధితామ్ । యవాగూం తనుకాం దద్యాత్స్నేహస్వేదౌ చ బుద్ధిమాన్ ॥ వమితశ్చ విరిక్తశ్చ మన్దాగ్నిశ్చ విలఙ్ఘితః । అగ్నిప్రాణవివృద్ధ్యర్థం క్రమం పేయాదికం భజేత్ ॥58॥

అ॥ వమనములు అధికముగనగుచున్నచో రోగిని చన్నీటితో తడిపి దానిమ్మ మొదలగుపండ్లయొక్క రసములతో తయారుకాబడినట్టియు ఘృతము తేనె పంచదార వీనితో కూడినట్టియు మంథమును ఇయ్యవలయును. త్రేనుపులతోకూడిన వాంతులు అధికముగనగుచున్నను, మూర్ఛకలిగినను ధనియాలు తుంగగడ్డలు అతిమధురము రసాంజనము వీనియొక్క చూర్ణమును తేనెతో కలిపి ఇయ్యవలయును. వాంతులగుచున్నవానికి నాలుక లోనికిపోయినచో స్నిగ్ధములుగను పులుపు ఉప్పు వీనితోకూడినవిగను మనస్సునకు ఇష్టములుగను నున్న యూషములు పాలు మాంసరసములు వీనితో కవలగ్రహము లనెడిగండూషములను చేయింపవలయును మరియు వానికెదురుగ ఇతరులుకూర్చొని దానిమ్మ మొదలగు పుల్లనిపండ్లను తినవలయును. నాలుక బయటికిజారినచో నువ్వులు ద్రాక్షపండ్లు వీనియొక్క కల్కమును నాలుకకుపూసి లోనప్రవేశపెట్టవలయును. వాగ్బంధముగాని వాతవ్యాధులుగాని కలిగినచో నెయ్యి మాంసము వీనితో తయారుచేయబడినట్టియు పలుచగనున్నట్టియు యవాగువును ఇయ్యవలయును. మరియు స్నేహస్వేదములను చేయింపవలయును, వమనములు చేయించబడినవాడును విరేచనములు చేయించబడినవాడును అగ్నిమాంద్యముకలవాడును లంఘనమును చేసినవాడును జాఠరాగ్నియొక్క బలమువృద్ధినొందునిమిత్తము పేయాదిక్రమము నాచరింపవలయును.

విరేచనాయోగచికిత్స.

మూ॥ బహుదోషస్య రూక్షస్య హీనాగ్నేరల్పమౌషధమ్। సోదావర్తస్య చోత్క్లిశ్య దోషాన్మార్గాన్నిరుధ్య చ॥ భృశమాధ్మాపయేన్నాభిం పృష్ఠపార్శ్వశిరోరుజామ్। శ్వాసవిణ్మూత్రవాతానాం సఙ్గం కుర్యాచ్చ దారుణమ్॥ అభ్యఙ్గస్వేదవర్త్యాది సనిరూహానువాసనమ్। ఉదావర్తహరం సర్వం కర్మాధ్మాతస్య శస్యతే॥61॥

అ॥ అధికదోషములు కలిగినట్టియు రూక్షులుగనున్నట్టియు స్వల్పమైనజాఠరాగ్ని కలిగినట్టియు ఉదావర్తము కలిగినట్టియు మనుజులకు అల్పపరిమితిగనియ్యబడిన ఔషధము దోషముల నుత్క్లేశమునొందించి మార్గము నరికట్టి నాభిప్రదేశమువందు అధికముగు ఉబ్బరమును, నడుము పార్శ్వములు శిరస్సు వీనియందు బాధను, శ్వాస మలము మూత్రము అపానవాతము వీనికి దారుణమైనబంధమును కలిగించును. అప్పుడు అభ్యంగము, స్వేదము, వర్తిప్రయోగము మొదలగునవి, నిరూహవస్తి, అనువాసనవస్తి, ఉదావర్తహరమైనచికిత్స, కడుపుబ్బరమునునశింపజేయుచికిత్స ఇవి ప్రశస్తములుగనుండును.

మూ॥ స్నిగ్ధేన గురుకోష్ఠేన సామే బలవదౌషధమ్। క్షామేణ మృదుకోష్ఠేన శ్రాన్తేనాల్పబలేన వా॥ పీతం దత్త్వా గుదం సామమాశు దోషం నిరస్య చ। తీవ్రశూలాం సపిచ్ఛాస్రాం కరోతి పరికర్తికామ్॥ లఙ్ఘనం పాచనం సామే రూక్షోష్ణం లఘుభోజనమ్। బృంహణీయో విధిః సర్వః క్షామస్య మధురస్తథా॥64॥

అ॥ స్నిగ్ధుడుగనున్నవాడు గురుకోష్ఠముకలవాడు ఆమదోషముకలవాడుక్షీణించినవాడు మృదుకోష్ఠము కలవాడు బడలికనొందినవాడుస్వల్పబలముకలవాడు వీరలకు ఇయ్యబడిన బలవత్తరమగు ఔషధము గుదప్రదేశమునుపొంది ఆమముతోకూడినదోషమును వెంటనేవెడలింపచేసి తీవ్రమైనబాధకలిగినట్టియు జిగురుతోడనురక్తముతోడను కూడినట్టియు పరికర్తికయనెడిబాధనుకలిగించును. అప్పుడు ఆమదోషమున్నచో లంఘనమును చేయింపవలయును. పాచనౌషధము నియ్యవలయును. రూక్షగుణమునుఉష్ణవీర్యమును లఘుగుణమును కల ఆహారము నియ్యవలయును. కృశించియున్నవానిక బృంహణక్రమము నాచరింపవలయును. మధురద్రవ్యములతో నుపచరింపవలయును.

మూ॥ ఆమాజీర్ణే తు బద్ధశ్చేత్తారామ్లం లఘు శస్యతే। పుష్పకాసీసమిశ్రం వా క్షారేణ లవణేన చ॥ సదాడిమరసం సర్పిః పిబేద్వాతేఽధికే సతి। దధ్యమ్లం భోజనే పానే సంయుక్తం దాడిమత్వచా॥ దేవదారుతిలానాం వా కల్కముష్ణామ్బునా పిబేత్। అశ్వత్థోదుమ్బర

ప్లక్షకదమ్బైర్వా శృతం పయః॥ కషాయమధురం వస్తిం పిచ్ఛావస్తిమ థాపి వా । యష్టీమధుకసిద్ధం వా స్నేహవస్తిం ప్రదాపయేత్ ॥68॥

అ॥ ఆమాజీర్ణము వలన విరేచనములు సరిగ కాకున్నచో క్షారములు ఆమ్లరసము వీనితో కూడినట్టియు లఘువైనట్టియు ఆహారము నీయవలయును. వాతమధికముగ నున్నచో పుష్పకాసీసముతో గాని క్షారము లవణము వీనితో గాని కూడినట్టియు దానిమ్మపండ్లరసముతో కూడినట్టియు ఘృతమును పానము చేయింపవలయును. మరియు దానిమ్మ పెరళ్ళచూర్ణముతో కూడిన పుల్లని పెరుగును అన్నపానములయందు ఉపయోగింపవలయును. లేక దేవదారు నువ్వులు వీనియొక్క కల్కమును వేడినీటితో ఈయవలయును. లేక రావి మేడి జువ్వి కడిమి వీనితో కాచబడిన పాల నీయవలయును. లేక కషాయరసము కల ద్రవ్యములతో డను మధురరసము కల ద్రవ్యములతోడను తయారు చేయబడిన వస్తిని గాని పిచ్ఛావస్తిని గాని యీయవలయును. లేక యష్టిమధుకముతో తయారు చేయబడిన స్నేహవస్తి నియవలయును.

మూ॥ అల్పం తు బహుదోషస్య దోషముత్క్లేశ్య భేషజమ్ । అల్పాల్పం స్రావయేత్కణ్డూ శోథకుష్ఠాని గౌరవమ్ ॥ కుర్యాచ్చాగ్నివధోత్క్లేశస్తైమిత్యారుచిపాణ్డుతామ్ । పరిస్రావగతం దోషం శమయేద్వామయేఽపి॥ స్నేహితం వా పునస్తీక్ష్ణం పాయయేచ్చ విరేచనమ్। శుద్ధే చూర్ణాసవారిష్టాన్ సంస్కృతాంశ్చ ప్రదాపయేత్ ॥69॥

అ॥ అధికదోషముకలవానికి స్వల్పమైన ఔషధము నిచ్చినయెడల ఆఔషధము దోషమును ఉత్క్లేశము నొందించి కొద్దిగ స్రవింపచేయును. మరియు దురద శోథ కుష్ఠము శరీరము బరువుగ నుండుట అగ్నిమాంద్యము ఉత్క్లేశము స్తైమిత్యము అరుచి పాండురోగము వీనిని కలిగించును. కొద్దికొద్దిగ స్రవించుచున్న యాదోషమునకు శమన చికిత్సను చేయింపవలయును. లేక స్నేహకర్మను చేయించి వమనౌషధమును గాని తీక్ష్ణమైన విరేచనౌషధమును గాని యీయవలయును. శుద్ధినొందినపిదప చూర్ణములను, ఆసవములను, అరిష్టములను, సంస్కరింపబడిన యూషములు మొదలగువానిని ఈయవలయును.

మూ॥ పీతౌషధస్య వేగానాం నిగ్రహాన్మారుతాదయః । కుపితా హృదయం గత్వా ఘోరం కుర్వన్తి హృద్గ్రహమ్ ॥ సహిక్కాశ్వాసపార్శ్వార్తిదైన్యలాలాక్షివిభ్రమైః । జిహ్వాం ఖాదతి నిఃసంజ్ఞో దన్తాన్కిటికిటాపయన్ ॥ స గచ్ఛేద్విభ్రమం తత్ర వామయేదాశు తం భిషక్ । మధురైః పిత్తమూర్చ్ఛార్తం కటుభిః కఫమూర్చ్ఛితమ్॥ పాచనీయైస్తతశ్చాస్య దోషశేషం విపాచయేత్ । కాయాగ్నిం చ బలం చాస్య క్రమేణాభివివర్ధయేత్ ॥70॥

అ॥ శోధనౌషధమును సేవించినవాడు వేగములను అరికట్టినచో వాతాదిదోషములు ప్రకోపించి హృదయమునుపొంది ఘోరమైనహృద్గ్రహమును కలిగించును. అప్పుడు ఎక్కిళ్ళు, శ్వాస, పార్శ్వములయందుబాధ, దైన్యము, చొల్లుకారుట, నేత్రములు తిరుగుట ఈలక్షణములతో కూడుకొని నాలుకను కొరుకుకొనుచు దంతములను కిటకిటలాడించుచు స్మృతిలేనివాడగును. అప్పుడు వైద్యుడు మోహము నొందకూడదు. అట్టిరోగికి వెంటనే వమనమును చేయింపవలయును. పిత్తాధిక్యము వలన మూర్ఛనొందిన యెడల మధురద్రవ్యములతోడను, కఫాధిక్యమువలన మూర్ఛనొందినయెడల కటుద్రవ్యములతోడను వమనమును చేయింపవలయును. పిమ్మట మిగిలిన దోషమును పాచనౌషధములచే పక్వముచేయవలయును. మరియు జాఠరాగ్నిని బలమును క్రమముగ వృద్ధినొందింపవలయును.

మూ॥ పవనేనాతివమతో హృదయం యస్య పీడ్యతే॥ తస్మై స్నిగ్ధామ్లలవణం దద్యాత్పిత్తకఫేఽన్యథా ॥76॥

అ॥ అధికముగ వమనములగుచున్నవానికి వాతము ప్రకోపించి హృదయమునందు పీడను కలిగించినచో స్నిగ్ధగుణమును అమ్లరసమును లవణరసమును కల ద్రవ్యముల నుపయోగింపవలయును. పిత్తకఫములు ప్రకోపించి హృదయపీడను కలిగించినచో వానికి విపరీతములైన ద్రవ్యముల నుపయోగింపవలయును.

మూ॥ పీతౌషధస్య వేగానాం నిగ్రహేణ కఫేన వాఽరుద్ధోఽతి చావిశుద్ధస్య గృహ్ణాత్యఙ్గాని మారుతః॥ స్తమ్భవేపథునిస్తోదసాదోద్వేష్టార్తి మూర్ఛితైః। తత్ర వాతహరం సర్వం స్నేహస్వేదాదికారయేత్॥

అ॥ శోధనౌషధమును సేవించినవాడు వేగములను అరికట్టుటచే గాని కఫముచే అరికట్టబడుటవలనగాని వాతము ప్రకోపించి బాగుగ శుద్ధినొందని యట్టివానియొక్క అవయవములను బిగపట్టి స్తంభించుట ఒణుకు సూదులతో పొడిచినట్లు బాధ కృశించుట బిగించినట్లు బాధ మూర్ఛ వీనిని కలిగించును. అప్పుడు స్నేహము స్వేదము మొదలగు వాతహరములైన క్రియలనన్నిటిని చేయింపవలయును.

మూ॥ అతితీక్ష్ణం మృదౌ కోష్ఠే లఘుదోషస్య భేషజమ్। దోషాన్ హృత్వా వినిర్మథ్య జీవం హరతి శోణితమ్॥ తేనాన్నం మిశ్రితం దద్యాద్వాయసాయ శునేఽపి వా। భుఙ్క్తే తచ్చేద్వదేజ్జీవం న భుఙ్క్తే పిత్తమాదిశేత్॥ శుక్లం వా భావితం వస్త్రమాతానం కోష్ణవారిణా। ప్రక్షాలితం వివర్ణం చేత్పిత్తం శుద్ధం తు శోణితమ్॥ తృష్ణా మూర్ఛామదార్తస్య కుర్యాదా మరణాత్క్రియామ్। తస్య పిత్తహరీం సర్వామతియోగే చ యా హితా॥ మృగగోమహిషాజానాం సద్యస్కం జీవతామసృక్। పిబేజ్జీవాభిసన్ధానం జీవం

తద్ధ్యాశు గచ్ఛతి॥ తదేవ దర్భమృదితం రక్తం వస్తిం ప్రదాపయేత్ । శ్యామాకాశ్మర్యబదరీదూర్వాప్వీరైః శృతం పయః ॥ ఘృతమణ్డాఞ్జనయుతం వస్తిం శీతం ప్రదాపయేత్ । పిచ్ఛావస్తిం సుశీతం వా ఘృతమణ్డానువాసనమ్ ॥85॥

అ॥ మృదుకోష్ఠముగలవానికి దోషము స్వల్పముగనున్నప్పుడు మిక్కిలి తీక్ష్ణమైన శోధనౌషధము నిచ్చినయెడల ఆయౌషధము దోషములనుహరించి జీవనాధారమైన రక్తమును కలతనొందించి బయలువెడలింపజేయును. బయలువెడలుచున్న ఆ రక్తమును అన్నముతోకలిపి కాకికిగాని కుక్కకుగాని పెట్టినయెడల అవి దానిని తినినచో అయ్యది జీవరక్తమనియు తినకున్నచో పిత్తయుక్తరక్తమనియు తెలిసికొనవలయును. మరియు ఆరక్తమునందు తెల్లనివస్త్రమునుతడిపి దానిని వేడినీటితోకడిగినయెడల అది వివర్ణముగనున్నచో పిత్తయుక్తరక్తమనియు స్వచ్ఛముగనైనచో జీవరక్తమనియు తెలిసికొనవలయును. అప్పుడు, తృష్ణారోగము మూర్ఛ మదాత్యయము వీనికి చెప్పబడిన చికిత్సను మరణపర్యంతము చేయింపవలయును మరియు పిత్తహరములైన సమస్తచికిత్సలను. శోధనాతియోగమునందు చెప్పబడిన సమస్తచికిత్సలను చేయింపవలయును. జీవించియున్న లేడి ఆవు దున్నపోతు మేక వీనియొక్క రక్తమును గ్రహించి వెంటనే జీవరక్తముకలుగుటకై మిత్తము ఇచ్చినచో అది శీఘ్రముగనే జీవరక్తముగ నగును. ఆజంతువులయొక్క రక్తమునందు దర్భవేళ్ళకల్కమును జేర్చి దానితో వస్తిని చేయింపవలయును. నల్లతెగడ పెద్దముష్టి రేగు గరికె వట్టివేళ్లు వీనితో కాచబడిన పాలయందు నేతిమీదితేట రసాంజనము వీనిని కలిపి చల్లగనున్న దానితో వస్తిని చేయింపవలయును లేక చల్లగనున్న పిచ్ఛావస్తినిగాని నేతిమీదితేటతో అనువాసనవస్తినిగాని చేయింపవలయును.

మూ॥ గుదభ్రంశం కషాయైశ్చ స్తమ్భయిత్వా ప్రవేశయేత్ । సామగన్ధర్వశబ్దాంశ్చ సంజ్ఞానాశేఽస్య కారయేత్ ॥86॥

అ॥ విరేచనములయొక్క అతియోగమువలన గుదప్రదేశము జారినచో కషాయరసముగలవానిచే స్తంభింపజేసి ప్రవేశపెట్టవలయును. స్మృతితప్పినయెడల ఓదార్పవలయును మరియు సంగీతమును వినిపింపవలయును.

మూ॥ యదా విరేచనం పీతం విదగ్ధమవతిష్ఠతే । వమనం భేషజాన్తం వా దోషానుత్క్లేశ్య నావహేత్ ॥ తదా కుర్వన్తి కణ్డ్వాదీన్దోషాః పరికుపితా గదాన్ । సవిభ్రంశానతస్తత్ర స్యాద్యథావ్యాధి భేషజమ్ ॥88॥

అ॥ విరేచనౌషధమువలన మలముమాత్రమును, వమనౌషధమువలన ఆయౌషధముమాత్రమును వెడలి కఫపిత్తములు వెడలకున్నచో దోషములు ఉత్క్లేశమును మాత్రము

పొంది బయలు వెడల నేరవు. అట్టి సమయమున ప్రకోపించిన యాదోషములు విభ్రంశముతో కూడిన దురద మొదలగు వ్యాధులను కలిగించును. అప్పుడు ఆయావ్యాధులకు తగిన చికిత్సలను చేయింపవలయును.

మూ॥ పీతం స్నిగ్ధేన సస్నేహం తద్దోషైర్మార్దవాద్వృతమ్ । న వాహయతి దోషాంస్తు స్వస్థానాత్తస్తమ్భయేచ్చ్యుతాన్ ॥ వాత సఙ్గ గుదస్తమ్భశూలైః క్షరతి చాల్పశః। తీక్ష్ణం వస్తిం విరేకం వా దద్యాల్లఙ్ఘన పాచనమ్ ॥90॥

అ॥ మిక్కిలి స్నిగ్ధుడుగ నున్నవాడు స్నేహయుక్తమైన విరేచనౌషధమును సేవించినయెడల ఆయౌషధము మృదుస్వభావము కలదగుటచే దోషములచే ఆవరింపబడి వానిని వెడలింపజేయజాలదు. మరియు వానిని స్వస్థానమునందు స్తంభింపజేయును. అపానవాతము బంధించుట, గుదప్రదేశము స్తంభించుట, గుదప్రదేశమునందు శూల ఈలక్షణములతో కూడి మలము కొద్దికొద్దిగ వెడలును. అప్పుడు తీక్ష్ణమైన వస్తినిగాని విరేచనౌషధమునుగాని ఈయవలయును. లంఘనమును చేయింపవలయును. పాచనౌషధమును ఈయవలయును.

మూ॥ రూక్షం విరేచనం పీతం రూక్షేణాల్పబలేన వా । మారుతం కోపయిత్వాఽఽశు కుర్యాద్ఘోరానుపద్రవాన్ ॥ స్తమ్భశూలాని ఘోరాణి సర్వగాత్రేషు మారుతః । స్నేహస్వేదాదికస్తత్ర కార్యో వాతహరో విధిః ॥92॥

అ॥ రూక్షుడుగ నున్నవానిచేగాని స్వల్పబలముగలవానిచేగాని రూక్షమైన విరేచనౌషధము సేవింపబడినయెడల అది వాతమును వెంటనే ప్రకోపింపచేసి ఘోరములైన ఉపద్రవములను కలిగించును. ప్రకోపించిన యావాతము సమస్తావయవముల యందును ఘోరములైన స్తంభము శూల వీనిని కలిగించును. అప్పుడు స్నేహము స్వేదము మొదలగు వాతహరములైన చికిత్సలను చేయింపవలయును.

మూ॥ స్నిగ్ధస్య గురుకోష్ఠస్య మృదూత్క్లేశ్యౌషధం కఫమ్ । పిత్తం వాతం చ సంరుధ్య సతన్ద్రాం గౌరవం క్లమమ్ ॥ దౌర్బల్యం సాఙ్గమర్దం చ కుర్యాదాశు తదుల్లిఖేత్ । లఙ్ఘనం పాచనం చాత్ర స్నిగ్ధే తీక్ష్ణం చ శోధనమ్ ॥94॥

అ॥ మిక్కిలి స్నిగ్ధుడుగనున్నవాడును గురుకోష్ఠముకలవాడును మృదువైనశోధనౌషధమును సేవించినయెడల ఆయౌషధము కఫమును పిత్తమును ఉత్క్లేశము నొందించి వాతమునరికట్టి బడలిక శరీరముబరువుగనుండుట పాలుమాలిక దౌర్బల్యము శరీరము కృశించుట వీనిని కలిగించును. అప్పుడు వెంటనే వమనమును చేయింపవలయును.

మరియు లంఘనమును చేయింపవలయును. పాచనౌషధముల నీయవలయును. స్నేహకర్మను చేయించి తీక్ష్ణమైన శోధనౌషధమును ఈయవలయును.

అధ్యాయసంగ్రహము.

మూ॥ ఇత్యేతా వ్యాపదః ప్రోక్తాః సరూపాః సచికిత్సితాః। వమనస్య విరేకస్య కృత స్యాకుశలైర్నృణామ్ ॥ ఏతాన్విజ్ఞాయ మతిమానవస్థాశ్చైవ తత్త్వతః। దద్యాత్సంశోధనం సమ్యగారోగ్యార్థం నృణాం సదా ॥96॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే సిద్ధిస్థానే వమనవిరేచనవ్యాపత్సిద్ధిర్నామ షష్ఠోఽధ్యాయః ॥

అ॥ ఈఅధ్యాయమునందు_నేర్పరులు కానివారిచే ప్రయోగింపబడిన వమనౌషధములవలనను విరేచనౌషధములవలనను కలుగు వ్యాపత్తులును, వానియొక్క లక్షణములును, చికిత్సలును చెప్పబడినవి. వీనిని అవస్థాభేదములను తెలిసికొని సరియైన ఆరోగ్యము కలుగునట్లుగ శోధనౌషధముల నియ్యవలయును.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు వమనవిరేచన వ్యాపత్సిద్ధి యనెడు షష్ఠాధ్యాయము సమాప్తము.

—0—

# సప్తమాధ్యాయము.

మూ॥ అథాతో వస్తివ్యాపదికీం సిద్ధిం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట వస్తివ్యాపదికీసిద్ధిని చెప్పబోవుచున్నాను.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ ధీధైర్యౌదార్యగామ్భీర్య క్షమాదమతపోనిధిమ్। పునర్వసుం శిష్యగణః పప్రచ్ఛ వినయాన్వితః ॥ కాః కతి వ్యాపదో వస్తేః కిం సముత్థాన లక్షణాః। కాశ్చికిత్సా ఇతి ప్రశ్నాఇచ్ఛ్రుత్వాతాన బ్రవీన్గురుః ॥4॥

అ॥ మేధాశక్తి ధైర్యము ఔదార్యము గాంభీర్యము ఓర్పు నియమము తపస్సు వీనికి నిధియైన పునర్వసునుగూర్చి శిష్యసముదాయము వినయముతో కూడినదై క్రింది విధముగ నడిగెను. సరిగ ప్రయోగింపబడనివస్తివలన ఏవ్యాపత్తులు కలుగును ? అవి ఎన్ని ? వానికి కారణములేవి ? లక్షణములేవి ? చికిత్సలేవి ? అని ప్రశ్నింపగా గురువు క్రిందివిధముగ చెప్పెను.

## వస్తివ్యాపత్తులు - వానియొక్క సంఖ్య - హేతువులు

మూ॥ నాతియోగౌ క్లమాధ్మానే హిక్కా హృత్ప్రాప్తి రూర్ధ్వతా । ప్రవాహికా శిరోఙ్గార్తిః పరికర్తః పరిస్రవః ॥ ద్వాదశ వ్యాపదో వస్తేరసమ్యగ్యోగసంభవాః । ఆసామేకైకశో రూపం చికిత్సాం చ నిబోధత ॥6॥

అ॥ అయోగము, అతియోగము, క్లమము, ఆధ్మానము, హిక్క, హృత్ప్రాప్తి, ఊర్ధ్వగమనము, ప్రవాహిక, శిరశ్శూల, అంగశూల, పరికర్తము, పరిస్రవము అనునీ పండ్రెండువ్యాపత్తులును వస్తియొక్క అసమ్యగ్యోగమువలన కలుగును. ప్రత్యేకముగ వీనియొక్క లక్షణములను చికిత్సలను చెప్పుచున్నాను.

## అయోగవ్యాపత్తుయొక్క లక్షణములు - చికిత్స.

మూ॥ గురుకోష్ఠేఽనిలప్రాయే రూక్షే వాతోల్బణేఽపి వా । శీతోఽల్పలవణస్నేహద్రవమాత్రో ఘనోఽపి వా ॥ వస్తిః సంక్షోభ్య తం దోషం దుర్బలత్వాదనిర్హరన్ । కరోతి గురుకోష్ఠత్వం వాతమూత్రశకృద్గ్రహాన్॥ నాభివస్తిరుజం దాహం హృల్లేపం శ్వయథుంగుదే। కణ్డూగణ్డాని వైవర్ణ్యమరుచిం వహ్నిమార్దవమ్ ॥ తతోష్ణాయాః ప్రమథ్యాయాః పానం స్వేదాః పృథగ్విధాః । ఫలవర్త్యోఽథవా కాలం జ్ఞాత్వా శస్తం విరేచనమ్ ॥ బిల్వమూలత్రివృద్దారుయవకోలకులత్థవాన్ ।సురాదిమూత్రవాన్ వస్తిః స ప్రాక్ప్రేషితమానయేత్॥

అ॥ గురుకోష్ఠముకలవానికిగాని వాతప్రధానునకుగాని రూక్షశరీరముకలవానికిగాని వాతాధిక్యముకలవానికిగాని ప్రయోగింపబడిన వస్తి శీతలముగగాని అల్పములైనసైంధవలవణము స్నేహము ద్రవముపరిమితి తక్కువకలదిగగాని చిక్కగ గానియున్నచో దుర్బలమైన ఆవస్తిదోషములను క్షోభనొందించి వానిని బయలువెడలింపచేయజాలక గురుకోష్ఠత్వము, వాతబంధము, మూత్రబంధము, మలబంధము, నాభియందును వస్తియందును బాధ, తాపము, హృదయముపూయబడినట్లుండుట, గుదప్రదేశమునందు వాపు, దురద, గ్రంథులు, వివర్ణత్వము, అరుచి, అగ్నిమాంద్యము వీనిని కలిగించును. అప్పుడు, ఉష్ణముగనున్న పాచనకషాయమును ఈయవలయును. అనేకవిధములైన స్వేదములను

చేయింపవలయును. ఫలవర్తులను ప్రయోగింపవలయును. లేక సమయమును తెలిసికొని విరేచనౌషధము నీయవలయును. మారేడువేళ్ళు తెగడ దేవదారు యవలు రేగు ఉలవలు వీనితోడను, సుర మొదలగుమద్యములు గోమూత్రము వీనితోడనుకూడిన వస్తిని ప్రయోగించి పూర్వమునందు ప్రయోగింపబడిన వస్తిని తీసి వేయవలయును.

## అతియోగవ్యాపత్తుయొక్క లక్షణములు - చికిత్స.

మూ॥ స్నిగ్ధస్విన్నేఽతితీక్ష్ణోష్ణో మృదుకోష్ఠేఽతియుజ్యతే। తస్య లిఙ్గాని చికిత్సాం చ శోధనాభ్యాం సమాచరేత్ ॥ పృశ్నిపర్ణీం స్థిరాం పద్మాం కాశ్మర్యం మధుకోత్పలమ్। పిష్ట్వా ద్రాక్షాం మధూకం చ క్షీరే తణ్డులధావనే॥ ద్రాక్షాయాః పక్వలోష్టస్య ప్రసాదో మధుకస్య చ । వినీయ సఘృతం వస్తిం దద్యాద్దాహేఽతియోగజే ॥14॥

అ॥ స్నేహస్వేదములను పొందినట్టియు మృదుకోష్ఠముకలిగినట్టియు మనుజునకు మిక్కిలి తీక్ష్ణముగను ఉష్ణముగనునున్న వస్తిని ప్రయోగించినచో అతియోగము కలుగును. అప్పుడు, వమనవిరేచనములయొక్క అతియోగమునందు చెప్పబడిన లక్షణములు కలుగును. వానియొక్క చికిత్సలనే చేయింపవలయును. అతియోగమునందు తాపము కలిగినచో ముయ్యాకుపొన్న కోలపొన్న పద్మములు తామరపువ్వు పెగ్గుమ్మడు అతిమధురము నల్లకలువ ద్రాక్షపండ్లు ఇప్ప వీనియొక్క కల్కమును పాలు బియ్యపు కడుగు ద్రాక్షపండ్లరసము కాల్చిన పెంకులు ముంచబడిననీళ్ళు అతిమధురరసము వీనియందు కలిపి నేతినికలిపి దానితో వస్తిని చేయింపవలయును.

## క్లమవ్యాపత్తుయొక్క లక్షణములు - చికిత్స.

మూ॥ ఆమదోషే నిరూహేణ మృదునా దోష ఈరితః। రుణద్ధి మార్గం వాతస్య హన్త్యగ్నిం మూర్ఛయత్యపి॥ క్లమం విదాహం హృచ్ఛూలం మోహవేష్టనగౌరవమ్। కుర్యాత్స్వేదైర్నిరూహైస్తం పాచనైశ్చాప్యుపాచరేత్ ॥ పిప్పలీ కత్తృణోశీరదారుమూర్వాశృతం జలమ్। పిబేత్సౌవర్చలోన్మిశ్రం దీపనం హృద్విశోధనమ్ ॥ వచానాగరశత్యేలాదధిమణ్డేన మూర్ఛితాః। పేయాః ప్రసన్నయా వా స్యురరిష్టేనాసవేన వా ॥ దారు త్రికటుకం పథ్యాం పలాశం చిత్రకం శటీమ్। పిష్ట్వా కుష్ఠం చ మూత్రేణ పిబేత్క్షారాంశ్చ దీపనాన్ ॥ వస్తిమస్య విదధ్యాచ్చ సమూత్రం దాశమూలికమ్ ॥ సమూత్ర మథవా వ్యక్త లవణం మాధుతైలికమ్ ॥20॥

అ॥ ఆమదోషమునందు మృదువైన నిరూహవస్తిని ఇచ్చినచో దోషములు ఉద్రేకమునొంది వాతముయొక్క మార్గమును అరికట్టి జాఠరాగ్నిని చెరచి మూర్ఛను కలిగించును. మరియు క్లమము అధికమైనతాపము హృదయశూల మోహము మెలివేయబడుచున్నట్లుండుట శరీరము బరువుగనుండుట వీనిని కలిగించును. అప్పుడు రూక్షస్వేదములను చేయించి పాచనౌషధముల నియ్యవలయును. పిప్పళ్ళు కామంచిపూరి వట్టివేళ్ళు దేవదారు చాగ వీనితో కాచబడిన కషాయమునందు సౌవర్చలలవణమునుకలిపి ఇచ్చినచో అగ్నిదీప్తిని కలిగించి హృదయమును శోధించును. వస శుంఠి కచోరములు ఏలకాయలు వీనియొక్క చూర్ణమును పెరుగుమీది తేటయందుగాని సుర యనెడి మద్యముయొక్క తేటయందుగాని అరిష్ట మనెడి మద్యమునందు గాని ఆసవ మనెడి మద్యమునందుగాని కలిపి పానము చేయింపవలయును. దేవదారు త్రికటుకములు కరక్కాయ మోదుగ చిత్రమూలము కచోరములు చెంగల్వకోష్టు వీనిని గోమూత్రముతో నూరి పానము చేయింపవలయును. మరియు దీపనములైన క్షారముల నియ్యవలయును. దశమూలములు గోమూత్రము వీనితోగూడిన వస్తినిగాని గోమూత్రముతోడను అధికమైన సైంధవలవణముచోడను కూడిన మాధుతైలికవస్తినిగాని చేయింపవలయును.

## ఆధ్మానవ్యాపత్తియొక్క లక్షణములు – చికిత్స.

మూ॥ అల్పవీర్యో మహాదోషే రూక్షే క్రూరాశయే కృతః । వస్తిర్దోషావృతో రుద్ధమార్గో రుద్ధ్వాత్సమీరణమ్ ॥ స విమార్గోఽనిలః కుర్యాదాధ్మానం మర్మపీడనమ్। విదాహం గురుకోష్ఠస్య ముష్కవఙ్క్షణ వేదనామ్ ॥ రుణద్ధి హృదయం శూలై రితశ్చేతశ్చ ధావతి । ఫలశ్యామాదిభిః కుష్ఠకృష్ణాలవణసర్షపైః ॥ ధూమనూమవచాకిణ్వ క్షారచూర్ణైర్గుడైః కృతామ్ । కరాఙ్గుష్ఠనిభాం వర్తిం యవమధ్యాం నిధాపయేత్ ॥ స్వభ్యక్తస్విన్నగాత్రస్య తైలాక్తాం స్నేహితే గుదే । అథవా లవణాగారధూమసిద్ధార్థకైః కృతామ్ ॥ బిల్వాదినా నిరూహః స్యాత్పీలుసర్షపమూత్రవాన్ । సరలామరదారుభ్యాం సిద్ధం చైవానువాసనమ్ ॥26॥

అ॥ అధికదోషములుకలిగినట్టియు రూక్షుడుగనున్నట్టియుక్రూరకోష్ఠముకలిగినట్టియు మనుజునకు స్వల్పశక్తిగలవస్తిని ప్రయోగించినయెడల ఆవస్తిదోషములచే ఆవరింపబడి అరికట్టబడినమార్గముకలదై వాతముయొక్క మార్గమును అరికట్టును. అప్పుడు వాతము ఇతరమార్గములనుపొందినదై మర్మములయందు బాధనుకలిగించునట్టి ఆధ్మానమును కలిగించును. గురుకోష్ఠముకలవానికి అధికమగుతాపమునుకలిగించును వృషణములయందును గజ్జలయందును బాధను కలిగించును. శూలలతోగూడి హృదయమును పొందును. శరీ

గములందంతటను తిరుగుచుండును. అప్పుడు మంగకాయలు తెగడ మొదలగువాని తోడను చెంగల్వకోష్టు పిప్పళ్లు సైంధవలవణము ఆవాలు వీనితోడను కరిధూపము మినుములు వస సురాబీజము యవక్షారము వీనితోడను బెల్లమునుచేర్చి చేతియొక్క బొటనవ్రేలు పరిమితిగ చేయబడినట్టియు మధ్యయందు యవచూర్ణమును కలిగినట్టియు వర్తులను తైలమునందు తడిపి వానిని, స్నేహస్వేదములుచేయింపబడినట్టివానియొక్క చమురు పూయబడిన గుదప్రదేశమునందు ప్రయోగింపవలయును. లేక సైంధవలవణము కరిధూపము తెల్లావాలు వీనితో చేయబడిన వర్తులను ప్రయోగింపవలయును. మారేడు వేళ్లు మొదలగువానితోడను కొండగోగు ఆవాలు గోమూత్రము వీనితోడను కూడిన నిరూహవస్తిని చేయింపవలయును. సరళదేవదారు దేవదారు వీనితో సిద్ధముచేయబడిన తైలముచే అనువాసనవస్తిని చేయింపవలయును.

## హిక్కావ్యాపత్తుయొక్క లక్షణములు - చికిత్స.

మూ॥ మృదుకోష్ఠేఽబలే వస్తిరతితీక్ష్ణోఽతినిర్హరన్ । కుర్యాద్ధిక్కాదికం తత్ర హిక్కాఘ్నం బృంహణం చ యత్ ॥ బలాస్థిరాది కాశ్మర్యత్రిఫలాగుడసైన్ధవైః । సుప్రసన్నారనాలామ్లైస్తైలం పక్త్వాఽనువాసయేత్ ॥ కృష్ణాలవణయోరక్షం పిబేదుష్ణాంబునా యుతమ్ । ధూమలేహరసక్షీరస్వేదాశ్చాన్నం చ వాతనుత్ ॥౭౯॥

అ॥ మృదుకోష్ఠముకలవానికిని దుర్బలుడుగనున్నవానికిని మిక్కిలితీక్ష్ణమైన వస్తిని ఇచ్చినయెడల ఆవస్తి దోషములను అధికముగ వెడలించి ఎక్కిళ్లు మొదలగు వానిని కలిగించును. అప్పుడు హిక్కానాశకమైనట్టియు బృంహణమైనట్టియు చికిత్సను చేయింపవలయును. ముత్తవపులగము హ్రస్వపంచమూలములు పెద్దుమ్మడు త్రిఫలములు బెల్లము సైంధవలవణము సురామద్యముయొక్క తేట ఆరనాళమనెడి మద్యము కాంజికము మొదలగుమద్యములు వీనితో తైలమును తయారుచేసి దానితో అనువాసనవస్తిని చేయింపవలయును. మరియు పిప్పళ్లు సైంధవలవణము వీనియొక్క చూర్ణమును కర్షపరిమితిగ గ్రహించి వేడినీటితోకలిపి పానముచేయింపవలయును. వాతనాశకములగు ధూమపానములు లేహములు మాంసరసములు పాలు స్వేదములు ఆహారములు వీనిని ఈయవలయును.

## హృత్ప్రాప్తివ్యాపత్తుయొక్క లక్షణములు - చికిత్స.

మూ॥ అతితీక్ష్ణః సవాతో వా న వా సమ్యక్ ప్రపీడితః । ఘట్టయేద్ధృదయం వస్తిస్తత్ర కాశకుశేత్కటైః ॥ స్యాత్తాన్సమ్లలవణస్కన్ధ శరీరబదరీఫలైః । శృతైర్వస్తిర్హితః సిద్ధం వాతఘ్నైశ్చానువాసనమ్॥

అ॥ మిక్కిలి తీక్ష్ణముగ నున్నట్టికాని వాతముతోఁ గూడినట్టికాని సరిగ నొక్కబడనట్టికాని వస్తి హృదయమును పొంది పీడించును. అప్పుడు కుశదర్భ రెల్లుదర్భ నీటిరెల్లు అమ్లద్రవ్యములు లవణస్కంధము వెదురుమొలకలు రేగుపండ్లు వీనియొక్క కషాయముతో వస్తిని చేయింపవలయును. వాతనాశక ద్రవ్యములతో తయారుచేయబడిన స్నేహములతో అనువాసనవస్తిని చేయింపవలయును.

### ఊర్ధ్వగమన వ్యాపత్తుయొక్క లక్షణములు – చికిత్స.

మూ॥ వాతమూత్రపురీషాణాం దత్తే వేగాన్నిగృహ్ణతః । అతిప్రపీడితో వస్తిర్ముఖేనాయాతి వేగవాన్ ॥ మూర్ఛావికారం తస్యాదౌ దృష్ట్వా శీతాంబునా ముఖమ్ । సిఞ్చేత్పార్శ్వోదరం చాధః ప్రమృజ్యాద్వీజయేచ్చ తమ్॥ కేశేష్వాకృష్య చాకాశే ధనుషా త్రాసయేచ్చ తమ్ । గోఖరాశ్వగజైః సింహై రాజప్రేష్యైస్తథోరగైః ॥ ఉల్కాభిరేవమన్యైశ్చ వస్తిమస్యానయేదధః। వస్త్రపాణిగ్రహైః కణ్ఠం రున్ధ్యాన్నం మ్రియతే తథా ॥ ప్రాణోదాననిరోధాద్ధి ప్రసిద్ధతరమార్గగః । అపానః పవనో వస్తిం తమాశ్వేవాపకర్షతి॥ తతః క్రముకకల్కం పాయయేతామ్లసంయుతమ్ । ఔష్ణ్యాత్తైక్ష్ణ్యాత్సరత్వాచ్చ వస్తిం చాస్యానులోమయేత్ ॥ పక్వాశయస్థితే స్విన్నే నిరూహో దాశమూలికః । యవకోలకులత్థైశ్చ విధేయో మూత్రసాధితః ॥ బిల్వాదిపఞ్చమూలేన సిద్ధో వస్తిరురఃస్థితే। శిరఃస్థే నావనం ధూమః ప్రచ్ఛాద్యం సర్షపైః శిరః ॥39॥

అ॥ వస్తిని ప్రయోగించినపుడు అపానవాతము మూత్రము పురీషము వీనియొక్క వేగమును అరికట్టినచో వస్తి మిక్కిలి పీడింపబడి వేగముతోఁ గూడినదై ముఖమునుండి బయలువెడలును. అట్టివానికి మొదట మూర్ఛకలిగినచో చన్నీటిని ముఖముమీద చల్లవలయును. పార్శ్వములమీదను ఉదరముమీదను హస్తములతో క్రిందకు రాయవలయును. మరియు వానికి వీచవలయును. జుట్టును పట్టుకొని ఎత్తి ధనుస్సు ఎద్దులు గాడిదలు గుఱ్ఱములు ఏనుగులు సింహములు రాజభటులు పాములు నిప్పుతోఁ గూడిన కట్టెలు వీనితోడను ఇట్టి ఇతరములతోడను భయపెట్టవలయును. ఇట్లుచేసి వస్తిని క్రిందికి దిగునట్లు చేయవలయును. వీనియొక్క కంఠమును వస్త్రములతోడను హస్తములతోడను బిగపట్టవలయును. అట్టిసమయమున మరణముకలుగకుండ చూడవలయును. అట్లు బిగపట్టినచో ప్రాణవాతమునకును ఉదానవాతమునకును నిరోధముకలుగుటవలన అపానవాతము తనయొక్క మార్గమును పొంది వెంటనే వస్తిని క్రిందికి ఆకర్షించును. పిమ్మట కర్ష పరిమితిగల పోకకాయల కల్కమును కాంజికము మొదలగు అమ్ల ద్రవ్యములలో

కలిపి ఇచ్చినయెడల అది ఉష్ణగుణమును తీక్ష్ణగుణమును, సరగుణమును కలదగుటవలన వస్తిని అనులోమమునొందించును. పక్వాశయమునుపొందినపుడు స్వేదకర్మను చేయించి దశమూలములు యవలు రేగుపండ్లు ఉలవలు గోమూత్రము వీనితో తయారుచేయబడిన నిరూహవస్తిని ఇయ్యవలయును. వక్షఃస్థలమునుపొందినపుడు మహాపంచమూలములతో తయారుకాబడినవస్తిని ఇయ్యవలయును. శిరస్సునుపొందినపుడు నస్యకర్మనుధూమపానమును చేయింపవలయును. మరియు ఆవాలకల్కమును శిరస్సునకు పూయవలయును.

## ప్రవాహికావ్యాపత్తుయొక్క లక్షణములు - చికిత్స.

మూ॥ స్నిగ్ధస్విన్నే మహాదోషే వస్తిర్మృద్వల్పభేషజః ।
ఉత్క్లేశ్యాల్పం హరేద్దోషం జనయేచ్చ ప్రవాహికామ్ ॥ శ్వయథుం
వస్తిపాయ్వోశ్చ జఙ్ఘోరుసదనం తథా । నిరుద్ధమారుతో జన్తురభీక్ష్ణం
సంప్రవాహతే॥ స్వేదాభ్యఙ్గాన్నిరూహాంశ్చ శోధనీయానులోమికాన్ ।
విదధ్యాల్లఙ్ఘయిత్వా తు వృత్తిః కుర్యాద్విరిక్తవత్ ॥42॥

అ॥ స్నేహస్వేదములను పొందినట్టియు అధికమైనదోషములు కలిగినట్టియు మనుజునకు మృదువైనట్టియు స్వల్పమైనట్టియు వస్తిని ఇచ్చినచో ఆవస్తి దోషములను ఉత్క్లేశమునొందించి కొద్దికొద్దిగ వెడలించుచు ప్రవాహికను కలిగించును. మరియు వస్తిప్రదేశమునందును గుదప్రదేశమునందును వాపును కలిగించును. పిక్కలను తొడలను కృశింపచేయును. అరికట్టబడినవాతముకల యా మనుజుడు దోషమును కొద్ది కొద్దిగ తఱుచు వెడలించును. అప్పుడు స్వేదములను, అభ్యంగములను, శోధింపచేయునట్టియు అనులోమమునుకలిగించునట్టియు నిరూహవస్తులను చేయింపవలయును. లంఘనమునుచేయించి, విరేచనకర్మచేయింపబడినవానికి చెప్పబడిన పేయాదిక్రమమునాచరింపవలయును.

## శిరశ్శూలవ్యాపత్తుయొక్క లక్షణములు - చికిత్స.

మూ॥ దుర్బలే తీవ్రదోషే చ క్రూరకోష్ఠే తనుర్మృదుః ।
శీతోఽల్పశ్చావృతో దోషైర్వస్తిస్తద్విహతోఽనిలః ॥ గాత్రాణ్యను
సరన్ మార్గే ఊర్ధ్వమూర్ధ్వం విధావతి । గ్రీవాం మన్యే చ గృహ్ణాతి
శిరః కణ్ఠం భినత్తి చ॥ బాధిర్యం కర్ణనాదం చ పీనసం నేత్రవిభ్ర
మమ్ । కుర్యాదభ్యఞ్జనం తైలలవణేన యథావిధి ॥ యుఞ్జ్యాత్ప్రధమ
నైర్నస్యైర్ధూమైరాస్యవిరేచనైః । తీక్ష్ణానులోమికేనాథ స్విన్నంభుక్తే
ఽనువాసయేత్ । విరేచనైర్నిరూహైశ్చ వస్తిభిశ్చానులోమికైః ॥47॥

అ॥ దుర్బలుడుగను తీవ్రమైన దోషములు కలవాడుగను క్రూరకోష్ఠము కల వాడుగను నున్న మనుజునకు పలుచగను మృదువుగను శీతలముగను స్వల్పముగను నున్న వస్తిని ఇచ్చినయెడల అవస్తి దోషములచే ఆవరింపబడును. దానిచే వాతము ప్రకోపింపచేయబడినదై ఆయామార్గములద్వారా సమస్తావయవములయందును సంచరించుచు ఊర్ధ్వముగ వ్యాపించి మెడను మెడకొంకులను బిగపట్టును. మరియు శిరస్సును కంఠమును భేదించును. చెముడు చెవులయందు ధ్వని పీనసము కండ్లు తిరుగుట వీనిని కలిగించును. అప్పుడు సైంధవలవణముతో కూడిన తైలముతో తగువిధమున అభ్యంగమును చేయింపవలయును. ప్రధమననస్యములను చేయింపవలయును. నోటియందలి దోషమును బయలువెడలించు ధూమపానములను చేయింపవలయును. ఆహారమునిచ్చి స్వేదకర్మను చేయించి తీక్ష్ణమైనట్టియు అనులోమమును కలిగించునట్టియు అనువాసనవస్తిని చేయింపవలయును. విరేచనౌషధములను అనులోమమును కలిగించు నిరూహవస్తులను ఇయ్యవలయును.

## అంగశూలవ్యాపత్తుయొక్క లక్షణములు - చికిత్స.

మూ॥ సుస్విన్న స్నిగ్ధదేహస్య యస్య వస్తిర్విధీయతే । అతితీక్ష్ణో గురుశ్చైవ సోఽతిమాత్రం ప్రవర్తయేత్ ॥ స్రుతేషు తస్య దోషేషు నిరూఢస్యాతి మాత్రశః । స్తబ్ధోదావృత్తకోష్ఠస్య వాయుః సంప్రతిహన్యతే ॥ విలోమన సముద్భూతో రుజత్యఙ్గాని దేహినః । గాత్రవేష్టననిస్తోదభేదస్ఫురణజృమ్భణైః ॥ తం తైలలవణాభ్యక్తం సేచయేదుష్ణవారిణా । ఏరణ్డపత్రనిష్క్వాథైః ప్రస్తరైశ్చోపపాదయేత్ ॥ యవాన్కులత్థాన్కోలాని పఞ్చమూలే తథోభయే । జలాఢకద్వయే పక్త్వా పాదశేషేణ తేన చ ॥ కుర్యాత్సబిల్వతైలోష్ణ లవణేన నిరూహణమ్ । నిరూహేణ సమాశ్వస్తం ద్రోణ్యాంతమవగాహయేత్ ॥ తతో భుక్తవతస్తస్య కారయేదనువాసనమ్ । యష్టీమధుకతైలేన బిల్వతైలేన వా భిషక్ ॥54॥

అ॥ స్నేహస్వేదములు బాగుగ చేయింపబడినవానికి మిక్కిలి తీక్ష్ణమైనట్టియు గురుగుణము కలిగినట్టియు వస్తిని ఉపయోగించినచో దోషములు అధికముగ వెడలును. నిరూహవస్తివలన అధికముగ స్రవించిన దోషములు కలిగినట్టియు స్తబ్ధముగను ఉదావర్తముతో కూడినదిగను నున్న కోష్ఠము కలిగినట్టియు మనుజునకు వాతము ప్రకోపించి విలోమగతి నొందినదై అవయవములయందు నులిమివేయబడినట్లుండుట సూదులతో పొడవబడినట్లుండుట బ్రద్దలుకొట్టబడుచున్నట్లుండుట తోలవబడుచున్నట్లుండుట పగులకొట్టబడుచున్నట్లుండుట అనెడి బాధలను కలిగించును. అట్టివానికి సైంధవలవణముతో కూడిన తైలమునుపూసి వేడినీటితోడను ఆముదపాకుల కషాయము తోడను కడుగవలయును. ప్రస్తరస్వేదమును చేయింపవలయును. యవలు ఉలవలు

రేగుపండ్లు మహాపంచమూలములు హ్రస్వపంచమూలములు వీనిని రెండాఢకముల నీటి యందు నాల్గవవంతు మిగులునట్లు కాచి యాకషాయమునందు బిల్వతైలమును సైంధవ లవణమును కలిపి సుఖోష్ణముగనున్న దానితో నిరూహవస్తిని చేయింపవలయును. నిరూహవస్తిచే ఉపచరింపబడినవానికి నీటితొట్టియందు అవగాహ స్నానమును చేయింపవలయును. పిమ్మట ఆహారమునిచ్చి అతిమధుర తైలముతోగాని బిల్వతైలముతోగాని అనువాసనవస్తిని చేయింపవలయును.

## పరికర్తవ్యాపత్తుయొక్క లక్షణములు - చికిత్స.

మూ॥ మృదుకోష్ఠాల్పదోషస్య రూక్షతీక్ష్ణోఽతిమాత్రవాన్ । వస్తిర్దోషాన్నిరస్యాశు జనయేత్పరికర్తికామ్ ॥ త్రికవఙ్క్షణవస్తీనాం తోదం నాభేరధో రుజమ్ । విబన్ధాల్పాల్పముత్థానం గుదనిర్లేఖనం భవేత్ ॥ స్వాదుశీతౌషధైస్తత్ర పయ ఇక్ష్వాదిభిః శృతమ్ । యష్ట్యాహ్వాతిలకల్కాభ్యాం వస్తిః స్యాత్క్షీరభోజినః॥ ససర్జరసయష్ట్యాహ జిఙ్గిసీకర్దమాఞ్జనమ్। విసీయ దుగ్ధే వస్తిః స్యాత్తిక్తామ్ల మృదుభోజినః ॥58॥

అ॥ మృదుకోష్ఠమును అల్పదోషమును కలవానికి రూక్షముగను తీక్ష్ణముగను అధికపరిమితిగను నున్న వస్తిని ఇచ్చినచో ఆవస్తిదోషములను వెంటనే వెడలించి పరికర్తిక యనెడి బాధను కలిగించును. అట్టిసమయమున త్రికప్రదేశము గజ్జలు వస్తిప్రదేశము నాభియొక్క క్రిందిభాగము వీనియందు బాధజనించును. మలముబంధముతో కొద్దికొద్దిగ వెడలును. గుదప్రదేశమునందు గీయుచున్నట్లు బాధ కలుగును. అప్పుడు పాలను ఆహారముగనిచ్చి మధురద్రవ్యములతోడను శీతలద్రవ్యములతోడను ఇక్ష్వాది గణముతోడను కాచబడిన పాలయందు అతిమధురముయొక్కయు నువ్వులయొక్కయు కల్కమును చేర్చి దానితో వస్తిని చేయింపవలయును. తిక్తద్రవ్యములతోడను ఆమ్లద్రవ్యములతోడను కూడిన మృదువైన ఆహారమునిచ్చి సర్జరసము అతిమధురము గిలిగిరింత కృష్ణాగరు రసాంజనము వీనితోకూడిన పాలచే వస్తిని ప్రయోగింపవలయును.

## పరిస్రావవ్యాపత్తుయొక్క లక్షణములు - చికిత్స.

మూ॥ పిత్తరక్తేఽమ్లఉష్ణో వా తీక్ష్ణో వా లవణోఽథవా। వస్తిర్గుదం విలిఖతి తీక్ష్ణోఽతివిదహత్యపి ॥ స విదగ్ధః స్రవత్యస్రం పిత్తం చానేకవర్ణవత్ । బహుధా హ్యతివేగేన మోహం గచ్ఛతిచాసకృత్ ॥ ఆర్ద్రశాల్మలివృన్తైస్తు క్షుణ్ణైరాజం పయః శృతమ్ । సర్పిషా యోజితం శీతం వస్తిమస్మై ప్రదాపయేత్ ॥ వటాదిపల్లవేష్వేష కల్పో యవతిలేషు చ । సువర్చలోపోదికయోః కచ్ఛుదారే చ శస్యతే ॥ గుదే

సేకాః ప్రదేహాశ్చ శీతాః స్యుర్మధురాశ్చ యే। రక్తపిత్తాతిసారఘ్నీ క్రియా చాత్ర ప్రశస్యతే ॥66॥

అ॥ పిత్తమును రక్తమును దుష్టినొందినపుడు అమ్లప్రధానమైనట్టికాని ఉష్ణమైనట్టికాని తీక్ష్ణమైనట్టికాని లవణప్రధానమైనట్టిగాని వస్తిని ఇచ్చినయెడల ఆవస్తి గుదప్రదేశమునందు విదారణమును కలిగించును. తీక్ష్ణమైనవస్తి మిక్కిలి దాహము నొందించును. విదగ్ధములైన రక్తమును పిత్తమును అనేకవర్ణములతో కూడి మిక్కిలివేగముతో చాలసారులు బయలువెడలును. అట్టి మనుజుడు తరుచు మోహమునొందును. అప్పుడు, బూరుగపువ్వులయొక్క పచ్చిత్రొడిమలను నలియకొట్టి మేకపాలతో కాచి యందు నేతినికలిపి చల్లగనున్న దానితో వస్తిని చేయింపవలయును. ఇట్టి కల్పనను మట్టి మొదలగువానియొక్క చిగుళ్ళు, యవలు, నువ్వులు, చెంచలికూర, బచ్చలికూర, దేవకాంచనము వీనిలో దేనితోనైనను తయారుచేసి దానితో వస్తిని ప్రయోగించుట శ్రేష్ఠముగ నుండును. గుదప్రదేశమునందు శీతలములైనట్టియు మధురద్రవ్యములతో కూడినట్టియు ద్రవ్యములతో సేకములను లేపములను చేయింపవలయును. రక్తపిత్తమును అతిసారమును నశింపచేయు చికిత్సను చేయింపవలయును.

## అధ్యాయ సంగ్రహము.

మూ॥ ఇత్యేతా వ్యాపదః ప్రోక్తా వస్తేః సాకృతి భేషజాః। బుద్ధ్వా కార్త్స్న్యేన తాన్ వస్తీన్నియుఞ్జన్నాపరాధ్యతి॥ తీక్ష్ణత్వం మూత్రపీల్వగ్నిలవణక్షారసర్షపైః। ప్రాప్తకాలం విధాతవ్యం క్షీరాద్యైర్మార్దవం తథా॥ ఆపాదతల మూర్ధస్థాన్ దోషాన్ పక్వాశయేస్థితః। వీర్యేణ వస్తిరాదత్తే ఖస్థోఽర్కో భూరసానివ ॥ యద్వత్కుసుమ్భసంమిశ్రాత్తోయాద్రాగం హరేత్పటః। తద్వద్ద్రవీకృతాత్కాయాన్నిరూహో నిర్హరేన్మలాన్ ॥67॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే సిద్ధిస్థానే వస్తివ్యాపదికీ సిద్ధిర్నామ సప్తమోఽధ్యాయః ॥

అ॥ ఈఅధ్యాయమునందు సరిగ ప్రయోగింపబడని వస్తివలనకలుగు వ్యాపత్తులును, వానియొక్క లక్షణములును, చికిత్సలును చెప్పబడినవి. వీనిని పూర్తిగ తెలిసికొని వస్తులను ప్రయోగించినచో పొరపాటును పొందడు. గోమూత్రము కొండగోగు చిత్రమూలము సైంధవలవణము యవక్షారము ఆవాలు వీనితో వస్తికి తీక్ష్ణత్వము కలుగును. పాలు మొదలగువానితో వస్తికి మృదుత్వము కలుగును. పక్వాశయమునందున్న వస్తి పాదము మొదలుకొని శిరస్సువరకునునున్న దోషములను 'ఆకాశమునందున్న సూర్యుడు

భూమియందలి రసములచవలె' తనయొక్క శక్తిచేఆకర్షించును. కుంకుమపువ్వుతో కూడిన జలమునుండి రంగును వస్త్రము హరించువిధమున, ద్రవీభూతముగనున్న శరీరమునుండి దోషములను వస్తి హరించును.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామకకృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడు చరకసంహితా వ్యాఖ్యానమునందు వస్తివ్యాపదికీసిద్ధి యనెడు సప్తమాధ్యాయము సమాప్తము.

—:0:—

# అష్టమాధ్యాయము.

మూ॥ అథాతః ప్రాసృతయోగికాం సిద్ధిం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట ప్రాసృతయోగికసిద్ధిని చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ అథేమాన్సు కుమారాణాం నిరూహాన్ స్నేహనాన్మృదూన్ । కర్మణా విప్లుతానాం చవక్ష్యామి ప్రసృతైః పృథక్ ॥3॥

అ॥ సుకుమారులకును కర్మలచే బడలికనొందినవారలకును మృదువులైన నిరూహవస్తులను అనువాసనవస్తులను ప్రసృతపరిమాణములతో ప్రత్యేకముగ చెప్పుచున్నాము.

మూ॥ క్షీరాద్ద్వౌప్రసృతౌ కార్యోమధుతైలఘృతాత్త్రియః । ఖజేన మథితో వస్తిర్వాతఘ్నో బలవర్ణకృత్ ॥ ఏకైకః ప్రసృతస్తైల ప్రసన్నాక్షౌద్ర సర్పిషామ్ । బిల్వాదిమూలక్వాథాద్ద్వౌ కౌలత్థాద్ద్వౌ స వాతనుత్ ॥ పఞ్చమూలరసాత్పఞ్చ ద్వౌతైలాత్ క్షౌద్రసర్పిషోః । ఏకైకః ప్రసృతో వస్తిః స్నేహనీయోఽనిలాపహః ॥6॥

అ॥ పాలను రెండుప్రసృతములుగను తేనె తైలము ఘృతము వీనిని ఒక్కొక్క ప్రసృతముగను గ్రహించి కరిబెతో కలియత్రిప్పి దీనితో వస్తిని చేయించినయెడల వాతమును పోగొట్టును. బలమును వర్ణమును కలిగించును. తైలము సురామద్యముయొక్క తేట తేనె నెయ్యి వీనిని ప్రత్యేకముగ ఒకొక్క ప్రసృతముగను దశమూలకషాయమును రెండుప్రసృతములుగను ఉలవలకషాయమును రెండుప్రసృతములుగను గ్రహించి దీనితో వస్తిని చేయించినయెడల వాతము నశించును. పంచమూలకషాయ

మును అయిదు ప్రసృతములుగను తైలమును రెండు ప్రసృతములుగను తేనెను ఒక ప్రసృతముగను ఘృతమును ఒక ప్రసృతముగను గ్రహించి దీనితో వస్తిని చేయించినయెడల స్నైగ్ధ్యమును కలిగించును. వాతమును పోగొట్టును.

మూ॥ సైన్ధవార్ధాక్ష ఏకైకః క్షౌద్రతైలపయోఘృతాత్ । ప్రసృతో హపుషాఖ్యాచ్చ నిరూహః శుక్రకృత్పరః॥ పటోలనిమ్బభూనిమ్బరాస్నాసప్తచ్ఛదామ్భసః। చత్వారః ప్రసృతా ఏకోఘృతాత్సర్షప కల్కితః॥ నిరూహః పఞ్చతిక్తోఽయం మేహాభిష్యన్దకుష్ఠనుత్ । విడఙ్గ త్రిఫలాశిగ్రుఫలముస్తాఖుపర్ణికాత్ ॥ కషాయాత్ప్రసృతాః పఞ్చతైలాదేకో విమథ్య తాన్ । విడఙ్గపిప్పలీకల్కో నిరూహః క్రిమినాశనః ॥ పయస్యేక్షుస్థిరారాస్నావిదారీక్షౌద్రసర్పిషామ్ ॥ ఏకైకః ప్రసృతో వస్తిః కృష్ణాకల్కో వృషత్వకృత్॥ చత్వారస్తైలగోమూత్రదధిమణ్డామ్లకాఞ్జికాత్। ప్రసృతాః సర్షపైః పిష్టైర్వస్తిః సజ్ఞానాహభేదనః॥ శ్వదంష్ట్రాశ్మభిదేరణ్డరసాత్తైలాత్సురాసవాత్ । ప్రసృతాః పఞ్చ యష్ట్యాహ్వకౌన్తీ మాగధికా సితా ॥ కల్కో వస్తిస్తు సానాహే మూత్రకృచ్ఛ్రే పరో మతః ॥ ౧౩॥

అ॥ సైంధవలవణమును అర్ధకర్ష పరిమితిగను తేనె తైలము పాలు నెయ్యి వీనిని ప్రత్యేకము ఒక్కొక్క ప్రసృతముగను బోడతరకషాయమును రెండు ప్రసృతములుగను గ్రహించి దీనితో నిరూహవస్తిని చేయించినయెడల శుక్రమును వృద్ధినొందించును. చేదుపొట్ల వేప నేలవేము సన్నరాస్నము ఏడాకులఅరటి వీనియొక్క కషాయమును నాలుగు ప్రసృతములుగను ఘృతమును ఒక ప్రసృతముగను గ్రహించి అందు ఆవాల కల్కమును కలిపి దీనితో నిరూహవస్తిని చేయించినయెడల ప్రమేహములు అభిష్యందము కుష్ఠములు వీనిని నశింపచేయును. ఇది పంచతిక్తనిరూహవస్తియని చెప్పబడును. వాయువిడంగములు త్రిఫలములు మునగ ముంగకాయలు తుంగగడ్డలు దంతి వీనియొక్క కషాయమును అయిదు ప్రసృతములుగను తైలమును ఒక ప్రసృతముగను కలిపి బాగుగ మథించి అందు వాయువిడంగములు పిప్పళ్ళు వీనియొక్క కల్కమును చేర్చి దీనితో నిరూహవస్తిని చేయించినయెడల క్రిములు నశించును. క్షీరకాకోళి చెఱకు మయ్యాకుపొన్న సన్నరాస్నము నేలగుమ్మడి వీనియొక్క కషాయములను ఒక్కొక్క ప్రసృతముగను తేనెను ఒకప్రసృతముగను ఘృతమును ఒకప్రసృతముగను గ్రహించి అందు పిప్పళ్ళయొక్క కల్కమును చేర్చి దీనితో నిరూహవస్తిని చేయించినయెడల శుక్రవృద్ధిని చేయును. తైలము గోమూత్రము పెరుగుమీది తేటఅమ్లకాంజికము వీనిని నాలుగు ప్రసృతములుగ గ్రహించి అందు ఆవాలయొక్క కల్కమును చేర్చి దీనితో నిరూహవస్తిని చేయించినయెడల మలబంధమును ఆనాహమును నశిం

చును. పల్లేరుకషాయము కొండపిండికషాయము ఆముదపువేళ్ళ కషాయము తైలము సురతో తయారుచేయబడిన ఆసవము ఈ అయిదింటిని ఒక్కొక్క ప్రసృతముగ గ్రహించి అందు అతిమధురము రేణుకలు పిప్పళ్ళు పంచదార నేతియొక్క కల్కమును చేర్చి దీనితో నిరూహవస్తిని చేయించినయెడల ఆనాహమును మూత్రకృచ్ఛ్రమును నశించును.

మూ॥ ఏతే సలవణాః కోష్ణా నిరూహాః ప్రసృతా నవ ॥14॥

అ॥ పైనచెప్పబడిన తొమ్మిదివిధములగు నిరూహవస్తులయందును సైంధవలవణమునుచేర్చి వానిని గోరువెచ్చగనున్నప్పుడు ప్రయోగింపవలయును.

మూ॥ మృదువస్తౌ జడేభూతే తీక్ష్ణోఽన్యో వస్తిరిష్యతే । తీక్ష్ణైర్వ్యాఽర్దితే స్వాదు ప్రత్యాస్థాపనమిష్యతే ॥15॥

అ॥ మృదువైనవస్తిని ఉపయోగించినప్పుడు ఆవస్తి జడత్వమునుపొందినచో అప్పుడు తీక్ష్ణమైన ఇతరవస్తిని ప్రయోగింపవలయును. తీక్ష్ణమైనవస్తిచే అతియోగము కలిగినయెడల అప్పుడు మధురరసముకల ద్రవ్యములతో సిద్ధముచేయబడిన ఆస్థాపనవస్తిని చేయింపవలయును.

మూ॥ వాతోపసృష్టస్యోష్ణైః స్యుర్గుదదాహాదయో యది । ద్రాక్షాంబునా త్రివృత్కల్కం దద్యాద్దోషానులోమనమ్ ॥ తద్ధి పిత్తశకృద్వాతాన్ హృత్వా దాహాదికాఞ్జయేత్ ।శుద్ధశ్చాపి పిబేచ్ఛీతాం యవాగూం శర్కరాయుతామ్॥అథవాఽతివిరిక్తః స్యాత్క్షీణవిట్కః స భక్షయేత్ । మాషయూషేణకుల్మాషాన్పిబేద్దధ్యథవా సురామ్ ॥18॥

అ॥ వాతముతోకూడినవానికి ఉష్ణములైనవస్తులను ప్రయోగించుటవలన గుదప్రదేశమునందు తాపము, మోహము మొదలగునవి కలిగినయెడల ద్రాక్షరసముతో త్రివృత్కల్కమును ఇచ్చినచో దోషములకు అనులోమనమునుకలిగించి పిత్తమును మలమును వాతమును హరింపచేసి తాపము మొదలగువానిని శమింపచేయును. శుద్ధుడైనపిదప శీతలమైనట్టియు పంచదారతోకూడినట్టియు యవాగువును పానముచేయవలయును. విరేచనములధికముగనగుటవలన మలముక్షీణించినచో అలచందలను మినపకట్టుతో తీయవలయును. లేక పెరుగును గాని సురయనెడిమద్యమును గాని ఈయవలయును.

మూ॥ సామం చేదతిసార్యేత శూలానాహచకవాన్నరః । స తదా హపుషాకుష్ఠనతదారువచాః పిబేత్ ॥ శకృద్వాతమసృక్పిత్తం కఫం వా యోఽతిసార్యతే । పక్వస్తతః స్వవర్గీయైర్వస్తిః శ్రేష్ఠం భిషగ్జితమ్॥ షణ్ణామేషాం ద్విసంసర్గాత్త్రింశద్భేదా భవన్తి తే । కేవలైః

సహ చేత్త్రింశద్విద్యాత్సోపద్రవానపి ॥ శూలప్రవాహికాధ్మాన పరికర్త్యరుచిజ్వరాన్ । సతృష్ణాదాహమూర్ఛాన్తాంశ్చైషాం విద్యాదుపద్రవాన్ ॥2:॥

అ॥ ఆమముతో కూడిన అతిసారముగా కలిగియుండి శూల అరోచకము వీనితో కూడిన మనుజునకు బోడతరము చెంగల్వకోష్టు గ్రంథితగరము దేవదారు వస వీని యొక్క కషాయమును పానము చేయింపవలయును. పురీషము వాతము రక్తము పిత్తము కఫము వీనిలో దేనినైనను గుదమార్గమున వెడలించుచున్నచో అప్పుడు ఆయా దోషనాశకములుగ చెప్పబడిన ద్రవ్యములతో సిద్ధముచేయబడిన వస్తిని ప్రయోగించుట శ్రేష్ఠమైన చికిత్సగ నుండును. ఆమము మలము వాతము మొదలగు ఈ ఆరును ప్రత్యేక భేదములచేతను రెండేసి కలియుటవలనను ఉపద్రవములతోడను ముప్పదివిధములుగ నుండును. శూల ప్రవాహిక ఆధ్మానము పరికర్తికము అరుచి జ్వరము దప్పిక తాపము మూర్ఛ ఈ తొమ్మిదియు ఉపద్రవములుగ నుండును.

మూ॥ తత్రామే వమనం కార్యం వ్యోషామ్లలవణైర్యుతమ్ । పాచనం శస్యతే వస్తిరామే హి ప్రతిషిధ్యతే ॥ వాతఘ్నగ్రాహివర్గైర్వస్తిః శకృతి శస్యతే । స్వాద్వమ్లలవణైః శస్తః స్నేహవస్తిః సమీరణే ॥ రక్తే రక్తేన పిత్తే తు కషాయస్వాదుతిక్తకైః । సార్యమాణే కఫే వస్తిః కషాయకటుతిక్తకైః ॥ శకృతా వాయునా చామే తేన వర్చస్యథానిలే । సంసృష్టేఽన్తరపానం స్యాద్వ్యోషామ్లలవణైర్యుతమ్ ॥ పిత్తేనామేఽసృజా వాపి తయోరామేన వా పునః । సంసృష్టయోర్భవేత్పానం సవ్యోషకటుతిక్తకమ్ ॥ తథాఽఽమే కఫసంసృష్టే కషాయవ్యోషతిక్తకమ్ । ఆమే తనుకఫే వ్యోషకషాయలవణైర్యుతమ్ ॥ వాతేన విషి పిత్తే వా విట్పిత్తాస్రైస్తథాఽనిలే ॥ మధురామ్లకషాయః స్యాత్సంసృష్టే వస్తిరుత్తమః ॥ శకృచ్ఛోణితయోః పిత్తశకృతో రక్తపిత్తయోః । వస్తిరన్యోన్యసంసర్గే కషాయస్వాదుతిక్తకః ॥ కఫేన విషి పిత్తే వా కఫే విట్పిత్తశోణితైః । వ్యోషతిక్తకషాయః స్యాత్సంసృష్టే వస్తిరుత్తమః ॥ స్వాద్వస్తిర్వ్యోషశీతామ్లః సంసృష్టే వాయునా కఫే। మధురవ్యోషతిక్తస్తు రక్తే కఫవిమిశ్రితే ॥ మారుతే కఫసంసృష్టే వ్యోషామ్లలవణో భవేత్ । వస్తిర్వాతేన రక్తే తు కార్యః స్వాద్వమ్లతిక్తకః ॥ త్రిచతుష్పఞ్చషట్సంసర్గానేవమేవ వికల్పయేత్ । యుక్తిజ్ఞశ్చాతిసారోక్తం సర్వాగ్నే

ష్వపి స్మృతా ॥ యుగపత్షడ్రసం షణ్ణాం సంసర్గే పాచనం భవేత్ ।
నిరామాణాం చ పక్వానాం వస్తిః షాడ్రసికో మతః ॥35॥

అ॥ గుదమార్గమున ఆమము తరుచు వెడలుచున్నచో త్రికటుకములు అమ్లద్రవ్యములు లవణములు వీనితోకూడిన వమనౌషధమును ఈయవలయును. పాచనౌషధముల నీయవలయును. అప్పుడు వస్తిని ఈయకూడదు. పురీషము వెడలుచున్నప్పుడు వాతనాశకములును గ్రాహికశక్తికలవిగ చెప్పబడినవియైనగు ద్రవ్యములతో తయారుచేయబడిన వస్తిని ఈయవలయును. వాతము వెడలుచున్నప్పుడు మధురామ్ల లవణరసములుకల ద్రవ్యములతో తయారుచేయబడిన అనువాసనవస్తిని చేయింపవలయును. రక్తము వెడలుచున్నప్పుడు రక్తముతో వస్తిని చేయింపవలయును. పిత్తము వెడలుచున్నప్పుడు కషాయ స్వాదుతిక్తరసములుకల ద్రవ్యములతో సిద్ధముచేయబడిన వస్తిని చేయింపవలయును. కఫము వెడలుచున్నప్పుడు కషాయ కటుతిక్తరసములుకల ద్రవ్యములతో సిద్ధముచేయబడిన వస్తిని చేయింపవలయును. ఆమము పురీషముతోగాని వాతముతోగాని కలిసి వెడలుచున్నప్పుడును పురీషముగాని వాతముగాని ఆమముతో కలిసి వెడలుచున్నప్పుడును త్రికటుకములు అమ్లద్రవ్యములు లవణములు వీనితోకూడిన పానము నీయవలయును. ఆమము పిత్తముతోగాని రక్తముతోగాని కలిసి వెడలుచున్నపుడును పిత్తముగాని రక్తముగాని ఆమముతో కలిసి వెడలుచున్నప్పుడును త్రికటుకములు కటురసద్రవ్యములు తిక్తరసద్రవ్యములు వీనితోకూడినపానము నీయవలయును. ఆమము కఫముతోకూడి వెడలుచున్నప్పుడు కషాయరసముకల ద్రవ్యములు త్రికటుకములు తిక్తరసముకల ద్రవ్యములు వీనితోకూడిన పానము నీయవలయును. ఆమము స్వల్పమైన కఫముతోకూడి వెడలుచున్నప్పుడు త్రికటుకములు కషాయరసముకల ద్రవ్యములు లవణములు వీనితోకూడిన పానము నీయవలయును. పురీషముగాని పిత్తముగాని వాతముతోకూడి వెడలుచున్నప్పుడును వాతము పురీషముతోగాని రక్తముతోగాని కలిసి వెడలుచున్నప్పుడును మధురామ్ల కషాయరసములుకల ద్రవ్యములతో తయారుచేయబడిన వస్తినీయవలయును. పురీషము రక్తము ఇవిగాని పిత్తము పురీషము ఇవిగాని రక్తము పిత్తము ఇవిగాని పరస్పరముకలిసిబయలు వెడలుచున్నపుడు కషాయ మధురతిక్తరసములుకల ద్రవ్యములతో తయారుచేయబడిన వస్తి నీయవలయును. పురీషముగాని పిత్తముగాని కఫముతోకూడి వెడలుచున్నప్పుడును కఫము పురీషముతోగాని పిత్తముతోగాని రక్తముతోగాని కలిసి వెడలుచున్నప్పుడును త్రికటుకములు తిక్తరసములుకల ద్రవ్యములు కషాయరసముకల ద్రవ్యములు వీనితో తయారుచేయబడిన వస్తిని ఈయవలయును. కఫము వాతముతో కలిసి వెడలుచున్నప్పుడు త్రికటుకములు తిక్తరసముకల ద్రవ్యములు అమ్లరసముకల ద్రవ్యములు వీనితోతయారుచేయబడిన వస్తిని ఈయవలయును. రక్తము కఫముతోకూడి వెడలుచున్నప్పుడు మధురరసముకల ద్రవ్యములు త్రికటుకములు తిక్తరసముకల ద్రవ్యములు వీనితో తయారుచేయబడిన వస్తిని ఈయవలయును. వాతము కఫముతోకూడి వెడలుచున్నపుడు త్రికటుకములు అమ్లద్రవ్యములు లవణములు వీనితో తయారుచేయబడిన వస్తిని ఈయవల

యును. రక్తము వాతముతోఁగూడి వెడలున్నప్పుడు మధుర అమ్లతిక్తరసములుకల ద్రవ్యములతోఁ తయారుచేయబడిన వస్తిని ఈయవలయును. ఆమము పురీషము మొదలగు ఆరును రెండేసిగఁ గలిసినప్పుడు కలుగు వికల్పనలు చెప్పబడినవి. ఇటులనే మూడేసికాని నాలుగేసికాని అయిదేసికాని ఆరింటిని గాని కలుపుకొని వికల్పనలను కల్పించుకొనవలయును. అతిసారమునందు చెప్పబడిన ఈయుక్తి ననుసరించియే సర్వరోగముల యందును వికల్పనలను కల్పించుకొనవచ్చును. ఆమము మొదలగు ఆరును కలిసి వెడలుచున్నప్పుడు ఆరురసముల నుపయోగింపవలయును. ఆమముగాక మిగిలిన అయిదును కలిసి వెడలుచున్నప్పుడు మధురము మొదలగు ఆరురసములును గల ద్రవ్యములతోఁ తయారుచేయబడిన వస్తిని ఈయవలయును.

మూ॥ ఉదుమ్బరశలాటూని జమ్బ్వామ్రోదుమ్బరత్వచః। శఙ్ఖం సర్జరసం లాక్షాం కర్దమం చ ప్రియంగుకామ్॥ పిష్ట్వా తైః సర్పిషః ప్రస్థం క్షీరద్విగుణితం పచేత్। అతీసారేషు సర్వేషు పేయమేతద్యథాబలమ్॥ కచ్ఛురాధాతకీబిల్వసమఙ్గారక్తశాలిభిః। మసూరాశ్వత్థశుఙ్గైశ్చ యవాగూః స్యాజ్జలే శృతైః॥ బాలోదుమ్బరకట్వఙ్గసమఙ్గాప్లక్షపల్లవైః। మసూరధాతకీపుష్పబలాభిశ్చ తథా భవేత్॥ స్థిరాదీనాం బలాదీనామిక్ష్వాదీనామథాపి వా। క్వాథేషు సమసూరాణాం యవాగ్వః స్యుః పృథక్ పృథక్॥ కచ్ఛురామూలశాల్యాదిలిణ్డులైర్వాపి సాధితాః। దధితక్రారనాలామ్లయూషేష్విక్షురసేఽపి వా॥ శీతాః సశర్కరాక్షౌద్రాః సర్వాతీసారనాశనాః। ససర్పిష్కా చాజాజీమధురాలవణాః శివాః॥42॥

అ॥ మేడిపిందెలు నేరేడుపట్ట మామిడిపట్ట మేడిపట్ట శంఖములు సర్జరసము జువ్వి కృష్ణాగరు వీనిని ఒక్కొక్కపలము చొప్పున గ్రహించి వీనియొక్క కల్కమును, ఒకప్రస్థము ఘృతమును, రెండుప్రస్థముల పాలను కలిపి తయారుచేసి ఆఘృతమును బలానుసారముగ సేవించినచో పైన చెప్పబడిన సమస్తాతిసారములు నశించును. దూలగొండి ఆరెపువ్వు మారేడు మంజిష్ఠ రక్తశాలి చిరుసెనగలు రావిచిగుళ్ళు వీనిని జలమునందు కాచి ఆకషాయముతోఁ తయారుచేయబడిన యవాగువును ఈయవలయును. హ్రస్వపిందెలు పెద్దమ్రాను మంజిష్ఠ జువ్విచిగుళ్ళు చిరుసెనగలు ఆరెపువ్వుము త్తవపులగము వీనియొక్క కషాయముతోఁ తయారుచేయబడిన యవాగువును ఈయవలయును. హ్రస్వపంచమూలకషాయముతోఁగాని బలాచతుష్టయముయొక్క కషాయముతోఁగాని ఇక్ష్వాదిగణముయొక్క కషాయముతోఁగాని ప్రత్యేకముగ తయారుచేయబడిన యవాగువుల నీయవలయును. దూలగొండివేళ్ళు శాలి మొదలగువానియొక్క బియ్యము వీనితోఁగాని పెరుగు మజ్జిగ ఆరనాళము అమ్లకాంజికము యవక్షారము వీనితోఁగాని చెఱకురసముతోఁగాని తయారుచేయబడిన యవాగువులయందు పంచదార తేనె నెయ్యి మిరి

యాలు జీలకఱ్ఱ మధురద్రవ్యములు సైంధవలవణము వీనిని కలిపి చల్లగనున్న వానిని పానము చేయింపవలయును. ఈయవాగువులు సమస్తాతిసారములను నశింపచేయును.

మూ॥ స్నిగ్ధామ్లలవణమధురం పానం వస్తిశ్చ మారుతేకోష్ణః। శీతం తిక్తకషాయం మధురం పిత్తే చ రక్తే చ ॥ తిక్తోష్ణకషాయకటు శ్లేష్మణి సంగ్రాహి వాతనుచ్ఛకృతి। పాచనమామే పానం పిచ్ఛాసృగ్వస్తయోరక్తే ॥ అతిసారం ప్రత్యుక్తం మిశ్రం ద్వన్ద్వాదిజేష్వపి చ। తత్రోద్రేకవిశేషాద్దోషేషూపక్రమః కార్యః ॥45॥

అ॥ వాతము వెడలుచున్నప్పుడు ఆమ్లలవణమధురరసములుకల ద్రవ్యములతో తయారుచేయబడినట్టియు స్నిగ్ధముగను గోరువెచ్చగనునున్నట్టియు ద్రవముతో పానమును వస్తిని చేయింపవలయును. పిత్తముగాని రక్తముగాని వెడలుచున్నప్పుడు తిక్తకషాయ మధురరసములుకల ద్రవ్యములతో తయారుచేయబడినట్టియు శీతలముగనున్నట్టియు ద్రవముతో పానమును వస్తిని చేయింపవలయును. శ్లేష్మము వెడలుచున్నపుడు తిక్తకషాయకటురసములు ఉష్ణవీర్యమునుకల ఔషధములను ఈయవలయును. పురీషము వెడలుచున్నప్పుడు గ్రాహిశక్తి కలిగినట్టియు వాతమును నశింపచేయునట్టియు ఔషధములను ఈయవలయును. ఆమము వెడలుచున్నప్పుడు పాచనౌషధములను పానము చేయింపవలయును. రక్తము వెడలుచున్నప్పుడు పిచ్ఛావస్తినిరక్తముతోకూడినవస్తిని చేయింపవలయును. రెండేసిగాని మూడేసిగాని నాలుగేసిగాని అయిదేసికాని ఆరునుగాని కలసి వెడలుచున్నప్పుడు దోషములయొక్క ఆధిక్యమును తెలిసికొని ఈచికిత్సను మిశ్రముచేసి చేయింపవలయును.

## అధ్యాయ సంగ్రహము.

మూ॥ ప్రాసృతికా సవ్యాపత్క్రియా నిరూహాస్తథాఽతిసారహితాః। రసకల్పఘృతయవాగ్వశ్చోక్తాగురుణా ప్రసృతసిద్ధౌ ॥46॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతి సంస్కృతే సిద్ధిస్థానే ప్రాసృతయోగికా సిద్ధిర్నామాఽష్టమోఽధ్యాయః ॥

అ॥ ఈప్రాసృతయోగికసిద్ధ్యధ్యాయమునందు—సరిగప్రయోగింపబడనినిరూహవస్తులవలనకలుగు వ్యాపత్తులను, వానియొక్క చికిత్సలను, ప్రసృతపరిమాణములతోకూడినయోగములును చెప్పబడినవి. మరియు ఆమాద్యతిసారములయందు హితకరములైన రసకల్పనములును ఘృతములును యవాగులును చెప్పబడినవి.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామకకృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితావ్యాఖ్యానమునందు ప్రాసృతయోగికాసిద్ధి యనెడు అష్టమాధ్యాయము సమాప్తము.

—*—

# నవమాధ్యాయము.

మూ॥ అథాతస్త్రిమర్మీయాం సిద్ధిం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట త్రిమర్మీయసిద్ధిని చెప్పబోవుచున్నాను.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మర్మవివరణము.

మూ॥ సప్తోత్తరం మర్మశతమస్మిన్ శరీరే స్కన్ధశాఖాశ్రిత మగ్ని వేశ! తేషామన్యతమపీడాయాం, సమధికా పీడా భవతి, చేత నానిబన్ధవైశేష్యాత్ ॥ తత్ర శాఖాశ్రితేభ్యో మర్మభ్యః స్కన్ధాశ్రితాని గరీయాంసి, శాఖానాం తదాశ్రితత్వాత్; స్కన్ధాశ్రితేభ్యోఽపి హృద్వస్తిశిరాంసి, తన్మూలత్వాచ్ఛరీరస్య ॥4॥

అ॥ శరీరమునందు మధ్యశరీరమును హస్తపాదములను ఆశ్రయించి నూటయేడు మర్మలు ఉండును. వీనియందు చేతనాధాతువు అధికముగనుండునుగావున వీనిలో దేనికి అభిఘాతముకలిగినను అధికమైనబాధ జనించును. హస్తపాదములు మధ్యశరీరమును ఆశ్రయించుకొనియుండునుగాని హస్తపాదములయందలి మర్మలకంటె మధ్యశరీరము నందలిమర్మలు ప్రధానములుగ నుండును. హృదయమును వస్తియు శిరస్సును శరీరమున కాధారమైనవగుటవలన ఇవి మధ్యశరీరమునందలిమర్మలకంటెగూడ ప్రధానములుగ నుండును.

మూ॥ తత్ర హృది దశ చ ధమన్యః ప్రాణోదానమనోబుద్ధి చేతనామహాభూతాని చ నాభ్యామరా ఇవ ప్రతిష్ఠితాని, శిరసి ఇన్ద్రియాణి ఇన్ద్రియప్రాణవహాని చ స్రోతాంసి సూర్యమివ గభస్తయః సంశ్రితాని, వస్తిస్తు స్థూలగుదముష్కసేవనీశుక్రమూత్రవాహినీనాం నాలీనాం మధ్యే మూత్రాధారోఽమ్బువహానాం సర్వస్రోతసాముదధిరివాపగానాం ప్రతిష్ఠితో భవతి, బహుభిశ్చ తన్మూలైర్మర్మసంజ్ఞకైః స్రోతోభిర్గగనమివ దినకరకరైర్వ్యాప్తమిదం శరీరమ్ ॥5॥

అ॥ హృదయమునందు పదివిధములగుధమనులును ప్రాణవాతమును ఉదానవాతమును మనస్సును బుద్ధియు చేతనాధాతువును పంచమహాభూతములును "చక్రము యొక్క పంచమునందు ఆకులవలె" ఆశ్రయించియుండును. శిరస్సునందు ఇంద్రియములును ఇంద్రియశక్తినివహించు స్రోతస్సులును "సూర్యునియందు కిరణములువలె"

ఆశ్రయించియుండును. వస్తి- స్థూలగుదము వృషణములు సేవని శుక్రవాహకనాడులు మూత్రవాహనాడులు వీనియొక్క మధ్యయందున్నవై మూత్రమునకు ఆధారముగ నుండి ఉదకవాహకములైన సమస్త స్రోతస్సులకును 'నదులకు సముద్రమువలె' కేంద్ర స్థానముగ నుండును. హృదయాదులను ఆశ్రయించి యున్నట్టియు అనేకవిధములైన ట్టియు మర్మస్థానములతో కూడినట్టియు స్రోతస్సులు శరీరమునందు 'సూర్యకిరణములాకాశమునందువలె' వ్యాపించియుండును.

మూ॥ తేషాం త్రయాణామన్యత మస్యాపి భేదాదాశ్వేవ శరీర భేదః స్యాత్, ఆశ్రయనాశాదాశ్రితస్య నాశః, తదుపఘాతాత్తు ఘోర వ్యాధిప్రాదుర్భావః, తస్మాదేతాని విశేషేణ రక్ష్యాణి బాహ్యాభిఘా తాత్ వాతాదిదోషేభ్యశ్చేతి ॥6॥

ఆ॥ ఆశ్రయమునకు నాశముకలిగినయెడల దానినాశ్రయించుకొనియున్నదానికి కూడ నాశము కలుగును. కావున హృదయము మొదలగు ఈమూడింటిలో దేనికి విఘాతము కలిగినను శరీరమునకు వెంటనే విఘాతము కలుగును. హృదయాదులకు వికృతి కలిగినయెడల ఘోరమైన వ్యాధులు జనించును. అందువలన, హృదయాదులకు బాహ్యాభిఘాతములవలనను వాతాదిదోషములవలనను వికృతి కలుగకుండునట్లు విశేషమగు రక్షణను చేయవలయును.

మూ॥ తత్ర హృదయేఽభిహతే కాసశ్వాసబలక్షయ కణ్ఠశోష క్లోమాపకర్షణ జిహ్వానిర్గమ ముఖతాలుశోషాపస్మారోన్మాద ప్రలాప చిత్తనాశాదయః స్యుః, శిరస్యభిహతే మన్యాస్తమ్భార్దిత చక్షుర్విభ్రమ మోహోద్వేష్టన చేష్టానాశ కాసశ్వాస హనుగ్రహమూక గద్గదత్వా క్షినిమీలనగణ్డస్పన్దన జృమ్భణ లాలాస్రావస్వరహానివదన జిహ్మత్వా దీని, వస్తౌ తు వాతమూత్ర వర్చోనిగ్రహవఙ్క్షణ మేహనవస్తి శూల కుణ్డలోదావర్తగుల్మబ్రధ్నానిలాష్ఠీలోప స్తమ్భనాభికుక్షి గుదశ్రోణి గ్రహాదయః ॥

ఆ॥ హృదయము వికృతినొందినయెడల దగ్గు, ఆయాసము, బలక్షయము, కంఠము ఎండుట, క్లోమప్రదేశమునందు లాగబడుచున్నట్లుబాధ, నాలుకబయలువెడలుట, నోరుఎండుట, తాలుప్రదేశములు ఎండుట, అపస్మారము, ఉన్మాదము, ప్రలాపము, మనశ్చాంచల్యము మొదలగునవి కలుగును. శిరస్సు వికృతినొందినయెడల మన్యాస్తంభము, అర్దితవాతము, నేత్రములు తిరుగుట, మోహము, శిరస్సునందు మెలివేయబడినట్లు బాధ, చేష్టలు నశించుట, దగ్గు, ఆయాసము, హనుగ్రహము, మూగ, గద్గదస్వరముతో మాట్లాడుట, నేత్రములు మూసికొనిపోవుట, గండస్థలములుజారుట, ఆవలింతలు, నోట చొల్లుకారుట, స్వరముతగ్గుట, ముఖము వంకరపోవుట మొదలగునవి కలుగును. వస్తి వికృతినొందినచో అపానవాతముబంధించుట, మూత్రము బంధించుట,

గజ్జలయందు శూల, మేఢ్రమునందు శూల, వసియందు శూల, వస్తియందు ఖండింపు కారముగ త్రిప్పబడుచున్నట్లు బాధ, ఉదావర్తము, గుల్మము, బ్రధ్నమనెడి వ్యాధి, వాతాష్ఠీల, స్తంభింపబడుట, నాభియందును కుక్షిప్రదేశమునందును గుదప్రదేశమునందును పిరుదులయందును బిగపట్టినట్లుండుట మొదలగునవి కలుగును.

మూ॥ వాతాద్యుపసృష్టానాం త్వేషాం లిఙ్గాని చికిత్సితే సక్రియాదివిధిన్యుక్తాని। కిం త్వేతాని విశేషతోఽనిలాద్రక్ష్యాణి, అనిలో హి పిత్తకఫసముదీరణే హేతుః ప్రాణమూలం చ, స వస్తికర్మసాధ్యతమః। తస్మాన్న వస్తికర్మసమం కించిత్ కర్మ మర్మపరిపాలనమస్తి॥ తత్ర షడాస్థాపనస్కన్ధాన్ విమానే ద్వౌ చానువాసనస్కన్ధావిహ చ విహితాన్ వస్తీన్ బుద్ధ్యా విచార్య మహామర్మపరిపాలనార్థం ప్రయోజయేద్వాతవ్యాధిచికిత్సాం చ॥ ॥

అ॥ హృదయాదిమర్మలు వాతాదులచే వికృతినొందింపబడినప్పుడు కలుగు లక్షణములును, అప్పుడు చేయవలసిన చికిత్స మొదలగు విధులును చికిత్సాస్థానమునందు చెప్పబడినవి. వాతము పిత్తకఫములను ఉద్రేకము నొందించునదిగను ప్రాణములకు హేతువుగను నుండును గావున అట్టివాతము హృదయాదులను వికృతినొందింపకుండునట్లు విశేషించి రక్షింపవలయును. అట్టి వాతము వస్తికర్మచే మిక్కిలి సాధ్యముగ నుండును. అందువలన హృదయాదిమర్మములను రక్షించుటకు వస్తికర్మకంటె శ్రేష్ఠమైన మరియొక విధానములేదు. ఆరువిధములగు నిరూహస్కంధములు విమానస్థానమునందును రెండువిధములగు అనువాసనస్కంధములు ఈ సిద్ధిస్థానమునందును చెప్పబడినవి. వానిని బుద్ధిచే బాగుగ ఆలోచించి అనుకూలమైన వస్తులను వాతవ్యాధులకు చెప్పబడిన చికిత్సలను మహామర్మములైన హృదయాదులయొక్క రక్షణకొఱకు చేయింపవలయును.

మూ॥ భూయశ్చ హృద్యుపసృష్టే వాతేన హిఙ్గుచూర్ణలవణానామన్యతమచూర్ణసంయుక్తాం పేయాం మాతులుఙ్గస్య రసేన వాఽన్యేన వాఽమ్లేన హృద్యేన వా పాయయేత్। స్థిరాదిపఞ్చమూలీరసః సశర్కరః పానార్థం, బిల్వాదిపఞ్చమూలరససిద్ధా చ యవాగూః, హృద్రోగవిహితం చ కర్మ॥ మూర్ధ్ని తు వాతోపసృష్టే అభ్యఙ్గస్వేదనోపనాహనస్నేహపానస్తః కర్మావపీడనధూమాదీని॥ వస్తౌ తు కుమ్భీస్వేదో వర్తయశ్చ, శ్యామాదిభిర్గోమూత్రసిద్ధో నిరూహః, బిల్వాదిభిశ్చ సురాదిసిద్ధః, శరకాశేక్షుదర్భగోక్షురకమూలశృతక్షీరైశ్చత్రపుషైర్వారుఖరాశ్వాబీజయవవర్షాభూకకల్కితో నిరూహః, సౌరయవతిల్వకభృష్టకల్కితో వా నిరూహః, పీతదారుకసిద్ధతైలాను

వాసనం, త్రైల్వకం చ సర్పిర్విరేకార్థం, శతావరీగోక్షురక బృహతీకణ్టకారికాగుడూచీ పునర్నవోశీర మధుక ద్విసారివాలోధ్ర శ్రేయసీకుశకాశ మూలకషాయ క్షీరచతుర్గుణం బలావృషర్షభకఖరాశ్వోపకుఞ్చికావత్సకత్రపుషైర్వారుబీజశీతివారక మధుక వచాశతపుష్పాశ్మభేద వర్షాభూ మదనఫలకల్క-సిద్ధం తైలముత్తరవస్తిః నిరూహః శుద్ధస్నిగ్ధస్విన్నస్య వస్తిశూల మూత్రవికారహర ఇతి ॥12॥

అ॥ హృదయము వాతముచే వికృతినొందింపబడినప్పుడు ఇంగువచూర్ణముతోగాని లవణచూర్ణముతోగాని కూడిన పేయను మాదీఫలరసముతోగాని పుల్లని ఇట్టి ఇతరరసములతోగాని మనస్సునకు అనుకూలమైన మరియొకదానితోగాని త్రాగవలయును. హ్రస్వపంచమూలరసమునందు పంచదారను కలిపి త్రాగునిమిత్త మీయవలయును. మహాపంచమూలములయొక్క రసముతో తయారుచేయుబడిన యవాగువును ఈయవలయును. మరియు హృద్రోగమునందు చెప్పబడిన చికిత్సను చేయింపవలయును. శిరస్సు వాతముచే వికృతినొందింపబడినపుడు అభ్యంగము, స్వేదము, ఉపనాహస్వేదము, స్నేహపానము, నస్యము, అవపీడనస్యము, ధూమపానము మొదలగు వానిని చేయింపవలయును. వస్తి వాతముచే వికృతి నొందింపబడినపుడు కుంభీస్వేదమును చేయింపవలయును. ఫలవర్తులను ప్రయోగింపవలయును నల్లతెగడ మొదలగు వానితోడను గోమూత్రముతోడను తయారైనట్టికాని మహాపంచమూలములతోడను సురామద్యము మొదలగు వానితోడను తయారైనట్టికాని నిరూహవస్తిని చేయింపవలయును. లేక కాకిరెల్లు రెల్లు చెఱకు దర్భలు పల్లేరు వీనియొక్క వేళ్ళతో కాచబడిన పాలయందు దోసవిత్తులు నక్కదోసవిత్తులు అజామోదము యవలు ఋషభకము వీనియొక్క కల్కమునుగాని యవక్షారము యవలు లొద్దుగ వేయింపబడిన వీనియొక్క కల్కమునుగాని చేర్చి దానితో నిరూహవస్తిని చేయింపవలయును. సరళదేవదారుతో తయారుచేయబడిన తైలముచే అనువాసనవస్తిని చేయింపవలయును. త్రైల్వకఘృతమును విరేచనమునిమిత్తము ఈయవలయును. పిల్లిపీచర పల్లేరు పెదవాకుడు చినవాకుడు తిప్పతీగ గలిజేరు వట్టివేళ్లు అతిమధురము తెల్లసుగంధిపాల నల్లసుగంధిపాల లొద్దుగ సన్నరాస్నము కుశదర్భవేళ్ళు రెల్లువేళ్ళు వీనియొక్క కషాయమును పాలను నాలుగురెట్లుగ చేర్చి ముత్తవపులగము అడ్డసరము ఋషభకము అజామోదము నల్లజీలకర్ర కొండిసెపాల దోసగింజలు నక్కదోసగింజలు చెంచలి అతిమధురము వస సదాప కొండపిండి గలిజేరు మంగకాయలు వీనియొక్క కల్కముతో తైలమును తయారుచేసి దీనిలో ఉత్తరవస్తిని చేయింపవలయును. శుద్ధుడై స్నేహస్వేదములను పొందినవానికి నిరూహవస్తిని చేయించినచో వస్తిశూలయు మూత్రవ్యాధులును నశించును.

మూ॥ హృది మూర్ధ్ని చ వస్తౌ చ నృణాం ప్రాణాః ప్రతిష్ఠితాః। తస్మాత్తేషాం సదా యత్నాత్కుర్వీత పరిపాలనమ్ ॥ ఆఘాత

వర్జనం నిత్యం స్వస్థవృత్తానువర్తనమ్ । ఉత్పన్నార్తి విఘాతశ్చ మర్మణాం పరిపాలనమ్ ॥ అత ఊర్ధ్వం వికారా యే త్రిమర్మీయే చికిత్సితే। న ప్రోక్తా మర్మజాస్తేషాం కాంశ్చిద్వక్ష్యామి సౌషధాన్ ॥15॥

అ॥ ప్రాణములు హృదయమునందును శిరస్సునందును వస్తియందును ఉండును. కావున హృదయాదులను ఎల్లప్పుడు ప్రయత్నముతో రక్షింపవలయును. ఈ మర్మలను వికృతిని కలిగించువానిని విసర్జింపవలయును. స్వస్థవృత్తము నాచరింపవలయును. వికృతికలిగినప్పుడు తగు చికిత్సలను చేయింపవలయును. ఇవి మర్మపరిపాలనములుగ నుండును. చికిత్సాస్థానములో త్రిమర్మీయాధ్యాయమునందు ఈహృదయాదులకు చెప్పబడని కొన్నివ్యాధులను చికిత్సలతోకూడ ఇచ్చట చెప్పుచున్నాము.

అపతంత్రకాపతానకములయొక్క లక్షణములు – చికిత్స.

మూ॥ క్రుద్ధః స్వైః కోపనైర్వాయుః స్థానాదూర్ధ్వం ప్రపద్యతే । పీడయన్ హృదయం గత్వా శిరః శఙ్ఖౌ చ పీడయన్॥ ధనుర్వన్నమయేద్గాత్రాణ్యాక్షిపేన్మోహయేత్తథా । కృచ్ఛ్రేణ చాప్యుచ్ఛ్వసితి స్తబ్ధాక్షోఽథ నిమీలకః ॥ కపోత ఇవ కూజేచ్చ నిఃసంజ్ఞః సోఽపతన్త్రకః । దృష్టిం సంస్తభ్య సంజ్ఞాం చ హత్వా కణ్ఠేన కూజతి॥ హృది ముక్తే నరః స్వాస్థ్యం యాతి మోహం వృతే పునః । వాయునా దారుణం ప్రాహురేకే తదపతానకమ్ ॥ శ్వసనం కఫవాతాభ్యాం రుద్ధం తస్య విమోచయేత్ । తీక్ష్ణైః ప్రధమనైః, సంజ్ఞాం తాసు ముక్తాసు విన్దతే॥ మరిచం శిగ్రుబీజాని విడఙ్గం చ ఫణిజ్జకమ్ । ఏతాని సూక్ష్మచూర్ణాని దద్యాచ్ఛీర్షవిరేచనమ్॥ హిఙ్గు తుమ్బురు పథ్యా చ పౌష్కరం లవణత్రయమ్ । యవక్వాథామ్బునా పేయం హృత్పార్శ్వార్త్యపతన్త్రకే ॥ హిఙ్గ్వమ్లవేతసం శుణ్ఠీం ససౌవర్చలదాడిమమ్। పిబేద్వాతకఫఘ్నం చ కర్మ హృద్రోగనుద్ధితమ్ ॥ శోధనా వస్తయస్తీక్ష్ణా హితాస్తస్య చ కృత్స్నశః । సౌవర్చలాభయావ్యోషైః సిద్ధం తు స్యాద్ఘృతం హితమ్ ॥24॥

అ॥ వాతము తనయొక్క ప్రకోపకారణములచే ప్రకోపించి స్వస్థానమునుండి ఊర్ధ్వముగ వ్యాపించి హృదయమును శిరస్సును కణతలనుపొంది వానిని పీడించి అవయవములను ధనుస్సునువలె వంచుచు చాచుచు మోహమును కలిగించును. అప్పుడు రోగి శ్వాసను కష్టముచే విడుచును. స్తంభించినట్టికాని మూయబడినట్టికాని నేత్రములు కలవాడుగ నగును. స్మారకములేనవాడుగనుండి పావురమువలె కూయుచుండును. ఇది

అపతంత్రకమని చెప్పబడును. స్తంభింపబడిన నేత్రములుకలవాడై స్మారకములేని వాడుగనుండి కంఠముతో కూయును వాతము హృదయమును విడిచిపెట్టగనే రోగి స్వాస్థ్యమునొందును. మరల హృదయమును ఆవరింపగనే మోహమునొందును. వాతముచే జనించి దారుణముగనున్న దీనిని అపతానకమని కొందరు చెప్పిరి. అట్టిరోగియొక్క కఫవాతములచే అడ్డగింపబడియున్న శ్వాసను తీక్ష్ణములైన ప్రధమనస్యములచే వెడలింపచేయవలయును. సంజ్ఞావాహకములైన నాడులు శుద్ధినొందగనె స్మారకమునొందును. మిరియాలు మునగవిత్తులు వాయువిడంగములు మోదుగమాడలు వీనిని మెత్తగ మర్దించి దీనితో నస్యకర్మము చేయింపవలయును. హృదయబాధ పార్శ్వబాధ అపతంత్రకము వీనియందు ఇంగువ తుంబుర్లు కరక్కాయ మెట్టతామర లవణత్రయము వీనితోగూడిన యవకషాయమును పానము చేయవలయును. ఇంగువ అమ్లవేతసము శుంఠి సౌవర్చలలవణము దానిమ్మ వీనితోగూడిన పానము నీయవలయును. వాతకఫములను నశింపచేయునట్టియు హృద్రోగమునునశింపజేయునట్టియు చికిత్సలను చేయింపవలయును. తీక్ష్ణములైన శోధనకర్మలను వస్తులను అధికముగ చేయింపవలయును. సౌవర్చలలవణము కరక్కాయలు త్రికటుకములు వీనితో తయారు చేయబడిన ఘృతమును ఈయవలయును.

## తంద్రయొక్క హేతువులు - లక్షణములు చికిత్స.

మూ॥ మధురస్నిగ్ధగుర్వన్నసేవనాచ్చిన్తనాద్భయాత్ । శోకాద్వ్యాధ్యనుషఙ్గాచ్చ వాయునోదీరితః కఫః॥ యదాఽసౌ సమవస్కన్ద్య హృదయం హృదయాశ్రయాన్ । సమావృణోతి జ్ఞానాదీంస్తదా తన్ద్రోపజాయతే ॥ హృదయే వ్యాకులీభావో వాక్చేష్టేన్ద్రియగౌరవమ్ । మనోబుద్ధ్యప్రసాదశ్చ తన్ద్రాయా లక్షణం మతమ్ ॥ కఫఘ్నం తత్ర కర్తవ్యం శోధనం శమనాని చ । వ్యాయామో రక్తమోక్షశ్చ భోజ్యం చ కటుతిక్తకమ్ ॥28॥

ఆ॥ మధురరసమును స్నిగ్ధగుణమును గురుగుణమును కల ఆహారములను సేవించుట, చింతించుట, భయము, దుఃఖము, వ్యాధి అనుసరించియుండుట వీనివలన వాతము కఫమును ఉద్రేకమునొందించును. అట్టికఫము హృదయమునందు వ్యాపించి హృదయమునందలి జ్ఞానవహస్రోతస్సులను అడ్డగించును. అప్పుడు తంద్ర కలుగును. అట్టిసమయమున హృదయమునందు వ్యాకులత్వము, వాక్యములు చేష్టలు ఇంద్రియములు వీనియందు గురుత్వము, మనస్సును బుద్ధియు నిర్మలముగ లేకుండుట ఈలక్షణములు కలుగును. ఈవ్యాధియందు కఫనాశకముగు చికిత్సను చేయింపవలయును. మరియు శోధన చికిత్సలు శమన చికిత్సలు వ్యాయామము రక్తమోక్షము వీనిని చేయింపవలయును. కటురసమును తిక్తరసమును కల పదార్థములను భుజింపచేయవలయును.

## వస్తిరోగ వివరణము.

మూ॥ మూత్రౌకసాదం జఠరం కృచ్ఛ్రం స్రోత్సఙ్గ సక్షయౌ। మూత్రాతీతో ఽనిలాష్ఠీలా వాతవస్త్యుష్ణమారుతౌ॥ వాతకుణ్డలిక గ్రన్థి విఘాతో వస్తికుణ్డలమ్। త్రయోదశై తే మూత్రస్య దోషాంస్తాల్లిఙ్గతః శృణు ॥30॥

అ॥ మూత్రౌకసాదము, మూత్రజఠరము, మూత్రకృచ్ఛ్రము, మూత్రోత్సంగము, మూత్రక్షయము, మూత్రాతీతము, వాతాష్ఠీల, వాతవస్తి, ఉష్ణవాతము, వాతకుండలిక, మూత్రగ్రంథి, విడ్విఘాతము, వస్తికుండలము అను నీపది మూడును మూత్రదోషములుగ నుండును. వీనియొక్క లక్షణములను చెప్పుచున్నాము.

### మూత్రౌకసాదముయొక్క లక్షణములు - చికిత్స.

మూ॥ పిత్తం కఫో ద్వయం వాపి వస్తౌ స హన్యతే యదా। మారుతేన తదా మూత్రం రక్తపీతం ఘనం సృజేత్ ॥ సదాహం శ్వేతసాన్ద్రం వా సర్వైర్వా లక్షణైర్యుతమ్। మూత్రౌకసాదం తం విద్యాత్పిత్తశ్లేష్మహరైర్జయేత్ ॥32॥

అ॥ పిత్తమును కఫమును ప్రత్యేకముగగాని కలిసికాని వస్తియందు వాతముచే దుష్టినొందింపబడి ఎఱ్ఱగను పచ్చగను చిక్కగను నున్నట్టికాని తాపయుక్తముగను తెల్లగను చిక్కగను నున్నట్టికాని ఈ అన్నిలక్షణములతోడను కూడినట్టికాని మూత్రము వెడలినచో అది మూత్రౌకసాద మనబడును. అప్పుడు పిత్తశ్లేష్మములను హరింపచేయు చికిత్సలను చేయుంపవలయును.

### మూత్రజఠరముయొక్క లక్షణములు - చికిత్స.

మూ॥ విధారణాత్ప్రతిహతం వాతోదావర్తితం యదా। పూరయత్యుదరం మూత్రం తదా తదనిమిత్తరుక్ ॥ అపక్తిమూత్ర విట్సఙ్గై స్తన్మూత్ర జఠరం వదేత్। మూత్రవై రేచనీం తత్ర చికిత్సాం సంప్రయోజయేత్ ॥ హిఙ్గుద్విరుత్తరం చూర్ణం త్రిమర్మీయే ప్రకీర్తితమ్। హన్యాన్మూత్రాది సంఘాతం వ్యాధిం చ గుదమేఢ్రయోః ॥35॥

అ॥ అడ్డగింపబడుటవలన ప్రతిహతమైనట్టియు వాతముచే ఉదావర్తమునొందింపబడినట్టియు మూత్రము ఉదరమును నిండించును. అట్టిసమయమున కారణము లేకుండగనే బాధ కలుగును. మరియు అజీర్ణము మూత్రబంధము మలబంధము ఈ లక్షణములు కలుగును. ఇది మూత్రజఠరమని చెప్పబడును. మూత్రమును వెడలింపచేయు చికి

త్పులను దీనియందు చేయింపవలయును. త్రిమర్మీయ చికిత్సాధ్యాయమునందు చెప్పబడిన హింగుద్వ్యిరుత్తర చూర్ణమును ఇచ్చినచో మూత్రాదులయొక్క సంఘాతము గుదవ్యాధులు మేఢ్రవ్యాధులు వీనిని నశింపచేయును.

మూత్రకృచ్ఛ్రాదులయొక్క లక్షణములు.

మూ॥ మూత్రితస్య వ్యవాయాత్తు రేతో వాతోద్ధృతం చ్యుతమ్ । పూర్వం మూత్రస్య పశ్చాద్వా స్రవేత్తత్కృచ్ఛ్రముచ్యతే ॥ క్షవైగుణ్యానిలాక్షేపైః కించిన్మూత్రం చ తిష్ఠతి । మణిసన్ధౌ స్రవేత్పశ్చాత్తిపరుగ్వాఽథ వాఽతిరుక్ ॥ మూత్రోత్సర్గః స విచ్ఛిన్నస్తచ్ఛేషో గురు శేఫసః । వాతాకృతిర్భవేద్వాతాన్మూత్రే శుష్యతి సంక్షయః ॥ చిరం ధారయతో మూత్రం త్వరయా న ప్రవర్తతే । మేహమానస్య మన్దం వా మూత్రాతీతః స ఉచ్యతే ॥ ఆధ్మాపయన్వస్తిగుదం రుద్ధ్వా వాయుశ్చలోన్నతామ్ । కుర్యాత్తీవ్రార్తి మష్ఠీలాం మూత్రవిణ్మార్గరోధినీమ్ ॥ మూత్రంధారయతో వస్తౌ వాయుః క్రుద్ధో విధారణాత్ । మూత్రరోధార్తి కణ్డూభిర్వాతవస్తిః స ఉచ్యతే ॥ ఊష్మణా సోష్మకం మూత్రం శోషయన్ రక్తపీతకమ్ । ఉష్ణవాతః సృజేత్కృచ్ఛ్రాద్వస్త్యుపస్థార్తిదాహవాన్ ॥ గతిసఙ్గాదుదావృత్తః స మూత్రస్థానమార్గయోః । మూత్రస్య విగుణో వాయుర్భగ్నవ్యావిద్ధకుణ్డలీ ॥ మూత్రం విహన్తి సంస్తమ్భభఙ్గగౌరవవేష్టనైః । తీవ్రరుఙ్మూత్రవిట్సఙ్గైర్వాతకుణ్డలికేతి సా । రక్తం వాతకఫాద్దుష్టం వస్తిద్వారే సుదారుణమ్ । గ్రన్థిం కుర్యాత్స కృచ్ఛ్రేణ సృజేన్మూత్రం తదావృతమ్ ॥ అశ్మరీ సమశూలం తం మూత్రగ్రన్థిం ప్రచక్షతే । రూక్షదుర్బలయోర్వాతేనోదావృత్తం శకృద్యదా ॥ మూత్రస్రోతః ప్రపద్యేత విట్సంసృష్టం తదా నరః । విడ్గన్ధం మూత్రయేత్కృచ్ఛ్రాద్విడ్విఘాతం వినిర్దిశేత్ ॥47॥

అ॥ మూత్రవేగముతోకూడినవాడు మైథునము నాచరించినచో శుక్రము వాతముచే ప్రేరేపింపబడి స్రవించి మూత్రమార్గమును పొంది మూత్రమునకు పూర్వమందుగాని పరమునందుగాని బయలువెడలుచున్నయెడల అది మూత్రకృచ్ఛ్రమని చెప్పబడును. మూత్రస్రోతస్సులు చెడుటవలనను, వాతముచే చిమ్మబడుటవలనను కొంత మూత్రము మేఢ్రముయొక్క మణిసంధియందు నిలిచియుండి మేఢ్రమునకు గురుత్వమును కలిగించి పిమ్మట బాధలేకుండగాని అధికమగుబాధతోకూడికాని కొద్దికొద్దిగ

బయలువెడలుచున్నచో అది మూత్రోత్సంగమని చెప్పబడును. వాతమువలన మూత్రము క్షీణించినప్పుడు వస్తి వాతలక్షణములతో కూడినదగును. అది మూత్రక్షయమని చెప్పబడును. మూత్రమును చిరకాలము ధరించియున్నవానికి మూత్రము తొందరగ ప్రవర్తింపనేరదు ముక్కినచో కొద్దిగ ప్రవర్తించును. అది మూత్రాతీతమని చెప్పబడును. ప్రకోపించినవాతము వస్తిప్రదేశమును గుదప్రదేశమును అరికట్టి పూరించి చలించునట్టియు ఉన్నతమైనట్టియు తీవ్రమైన బాధకలిగినట్టియు మూత్రమార్గమును పురీషమార్గమును అడ్డగించునట్టియు అష్ఠీలను కలిగించును. అది వాతాష్ఠీలయని చెప్పబడును. మూత్రమును అడ్డగించినవానికి వాతము వస్తిప్రదేశమునందు ప్రకోపించి మూత్రమును బాధించును. అప్పుడు మూత్రము వెడలకుండుటయు బాధయు దురదయు కలుగును. అది వాతవస్తియని చెప్పబడును. వాతము పిత్తోష్మతో కూడి మూత్రమును ఎండింపచేసి వెచ్చగనున్నట్టియు ఎర్రగను పచ్చగనున్నట్టియు మూత్రమును, వస్తి గుహ్యప్రదేశము వీనియందలి బాధతోడను తాపముతోడను కష్టముచే వెడలించును. అది ఉష్ణవాతమని చెప్పబడును. మూత్రవేగమునరికట్టినచో వాతము ఉదావర్తమునొంది మూత్రస్థానమునందును మూత్రమార్గమునందును వైగుణ్యమునొంది ప్రతివాతమై వక్రత్వమునొంది గుండ్రముగనై మూత్రమును చెరచును. అప్పుడు స్తంభించుట బ్రద్దలుకొట్టబడుచున్నట్లుండుట గురుత్వము మెలివేయబడుచున్నట్లుండుట అధికమైనబాధ మూత్రబంధము ఈలక్షణములు కలుగును. అది వాతకుండలికయని చెప్పబడును. వాతకఫమువలన చెడినరక్తము వస్తిద్వారమునందు దారుణమైన గ్రంథిని కలిగించును. అప్పుడు మూత్రము దానిచే అడ్డగింపబడుటవలన కష్టముచే బయలువెడలును. అశ్మరియందువలె బాధ కలుగును. అది మూత్రగ్రంథియని చెప్పబడును. రూక్షుడుగను దుర్బలుడుగను నున్నవానికి వాతము పురీషమును ఉదావర్తము నొందించి మూత్రస్రోతస్సునందు చేర్చినచో పురీషముతోకూడినట్టియు పురీషగంధము కలిగినట్టియు మూత్రము కష్టముచే వెడలును. అది విడ్విఘాతమని చెప్పబడును.

## వస్తికుండలముయొక్క లక్షణములు.

మూ॥ ద్రుతాధ్వలఙ్ఘనాయాసాదభిఘాతాత్ప్రపీడనాత్ । స్వస్థానాద్వస్తిరుద్వృత్తః స్థూలస్తిష్ఠతి గర్భవత్ ॥ శూలస్పన్దనదాహార్తో బిన్దుం బిన్దుం స్రవత్యపి । పీడితస్తు స్రవేద్ధారాం స్తమ్భనోద్వేష్టనార్తిమాన్ ॥ వస్తికుణ్డలమాహుస్తం ఘోరం శస్త్రవిషోపమమ్ । పవనప్రబలం ప్రాయో దుర్నివారమబుద్ధిభిః ॥ తస్మిన్పిత్తాన్వితే దాహః శూలం మూత్రవివర్ణతా । శ్లేష్మణా గౌరవం శోఫః స్నిగ్ధం మూత్రం ఘనం సితమ్ ॥ శ్లేష్మరుద్ధబిలో వస్తిః పిత్తోదీర్ణో న సిధ్యతి । అవిభ్రాన్తబిలః సాధ్యో న తు యః కుణ్డలీకృతః ॥ స్యాద్వస్తౌ కుణ్డలీభూతే తృణ్మోహశ్శ్వాస ఏవ చ ॥52॥

అ॥ మార్గమున తొందరగ నడచుట, ఎగురుట, ఆయాస జనకములైనపనులను చేయుట, అభిఘాతము, పీడింపబడుట, వీనివలన వస్తి స్వస్థానమునుండి పైకిజారి పెద్దదై గర్భమువలె నుండును. అప్పుడు శూల చలించుట తాపము వీనితో కూడిన మూత్రము బొట్లుబొట్లుగ స్రవించును. నొక్కినచో ధారగ వెడలును, అట్టిసమయమున బిగపట్టుట మెలిపేయబడినట్లుండుట ఈలక్షణములు కలుగును. దీని వస్తికుండల మని చెప్పబడును. ఇది ఘోరమైనదిగను, శస్త్రముయొక్కయు విషముయొక్కయు బాధలనుకలిగించునదిగను, తరుచు వాతప్రధానమైనదిగను, తెలియనివారిచే చికిత్సింపనలవికానిదిగను నుండును. పిత్తమునకు సంబంధమున్నచో తాపము, శూల, మూత్రమునందు రంగుమారుట ఈలక్షణములుకలుగును. కఫమునకు సంబంధమున్నచో గురుత్వము, శోఫ, స్నిగ్ధముగను చిక్కగను తెల్లగను నున్న మూత్రము వెడలుట ఈలక్షణములు కలుగును. వస్తి కఫముచే అరికట్టబడిన రంధ్రము కలదిగనున్నను పిత్తము ఉద్రేకము నొందియున్నను ఈవ్యాధి అసాధ్యముగ నుండును. వస్తియొక్కమార్గము అరికట్టబడి యుండకపోయినను వస్తి గుండ్రముగ చేయబడకపోయినను ఈవ్యాధి సాధ్యముగ నుండును. వస్తి గుండ్రముగచేయబడినపుడు దప్పిక మోహము ఉచ్ఛ్వాసము ఈలక్షణములు కలుగును.

## మూత్రకృచ్ఛ్రాదులయొక్కయు వస్తికుండలము యొక్కయు చికిత్స.

మూ॥ దోషాధిక్యమవేక్ష్యైతాన్మూత్రకృచ్ఛ్రహరైర్జయేత్।
వస్తిముత్తరవస్తిం చ సర్వేషామేవ యోజయేత్ ॥౫౩॥

అ॥ మూత్రకృచ్ఛ్రము మూత్రోత్సంగము మొదలగువానియందును వస్తికుండలమునందును దోషములయొక్క ఆధిక్యమును తెలిసికొని మూత్రకృచ్ఛ్రనాశకములగు చికిత్సలను చేయింపవలయును. మరియు అన్నిటియందును వస్తిని ఉత్తరవస్తిని చేయింపవలయును.

## ఉత్తరవస్తి విధానము.

మూ॥ పుష్పనేత్రం చ హైమం స్యాత్సూక్ష్మ మౌత్తరవస్తికమ్। జాతీపుష్పస్య వృన్తేన సమం గోపుచ్ఛసంస్థితమ్॥ రౌప్యం వా సర్షపచ్ఛిద్రం ద్వికర్ణం ద్వాదశాఙ్గులమ్। తేనాజవస్తియుక్తేన స్నేహస్యార్ధపలం నయేత్॥ యథాపయోవిశేషేణ స్నేహమాత్రాం వికల్ప్య వా। స్నాతస్య భుక్తభక్తస్య రసేన పయసాఽపి వా॥ సృష్టవిణ్మూత్రవేగస్య పీఠే జానుసమే మృదౌ। ఋజోః సుఖోపవిష్టస్య హృష్టే మూర్ధే ఘృతాక్తే॥ శలాకయాఽన్విష్య గతిం యద్యప్రతిహతా వ్రజేత్। తతః శేఫః ప్రమాణేన పుష్పనేత్రం ప్రవేశయేత్॥ గుదవన్మూత్రమార్గేణ ప్రణయేదనుసేవనీమ్। హింస్యాద్ధ్యతి గతం

వస్తిమూనే స్నేహో న గచ్ఛతి॥ సుఖం ప్రపీడ్య నిష్కమ్పం నిష్కర్షే న్నేత్రమేవ చ। ప్రత్యాగతే ద్వితీయం తు తృతీయం చ ప్రదాపయేత్॥ అనాగచ్ఛన్నుపేక్ష్యస్తు రజనీవ్యుషితస్య చ। పిప్పలీలవణాగారధూమాపామార్గసర్షపైః వార్తాకురసఃగ్గుడశ్యామ్పాకైః ససహాచరైః। మూత్రామ్లపిష్టైః సగుడైర్వర్తిం కృత్వా ప్రవేశయేత్॥ అగ్రే తు సర్షపాకారాం పశ్చాద్ద్వైమాషసంమితామ్। నేత్రదీర్ఘాం ఘృతాభ్యక్తాం సుకుమారామభఙ్గురామ్॥ నేత్రవన్మూత్రనాడ్యాం తు పాయయా వాఙ్గుష్ఠసంమితామ్। స్నేహే ప్రత్యాగతే తాభ్యాం సానువాసనికో విధిః॥ పరిహారస్య సవ్యాపత్సమ్యగ్దత్తస్య చేష్యతామ్ ॥15॥

అ॥ ఉత్తరవస్తిసంబంధమగు నేత్రమును బంగారముతోగాని వెండితోగాని నిర్మింపవలయును. ఈ నేత్రము చిన్నదిగను జాజిపువ్వుయొక్క తొడిమతో సమానమైనదిగను ఆవుతోకయొక్క ఆకారముకలదిగను ఆవగింజ ప్రవేశించునంతటి రంధ్రము కలదిగను రెండుకర్ణికలుకలదిగను పన్రెండుఅంగుళములుపొడవుకలదిగను నుండవలయును. ఈ నేత్రమునకు మేకయొక్క వస్తిని కట్టవలయును. దీనితో అర్ధపలపరిమితిగల స్నేహమును ప్రయోగింపవలయును. లేక వయోవిశేషమునను సరించి తగుపరిమితిగ ప్రయోగింపవలయును. స్నానముచేసినట్టియు మాంసరసముతోగాని పాలతోగాని ఆహారమును భుజించినట్టియు మలమూత్రములను వెడలించినట్టియు మృదువుగను మోకాళ్ళయెత్తుకలదిగను నున్న పీఠమునందు వంకరలేకుండగను సుఖముగను కూర్చున్నట్టియు మనుజునకు ఘృతముతోపూయబడినదియు ఎత్తబడినదియు నగు మేఢ్రము నందు తొలుత శలాకను ప్రవేశపెట్టి గమనమును చూచుకొని అడ్డులేకున్నచో పిమ్మట నేత్రమును మేఢ్రపరిమితిగ ప్రవేశపెట్టవలయును. గుదప్రదేశమునందు వస్తినేత్రమును ప్రవేశపెట్టువిధముననే దీనిని మూత్రమార్గముద్వారా సేవని ననుసరించి ప్రవేశపెట్టవలయును. స్నేహమును అధికముగ ప్రవేశపెట్టినచో మూత్రాశయమునందు బాధ కలుగును. స్వల్పముగ ప్రవేశపెట్టినచో సరిగ ప్రవేశింపనేరదు. స్నేహమును వణుకులేకుండగ సుఖముగ ప్రవేశపెట్టి పిమ్మట నేత్రమును తీసివేయవలయును. ఆస్నేహము బయలువెడలినపిదప మరల రెండవసారియు మూడవసారియు ప్రవేశపెట్టవలయును. స్నేహము బయలువెడలనియెడల ఊరుకొని రాత్రియందు అటులనేయుంచి మరునాడు పిప్పళ్ళు సైంధవలవణము కరిఘూపము ఉత్తరేణు ఆవాలు వంగయొక్క రసము వావిలి రేల గోరింట వీనిని, బెల్లమును కలిపి గోమూత్రముతోడను కాంజికము మొదలగు అమ్లద్రవములతోడను నూరి వర్తులను చేసి ప్రవేశపెట్టవలయును. ఈవర్తులు చివర ఆవగింజవలెను మొదటిభాగమున మినపగింజపరిమితిగను మూత్రవస్తియొక్క నేత్రముతో సమానమైన పొడవుకలవిగను నేతితోపూయబడినవిగను సుకుమారముగను నున్నగను నుండవలయును. ఈవర్తిని మూత్రనాడియందు నేత్రమునువలె

ప్రవేశ పెట్టవలయును. లేక బొటన వ్రేలి పరిమితిగల వర్తిని చేసి గుదప్రదేశమునందు ప్రవేశ పెట్టవలయును. నిలిచియున్న స్నేహము ఈవర్తులద్వారా బయలు వెడలినపిదప, అనువాసనానంతరమునందు చెప్పబడిన విధిని ఆచరింపవలయును. సమ్యగ్యోగలక్షణములును, వ్యాపత్తులును, వ్యాపత్తులయొక్క చికిత్సలును అనువాసనవస్తినియందు చెప్పబడినవిధముననే దీనియందుగూడ తెలిసికొనవలయును.

## స్త్రీలకు ఉత్తరవస్తి విధానము.

మూ॥ స్త్రీణాం చార్తవకాలే తు ప్రతికర్మ తదాచరేత్ । గర్భాసనా సుఖం స్నేహం తదాఽఽదత్తే హ్యపావృతా ॥ గర్భం యోనిస్తదా శీఘ్రం జితే గృహ్ణాతి మారుతే । వస్తిజేషు వికారేషు యోనివిభ్రంశజేషు చ ॥ యోనిశూలేషు తీవ్రేషు యోనివ్యాపత్స్వసృగ్దరే । అప్రస్రవతి మూత్రే చ బిన్దుం బిన్దుం స్రవత్యపి ॥ విదధ్యాదుత్తరం వస్తిం యథాస్వౌషధసంస్కృతమ్ ॥ పుష్పనేత్ర ప్రమాణం తు ప్రమదానాం దశాఙ్గులమ్ ॥ మూత్రస్రోతః పరీణాహం మూత్రస్రోతోఽనువాహిచ । గర్భమార్గే తు నారీణాం విధేయం చతురఙ్గులమ్ ॥ ద్వ్యఙ్గులం మూత్రమార్గే తు బాలాయాస్త్వేక మఙ్గులమ్ । ఉత్తానాయాః శయానాయాః సమ్యక్ సఙ్కోచ్య సక్థినీ ॥ అథాస్యాః ప్రణయేన్నేత్ర మనువంశగతం సుఖమ్ । ద్విస్త్రిశ్చతురితి స్నేహాన హోరాత్రేణ యోజయేత్ ॥ వస్త్రౌ, వస్త్రౌ ప్రణీతే చ వస్తిశ్చాన్తర్గతో భవేత్ । త్రిరాత్రం కర్మ కుర్వీత స్నేహమాత్రాం వివర్ధయన్ ॥ అనేనైవ విధానేన కర్మ కుర్యాత్పునస్త్ర్యహాత్ ॥73॥

అ॥ ఉత్తరవస్తిని స్త్రీలకు ఆర్తవకాలమునందు చేయింపవలయును. అప్పుడు గర్భాశయము తెరచుకొనియుండి స్నేహమును సుఖముగ గ్రహించును అప్పుడు వాతము హరింపబడుటవలన ఆట్టిస్త్రీకి వెంటనే గర్భము కలుగును. మూత్రాశయమునందు జనించిన వ్యాధులు, యోనివిభ్రంశమువలనజనించిన వ్యాధులు, తీవ్రమైన యోనిశూల, యోనివ్యాపత్తులు, అసృగ్దరము, మూత్రము వెడలకుండుట, మూత్రము బొట్లుబొట్లుగ స్రవించుచుండుట ఈ వ్యాధులయందు ఆయా వ్యాధులనునశింపచేయు ద్రవ్యములతో తయారుచేయబడిన ఉత్తరవస్తిని చేయింపవలయును. స్త్రీలకుపయోగింపబడు ఉత్తరవస్తియొక్క నేత్రము పదియంగుళములపొడవుగను మూత్రస్రోతస్సుతో సమానమైన లావుకలదిగను మూత్రస్రోతస్సునందు సుఖముగ ప్రవేశించునదిగను నుండవలయును. ఈ నేత్రమును గర్భమార్గమునందైనచో నాలుగంగుళములుగను, మూత్రమార్గమునందైనచో రెండంగుళములుగను, బాలికకైనచో ఒకఅంగుళముగను ప్రవేశపెట్టవల

యును. వెల్లకితలగ పరుండి తొడలను బాగుగ ముడుచుకొనియున్న స్త్రీకి నేత్రమును వెన్నుపూస ననుసరించి సుఖముగ ప్రవేశపెట్టవలయును. స్నేహమును ఇట్లు ఒకరాత్రింబగలునందు రెండుసారులుగాని మూడుసారులుగాని నాలుగుసారులుగాని ప్రయోగింపవలయును. పూర్వమునం దియ్యబడిన వస్తి బయలు వెడలినపిదపనే తరువాత వస్తిని ఇచ్చుచుండవలయును. స్నేహముయొక్క పరిమితిని వృద్ధినొందించుకొనుచు ఇట్లు మూడు రోజులు చేయింపవలయును. పిమ్మట మూడు రోజు లూరకొని పిదప మరల ఇదేవిధమున చేయింపవలయును.

మూ॥ అతః శిరోవికారాణాం కశ్చిద్భేదః ప్రవక్ష్యతే ॥74॥

అ॥ పిమ్మట శిరోవ్యాధులయొక్క కొన్ని భేదములను చెప్పుచున్నాము.

శంఖకముయొక్క లక్షణములు — చికిత్స.

మూ॥ రక్తపిత్తానిలా దుష్టాః శఙ్ఖదేశే విమూర్ఛితాః । తీవ్ర రుగ్దాహరాగం హి శోఫం కుర్వన్తి దారుణమ్ ॥ స శిరో విషవద్వేగీ నిరుధ్యాశు గలం తథా । త్రిరాత్రాజ్జీవితం హన్తి శఙ్ఖకో నామ నామతః॥ జీవేత్త్ర్యహం చేద్భైషజ్యం ప్రత్యాఖ్యాయసమాచరేత్ । శిరోవిరేకసేకాది సర్వం వీసర్పనుచ్చ యత్ ॥77

అ॥ వాతమును పిత్తమును కఫమును దుష్టినొందినవై కణతలను పొంది తీవ్రమైన బాధ తాపము ఇవి కలిగినట్టియు దారుణమైనట్టియు శోఫను కలిగించును. ఆశోఫ విషమువలె వేగముకలదై శిరస్సును కంఠమును వెంటనే అరికట్టి మూడురోజులలో ప్రాణమును హరింపచేయును. అది శంఖకమని చెప్పబడును. రోగి మూడురోజుల వరకు బ్రతికియున్నయెడల అసాధ్యమని తలచియే చికిత్సింపవలయును. వస్యకర్మను కషాయాదులచే తడుపుట మొదలగువానిని, విసర్పనాశకమగు సమస్త క్రియలను చేయింపవలయును.

అర్ధావభేదకముయొక్క లక్షణములు — చికిత్స.

మూ॥ రూక్షాత్యధ్యశనాత్పూర్వ వాతావశ్యాయమైథునైః । వేగసన్ధారణాయాస వ్యాయామైః కుపితోఽనిలః కేవలః సకఫో వాపి గృహీత్వాఽర్ధం శిరో బలీ । మన్యాభ్రూశఙ్ఖకర్ణాక్షి లలాటార్ధే చ వేదనామ్॥ శస్త్రారణినిభాం కుర్యాత్తీవ్రాం సోఽర్ధావభేదకః । నయనం వాఽథ వా శ్రోత్రమతివృద్ధో వినాశయేత్ ॥ చతుః స్నేహోత్తమా మాత్రా శిరఃకాయ విరేచనమ్ । నాడీస్వేదో ఘృతం జీర్ణం వస్తికర్మాను వాసనమ్ ॥ ఉపనాహః శిరోవస్తిర్దహనం చాత్ర శస్యతే । ప్రతిశ్యాయే శిరోరోగే యచ్చోద్దిష్టం చికిత్సితమ్ ॥82॥

అ॥ రూక్షపదార్థములను సేవించుట, అధికముగ భుజించుట, అధ్యశనము, ఎదురుగాలి, మంచు, మైథునము, వేగసంధారణము, శ్రమనుకలిగించు పనులనుచేయుట, వ్యాయామము వీనివలన వాతము ప్రకోపించి కేవలముగాని కఫముతో గూడికాని బలముగలదై శిరస్సుయొక్క అర్ధభాగమును పొంది ఆ యర్ధభాగమునందున్న మన్యాప్రదేశము కనుబొమ్మ కణత చెవి నేత్రము నుదురు వీనియందు కత్తితో ఛేదింపబడుచున్నట్లును అరణితో మథింపబడుచున్నట్లును నుండునట్టి తీవ్రమైన బాధను కలిగించును. అది అర్ధావభేదమని చెప్పబడును. ఈవ్యాధి అధికమైనచో కన్నునుగాని చెవినిగాని చెడగొట్టును. ఈవ్యాధిని నాలుగు-స్నేహములను ఉత్తమమాత్రగనిచ్చుట నస్యకర్మ విరేచనకర్మ నాడీస్వేదము పురాణఘృతము వస్తికర్మ అనువాసనవస్తి ఉపనాహస్వేదము శిరోవస్తి దాహకర్మ వీనిచే చికిత్సింపవలయును. మరియు ప్రతిశ్యాయమునందును శిరోవ్యాధయందును చెప్పబడిన చికిత్సలను చేయింపవలయును.

## సూర్యావర్తముయొక్క లక్షణములు - చికిత్స

మూ॥ సంధారణాదజీర్ణాద్వా ర్మస్తిష్కాంర క్తమారుతౌ। దుష్టౌ దూషయత స్తచ్చ దుష్టం తాభ్యాం విమూర్ఛితమ్। సూర్యోదయేఽంశుసంతాపాద్దుఃఖం నిష్యన్దతే శనైః। తదా దినే శిరశ్శూలం దినవృద్ధ్యా చ వర్ధతే॥ దినక్షయే తతః స్త్యానే మస్తిష్కే సంప్రశామ్యతి। సూర్యావర్తః స ఏవ స్యాత్సర్పిరౌత్తరభక్తికమ్॥ శిరః కాయవిరేకౌ చ మూర్ధ్ని చ స్నేహధారణమ్। జాఙ్గలైరుపనాహాశ్చ ఘృతక్షీరైశ్చ సేచనమ్॥ బస్తితిత్తిరిలావాదిశృతక్షీరోత్థితం ఘృతమ్। నావనం జీవనీయాష్టగుణక్షీరోపసాధితమ్ ॥87॥

అ॥ వేగధారణము అజీర్ణము మొదలగువానిచే రక్తమును వాతమును దుష్టినొందినవై మెదడును దూషింపచేయును. అట్లు దూషింపబడిన మెదడు సూర్యోదయమైనపిమ్మట సూర్యకిరణములయొక్క వేడిమివలన మెల్లగ కష్టముచే కరుగును. అప్పుడు, సూర్యుడు వృద్ధినొందినకొలదియు శిరస్సునందు శూల వృద్ధినొందును. సూర్యుడుక్షీణించుచున్నకొలదియు మెదడు గట్టిపడును శూలకూడ తగ్గును. ఇట్లు పగటియందు జరుగును. అది సూర్యావర్తమని చెప్పబడును. ఈవ్యాధికలవానికి భోజనానంతరమునందు ఘృతపానమును చేయింపవలయును. నస్యమును విరేచనకర్మను చేయింపవలయును. శిరస్సునందు స్నేహమును ధరింపచేయవలయును. జాంగలమాంసముచే ఉపనాహస్వేదమును, ఘృతము పాలు వీనిచే సేచనమును చేయింపవలయును. మేకలి తిత్తిరిపక్షి లావుకపక్షి మొదలగువానితో కాచబడిన పాలనుండి పుట్టినట్టి ఘృతమును జీవనీయగణద్రవ్యములతోను, ఎనిమిదిరెట్లపాలతోడను తయారుచేసి ఆఘృతముతో నస్యకర్మను చేయింపవలయును.

### అనంతవాతముయొక్క లక్షణములు - చికిత్స.

మూ॥ ఉపవాసాతిశోకాతిరూక్షశీతాల్పభోజనైః । దుష్టా దోషాస్త్రయో మన్యాపశ్చాద్ఘాటాసు వేదనామ్ ॥ తీవ్రాం కుర్వన్తి నాసాక్షిభ్రూశఙ్ఖేష్వవతిష్ఠతే। స్పన్దనం గణ్డపార్శ్వస్య నేత్రరోగం హనుగ్రహమ్। సోఽనన్తవాతస్తం హన్యాచ్ఛిరోఽర్కావర్తనాశనైః॥89॥

అ॥ ఉపవాసము, అధికమగుశోకము, మిక్కిలి శీతముగను రూక్షముగను నున్న పదార్థములను భుజించుట, స్వల్పముగ భుజించుట వీనివలన మూడు దోషములును ప్రకోపించి మెడకొంకుల వెనుకభాగమునందును మెడయొక్క వెనుకభాగమునందును తీవ్రమైనబాధను కలిగించును. ఆబాధ ముక్కునందును కండ్లయందును కనుబొమ్మల యందును కణతలయందును ఉన్నదై కపోలప్రదేశముయొక్క పార్శ్వభాగమునందు కదలుటను, నేత్రరోగమును, హనుగ్రహమును కలిగించును. అది అనంతవాతమని చెప్పబడును. సూర్యావర్తవ్యాధికి చెప్పబడిన చికిత్సనే ఈవ్యాధియందు కూడ చేయింపవలయును.

### శిరఃకంపముయొక్క లక్షణములు - చికిత్స.

మూ॥ వాతో రూక్షాదిభిః క్రుద్ధః శిరః కమ్పముదీరయేత్ । తత్రామృతాబలారాస్నా మహాశ్వేతాశ్వగన్ధకైః । స్నేహస్వేదాది వాతఘ్నం శస్తం నస్యం చ తర్పణమ్ ॥9 ॥

అ॥ రూక్షాదులచే వాతము ప్రకోపించి శిరస్సును కంపింపచేయును. అది శిరఃకంపమని చెప్పబడును. దీనియందు తిప్పతీగ ముత్తవపులగము సన్నరాష్ట్రము నేలగుమ్మడు పెన్నేరు వీనితోకూడిన స్నేహస్వేదాదులను, వాతనాశకమైన చికిత్సను, నస్యకర్మను, తర్పణమును చేయింపవలయును.

మూ॥ నస్తః కర్మ చ కుర్వీత శిరోరోగేషు శాస్త్రవిత్ । ద్వారం హి శిరసో నాసా తేన తద్వ్యాప్య హన్తి తాన్ ॥92॥

అ॥ తెలిసినమనుజుడు సమస్తమైనశిరోవ్యాధులయందును నస్యకర్మను చేయింపవలయును. ముక్కు శిరస్సునకు ద్వారముగ నుండును. అందువలన ఔషధము ముక్కుద్వారా శిరస్సునందు వ్యాపించి అచ్చటివ్యాధులను నశింపచేయును.

### నస్యకర్మవివరణము.

మూ॥ నావనం చావపీడశ్చ ధ్మాపనం ధూమ ఏవ చ । ప్రతిమర్శశ్చ విజ్ఞేయో నస్తః కర్మ తు పఞ్చధా ॥ స్నేహనం శోధనంచైవ ద్వివిధం నావనం స్మృతమ్। శోధనః స్తమ్భనశ్చ స్యాదవపీడో ద్విధా

మతః ॥ చూర్ణస్యా ధ్మాపనం నామ దేహశ్లేష్మవిశోధనమ్ । విజ్ఞేయ స్త్రివిధో ధూమః ప్రాగుక్తః శమనాదికః ॥ ప్రతిమర్శో భవేత్స్నేహో నిర్దోష ఉభయార్థకృత్ । ఏవం తద్రేచనం కర్మ తర్పణం శమనం త్రిధా ॥96॥

అ॥ నావనము, అవపీడము, ధ్మాపనము, ధూమము, ప్రతిమర్శము అనెడిభేదములచే నస్యకర్మ ఐదువిధములుగ నుండును. వానిలో నావనము స్నేహనమనియు శోధనమనియు రెండువిధములుగ నుండును. అవపీడము శోధనమనియు స్తంభనమనియు రెండు విధములుగ నుండును. దేహమునందలిస్రోతస్సులు శుద్ధినొందునిమిత్తము చూర్ణమును ముక్కులోనికి ఊదుట ధ్మాపన మనబడును. శమనాదిభేదములచే మూడువిధములగు ధూమము పూర్వమునందు చెప్పబడినది. స్నేహముచే నస్యకర్మను చేయించుట ప్రతిమర్శ మనబడును. ఇది దోషరహితముగను శోధనశమనములను చేయునదిగను నుండును. ఐదువిధములైన ఈనస్యకర్మ రేచనమనియు తర్పణమనియు శమనమనియు మూడువిధములుగ నుండును.

## రేచనాది నస్యములయొక్క ఉపయోగము.

మూ॥ స్తమ్భసుప్తి గురుత్వాద్యాః శ్లైష్మికా యే శిరోగదాః । శిరసో రేచనం తేషు నస్తఃకర్మ ప్రశస్యతే ॥ యే చ వాతాత్మకా రోగాః శిరః కమ్పార్దితాదయః । శిరస స్తర్పణం తేషు నస్తఃకర్మ ప్రవక్ష్యతే ॥ రక్తపిత్తాదిరోగేషు శమనం నస్యమిష్యతే ॥98॥

అ॥ స్తంభించుట మొద్దుబారుట గురుత్వము మొదలగు శ్లేష్మసంబంధమైన శిరోవ్యాధులయందు రేచననస్యకర్మను, శిరఃకంపము అర్దితము మొదలగు వాతవ్యాధులయందు తర్పణనస్యకర్మను, రక్తపిత్తము మొదలగువ్యాధులయందు శమననస్యకర్మను చేయింపవలయును.

మూ॥ ధ్మాపనం ధూమపానం చ యథాయోగ్యేషు శస్యతే । దోషాదికం సమీక్ష్యైవ భిషక్ సమ్యక్ చ కారయేత్ ॥99॥

అ॥ ధ్మాపననస్యమును ధూమపాననస్యమును వానికి తగినవ్యాధులయందు దోషాదులను తెలిసికొని సరిగ చేయింపవలయును.

మూ॥ ఫలాది భేషజం ప్రోక్తం శిరసో యద్విరేచనమ్ । తత్తు సంకల్పయే త్తేన పచేత్స్నేహం విరేచనమ్ ॥ యదుక్తం మధురస్కన్ధే భేషజం తేన తర్పణమ్ । సాధయిత్వా భిషక్ స్నేహం నస్తః కుర్యాద్విధానవిత్ ॥10౦॥

అ॥ శిరోవిరేచనద్రవ్యములుగ చెప్పబడిన ఫలములు వేళ్ళు మొదలగువానితో తయారుచేయబడిన చూర్ణాదికల్పనలనుగాని స్నేహమునుగాని రేచననస్యమునిమిత్తము ఉపయోగింపవలయును. మధురస్కంధమునందు చెప్పబడినద్రవ్యములతో తయారు చేయబడిన స్నేహమునుతర్పణనస్యమునిమిత్తము, విధానమును తెలిసికొని ఉపయోగింపవలయును.

## నస్యకర్మవిధానము.

మూ॥ ప్రాక్పూర్వాహ్ణే మధ్యసూర్యే వా కుర్యాత్తర్పణమేవ చ। ఉత్తానస్య శయానస్య శయనే స్వాస్తృతే సుఖమ్॥ ప్రలమ్బశిరసః కించిత్కించిత్పాదోన్నతస్య చ। దద్యాన్నాసాపుటే స్నేహంతర్పణం బుద్ధిమాన్ భిషక్ ॥ అనవాక్శిరసో నస్యం న శిరః ప్రతిపద్యతే। అత్యవాక్శిరసో నస్యం మస్తులుఙ్గే చ తిష్ఠతి॥ అత ఏవ శయానస్య శుద్ధ్యర్థం స్వేదయేచ్ఛిరః। సంస్వేద్య నాసామున్నామ్య వామేనాఙ్గుష్ఠపర్వణా హస్తేన దక్షిణేనాథ దద్యాదుభయతః సమమ్। ప్రణాల్యా పిచునా వాపి నస్తః స్నేహం యథావిధి ॥ కృతే చ స్వేదయేద్భూయ ఆకర్షేచ్చ పునః పునః। తం స్నేహం శ్లేష్మణా సార్ధం తథా స్నేహో న తిష్ఠతి ॥ 10 ॥

అ॥ తర్పణనస్యమును సూర్యోదయమునకు పూర్వమునందుగాని మధ్యాహ్నమునందుగాని చేయింపవలయును. బాగుగపరువబడినశయనమునందు సుఖముగ పరున్నట్టియు కొంచెముగ వెనుకకు వంచబడిన శిరస్సుకలిగినట్టియు కొద్దిగ ఎత్తిబడినపాదములు కలిగి నట్టియు మనుజునకు నాసారంధ్రములయందు తర్పణస్నేహమును ప్రయోగింపవలయును. శిరస్సునువంచకుండగ నస్యమును ప్రయోగించినచో అది శిరస్సును పొందదు. శిరస్సుఅధికముగవంచి ప్రయోగించినచో అది మెదడునందు ప్రవేశించును. సరిగ పరుండియున్న వానియొక్క శిరస్సునకు శుద్ధినొందు నిమిత్తము స్వేదకర్మను చేయింపవలయును. పిమ్మట ఎడమచేతిబొటనవ్రేలితో నాసికనుఎత్తిపట్టి కుడిచేతితో గొట్టముచేదూదిచేగాని నస్యస్నేహమును రెండురంధ్రములయందును సమముగ విధిననుసరించి ప్రవేశపెట్టవలయును. అట్లుప్రవేశపెట్టగనే మరల స్వేదకర్మనుచేయించి ఆస్నేహమును శ్లేష్మముతోకూడ బయలువెడలించుచుండవలయును. అట్లు చేసినచో స్నేహము లోన ఉండనేరదు.

## ధూమపానప్రయోగము.

మూ॥ స్వేదేనోత్క్లేశితః శ్లేష్మా నస్తఃకర్మణ్యుపస్థితః। భూయః స్నేహస్య శైత్యేన శిరసి స్త్యాయతే తతః ॥ శ్రోత్రమన్యాగ

లాద్యేషు వికారాయ స కల్పతే। తతోఽనస్తః కృతే ధూమం పిబేత్ కఫవినాశనమ్ ॥ హితాన్నభుఙ్నివాతోష్ణ సేవీస్యాన్నియతేన్ద్రియః ॥

అ॥ స్వేదకర్మచే ఉత్క్లేశమునొందింపబడినశ్లేష్మము లోనఉన్నచో ముక్కుల ప్రయోగింపబడుచున్న స్నేహముయొక్క శైత్యమువలన శిరస్సునందుగడ్డగట్టి చెవులు మెడకొంకులు కంఠము మొదలగువానియందు వ్యాధులను కలిగించును. అందువలన నస్యకర్మను చేయించినపిదప కఫమునునశింపజేయు ధూమపానమును చేయింపవల యును. మరియు హితమైనఆహారమును గాలిలేనిప్రదేశమును ఉష్ణపదార్థములను సేవించువాడుగను, ఇంద్రియనిగ్రహముకలవాడుగను నుండవలయును.

## ప్రధ్మాపననస్య విధి.

మూ॥ విధిరేషోఽవపీడస్య కార్యః ప్రధ్మాపనస్య తు। షడఙ్గుల్యాఽథవా నాల్యా ధమేచ్చూర్ణం ముఖేన తు ॥ విరిక్తశిరసం తూర్ణం పాయయిత్వాఽమ్బు భోజయేత్। లఘు త్రిష్వవిరుద్ధం చ నివాతస్థమతన్ద్రితః ॥ 112 ॥

అ॥ అవపీడననస్యముయొక్క విధానము పైవిధమున చెప్పబడినది. ప్రధ్మాపన నస్యముయొక్క విధానమును చెప్పుచున్నాము. నస్యచూర్ణమును ఆరంగుళములపొడవు కల గొట్టమునందుపోసి నోటితో ముక్కులోనికి ఊదవలయును. శిరస్సుశుద్ధినొందిన పిదప వెంటనే ఉదకమును త్రాగించి గాలిలేనిప్రదేశమునందుంచి లఘుగుణము కలిగి నట్టియు మూడుదోషములకును విరుద్ధముకానట్టియు ఆహారమును ఈయవలయును.

మూ॥ విరేకశుద్ధౌ దోషస్య కోపనం యస్య సేవతే। స దోషో విచరంస్తత్ర కరోతి స్వాన్ గదాన్బహూన్ ॥ యథాస్వం విహితాం తేషు క్రియాం కుర్యాద్విచక్షణః। అకాలకృతజాతానాం రోగాణామనురూపతః ॥ 114 ॥

అ॥ రేచననస్యముచే శుద్ధినొందినపిదప అహితములైన ఆహారాదులను సేవించిన యెడల ఆయాదోషములు ప్రకోపించి వానిసంబంధమైన అనేకవ్యాధులను కలిగిం చును. అప్పుడు, ఆవ్యాధులకు చెప్పబడిన చికిత్సలను చేయవలయును. నస్యకర్మ అకాలమునందు చేయబడుటవలన వ్యాధులుకలిగినయెడల ఆవ్యాధులకు తగుచికిత్సను చేయింపవలయును.

## నస్యకర్మకు అనర్హులు.

మూ॥ అజీర్ణే భుక్తభుక్తే చ తోయపీతేఽథ దుర్దినే। ప్రతిశ్యాయే నవే స్నానే స్నేహపానేఽనువాసనే ॥ నావనం స్నేహసం

రోగాన్కరోతి శ్లైష్మికాన్బహూన్ । తత్ర శ్లేష్మహరః సర్వస్తీక్ష్ణోష్ణాది విధిర్హితః॥ క్షామే విరేచితే గర్భే వ్యాయామాభిహతేష్వపి । వాతో రూక్షేణ నస్యేన క్రుద్ధః స్వాఞ్జనయేద్గదాన్ ॥ తత్ర వాతహరః సర్వో విధిః స్నేహనబృంహణః । స్వేదాదిః స్యాద్ఘృతం క్షీరం గర్భిణ్యాస్తు విశేషతః ॥ జ్వరశోకాభితప్తానాం తిమిరం మద్యపస్య చ । రూక్షైః శీతాఞ్జనైర్లేపైః పుటపాకైశ్చ సాధయేత్ ॥119॥

అ॥ అజీర్ణమాకలవాడు అప్పుడేభుజించినవాడు జలమునుత్రాగినవాడు ప్రతిశ్యాయముకలవాడు అప్పుడే స్నానమునాచరించినవాడు స్నేహపానముచేసినవాడు అనువాసనవస్తినిచేయింపబడినవాడు వీరలకును, దుర్దినమునందును స్నేహనస్యమును చేయింపకూడదు. చేయించినయెడల అనేకవిధములైన శ్లేష్మవ్యాధులు కలుగును. అప్పుడు, శ్లేష్మనాశకములైనసమస్తక్రియలను చేయింపవలయును. మరియు తీక్ష్ణగుణము ఉష్ణవీర్యము మొదలగునవికల పదార్థములచే తగువిధానములను చేయింపవలయును. కృశించినవాడు విరేచనములను చేయింపబడినవాడు గర్భిణీస్త్రీ వ్యాయామముచే కృశించినవాడు వీరలకు రూక్షమైననస్యమును చేయించినయెడల వాతము ప్రకోపించి అనేకవిధములైన వాతవ్యాధులను కలిగించును. అప్పుడు, వాతహరములైన సమస్తవిధానములను చేయింపవలయును. స్నేహకర్మ బృంహణవిధి స్వేదకర్మ మొదలగువానిని చేయింపవలయును. గర్భిణీస్త్రీకి ఘృతమును పాలను విశేషించిఈయవలయును జ్వరము దుఃఖము వీనితో కూడినవారలకును మద్యపానమునుచేయువారలకును నస్యకర్మను చేయించినయెడల తిమిరమనెడినేత్రవ్యాధి కలుగును. అప్పుడు రూక్షములైన శీతాంజనములు లేపములు పుటపాకములు వీనిని చేయింపవలయును.

## ప్రతిమర్షనస్య గుణము.

మూ॥ స్నేహనం శోధనం చైవ ద్వివిధం నస్యముచ్యతే । ప్రతిమర్షశ్చ నస్యార్థం కరోతి న చ దోషవాన్ ॥ నస్తః స్నేహాఙ్గులిం దద్యాత్ప్రాతర్నిశి చ సర్వదా । న చోత్సింఘేదరోగాణాం ప్రతిమర్శః స దార్ఢ్యకృత్ ॥121॥

అ॥ నస్యకర్మ స్నేహనమనియు శోధనమనియు రెండువిధములుగ నుండును. ప్రతిమర్షనస్యమువలన రెండువిధములగు ఈప్రయోజనములును కలుగును. మరియు దోషములను కలిగింపదు. స్నేహముతోకూడిన వ్రేలిని ప్రాతఃకాలమునందును రాత్రియందును ఎల్లప్పుడును ముక్కునందుంచుకొని ఆస్నేహమును పీల్చవలయును. ఈప్రతిమర్షనస్యము ఆరోగ్యవంతులకుగూడ హితకరముగ నుండును. శిరస్సు కపాలము మొదలగువానికి దార్ఢ్యమును కలిగించును.

## అధ్యాయ సంగ్రహము.

మూ॥ త్రీణియస్మాత్ప్రధానాని మర్మాణ్యభిహతేషు చ । తేషు లిఙ్గం చికిత్సాం చ రోగభేదాశ్చ సౌషధాః॥ విధిరుత్తరవస్తేశ్చ నస్తః కర్మవిధిస్తథా। షడ్వ్యాపద్భేషజం సిద్ధౌ మర్మాధ్యాయే ప్రకీర్తితమ్ ॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే సిద్ధిస్థానే త్రిమర్మీయ సిద్ధిర్నామ నవమోఽధ్యాయః ॥

అ॥ ఈత్రిమర్మీయసిద్ధ్యధ్యాయమునందు - మూడువిధములైనమర్మలు ప్రధానముగనుండుటకు కారణము, ఆమర్మలు అభిఘాతమునొందినప్పుడు కలుగు లక్షణములు, అప్పుడు చేయవలసిన చికిత్సలు, మర్మలసంబంధమగు వ్యాధులయొక్క భేదములు, వాని చికిత్సలు, ఉత్తరవస్తివిధానము, నస్యకర్మవిధానము, నస్యకర్మ వలనకలుగు ఆరువిధము లగువ్యాపత్తులు, ఆవ్యాపత్తులయొక్క చికిత్సలు ఇవి చెప్పబడినవి.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు త్రిమర్మీయసిద్ధి యనెడు నవమాధ్యాయము సమాప్తము.

—0—

# దశమాధ్యాయము.

మూ॥ అథాతో వస్తిసిద్ధిం వ్యాఖ్యాస్యామః ॥1॥

అ॥ పిమ్మట వస్తిసిద్ధిని చెప్పబోవుచున్నాను.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

అ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ సిద్ధానాం వస్తీనాం శస్తానాం తేషు తేషు రోగేషు । శృణ్వగ్నివేశ । గదతః సిద్ధిం సిద్ధిప్రదాం భిషజామ్ ॥3॥

అ॥ ప్రసిద్ధములైనట్టియు ఆయారోగములను నశింపచేయునట్టియు వైద్యులకు కార్యసిద్ధిని కలిగించునట్టియు వస్తులను చెప్పుచున్నాను. వినుము.

మూ॥ బలదోషకాల రోగప్రకృతీః ప్రవిభజ్య యోజితః సమ్యక్। స్వైః స్వైరౌషధవర్గైః స్వాన్స్వాన్ రోగాన్నివర్తయతి ॥

కర్మాన్యద్వస్తి సమం న విద్యతే శీఘ్రసుఖవిశోధితత్వాత్ । ఆశ్వపతర్పణ తర్పణ యోగాచ్చ నిరత్యయత్వాచ్చ ॥ సత్యపి దోషహరత్వే కటు తీక్ష్ణోష్ణాది భేషజాదానాత్ ॥ దుఃఖోద్గారోత్క్లేశాహృద్యత్వకోష్ఠరుజా విరేకే స్యుః ॥ అవిరేచ్యౌ శిశువృద్ధౌ తావప్రాప్తహీన ధాతుబలౌ ॥ ఆస్థాపనమేవ తయోః సర్వార్థ కృదుత్తమం కర్మ ॥ బలవర్ణహర్షమార్దవగాత్ర స్నేహాన్నృణాం దధాత్యాశు ॥7॥

అ॥ బలము దోషము కాలము రోగము ప్రకృతి వీనిని బాగుగ తెలిసికొని ఆయా వ్యాధులకు అనుకూలములైన ద్రవ్యములతో కూడినట్టి వస్తులను ప్రయోగించినచో ఆయా వ్యాధులను నశింపచేయును. వస్తికర్మ శీఘ్రముగను సుఖముగను శోధించునదగుటవలనను, అపతర్పణమును తర్పణమును నెంటనే చేయునదగుటవలనను, ఉపద్రవములను కలిగింపనిదగుటవలనను దీనికంటె శ్రేష్ఠమైనకర్మ మరియొకటిలేదు. వమనకర్మయు విరేచనకర్మయు దోషములను హరించునవైనను కటురసము తీక్ష్ణగుణము ఉష్ణవీర్యము మొదలగునవికల ద్రవ్యములతో కూడునవగుటవలన దుఃఖమును, త్రేనుపులను ఉత్క్లేశమును, అప్రియత్వమును, కోష్ఠమునందు బాధలను కలిగించుచుండును. పొందబడని ధాతుబలముకలవారగుటవలన బాలురకును, క్షీణించిన ధాతుబలము కలవారగుటవలన వృద్ధులకును వమనవిరేచనకర్మలను చేయించకూడదు. వారలకు సమస్తప్రయోజనములను కలిగించు ఆస్థాపనవస్తియే ఉత్తమకర్మగ నుండును. బలము కాంతి సంతోషము మార్దవము శరీరస్నిగ్ధత్వము వీనిని మనుజులకు ఆస్థాపనవస్తి వెంటనే కలిగించును.

మూ॥ అనువాసనం నిరూహశ్చోత్తర వస్తిశ్చ స త్రివిధః । శాఖావాతార్తానాం సఙ్కుచితస్తబ్ధ భగ్నసన్ధీనామ్ ॥ విట్సఙ్గాధ్మానారుచిపరికర్తి రుగాదిషు చ శస్తః ఉష్ణార్తానాం శీతాఞ్ఛీతార్తానాం తథా సుఖోష్ణాంశ్చ ॥ తదర్హౌషధయుక్తాన్ వస్తీన్ సన్తర్క్య విసృజ్యాత్ । వస్తీన్న బృంహణీయాన్దద్యాద్వ్యాధిషు విశోధనీయేషు ॥ మేదస్వినో విశోధ్యా యే చ నరాః కుష్ఠమేహార్తాః । న క్షీణక్షత దుర్బలమూర్ఛిత కృశశుష్క స్తబ్ధదేహానామ్ । దద్యాద్విశోధనీయాన్దోష నిబద్ధాయుషో యే చ ॥8॥

అ॥ వస్తి అనువాసనమనియు నిరూహమనియు ఉత్తరవస్తియనియు మూడు విధములుగ నుండును. శాఖావాతముతో కూడినవారలకును, సంకోచమునొందినట్టియు స్తంభించినట్టియు విరిగినట్టియు సంధులుకలవారలకును, మలబంధము కడుపుబ్బరము అరుచి పరికర్తికయనెడిబాధ మొదలైనవికలవారలకును వస్తికర్మ ప్రశస్తమైనదిగ నుండును. ఉష్ణవ్యాధులుకలవారలకు శీతలవస్తులను, శీతవ్యాధులుకలవారలకు సుఖోష్ణములైనవస్తులను వానికనుకూలములైనద్రవ్యములతో తయారుచేసి యోజించి ప్రయో

గింపవలయును. మేదోరోగము కుష్ఠము మేహము మొదలైన మిక్కిలి శోధింపదగినట్టి వ్యాధులయందు బృంహణీయములైన వస్తువులను ప్రయోగింపకూడదు. క్షీణించినవాడు అభిఘాతమునొందినవాడు దుర్బలుడు మూర్ఛనొందినవాడు కృశించినవాడు శుష్కించి నట్టియు స్తంభించినట్టియు శరీరముకలవాడు మలము నాధారముగ చేసికొనియున్న బలముకలవాడు వీరలకు శోధనములైనవస్తువులను ప్రయోగింపకూడదు.

మూ॥ వాజీకరణేఽసృక్పిత్తయోర్మధుఘృతవయః సంయుతాః సర్వే। శస్తాః సతైలమూత్రారనాలలవణాః కఫావృతే వాతే ॥16॥

అ॥ వాజీకరణమునిమిత్తమును, రక్తవ్యాధులు పిత్తవ్యాధులు ఇవి వశించునిమిత్తమును ప్రయోగింపబడు సమస్తవస్తులయందు గను తేనె ఘృతము పాలు వీనిని చేర్చుట శ్రేష్ఠముగనుండును కఫముతో కూడినవాతము శమించునిమిత్తము ప్రయోగింపబడు వస్తులయందు తైలము గోమూత్రము ఆరనాళము సైంధవలవణము వీనిని చేర్చుట శ్రేష్ఠముగనుండును.

మూ॥ యుజ్యాద్వస్తిష్వమ్లం మూత్రం పయస్సురాం క్వాథాన్। అవిరోధాద్ధాతూనాం రసయోనిత్వాచ్చ జలముష్ణమ్॥ సురదారుశతాహ్వైలాకుష్ఠమధుకపిప్పలీమధుస్నేహాః। ఉద్వాలోమభాగాః ససర్షపా శర్కరా లవణమ్॥ ఆవాపో వస్తీనామతః ప్రయోజ్యాని యేషు యాని స్యుః। యుక్తాని సహ కషాయైస్తదుత్తరతః ప్రవక్ష్యామి॥ చిరజాతకఠినబలిషు వ్యాధిషు తీక్ష్ణా విపర్యయే చ మృదవః। సప్రతివాపకషాయైర్యోజ్యాస్తనువాసననిరూహాః ॥17॥

అ॥ కాంజికము మొదలగుఆమ్లద్రవ్యములు, గోమూత్రము, పాలు, సురయనెడి మద్యము, కషాయములు ఇవి ధాతువులకు విరోధమును కలిగింపనివగుటవలన వీనిని సమస్తవస్తులయందును ప్రయోగింపవచ్చును. మరియు జలము సమస్తరసములకుకారణమైనదగుటవలన వేడినీటిని ఉపయోగింపవచ్చును. దేవదారు సదాప ఏలకులు చెంగల్వకోష్టు యష్టిమధుకము పిప్పళ్ళు తేనె స్నేహములు వమనద్రవ్యములు విరేచనద్రవ్యములు ఆవాలు పంచదార సైంధవలవణము వీనిని సమస్తవస్తులయందును కల్కముగ ఉపయోగింపవచ్చును. వీనిని ముందు చెప్పబోవుకషాయములతో ఆయాదోషములనను సరించి తగురీతిని ఉపయోగించుకొనవలయును. కల్కము కషాయము వీనితో కూడిన అనువాసనవస్తులను నిరూహవస్తులను చిరకాలమైజనించినట్టియు మిక్కిలి బలిష్ఠములై నట్టియు వ్యాధులయందు తీక్ష్ణములుగ నుండునట్లును, వీనికివ్యతిరేకములైనవ్యాధుల యందు మృదువులుగనుండునట్లును ప్రయోగింపవలయును.

మూ॥ అర్ధశ్లోకైరతః సిద్ధాన్నానావ్యాధిషు వర్గశః। వస్తీన్ వీర్యసమైర్భాగైర్యథాస్వానిహ తాఞ్ఛృణు ॥ బిల్వోఽగ్నిమన్థః

శ్యోనాకః కాశ్మర్యః పాటలిస్తథా । శాలిపర్ణీ పృశ్నిపర్ణీ బృహత్యౌ వర్ధమానకః ॥ యవాః కులత్థాః కోలాని స్థిరా చేతి త్రయోఽనిలే । శస్తాస్తే సచతుస్స్నేహాః పిశితస్య రసాన్వితాః ॥ నలవఞ్జులవానీరశతపత్రాణి శైవలమ్। మఞ్జిష్ఠాసారివాఽనన్తాపయస్యా మధుయష్టికా॥ చన్దనం పద్మకోశీరం తుఙ్గం చ పైత్తికే త్రయః । సశర్కరాఘృతక్షౌద్రాః సక్షీరా వస్తయో హితాః ॥ అర్కస్తథైవ చాలర్క ఏకాష్ఠీలా పునర్నవా । హరిద్రా త్రిఫలా ముస్తం పీతదారు కుటన్నటమ్ ॥ పిప్పల్యశ్చిత్రకశ్చేతి త్రయస్తే శ్లేష్మరోగిణామ్ । సక్షారక్షౌద్రాగోమూత్రా నాతిస్నేహాన్వితా హితాః ॥24॥

అ॥ సమస్తవ్యాధులయందును ఉపయోగించునట్టియు శక్తిసంపన్నములైనట్టియు అనుకూలమైనభాగములం కలిగినట్టియు వస్తులను వర్గములుగ ఒక్కొక్క అర్ధశ్లోకముచే చెప్పుచున్నాము. మారేడు నెల్లి పెద్దమ్రాను పెగ్గుమ్రాను కలిగొట్టు వీనియొక్కయు, ముయ్యాకుపొన్న కోలపొన్న చిన్నవాకుడు పెద్దవాకుడు ఆముదపువేళ్ళు వీనియొక్కయు, యవలు ఉలవలు రేగుగింజలు ముయ్యాకుపొన్న వీనియొక్కయు కషాయములయందు నాలుగుస్నేహములను మాంసరసమును చేర్చి ప్రయోగించినచో ఈమూడువస్తులును వాతమునశింపచేయుటయందు ప్రశస్తములుగనుండును. కిక్కసగడ్డి ప్రబ్బలి నీటిప్రబ్బలి తామరపువ్వు నాచు వీనియొక్కయు, మంజిష్ఠ సుగంధపాల నల్లసుగంధిపాల కాకోళీ యష్టిమధుకము వీనియొక్కయు, చందనము పుష్కరమూలము వట్టివేళ్ళు సురపొన్న వీనియొక్కయు కషాయములయందు పంచదార నెయ్యి తేనె పాలు వీనిని చేర్చి ప్రయోగించినచో ఈమూడువస్తులును పిత్తమునునశింపచేయుటయందు ప్రశస్తములుగ నుండును. జిల్లేడు తెల్లజిల్లేడు పిచ్చుబుడ్డి గలిజేరు వీనియొక్కయు, పసుపు త్రిఫలములు తుంగముస్తలు మ్రానిపసుపు భద్రముస్తలు వీనియొక్కయు, పిప్పళ్ళు చిత్రమూలము వీనియొక్క కషాయములయందు యవక్షారము తేనె గోమూత్రము వీనిని, స్వల్పపరిమితికలస్నేహమును చేర్చి ప్రయోగించినచో ఈమూడువస్తులును కఫమును నశింపచేయుటయందు ప్రశస్తములుగనుండును.

మూ॥ ఫలజీమూతకేక్ష్వాకుధామార్గవకవత్సకాః । శ్యామా చ త్రిఫలా చైవ స్థిరా దన్తీ ద్రవన్త్యపి ॥ ప్రకీర్యా చోదకీర్యా చ ॥ చత్వారో మాత్రసిద్ధాస్తే పక్వాశయవిశోధనాః । వ్యస్తైరపి సమస్తైశ్చ చతుర్యోగా ఉదాహృతాః ॥ 27॥

అ॥ మ్రంగకాయ దేవదాలి చేదుబీర పెద్దచేదుబీర కొండసపాలవిత్తులు వీనిని నల్లతెగడ త్రిఫలములు ముయ్యాకుపొన్న దంతి పెద్దదంతి వీనిని, కానుగ పెద్దకానుగ

నీలి పాలగుమ్మడు వీనిని, సంబరేణు ఈశ్వరి లొద్దుగ కంపిల్లకఫలము వీనిని గోమూత్రముతో సిద్ధముచేసి ప్రయోగించినచో ఈనాలుగువస్తువులను ప్రత్యేకముగ గాని అన్నియుకలిపికాని పక్వాశయమునుశోధంచుటయందు ప్రశస్తములుగ నుండును.

మూ॥ కాకోలీ క్షీర కాకోలీ ముద్గపర్ణీ శతావరీ। విదారీమధుయష్ట్యాహ్వే శృఙ్గాటకకశేరుకే॥ ఆత్మగుప్తాఫలం మాషాః సగోధూమా యవాస్తథా। జాఙ్గలానూపజం మాంసమిత్యేతే శుక్రమాంసదాః ॥29॥

అ॥ కాకోలి క్షీరకాకోలి అడవిపెసర పిల్లిపీచర వీనితోడను నేలగుమ్మడు యష్టిమధుకము పరికగడ్డ నమ్మదుంపలు వీనితోడను, పెద్దదూలగొండివిత్తులు మినుములు గోధుమలు యవలు వీనితోడను, జాంగలజంతువులయొక్క మాంసము ఆనూపజంతువులయొక్క మాంసము వీనితోడను చేయబడు వస్తులు శుక్రమును మాంసమును వృద్ధినొందించును.

మూ॥ జీవన్తీ చాగ్నిమన్థశ్చ ధాతకీపుష్పవత్సకౌ। ప్రగ్రహః ఖదిరః కుష్ఠం శమీ పిణ్డీతకో యవాః॥ ప్రియఙ్గూరక్తమూలీ చ తరుణీ స్వర్ణయూథికా। పటాద్యాః కింశుకం లోధ్రమితి సాంగ్రాహికామతాః॥

అ॥ మనుబాల నెల్లి ఆరెపువ్వు కొడిసెపాలు వీనితోడను, చిన్నరేల చండ్రచెంగల్వకోష్టు జమ్మి ప్రంగకాయ యవలు వీనితోడను, ప్రేంఖణము మంజిష్ఠ నల్లజీలకర్ర స్వర్ణయూథిక వీనితోడను, మఱ్ఱి మొదలగుక్షీరవృక్షములు మోదుగ లొద్దుగ వీనితోడను చేయబడు వస్తులు సంగ్రాహికశక్తికలవిగ నుండును.

మూ॥ పరిస్రవే శృతం క్షీరం సవృశ్చీరపునర్నవమ్॥ ఆఖుపర్ణికయా వాపి తండులీయకయుక్తయా ॥32॥

అ॥ తెల్లగలిజేరు ఎఱ్ఱగలిజేరు వీనితో గాని ఎలుకచెవియాకు చిర్రికూర వీనితో గాని కాచబడిన పాలచే చేయబడు వస్తి పరిస్రావమును హరింపచేయును.

మూ॥ కోలకతక కాణ్డేక్షుదర్భపోటేక్షువాలిభిః। దాహఘ్నః సఘృతక్షీరో ద్వితీయశ్చోత్పలాదిభిః॥ కర్బుదారాఢకీనీపవిదులైః క్షీరసాధితైః। వస్తిః ప్రదేయో భిషజా శీతః సమధుశర్కరః ॥34॥

అ॥ రేగు చిల్లగింజలు తెల్లచెఱకు దర్భ బోడతరము గొలిమిడి వీనితో గాని ఉత్పలాదిగణమునందు చెప్పబడినద్రవ్యములతో గాని సిద్ధముచేయబడిన క్షీరమునందు ఘృతమునుకలిపి దానిచేచేయబడు వస్తి తాపమును హరించేయును. మఱియు దేవకాంచనము కందులు కదంబవృక్షము ప్రబ్బలి వీనితో సిద్ధముచేయబడిన పాలయందు తేనెయుపంచదారను చేర్చిదానితో చేయబడువస్తి తాపమును హరింపచేయును.

మూ॥ పరికుర్తే తథా వృన్తైః శ్రీపర్ణ్యోవిదారజైః । ముష్టిః శాల్మలివృన్తానాం క్షీరసిద్ధో ఘృతాన్వితః ॥౩౯॥

అ॥ సెల్లితొడిమలు ఎఱ్ఱదేవకాంచనపుతొడిమలు పలపరిమాణముగల బూరుగతొడిమలు వీనితో సిద్ధముచేయబడిన పాలయందు నేతినిచేర్చి దానితోచేయబడు వస్తి పరికర్తమును హరింపచేయును.

మూ॥ హితః ప్రవాహణే తద్వద్వృన్తైః శాల్మలికస్య చ । అశ్వావరోహీకాకాకనాసారాజకశేరుకైః ॥ సిద్ధాః క్షీరేఽతియోగేస్యుః క్షౌద్రాఞ్జనఘృతైర్యుతాః ॥ న్యగ్రోధాద్యైశ్చతుర్భిశ్చ తేనైవ విధినాఽపరః॥ వస్తిః ప్రవాహణేదేయో భిషజా కల్పితోధియా॥

అ॥ బూరుగతొడిమలతో సిద్ధముచేయబడిన పాలయందు నేతినిచేర్చి దానితో సిద్ధముచేయబడిన పాలయందుగాని న్యగ్రోధము మొదలగునాలుగు ద్రవ్యములతోడను సిద్ధముచేయబడిన పాలయందుగాని తేనె రసాంజనము నెయ్యి వీనినిచేర్చి దానితో చేయబడిన వస్తిని అధికముగ ప్రవర్తించుచుండు ప్రవాహికయందు ఉపయోగింపవలయును.

మూ॥ బృహతీ క్షీరకాకోలీ పృశ్నిపర్ణీ శతావరీ ॥ కాశ్మర్యం బదరీ దూర్వా తథోశీరప్రియఙ్గవః । జీవాదానే శృతౌ క్షీరేద్వౌ ఘృతాఞ్జనసంయుతౌ ॥ వస్తీ ప్రదేయౌ భిషజా శీతౌ సమధుశర్కరౌ । గోఽవ్యజామహిషీక్షీరైర్జీవనీయయుతైస్తథా ॥ తేనైవ విధినా వస్తిర్దేయః సక్షౌద్రశర్కరః । శశైణదక్షమార్జారమహిషావ్యజశోణితైః ॥ సద్యస్కైర్మృదుభిర్వస్తిర్జీవాదానే ప్రశస్యతే ॥౪౧॥

అ॥ వాకుడు క్షీరకాకోలి కోలపొన్న పిల్లిపీచర వీనితోడను పెద్దగుమ్ముడు రేగు గరిక వట్టివేళ్ళు ప్రేంఖణము వీనితోడను సిద్ధముచేయబడిన పాలయందు నెయ్యి రసాంజనము తేనె వీనిని చేర్చి చేయబడునట్టియు చల్లగనున్నట్టియు ఈ రెండువిధము లగువస్తులను జీవరక్తముపోవునప్పుడు హితకరములుగ నుండును. మరియు ఆవు గొఱ్ఱె మేక గేదె వీనియొక్క పాలయందు జీవనీయగణద్రవ్యములను తేనెను పంచదారను చేర్చి పూర్వమునందువలెనె ప్రయోగింపబడు వస్తిగాని తత్కాలమునందే చంపబడినవి యగు కుందేలు జింక కోడి పిల్లి దున్నపోతు గొఱ్ఱె మేక వీనియొక్క రక్తములను వెంటనే గ్రహించి మృదువులుగనుండు ఆరక్తములచే చేయబడు వస్తినిగాని జీవరక్తము పోవునప్పుడు హితకరముగ నుండును.

మూ॥ మధూకమధుకద్రాక్షాదూర్వాకాశ్మర్యచన్దనైః॥ శర్కరాచన్దనద్రాక్షామధుధాత్రీఫలోత్పలైః । రక్తపిత్తే ప్రమేహే తు కషాయః సోమవల్కజః ॥43॥

అ॥ ఇప్ప యష్టిమధుకము ద్రాక్ష గరిక పెద్దముస్తులు చందనము వీనితోడను పంచదార చందనము ద్రాక్ష అతిమధురము ఉసిరికపండ్లు నల్లకలువ వీనితోడను చేయబడు వస్తులు రక్తపిత్తము నశింపచేయును. వెలిచంద్రయొక్క కషాయముతో చేయబడినవస్తి ప్రమేహమునందు హితకరముగ నుండును.

## అధ్యాయ సంగ్రహము.

మూ॥ త్రికాస్త్రయోఽనిలాదీనాం చతుష్కాశ్చాపరే తయః। పక్వాశయవిశుద్ధ్యర్థం వృష్యాః సాంగ్రాహికాస్తథా ॥ పరిస్రావే తథా దాహే కరికర్తే ప్రవాహణే। అతియోగే మతాః పఞ్చ జీవాదానే తథా త్రియః ॥ రక్తపిత్తే ద్వయం మేహ ఏకస్త్రింశచ్చ పఞ్చ చ। సులభా నౌషధక్లేశా వస్తయో గుణవత్తమాః ॥ గుల్మాతిసారోదావర్తస్తమ్భసఙ్కుచితాదిషు। సర్వాఙ్గైకాఙ్గరోగేషు రోగేష్వేవం విధేషు చ ॥ యథాస్వమౌషధైః సిద్ధాన్ వస్తీన్దద్యాద్విచక్షణః। పూర్వోక్తేన విధానేన కుర్యాద్యోగాన్ పృథగ్విధాన్ ॥ 48॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతి సంస్కృతే సిద్ధిస్థానే వస్తిసిద్ధిర్నామ దశమోఽధ్యాయః ॥

అ॥ వాతమునందు మూడువస్తులును, పిత్తమునందు మూడును, కఫమునందు మూడును, పక్వాశయమును శుద్ధినొందించునవి నాలుగును, శుక్రమునువృద్ధిపొందించునవి నాలుగును, సంగ్రాహిగుణముకలవి నాలుగును, పరిస్రావమునందు రెండును, తాపమునందు రెండును, పరికర్తకమునందు ఒకటియు, ప్రవాహికయందు ఒకటియు, అతియోగముగల ప్రవాహికయందు రెండును, జీవరక్తమునిమిత్తము మూడును, రక్తపిత్తమునందు రెండును, ప్రమేహమునందు ఒకటియు ఇట్లు సులభసాధ్యములైనట్టియుకష్టమును కలిగింపనట్టియు గుణవత్తరములైనట్టియుముప్పదియైదువస్తులు చెప్పబడినవి. గుల్మము అతిసారము ఉదావర్తము స్తంభించుట సంకోచము నొందుట మొదలగువానియందును సర్వాంగవ్యాధులయందును ఏకాంగవ్యాధులయందును ఇట్టి ఇతరవ్యాధులయందును ఆయావ్యాధుల కనుకూలములైనద్రవ్యములతో అనేకవిధములైన యోగములను తయారుచేసి పూర్వోక్తవిధానమునను సరించి వస్తులను చేయింపవలయును.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితావ్యాఖ్యానమునందు వస్తిసిద్ధి యనెడు దశమాధ్యాయము సమాప్తము.

— * —

# ఏకాదశాధ్యాయము.

మూ॥ అథాతః ఫలమాత్రాసిద్ధిం వ్యాఖ్యాస్యామః ॥1॥

ఆ॥ పిమ్మట ఫలమాత్రాసిద్ధిని చెప్పబోవుచున్నాము.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

ఆ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

మూ॥ భగవన్తముదారసత్త్వధీశ్రుతివిజ్ఞానసమృద్ధమత్రిజమ్ । ఫలవస్తివరత్వనిశ్చయే సవివాదా మునయోఽభ్యుపాగమన్ ॥ భృగుకౌశికకాప్యశౌనకాః సపులస్త్యాసితగౌతమాదయః । కతమత్ప్రవరం ఫలాదిషు స్మృతమాస్థాపనయోజనాస్వితి ॥2॥

ఆ॥ భృగువు కౌశికుడు కాప్యుడు శౌనకుడు పులస్త్యుడు అసితుడు గౌతముడు మొదలగు ఋషులు ఆస్థాపనవస్తియందుపయోగింపతగిన ఫలములలో ఏది శ్రేష్ఠమైనదని వివాదముతో కూడినవారై భగవంతుడైనట్టియు ఉదారములైన సత్త్వము బుద్ధి శాస్త్రము విజ్ఞానము వీనితో కూడినట్టియు ఆత్రేయుని పొందిరి.

మూ॥ కఫపిత్తహరం వరం ఫలేష్వథ జీమూతకమాహ శౌనకః । మృదువీర్యతయా భినత్తి తచ్ఛకృదిత్యాహ నృపోఽథ వామకః ॥ కటుతుమ్బిఫలముత్తమం మతం వమనే దోషసమీరణం చ తత్ । తదయోగ్యమశైత్యతీక్ష్ణతాకటురౌక్ష్యాదితి గౌతమోఽబ్రవీత్ ॥ కఫపిత్తనిబర్హణాం పరం స చ ధామార్గవమిత్యమిన్యత । తదమన్యత వాతలం పునర్బడిశో గ్లానికరం బలాపహామ్ ॥ కుటజం ప్రశశంస చోత్తమం న బలఘ్నం కఫపిత్తహారి చ । అతివిజ్జలమూర్ధ్వభాగికం పవనక్షోభి చ కాప్య అహా తత్ కృతవేధనమాహ వాతలం కఫపిత్తం ప్రబలం హరేదితి । తదసాధ్వితి భద్రశౌనకః కటుకం చాపి బలఘ్నమిత్యపి ॥ ఇతి తద్వచనాని హేతుభిః సువిచిత్రాణి నిశమ్య బుద్ధిమాన్ । త్రిశశంస ఫలేషు నిశ్చయం పరమం చాత్రిసుతోఽబ్రవీదిదమ్ ॥8॥

ఆ॥ దేవదాళి కఫపిత్తములను హరించునదగుటవలన ఆస్థాపనవస్తికి ఉపయోగించుఫలములలో శ్రేష్ఠమైనదని శౌనకుడు చెప్పెను. ఇది మృదువీర్యము కలదగుటవలన మలమునుమాత్రము భేదించుననియు వమనములయందు దోషమును బాగుగ హరించునదగుటవలన చేదుసార శ్రేష్ఠమైనదనియు వామకుడను రాజర్షి చెప్పెను. చేదుసార

ఉష్ణవీర్యమును తీక్ష్ణగుణమును కటురసమును రూక్షగుణమును కలదగుటవలన అయోగ్యముగ నుండుననియు కఫపిత్తములనుహరించునదగుటవలన పెద్దచేదుబీర శ్రేష్ఠముగ నుండుననియు గౌతముడు చెప్పెను. పెద్ద చేదుబీర వాతమును వృద్ధినొందించునదిగను బడలికను కలిగించునదిగను బలమునుహరించునదిగను నుండుటవలన శ్రేష్ఠమైనది కాదనియు బలముహరింపచేయునదియు కఫపిత్తములనుహరించునదియు నగుటవలన కొడిసెపాల శ్రేష్ఠమైనదనియు వడిశుడు చెప్పెను. కొడిసెపాల పిచ్ఛిలగుణముకలదగుటవలనను ఊర్ధ్వభాగమునుపొందునదగుటవలనను వాతమును క్షోభింపచేయునదగుటవలనను శ్రేష్ఠమైనదికాదనియు వాతమునువృద్ధినొందించునదైనను ప్రబలములైనకఫపిత్తములను హరింపజేయునదగుటవలన చినచేదుబీర శ్రేష్ఠమైనదనియు కాప్యుడు చెప్పెను. చినచేదుబీర కటురసముకలదగుటవలనను బలమునునశింపచేయునదగుటవలనను శ్రేష్ఠమైనదికాదని భద్రశౌనకుడు చెప్పెను. ఇట్లు హేతువులతో గూడవిచిత్రములుగ చెప్పబడుచున్న వాక్యములను విని బుద్ధిమంతుడగు ఆత్రేయుడు ఫలములవిషయమై శ్రేష్ఠత్వమును నిశ్చయించి ఈక్రిందివిధమున చెప్పెను.

మూ॥ ఫలదోషగుణాన్సరస్వతీ ప్రతి సర్వైరపి సమ్యగీరితా। న తు కించిదదోషనిర్గుణం గుణభూయస్త్వమతో వివిచ్యతే॥ ఇహ కుష్ఠహితా గరాగరీ హితమిక్ష్వాకు తు మేహినే మతమ్। కుటజస్య ఫలం హృదామయే ప్రవరం కోశఫలం చ పాణ్డుషు॥ ఉదరే కృతవేధనం హితం మదనం సర్వగదావిరోధి తు। మదనం సకషాయతిక్తకం తదరూక్షం సకటూష్ణవిజ్జలమ్॥ కఫపిత్తహృదాశుకారి చాప్యనపాయం పవనానులోమి చ। ఫలనామవిశేషతస్త్వతో లభతేఽన్యేషు ఫలేషు సత్స్వపి ॥12॥

అ॥ మీరందరును ఫలములయొక్క దోషములనుగురించియు గుణములనుగురించియు బాగుగ చెప్పిరి. కాని ప్రతివస్తువునందును దోషములును గుణములును నుండును. అందువలన గుణములయొక్క ఆధిక్యమును ఆలోచింపవలయును. దేవదాళి కుష్ఠములయందును, చేదుసొరపి మేహములయందును, కొడిసెపాల హృద్రోగములయందును, పెదచేదుబీర పాండురోగములయందును, చినచేదుబీర ఉదరవ్యాధులయందును ప్రశస్తమైనదిగనుండును. మ్రంగకాయ సమస్తవ్యాధులయందును అవిరుద్ధముగ నుండును. మ్రంగకాయ కషాయరసమును తిక్తరసమును కటురసమును ఉష్ణవీర్యమును పిచ్ఛిలగుణమును కలదిగ నుండును. రూక్షగుణములేనిదిగ నుండును. కఫపిత్తములను హరింపచేయును. దోషములను హరింపచేయును. అపాయమును కలిగింపదు. వాతమున కనులోమమును కలిగించును. అందువలన ఇతరఫలములున్నను ఫలశబ్దముచే మ్రంగకాయయే గ్రహింపబడుచున్నది.

మూ॥ గురుణా చ వచస్యుదాహృతే మునిసఙ్ఘేన చ పూజితే తతః। ప్రణిపత్య ముదా సమన్వితైః సహితైః శిష్యగణోఽనుపృష్ట

వాన్ ॥ సర్వకర్మగుణకృద్గురుణోక్తో వస్తిరూర్ధ్వమథ వేదినో మతః । నాభ్యధోగుదగతశ్చ శరీరాత్సర్వతః కథ మపోహతి దోషాన్ ॥ తన్ను గురురబ్రవీదిదం శరీరం తన్త్రయతేఽనిలః సఙ్గవిఘాతాత్ । కేవల ఏవ దోషసహితో వా స హి వాయుః ప్రకోప ముపయాతి॥ తం పవనం సపిత్తకఫవిట్కం శుద్ధికరోఽనులోమయతి వస్తిః । సర్వశరీరగశ్చ గద సంఘాతః ప్రకాశనాత్ప్రశాన్తిముపయాతి ॥16॥

అ॥ మునులచే పూజింపబడిన వాక్యములను ఆత్రేయుడు చెప్పగనే సంతోషముతో కూడిన శిష్యగణము ఆత్రేయునకు నమస్కరించి ఈ క్రిందివిధమున అడిగెను. "వస్తి సమస్తకర్మలను గుణములను చేయునని తమచే ఇదివరలో చెప్పబడినది. నాభియొక్క క్రిందిభాగమునందలి గుదప్రదేశమును పొందు వస్తి సర్వశరీరమునందలి దోషములను ఎట్లుబయలు వెడలించును?" అని అడిగెను. అట్లు అడుగగా ఆత్రేయుడు క్రిందివిధముగ చెప్పెను. వాతము సంగములకు విఘాతమును కలిగించుచు శరీరమును ధరించియుండును. అట్టి వాతము కేవలముగగాని ఇతరదోషములతో కూడిగాని ప్రకోపమును పొందును. పిత్తము కఫము మలము వీనితో కూడిన అట్టి వాతమునకు వస్తి శుద్ధిని కలిగించి అనులోమమును కలిగించును. సమస్తశరీరమునందును వ్యాపించియుండు వ్యాధులన్నియు వాతము శుద్ధినొందుటవలన శాంతించును.

మూ॥ అథాభిగమ్యార్థమఖణ్డితం ధియా గజోష్ట్రగోఽశ్వావ్యజవస్తికర్మ । అపృచ్ఛదేనం స చ వస్తిమబ్రవీద్విధిం చ కస్యాహ పునః ప్రచోదితః ॥ అజావికే సౌమ్య గజోష్ట్రయోర్వా గవాశ్వయోర్వస్తి ముశన్తి మాహిషమ్ । అజావికాదేస్తు వస్తిముత్తరం వద న్తి వస్తిం త్వథ ఉత్తరేః ॥ సువస్తిమష్టాదశషోడశాఙ్గులం త్వష్టైవ నేత్రం చ దశాఙ్గులం క్రమాత్ । గజోష్ట్రగోశ్వావ్యజవస్తిసంధౌ చతుర్థభాగే కృతకర్ణికం వదేత్ ॥ ప్రస్థస్త్వజావ్యోర్ద్విశిరూహమాత్రా గవాదషు ద్విత్రిగుణో యథాబలమ్। నిరూహ ఉష్ట్రస్య తథాఢకద్వయం గజస్య వృద్ధిస్త్వను వాసనేఽష్టమః ॥20॥

అ॥ పైనచెప్పబడిన అఖండమైన విషయమును తెలిసికొని ఏనుగులు ఒంటెలు గోవులు గుఱ్ఱములు గొఱ్ఱెలు మేకలు వీనికి చేయింపవలసిన వస్తికర్మనుగూర్చి ఆత్రేయుని అడిగెను. అప్పుడు ఆత్రేయుడు వానికి చేయింపవలసిన వస్తికర్మయొక్క విధిని క్రిందివిధముగ చెప్పెను. మేకలు గొఱ్ఱెలు ఏనుగులు ఒంటెలు గోవులు గుఱ్ఱములు వీనికి వస్తికర్మనిమిత్తము దున్నపోతుయొక్క మూత్రాశయమును గ్రహింపవలయును. మేకలు గొఱ్ఱెలు మొదలగువానికి చేయు వస్తి సునస్తి యనబడును. ఉత్తరమార్గమున చేయబడు వస్తి ఉత్తరవస్తి యనబడును సువస్తియుపయోగింపబడు నేత్రము ఏను

గులు ఒంటెలు వీనికి పదునెనిమిదంగుళముల పొడవుగలదిగను, గోవులు గుఱ్ఱములు వీనికి పదునారంగుళముల పొడవుగలదిగను, గొఱ్ఱెలు మేకలు వీనికి పదియంగుళముల పొడవుగలదిగను ఉండవలయును. ఈనేత్రముయొక్క నాలుగవ భాగములో కర్ణిక యుండవలయును. నిరూహవస్తియొక్క పరిమితి మేకలకును గొఱ్ఱెలకును ప్రస్థపరిమితిగను, గోవులకును గుఱ్ఱములకును బలమునను సరించి రెండులేక మూడుప్రస్థములపరిమితిగను, ఒంటెకు రెండుఆఢకముల పరిమితిగను, ఏనుగునకు నాలుగుఆఢకముల పరిమితిగను ఉండవలయును. అనువాసవస్తియొక్క పరిమితి నిరూహవస్తియొక్క పరిమితిలో ఎనిమిదవంతుగ నుండవలయును.

మూ॥ కలిఙ్గకృష్ణే మధుకం సపిప్పలీ వచా శతాహ్వా మదనం రసాఞ్జనమ్। హితాని సర్వేషు గుడః ససైన్ధవో ద్విపఞ్చమూలస్య వికల్పనా త్వియమ్ ॥ గజేఽధికోఽశ్వత్థవటాశ్వకర్ణజః సఖాదిరః ప్రగ్రహసాలతాలజః । తథా చ ఉష్ట్రే ధవశిగ్రుపాటలామధూకసారాః సనికుమ్భచిత్రకాః ॥ పలాశభూతీకసుగాహ్వరోహిణీకషాయ ఉక్తస్త్వధికో గవాం హితః । పలాశదన్తీసురదారుకత్తృణద్రవస్త్వ ఉక్తాస్తురగస్య చాధికాః॥ ఖరోష్ట్రయోః పీలుకరీరఖాదిరాః శమ్యార్కబిల్వాదిగణస్య చ చ్ఛదాః ॥ అజావికానాం త్రిఫలాపమూషకం కపిత్థకర్కన్ధు సబిల్వకోలజమ్ ॥24

అ॥ కొడిసెపాలవిత్తులు చెంగల్వకోష్టు యష్టిమధుకము పిప్పళ్ళు వస సదాప మ్రంగ రసాంజనము దశమూలములు వీనియొక్క కషాయమునందు బెల్లమును సైంధవలవణమును చేర్చి దానితో ఏనుగు మొదలగుసమస్తజంతువులకును వస్తికర్మనుచేయుట హితకరముగ నుండును. రావి మఱ్ఱి తెల్లమద్ది చండ్ర రేల ఏపి తాటిపండు వీనియొక్క కషాయముతో ఏనుగులకు విశేషించి వస్తికర్మను చేయింపవలయును చండ్ర మునగ కలిగొట్టు ఇప్ప ఏపి దంతి చిత్రమూలము వీనియొక్కకషాయముతో ఒంటెలకు విశేషించి వస్తిని చేయింపవలయును. మోదుగ ఓమము దేవదారు కటుకరోహిణి వీనియొక్క కషాయములతో గోవులకువిశేషించి వస్తికర్మను చేయింపవలయును. మోదుగ దంతి దేవదారుకామంచిపూరి పెద్దదంతి వీనియొక్క కషాయముతో గుఱ్ఱములకువిశేషించివస్తికర్మనుచేయింపవలయును. వరగోగు వెదురు మొలక చండ్రరేలచిగుళ్ళు బిల్వాదిగణమునందలి వృక్షములయొక్క చిగుళ్ళు వీనికషాయముతో గాడిద ఒంటె వీనికివిశేషించి వస్తికర్మను చేయింపవలయును. త్రిఫలములు చిట్టీత వెలగ పెద్దరేగు మారేడు చిన్నరేగు వీనియొక్క కషాయముతో మేకలకును గొఱ్ఱెలకును విశేషించి వస్తికర్మను చేయింపవలయును.

బ్రాహ్మణాదులు ఎల్లప్పుడు అనారోగ్యులుగనుండుటకు కారణము.

మూ॥ అథాగ్నివేశః సతతాతురాన్ సతతాతురాన్ హితం చ పప్రచ్ఛ గురుస్తదాహ చ । సదాతురాః శ్రోత్రియ రాజసేవకాస్తథైవ వేశ్యాః సహపణ్యజీవిభిః॥ ద్విజో హి వేదాధ్యయనవ్రతాహ్నిక క్రియాదిభిర్దేహ హితం న చేష్టతే । నృపోపసేవీ నృపచిత్తరక్షణాత్పరానురోధాద్బహు చిన్తనాద్భయాత్ ॥ నృచిత్తవర్తిన్యుపచారతత్పరా మృజాభూషా నిరతాః పణాఙ్గనాః । సదాసనాదత్యనుబద్ధవిక్రయక్రయాదిలోభాదపిపణ్యజీవినః॥ సదైవ తే హ్యాగతవేగనిగ్రహం సమాచరన్తే న చ కాలభోజనమ్ । అకాలనిర్హారవిహారసేవినో భవన్తి యేఽన్యేఽపి సదాతురాశ్చ తే ॥ 8॥

అ॥ అడుగుచున్న అగ్నివేశునకు గురువు క్రిందివిధముగ చెప్పెను. బ్రాహ్మణులు, రాజసేవకులు, వేశ్యాస్త్రీలు, వర్తకులు వీరలు ఎల్లప్పుడును అనారోగ్యులుగ నుండెదరు. ఎందువలననగా — వేదాధ్యయనము వ్రతములు ఆహ్నిక క్రియలు మొదలగువానిని ఆచరించుచుండుటవలన బ్రాహ్మణులును, అధికారియొక్క చిత్తమును అనుసరింపవలసియుండుట ఇతరులయొక్క వశమునందుండుట అధికముగు ఆలోచనతో కూడియుండుట భయమును కలిగియుండుట వీనివలన రాజసేవకులును, పురుషునియొక్క చిత్తమును అనుసరించియుండుట పురుషునకు ఉపచారములను చేయుట శరీరశుభ్రతయందును అలంకరించుకొనుటయందును నిమగ్నురాండ్రైయుండుట వీనివలన వేశ్యాస్త్రీలును ఎప్పుడును కూర్చొనియుండుట అమ్మటకొనుట మొదలగువానియందు ఎల్లప్పుడును నిమగ్నులైయుండుట వీనివలన వర్తకులును తమశరీరముయొక్క హితమును పాటింపరు. మరియు వారు మలమూత్రాదులయొక్క వేగములను ఎల్లప్పుడు అడ్డగించెదరు. కాలభోజనమును ఎప్పుడును చేయరు. మరియు మలమూత్రాది వేగములను అకాలమునందు ప్రవర్తింపచేయుదురు. విహారమును అకాలమునందు చేయుదురు. అందువలన వారు ఎల్లప్పుడును అనారోగ్యులుగ నుండెదరు. ఈవిధముగ నాచరించు ఇతరులుకూడ ఎల్లప్పుడును అనారోగ్యులుగనే యుండెదరు.

మూ॥ సమీరణం వేగవిధారణోద్ధతం విబద్ధసర్వాఙ్గరుజాకరం భిషక్ । సమీక్ష్య తేషాం ఫలవర్తిమాదితః సుకల్పితాం స్నేహవతీం ప్రయోజయేత్ ॥29॥

అ॥ వేగవిధారణమువలన వాతము ప్రకోపించి విబంధము సర్వావయవముల యందు బాధను కలిగించినయెడల బాగుగ తయారుచేయబడినట్టియు చమురుతో కూడినట్టియు ఫలవర్తులను తొలుత ప్రయోగింపవలయును.

మూ॥ పునర్నవైరణ్డనికుమ్భచిత్రకాన్ దేవదారుత్రివృతానిదిగ్ధకాన్ । మహాన్తి మూలాని చ పఞ్చ తద్భవాన్విపాచ్య మూత్రే దధిమస్తుసంయుతే ॥ సతైలసర్పిర్లవణైశ్చ పఞ్చభిర్విమూర్చ్ఛితం వస్తిమథ ప్రయోజయేత్ । నిరూహితం ధన్వరసేన భోజితం నికుమ్భతైలేన తతోఽనువాసయేత్ ॥ 1॥

అ॥ గలిజేరు ఆముదపువేళ్ళు దంతి చిత్రమూలము దేవదారు తెగడ వాపదు మహాపంచమూలములు వీనిని పెరుగు మీగడ వీనితో కూడిన గోమూత్రమునందు కషాయముకాచి ఆకషాయమునందు తైలమును ఘృతమును పంచలవణములను కలిపి దానితో నిరూహవస్తిని చేయింపవలయును. పిమ్మట జాంగలమాంసరసముతో ఆహారము నిచ్చి పిమ్మట. దంతియొక్క కషాయముతోడను కల్కముతోడను తయారుచేయబడిన తైలముతో అనువాసనవస్తిని చేయింపవలయును.

మూ॥ బలాశ్వగన్ధాఫలబిల్వచిత్రకాన్ద్విపఞ్చమూలే కృతమాలకోత్పలే । యవాన్కులుత్థాంశ్చ పచేజ్జలాఢకే రసః స పేష్యైస్తు కలిఙ్గకాదిభిః ॥ సతైలసర్పిర్గుడసైన్ధవో హితః సదా నరాణాం బలవర్ణవర్ధనః । తథైవ శస్తం మధుకేన సాధితం ఫలేన బిల్వేన శతాహ్వయాఽథ వా ॥ సజీవనీయస్తు రసోఽనువాసనే నిరూహణే చాలవణో శిశోర్హితః । న చాస్యదాశ్వఙ్గబలాభివర్ధనం నిరూహవస్తేః శిశువృద్ధయోః పరమ్ ॥

అ॥ ముత్తవపులగము పెన్నేరు మంగకాయలు మారేడు చిత్రమూలము హ్రస్వపంచమూలములు మహాపంచమూలములు రేల నల్లకలువ యవలు ఉలవలు వీనిని ఒకఆఢకముజలమందు కషాయముకాచి ఆకషాయమునందు కొడిసెపాలవిత్తులు చెంగల్వకోష్టు మొదలగువానియొక్క కల్కమును తైలమును ఘృతమును బెల్లమును సైంధవలవణమును చేర్చి దానితో వస్తిని చేయించినయెడల బలమును వర్ణమునువృద్ధి నొందించును. అతిమధురముతో గాని మంగకాయలతో గాని మారేడుతో గాని సదాపతో గాని తయారు చేయబడిన వస్తికూడ బలమును వర్ణమును కలిగించును. శిశువులకు జీవనీయగణద్రవ్యములయొక్క రసముతో తయారుచేయబడిన స్నేహముచే అనువాసనవస్తిని గాని జీవనీయగణద్రవ్యములయొక్క కషాయమునందు సైంధవలవణమును చేర్పక దానితో నిరూహవస్తిని గాని చేయించుట హితకరముగనుండును. శిశువులు వృద్ధులు వీరలకు శరీరబలమును వెంటనే కలిగించుటకు నిరూహవస్తికంటె శ్రేష్ఠమైనది మరియొకటి లేదు.

అధ్యాయ సంగ్రహము.

మూ॥ ఫలకర్మవస్తిషు వరత్వనిశ్చయో వస్తయో గవాదీనామ్ । సతతాతురాశ్చోద్దిష్టాః హ్రస్వమాత్రాయాం హితం చైషామ్॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే సిద్ధిస్థానే ఫలమాత్రా సిద్ధిర్నామ ఏకాదశోఽధ్యాయః ॥

ఆ॥ ఈఫలమాత్రా సిద్ధ్యధ్యాయమునందు - వస్తికర్మయందు ఉపయోగింపదగిన ఫలములలో శ్రేష్ఠత్వమును నిశ్చయించుట, గోవులు మొదలగువానికి ప్రయోగింపదగిన వస్తులు, బ్రాహ్మణులు మొదలగువారు ఎల్లప్పుడును ఆరోగ్యులుగనుండుటకు కారణములు, ఇట్టి వీరలకు హితకరములు ఇవి చెప్పబడినవి.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామక కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు ఫలమాత్రాసిద్ధి యనెడు ఏకాదశాధ్యాయము సమాప్తము.

—0—

# ద్వాదశాధ్యాయము.

మూ॥ అథాత ఉత్తరవస్తిసిద్ధిం వ్యాఖ్యాస్యామః ॥1॥

ఆ॥ పిమ్మట ఉత్తరవస్తిసిద్ధిని చెప్పబోవుచున్నాను.

మూ॥ ఇతి హ స్మాహ భగవానాత్రేయః ॥2॥

ఆ॥ అని భగవంతుడగు ఆత్రేయుడు చెప్పెను.

## శోధనోత్తర క్రియ.

మూ॥ అథ ఖల్వాతురం వైద్యః సంశుద్ధం వమనాదిభిః । దుర్బలం కృశమల్పాగ్నిం ముక్తసంధానబన్ధనమ్ ॥ నిర్హృతానిల విణ్మూత్ర కఫపిత్తం కృశాశయమ్ । శూన్యదేహం ప్రతీకారాసహిష్ణుం పరిపాలయేత్ ॥ యథైవ తరుణం పూర్ణం తైలపాత్రం తథైవ చ ॥ గోపాల ఇవ దణ్డీ గాః సర్వస్మాదపచారతః ॥5॥

ఆ॥ వమనాదులచే శుద్ధినొంది దుర్బలుడుగను కృశించినవాడుగను స్వల్పమైన జాఠరాగ్ని కలవాడుగను సంధిబంధనములు విడిపోయినవాడుగను వాతము పురీషము కఫము పిత్తము ఇవి హరింపబడినవాడుగను కృశించిన ఆశయములు కలవాడుగను శూన్యమైన దేహముకలవాడుగను ప్రతీకారమును సహింపలేనివాడుగనునున్న రోగిని తైలముతో నిండియున్నట్టియు తరుణమైనట్టియు పాత్రనువలె సమస్తాపచారముల

నుండి యీము రక్షింపవలయును. మరి యీము గోపాలునకు దండము నుధరించి గోవులను రక్షించువిధమున వైద్యుడు అట్టిరోగిని రక్షింపవలయును.

## అగ్నిసందీపనాదిక్రమము.

మూ॥ అగ్నిసంధుక్షణార్థం తు పూర్వం పేయాదిభిర్భిషక్ । రసోత్తరేణైవ చరేత్క్రమేణ క్రమకోవిదః॥ స్నిగ్ధామ్లస్వాదుహృద్యాని తతోఽమ్లలవణౌ రసౌ । స్వాదుతిక్తౌ తతో భూయః కషాయకటుకౌ తతః ॥ అన్యోఽన్యప్రత్యనీకానాం రసానాం స్నిగ్ధరూక్షయోః । వ్యత్యాసాదుపయోగేన ప్రకృతిం గమయేద్భిషక్ ॥8॥

అ॥ జాఠరాగ్ని వృద్ధిపొందునిమిత్తము ప్రథమమున పేయాదుల నీయవలయును. క్రమముగ మాంసరసముతో కూడిన ఆహారము నీయవలయును. తొలుత స్నిగ్ధగుణమును అమ్లస్వాదురసములను కలిగి హృద్యములుగనుండు పదార్థములను, పిమ్మట అమ్లలవణ రసములుగల పదార్థములను, పిమ్మట స్వాదుతిక్తరసములుకల పదార్థములను, అటు పిమ్మట కషాయరసములుగల పదార్థములను ఈయవలయును. ఇట్లు పరస్పరము విరుద్ధములైన రసములుకల పదార్థములను స్నిగ్ధరూక్షములుగల పదార్థములను మార్చుకొనుచు ప్రయోగించి రోగికి ప్రకృతిస్థితిని కలిగింపవలయును.

## ప్రకృతినిపొందినవానియొక్క లక్షణములు.

మూ॥ బలవాన్ వర్ణవాన్ సర్వరతిః స్వఙ్గః స్థిరేన్ద్రియః । ప్రసన్నాత్మా సర్వసహో విజ్ఞేయః ప్రకృతిం గతః ॥9॥

అ॥ ప్రకృతినిపొందినవాడు బలవంతుడుగను మంచివర్ణముకలవాడుగను అన్నిటియందును కోరికకలవాడుగను సుఖములుగనున్న అంగములుకలవాడుగను స్థిరములైన ఇంద్రియములుకలవాడుగను నిర్మలమైనమనస్సుకలవాడుగను సమస్తమునుసహించువాడుగను నుండును.

## ప్రకృతినిపొందనివాడు వర్జింపతగినవి.

మూ॥ ఏతాం ప్రకృతిమప్రాప్తః సర్వవర్జ్యాని వర్జయేత్ । మహాదోషకరాణ్యష్టావిమాని తు విశేషతః ॥ ఉచ్చైర్భాష్యం రథక్షోభమతిచఙ్క్రమణాసనే । అజీర్ణాహితభోజ్యే చ దివాస్వప్నం చ మైథునమ్ ॥11॥

అ॥ ప్రకృతినిపొందనివాడు విడిచిపెట్టతగినవానినన్నింటిని విడిచిపెట్టవలయును. మరియీము మహాదోషములనుకలిగించునవియగు బిగ్గరగమాట్లాడుట, రథాదియానములవలనక్షోభనొందుట, అధికముగతిరుగుట, అధికముగకూర్చుండుట, అజీర్ణాహారములను

సేవించుట, అహితాహారములను సేవించుట, పగటియందు నిద్రించుట, మైథునము నాచరించుట ఈ ఎనిమిదింటిని విశేషించి విడిచిపెట్టవలయును.

వర్జింపదగినవానిని వర్జింపకున్నచో కలుగు
సామాన్య దోషములు.

మూ॥ తజ్జా దేహోర్ధ్వసర్వాధోమధ్యపీడామదోషజాః । శ్లేష్మజాః క్షయజాశ్చైవ వ్యాధయః స్యుర్యథాక్రమమ్॥ తేషాం విస్తరతో లిఙ్గమేకైకస్య సభేషజమ్ । యథావత్సంప్రవక్ష్యామి సిద్ధాన్ వస్తీంశ్చ యాపనాన్ ॥౩॥

అ॥ ప్రకృతిని పొందనివాడు విడిచిపెట్టవగిన ఈ ఎనిమిదింటిని విడిచిపెట్టకున్నచో ఆ ఎనిమిదింటివలనను శరీరముయొక్క ఊర్ధ్వభాగమునందు బాధ, శరీరమంతటను బాధ, అధఃప్రదేశమునందు బాధ, మధ్యప్రదేశమునందు బాధ, ఆమదోషము, శ్లేష్మజవ్యాధులు క్షయవ్యాధులు అను నీ ఎనిమియు క్రమముగ కలుగును. ఈ ఎనిమిదింటియొక్కయు ప్రత్యేకప్రత్యేకలక్షణములను చికిత్సలను వివరించి చెప్పుచున్నాము. మరియు సిద్ధిదాయకములైన యాపనవస్తులను చెప్పుచున్నాము.

బిగ్గరగమాట్లాడుట మొదలగువానివలన కలుగు దోషములు.

మూ॥ తత్ర, ఉచ్చైర్భాష్యాతిభాష్యాభ్యాం శిరస్తాపశఙ్ఖకర్ణనిస్తోదశ్రోత్రోపరోధముఖతాలుకణ్ఠశోషతైమిర్యపిపాసాజ్వరతమకహనుమన్యాగ్రహనిష్ఠీవనోరః పార్శ్వశూలస్వరభేదహిక్కాశ్వాసాదయః స్యుః, రథక్షోభాత్ సన్ధిపర్వశైథిల్యహనునాసాకర్ణశిరఃశూలతోదవహ్నివిక్షోభాటోపాన్త్రకూజనాధ్మానహృదయేన్ద్రియోపరోధస్ఫిక్పార్శ్వవఙ్క్షణవృషణకటీపృష్ఠవేదనాసన్ధిస్కన్ధహనుగ్రీవాదౌర్బల్యాఙ్గాభితాపపాదశోఫప్రస్వాపహర్షణాదయః, అతిచఙ్క్రమణాత్ పాదజఙ్ఘోరుజానువఙ్క్షణశ్రోణీపృష్ఠశూలచ్ఛర్దిసక్థిసాదనిస్తోదపిణ్డికోద్వేష్టనాఙ్గమర్దాంసాభితాపసిరాధమనీహర్ష శ్వాసకాసాదయః స్యుః, అత్యాసనాత్ గదక్షోభజాః స్ఫిక్పార్శ్వవఙ్క్షణవృషణకటీపృష్ఠవేదనాదయః స్యుః, అజీర్ణాధ్యశనాభ్యాం తు ముఖశోషాధ్మానశూలనిస్తోదపిపాసాగాత్రసాదచ్ఛర్ద్యతీసారమూర్ఛాజ్వరప్రవాహణామవిషాదయః స్యుః, విషమాహితాశనాభ్యామనన్నాభిలాష దౌర్బల్యవైవర్ణ్యకణ్డూపామాఙ్గగాత్రావసాదవాతాదప్రకోపజాశ్చ గ్రహణ్యర్శోవికారాదయః, దివాస్వప్నాదరోచకా విపాకాగ్నినాశ స్తైమిత్య

పోణ్డుకణ్డూపామూదాహచ్ఛర్ద్యఙ్గమర్దహృత్తృష్ణాజాడ్యతన్ద్రానిద్రాప్ర సఙ్గగ్రన్థిదన్తమదౌర్బల్యారక్తమూత్రాక్షితా తాలుశోషః పిపాసా చ, వ్యవాయాదాశుబలసాదోరుసాదనస్తిశిరోగుద మేఢ్రవృషణవఙ్క్షణోరు జానుజఙ్ఘాపాదజః హృదయస్పన్దననేత్రపీడాఙ్గశైథిల్యశుక్రమార్గశోణి తాగమన కాసశ్వాసశోణితష్ఠీవనస్వరావసాద కటీదౌర్బల్యైకాఙ్గస ర్వాఙ్గరోగముష్కశ్వయథువాతవర్చోమూత్రసఙ్గశుక్రవిసర్గ జాడ్యవే పథుబాధిర్యవిషాదాదయః స్యుః, ఉత్పాట్యత ఇవాస్థ్యత ఇవ మేఢ్రమవసీదతీవ మనో వేపతే హృదయం పీడ్యన్తే సన్ధయస్త మః ప్రవిశతీవ చ, ఇత్యేవమేభిరపచారైః శేతే ప్రాదుర్భవన్త్యు పద్రవాః ॥13॥

అ॥ వానిలో బిగ్గరగ మాట్లాడుటవలనను అధికముగ మాట్లాడుటవలనను శిరస్సునందు తాపము, చెవులయందును కణతలయందును పొడిచినటుల బాధ, స్రోతస్సులు అడ్డగింపబడుట, నోరును తాలుప్రదేశములును, కంఠమును ఎండుట, తిమిరము కలుగుట, దప్పిక, జ్వరము, తమకశ్వాస, అంకిళ్ళు మెడకొంకులు బిగియుట, ఉమ్మి వచ్చుట, వక్షఃస్థలమునందును పార్శ్వములయందును శూల, స్వరభేదము, ఎక్కిళ్ళు శ్వాస మొదలగునవి కలుగును. రథాదియానములవలన క్షోభనొందుటచే సంధులును కణుపులును శైథిల్యమునొందుట, అంకిళ్లు ముక్కు చెవులు శిరస్సు వీనియందు శూలయు పోట్లును కలుగుట. జాఠరాగ్ని చెడుట, ఉదరమునందు ఆటోపము, ప్రేగులు అరచుట, కడుపుఉబ్బరము, హృదయమును ఇంద్రియములును అడ్డగింపబడుట, పిరుదులు పార్శ్వములు గజ్జలు వృషణములు కటిప్రదేశము పృష్ఠప్రదేశము వీనియందు బాధలుకలుగుట. సంధులు భుజశిరస్సులు అంకిళ్ళు మెడ వీనియందు దుర్బలత్వ మేర్పడుట, శరీరతాపము, పాదములయందు వాపును మొద్దుబారుటయు పగులుటయు జనించుట మొదలగు లక్షణములు కలుగును. అధికముగ తిరుగుటవలన పాదములు పిక్కలు తొడలు మోకాళ్ళు గజ్జలు పిరుదులు పృష్ఠప్రదేశము వీనియందు శూలకలుగుట, వాంతియగుట కాళ్ళయందు కృశత్వమును పోట్లును కలుగుట, పిక్కలయందు మెలివేసినటుల బాధ, ఒడలునొప్పులు, అంసప్రదేశములయందు తాపము, సిరలయందును ధమనులయందును దౌర్బల్యమేర్పడుట, శ్వాస, కాస మొదలగు లక్షణములు కలుగును. అధికముగ కూర్చుండుటవలన పిరుదులు పార్శ్వములు గజ్జలు వృషణములు కటిప్రదేశము పృష్ఠప్రదేశము వీనియందు బాధకలుగుట మొదలుగాగల రథక్షోభజలక్షణములు కలుగును. అజీర్ణాహారములను సేవించుటవలనను అధ్యశనమువలనను నోరు ఎండుట, కడుపుబ్బరము, శూల, పొడిచినటుల బాధ, దప్పిక, శరీరము కృశించుట, వాంతి, అతిసారము, మూర్ఛ, జ్వరము, ప్రవాహిక, ఆమవిషము మొదలగు లక్షణములు కలుగును. విషమాహారమువలనను అహితాహారములను సేవించుటవలనను ఆహారము సందిష్టము లేకపోవుట, దుర్బలత్వము వివర్ణత్వము, దురద, గజ్జి, శరీరము కృశించుట, వాతాదులు ప్రకోపించుటవలన

కలుగు వికారములు, గ్రహణీరోగము, అర్శోవ్యాధి మొదలగు లక్షణములు కలుగును. పగటియందు నిద్రించుటవలన అరోచకము, జీర్ణము కాకుండుట, అగ్నిమాంద్యము, స్తైమిత్యము, పాండువ్యాధి, దురద, గజ్జి, తాపము వాంతి, ఒడలునొప్పులు, హృదయముబిగపట్టుట, జడత్వము, బడలిక, నిద్ర అధికమగుట, గ్రంథులుపుట్టుట, దౌర్బల్యము, మూత్రమును నేత్రములును ఎరుపుబారుట, తాలుప్రదేశముపూయబడినట్లుండుట, దప్పిక ఈలక్షణములు కలుగును. మైథునము నాచరించుటవలన బలము వెంటనే క్షీణించుట, తొడలు కృశించుట, వస్తిప్రదేశము శిరస్సు గుదప్రదేశము మేఢ్రము వృషణములు గజ్జలు తొడలు మోకాళ్లు పిక్కలు పాదములు వీనియందు శూలకలుగుట, హృదయమునకముగకొట్టుకొనుట, నేత్రములయందు బాధ, అవయవములు శైథిల్యమునొందుట, శుక్రమార్గమునుండి రక్తమువచ్చుట, కాస, శ్వాస, రక్తము నుమియుట స్వరముకృశించుట, కటిప్రదేశమునందు దౌర్బల్యమేర్పడుట, ఏకాంగవాతము సర్వాంగవాతము, వృషణములయందు వాపు, అపానవాతమును పురీషమును మూత్రమును బంధించుట, శుక్రముబయలువెడలుచుండుట, జడత్వము, వణకు, చెముడు, దుఃఖము మొదలగులక్షణములు కలుగును. మరియు గుదప్రదేశము చీల్చబడుచున్నట్లుండుట మేఢ్రము కొట్టబడుచున్నట్లుండుట, మనోబలము కృశించుచున్నట్లుండుట, హృదయముకంపించుట, సంధులుపీడింపబడుట, చీకట్లు క్రమ్మినట్లుండుట ఈలక్షణములు కలుగును. ఎనిమిది విధములగు అపచారములవలనను ఈ ఉపద్రవములు ఇట్లు కలుగును.

## ఉచ్చైర్భాషణాదులవలన కలుగు ఉపద్రవములకు చికిత్స.

మూ॥ తేషాం సిద్ధిః — ఉచ్చైర్భాష్యాతిభాష్యజానామభ్యఙ్గస్వేదోపనాహధూమనస్యోపరిభక్తస్నేహపానరసక్షీరాదిభిర్వాతహరః సర్వోవిధిర్మౌనం చ, రథక్షోభాతిచఙ్క్రమణాత్యాసనజానాం స్నేహస్వేదాది వాతహరం కర్మ సర్వం నిదానవర్జం, అజీర్ణాధ్యశనజానాం నిరవశేషతశ్ఛర్దనం రూక్షస్వేదధూమపానలఙ్ఘనీయపాచనీయదీపనీయౌషధావచారణాని చ, విషమాహితాశనజానాం యథాస్వం దోషక్రియాః, దివాస్వప్నజానాం ధూమపానలఙ్ఘనవమనశిరోవిరేచనవ్యాయామరూక్షాశనాదిదీపనీయౌషధోపయోగః ప్రఘర్షణోన్మర్దనపరిషేచనాదిశ్చ శ్లేష్మహరః సర్వో విధిః, మైథునజానాం జీవనీయసిద్ధయోః క్షీరసర్పిషోరుపయోగస్తథా వాతహరాః స్వేదాభ్యఙ్గోపనాహా వృష్యాశ్చాహారాః స్నేహాః స్నేహవిధయో యాపనావస్తయోఽనువాసనం చ మూత్రవైకృతవస్తిశూలేషు చోత్తరవస్తిః విదారిగన్ధాదిగణజీవనీయగణక్షీరసంసిద్ధం తైలం స్యాద్యాపనాశ్చ వస్తయః సర్వకాలం దేయాః తానుపదేక్ష్యామః ॥ 5॥

అ॥ బిగ్గరగమాట్లాడుట మొదలగువానివలనకలుగు ఉపద్రవములకు చికిత్స చెప్పబడుచున్నది. బిగ్గరగమాట్లాడుటవలనను అధికముగమాట్లాడుటవలనను కలుగు వ్యాధులయందు అభ్యంజనము, స్వేదకర్మ, ఉపనాహము, ధూమపానము, నస్యకర్మ భోజనానంతరమునందు స్నేహమును పానముచేయుట. మాంసరసమును క్షీరమును సేవించుట మొదలగు వాతహరములగు సమస్తక్రియలను ఆచరింపవలయును. మరియు మౌనముగ నుండవలయును. రథాదియానములచే క్షోభనొందుటవలనను అధికముగతిరుగుటవలనను అధికముగకూర్చుండుటవలనను కలుగు వ్యాధులందు స్నేహకర్మ స్వేదకర్మ మొదలగు వాతహరములగు సమస్తక్రియలను ఆచరింపవలయును. మరియు ఈవ్యాధులకు కారణములైనవానిని విడిచిపెట్టవలయును, అజీర్ణాహారములను సేవించుటవలనను అధ్యశనము వలనను కలిగిన వ్యాధులయందు శేషములేకుండునట్లు వాంతినిచేయించుట. రూక్షమైన స్వేదము, ధూమపానము, లంఘనీయములును పాచనీయములును దీపనీయములును నగు ఔషధములను ఇచ్చుట వీని నాచరింపవలయును. విషమాహారమువలనను అహితాహారములను సేవించుటవలనను కలిగిన వ్యాధులయందు ఆయాదోషములకనుకూలమగు చికిత్సలను ఆచరింపవలయును. పగటియందునిద్రించుటవలనకలుగు వ్యాధులయందు ధూమపానము. లంఘనము, వమనము, నస్యము, వ్యాయామము, రూక్షములైన ఆహారాదులను సేవించుట, దీపనీయములైన ఔషధములను ఉపయోగించుట వీనిని ఆచరింపవలయును. మరియు లంఘనము, బాగుగమర్దించుట, పరిషేకము మొదలగు శ్లేష్మహరమగు సమస్తక్రియలను నాచరింపవలయును. మైథునము నాచరించుటవలనకలుగు వ్యాధులయందుజీవనీయగణద్రవ్యములతో తయారుకాబడిన పాలను ఘృతమును ఉపయోగింపవలయును. మరియు వాతహరములగు స్వేదములను అభ్యంగములను ఉపనాహములను చేయింపవలయును. వీర్యవృద్ధికరములగు ఆహారములను సేవింపవలయును. స్నేహపానములను స్నేహపానవిధులను ఆచరింపవలయును. యాపనవస్తులను అనువాసనవస్తులను చేయింపవలయును. మూత్రవికారములును వస్తిశూలయు కలిగినయెడల విదారిగంధాదిగణద్రవ్యములతోడను జీవనీయగణద్రవ్యములతోడను పాలతోడను తయారు చేయబడిన తైలముచే ఉత్తరవస్తిని చేయింపవలయును. మరియు యాపనవస్తులను తరుచు చేయింపవలయును. అట్టి యాపనవస్తులను చెప్పబోవుచున్నాము.

యాపనవస్తివివరణము.

మూ॥ ముస్తోశీరబలారగ్వధరాస్నామంజిష్ఠాకటురోహిణీత్రాయమాణాపునర్నవావిభీతకగుడూచీస్థిరాది పఞ్చమూలాని పలికాని ఖణ్డశః క్లుప్తాని అష్టౌ చ మదనఫలాని ప్రక్షాల్య జలాఢకే పరిక్వాథ్య పాదశేషో రసః క్షీరద్విప్రస్థసంయుక్తః పునః శృతః క్షీరావశేషః జాఙ్గలరసతుల్యః మధుయుతః శతకుసుమామధుకకుటజఫలరసాఞ్జనప్రియఙ్గుకల్కీకృతః ససైన్ధవః సుఖోష్ణవస్తిః శుక్రమాంసాగ్నిజననః క్షతక్షీణకాసగుల్మశూలవిషమజ్వరబ్రధ్న కుణ్డలోదావర్త కుక్షిశూలమూత్రకృచ్ఛ్రాసృగ్దరజోవిసర్పప్రవాహికా శిరోరుజాజానూరుజఙ్ఘావ

స్త్రీగ్రహాశ్మర్యున్మాదార్శః ప్రమేహాధ్మానవాతరక్తపిత్తశ్లేష్మవ్యాధిహరః సద్యో బలననో రసాయనశ్చేతి ॥ 6॥

అ॥ తుంగముస్తలు వట్టివేళ్ళు ముత్తవపులగము రేల సన్నరాస్నము మంజిష్ఠ కటుకరోహిణి కల్లుగానుగ గలిజేరు తానికాయ తిప్పతీగె హ్రస్వపంచమూలములు వీనిని ప్రత్యేకము ఒక్కొక్క పలముగను మ్రుంగకాయలను ఎనిమిదిపలములుగను గ్రహించి ముక్కలుజేసి కడిగి ఒక ఆఢకముజలమునందు వేసి నాలుగవవంతు మిగులునట్లు కాచి ఆకషాయమునందు రెండుప్రస్థముల పాలను కలిపి పాలు మిగులువరకు మరల కాచి ఆపాలతో సమానపరిమితిగల జాంగలమాంసరసమును జేర్చి అందు తేనెను కలిపి సదాప అతిమధురము కొడిసెపాలవిత్తులు రసాంజనము ప్రేంఖణము వీనియొక్క కల్కమును సైంధలవణమును చేర్చి గోరువెచ్చగనున్నప్పుడు దానితో వస్తినిచేయించినయెడల శుక్రమును మాంసమును జాఠరాగ్నిని వృద్ధినొందించును. మరియు క్షతక్షీణము కాస గుల్మము శూల విషమజ్వరము బ్రధ్నము నడివ్యాధి వాతకుండలికము ఉదావర్తము ఉదరశూల మూత్రకృచ్ఛ్రము అసృగ్దరము విసర్పము ప్రవాహిక శిరోబాధ మోకాళ్ళును తొడలును పిక్కలును వస్తిప్రదేశమును బిగియుట అశ్మరి ఉన్మాదము అర్శస్సు ప్రమేహము కడుపుబ్బరము వాతవ్యాధులు రక్తవ్యాధులు పిత్తవ్యాధులు శ్లేష్మవ్యాధులు వీనిని హరింపజేయును. వెంటనే బలమును కలిగించును. రసాయనముగ నుండును.

మూ॥ ఏరణ్డమూలపలాశాత్ షట్పలం శాలిపర్ణీ పృశ్నిపర్ణీ బృహతీ కణ్టకారికా గోక్షురకో రాస్నా ఽశ్వగన్ధా గుడూచీ వర్షాభూరారగ్వధో దేవదార్వితి పలికాని ఖణ్డశః క్లృప్తాని ఫలాని చాష్టౌ ప్రక్షాల్య జలాఢకే క్షీరపాదే పచేత్. పాదశేషం కషాయం పూతం శతకుసుమాకుష్ఠముస్తపిప్పలీ హపుషాబిల్వవచావత్సకఫలరసాఞ్జనప్రియఙ్గుయవానీప్రత్యేకకల్కితం మధుఘృతతైలసైన్ధవయుక్తం సుఖోష్ణం నిరూహమేకం ద్వే త్రీన్వా దద్యాత్, సర్వేషాం ప్రశస్తో విశేషతో లలితసుకుమారక్షీణక్షతస్థవిరచిరాగ్నినామపత్యకామానాం చ ॥7॥

అ॥ ఆముదపువేళ్లు మోదుగ వీనిని ఆరుపలములుగను ముయ్యాకుపొన్న కోలపొన్న వాకుడు పెద్దవాకుడు పల్లేరు సన్నరాస్నము పెన్నేరు తిప్పతీగె గలిజేరు రేల దేవదారు వీనినొక్కొక్క పలపరిమితిగను మ్రుంగకాయలను ఎనిమిది పలములపరిమితిగను గ్రహించి ముక్కలుగ నరకి కడిగి ఒక ఆఢకముజలమునందువైచి అందు ఒక ప్రస్థముపాలను పోసి నాలుగవవంతు మిగులునట్లు కాచి వడగట్టి ఆకషాయమునందు సదాప చెంగల్వకోష్టు తుంగముస్తలు పిప్పళ్లు బోడసరము మారేడు వస కొడిసెపాలవిత్తులు రసాంజనము ప్రేంఖణము మరాసానివాము వీనియొక్క కల్కమును తేనె నెయ్యి తైలము సైంధవలవణము వీనిని చేర్చి గోరువెచ్చగనున్నప్పుడు దానితో ఒక

టిని గాని రెండిటిని గాని మూడింటిని గాని నిరూహవస్తులను చేయింపవలయును. ఈ వస్తి సమస్తమైనవారికిని హితకరముగ నుండును. సుందరులు సుకుమారులు క్షతక్షీణులు వృద్ధులు చిరకాలమునుండియున్న అర్శస్సు కలవారు సంతానమునుగోరువారు వీరలకు విశేషించి హితకరముగనుండును.

మూ॥ సహచరబలామూర్వామూలసారివాసిద్ధేన పయసా తథా బృహతీకణ్టకారీశతావరీచ్ఛిన్నరుహాశృతేన పయసా మధుకమదనపిప్పలీకల్కకృతేన పూర్వవద్వస్తిః ॥18॥

అ॥ ములుగోరింట ముత్తవపులగము చాగదుంప సుగంధిపాల వీనితోగాని వాకుడు పెద్దవాకుడు పిల్లిపీచర తిప్పతీగె వీనితోగాని కాచబడిన పాలయందు అతిమధురము మంగకాయ పిప్పళ్లు వీనియొక్క కల్కమును చేర్చి పూర్వమునందువలెనే వస్తిని చేయింపవలయును.

మూ॥ తథా బలాతిబలావిదారీశాలిపర్ణీపృశ్నిపర్ణీబృహతీకణ్టకారికాదర్భమూలయవకాశ్మర్యబిల్వఫలసిద్ధేన పయసా మధూకమదనకల్కకృతేన మధుఘృతసౌవర్చలప్రయుక్తేన కాసజ్వరగుల్మప్లీహార్దితస్త్రీమద్యక్లిష్టానాం సద్యోబలజననో రసాయనశ్చ ॥19॥

అ॥ ముత్తవపులగము పెద్దముత్తవపులగము నేలగుమ్మడు ముయ్యాకుపొన్న కోలపొన్న వాకుడు పెద్దవాకుడు దర్భవేళ్లు యవలు పెగ్గుమ్మడు మారేడుపండ్లు వీనితో సిద్ధము చేయబడిన పాలయందు అతిమధురము మంగకాయ వీనియొక్క కల్కమును తేనె నెయ్యి సౌవర్చలలవణము వీనిని చేర్చి దానితో వస్తిని చేయించిన యెడల కాస జ్వరము గుల్మము ప్లీహవ్యాధి వీనిని హరింపచేయును. మరియు మైథునముచేతను మద్యపానముచేతను కృశించినవారలకు వెంటనే బలమును కలుగచేయును. రసాయనముగ నుండును.

మూ॥ తథా బలాతిబలారాస్నారగ్వధమదనబిల్వగుడూచీపునర్నవైరణ్డాశ్వగన్ధాసహచరపలాశదేవదారుద్విపఞ్చమూలాని పలికాని యవకోలకులత్థద్విప్రసృతం శుష్కమూలకానాం చ జలద్రోణే సిద్ధం నిరూహప్రమాణం శేషం కషాయం పూతం మధూకమదనశతపుష్పాకుష్ఠపిప్పలీవచావత్సకఫలరసాఞ్జనప్రియఙ్గుయవానీకల్కీకృతం గుడఘృతతైలక్షౌద్రక్షీరమాంసరసామ్లకాఞ్జికసైన్ధవయుక్తం సుఖోష్ణం చ వస్తిం దద్యాత్ శుక్రమూత్రవర్చఃసఙ్గానిలజగుల్మహృద్రోగాధ్మానబ్రధ్నపార్శ్వపృష్ఠకటీగ్రహసంజ్ఞానాశబలక్షయేషు చ ॥20॥

అ॥ ముత్తవపులగము పెద్దముత్తవపులగము సన్నరాస్నము రేల మంగకాయ మారేడు తిప్పతీగె గలిజేరు ఆముదపువేళ్లు పెన్నేరుముల్లుగోరింట మోదుగ దేవదారు

హ్రస్వపంచమూలములు మహాపంచమూలములు వీనినొక్కొక్క పలపరిమితిగను, యవలు రేగు ఉలవలు ఎండుముల్లంగి వీనిని నాలుగేసిపలములుగను గ్రహించి ద్రోణ పరిమితోదకమునందు వైచి నిరూహవస్తికి తగినపరిమితిగ మిగులునట్లు కషాయముగాచి వడగట్టి ఆకషాయమునందు అతిమధురము మ్రంగకాయలు సదాప చెంగల్వకోష్టు పిప్పళ్ళు వస కొడిసెపాలవిత్తులు రసాంజనము ప్రేంఖణము కురాసానివాము వీని యొక్క కల్కమును బెల్లము నెయ్యి తైలము తేనె పాలు మాంసరసము పులి కడుగు సైంధవలవణము వీనిని చేర్చి గోరువెచ్చగ నుండునప్పుడు దానితో వస్తిని చేయించినయెడల శుక్రము మూత్రము పురీషము వీనియొక్క బంధము, వాతజగుల్మము, హృద్రోగము, కడుపుబ్బరము, బ్రధ్నమనెడివ్యాధి పార్శ్వములును పృష్ఠప్రదేశమును కటిప్రదేశమును బిగపట్టినట్లుండుట, సంజ్ఞానాశము, బలముక్షీణించుట ఇవి నశించును.

మూ॥ హపుషార్ధకుడవో ద్విగుణార్ధక్షుణ్ణాయవః క్షీరోదక సిద్ధః క్షీరశేషో మధుఘృతతైలలవణయుక్తో వస్తిః సర్వాఙ్గవిసృతవాతరక్తసక్తవిణ్మూత్రస్త్రీఖేదితహితో వాతహరో బుద్ధిమేధాగ్నిబలజననశ్చ॥21॥

అ॥ జోడతెరమును అర్ధకుడబ పరిమితిగను, సగమునలియగొట్టబడిన యవలను కుడబపరిమితిగను గ్రహించి పాలు ఉదకము వీనియందు వేసి పాలుమిగులునట్లు కాచి అందు తేనె నెయ్యి నూనె సైంధవలవణము వీనిని చేర్చి దానితో వస్తిని చేయించినయెడల సమస్తావయవములయందును వ్యాపించిన వాతరక్తము, పురీషముయొక్కయు మూత్రముయొక్కయు బంధము వీనియందు హితకరముగ నుండును. మరియు స్త్రీసంగముచేకృశించినవారలకు హితకరముగ నుండును. వాతమును హరింపచేయును. బుద్ధి మేధాశక్తి జాఠరాగ్ని వీనికి బలమును కలిగించును.

మూ॥ హ్రస్వపఞ్చమూలీకషాయః క్షీరోదకసిద్ధః పిప్పలీమధూకమదన కల్కీకృతః సగుడఘృతతైలలవణః క్షీణవిషమజ్వరకర్శితస్య వస్తిః ॥22॥

అ॥ పాలతోడను ఉదకముతోడను సిద్ధముచేయబడిన హ్రస్వపంచమూలములయొక్క కషాయమునందు పిప్పళ్ళు అతిమధురము మ్రంగకాయలు వీనియొక్క కల్కమును, బెల్లము నెయ్యి తైలము సైంధవలవణము వీనిని చేర్చి దానితో వస్తిని చేయించినయెడల క్షీణించినవారికిని విషమజ్వరముచే కృశించినవారికి హితకరముగ నుండును.

మూ॥ బలాతిబలాపామార్గాత్మగుప్తాష్టపలార్ధక్షుణ్ణాయవాఞ్జలికషాయః పూర్వవద్వస్తిః స్థవిరదుర్బలక్షీణశుక్రరుధిరాణాం పథ్యతమః॥

అ॥ ముత్తవపులగము పెదముత్తవపులగము ఉత్తరేణి దూలగొండి వీనినిఎనిమిది పలములుగను, సగమునలియగొట్టబడిన యవలను నాలుగుపలములపరిమితిగను గ్రహించి కషాయముకాచి దానితో పైనచెప్పబడినవిధమున వస్తిని చేయించినయెడలవృద్ధులకును దుర్బలులకును క్షీణించినశుక్రమురక్తము ఇవికలవారికిని హితకరముగనుండును.

మూ॥ జలామధుకవిదారీదర్భమూలమృద్వీకాయవైః కషాయమాజేన పయసా పక్త్వా మధుకాక్షకల్కితం సమధుఘృతసైన్ధవం జ్వరార్తేభ్యో వస్తిం దద్యాత్ ॥24॥

అ॥ ముత్తవపులగము అతిమధురము నేలగుమ్ముడు దర్భవేళ్ళు ద్రాక్షపండ్లు యవలు వీనితోడను మేకపాలతోడను కాచబడిన కషాయమునందు అతిమధురము యొక్కయు తానికాయయొక్కయు కల్కమును, తేనె నెయ్యి సైంధవలవణము వీనిని చేర్చి దానితో జ్వరితులకు వస్తిని చేయింపవలయును.

మూ॥ శాలిపర్ణీపృశ్నిపర్ణీగోక్షురకకోలకాశ్మర్యపరూషకఖర్జూరఫలమధూకపుష్పైః జాక్షీరజలప్రస్థాభ్యాం సిద్ధః కషాయః పిప్పలీమధుకోత్పలకల్కితః సఘృతసైన్ధవః క్షీణేన్ద్రియవిషమజ్వరకర్శితస్య వస్తిః శస్తః ॥2[illegible]॥

అ॥ ముయ్యాకుపొన్న కోలపొన్న పల్లేరు తక్కోలములు పెద్దగుమ్ముడు చిట్టీతఖర్జూరపుపండ్లు ఇప్పపువ్వు వీనిని రెండుప్రస్థములపరిమితిగల మేకపాలు జలము వీనిని గ్రహించి కషాయమును కాచి అందుపిప్పళ్ళు అతిమధురము నల్లకలువ వీనియొక్క కల్కమును, నెయ్యి సైంధవలవణము వీనిని చేర్చి వస్తినిచేయించినచో క్షీణించిన ఇంద్రియశక్తి కలిగినవారికిని విషమజ్వరముచే కృశించినవారికిని హితకరముగ నుండును.

మూ॥ స్థిరాదిపఞ్చమూలీపఞ్చపలేన శాలిషష్టికయవగోధూమమాషకషాయపఞ్చప్రసృతేన ఛాగపయః శృతం పాదశేషం, కుక్కుటాణ్డరసమధుఘృతశర్కరాసైన్ధవసౌవర్చలయుక్తో వస్తిర్వృష్యతమో బలవర్ణజననశ్చ। ఇతి యాపనావస్తయో ద్వాదశ ॥ కల్పశ్చైష శిఖిగోనర్దహంసాణ్డరసేషు స్యాత్ ॥27॥

అ॥ హ్రస్వపంచమూలములను అయిదుపలములుగను, శాలిధాన్యము షష్టికధాన్యము యవలు గోధుమలు మినుములు వీనియొక్క కషాయమును పదిపలములుగను గ్రహించి మేకపాలను చేర్చి నాల్గవవంతు మిగులునట్లు కషాయమును కాచి అందు కోడిగుడ్లరసము తేనె నెయ్యి పంచదార సైంధవలవణము సౌవర్చలలవణము వీనిని చేర్చి దానితో చేయబడువస్తి శుక్రవృద్ధిని బలమును వర్ణమును కలిగించునదిగ నుండును. ఇట్లు పండ్రెండువిధములగు యాపనవస్తులు చెప్పబడినవి. ముయ్యాకుపొన్న మొదలగు ద్రవ్యములచే చేయబడువస్తియందు కోడిగ్రుడ్డయొక్క రసమునువలెనే నెమలి సారసపక్షి హంస వీనియొక్క గ్రుడ్లరసములనుగూడ చేర్చి వస్తులను చేయింపవచ్చును.

మూ॥ సతిత్తిరిః మయూర రాజహంసపఞ్చమూలీసిద్ధపయః శతకుసుమమధుకరాస్నాకుటజఫలపిప్పలీకల్కః ఘృతతైలగుడసైన్ధవయుక్తో వస్తిర్బలవర్ణశుక్రజననో రసాయనశ్చ ॥28॥

అ॥ ఆ త్తిరిపక్షి నెమలి రాజహంస వీనియొక్క మాంసములతోడను పంచమూలములతోడను సిద్ధము చేయబడిన పాలయందు సదాప అతిమధురము సన్నరాస్నము కోడిసెపాలవిత్తులు పిప్పళ్ళు వీనియొక్క కల్కమును, నెయ్యి తైలము బెల్లము సైంధవలవణము వీనిని చేర్చి చేయబడు వస్తి బలమును వర్ణమును శుక్రమును వృద్ధిపొందించును. మరియు రసాయనముగ నుండును.

మూ॥ ద్విపఞ్చమూలీ కుక్కుటరససిద్ధం పయః పాదశేషం పిప్పలీమధూకరాస్నామదనమధుకకల్కం శర్కరామధుఘృతయుక్తం స్త్రీప్వతికామానాం బలజననో వస్తిః ॥29॥

అ॥ దశమూలములయొక్క కషాయము కోడియొక్క మాంసరసము వీనిని చేర్చి నాల్గవవంతు మిగులునటుల కాచబడిన పాలయందు పిప్పళ్లు ఇప్పపువ్వు సన్నరాస్నము మ్రంగకాయలు అతిమధురము వీనియొక్క కల్కమును, పంచదార తేనె నెయ్యి వీనిని చేర్చి చేయబడు వస్తి స్త్రీలయందధికముగ కామముగలవారలకు బలమును కలిగించును.

మూ॥ మయూరమపిత్తపక్షపాదాస్యాస్త్రం కృత్వా స్థిరాదిభిః పలికైః సజలే పయసి పక్త్వా క్షీరశేషం మదనవిదారీపిప్పలీశతకుసుమామధూకకల్కీకృతం మధుఘృతసైన్ధవయుక్తం వస్తిం దద్యాత్, స్త్రీప్వతిప్రసక్తక్షీణేన్ద్రియేభ్యో హితో బలవర్ణకరః ॥30॥

అ॥ పిత్తకోశము రెక్కలు పాదములు ముక్కు ప్రేగులు ఇవి తీసివేయబడిన నెమలిని, ఒక్కొక్క పలపరిమితికల హ్రస్వపంచమూలములను నీటితోకూడిన పాలయందు చేర్చి పాలుమిగులునట్లుగ కాచి అందు మ్రంగకాయలు నేలగుమ్మడు పిప్పళ్ళు సదాప ఇప్పపువ్వు వీనియొక్క కల్కమును, తేనె నెయ్యి సైంధవలవణము వీనిని చేర్చి చేయబడు వస్తి స్త్రీలయందలి అధికసంగమముచే క్షీణించిన ఇంద్రియశక్తికలవారలకు హితకరముగ నుండును మరియు బలమును వర్ణమును కలిగించును.

మూ॥ కల్పశ్చైష విష్కిరప్రతుదప్రసహామ్బుచరేషుస్యాత్, అక్షీరో రోహితాదిషు మత్స్యేషు చ ॥31॥

అ॥ నెమలిని చేర్చి వస్తిని చేయువిధమునవే విష్కిరములును ప్రతుదములును ప్రసహములును అంబుచరములును నగు మృగములను పక్షులనుగూడ చేర్చి వస్తిని చేయవచ్చును. రోహితము మొదలగుమత్స్యములతో వస్తిని సిద్ధము చేయునప్పుడు అందు పాలను చేర్పగూడదు.

మూ॥ గోధానకులమార్జారమూషికశల్లకమాంసానాం దశపలాన్భాగాన్ సపఞ్చమూలాన్పయసి పక్త్వా తత్పయఃపిప్పలీఫలకల్కసైన్ధవసౌవర్చలశర్కరామధుఘృతతైలయుక్తోవస్తిర్బల్యో రసాయనః క్షీణక్షతస్య సన్ధానకరో మథితోరస్కరథగజహయభగ్నవాతబలాసక

పరిభగ్నాస్థీనాం వాతబలాసకముఖానాం వ్యాధినా ఉదావర్తవాతసక్తమూత్రవర్చఃశుక్రాణాం హితతమశ్చ ॥32॥

అ॥ ఉడుము ముంగిస పిల్లి ఎలుక ఏదుపంది వీనియొక్క మాంసములను పదిపలములుగను దశమూలములను గ్రహించి పాలయందు వేసి కాచి ఆపాలయందు పిప్పళ్ళయొక్కయు మంగకాయయొక్కయు కల్కమును, సైంధవలవణము సౌవర్చలలవణము పంచదార తేనె నెయ్యి తైలము వీనిని చేర్చి దానితో చేయింపబడిన వస్తి బలమును కలిగించునదిగను రసాయనముగను క్షతక్షీణులకు సంధానమును కలిగించునదిగను నుండును. అభిఘాతమునొందినవక్షస్థలముకలవారలకును. రథములు ఏనుగులు గుఱ్ఱములు వీనిచే భగ్నమైనశరీరముకలవారలకును, వాతబలాసకము మొదలగు వ్యాధులు ఉదావర్తవాతము మూత్రమును పురీషమును శుక్రమును బంధింపబడుట ఇవి కలవారలకును హితకరముగ నుండును.

మూ॥ కూర్మాదీనామన్యతమపిశితసిద్ధం పయో గోవృషనాగహయనక్రహంసకుక్కుటాణ్డరసమధుఘృతశర్కరా సైన్ధవేక్షురకాత్మగుప్తాఫలకల్కసంసృష్టో వస్తిర్వృద్ధానామపి బలజననః ॥33॥

అ॥ తాబేలు మొదలగు జలచరములలో దేనియొక్క మాంసముతోనైనను సిద్ధముచేయబడిన పాలయందు ఎద్దు ఏనుగు గుఱ్ఱము మొసలి హంస వీనియొక్క మాంసరసమును, కోడిగ్రుడ్లరసమును, తేనె నెయ్యి పంచదార సైంధవలవణము వీనిని, గొబ్బివిత్తులు దూలగొండివిత్తులు వీనియొక్క కల్కమును చేర్చి చేయబడిన వస్తి వృద్ధులకుకూడ బలమును కలిగించును.

మూ॥ గోవృషబస్తవరాహవృషణకర్కటచటకసిద్ధం క్షీరముచ్చటకేక్షురకాత్మగుప్తామధుఘృతయుతం కించిల్లవణితం వస్తిః॥ కర్కటకరసశ్చటకాణ్డరసయుక్తః సమధుఘృతశర్కరో వస్తిరిత్యేతే వస్తయః పరమవృష్యాః ॥35॥

అ॥ ఎద్దు మేక పంది వీనియొక్కవృషణములతోడను కర్కటపక్షియొక్కయు పిచ్చుకయొక్కయు మాంసముతోడను సిద్ధముచేయబడినపాలయందు నాగరముస్తలు గొబ్బివిత్తులు దూలగొండివిత్తులు వీనియొక్క కల్కమును తేనెను నేతిని కొంచెము సైంధవలవణమును చేర్చి దానితో చేయబడు వస్తియు కర్కటపక్షియొక్క మాంసరసమునందు పిచ్చుకయొక్క గ్రుడ్లరసమును తేనె నెయ్యి పంచదార వీనిని చేర్చి దానితో చేయబడు వస్తియు అధికముగు శుక్రవృద్ధిని కలిగించును.

మూ॥ ఉచ్చటకేక్షురకాత్మగుప్తాశృతక్షీరప్రతిభోజనానుపానా త్స్త్రీశతగామినం నరం కుర్యాః ॥36॥

అ॥ నాగరముస్తలు గొబ్బివిత్తులు దూలగొండివిత్తులు వీనితో కాచబడిన పాలను భోజనముచేసినపుడెల్లను త్రాగుచుండినచో ఆవస్తులు అనేకమంది స్త్రీలతో రమించు శక్తిగలవారినిగ చేయును

మూ॥ దశమూలమయూరహంసకుక్కుటక్వాథాత్పఞ్చప్రస్థం తైలఘృతవసామజ్జచతుష్ప్రసృతయుక్తం శతపుష్పాకుష్ఠహపుషాకల్కీకృతః సలవణో వస్తిః పాదగుల్ఫోరుజానుజఙ్ఘాత్రికవఙ్క్షణవస్తివృషణానిలరోగహరః ॥ మృగపక్షిణామనూపబిలేశయానామేతేనైవ కల్పేన వస్తయో దేయాః ॥33॥

అ॥ దశమూలములు నెమలి మాంసము హంసమాంసము కోడిమాంసము వీని యొక్క కషాయమును పదిఏలములుగను తైలము నెయ్యి వస మజ్జ వీనిని ఎనిమిదిపలములుగను గ్రహించి అందు సదాప కుంగము స్తలు బోడసరము వీనియొక్క కల్కమును సైంధలవణమును చేర్చి దానితో వస్తిని చేయించినయెడల పాదములు చీలమండలు తొడలు మోకాళ్ళు పిక్కలు త్రికప్రదేశము గజ్జలు వస్తిప్రదేశము వృషణములు వీనియందు కలుగు వాతరోగములు హరించును. ఈకల్పమునుసరించియే మృగములు పక్షులు ఆనూపజంతువులు బిలేశయములు వీనియొక్క మాంసములతో సిద్ధముచేయబడిన కషాయములతోగూడ వస్తులను చేయింపవచ్చును.

మూ॥ మధుఘృతద్విప్రసృతం తులోష్ణోదకం శతపుష్పార్ధపలం సైన్ధవార్ధాక్షయుక్తో వస్తిర్దీపనో బృంహణో బలవర్ణకరో నిరుపద్రవో వృష్యతమో రసాయనః క్రిమికుష్ఠోదావర్తగుల్మార్శోబ్రధ్నప్లీహమేహహరః ॥ తద్వత్సమధుఘృతః పయస్తుల్యో వస్తిః పూర్వకల్పేన బలవర్ణకరో వృష్యతమో నిరుపద్రవో వస్తిః పూర్వకల్పేన బలర్ణకరో వృష్యతమో నిరుపద్రవో వస్తిమేఢ్రపాకపరికర్తికామూత్రకృచ్ఛ్రపిత్తవ్యాధిహరో రసాయనశ్చ ॥ మధుఘృతాభ్యాం మాంసరసతుల్యో మస్త్వక్షయుక్తః పూర్వవద్వస్తిర్బలాసపాదహర్షగుల్మజానూరునికుఞ్చనవస్తివృషణమేఢ్రత్రికోరుపృష్ఠశూలహారః

అ॥ తేనె నెయ్యి వీనిని నాలుగుపలములుగను ఉష్ణోదకమును నాలుగుపలములుగను సదాపను అర్ధపలముగను సైంధవలవణమును అర్ధకర్షముగను గ్రహించి దానితో చేయబడు వస్తి దీపనముగను బృంహణముగను బలము వర్ణము వీనిని కలిగించునదిగను ఉపద్రవములను కలిగింపనిదిగను వీర్యవృద్ధిని చేయునదిగను రసాయనముగను నుండును. మరియు క్రిములు కుష్ఠము ఉదావర్తము గుల్మము అర్శస్సు బ్రధ్నమునెడివ్యాధి ప్లీహవ్యాధి ప్రమేహము వీనిని హరింపజేయును. ఈకల్పమునను సరించియే తేనె నెయ్యి సమానముగు పాలు వీనితో గూడిన వస్తిని చేయించినచో అదిబలమును వర్ణము వీనిని కలిగించునదిగను వీర్యవృద్ధిని చేయునదిగను ఉపద్రవములను కలిగింపనిదిగను నుండును. మరియు వస్తిపాకము మేఢ్రపాకము పరికర్తికము మూత్రకృచ్ఛ్రము పిత్తవ్యాధులు వీనిని హరింపజేయును. రసాయనముగ నుండును. ఈకల్పమునను సరించియే తేనె నెయ్యి సమానముగు మాంసరసము కర్ష పరిమితిగల తుంగముస్తలకల్కము వీనితో కూడిన వస్తిని చేయించినయెడల శ్లేష్మము, కాళ్ళయం

దలిపగుళ్ళు, గుల్మము మోకాళ్ళు తొడలును ముడుచుకొనిపోవుట, వస్తి ప్రదేశము వృషణములు మేఢ్రము త్రిక ప్రదేశము తొడలు పృష్ఠప్రదేశము వీనియందలి శూల వీనిని హరింపజేయును.

మూ॥ సురాసౌవీరక కులత్థమాంసరసమధుఘృతతైలప్రసృతః ముస్తశతాహ్వాకల్కితః సలవణో వస్తిః సర్వవాతరోగహరః॥

ఆ॥ సురయనెడిమద్యము సౌవీరకమనెడిమద్యము ఉలవలకషాయము మాంసరసము తేనె నెయ్యి తైలము వీనిని పదునాలుగు పలములుగ గ్రహించి అందు తుంగముస్తలు సదాప వీనియొక్క కల్కమును సైంధవలవణమును చేర్చి దానితో చేయబడు వస్తి సమస్తవాతరోగములను హరింపజేయును.

మూ॥ శిథా ద్విపఞ్చమూల త్రిఫలాబిల్వమదనఫలకషాయో గోమూత్రసిద్ధః కుటజమదనఫలముస్తపాఠాకల్కితః సైన్ధవయవాశూకక్షౌద్రతైలయుక్తో వస్తిః శ్లేష్మవ్యాధివస్త్యాటోపవాతశుక్రసఙ్గపాణ్డురోగాజీర్ణ విసూచి కాలసకేషు దేయ ఇతి ॥43॥

ఆ॥ దశమూలములు త్రిఫలములు మారేడు మంగకాయలు వీనిని గోమూత్రమునందు చేర్చి కషాయము కాచి ఆకషాయమునందు కొడిసెపాలవిత్తులు మంగకాయలు తుంగముస్తలు చిరుబొద్ది వీనియొక్క కల్కమును సైంధవలవణము యవక్షారము తేనె తైలము వీనిని చేర్చి దానితో వస్తిని చేసినచో శ్లేష్మవ్యాధులు, వస్తియందలి ఆటోపము, అపానవాతము బంధించుట, శుక్రము అడ్డగింపబడుట, పాండురోగము, అజీర్ణము, విషూచి, అలసకము వీనిని నశింపజేయును.

మూ॥ అత ఊర్ధ్వం వృష్యతమాన్ స్నేహాన్ వక్ష్యామః ॥44॥

ఆ॥ పిమ్మట వృష్యతమములగు స్నేహవస్తులను చెప్పుచున్నాము.

మూ॥ శతావరీగుడూచీక్షువిదార్యామలకద్రాక్షాఖర్జూరాణాం యన్త్రపీడితానాం రసప్రస్థం పృథగేకైకం తద్వద్ఘృతతైలగోమహిష్యజాక్షీరాణాం ద్వౌ ద్వౌ దద్యాత్, జీవకర్షభకమేదామహామేదాత్వక్క్షీరీశృఙ్గాటకమధూకకాశ్మర్యమధుకోచ్చటకపిప్పలీపుష్కరబీజనీలోత్పలకదమ్బపుష్పపుణ్డరీక కేసరకల్కాన్ పృషతతరక్షుమాంసకుక్కుటచటకచ కోరమత్తాక్షుబర్హిజీవఞ్జీవకకులిఙ్గఫలహంసానాం రసం వసామజ్జ్ఞోశ్చ ప్రస్థం దత్త్వా సాధయేత్ । బ్రహ్మఘోషశఙ్ఖపటహభేరీనినాదైః సిద్ధం సితచ్ఛత్రకృతచ్ఛాయం గజస్కన్ధమారోహయేద్భగవన్తం వృషధ్వజమభిపూజ్య తం స్నేహం త్రిభాగమాక్షికం మఙ్గలాశీః స్తుతిదేవతార్చనైర్వస్తిం గమయేత్ । నృణాం స్త్రీవిహారిణాం నష్టరేతసాంక్షతక్షీణవిషమజ్వరార్తానాం వ్యాపన్నయోనీనాం వన్ధ్యా

నాం రక్తగుల్మినీనాం మృతాపత్యానామనార్తవానాం చ స్త్రీణాం క్షీణమాంసరుధిరాణాం పథ్యతమం రసాయనముత్తమం వలీపలిత నాశనం విద్యాత్ ॥15॥

అ॥ పిల్లిపీచర తిప్పతీగ చెరకు నేలగుమ్మడు ఉసిరికపండ్లు ద్రాక్షపండ్లు ఖర్జూరపుపండ్లు వీనినుండి యంత్రముచే తీయబడినరసములను ప్రత్యేకముగ ఒక్కొక్క ప్రస్థపరిమితిగను, నెయ్యి తైలము ఆవుపాలు గేదెపాలు మేకపాలు వీనిని ప్రత్యేకముగ రెండేసిప్రస్థములుగను, జీవకము ఋషభకము మేద మహామేద పాలనేలగుమ్మడు పరికగడ్డలు ఇప్ప అతిమధురము తుంగముస్తలు పిప్పళ్ళు మెట్టతామరవిత్తులు నల్లకలువ కడిమిపువ్వులు పద్మకేసరములు వీనియొక్క కల్కములను దుప్పి సివంగి వీనియొక్క మాంసమును కోడి పిచ్చుక చకోరపక్షి కోకిల నెమలి వెన్నెలపురుగు ఊరపిచ్చుక నీలహంసలు వీనియొక్క మాంసరసమును వస మజ్జ వీనిని ప్రస్థపరిమితిగను గ్రహించి తయారుచేయవలయును. వేదఘోషలు శంఖములు పటహములు భేరులు వీనియొక్క శబ్దములతో సిద్ధముచేయబడిన ఆస్నేహమును తెల్లని ఛత్రముతో కూడిన ఏనుగమూపునందు ఉంచవలయును, పిమ్మట భగవంతుడగు శివుని పూజించి ఆ స్నేహమునందు మాడవవంతు తేనెను చేర్చి మంగళకరములగు ఆశీర్వచనములు స్తోత్రములు దేవతార్చనములు వీని నాచరించుచు ఆ స్నేహముతో వస్తిని చేయింపవలయును స్త్రీలతో అధికముగ రమించునట్టియు క్షీణించిన శుక్రముకలిగినట్టియు క్షతక్షీణముచేతను విషమజ్వరముచేతను పీడింపబడుచున్నట్టియుమను జాలకుపయోని వ్యాపత్తులు కలిగినట్టియు వంధ్యలుగనున్నట్టియు రక్తగుల్మముకలిగినట్టియు చనిపోవుచున్నసంతానముకలిగినట్టియు ఆర్తవస్రావములేనట్టియు మాంసమునురక్తమునుక్షీణించినట్టియు స్త్రీలకును ఈ వస్తి హితకరముగ నుండును మరియు ఉత్తమమైన రసాయనముగను వలీపలితములనునశింపజేయునదిగ ను నుండును

మూ॥ బలాగోక్షురక రాస్నాశ్వదంష్ట్రాశతావరీసహచరాణాం, శతం శతమాయోజ్య జలద్రోణశతే ప్రసాధ్య తస్మిన్ జలద్రోణావశేషే రసే వస్త్రపూతే విదార్యామలకస్వరసయోర్బస్తమహిషవరాహవృషకుక్కుటబర్హిహంసకారణ్డవసారసానాం ఘృతతైలయోశ్చ ఏకైకం పృథక్ ప్రస్థమష్టౌ ప్రస్థాన్ క్షీరస్య దత్వా చన్దనమధుకమధూలికాత్వక్ క్షీరబిసమృణాలోత్పలపటోలఫలాత్మగుప్తాదనపాకితాలమజ్జాఖర్జూరమృద్వీకాతామలకీకట్ఫలకాకోలీజీవకర్షభకక్షుద్రసహామహాసహాశతావరీమేదామహామేదాపిప్పలీహ్రీబేరత్వక్పత్రైశ్చార్ధపలికైర్దత్వా సాధయేత్ । బ్రహ్మఘోషాదినా విధినా తంస్నేహం వస్తిమాదద్యాత్ । తేః స్త్రీశతం గచ్ఛేత్ న చాత్ర స్త్రీవిహారాహారయన్త్రణా క్వచిత్ । ఏష వృష్యో వర్ణ్యో బృంహణ ఆయుష్యో వలీపలితనుత్ । క్షతక్షీణ

నష్టశుక్రవిషమజ్వరార్తానాం వ్యాపన్నయోనీనాం చ పథ్యతమః ॥46॥

అ॥ ముత్తవపులగము పల్లేరు సన్నరాష్ట్రము పెన్నేరు పిల్లిపీచర గోరింట వీనిని ప్రత్యేకము నూరేసిపలములుగ గ్రహించి నూరుద్రోణములపరిమితిగల జలమునందు జేర్చి ఒకద్రోణము మిగులునట్లు కాచి వడియగట్టి ఆకషాయమునందు నేలగుమ్ముడు ఉసిరికపండ్లు వీనియొక్క రసమును మేకపోతు దున్నపోతు పంది ఎద్దు కోడి నెమలి హంస కన్నెలేడి బెగ్గురుపక్షి వీనియొక్క మాంసరసమును ఘృతమును తైలమును వీనిని ప్రత్యేకము ఒక్కొక్కప్రస్థముగను పాలను ఎనిమిదిప్రస్థములుగను కలిపి చందనము యష్టిమధుకము ఇప్పపువ్వు పాలగుమ్ముడు తామరబిసములు తామరతూండ్లు నల్లకలువ చేదుపొట్లకాయ దూలగొండి నల్లపువ్వులగోరింట తాటిగుంజు ఖర్జూరపండ్లు ద్రాక్షపండ్లు నేలఉసిరిక వాకుడు జీవకము ఋషభికము కారుపెసర కారుమినుము పిల్లిపీచర మేద మహామేద పిప్పళ్ళు కురువేరు దాల్చినచెక్క ఆకుపత్రి వీనియొక్క కల్కములను చేర్చి తయారుచేయవలయును. వేదఘోషలు మొదలగువిధిననుసరించి తయారుచేయబడిన ఆస్నేహముతో వస్తిని చేయించినచో నూరుమందిస్త్రీలతో రమింపగలుగును. ఈవస్తిని చేయించినప్పుడు ఆహారవిహారములయందు నియమము అవసరములేదు. ఈవస్తి శుక్రమునువృద్ధిచేయునదిగను వర్ణమునుకలిగించునదిగను బృంహణముగను ఆయువును వృద్ధిచేయునదిగను వలిపలితములను నశింపచేయునదిగను నుండును. మరియు క్షతక్షీణులకును క్షీణించినశుక్రముగలవారికిని విషమజ్వరముచే పీడింపబడుచున్నవారికిని యోనిదోషములుగల స్త్రీలకును హితకరముగనుండును.

మూ॥ సహచరపలశతముదకముదకద్రోణచతుష్టయే పక్త్వా ద్రోణశేషే రసే సుపూతే విదారీక్షురసప్రస్థాభ్యామష్టగుణక్షీరం ఘృతతైలప్రస్థం బలామధుకమధూకచన్దనమృణాలికాసారివామేదా మహామేదాకాకోలీక్షీరకాకోలీ పయస్యాఽగురుమఞ్జిష్ఠావ్యాఘ్రనఖశటీసహచరసహస్రవీర్యానరాజ్జలోధ్రాణామక్షమాత్రైర్ద్విగుణశర్కరైః కల్కైః సాధయేద్బ్రహ్మఘోషాదినా విధినా। తత్సిద్ధం వస్తిం దద్యాత్, ఏష సర్వరోగహరో రసాయనో లలితానాం శ్రేష్ఠోఽన్తఃపురచారిణాం క్షతక్షయవాతపిత్తవేదనాశ్వాసకాసహరః స్త్రీభాగమాక్షికోఽకాలవలీపలితనుత్ వర్ణరూపబలమాంసశుక్రవర్ధనః ॥47॥

అ॥ నూరుపలములగోరింటను నాలుగుద్రోణములనీటియందు నాల్గవవంతుమిగులునట్లు కాచి బాగుగవడియకట్టబడిన ఆకషాయమునందు నేలగుమ్ముడురసము చెఱకురసము వీనిని రెండుప్రస్థములుగను, పాలను ఎనిమిదిప్రస్థములుగను, ఘృతము తైలము వీనిని ఒకప్రస్థముగను,ముత్తవపులగము అతిమధురము ఇప్ప చందనము నీటియష్టిమధుకము సుగంధిపాల మేద మహామేద కాకోళి క్షీరకాకోళి పాలగుమ్ముడు కృష్ణాగురు మంజిష్ఠ వ్యాఘ్రనఖము నెడిదుంపవిశేషము కచోరములు గోరింట గరిక దాసెనచెక్కలొద్దుగ వీనియొక్క కల్కములను ఒక్కొక్కకర్షముగను, పంచదారను రెండుకర్ష

ములుగను కలిపి వేదఘోషలు మొదలగు విధులననుసరించి తయారుచేయవలయును. బాగుగ తయారైన ఆస్నేహముతో చేయబడు వస్తి సమస్తరోగములను హరించునది గను రసాయనముగను అంతఃపురమునందు నివసించుసుందరులకు హితమునుకలిగించు నదిగను నుండును. మరియు క్షతక్షయ వాతవికారములు పిత్తవికారములు శ్వాస కాస వీనిని హరింపచేయును. ఈస్నేహములో మూడవవంతు తేనెను కలిపినచో ఇది అకాలమునందుజనించు వళులను ఫలితమును నశింపచేయుననిగను వర్ణము రూపము బలము మాంసము శుక్రము వీనిని వృద్ధినొందించునదిగను నుండును.

మూ॥ ఇత్యేతే రసాయనాః స్నేహవస్తయః సతి విభవే శత పాకాః సహస్రపాకా వా కార్యా వీర్యబలాధానార్థమితి ॥48॥

ఆ॥ రసాయనములగు ఈస్నేహములను సంపత్తున్నచో నూరుసారులుగాని వెయ్యిసారులుగాని పాకముచేసినయెడల అధికమగుశక్తికలవిగ నగును.

మూ॥ ఇత్యేతే వస్తయః స్నేహాశ్చోక్తాః ప్రాణిషు సజ్జితాః। సుస్థానామాతురాణాం చ వృద్ధానాం చావిరోధినః ॥ అతివ్యవాయ శీలానాం శుక్రమాంసబలప్రదాః । సర్వరోగప్రశమనాః సర్వేష్వృతుషు యౌగికాః॥ నారీణామప్రజాతానాం నరాణాం చాప్యపత్యదాః। ఉభయార్థకరా దృష్టాః స్నేహవస్తినిరూహయోః ॥51॥

ఆ॥ మనుజులకు హితకరములుగ చెప్పబడిన ఈస్నేహవస్తులు ఆరోగ్యవంతులకును రోగులకును వృద్ధులకును చెరుపునుకలిగింపనవిగను, అధికమైథునము నాచరించు స్వభావముకలవారలకు శుక్రమును బలమును మాంసమును వృద్ధినొందించునవిగను, వ్యాధులను నశింపచేయునవిగను, సమస్తఋతువులయందు నుపయోగింపతగినవిగను, సంతానములేని స్త్రీలకును పురుషులకును సంతానమునుకలిగించునవిగను, స్నేహవస్తి యొక్కయు నిరూహవస్తియొక్కయు ప్రయోజనములను చేయునవిగను నుండును.

యాపనాదివస్తులను చేయించునప్పుడు వర్జింపతగినవి.

మూ॥ వ్యాయామో మైథునం మద్యం మధూని శిశిరామ్బు చ । సంభోజనం రథక్షోభో వస్తిష్వేతేషు గర్హితమ్ ॥52॥

ఆ॥ యాపనాదివస్తులను చేయించునప్పుడు వ్యాయామము మైథునము మద్యపానము మధురరసపదార్థములు శీతోదకము అధికభోజనము రథములు మొదలగు యానములచే కలుగు క్షోభము వీనిని విసర్జింపవలయును.

వస్తిసంగ్రహము.

మూ॥ శిఖిగోనర్దహంసాద్యైర్దశవద్వస్తయస్త్రయః । వింశతిర్ద్విష్కిరైస్త్రింశత్ప్రతుదైః ప్రసహైర్నవ ॥ వింశతిశ్చ తథా సప్తవింశతిశ్చామ్బుచారిభిః । నవ మత్స్యాదిభిశ్చైవ శిఖికల్పేన వస్తయః ॥

దశ కర్కటకాద్యైశ్చ కౌర్మకల్పేన వస్తయః । మృగైః సప్తదశైకోనవింశతిర్విష్కిరైర్దశ ॥ ఆనూపైర్దక్షశిఖివద్ధూమశయైశ్చ చతుర్దశ । ఏకోనత్రింశదత్యేతే సహ స్నేహైః సమాసతః ॥ ప్రోక్తా విస్తరశో భిన్నా ద్వే శతే షోడశోత్తరే । ఏతే మాక్షికసంయుక్తాః కుర్వన్త్యతివృషం నరమ్ । నాతియోగం న వాఽయోగం స్తమ్భితాస్తైశ్చ కుర్వతే ॥57॥

అ॥ కోడి గుడ్లతో వలెనె నెమలి బెగ్గురుపక్షి హంస వీనియొక్క గ్రుడ్లతో చేయబడు వస్తులు మూడును, విష్కిరములతో చేయబడునవి ఇరువదియు, ప్రతుదములతో ముప్పదియు, ప్రసహములతో ఇరువదితొమ్మిదియు, జలచరములతో ఇరువదియేడును, నెమలియొక్క కల్పమునను సరించి చేపలు మొదలగువానితో చేయబడునవి తొమ్మిదియు, తాబేలుయొక్క కల్పమునను సరించి కర్కటకము మొదలగువానిచే చేయబడు వస్తులు పదియు, మృగములతో పదునేడును, విష్కిరములతో పందొమ్మిదియు, కోడి నెమలి వీనియొక్క కల్పమునను సరించి ఆనూపమాంసములతో చేయబడునవి పదియు, భూశయములతో పదునాల్గును చెప్పబడినవి. సంగ్రహముగ చెప్పబడినట్టియు స్నేహవస్తులతోగూడి ఇరువదితొమ్మిదైనట్టియు ఈ యాపనాదివస్తులు పైన చెప్పబడిన వస్తులతో విస్తరింపబడి రెండువందలపదునారుగ నగును. ఈ వస్తులయందు తేనెను చేర్చి ప్రయోగించినచో మనుజుని అధికమైన వీర్యవృద్ధికలవానినిగ చేయును. తేనెతో స్తంభింపబడి అతియోగమును గాని అయోగమును గాని కలిగింపవు.

## యాపనవస్తులు బయలు వెడలకున్నచో చేయయవలసిన విధి.

మూ॥ మృదుత్వాన్న నివర్తేరన్ వస్తయశ్చ నిరూహణే । సమూత్రైర్వస్తిభిస్తీక్ష్ణైరాస్థాప్యః క్షిప్రమేవ చ ॥58॥

అ॥ యాపనవస్తులు మృదువుగనుండి బయలువెడలకున్నచో గోమూత్రముతో కూడిన ఆస్థాపనవస్తులను వెంటనే చేయింపవలయును.

## యాపనవస్తులయొక్క అతిసేవనచేకలుగు దోషములు—చికిత్స.

మూ॥ శోఫాగ్నినాశపాణ్డుత్వశూలార్శఃపరికర్తికాః । స్యుర్జ్వరశ్చాతిసారశ్చ యాపనాత్యర్థసేవయా ॥ అరిష్టక్షీరశీధ్వాద్యాస్తత్రేష్టా దీపనీ క్రియా । యుక్త్యా తిస్మాన్నిషేవేత యాపనాన్న ప్రసఙ్గతః ॥60॥

అ॥ యాపనవస్తులను అధికముగ సేవించినయెడల శోఫ అగ్నిమాంద్యము పాండువ్యాధి శూల అర్శస్సు పరికర్తికము జ్వరము అతిసారము ఇవి కలుగును. అట్లుకలిగినప్పుడు అరిష్టములు పాలు శీధువులు మొదలగువానిని సేవింపవలయును. మరియు దీపనమును కలిగించు క్రియలను యుక్తిననుసరించి చేయింపవలయును. యాపనవస్తులను విసర్జింపవలయును.

## అధ్యాయసంగ్రహము.

మూ॥ ఇత్యుచ్చైర్భాష్యపూర్వాణాం వ్యాపదః సచికిత్సితాః।
విస్తరేణ పృథక్ ప్రోక్తాస్తేభ్యో రక్షేన్నరం సదా ॥61॥

అ॥ ఈఅధ్యాయమునందు — బిగ్గరగమాట్లాడుట మొదలగువానివలనకలుగు వ్యాపత్తులును వానియొక్క చికిత్సలును ప్రత్యేకముగ విస్తరించి చెప్పబడినవి. అట్టి వ్యాపత్తులనుండి మనుజుని ఎల్లప్పుడును రక్షింపవలయును.

## స్థానసంగ్రహము.

మూ॥ కర్మణాం వమనాదీనామసమ్యక్కరణాపదామ్ । యతోऽత్రోక్తం సాధనం స్థానే సిద్ధిస్థానం తదుచ్యతే ॥6 ॥

అ॥ సరిగ ప్రయోగింపబడని వమనాదికర్మలవలన కలుగు వ్యాపత్తులును వాని యొక్క సిద్ధులును (చికిత్సలును) ఈ స్థానమునందు చెప్పబడినవి. అందువలన ఈ స్థానము సిద్ధిస్థానమని చెప్పబడుచున్నది.

## గ్రంథసంగ్రహము.

మూ॥ ఇత్యధ్యాయశతం వింశమాత్రేయమునివాఙ్మయమ్॥
హితార్థం ప్రాణినాం ప్రోక్తమగ్నివేశేన ధీమతా ॥63॥

అ॥ బుద్ధిమంతుడగుఅగ్నివేశునిచే ప్రాణులయొక్క హితముకొఱకు ఆత్రేయముని చే చెప్పబడినట్టియు నూటఇరువది అధ్యాయములతో గూడినట్టియు ఈగ్రంథము చెప్పబడినది.

## గ్రంథపఠనఫలము.

మూ॥ దీర్ఘమాయుర్యశః ప్రజ్ఞామారోగ్యం చాపి పుష్కలమ్।
సిద్ధిం చానుత్తమాం లోకే ప్రాప్నోతి విధినా పఠన్ ॥64॥

అ॥ ఈగ్రంథమును విధిప్రకారము పఠించినచో దీర్ఘమైన ఆయుర్వును కీర్తిని అధికమైనప్రజ్ఞను పుష్కలమైన ఆరోగ్యమును లోకమునందు అత్యుత్తమమైన కార్యసిద్ధిని పొందును.

మూ॥ విస్తారయతి లేశోక్తం సంక్షిపత్యతివిస్తరమ్ । సంస్కర్తా కురుతే తన్త్రం పురాణం చ పునర్నవమ్ ॥ అతస్తన్త్రోత్తమమిదం చరకేణాతిబుద్ధినా । సంస్కృతం తత్తు సంసృష్టం విభాగేనోపలక్ష్యతే॥ అఖణ్డార్థం దృఢబలో జాతః పఞ్చనదే పురే । కృత్వా బహుభ్యస్తన్త్రేభ్యో విశేషోచ్చ బలోచ్చయమ్॥ సప్తదశౌషధాధ్యాయసిద్ధికల్పైరపూరయత్ ॥ఇదమన్యూనశబ్దార్థం తన్త్రం దోషవివర్జితమ్। షట్త్రింశతా విచిత్రాభిర్భూషితం తన్త్రయుక్తిభిః ॥68॥

అ॥ సంస్కర్త - సంగ్రహముగ చెప్పబడినశాస్త్రమును విస్తరింపచేయును. మిక్కిలివిస్తారముగ చెప్పబడినదానిని సంక్షేపింపచేయును. పురాతనమైనదానిని నవీన

మైనదానినిగ చేయును. అందువలన, బుద్ధిమంతుడగు చరకుడు ఉత్తమమైన ఈతంత్రమును సంస్కరించెను. అట్లు సంస్కరింపబడిన ఈతంత్రము విభాగముగ తెలియబడుచున్నది. అఖండమైన ప్రయోజనముకల ఈతంత్రమును పంచనదనుపట్టణమునందు జన్మించిన దృఢబలుడు ఇతరతంత్రములకంటె మిక్కిలి శ్రేష్ఠమైనదానినిగ చేసెను. చికిత్సాస్థానమునందలి తుది పదునేడు అధ్యాయములచేతను, కల్పస్థానముచేతను, సిద్ధిస్థానముచేతను పూరించి న్యూనములుకాని శబ్దములును అర్థములును కలదానినిగను, దోషములులేనిదానినిగను, విచిత్రములైన ముప్పదియారుశాస్త్రయుక్తులతోకూడిన దానినిగను చేసెను.



తంత్రయుక్తులు.

మూ॥ తత్రాధికరణం యోగో హేత్వర్థోఽర్థః పదస్య చ ॥ ప్రదేశోద్దేశనిర్దేశవాక్యశేషాః ప్రయోజనమ్ । ఉపదేశాపదేశాతిదేశార్థాపత్తినిర్ణయాః ॥ ప్రసఙ్గైకాన్తనైకాన్తాః సాపవర్గో విపర్యయః। పూర్వపక్షవిధానానుమతవ్యాఖ్యానసంశయాః ॥ అతీతానాగతావేక్షాస్వసంజ్ఞోహ్యసముచ్చయాః। నిదర్శనం నిర్వచనం సంనియోగో వికల్పనమ్ ॥ ప్రత్యుచ్చార సహోద్ధారః సంభవస్తన్త్రయుక్తయః । తన్త్రే వ్యాససమాసాభ్యాం భవన్త్యేతా హి కృత్స్నశః॥ ఏకదేశేన దృశ్యన్తే సమాసాభిహితాస్తథా ॥ యథామ్బుజవనస్యార్కః ప్రదీపో వేశ్మనో యథా । ప్రబోధనప్రకాశార్థాస్తథా తన్త్రస్య యుక్తయః ॥75॥

అ॥ అధికరణము, యోగము, హేత్వర్థము పదార్థము, ప్రదేశము, ఉద్దేశము, నిర్దేశము, వాక్యశేషము, ప్రయోజనము, ఉపదేశము, అపదేశము, అతిదేశము, అర్థాపత్తి. నిర్ణయము, ప్రసంగము, ఏకాంతము, అనేకాంతము, అపవర్గము, విపర్యయము, పూర్వపక్షము, విధానము, అనుమతము, వ్యాఖ్యానము, సంశయము, అతీతావేక్షణము, అనాగతావేక్షణము, స్వసంజ్ఞ, ఊహ్యము. సముచ్చయము, నిదర్శనము, నిర్వచనము, సంనియోగము, వికల్పనము, ప్రత్యుచ్చారము, ఉద్ధారము, సంభవము అను నీ ముప్పదియారును తంత్రయుక్తులుగ నుండును. ఇవన్నియు ప్రతితంత్రమునందును విస్తారముగను సంగ్రహముగను నుండును. సంగ్రహముగ చెప్పబడినవి ఏకదేశముగ కనబడుచుండును సూర్యుడు పద్మవనమునకువలెను దీపము గృహమునకువలెను యుక్తులు తంత్రమునకు ప్రబోధమును ప్రకాశమును కలిగించును.



మూ॥ ఏకస్మిన్నపి యస్యేహ శాస్త్రే లబ్ధాస్పదా మతిః । స శాస్త్రమన్యదప్యాశు యుక్తిజ్ఞత్వాత్ప్రబుధ్యతే ॥ అధీయానోఽపి శాస్త్రాణి తన్త్రయుక్త్యవిచక్షణః । నాధిగచ్ఛతి శాస్త్రార్థానర్థాన్భాగ్యక్షయే యథా ॥ దుర్గృహీతం క్షిణోత్యేవ శాస్త్రం శస్త్రమివాబుధమ్ । సుగృహీతం తదేవ జ్ఞం శాస్త్రం శస్త్రం చ రక్షతి ॥78॥

అ॥ ఎవడు ఒకశాస్త్రమును బాగుగ తెలిసికొనియుండునో వాడు యుక్తులను తెలిసికొనినవాడగుటవలన ఇతర శాస్త్రమునుకూడ శీఘ్రముగ తెలిసికొనకలుగును. భాగ్యములేనివాడు ధనమును పొందలేనివిధమున తంత్రయుక్తులను తెలిసికొనని వాడు శాస్త్రమును పఠించినను శాస్త్రముయొక్క ప్రయోజనమును పొందజాలడు. సరిగ గ్రహింపబడని శాస్త్రము సరిగ గ్రహింపబడని శస్త్రమువలె మనుజునకు హానిని కలిగించును. శాస్త్రమును సరిగ గ్రహించినచో సరిగ గ్రహింపబడిన శస్త్రమువలె రక్షించును.

## గ్రంథప్రయోజనము.

మూ॥ ఇదమఖిలమధీత్య సమ్యగర్థాన్ విమృశతి యో విమలః ప్రయోగనిత్యః । స మనుజసుఖజీవితప్రదానాద్భవతి ధృతిస్మృతిబుద్ధిధర్మవృద్ధః ॥ యస్య ద్వాదశసాహస్రీ హృది తిష్ఠతి సంహితా । సోఽర్థజ్ఞః స విచారజ్ఞశ్చికిత్సాకుశలశ్చ సః ॥80॥

అ॥ ఎవడు ఈ గ్రంథమునంతయు అభ్యసించి అర్థములను విమర్శించి నిర్మలమైన మనస్సుకలవాడై నిత్యము చికిత్సచేయునో వాడు మనుజునకు సుఖమును జీవితమును కలిగించి ధైర్యము స్మృతి బుద్ధి ధర్మము వీనిని అధికముగ పొందును. పండ్రెండు వేలశ్లోకములుకల ఈసంహిత ఎవనికి హృదయస్థముగనుండునో అట్టి వాడు అర్థములను తెలిసికొనినవాడుగను విమర్శించువాడుగను చికిత్సయందుకుశలుండుగను నుండును.

మూ॥ చికిత్సితం వహ్నివేశ । స్వస్థాతురహితం ప్రతి యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్ ॥81॥

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే సిద్ధిస్థానే ఉత్తరవస్తిసిద్ధిర్నామ ద్వాదశోఽధ్యాయః ॥

అ॥ స్వస్థునకును రోగికిని హితకరమైన ఏచికిత్స ఈగ్రంథమునందు చెప్పబడినదో అదియే ఇతర గ్రంథములయందు కలదు. ఈగ్రంథమునందు చెప్పబడనిది ఇతర గ్రంథములయందెచ్చటను లేదు.

ఇవ్విధంబున, శ్రీపాదోపనామకకృష్ణమూర్తిశాస్త్రిప్రణీతంబైన చరకదీపిక యనెడి చరకసంహితా వ్యాఖ్యానమునందు ఉత్తరవస్తిసిద్ధి యనెడు ద్వాదశాధ్యాయము సమాప్తము.

—:0:—

సిద్ధిస్థానము సమాప్తము.

## స్థానషట్కము సమాప్తము.